శ్రీ కోదండరామ సేవకసమాజము గుంటూరు మాండలిక సభ మార్చినెల ౧౬-౧౭-౧౮ తేదులయందు నరసారావుపేఁట సమీపమున ౬ మైళ్లలోనుండు చాగంటివారిపాలెమున బ్ర॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బరావుగారి యాధిపత్యమున జరుపఁబడును నరసారావుపేఁటలోనే ధూమశకటము దిగవలయును

---

# శుద్ధపత్రము.

పేజి

౧౧౭ ౧౦-వ పంక్తికిఁ దరువాత 'ఁగలదె యీరక బ్రాహ్మణగౌరవంబు' అని చదువవలెను.

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౨౦ | ౧౮ | ద్వేషాచ | ద్వేషాచ |
| ౧౨౧ | ౨౩ | నంధమి | నధమ |
| ౧౨౩ | ౩ | దమి | దమ |
| ,, | ౬ | దిమో | విమో |
| ,, | ౭ | కునింకి | కునికి |
| ౧౨౪ | ౭ | వైకుండ | వైకుంఠ |
| ౧౨౫ | ౧౫ | శ్లోకములకు | శ్లోకమునకు |
| ౧౨౬ | ౨ | బిరిర్త | బిభర్తి |
| ,, | ౧౩ | తజ్జా | తజ్జా<br>ఙ |
| ౧౨౭ | ౧౪ | కృష్ట | కృష్ణ |
| ౧౨౮ | ౪ | లనుమదించెను | లినుమడించెను |
| ౧౩౦ | ౧౫ | పోయితివాగదా | పోయితివిగదా |

శ్రీరామసేవ.

# భక్తిసంజీవనీ నియమములు.

౧ ఇది ప్రతిహూణమాసారంభమున వెలువడుచుండును.

౨ ముముక్షువులకు శ్రేయస్కరములైన సాంగభక్తి ప్రపత్తులమార్గ ప్రదర్శనము ముఖ్యోద్దేశ్యము

౩ చందాలు ముందు చెల్లించినవారికిమాత్రమే యిది బంపఁబడును

౪. పత్రికనుగుఱించిగాని, తన్నిర్వాహకాదులగుఱించి కాని వ్రాయఁబడు ముఖస్తోత్రాదు లిందుఁ బ్రకటింపఁబడవు.

౫ ఉపవిలేఖకుల యభిప్రాయములకుఁ బత్రికానిర్వాహకు లుత్తరవాదులు గారు

౬ భిన్నాభిప్రాయములు ప్రకటింపఁబడునుగాని విద్వేషకారణమైన విషయములు-వ్యాసములు-వాక్యము లిందుఁ బ్రకటింపఁబడవు

౭. వ్యర్థచర్చలకు వితండావాదముల కిందు స్థలము లభింపదు.

౮. ఉపవిలేఖకుల వ్యాసములు ప్రకటించుటకు నిరాకరించుటకు భాష సవరించుటకుఁ బత్రికా ప్రధానలేఖకులు స్వతంత్రులు నిరాకరణమునకుఁ గారణము తెలుపఁబడదు. పోస్టేజి పంపినయెడల మరల నవి పంపఁబడును.

౯ ఉత్తరములు వ్రాయువారు ప్రత్యుత్తరమునకై ౦-౧-౦ బిళ్ల పంపిననే ప్రత్యుత్తరము పంపఁబడును.

౧౦ భక్తిసంజీవని యన్యమతద్వేష మెఱుఁగదు. భక్తి విషయ మెందుండినను గ్రహించును. మతత్రయ సామరస్యమునకై యత్నించును.

౧౧ ఉపవిలేఖకులు పత్రముల కొకవైపుననే విశదములైన యక్షరములతో వ్రాయవలెను

౧౨ పత్రికావిషయ మెఱుంగఁగోరువారు, పత్రికానిర్వాహకులపేర ౦-౧-౦ బిళ్లతోడ వ్రాయవలయును వ్యాసములు వీరిపేరనే పంపవలయును

౧౩ ఇందుఁ బ్రకటింపఁబడు వ్యాసములయుఁ బుస్తకములయు సర్వస్వామ్యము పత్రికాధిపతులదే దీనికి సమ్మతించినవారే వ్యాసములు గ్రంథములు పంపవలయును.

౧౪. ౧౯౨౯ సం॥ జనవరి ౧ తేది మొదలు సంవత్సర గణనము సంవత్సరపుఁ జందాకుఁ దక్కు_వఁ దీసికొనఁబడదు

౧౫ ఈ పత్రికవలన వచ్చులాభము ఒంటిమిట్ట కోదండరాములవారిదే కావున దీనిని బోషించువారు శ్రీరామకైంకర్య లాభమును సంపాదించినవా రగుదురు.

౧౬ వేవురైనను (౧౦౦౦) ఉదారులైన చందాదారులు చేరిరేని మందరము (ఆంధ్రవాల్మీకిరామాయణ వ్యాఖ్యానము) ప్రకటింప యత్నింపఁబడును

వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట

వాసుదాసుఁడు, కార్యనిర్వాహకుఁడు.



శ్రీరామాయనమః.

# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు
మాసపత్రిక.

ప్రతి పూర్ణిమాసారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట

సంపుటము ౧. { విభవనామసంవత్సరము మార్చి ౧౯౨౯ సం॥ } సంచిక 3.

చం. “జనకుని సత్యవాక్యరతు, సల్పఁ ద్యజించి సుఖంబు రాజ్య
ముఁ । జనె నెవి దండకాటవికి? జానకి ప్రీతికి మాయజింక
వె । న్కొని పరువెత్తె నెవ్వి? పెనుగూర్మి గుహుండును గడ్గె
నెవ్వి? యా । వనజభవాది సేవ్య పదవారిజముల్ శిరసా
వహించెదఁ ॥”

## భక్తిసంజీవని యౌషధమా? పత్త్రికయా?

ఒకరు భక్తిసంజీవని యౌషధమా పత్త్రికయా యని ప్రశ్నించిరి. దీనికిఁ బ్రత్యుత్తరము భక్తిసంజీవని పత్త్రికారూపక మైన దివ్యౌషధ మనియే. ఎట్లన —

లోకమునందు రోగములు మూఁడు విధములు I. ఆధులు. II. వ్యాధులు ఇవి రెండు దేహసంబంధమైనది. ఆధులు మనస్సును బీడించునవి. వ్యాధులు శరీరమును బాధించునవి. మనుష్యునకు దేహము గాక దేహియైన జీవాత్మ యొకటి గలదు దీనికి దేహసంబంధముచేఁ బుట్టుట గిట్టుట యను సంసార రూపకమై మృత్యుస్వరూపమైన బాధగలదు. ఇది మూఁడవది యైనను ప్రథమరోగ మిదియే. ఆధులకు వ్యాధులకు బీజ భూత మిదియే. ఈ రోగము నివర్తించిన నుతి యే రోగము పీడింపదు చెట్లు కొమ్మ లెన్నిమార్లు కొట్టినను గాల్చినను వేరు బాగుండిన మరలమరలఁ జిగిరించుచునే యుండును. అట్లే భవరోగము భద్రముగ నుండువఱకు నాధులకు వ్యాధులకు నెన్ని యౌషధములు తీసికొన్నను దత్కాలమున కుపశాంతియే గాని వ్యాధి మొదలుముట్ట నివారణముగాదు. రోగనిదానము తెలియక పై లక్షణము లుపశమింప నౌషధమిచ్చు వైద్యుఁడు వృత్తిమాత్రోపజీవియే కాని సార్థకనామధేయుఁడు గాఁడు. వేరు నిర్మూలమైనచో వృక్షమంతయు నశించును.

ఇది తెలిసియుఁ దెలియనివారు తత్కాలోపశమనములైన యౌషధములఁ దీసికొందురు. మరలమరల రోగపీడితులగు చుందురు. ఎఱుకగలవారు రోగము నిశ్శేషముగ నిర్మూలింపఁ బ్రయత్నింతురు.

ఆధులను, వ్యాధులను, భవబాధలను నిర్మూలింపఁ గల యౌషధ మొకటియే కలదు అదితప్ప రెండవది లేదు. ఆ యౌషధముపేరు భక్తి

మ ‘‘విను మంభోజభవుండు మున్ను మదిలో వేదంబు ము
మ్మాటు నె|మ్మన మందుం దలపోసి యెంతయుఁ బరా
మర్శించి మోక్షంబు ద|క్కిన మార్గంబున వెంట లేద
నుచు భక్తిం జింతచేసెఁ జనా|ర్దనునాత్మాకృతి నిర్వి
కారుఁడగుచుం దన్మార్గనిర్ణేతయై॥’’ భాగ.

శ్లో ‘‘చతుర్ముఖాదీనాం సర్వేషా మపి వినా|విష్ణుభక్త్యా కల్ప
కోటిభి ర్మోక్షో నవిద్యతే॥’’ మహానారాయణోపనిషత్తు.

కోటికల్పములు ప్రయత్నించినను బ్రహ్మాదుల కందఱి కును విష్ణుభక్తిలేక మోక్షము లేదు.

‘‘మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ’’ శంకరాచార్యులు మోక్షమును సాధించు నుపాయము లన్నిటిలో భక్తియే శ్రేష్ఠమైనది

‘‘అతులా భక్తిశ్చ తత్సాధనమ్.’’ మధ్వాచార్యులు. నిర్మలమైనభక్తియే దానికి (మోక్షమునకు) సాధనము.

"భక్త్యా పరమయా వాపి, ప్రపత్త్యా వా మహామతే। ప్రా
ప్యోహం నాన్యథాప్రాప్యో, మమకైంకర్య లిప్సుభిః॥"

పరమభక్తిచేఁగాని, ప్రపత్తిచేఁగాని నా కైంకర్యమందుఁ గోరికగలవారికి నేను బ్రాప్యుండనే కాని మఱియొక విధమునఁ బ్రాప్యుఁడను గాను

ఇట్టి ప్రమాణము లనేకములు గలవు

మోక్షప్రాప్తికి భక్తి యౌషధమైన నగును గాక దేహ సంబంధరోగముల కది యెట్లుపయోగపడునందు రేమో వినుండు వైద్యశిఖామణి యైన ధన్వంతరి

శ్లో॥ "అచ్యుతానంత గోవింద, నామోచ్చారణ భేషజాత్।
నశ్యంతి సకలారోగాః, సత్యం సత్యం బ్రవీమ్యహమ్॥"

అని వచించెను

అచ్యుత అనంత గోవింద యను భగవన్నామముల నుచ్చరించుటచే సమస్తరోగములు నశించును. సత్యముపైఁ బ్రమాణముచేసి చెప్పుచున్నాను.

శ్లో॥ "భవత్యరోగో ద్యుతిమాన్, బలరూపగుణాన్వితః।
న వాసుదేవభక్తానా, మశుభం విద్యతే క్వచిత్।
జన్మమృత్యు జరావ్యాధి భయం వా ప్యుపజాయతే॥"

విష్ణుసహస్రనామములు పఠించువాఁడు రోగపీడితుఁడు గాఁడు. కాంతి బలము రూపముగలవాఁడగును. వాసుదేవ భక్తులకు నశుభ మనునది తెలియరాదు జననము-మరణము-ముసలితనము-రోగము. వీనివలని భయమైనను కలుగదు

ఇట్టి ప్రమాణము లనేకములు గలవు. కావున నాధులకు, వ్యాధులకు, జననమరణబాధలకు భక్తి యొక్కటియే యమోఘమైన యౌషధము ఈ యౌషధమును సేవించుమార్గము-పథ్యము లోనైనవి భక్తిసంజీవని తెలుపును భగవంతుఁడెవరి ననుగ్రహింప సంకల్పించునో వారీ యౌషధమును సక్రమముగ సపథ్యముగ సేవించి బాగుపడుదురు రోగములు-నొప్పులు వచ్చినపుడు సంతానము కావలసినపుడు కష్టములు నివారణము కావలసినపుడు దేవతలకు మ్రొక్కుకొనుట యందఱకుఁ దెలిసిన విషయమే ఆపద మ్రొక్కులు సంపదమఱపులు గాక కలకాలము చేయవలయు ననియే భక్తిసంజీవని లోకుల వేఁడుచున్నది. స్వరాజ్యమైనను, స్వారాజ్యమైనను, మోక్షసామ్రాజ్యమైనను భగవత్సాహాయ్యము లేక లభింపదు భగవత్సాహాయ్యము కలుగుటకు భక్తియే కాని వేఱొండు సదుపాయము లేదు.

## కోదండరామసేవక సమాజనియమములు.

ర వృత్తిహాని లేకుండ నేజీవికైనఁ బ్రతిఫలాపేక్ష లేక సమయము తటస్థించినప్పు డంతయు ధర్మ్యముగ నుపకారము చేయుచుండవలయును సమయము తటస్థించినపుడు సాకులు చెప్పి తప్పించుకోరాదు.

వృత్తి యనఁగా జీవనోపాయము దీనికి హాని లేకుండు నట్లు ఏజాతివారికైనను బశుపక్ష్యాదులకైనను మఱు మేలుగోరక యధర్మమార్గమునఁ గాక ధర్మపద్ధతిని జేతనైనంతమాత్రము

సాహాయ్యము చేయవలయును ప్రథమునుండే తన్ను మాలిన ధర్మము తాఁజెడ్డ బేరము కారాదు. బలిచక్రవర్తులు-కర్ణులు-దధీచులు-జీమూతవాహనులు సమాజసభ్యులం దుదయించి లేని పరమసంతోషమే కాని యందఱు నట్లుంచవలయునని నియమించుట సరిగాదు. ఈ యుపకారము ధనరూపముగను ధాన్యరూపముగను నుండవలయునను నిర్బంధము లేదు వాక్సహాయమైనను జేయవచ్చును. దేహకష్టముచేనైనఁ జేయవచ్చును. శక్తికి మించి చేయవలసిన పనిలేదు. దాహముగొన్న వారికి మంచినీళ్లు (ఉప్పునీళ్లుగావు) ఇచ్చుటయు నక్కఱ లవసరముల నెట్టివారికైన నాదుకొనుటయు నుపకారములే. హితబోధయు నుపకారమే.

ఒకరు బిచ్చమువేయుట యుపకారమో యని ప్రశ్నించిరి. నిస్సందేహముగ నుపకారమే కాని బిచ్చమెత్తుటయే సులభమైన జీవనోపాయముగా నెంచి వచ్చినవిద్యమునో ధాన్యమునో యమ్మి వడ్డివ్యాపారము చేయువారికి బ్రాహ్మణులకైనను బిచ్చము పెట్టరాదు. వచ్చిన దానిని సంచయముచేయక యేనాఁటి దానాఁ డెవఁడు వెచ్చపెట్టునో యట్టివానికి బిచ్చము పెట్టవచ్చును-పెట్టవలయును కష్టించి జీవింపఁగల శక్తిగల వారికి సోమరులకు బిచ్చము పెట్టరాదు వికలాంగులకు బీదలైన వృద్ధులకు, మాధుకరవృత్తి జీవించువారికి వానప్రస్థ సన్న్యాసులకు బిచ్చముగాని యన్నముగాని పెట్టవచ్చును. కడపటి ముప్వర కన్నమే పెట్టవలయును అన్నదానమునకుఁ

బాత్రాపాత్రవిచార మక్కఱలేదు ఏది చేసినను అహంకార లోభదూషితులుగాక భగవదర్పణబుద్ధి చేయవలయును కొంచఱు వికలాంగులకు రోగులకుఁ గుంటికి గ్రుడ్డికి సాహాయ్యము చేసిన వారి కర్మానుభవమున కడ్డపడినవారమగుదుము కావున నట్టివారికి సాహాయ్యము చేయరాదందురు. దీనికి మౌఢ్యమో లౌభ్యమో కారణమై యుండును ఒకరి కర్మానుభవమునకు మఱియొకరడ్డపడఁ జాలరు. మనము భగవదర్పణబుద్ధి నొకరికి మేలుచేసినఁ బాపఫల మెన్నఁటికిని రాదు అట్టివారికి శక్తి యుండియు సాహాయ్యము చేయకపోయినయెడలఁ బాపము వచ్చును. మన కౌదార్యము కలిగించుటకు మన మనస్సులు పరీక్షించుటకు భగవంతుఁ డట్టివేషముతో వచ్చె నని యెంచ వలయును

పరోపకారమే పుణ్యము-పరాపకారమే పాపము అల్పుల కుపకారము చేసినపుడు మీ యంతరాత్మ యెంత సంతసించునో పరీక్షింపుఁడు ప్రతిఫలము కోరిగాని, యిదివఱకే యుపకారము చేసినవారికిఁగాని, యిఁకమీఁద నెన్నఁడైనఁ జేయుదురను తలంపుతోఁగాని చేయు నుపకార ముపకారము గాదు ఉపకారము నిర్వ్యాజముగ నుండవలయును

కం "కారణము లేకయును నుప
కారపరత్వమున నొరుల కార్యంబులకుఙ్
వారని యలజడి పడియెడు
వారల చూ యేడుగడయ వసుధకు నధిపా." భార.

౫. స్త్రీలోలత్వము - జూదము - పానము - వేఁట - పరుష వాక్కులాడుట - సొమ్ము నిష్ప్రయోజనముగ వెచ్చపెట్టుట - దండ పారుష్యము ఇవి సప్తవ్యసనములు. వీనివలని కీడులు లోకు లంద ఱెఱింగినవియే

౬. స్వామికి నివేదింపక యెప్పుడేని దేనినేని భుజింప రాదు భగవంతునికి నివేదింపని పదార్థమేదియు భుజింప రాదు ఇంటిలో దేవతారాధనమై మహానైవేద్యమై యున్న యెడల మరల నివేదింపవలసిన పనిలేదు గాని యట్లు గాని యెడలఁ దన విస్తరిలో నుంచిన పదార్థమును దన మెడలో నుండు పతకమున నుండు శ్రీరామమూర్తికి నివేదన మొనర్చియే గోవిందనామస్మరణము చేయుచు భుజింపవలయును స్వగృహ ముననైనను, బరగృహమున నైనను నిదియే పద్ధతి. ఈ పద్ధతి పక్వాన్నవిషయమై మాత్రమే కాదు. ఇతరకాలములందైనను నితరప్రదేశమందైనను పండో కాయో భుజించిన యెడల దానిని గూడ నిట్టులే పతకమునకు నివేదింపవలయును ఈ పతకము హృదయస్థానమునకు సరిగానుండునట్లు మెడలో వ్రేలాడ వేసి కొనవలయును ‟ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేర్జున తిష్ఠతి॥” యని భగవంతుఁడు హృదయమందున్న వాఁడు గావునఁ దచ్చిహ్నముగఁ దద్ద్యోతకముగఁ బతకమును గ్రహింపవలయును ఇప్పుడు బాహ్యమునఁ జూచుమూర్తిని సమాజసభ్యులు శ్రద్ధా భక్తులు గలవారైరేని కొంతకాలముమీఁద దైవకృపచే హృద యాంతరమున నదే స్థానంబునఁ యథాస్వరూపమున జూడఁ

విధములఁ గులభ్రష్టులఁజేసి వారీ దేశమున నుండకుండఁ దఱు మఁగొట్టెను వారు ఇరాన్ దేశమునఁ జేరిరి ఇదియే యిప్పటి పరిషియాదేశము. ఇరాన్ శబ్దము ఆర్యశబ్దభవమే జుట్టుకత్తి రింపులు భ్రష్టలక్షణముగఁ బూర్వులచే నెంచఁబడుచుండెను.

పూర్వము బానిసలకు నిట్లే కత్తిరించుచుండిరని తెలియ వచ్చెడిని అది యట్టులుండుఁగాక

మానసికస్నానమంత్రము లందు "తత్పాదపద్మజాం గంగాం నిపతంతీం స్వమూర్ధని। చింతయేద్బ్రహ్మరంధ్రేణ ప్రవిశంతీం స్వకాం తనుం। తయా సంక్షాళయేద్దేహం బాహ్యామభ్యంతరం మలమ్॥" అని యిత్యాది వాక్యములు గలవు.

మానసికస్నానము చేయునపుడు విష్ణువాసుపాదాంగుష్ఠమునుండి గంగ వెలువడి మన శిరస్సుపైఁబడి యందలి బ్రహ్మరంధ్రమున మన దేహములోనికిఁ బోయి కొంత, దేహముమీఁదఁ బ్రసరించి కొంత, లోపల వెలుపల దేహబాహ్యాభ్యంతరమలమును గడిగి వేయుచున్నట్లు ధ్యానింపవలెను ఇట్లు మనము ధ్యానించితిమేని ప్రాణశక్తి బ్రహ్మరంధ్రమునఁ బ్రవేశించి లోపలఁ బరిశుద్ధము చేయును. ఈ బ్రహ్మరంధ్రము స్త్రీలపాపట రెండుగాఁ జీలు ప్రదేశమునొద్ద నున్నది. ఇది సూక్ష్మరంధ్రము సుషుమ్నానాడి మార్గమునఁ బోవు జీవుఁడీ ద్వారమున వెలునడియే పోవలయును యోగులీ మార్గమును ప్రాణాయామాభ్యాసముచే శుభ్రపఱిచికొని యుందురు ఈ ద్వారమునఁ బోయిన జీవునకు మరల జన్మము లేదు

విధములఁ గులభ్రష్టులఁ జేసి వారీ దేశమున నుండకుండఁ దఱు మఁగొట్టెను వారు ఇరాణ్ దేశమునఁ జేరిరి ఇదియే యిప్పటి పరిషియా దేశము. ఇరాణ్ శబ్దము ఆర్యశబ్దభవమే. జుట్టుకత్తి రింపులు భ్రష్టలక్షణముగఁ బూర్వులచే నెంచఁబడుచుండెను.

పూర్వము బానిసలకు నిట్లే కత్తిరించుచుండిరని తెలియ వచ్చెడిని అది యట్టులుండుఁ గాక

మానసికస్నానమంత్రము లందు "తత్పాదపద్మాం గం గాం నిపంతంతీం స్వమూర్ధని। చింతయే ద్బ్రహ్మరంధ్రేణ ప్రవి శంతీం స్వకాం తనుం॥ తయా సంక్షాళయే ద్దేహం బాహ్యా మభ్యంతరం మలమ్॥" అని యిత్యాది వాక్యములు గలవు.

మానసికస్నానము చేయుసమయంబున విష్ణువాను పా దాంగుష్ఠమునుండి గంగ వెలువడి మన శిరస్సుపైఁ బడి యం దలి బ్రహ్మరంధ్రమున మన దేహములోనికిఁ బోయి కొంత, దేహముమీఁదఁ బ్రసరించి కొంత, లోపల వెలుపల దేహ బాహ్యాభ్యంతరమలమును గడగి వేయుచున్నట్లు ధ్యానింప వలెను ఇట్లు మనము ధ్యానించితిమేని ప్రాణశక్తి బ్రహ్మరంధ్ర మునఁ బ్రవేశించి లోపలఁ బరిశుద్ధము చేయును. ఈ బ్రహ్మ రంధ్రము స్త్రీలపాపట రెండుగాఁ జీలు ప్రదేశమునొద్ద నున్నది. ఇది సూక్ష్మరంధ్రము సుషుమ్నానాడి మార్గమునఁ బోవు జీవుఁ డీ ద్వారమున వెలువడియే పోవలయును యోగులీ మార్గమును ప్రాణాయామాభ్యాసముచే సుప్రపరిచికొని యుందురు ఈ ద్వారమునఁ బోయిన జీవునకు మరల జన్మము లేదు

"ఇచ్ఛలేని యోగి యొక్క మహార్తార్థ
మింద్రియానుషంగ మింత లేక
ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రముఁ జించి
బ్రహ్మమందుఁ గలయుఁ బార్థివేంద్ర"
యని భాగవతమునఁ గలదు

కాఁబట్టి యీ రంధ్రమును స్త్రీలుగాని పురుషులుగాని కప్పివేయరాదు మన ప్రయత్నములేకున్నను సంకల్పముకూడ లేకున్నను గొంత ప్రాణశక్తి, మనము త్రాగునీళ్లనుండి, మనము భుజించు నాహారమునుండి, మనము పీల్చుగాలినుండి, దేహము లోనికిఁ బోయి దేహధారణమును జేయుచున్నది ఈ ప్రాణశక్తి మన దేహమం దెంత యెక్కువగ నుండిన నంతబలము తేజము లోనగు శక్తులుండును అది యెంత క్షీణించునో యంత బల హీనత తేజోహీనత లోనైనవి కానవచ్చును ప్రాణము పోయిన దన నేమి యర్థము?

గాయత్రి మంత్రమందుఁ జెప్పఁబడిన 'భర్గో దేవస్య' యీ శక్తియే ప్రాణాయామముచే యోగులు గ్రహించునది యీ శక్తియే. సదాచారసంపత్తిచేతను, సాత్త్వికాహారాదులచేతను నైష్ఠికులు శీలసంపన్నులు సేకరించునది యీ శక్తియే. విద్యుచ్ఛక్తి యేవిధముగ నొక పాత్రనుందు సేకరింపఁబడునో యట్లే యిదియు. తదేకధ్యాననిష్ఠాగరిష్ఠుఁడై గాయత్రి నెంత యెక్కువగ జపించునో యీ శక్తి యంత యెక్కువగ దేహములోనికి వచ్చును. ఈ శక్తిచేతనే విశ్వామిత్రుఁడు సృష్టిచేయ సమర్థుఁ

డాయెను ఔషధములు లేక రోగముల నివారించు శక్తి యిదియే

ఈ శక్తి యార్జించుటకు మార్గము లున్నట్లే వ్యయపడు టకు మార్గములు కలవు రేతస్స్ఖలనము-అతిభాషణము-అతి దూరప్రయాణము వ్యర్థముగ నయనచాలనము. తాఁకరాని వానిని దాఁకుట, తినరాని రాజసతామసాహారములను దినుట, పసువెత్తుట, వ్యర్థాలోచనము, దురాచారము, కోపము, దురా లోచనము లోనగు వానివలన నీ శక్తి క్షీణించును కావుననే యోగు లిట్టి కార్యములు చేయరు. లోహములోనికి వేఁడిమి వచ్చుట పోవుట యెట్లో దీని నట్టులే యని గ్రహింపవలయును. పై మార్గములనుండియే గాక యీ శక్తి తలవెంట్రుకలకొనలు- కాలివ్రేళ్లు-చేతివ్రేళ్లు వీని కొనలనుండియు ధరించినవస్త్రముల కొనలనుండియు నిది వెలుపలికి భూమిలోనికిఁ బోవును కావు ననేకదా పెద్దలు కొనలు తెలియునట్లు తలవెంట్రుకలు ముడి వేయవలదని చెప్పుదురు. కావుననేకదా పూర్వాచారపరా యణులైన శిష్టులు కొనలు వెలికిఁ దెలియకుండునట్లు పంచ కచ్చలతోనో మూఁడుకచ్చలతోనో వస్త్రములు కట్టుకొం దురు. సత్సంప్రదాయ మెఱిఁగిన శీలవతులు నేఁటికిని తమ పయ్యెఁట కొంగులను వ్రేలాడ విడువక నడుమునందు దోఁపు దురు. నేఁటిమగవారు తలవెంట్రుకలు కత్తిరించికొనిన స్త్రీల పాపటలో బర్రె (గేదె) కొమ్ములవలె రెండుచెవులమీఁదికిఁ బోవుచున్నవి. చక్కనిపదార్థమును బాపట తీసినట్టని పోల్చుట

కలదు ఇఁకఁ గొన్నిదినములు పోయిన నీ యుపమాన సార్థమే కాదు. మగవారి గోఁచులు నేల జీరాడఁగా, వానిపైఁ బోటీకిఁ బోలె గొందఱు స్త్రీలపైఁటలు నేల కసవు చిమ్ముచుండును దీనికి రీవి యని పేరు తెలిసినవారు భ్రష్టతకు దీవి యందురు. ఈ జుట్టు కత్తిరింపుల దురాచార మెంతవఱకుఁ బోయినదో వినుఁగు

వాసుదాసుఁడు కొన్నిసంవత్సరములకు మునుపు తన బంధువుల యింట నుపనయనము జరగుచుండ నాహూతుఁడై యచటికిఁ బోయెను చౌలము లోనగు కర్మము జరగెను శిఖలు విడువకయే వటువు క్రాపింగుతోడ వచ్చి కూర్చుండుట బ్రహ్మోపదేశము (పేరుచెడినది వాస్తవమునఁ గల్యుపదేశము) లోనైన కర్మములు జరగుచుండఁ జూచి యిదియేమి మధ్యస్థోపనయనమనుకొని యా వటువు సోదరిని జూచి "యిదియేమి శిఖలు విడువకయే కార్యములు జరపుచున్నా" రని యడిగెను. "పిల్లవాఁడు క్రాపింగు పోవునని యేడుచుచున్నాఁడు అందువలన శిఖలు విడువలే" దని యామె చెప్పెను. ఇక్కడికి వచ్చినదే బుద్ధిమాలినపని యనుకొనుచు వాసుదాసుఁ డచటనుండి యా ఘోరకర్మము చూడఁజాలకే వెడలిపోయెను కంటిరిగదా దురాచార పిశాచ మెంతవఱకు వ్యాపించినదో వీఁడు బ్రాహ్మణుఁ డంట అది యుపనయన మంట పిడికెఁడు బొచ్చున కుండు గౌరవము బ్రాహ్మణత్వమునకు లేదాయె. ఇట్టివి యింతకుమించినవి యాంధ్రలోకములో నెన్ని జరగుచున్నవో యెవ్వఁ డెఱుఁగును.

శ్లో. ''విశిఖో౽ నుపవీతీచ యత్కరోతి న తత్కృతమ్.''

శిఖయును జందెమును లేక చేసినకర్మము వ్యర్థము. అనఁగాఁ జేసినను ఆ కర్మమువలనఁ గలుగు ఫలము లభింప దని యర్థము ద్రవ్యనష్టమే ఫలము ఇఁక సిగ లేనివాగు చేయు సంధ్యావందనములు-తర్పణములు-శ్రాద్ధాదులు-వ్రతానుష్ఠానములు బూడిదలోఁ జేసిన హోమము లే కదా.

శ్లో ''జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే ద్విజః''

బ్రహ్మ క్షత్రియ వైశ్య వర్ణములఁ బుట్టినవాఁడైనను బుగ షుఁ డుపనయన సంస్కారము జరగి శాస్త్రోక్త కర్మాధికారి యగువఱకు శూద్రుఁడే అనఁగా శూద్రునితో సమానుఁడని యర్థము అనఁగా వీఁడు శూద్రులు చేయు కర్మములు నిలువఁబడి మూత్రము విడుచుట లోనగు కార్యములు చేసినను వీనికి నుపనయనసంస్కార మగువఱకు దోషావహములు కావు. ఉపనయన సంస్కారము జరగి కర్మాధికారము వచ్చి ద్విజుఁడైన పిమ్మట శాస్త్ర నిషిద్ధకార్యములు చేసెనేని పాపి యగును. కర్మములే చేయఁడేని శూద్రుఁడగును.

ఇట్లుండ నుపనయనసంస్కారమున ముఖ్యాంగమైన శిఖ విడుచుట యనునది లోపించినను దరువాత శిఖ లేకయుండినను వాఁడు సంస్కారి యెట్లు కాఁగలఁడు? తత్పూర్వము బాలుఁడు వెంట్రుకలు పెంచుకొనియుండు పద్ధతి సరి గాదని కదా శిఖ విడుచుట అటు విడువక యథాపూర్వ ముండెనేని దీనికి శూద్రత్వ మెక్కడఁ బోయినట్లగును? శూద్రత్వము

పోనపుడు వాఁడు ద్విజుఁ డెట్లగును? కర్మాధికారి యెట్లగును? కావున శిఖలేనివాఁడు భ్రష్టుఁడనియే చెప్పవలసియుండును.

యోగులు ఋషీశ్వరులు జటాభారములు ధరించి యున్నారు గదా యను సందేహము కలుగవచ్చును.

యోగులు ఋషులు వనవాసులేగాని పురవాసులుగారు వీరి కిరువురకు యోగ మనివార్యమైన విధి. వీరు యోగాభ్యాసముచేఁ బ్రాణశక్తిని బ్రతిరోమకూపమునందుండి గ్రహింతురు. ప్రాణశక్తి నెంతైన నార్జింతురే కాని కొంచెమైన వెలుపలఁ బోనీయరు. ఈ శక్తిని వెలుపలఁ బోనీయక కాపాడు వానిలో దూదిన వస్త్రము లధమములు. వానికంటె శ్రేష్ఠమైనవి పట్టువస్త్రములు వానికంటె శ్రేష్ఠమైనవి మేఁకలు మొదలైన వాని రోమములతోఁ జేయఁబడిన దావళులు సాలువలు లోనైనవి. దూదివస్త్రము దినము మాటిన మైలగుడ్డయే పట్టువస్త్రము పదిదినము లుండవచ్చును. సాలువలు సర్వదా శుచులేయని శాస్త్రము చెప్పుచున్నది యోగాభ్యాసమునకుఁ దలనిండ వెండ్రుకలుండుట యెంతో సహాయము అభ్యాసకాలమునఁ దలవెండ్రుకలతోనే దేహమును గప్పుకొని కూర్చుండుట సాధన కెంతో తోడుపాటు. యోగులు ప్రాణాయామముచేతను నుడ్డీయానాదిబంధములచేతను గుండలిని లేపి సుషుమ్నానాడి శుద్ధిచేసికొనుదురు కావున వారికిఁ దలనిండ వెండ్రుకలుండినను దోషములేదు.

తరిగొండ వెంకమ్మ మహాయోగిని విధవ యగుటచే మత సంప్రదాయప్రకారము వికేశినిగా నుండవలయును ఆమె యట్లుండినది గాదు. కొంద ఱామెయందలి యసూయచే శంకరాచార్యులవారితో వెంకమ్మ విధవయయ్యు శాస్త్రోల్లం ఘనముచేసి తలవెంట్రుక లుంచుకొని యున్నదని చెప్పిరి. వా రామెను బిలిపించి నీవు వెంటనే తలవెంట్రుకలు తీసివేయించు కొనకపోయితివేని నిన్నుఁ గులమునుండి బహిష్కరించెద నని చెప్పిరి మరల మొలవకుండ మీరు చేయఁగలుగుదురేని తీయించుకొనెద నని యామె బదులు చెప్పెను. సరియే తీయించుకొమ్మని వారు చెప్పిరి. అప్పుడే మంగలవానిని బిలి పించి తలవెంట్రుకలు తీయించుకొని బోడితలను స్వాములవారికిఁ గనఁబఱచెను వా రామోదించిరి. వెంటనే పోయి యామె స్వామి పుష్కరిణిలో మునిఁగి లేచెను. యథాప్రకారము తల నిండ బారెఁడుపొడుగున వెంట్రుకలు మొలచెను మరల వచ్చి స్వాములవారికి నమస్కరించెను. ఇట్టి యోగశక్తిగలవారికి మనకు నెక్కడి పోలిక యోగులు భూమిలోనో నీళ్లలోనో దినములకొలఁది నుందురు మన ముచ్ఛ్వాసనిశ్వాసములు లేక ౨-3 నిమిషము లుండఁగలమా.

శ్లో ॥ "నిస్త్రైగుణ్యేపథివిహరతాం కో విధిః కో నిషేధః"

శంకరాచార్యులు త్రిగుణాతీతమైన మార్గమం దుండు వారికి విధి యేమి నిషేధ యేమి?

శ్లో "అత్యంతభక్తి యుక్తానాం నచ శాస్త్రం నచ క్రమః"

అత్యంతభక్తిగలవారికి శాస్త్రములేదు క్రమములేదు. వారి యిచ్ఛయే శాస్త్రము వారి నడవడియే యాచారము. కావున నట్టివారితో మనలను బోల్చుకొనుట సరిగాదు. తలుపులు కిటికీలన్నియు మూసికొని మిద్దెమీఁది గవాక్షమైనను దెఱవక యింటిలో నుండుట యెట్టిదో ప్రాణాయామపరాయణత్వము లేక బ్రహ్మరంధ్రమును గప్పుటయు నట్టిద

ఇఁక గోత్రవిషయమై విచారింతము

బ్రాహ్మణులందఱు ఋషివంశములవారే కావున మహాతపస్సంపన్నులే. ఇట్టి ఋషీశ్వరులు తమపుత్రులను వేఱొక ఋషీశ్వరునొద్దకు నధ్యయనమునకో బ్రహ్మవిద్యార్థమో పంపుచుండిరి వంశపరంపరగఁ గొన్ని రోగము లెట్లు వచ్చునో యట్లే మీఁదఁ జెప్పిన ప్రాణశక్తియు వంశపరంపరగ వచ్చును కావున నాకాలపుబాలురకుఁ దల్లిదండ్రులవలన సహజముగ వచ్చిన శక్తికిఁ దాము స్వయముగ నార్జించిన దానిని దోడుచేయుచుండిరి అంతియకాక యుపదేశరూపమునఁ గొంత, గురువుల కృపావిశేషమునను, వారి సమీపమున వసించుటచేతను, గొంత లభించుచుండెను. ఈ విధముగ వారి శక్తిని బలపఱుచుకొనుచుండిరి వారి శక్తి యపారమైనది గనుకనే వారి వంశమునఁ బుట్టినవార మగుటచేమనయందు నష్టశేషము గొంత కానవచ్చుచున్నది. మన మెన్నెన్ని విధముల నా తేజస్సును ధ్వంసము చేయవచ్చునో వంచనలేక యేమఱక సోమ

రులము గాక యన్నివిధముల ధ్వంసము చేయుచున్నారము. ఇంత చేసినను హాతశేష మింకను నుండుటే యాశ్చర్యము. ఆ కొంచెము పోవుకాలము సమీపించినది గురువులవలన వచ్చు తేజస్సు నున్న వారికే లేదు వారు మన కేమి యిత్తురు. ఇఁక మన తల్లిదండ్రులవలననా సుఖసంకటములు. క్షయరోగ ములు మూర్ఛలు కుష్టవ్యాధులు లోనైనవి రాకుండిన నసన మెంతో పుణ్యము చేసిన వారమే. ఈ రోగములు మనవలన మన బిడ్డలకు రాదేని వారు పుణ్యము చేసినవారే.

ప్రాణశక్తి యొకటి యుండుటయు నది దేహమునం దెట్టి పనిచేయునదియు నీ సమాజసభ్యులలో లఘుప్రాణాయామమైన నభ్యసించువారికిని ననుభవ విదితమే. కావున దానికి నిద ర్శనములు - సాక్ష్యములు - ప్రమాణములు తీసికొని రావలసిన పనిలేదు.

పెద్దలు కోట్లకొలఁది ధనముసంపాదించి యుంచి పోయి నను వారి వంశమువారు స్వార్జితముచే దాని నూర్జితపఱుపక మితవ్యయమును జేయక యిష్టము వచ్చినట్లు కొల్లపెట్టుచుం డిన నెంత కాల మా ధనశేష ముండఁగలదు? ఎంతకాల మావంశమువారు దాని ననుభవింపఁగలరు? అది సర్వము వెచ్చపడిన పిమ్మట నా వెనుకటివారి గతియేమి? వీరిగతియే మనగతి. బాపట్లతాలూకాలో నొక గ్రామములోఁ గొందఱు బ్రాహ్మణులు స్త్రీలు పురుషులు శూద్రుని శిష్యులై యతనిచే మంత్రోపదేశము నొంది యతని పాదతీర్థము తీసికొని యతనికి

సాష్టాంగనమస్కారము చేయుచున్నారని యా గ్రామమునకుఁ బోయినపుడు తెలియవచ్చెను. మఱియొక గ్రామములోఁ గొందఱు బ్రాహ్మణులు కుమ్మరదాని శిష్యులై యున్నారఁట. ఏ రింకను బ్రాహ్మణులఁట. హీనవర్ణములవారు చేయరు. భయపడు ఘోరకార్యములను బ్రాహ్మణులు చేయుచుఁ దమ్మితరులు గౌరవింపలేదని విలపించిన నేమిప్రయోజనము. మన మర్యాద యందు మనముండిన వారి మర్యాదయందు వారుందురు.

గీ. "క్రోధ మోహ నామకులైన ఘోరశత్రు
లిరువు రెరియించుచుండుదు రెపుడు నరుని
యంతరంగము య్యుభయంబు నడఁపకున్నఁ
నారదీయే పరమరహస్య మంత్రోపనిషదధ్యాయే."

శ్లో॥ "నారీ వా వృషలో వాపి, గురుత్వం యది గచ్ఛతి।
జిహ్వాచ్ఛేదనతదాకుర్యా, త్తస్యదండం నరాధిపః।"
శూద్ర శిష్యం తథాచైవ, నారీ శిష్యంతథైవచ।
చండాల కర్మణా నిత్యం, యోజయేత్తు నరాధిపః॥"

స్త్రీగాని శూద్రుఁడుగాని గురుత్వము వహించెనేని రాజు వారి నాలుకకోసి శిక్షింపవలయును.

ఆ ప్రకారమే శూద్రునికి శిష్యుఁడైనవానిని, స్త్రీకి శిష్యుఁడైనవానిని ప్రభువు నిత్యముగఁ జండాలుఁడు చేయు కర్మమందు నియమింపవలెను శూద్రశిష్యులు-స్త్రీశిష్యులు చండాలురతో సమానులని భావము.

శ్లో. "స్త్రీ శూద్ర బ్రహ్మ బంధూనాం,
త్రయీన శ్రుతి గోచరా" భాగవతము.

స్త్రీలు శూద్రులు భ్రష్టబ్రాహ్మణులు వేదము వినరాదు.

ఇట్లుండ వీరికి వేదమంత్రోపదేశాధికార మెందుండి వచ్చెనో. వీరైనను నాచార్యాభిమానము సంపాదించికొని మంత్రోపదేశము పొందిరేని శబరీవిదురాదులవలెఁ దాము జపించి తరింపవచ్చునే కాని యితరుల కుపదేశింపరాదు కావుననే కదా విదురుఁడు ధృతరాష్ట్రునితో నీ వడిగిన యధ్యాత్మ విషయము శూద్రయోనియందుఁ బుట్టిన నేను జెప్పరాదనెను మీఁదఁ జెప్పఁబడిన కారణముచేతనే జాతిచండాలునైన గ్రహింపఁబడు నీ సమాజమునందుఁ మీఁదఁ జెప్పఁబడిన కర్మచండాలురు నిషేధింపఁబడిరి ~~[illegible] బ్రాహ్మణగౌరవము.~~ ~~భాగ~~

బ్రాహ్మణగౌరవము పోవునని కాని పోవుచున్నదని కాని పోయెనే యని కాని విచారపడవలసిన పనిలేదు. స్వయంకృతాపరాధమునకుఁ దగినశిక్ష యనుభవింపవలసినదే. కాని బ్రాహ్మణులమనువా రనేకులు బ్రాహ్మణ్య మెంత కష్టత మార్జితమో యెఱుఁగఁజాలకున్నారు గదా యని విచారపడవలసియున్నది. ఆ గర్భశ్రీమంతుఁడై కోటీశ్వరున కుదయించిన కుమారునకుఁ గోటీశ్వరుఁ డగుట కెంత కష్టపడవలయునో యెట్లు తెలియును? పూర్వపూర్వజన్మంబుల నెంత శ్రమింపకుండినఁ దేరకు బ్రాహ్మణ జన్మము లభించెనా?

చం. పురుషభవంబు నొందుట యపూర్వము జన్మములందు సందు భూ,సురకులమందుఁ బుట్టు టతిచోద్యము. భాగ.

శ్లో॥ జంతూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతోవి ప్రతా. జంతువులకు మనుష్యజన్మమే దుర్లభము అంతకంటె దుర్లభము పురుషత్వము. అంతకంటె దుర్లభము బ్రాహ్మణత్వము. వివేకచూడామణి

శ్లో॥ "దుర్లభం త్రయ మే వైత, ద్దైవానుగ్రహహేతుకమ్।
మనుష్యత్వం ముముక్షుత్వం, మహాపురుషసంశ్రయమ్॥"

దుర్లభములైనవి మూఁడు గలవు. ఇవి లభించుటకు దైవానుగ్రహమే కారణము. అవి యేవన మనుష్యస్త్రీగాఁగాని పురుషుఁడుగాఁగాని పుట్టుట మోక్షమునం దాశక్తికలిగి యుండుట, మహాత్ముని యాశ్రయము (ఇచ్చట మహాత్ముఁడనఁగా మోక్షమార్గమున నడపించెడివాఁడు) పాషాణముగనున్న జీవి మనుష్యుఁ డగుట కెంతకాలము పట్టునో యెన్ని యోనుల సంభవింపవలయునో యం దెంత శ్రమముగలదో యా పరిణామ క్రమమంతయు సెంకాయచిప్పశతకటీకయందు వివరింపఁబడి యున్నది జీవి యంత శ్రమపడి తుట్టతుదకు నెన్నియో కల్పములకు మనుష్యుఁ డగుచున్నాఁడు అక్కడనుండి వీని పరిణామ క్రమ మెట్టిదో చూతము. ఈ విషయము మహాభారతమున ననుశాసనపర్వంబున నిట్లు చెప్పఁబడియున్నది బ్రాహ్మణ్యము జన్మముచేతనే కాని కర్మము తపస్సు లోనగువానిచే రాదని చెప్పుచు భీష్ముఁడు ధర్మరాజున కిట్లు చెప్పుచున్నాఁడు

శ్లో. "తిర్యగ్యోనిగత స్సర్వో, మనుష్యం యది గచ్ఛతి
సజాయతే పుల్కసోవా, చండాలో వా ప్యసంశయః.
పుల్కసః పాపయోని ర్వా, యః కశ్చిదిహ లక్ష్యతే
స తస్యామేవ సుచిరం, మతంగ పరివర్తతే.
తతో దశశతేకాలే, లభతే శూద్రతా మపి
శూద్రయోనా వపి తతో, బహుశః పరివర్తతే.
తత స్త్రింశద్గణేకాలే, లభతే వైశ్యతా మపి
వైశ్యతాయాం చిరం కాలం, తత్రైవ పరివర్తతే
తతః షష్టిగుణే కాలే, రాజన్యో నామ జాయతే
తతః షష్టిగుణే కాలే, లభతే బ్రహ్మబంధుతామ్
బ్రహ్మబంధు శ్చిరం కాలం, తతస్తు పరివర్తతే
తతస్తు ద్విశతే కాలే, లభతే కాండపృష్ఠతామ్
కాండపృష్ఠ చిరం కాలం, తత్రైవ పరివర్తతే
తతస్తు త్రిశతే కాలే, లభతే జపతా మపి.
తం చ ప్రాప్య చిరం కాలం, తత్రైవ పరివర్తతే
తత శ్చతుః శతే కాలే, శ్రోత్రియో నామజాయతే.
శ్రోత్రియత్వే చిరం కాలం, తత్రైవ పరివర్తతే
తదేవం శోకహర్షాతు, కామద్వేషౌచ పుత్రక.
అతిమానాతివాదాచ, ప్రవిశేతే ద్విజాధమమ్
తాం శ్చే జ్జయతి శత్రూ న్స, తదాప్రాప్నోతి సద్గతిమ్
అథ తే వైజయం త్యేనం, తాలం పక్వ మివాపతేత్."

దీనికర్థము —పశువులు పక్షులు లోనగు తిర్యగ్జాతుల నుండి మనుష్యత్వము ప్రాప్తించుచున్నది. అందుఁ దొలుతఁ బుల్కసుఁడుగనో చండాలుఁడుగనో జన్మము లభించును. అట్లు పాపజాతి యగు పుల్కసుఁడుగాఁ బుట్టి యందే దీర్ఘకాలముం డును. వేయిసంవత్సరము లా జాతియందే యుండి యావల శూద్రుఁ డగుచున్నాఁడు. శూద్రుఁడుగా దీర్ఘకాలము ముప్పది వేలసంవత్సరము లుండి యావల వైశ్యజాతియందుఁ బుట్టు చున్నాఁడు ఆ జాతియందు దీర్ఘకాలముండి శూద్రుఁడుగానున్న కాలమునకు నలువదంతలు నగు కాలమున కావల వైశ్యుఁడు క్షత్రియజాతియందుఁ బుట్టుచున్నాఁడు అంత కలునదియం తల కాలమైన తరువాత బ్రహ్మబంధువుఁ (పతితబ్రాహ్మణుఁడు) అగుచున్నాఁడు. అంతకు ౨౦౦ అంతలకాలమున కావల నాయుధములచే జీవించు బ్రాహ్మణుఁడుగాఁ బుట్టుచున్నాఁడు దీర్ఘకాల మట్లుండి గాయత్రి మొదలగు మంత్రముల జపించు బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు అంతకు ౪౦౦ అంతలు కాల మరిగినపిమ్మట వేదములను సార్థముగ సాంగముగ నేర్చిన బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు ఇట్లు దీర్ఘకాలము గడచినపిమ్మట శోకసంతోషములు, కామద్వేషములు, అభిమానాతిశయము అతివాదిత్వముఁ దుర్భాషలాడువాడు (అతివాది) వాని హృద యమునఁ బ్రవేశించి వాని నధమదశకుఁ దీసికొని రా యత్నిం చును ఆ శత్రువులను వీఁడు జయించెనా యుత్తమదశ పొం దును అవి వీనిని జయించెనా యెత్తైన త్రాటిచెట్టునుండి పడెడు తాటిపండువలె మరల నధమలోకములఁ బడును.

శ్లో "బ్రాహ్మణ్యం యది దుష్ప్రాపం, త్రిభిర్వర్ణై స్సురాసదమ్।
సుదుర్లభం సదా వాప్య, నానుతిష్ఠంతి మానవాః।
యే పాపేభ్యః పాపతమా స్తేషా మధమ ఏవ సః।
బ్రాహ్మణ్యం యోవజానతే, ధనం లబ్ధ్వేవ దుర్లభమ్॥"

తక్కిన మూఁడువర్ణములవారికి (ఆ జన్మమందే) పొంద రానిదియు దుర్లభ మైనదియు నగు బ్రాహ్మణ్యమును బొంది దానిని దక్కించుకొన నేరని మానవులు పాపాత్ములకంటెఁ బాపాత్ములును మనుష్యులయం దధములు నగుదురు దుర్లభ మైన ధనమును సంపాదించి దక్కించుకొననేరనివాఁడు పేద లలోఁ బేదయే కదా

ఇంత శ్రమించి సంపాదించిన బ్రాహ్మణ్యమును దెకతే రకుఁ గోలుపోయి యధమలోకముల పాలగువారు నింద్యులు గాక వంద్యు లెట్లగుదురు? ఇంతకంటె శోచనీయులు మఱి యె వ్వరు ఒక్కొక్కజాతియం దంతంతకాల మేల గడపవలసియుం డునా యని సందేహింపఁ బనిలేదు. వజ్రము బొగ్గేకాని మఱి యేగియుఁ గాదు బొగ్గు వజ్ర మగుట కెంత కాలము పట్టునో యాలోచింపుఁడు. ఒక శూద్రజాతియందే తెలివి తేటలయందు జ్ఞానమందు భక్తిశ్రద్ధలయందు నెంతెంత భేదము గానవచ్చు చున్నదో చూడుఁడు. ఒక్కొక్కజాతిలో నధమాధముఁడు గానుండి యధముఁడయి కాలక్రమమున నుత్తమోత్తముఁ డగును అట్టు లుత్తమోత్తమ శూద్రుఁడుగానుండి యావలిజన్మ మున నంత కుత్తమజాతియందు జన్మించును.

నహుషుఁడు ధర్మరాజును బ్రాహ్మణుఁ డెట్టివాఁ డని ప్రశ్నింప ధర్మరా జిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

సీ ''సత్యక్షమాదమశౌచ దయాతపో
దానశీలంబు లెందేనిఁ గాన
నగు నట్టివాఁడు బ్రాహ్మణుఁడు; సుఖంబు దుః
ఖము నైన యెడ దిమోహమును బొంద
కునికియ వానికి నుత్తమం బగువిద్య
నహుషుఁడు, నీ చెప్పిన యగ్గుణములు
క్రియ శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమ
ద్విజుఁడు గానేర్చునే నిజము విడిచి
తే నట్లు లయిన బ్రాహ్మణాదివర్ణవిభాగ
మెట్లు గలుగునయ్యా? హీను లధికు
లను వివేక మది యపార్థకం బగుఁగాదె
యనిన ననియె నంత కాత్మజుండు ''

వ ప్రమాదంబున వర్ణసంకరంబయినపుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువులైన మనువు సెప్పె. సత్యాదిగుణములు శూద్రునందుఁ గలిగె నేని వాఁడు సచ్ఛూద్రుం డగుఁ గాక బ్రాహ్మణుండు గా నేర్చునే ఆవియు బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుండ యనం బడు.                    భారతము, అరణ్యపర్వము

బ్రాహ్మణ్యము సంపాదించుట యెంత కష్టమో తెలియుటకై యింతదూరము వ్రాయవలసివచ్చెను ఇట్లు సంపా

దించినదానిని వ్యర్థముగఁ బోఁగొట్టుకొనువాఁడు బుద్ధిమం
తుఁ డగునో కోటిసూపాయలొక దినమున వెచ్చపఱుపవచ్చును
సంపాదింపవలయు ననిన నెంతకాలము పట్టును. పెద్దలు సంపా
దించి యుంచినదానిని వ్యర్థపఱుచువాఁడు వివేకియా బ్రాహ్మ
ణ్యము సంపాదించుట యెంతలికష్టము లక్షణముగాఁ జెప్పఁ
బడెను. రాఁగల పత్రికయందు లక్ష్యముగాఁ దెలుపఁబడును.

సశేషము.

---

## వైకుండనాథమూర్తి.

ముఖపత్రమందలి మూర్తి యెవ్వరైనది కొంద ఱెఱుం
గక యుండవచ్చును ఆయన వైకుంఠనాథుఁడు నారాయ
ణాష్టాక్షరీమంత్రమును జపించువారు ధ్యానించినది ఈ
మూర్తినే

శ్లో.॥"సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం దక్షిణం
కుంచయిత్వా। జాను న్యాధాయ సవ్యేతర, మితరభుజం నాగ
భోగే నిధాయ। పశ్చా ద్బాహుద్వయేన ప్రతిభటశమనే ధార
యఞ్ శంఖచక్రే। దేవీభూషాదిజుష్టో జనయతు జగతాం శర్మ
వైకుంఠనాథః॥"

సీ. సవ్యపాదము సాఁచి స్వాశ్రితసంఘుంబు
దురితచయంబులఁ దొలఁగఁ ద్రోయు
దక్షిణచరణంబుఁ దగ మోడ్చి లోనికి
మోఁకాటఁ గుడిహస్తమును ఘటించి

వామపాణితలంబు ఫణిభోగమున నూఁది
　ప్రతిభటశమనమై పరఁగు చక్ర
పాంచజన్యంబులఁ బశ్చాత్కరద్వయ
　ములను ధరించియు లలితరీతి
గీ. వక్షమునఁ బ్రేమరూప శ్రీ వసతి గొనఁగ
　వైజయంతియు వనమాల వఱల వెలయు
　పరమపదనాథమూర్తి ప్రపంచమునకు
　భక్తకోటుల కెల్ల సుభంబు లిడుత.

ఎడమకాలు చాఁచి కుడికాలు మోడ్చి కుడిమోఁకాలి మీఁదఁ గుడిచేతినూఁది యెడమచేతిని శేషుని దేహముపై నుంచి వెనుకటి రెండుచేతులయందుఁ జక్రశంఖముల ధరించి వక్షమున లక్ష్మీదేవియు నామె కుయ్యాలవలె వైజయంతియుఁ గంఠమున వనమాలయు ధరించి యే భక్తులు పిలుతురా తలఁతురా యచ్చటికిఁ బోదమని ప్రయాణమునకు సిద్ధపడియుండు నారాయణుఁడు సర్వలోకములను నందు విశేషించి స్వభక్తులను (నందు శ్రీకోదండరామసేవక సమాజసభ్యులను సభ్యేరాంధ్రను) సర్వదా రక్షించునుగాక.

ఇది శ్లోకములకుఁ బద్యమునకు నర్థము.

ఇం దాదిశేషుఁడు సంస్కృతప్రణవాకారాకారమున నున్నవాఁడు. ఆదిశేషుఁడు జ్ఞానమూర్తియే కదా. అందు శ్రీమన్నారాయణుఁ (అకారవాచ్యుఁ)డున్నవాఁడు. ఇట్టి మూర్తిని సేవించువారు దాని తత్త్వమును దెలిసికొనుట యత్యావశ్యకము.

శ్లో "ఆత్మాన మస్య జగతో, నిర్లేప మగుణామలమ్
బిరిభ్త కౌస్తుభమణి, స్వరూపం భగవాన్ హరిః
శ్రీవత్ససంస్థానధర, మనంతేచ సమాశ్రితమ్
ప్రధానం, బుద్ధిర ప్యాస్తే, గదారూపేణ మాధవే
భూతాది మింద్రియాదిం చ, ద్విధాహంకార మీశ్వరః
బిభర్తి శంఖరూపేణ, శార్ఙ్గ రూపేణ చ స్థితమ్
పంచరూపాతు యా మాలా, వైజయంతీ గదాభృతః
సా హేతుభూతసంఘాతో, భూతమాలాతు వై ద్విజ
చలస్వరూప మత్యంతం, జవేనాంతరితానిలమ్
చక్రస్వరూపం తు మనో, ధత్తే విష్ణుకరే స్థితమ్
యానీంద్రియా ణ్యశేషాని, తాని ధత్తే జనార్దనః
బిభర్తి య చ్చాసిరత్న, మచ్యుతోత్యంత నిర్మలమ్
విద్యామయంతు తజ్ఞాన, మవిద్యా చర్మసంజ్ఞకా
ఇత్యాదే ర్మూలభూతాసు, వేదాత్మా విహగేశ్వరః"

ఇత్యాది వాక్యములవలన,

కౌస్తుభము=జీవసముదాయము.
శ్రీవత్సము=ప్రకృతి.
కౌమోదకి=మహత్తత్త్వము.
నందకము=జ్ఞానము
అజ్ఞానము=దీనియొఱ
శార్ఙ్గము=సాత్త్వికాహంకారము.
శంఖము=తామసాహంకారము

బాణములు=కర్మజ్ఞానేంద్రియములు.
వనమాల=స్థూలసూక్ష్మ భూతములు.
చక్రము=మనస్సు.
గరుత్మంతుఁడు=వేదాత్ముఁడు.
లక్ష్మీదేవి=ప్రేమ

ఈ విధముగఁ దత్త్వములన్నియు సాకారములై భగవంతుని సేవించుచుండును నారాయణుఁడు వాసుదేవుఁడు (వాసు యొక్క దేవుఁడు.) కావున వాసుని బాదపీఠముగాఁ గొని వాని మీఁదఁ దన పాదకమలమును మోపి యున్నవాఁడు చంద్రుఁడు మనస్సునఁ బుట్టినవాఁడు. గావునఁ బూర్ణచంద్రుఁడు నిండుమనస్సును, అజ్ఞానదూషితముగాని మనస్సును దెలుపును. ఇట్టి మనస్సుతో నట్టి భగవంతుని పాలసముద్ర మను నిర్మల హృదయమున నిలిపి ధ్యానించువారు ధన్యులు

## రాధాకృష్ణసంవాదము

ఇది కార్తికమాసము - శుక్లపక్షము - పున్నమరేయి - పదునాఱు కళలతోడి నిండుచందురుఁడు పిండారఁబోసినట్లు పండు వెన్నెలల భూమండలంబునిండ దండిగఁ గన్నులపండువుగ వెద చల్లుచుండెను ఆకాశము నిర్మలమై యుండెను. ఘుమ్మను వలపులు వెదచల్లుచుఁ గమ్మనితెమ్మెర నిమ్ముగ నొయ్యారమ్ముగ మెల్లగ బృందావనమ్మున వీచుచుండెను తారకలు తేజోహీనమ్ములయ్యెను. చలువచేసిన చేతివలువలవలె నెందేని మబ్బుతునుకలు గానవచ్చుచుండెను నెమిళ్లాడుచుండెను. కోకిలలు విర

హిఁశివారమ్ముల వీనులకుఁ గారంబుగఁ ఘహూంకారంబులు సలుపుచుండెను రాజభీతిఁ జోరులవలె రాజభీతి నిగులు పొదరుల దాఁగెను. సర్వర్తుకంబైన యా వనమ్మునందలి మల్లెల మొల్లల తెల్లని కాంతు లనునుదించెను. ఇట్టి జగన్మోహనంబైన యామినియందు జగన్మోహనాకారుండైన యశోదాకుమారుండు భువనకామినీమోహనంబుగ వేణువూఁదెను. వల్లవమత్తకాశినీచిత్తంబులఁ జిత్తభవుండు శరపరంపరల సవ్యాపసవ్యంబుగ మోఁదెను. తెఱవలు మరునకు వెఱచిరి పెదవులు కఱచిరి. మేనులు మఱచిరి. గృహములు వదలిరి. వీధుల మెసలిరి గుంపులై కదలిరి. సిగ్గులు జాఱిరి వనముం జేరిరి.

ఈ యింతులలో మేలుబంతియై యొకకాంత యుండెను. ఆమె కృష్ణున కాత్మవంటిదే. దేహములే రెండు ఆత్మ యొక్కటే. అందఱు గోపికలు విసవిస నడచిరి ఆమందగమనముందుగఁ బరువుపాఱెను ఎచ్చటికో యామెకే తెలియదు త్రోవయో తెలియదు. జడముడి వీడుట యెఱుఁగదు పైఁట నేల జీరాడుట యెఱుఁగదు. కాఱుచున్న చెమటతో, జాఱుచున్న చీరతో, వ్రేలాడు సరులతోఁ దూలాడుమేనితోఁ బయనించెను కృష్ణు సమీపించెను. నా కృష్ణా యని యెగసిపోయి కౌఁగిలించెను. ఆమెకుఁ దెలిసిన దంతయే. తన్ను మఱచెను. తోడివారి మఱచెను ప్రపంచమునే మఱచెను. కృష్ణుఁడు వెన్నుచమిరెను. మేను నిమిరెను. చెమటలు దుడిచెను. చీర సవరించెను. ముద్దులు పెట్టెను. పెదవి గొఱికెను. రాధకు

స్మృతివచ్చెను కృష్ణునితోడ సిచ్ఛావిహారంబు సలిపెను. రాధ కృష్ణుఁడు తనకే దక్కె ననుకొనెను గోపికలలోఁ గృష్ణునకుఁ దానే ప్రియురాలని నిక్కెను ఇంతయేల కృష్ణుఁడు తనకు దాసుఁడయ్యెనని తలఁచెను తన్ను విడిచినఁ గృష్ణుఁడు బ్రతుక లేఁడని నమ్మెను. కృష్ణుఁడు తనచేతి లీలాకురంగమని గర్వించెను.

కృష్ణా! నేను నడువలేను బడలితిని-సడలితిని నన్నెత్తి కొని పొమ్మనెను కృష్ణుఁ డట్టులే కావించెను. రాధ సంతోషించెను. కృష్ణునిపైఁ దనకుఁ గల యధికారబలము తక్కిన గోపికలు చూచిరో లేదో యని యామెకుఁ దోఁచెను వారికై చేయిపిచెను. పచ్చిక పట్టుపైఁ బడెను. లేచెను-నలుదిక్కులు చూచెను లేఁడు కృష్ణుఁడు-కృష్ణుఁడు లేఁడు. ఏఁడీ కృష్ణుఁడు ఎందున్నాఁడు కృష్ణా కృష్ణా యని పిలిచెను కోవెలలు బదులిడెను. కృష్ణుఁడు పలుకలేదు కృష్ణా రారా యని చేయివిసరెను. జింకకొదమలు వచ్చెను కృష్ణుఁడు రాలేదు పొదలలో వెదకెను చెట్లమాటున వెదకెను. కృష్ణుఁడు లేఁడు అదిగో నెమలి పురివిచ్చి యాడుచున్నది. కృష్ణుఁ డచ్చట నుండనోపు. లేకున్న దానికేల యంతసంతోషము అని యచ్చటికిఁ బరువెత్తెను అందుఁ గృష్ణుఁడు లేఁడు. అదిగో నా పూఁబొదరింట నలుపు. అది కృష్ణుని మేని చాయ. కృష్ణుఁ డందుఁ గలఁడు. అని యచ్చటికిఁ బోయెను. కృష్ణుఁ డందును లేఁడు. కృష్ణుఁ డెందును లేఁడాయె. ఎంత పిలిచిన రాఁడాయె. ఎందుఁ బోదును? ఏమిసేయుదును? ఎక్కడ వెదకుదును. కృష్ణుని బాసి

ప్రాణము లెట్లు ధరింతును ఎట్లు చరింతు నని ఉస్సి సడిచ
లేక యొకచోఁ గూలఁబడి వేఁడికన్నీరు మున్నీరై కాఱి చెక్కు-
టద్దములు నిద్దమ్ము రద్దుపఱుపఁ నిట్టూర్పు కాఁకలఁ జిగురు మోవి
కమర హాకృష్ణా కృష్ణా యెంతమోసము చేసితివిరా యని
వెక్కి-వెక్కి- యేడ్చెను.

త్రిభువనమోహనాకారంబున నాతఁడు సన్నగ నవ్వుచుండు
హరియుఁ బీతాంబరధారియు నై యామె యెదుట నిలఁబడెను
గాని వేఁడికన్నీరు కన్నులనిండఁ గ్రమ్మినకారణంబున నామె కేది
యుఁ గానవచ్చినది కాదు హాకృష్ణా ప్రియా యని యేడ్చు
చుండెను శ్రీకృష్ణుఁడు కన్నీరు తుడిచి యోదార్చెను

రాధయుఁ బెన్నిధిగన్న పేదవోలె సంతోషించి తన
పైఁట కొంగు నేలఁ బఱిచి దానిపైఁ గృష్ణుఁ గూర్చుండబెట్టి
దీనవదనయై ప్రణయకోపంబున నిట్లనియె.

రాధ — కృష్ణా! నీవు మహాప్రేమగలవానివలె నటించి
లాలించి పాలించి తుదకు మోసగించి పోయితివాగదా?
ఇది నీకు ధర్మమా.

కృష్ణ — ప్రియురాలా! నన్నేల నిందించెదవు. నీవు నన్నపే
క్షించినపుడు నీయొద్దనే యుంటిని. నీవు నన్నుపేక్షించి
నపుడు నేను నిన్నుపేక్షించి పోయితిని నీ కక్కఱలేనప్పుడు
నేనేల నీతోడ నుండవలె?

రాధ — ఏమీ! నేను నిన్నుపేక్షించితినా?

కృష్ణ.—ఉపేక్షింపలేదా? తొలుత నీవు ప్రేపల్లెనుండి పరువిడి వచ్చి కౌఁగిలించినప్పటి యాతురక్యము తరువాత నుండెనా? కొంతసేపటి కుపేక్షించి నీ హృదయంబున నిండియున్న నన్ను నెట్టి నాస్థానంబున గర్వంబును నిలిపితివి నీమనస్సు గోపికలమీఁదఁ బోయెను. నీవు న న్నుపేక్షించిన నే నిన్ను పేక్షించితిని ఇందు నా దోషమేమి? అనాదరించు ప్రియురాండ్రయొద్ద నుండుటకంటెఁ బ్రియులకు వేఱొక దుఃఖము పరిభవము గలదా?

రాధ.—నాకేల యట్లు మనసు చలించి నీ యందుండక పోయెనో తెలిపెదవా?

కృష్ణ.—నీమనస్సింకను బక్వము కాలేదు

రాధ.—నిజమే. నామనస్సు పక్వముకాలేదు. నీది పక్వమైన మనస్సే గదా! నేను జేసినదోషమే నీవును జేయవలయునా?

కృష్ణ —నన్ను మఱేమి చేయుమనెదవు? నీవు నాప్రియురాలవు. నేను నీప్రియుఁడను మన మిరువురప్రీతి సమానదశ యం దెప్పుడు నుండవలయును. ఒకరికిఁ బ్రీతి యుండి మఱి యొకరికి లేకున్న నది రసాభాసము గదా? కావున నిన్నను సరించి నీవున్నదశకే నేను రావలసియున్నది. నీమనస్సింకను బక్వమై ప్రేమ యతిశయించుకొలఁది నేను నెక్కువ ప్రేమనే కనఁబఱుచుచుందును.

రాధ —కృష్ణా నీవు చెప్పినది సత్యమే. దోషము నాదే యనుకో అయినను నీ వియోగమందుఁ గూడ నొక మేలు

గలదు. నీవు నాతోడ నున్నప్పుడు నీ వింతమాత్రము యొక్కచోటనే కానవచ్చెదవు. నీవు నాతోడ లేనప్పుడు ప్రపంచ మందెచ్చటం జూచిన నీవే కానవచ్చెదవు. నీవు నాతోడ నున్నప్పటికంటె లేనప్పుడే నామనస్సు నీయందు నెక్కువగ లీనమగుచున్నది స్మరించుచున్నది. కావున నీ వియోగము కేవలదుఃఖాత్మకము గాదు విషము కలిపిన యమృతము. కాదు కాదు అప్పటికి విషముగాం దోంచి నను నది నీయందు మనస్సెక్కువగ దృఢపడం గారణ మగు చున్నది. ఈ విధముగాంగదా నీవు నీ భక్తుల మనస్సులను బక్వదశకుం దెచ్చెదవు. అడిచి పాలు ద్రావించుతల్లివలె నీవెంతటి దయాళుండవురా కృష్ణా. ఎంత మంచివాండ వురా.

కృ — ప్రియురాలా! యిది నా మంచితనముగాదు నీ మంచి తనమే నీవే త్రోవనం బోవం దలంచెదవో యా త్రోవన నిన్నుం దీసికొనిపోవుట నీ ప్రియుండనైన నాకు విధియై యున్నది. నీ యిష్టమునకు విరోధముగ వర్తించిన నీకు నేను బ్రియుండ నగుదునా? అప్పుడు నీ వేమందువు? నామీంద నీకుం బ్రేమ లేదనవా? కొందఱు భార్యలను నీవు చూడ లేదా? భర్తలు తమకుం బథ్యమైన విషయము చెప్పినను వినక తాము పట్టిన కుందేటికి మూండే కాళ్లని హఠము సాధించుటయు నేడ్చుటయుం గూడు నీళ్లు కొనక యుండు టయు, ఇట్టులే కదా నీవు చేయుదువు.

రాధ —నాకుఁ దాఁకు తప్పు తెలియక చెడుత్రోవఁ బోవఁ దలఁచిన?

కృష్ణ —నే నామార్గముననే నిన్నుఁ దీసికొని పోదును. సంక ల్పించుట నీవంతు. దానిని గొనసాగించుట నావంతు. సీతాదేవి చరిత్రము నెఱుఁగవా? పంచవటిలో నున్నప్పుడు సీతాదేవి మాయామృగమును బట్టి తెమ్మని రామునిఁ గోరెను. అది రాక్షసమాయ. నిజమైన మృగము గాదని లక్ష్మణుఁడు చెప్పెను ఆమె వినెనా! వినక తన కది కావ లయు ననియే కోరెను. దానికై రాముఁడు పోయెను. ఆవలి కథ నీవెఱుఁగుదువు

రాధ —నీచర్య ప్రియమైనదే కాని పథ్యమైనది గాదు. మాకుఁ దెలియక మేము మంటలోఁబడ పోయిన మమ్ము నివారిం చుటకు మాఱుగ నీవే పడఁద్రోచెదవా? ఎంత నిర్దయుఁ డవురా కృష్ణా.

కృష్ణ —ప్రియా! నీ వాలోచన లేక పలుకుచున్నావు సత్త్వ గుణమం దుండువారు చెడుత్రోవఁ బొమ్మని బలవంతపెట్టఁ బడినను బోరు. వక్రమార్గమునఁ బోవువారు రాజసులు తామసులు. వారిని గామక్రోధములు పట్టి లాగికొని పోవు చున్నవి. నిగ్రహ మేమి చేయఁగలదు? కావున వారిమార్గ మున నే వారిని బోనీయవలె వారిమార్గముననుండు కష్టము ఫలము వా రనుభవించి తెలిసికొనిరా మరల నాత్రోవఁ బొమ్మనినను బోరు. ఉపదేశము నిరర్థకము. దీపమును బట్టు

కొనఁ బోయిన శిశువును నీ వెన్ని మార్లు వెనుకకు లాగినను మరలమరలఁ బోవుచునే యుండును ఒకసారి చెయి కాల్చు కొనెనా మరల నాప్రక్కఁ బోఁడు. ఒకవేళ బలవంతము గా బిగఁ బట్టినను మనస్సేమో దానియందే యుంచును. సమయము దొరకెనా యాపని చేయనే చేయును అంత కాలహరణము కష్టమేల? మొదటిసారి కోరినపుడే యాఫల మనుభవింపఁ జేసితినా వానికి సుఖమే. నాకును సుఖమే. నామార్గము సరియో తప్పో నీవే యాలోచించు ఒకరి ముచ్చట లేల! నీవిషయమే నీ వాలోచింపుము నీ యందు నేనెంతో మచ్చికపడి యుండిని నీవు తొలుత నన్నే యుంటివి అతిపరిచితి యవజ్ఞతకుఁ గారణ మాయెను. నన్ను నీ వుపేక్షించితివి మఱచితివి. అశ్రద్ధ చేసితివి. నీమనస్సు నామీఁద లేదాయె. నీకు నేనుగాఁబట్టనపుడు నీతోఁడ నాకేమి పనియని నేను బోయితిని తరువాతఁ దెలివితెచ్చుకొని వెదకితివి శ్రమించితివి. ఏడిచితివి నీమనస్సంతయు నాయందే యుంచితివి. మరల వచ్చితిని ప్రియురాలా! నేనెందును బోయినవాఁడను గాను ఇందే యుంటిని. నీతోడనే యుంటిని. నీవు పోవుపోకలను జూచుచునే యుంటిని నీమనస్సు మఱిదేనిమీఁదనో యుండుటచే నీవే నన్నుఁ దెలిసికొనలేక పోయితివి దోషము నాదా నీదా?

రాధ — ఏమి మాయలాఁడవురా కృష్ణా! అదట్లు లుండనీ కాని. నీవు నన్నేల సృష్టించితివి? సృష్టించి నన్నిన్ని కడగండ్లు పెట్టి నీ విన్ని కడగండ్లు పడనేల?

కృష్ణ —ఏమి నెఱజాణవే రాధా! నీవు నన్ను సృష్టించితివా. నేను నిన్ను సృష్టించితినా? మగనిని గొట్టి మొఱపెట్టు నట్లున్నది నీసమాచారము.

రాధ —బలే బలే కృష్ణా! నేను నిన్ను సృష్టింపఁగలిగి యుండిన నిన్ను రాధగానే సృజించి యుందును. నేను గృష్ణుఁడుగానే పుట్టియుందును నేను నిన్నెట్లు సృష్టించితినో చెప్పుము.

సశేషము.

---

మందరము —

(ఆంధ్రవాల్మీకిరామాయణవ్యాఖ్యానము.)

మందరము నేసముద్రమునందు వైచితివని కొందఱును, దేహ మశాశ్వతమగుట మఱచితివని కొందఱును, యమస్య కరుణా నాస్తి, తస్మాజ్జాగ్రతజాగ్రత యని కొందఱును నాశ్రేయస్కాములైన హితులు మందరప్రకటనమునుగుఱించి యుద్బోధించుచున్నారు. నిద్రపోవువానిని లేపవచ్చునుగాని మేలుకొని యున్నవాని లేప నెవ్వరితరము? మేలుకొనియుండియు నేలయట్టి గొప్పకార్య ముపేక్షించుచున్నావందురేమో

వాస్తవమున నేనుపేక్షించినవాఁడనుగాను ఈ ఘటమునకు నన్యసాహాయ్యముగ సాధ్యమైన లేఖనకార్యము ముగిసినది. మఱియొకసారి పరామర్శించి శుద్ధప్రతి సిద్ధము చేయుటయే కొఱఁత అదియైనను రేపగలు పనిచేసినను 3-సంవత్సరములు పట్టును కాలము నాస్వాధీనమందు లేదనియు మృత్యువు నాచుట్టముగాదనియు నెఱుంగుదు "కృతకృత్యా

నిరీక్ష్యంతే, మృత్యుం ప్రియమివాతిథిమ్॥ కృతకృత్యులైన వారు మృత్యువును బ్రియాతిథివలె నెదురుచూతురన్నట్లు దానికి సంతోషముతో స్వాగతమియ్య నెదురుచూచున్నవాఁడను. అది వచ్చువఱకుఁ గాలము వ్యర్థపఱుపరాదని దేవసేవయు లోకసేవయు యథాశక్తి చేయువ్రతముఁ బూనియున్నాఁడను. మందరము దేవసేవయు లోకసేవయును గదా యని నామిత్రు లనుచున్నారు సత్యము. అదిగాదని నేననను. కాని యది నాస్వాధీనమందు లేదు అది కేవలధనైకసాధ్యము నేనా కుచేలుఁడను. అన్నవస్త్రములకును బరాధీనుఁడ నని పరిచితు లెఱుఁగుదురు మందరప్రకటన మనిన రూ. ౧౦,౦౦౦-లు ఇంచుమించుగఁ గావలసియుండును. నేనెందుండి తెత్తును? దీనుఁడనై యాచించినను నంతమొత్త మెవ్వరిత్తురు? ఆత్మార్థము యాచింతునా? పరార్థము యాచింతునా? ఆత్మార్థము లనమైన యాచింపను. పరిగ్రహింపను ధనముతోడ నాకుఁ బనిలేదు. ఇవంతయు నాలోచించి చందాపద్ధతిఁ బ్రకటింపఁ దలఁచితిని. ఆఱువందలు చందాదారులు కావలయునని కోరితిని ఆఱుసంవత్సరములుగా యత్నింపఁగా ౩౨౦ మంది చేరిరి ఇది నాకుఁ గీర్తికరమైనదిగాదు. కార్యసాధకమైనదిగాదు ఇందు నీకు వచ్చిన యపకీర్తి యేమందు రేమో. నాయందు నమ్మకము లేమినిగదా చందా ముందుగఁ జెల్లింప నాంధ్రులు సందేహించుట వారిసందేహము నిరాధారముగాదు నేను జెప్పుచున్నట్లే, యింతకు విశ్వసింపఁదగిన తియ్యనిమాటలే చెప్పి లోకులను గొందఱు వంచించియు

న్నారు. ఆ మోసపోయినవారిలో నేనొకరుఁడను ఇట్టి వంచకులు లోకంబున వ్యాపించియుండ నెవ్వరినైన నెట్లు నమ్మ సాధ్యపడును కావున నది లోకుల దోషముగాఁ దలఁపను వంచకుల మార్గ మవలంబించుట నాతప్పే

ఆ మార్గమును విడిచిన నిఁక నెవ్వరైన ధనికుల సాహాయ్యముచే నది కావలసిన కార్యమైయున్నది దీనికై యొకరిని యాచించుట నా మతముగాదు. యాచించినచో లేదనక యిచ్చువారు పిఠాపురము మహారాజుగా రొకరు. వారి పెద్దతల్లి సన్నుతులు రా॥ శ్రీ॥ రాజారావుచెల్లాయమ్మారావుగారు మఱి యొకరు. వీ రిరువురిన వేఁడినఁ గొంతయైన సహాయము కలుగును తప్పదు. అయినను వీరిరువురు నాగ్రంథములకుమున్నే విశేషించి నేను యాచింపకయే సాహాయ్యము చేసిరి చెఱుకు తీపని వేళ్లతో వెన్నులతో నమలుట ధర్మముగాదు. కావున వారిని వేఁడుటకు మనస్సొప్పకున్నది. ఒక్కొక్క భాగమునకు నించుమించు ౧౦౦౦-౦-౦-లు కావలసియుండును మందరము నేసముద్రమున వైచితినని నన్ను నిందలాడిన నేనేమి చేయుదును?

అయినను మందరమును భగవంతుఁడు పాలసముద్రమునందే వైచుననియు దానివలన నమృతమే జనించుననియుఁ సాధువిబుధబృందమే భుజించుననియు బిచ్చినమ్మకము గలదు దానిసమయము రామిని భగవంతుఁ డాలసించుచున్నాఁడు.

శ్రీకోదండరామసేవక సమాజసభ్యుల ప్రేరణముచే నీ పత్రికాభారమొకటి వహింపవలసివచ్చెను. దీనికి ౫౦౦ మంది

చందాదార్లు లభింపకుండిన నిది జీవింపఁజాలదు అంతస్సుచే సంజీవనిని సంజీవింపఁ జేయవలసినవారైయున్నారు. ఏమి చేసెదరో చూడవలయును.

ఈ కోదండరామసేవకసమాజ ప్రతిష్ఠకుఁ గారణభూతు రాలు వీరమ్మ యను నొక కన్నుకొమ్మయే ఈ పత్రికాప్రతిష్ఠకుఁ గారణభూతుఁడు సిద్దయ్యయుఁ గన్నుయే ఇది యేమిచిత్రమో తెలియదు. నరసాయపాళెములోని కన్నుస్త్రీలవంటివారు పురు షులుగాని స్త్రీలుగాని మఱికొంద ఱాంధ్రదేశంబునఁ గలరేని పత్రికయు జీవించును మందరము ప్రకటితమగును.

ఈ గ్రామమునందలి స్త్రీలు సమాజమున సభ్యురాండ్రు కాకపోయినను విద్యావతులు గాకపోయినను, నీపత్రికకు సంవ త్సరమునకు ౨-౦-౦ లిచ్చిన స్వామిసొత్తు మనము తిన్నట్లగును గాని స్వామికైంకర్యమున కేమి సహాయము చేసినట్లని యయిదు రూపాయలు పదిరూపాయ లీప్రకారము చందాలు వేసి ఇచ్చిరి.

ఈ పత్రికకు మందరమున కేమిసంబంధమనెదరేమో. ఐదువందల చందాదారులు లభించినయెడలఁ బత్రిక స్థిరపడును. మఱియొక యైదాఱువందల చందాదారులు లభించిరేని మం దరము తత్సహాయముచేఁ బ్రకటింపఁ బ్రయత్నించెదను. ఈ యేర్పాటువలన నన్నునమ్మి ముందు పైకమిచ్చి మోసపోయితి మని విచారపడవలసిన కారణ మెవ్వరికిని యుండదు వారిచ్చు చందాలకు వారికిఁ బత్రికలు వచ్చుచునే యుండును ఎక్కు వగా వచ్చు మొత్తము మందరమునకై వినియోగింతును.

ఆంధ్రలోకంబునఁ గుఱ్ఱా సిద్ధయ్యవంటి పురుషులును, నరసాయపాళెము స్త్రీలవంటి స్త్రీలును మఱికొందఱు గలరో లేరో భవిష్యత్కాలము చెప్పఁగలదు లేరేని నామీఁద నిందదొలఁగును. నాప్రాణమే సుఖపడును కష్టపడువాఁడనే నష్టపడువాఁడను నేనుగాను కావున విచారమును లేదు. అయినను నాచేనైనంత కృషిచేసి చూచెదను భగవత్సంకల్పమనుకూలించెనా లోకులకు ననుకూలబుద్ధియే పుట్టుచు విపర్యయమైనచో విపరీతమే మందరము మందరమగునని తలఁచితిని. అయినను మందరులు చాలమంది గాఁబోలు మందరగానయ్యె. కానిండు. ఆనాఁటి మందరధరుఁ డీనాఁడు లేఁడా? ఆయన స్వప్నాయమన యెట్లు చేసికొనిన నాకేమివ్యసనము? తక్కిన సామగ్రియంతయు సంపాదించికొనినవాఁడు తరిత్రాట రెండు భాగములు సంపాదించుకొనిన వాఁ డింకొకభాగము సంపాదించుకొనలేఁడా? లేకున్నఁబోనీ! నాకష్టము వ్యర్థముపోదు అది సర్వదా సఫలమే. మందర ప్రకటనమున కింతకంటె సులభమైనమార్గ మెవ్వరైన సూచించిరేని యామార్గమందే నడవఁగలవాఁడను.

ఇట్లు విన్నవించు,
దాసోహమ్
వాసుదాసుఁడు.

---

## గజేంద్రమోక్షణ తత్త్వము (పుట ౯౬ చూడుఁడు.)

### శేషము.

రెండు విషయము లిందు ముఖ్యముగ గమనింపవల యును. భగవంతుని గజేంద్రుఁడు బ్రహ్మ యనికాని శివుఁ డని కాని నారాయణుఁ డనికాని పేరుపెట్టి పిలువలేదు. కావున నాయన ధ్యానించినది సాకారబ్రహ్మము కాదు అయినను గజేంద్రుఁడు వర్ణించినగుణములు తమయందు లేకుండుటచే శివబ్రహ్మలు రక్షింపరారైరి నారాయణుఁడుమాత్రమే సపరి వారముగా వచ్చి రక్షించెను కావున మోక్షదాత నారా యణుఁడే యని, యెఱుంగవలయును. మఱియును నిరాకార మూర్తిని ధ్యానించువారికిని ఫలమిచ్చువాఁడు సాకారుఁడే యనియు నిరాకారధ్యానమునందు శ్రమముమాత్ర మెక్కు వయే కాని వీరికి సాకారోపాసకులకంటె ఫలమునం దాధిక్యము లేదనియు నెఱుంగవలయును. భగవద్గీత ౧౨-వ యధ్యాయమం దీయర్థమునే కృష్ణభగవానుఁడు నరున కుపదేశించెను. ఇంతకు భగవంతునందు సాకారనిరాకారభేదములు లేవు. అది యజ్ఞ కల్పితమే కాని సత్యము కాదు ఈవిషయము శ్రీరామపరత్వ మందుఁ జర్చితము.

రెండవది.—గజేంద్రుఁడు కేవల దేహరక్షణార్థము భగ వంతుని బ్రార్థించినవాఁడు గాఁడు. సంస్కృతభాగవతమున,

శ్లో॥ "జిజీవిషే నాహ మిహా ముయా కి
మంతర్బహిశ్చావృతయేఽ భయోన్యా

ఇచ్ఛామి కాలేన నయస్య విప్లవ
స్తస్యాత్మలోకావరణస్య మోక్షణమ్ ॥

అని స్పష్టముగఁ గలదు.

జీవితమును నేను గోరను ఈ జన్మమువలన నాకుఁ గావలసిన దేదికలదు? మరణమే ప్రాప్తమగునేని భగవంతుఁడు నన్ను ముక్తునిగావించుఁ గాక యని ప్రార్థించెను గాని దేహమును గాపాడు మని మరణభీతి స్తుతించినవాఁడు గాఁడు

శ్లో. ॥నా భినిందేత మరణం, నా భినందేత జీవితమ్ ॥

అన్నట్లు భక్తుఁడు మరణమును నిందింపఁడు జీవితమును వందింపఁడు. మరణము వచ్చెనా రానీ. మరల జననము రాక యుండవలయునని కోరును

గీ. ॥ . శౌరి కేల నంటితడవ,
హస్తిలోకనాథుఁ డజ్ఞానరహితుఁడై
విష్ణురూపుఁ డగుచు వెలయుచుండె ॥

నని చెప్పఁబడుటచే గజేంద్రునకుఁ బీతాంబరము చతుర్బాహువులుగల సారూప్యముక్తి లభించె ననుట స్పష్టము

కేవల దేహాభిమానము గలవారై దానిని రక్షింపఁ గోరువారికి ముక్తి లభింపదు.

ద్వి. ॥ఏరీతి నెవరు న న్నెఱిఁగి సేవింత్రు
వారి నారీతినే భజియింతు నేను ॥ ద్విపద, భగవద్గీత.

శ్లో ॥శరీరారోగ్యమర్థాంశ్చ, భోగాంశ్చైవానుషంగికాన్
దదాతి ధ్యాయతాం నిత్య, మపవర్గప్రదో హరిః ॥

మోక్ష మిచ్చునారాయణుఁడు తన్ను ధ్యానించువానికి నారోగ్యము-ధనము-భోగము లోనైనవియు నొసఁగును గని వానినిమాత్రము గోరువారికి ముక్తి నీయఁడు కావునఁ గష్టకాలమందైనను, సుఖకాలమందైనను, మానవుఁడు మోక్షము కొఱకే హరిని సేవింపవలయును పూర్వాభ్యాసములేక భగవన్నామ మాపత్కాలమున స్మరణంబునకు రాదు.

ద్వి॥ "అట్టులు గావున నన్నికాలముల,
నెట్టన యోగైకనిష్ఠుఁడ వగుము." ద్వి భ గీ.

ఈ భగవద్గీతావాక్యమును సమాజసభ్యులందఱు స్త్రీలు పురుషులు సర్వదా స్మరణనుంచుకొని యందుఁ జెప్పినట్లు చేయుచుండవలయునని ప్రార్థించెదను. యోగమనఁగ సర్వదా భగవంతునియందు మనస్సుంచుటయే

పూర్వపుణ్యఫల దివ్యజ్ఞానసంపత్తిచేఁ గదా గజేంద్రుఁడు భగవంతునిఁ బ్రార్థింపఁగలిగెను పూర్వజన్మమునఁ జేసినభక్తియీ జన్మమున మనకు సహాయపడునా యని సందేహింపఁబనిలేదు. ఈ విషయమున శ్రీకృష్ణభగవాను లేమిబోధించిరో చూతము.

శ్లో॥ "తత్ర తం బుద్ధిసంయోగం, లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయః, సంసిద్ధౌ కురునందన।
పూర్వాభ్యాసేన తేనైవ, హ్రియతే హ్యవశోఽపి సః॥"
భ గీ. ౬-౪౩-౪౪.

ద్వి "ఇరవుగఁ బౌర్వదైహికమైనబుద్ధి
బలమును, దానిచేఁ బ్రబలయత్నంబు

ఫలసిద్ధికై యల్లభవమునఁ జలుపు
నాతఁడు పరవశుఁ డైయున్ననైన
నాతని నీడ్చుఁ బూర్వాభ్యాసశక్తి ’’ ద్వి. భ. గీ.

భక్తియోగవృక్షము నీరులేక యెండిపోవునది కాదు. దానికిఁ బాదు భగవంతుఁడే. నీరును భగవంతుఁడే దానికిఁ జుట్టు కల్లు భగవంతుఁడే హృదయక్షేత్రమున భక్తిబీజము పడుటే దుర్ఘటము కాని విత్తనముపడెనా యెన్నాళ్లకైన మొలక యెత్తక మానదు పెరుఁగక మానదు చెట్టై, మ్రాఁకై యనేకులకుఁ దాపమార్చు నీడ నిచ్చు శాఖోపశాఖలుగలదై పూఁచి, కాచి తుదకు ఫలించును

తే. ‘‘హృదయ మనుపాత్ర, జ్ఞానముఁ ఘృతమునందు
యోగవర్తిక కొన, భక్తియోగ మను న
ఖండదీపంబు జ్వలియింపఁ గడను వడక
బాలురీతిని, దయ్యంబు పట్టినట్లు,
వెఱ్ఱినలెఁ, దోఁపఁ జేయుమీ విశ్వవినుత
నాకజననుతిపాత్ర సీతాకళత్ర.’’ వా. సు.

కావుననే కదా శ్రీభాగవతమున,

చం. ‘‘తనకులధర్మముఁ విడిచి దానవవైరిపదారవిందముల్
పనిపడి సేవచేసి పరిపాకము నొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేననైన నది సిద్ధి వహించును’’

అని చెప్పఁబడెను. దీనికి గజేంద్రుఁడే సాక్షి

గజేంద్రమోక్షణమున నేర్చుకొనవలసిన నీతి శ్రీభాగవతమున నిట్లు చెప్పఁబడినది.

గీ ॥ కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మ మెల్ల శిథిలమై మెల్లనఁ
బ్రబల మైనవిష్ణుభక్తి చెడదు.॥

కం ॥ చెడుఁ గరులు హయములు ధనములుఁ
జెడుదురు నిజసతులు సుతులుఁ జెలుచెలికాండ్రున్
జెడక మను నెఱసు గుణులకుఁ
జెడనిపదార్థములు విష్ణుసేవానిరతుల్ ॥

ఈ పద్యములవలనఁ ముముక్షుండగు గృహస్థుండైన దారపు
త్రాదులతోడ సుఖించుచుండియు మనస్సున వాక్కునఁ గాయ
మున భక్తితో విష్ణుసేవ సేయుచునుండెనేని క్రమక్రమముగఁ
గర్మములే నశించి భక్తియెక్కువై భగవత్సాక్షాత్కారము
గలిగించునని యేర్పడుచున్నది. క్రమక్రమముగఁ జెడునవి కర్మ
ములే. ఏగడియయందు 'స్వామీ నీవాఁడ నన్ను రక్షింపు'
మని భగవంతుని నిండుమనస్సుతో నాశ్రయింతుమో నాగడి
యయందే యాగామిసంచితపాపములు నశించును. ప్రారబ్ధ
మా దేహాంతమున నాశమగును. శిథిలమై మెల్లనఁ జెడు నను
టచే సారాయము త్రాగి మత్తెక్కినవానికి వాఁడు కట్టుకొన్న
వస్త్రము జాఱిపోవుటయుఁ దెలియనట్లు బాగుగఁ బండినపండు
తొడిమయూఁడి తనంతటతానే తీఁగకు హానిలేక పడిపోవునట్లు
కర్మబంధ మొక్కొక్కటి తనంతటఁదానే తొలఁగిపోవును.

సశేషము.

శ్రీరామ

# భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి కైంకర్య రూప మాసపత్రిక.

ఏలిక: సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి

సంపాదకుడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుడు)

ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడప మండలము.

పత్రికా భారనిర్వాహకులు — శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులు. ఆంధ్రదేశంబున మూర్ఛావస్థఁ జెందియున్న భక్తిమాతను స్వస్థస్థితినిఁ దెచ్చుటయే యుద్దేశము. భక్తిమార్గమున నడచి యుభయ లోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగములైన కర్మ, జ్ఞాన, యోగ ముల గురించియు భక్తిలక్షణము దాని యనుష్ఠానము గురించియుఁ బ్రపత్తి గురించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడు చుండును.

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపభాగకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| భాగకులు | ,, | ౫—౦—౦ |
| సామాంశువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు.

సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

Regd No M 2413 తేది, ౨-౧-30

శ్రీరామ

# శ్రీ భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామసేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
నిలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు.)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడపమండలము.

పత్రికా భారనిర్వాహకులు:— శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులు ఆంధ్రదేశంబున మూర్ఛావస్థఁ జెందియున్న భక్తిమాతను స్వస్థావస్థకుఁ దెచ్చుటయే యుద్దేశము. భక్తిమార్గమున నడచి యుభయలోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీ కోదండరామసేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగములైన కర్మ, జ్ఞాన, యోగముల గురించియు భక్తిలక్షణము దాని యనుష్ఠానము గురించియుఁ బ్రపత్తిగురించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడుచుండును.

## చందాల వివరము.

| | | | | |
|---|---|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨ | 0 | 0 |
| ధారకులు | ,, | ౫ | 0 | 0 |
| జీవాతువులు | ,, | ౧౦ | 0 | 0 |
| పోషకులు | ,, | ౨౫ | 0 | 0 |
| రక్షకులు | ,, | ౫౦ | 0 | 0 |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦ | 0 | 0 |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు. సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

సదాభ్యాసమందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీ మట
లోనగు నుపచారము చేయువారినంటి వా రుపచారకులు

కన్నెక యెండకుండ ప్రత్యహము పాలను తీసికి ధార
ధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాత్మప్రం

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు
పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యను
కూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక ౦ ర ౦

## శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ | అ. | పై. |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కట్టా సిద్దయ్యగారు, జమ్ములపాళెము .. | ర౦౦ | ౦ | ౦ |
| రక్షకులు | | | |
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |
| పోషకులు | | | |
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

శాస్త్రీకాశ్రమము, ఒంటిమిట్ట. | వాసుదాసుఁడు, నిర్వాహకుఁడు



# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక.

ప్రతి హయాణమాసారంభంబున వెలువడుచుండును

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,

(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁ బొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨ | శుక్ల - పుష్యమాసము<br>జనవరి నెల ౧౯౩౦ సం॥ | సంచిక ౧

మ. ద్విజరాట్కై చెలువొందఁగాక, యమృతాబ్ధిం బుట్టి కున్నం
దుఁగా।క, జగత్ప్రాణుల కోదనంబు నిడుతఱ్, ఖ్యాతంబుగా
ధాత్రి స।ద్విజసాంగత్యముగల్గఁగాక, తనప్రారబ్ధంబు
తప్పింపరా।దజహోదన్యనకైన దుర్భరవిధామా భక్తకల్ప
ద్రుమా॥

## -స్వవిషయము.-

శ్రీమదొంటిమిట్ట కోదండరాముల కరుణాకటాక్ష వీక్షణంబునను, భక్తులైన చందాదారుల స్వీయాభిమానమునను భక్తిసంజీవనికి నొకవత్సరము నిరంతరాయముగఁ గడచెను భక్తి ప్రస్థాపనరక్షాచరణ ధురీణులైన యాయిరువురకు భక్తిసంజీవని పునఃపునస్సాష్టాంగనమస్కారము లాచరించుచున్నది కరుణాకేలురై వారు వానిని గ్రహింతురుగాక.

కొందఱు వ్రాసినయుత్తరములవలనను, గొందఱ సముఖ సంభాషణమువలనను, గొంతవఱకు మతవిషయదురభిప్రాయములఁ దొలఁగించి శాస్త్రీయమై సరియైన స్వస్థతలఁ జెలావుటచే సంజీవని మంచికార్యము చేయుచున్నట్టు తెలియవచ్చినను నిది సముద్రములోఁ దేనెబొట్టు నైచుటవంటి వని సంజీవని యెఱుఁగును చేయవలసినకార్యము బహుళముగా నున్నదనియు నెఱుఁగును ఇల్లలికినఁ బెండ్లి ముగియునా? శుష్కవేదాంతులయు దొంగసన్న్యాసులయు మాయాయోగులయు వలలోఁబడి ప్రజలు చెడకుండ రక్షింపఁ దలంపుగల సంజీవని తొలుతఁ గర్తవ్యబోధమార్గము నే యనుసరింప నెంచియుండెను గాని శ్రీ వేంకటేశ్వరప్రేరణముచే మ. రా. శ్రీ అంకిరెడ్డియాంజనేయులుగా రామార్గమున కడ్డుపడి దానిని దుర్మతఖండనకార్య మార్గమునకుఁ ద్రిప్పిరి. వాస్తవముగ వీ రుపకారులనియే సంజీవని యభిప్రాయము.

పైరులు పెంచు రైతులు గడ్డిగాదమును దీసివేయనేల? పైరును బోషించినంజాలు నని మడిలోని కంపలను గడ్డిగాదమును ధ్వంసముచేయక యూరకుందురేని పైరు వృద్ధికాంజాలదు ఇయ్యవలసినంత ఫలము నీయంజాలదు దేహము వ్యాధిగ్రస్తమై నపుడు వ్యాధిహరమైన యౌషధమును సేవింపక వాజీకరణములైన రసాయనముల సేవించిన లాభమేమి? కావున సన్మతస్థాపనమునకు దుర్మతఖండనము, దురభిప్రాయముండనము, స్వమతమండనము కర్తవ్యము లగుచున్నవి. అటు చేయకున్న సందేహములు దీఱవు జిజ్ఞాసువుల మనస్సులు నిర్మలములు గావు

ధర్మసంస్థాపనమునకు సాధుపరిత్రాణము దుష్టవినాశము గావింతు నని భగవంతుండే చెప్పుటయే గాక యట్టులే కదా ప్రత్యవతారమునందును జరిపెను. శ్రీశంకరరామానుజమధ్వాచార్యాదిమతస్థాపకు లందఱు నామార్గము ననుసరించిన వారే కదా! ‘పోవంగను బెద్దవారు పోయెడి త్రోవన్,’ అను నియమమును బురస్కరించుకొని సంజీవనియుం బూర్వాచార్యుల మార్గమే యవలంబింప వలసివచ్చెను వాస్తవ మిట్లుండం గొందఱు సంజీవని పురోభాగినియై యున్న దనుట తెలియని తనముచేతనే ఈవిషయమున సంజీవని యింకను శ్రమింపవలసి యున్నది. మతముపేర దుష్టులు చేయు టాటోటులను సంజీవని వెలిపెట్టంగలదు మేకతోలు గప్పిన పులుల వాతంబడకుండ గోవుల రక్షింపవలసియున్నది. కావునం బాఠకులు సంజీవని

కృష్ణు —అయినను నామీఁద నీ కనుమానము లేదుకదా!

రాధ —లేదు కృష్ణా! లేదు నాకై నీవు ప్రాణమైన నిచ్చెద వని నమ్మితిని నన్ను నీ వెడఁబాయ వని విశ్వసించితిని కాని నామీఁద నీకు సందేహము లేదుగదా.

కృష్ణు — లేదు. కలఁడో లేఁడో, వచ్చునో రాఁడో, కాపాడునో కాపాడఁడో యని సందేహించువారి విషయములో నాకును సందేహమేకాని, సర్వమునుగాని, సర్వమునం దభిమానముగాని విడిచి సర్వభావముల నన్నే దిక్కని నమ్మి యుండువారిని వా రెట్టివారైనను నేను విడువను ఇది నా వ్రతము కావున నావిషయమున నీవు సందేహింపకుము

రాధ —లేదు కృష్ణా లేదు. బుద్ధి వచ్చినది. మఱికొన్ని విషయములు ని న్నడిగి తెలిసికొనవలయు నని యున్నాను. చెప్పెదవా?

కృష్ణు —నీ విదివఱ కడిగినవానికే కొన్నిటికిఁ బ్రత్యుత్తరము లీయవలసియున్నది. అయినను దెల్లవాఱుచున్నది. మా యమ్మ దూడలను విడచుకాలమైనది. నన్ను వెదకుచుండును. ఇప్పటి కిండ్లకుఁ బోదము. రేపటిరాత్రి మరల రమ్ము మాటలాడుదము.

రాధ —ఎంత కఠినచిత్తుఁడవురా కృష్ణా? ఇఁక నైదాఱు జాములు ని న్నెట్లురా విడిచియుందును?

కృష్ణు —నీకును గృహకృత్యములకు వేళయయ్యెను గదా

రాధ —పాడుగృహకృత్యములు. ఇవే కొంపతీయునవి.

కృష్ణ — అట్లు లనకుము నామీఁద నీకుఁ బ్రేమయుండిన నీ వట్లనవు ఏల యందువా? నీవు పాలు పిండునవు డీపాలు చక్కఁగాఁ గాఁచి చిక్కనిపాలలోఁ జక్కెర వేసి కృష్ణున కీయవలయుననుకో. కృష్ణుఁడు మనయింటి కెప్పుడు వచ్చునో యేమో ఆయన వచ్చువేళకు నిల్లు కసవూడ్చి యలికి రంగవల్లులు దీర్చి యాయన చూచి సంతోషించునట్లు పరిశుద్ధముగా నుంచవలయు నని గృహకృత్యములు చేయుము కృష్ణునకుఁ బ్రియమైన పదార్థములే రుచికరముగా పాకము చేయవలయు నని వంటచేయుము కృష్ణునకుఁ బెట్టక నే నెట్లు తిందునని ముందు నాకుఁ బెట్టుము కృష్ణుఁడు భుజింపఁగా మిగిలినది పవిత్రమైనది యిదే నా కాహార మని భుజింపుము కృష్ణుఁడు తాఁకెడి దేహమె ఇది శుద్ధముగా నుంచవలయు నని స్నానము చేయుము కృష్ణుఁడు మెచ్చుకొనునట్లు సొగసు చేసికొనుదు నని తలదువ్వి జడ వేసికో కొప్పు పెట్టుకో శుభ్రవస్త్రములు కట్టుకో అన్ని యీ ప్రకారము చేయుచుండిన నన్ను నీ వెట్లు మఱవఁ గలవు? నేను ని న్నెట్లు లెడఁబాయఁగలను.

రాధ — నీవు మహారాజకుమారుఁడవు. నీతల్లిదండ్రులు నీకుఁ బెట్టునట్లు బీదరాలనే నేను నీకు విలువగల రుచిగల పదార్థములు పెట్టఁగలనా?

కృష్ణ — నాకై నీవు శ్రమింపఁబనిలేదు. నీ కేదిలభ్యమగునో యదియే నాకుఁ బెట్టుము. ఏవి లేక మంచినీళ్లు త్రాగి

పండుకొనెదవా అవియే నాకుఁ బెట్టుము నీవు ... వర
మాన్నము చేసికొని నాకు నాలుకలయందు బెట్టుము ప్రతి
నాకుఁ బ్రధానముగాని పదార్థము గాదు

రాధ — కృష్ణా! నీనాలుక ఎవిచెడినదా? పూంతిన ...ము
పెట్టినను దింటివి యశోద వెన్న పెట్టినను తింటివు నీ
నాలుక రుచి యెఱుఁగదు లే (అని నవ్వును)

కృష్ణు — తెల్లవాఱినది పోదముపద

---

## నారద చరిత్రము

వ్యాస — స్థిరభక్తి యెట్లు లభించును?

నార — అయ్యా! నీవు సర్వజ్ఞుఁడవు నీకుఁ దెలియని విష
యము లేదు ఏ కారణముచేతనో నీమనస్సు ప ...మార్గ
మును ద్రొక్కినది దానిని నుత్తమమైన భక్తిమార్గమునకుఁ
ద్రిప్పినఁ జాలును అది నీ వెఱుంగనిదికాదు భక్తివిష
యమై కొన్ని సూత్రములు వ్రాసియున్నాఁడను దీనిని
జూడుము నామార్గము నీకుఁ దెలియఁగలదు ప్రహ్లాదున
కీమార్గము నే యుపదేశించితిని వాల్మీకి కీమార్గము నే
బోధించితిని దాని ననుసరించియే యాయన శ్రీమద్రా
మాయణము రచించెను. ఇంకను బెక్కురి కీమార్గము ...
బోధించితిని భగవంతుని యనుగ్రహ మొకప్పుడు నెప్పు
డే కారణముచే వచ్చునో తెలియదు అది యెవ్వరు చెప్పఁ
జాలరు ఏండ్లుపూండ్లు జపతప ఆదులు చేయువారికి
భగవదనుగ్రహము రాదు ఏమి లేకయే కొందఱి ...

సులభముగ లభించును భగవంతుని యనుగ్రహమునకు
వీరు పాత్రులని వీరు కారని చెప్పఁజాలము. దానికి కులము
ప్రధానముగాదు వయస్సుగాదు శ్రమముగాదు ధనముగాదు.
భగవంతుని కథలు వినువారును, జెప్పువారును, వ్రాయు
వారును, స్త్రీలైనను, బాలురైనను, చండాలాదులైనను,
పశువులు, పక్షులైనను భగవంతునియందలి ప్రేమ చేతనే
తరింతురు ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, మాలాంకారుఁడు
నాయకుఁడు, ద్రౌపది, శబరి, విదురుఁడు, పూతన, గోపి
కలు, కంసుఁడు, కుచేలుఁడు, శిశుపాలుఁడు, గజేంద్రుఁడు,
అజామిళుఁడు, అంబరీషుఁడు, భీష్ముఁడు, అయోధ్యయం
దలి సర్వజంతువులు, బృందావనమందలి సర్వజంతువులు
నుఱియు ననేకులు భగవదనుగ్రహమునకుఁ బాత్రులైరి కదా.
ఇట్టి వారి చరిత్రములను నీవు గ్రంథరూపమున వినరించితి
వేని లోకులు వారివారికి సాధ్యమైన మార్గమునఁ బోయి
తరింతురు స్థిరభక్తి యెట్లు లభించు నని యడిగితివి ప్రతి
ఫలాపేక్ష లేక, ప్రేమతో, చేయు సేవకే భక్తియని పేరు
కావున నిందు మనోవ్యాపారము ముఖ్యము కావున
మనస్సును దొలుత మనస్వాధీనమునకుఁ దెచ్చుకొనవలెను.
దానికి మనము లోపడియుండరాదు. మనస్సు లోపడెనేని
సర్వేంద్రియములను మనము జయించినవారమే మనస్సు
ప్రకృతిసంబంధమై త్రిగుణములను గలది స్థూలప్రకృతి
దేహము సూక్ష్మప్రకృతి మనస్సు. కావున నాహారము

కొలఁది యవియుండును. పరిశుద్ధాహారము తినువాని మనస్సు పరిశుద్ధముగానే యుండును మడ్డిచమురు పోసిన వెలుఁగు దీపమునకు శుద్ధతైలము పోసిన వెలుఁగుదీపమునకు భేదము లేదా? ఆహారమేకదా దేహమగుట. కావునఁ బరిశుద్ధమైన యాహారమునే తీసికొనవలయును దానివలన నింద్రియజయము గలదు ఇంద్రియములు పనికి లోనబడి నవి యున్నిటి నేకాగ్రముగఁ జేసి యొకకార్యమునందే నియోగింప వచ్చును ఆకార్యము భగవత్కైంకర్యముగా నుండునేని యదియే భక్తియై ముక్తికిఁ గారణమగును కావున శ్రీభాగవతమను పేర భగవద్విషయ మొల్ల రచించి ముక్తిమార్గ మెఱుంగక వేదత్రోవలఁ జనువారికి మార్గదర్శని నిమ్ము నేను బోయివచ్చెద †

## శంబుకవధ.

(గతసంచికాశేషము చూడుము డిశంబర్ సంచిక పుట.)

స్వధర్మనిష్ఠ యెక్కుడా? పరధర్మనిష్ఠ యెక్కుడా? యని విచారింతము. ఏవర్ణమందు నేయాశ్రమమం దెవ్వ రున్నారో వారికి విహితధర్మముగ శాస్త్రములు దేని శాసించుచున్నవో యాధర్మము వారివారికి స్వధర్మము. బ్రాహ్మణధర్మము వేఱు క్షత్రియధర్మము వేఱు. వైశ్యధర్మము వేఱు. శూద్రధర్మము వేఱు అట్టులే బ్రహ్మచారిధర్మము వేఱు గృహస్థధర్మము వేఱు.

---

N B † ఇందుఁ జెప్పఁబడిన నారదభక్తిసూత్రములు వ్యాఖ్యానము తోడ ముమ్ముందు భక్తిసంజీవనియందుఁ బ్రకటింపఁబడును.

వానప్రస్థధర్మము వేఱు సన్న్యాసిధర్మము వేఱు వారివారి ధర్మము వారివారికి స్వధర్మ మగునేకాని యొకరిధర్మము మఱి యొకరికి స్వధర్మము కాఁజాలదు. పరధర్మమే యగును భగవం తుఁ డొకనియొద్ద లంచము పుచ్చుకొని దేవతగను బ్రాహ్మణుఁడు గను లంచమీయ లేదని మఱియొకనిపై ద్వేషించి శూద్రుఁడు గను జండాలుఁడుగను బుట్టింపలేదు గతజన్మమందలి గుణ కర్మములనుబట్టి యీజన్మము కలుగుచుండును గుణకర్మములను బట్టి సంస్కార మేర్పడును ఈ సంస్కారము జీవు నంటియే యుండును మరణకాలమందుఁ దొలఁగిపోదు ఈ సంస్కా రముతోడనే మరల జన్మించును

శ్లో. కారణం గుణసంగోస్య స సదోన్యని జన్మసు
భ. గీ ౧౩-౨౧

మంచియోనిని జన్మించుటకుఁ జెడుయోనిని జన్మించుట కుఁ గారణము గుణముల సంగతియే. అనఁగాఁ దమోగుణము గలవాఁడు హీనకులమున జన్మించును సత్త్వగుణముగలవాఁ డుత్తమవర్ణమున జన్మించును ఒకకాలమున బుట్టిన జొన్నలనే యారైతు మఱుసంవత్సరమున నా పొలమునందే చల్లినేని కొన్ని పొడువుగఁ జక్కఁగఁ బెరుఁగును. వానిప్రక్కనే పొట్టివి నిస్సారమైనవి యుండును. దీనికి భూమి కారణము కాదు. రైతు కారణము గాదు. బీజమే కారణము. జొన్నలయందే యెన్ని భేదములు లేవు. ఈభేదముల కన్నిటికి పూర్వజన్మసం స్కారమే కారణము. ఈసంస్కారమును బట్టియే యంతః

కరణచతుష్టయము మనోబుద్ధి చిత్తాహంకారములు ఇందును వీని కనుగుణమైన కార్యములు జరుగుటకుఁగాను పంచప్రాణములు కర్మేంద్రియము లేర్పడును. లింగదేహమును బట్టి స్థూలదేహము దాని ననుసరించి స్థూలదేహ ముండునుగాని సూక్ష్మదేహము లేక స్థూలదేహ ముండదు అనఁగా సూక్ష్మదేహము ఏ గుణవిశిష్టమైయుండె స్థూలదేహము, సత్త్వగుణ ధర్మిష్ఠమై యుండదు ఈవిషయమై భగవద్గీత (౧౫-వ అధ్యా) యేమని చెప్పుచున్నదో చూతము

శ్లో॥ మమైవాంశో జీవలోకే, జీవభూత స్సనాతనః
మన షష్ఠా ణీంద్రియాణి, ప్రకృతి స్థాని కర్షతి.
శరీరం య దవాప్నోతి, యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః
గృహీ త్వైతాని సంయాతి, వాయు ర్గంధా నివాశయాత్.
శ్రోత్రం చక్షు స్స్పర్శనం చ, రసనం ఘ్రాణ మేవ చ
అధిష్ఠాయ మన శ్చాయం, విష యానుపసేవ తే.
ఉత్క్రామంతం స్థితం వాపి, భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి, పశ్యంతి జ్ఞానచక్షుషః.
యతంతో యోగిన శ్చైనం, పశ్యం త్యాత్మ న్యవస్థితమ్
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః ౧౧

జీవలోకమందు జీవభూతుఁడగు సనాతనుఁడు నాయంశమే. అతఁడు మనస్సును జ్ఞానేంద్రియములగు శబ్దస్పర్శరసరూపగంధముల నాకర్షించును. శరీర మెప్పుడు పొందునో (జన్మవేళ) యెప్పుడు [illegible] విడిచిపోవునో (మరణవేళ)

యుప్పుడు వీనిని గ్రహించియే వాయువు సుగంధదుర్గంధము
లను బదార్థములనుండి గ్రహించి కొనిపోవునట్లు పోవును
చెవులు-కన్నులు-శరీరము-నాలుక-ముక్కు-మనస్సు వీని నధి
ష్ఠించియే జీవుఁడు విషయముల సేవించును. దేహమును
విడిచిపోవునప్పుడును గుణములను ననుభవించునప్పుడును జీవుని
మూఢులు చూడలేరు జ్ఞాననేత్రములుగలవారు చూతురు.
యోగులు ప్రయత్నించి దేహమందుండు వీనిని జూడఁగలరు
ప్రయత్నించియు నకృతాత్ములగువారు చూడలేరు. అని
-ధర్మము దీనివలన నొకకులమందు జన్మించుట కొందఱు
తలంచునట్లు నిష్కారణముగాదు. యాదృచ్ఛికముగాదు

పూర్వజన్మమం దనుష్ఠించిన గుణకర్మములే యీజన్మమునకు
కారణ మని సిద్ధాంతమయ్యెను రాత్రి పదియున్నొకలుపాతికయొద్ద
నేవస్త్రములతో నెవఁడు నిద్రించునో నాఁడు మరుదినమున నచ్చ
టనే నావస్త్రములతో నిద్ర లేచునుగాని పంత్రెండవ మొంటిపాతి
కయొద్ద భిన్నవస్త్రములతో నిద్ర లేవఁడు అట్లులే యేసంస్కా
రముతో నేయంతఃకరణచతుష్టయముతో నేకోరికలతో నెవఁడు
మరణించునో యవియే ప్రాతిపదికముగా నుంచుకొని మరల
జన్మించును ఏయోనియందు వాఁడు జన్మించిన వాని సంస్కా
రము లభివృద్ధిచెందునో యాయోనియందే జన్మించును. ఆత్మ
లకు జననమరణములు లేవు జనన మరణములు! దేహములకే
వీని సాంగత్యముచేత నాత్మలు పచ్చుచుఁ బుట్టుచున్నట్లు తోఁ
చును కార్యకారణ కర్తృత్వే యను ప్రకృతి హేతు వగును

ఫలానుభవమందు హేతువు జీవుఁడగుచు కార్యకారిత్వముగు
చేయునది దేహము. ఈదేహము ముందు చెప్పినట్లు సంస్కా-
రములను నంతఃకరణముల ననుసరించి పెరుగును సంస్కార
ములు సంపూర్ణముగ మారువఱకు సూక్ష్మదేహముగాని
స్థూలదేహముగాని మారదు సంస్కారములును సందివి
చెడ్డగను చెడ్డవి మంచివిగను కొంతవఱకు మూర్పవచ్చును.
గాని సంపూర్ణముగ నొక జన్మమందు మార్పు సాధ్యపడదు.
ఒక గడియారమునకు బిగ యిచ్చి విడిచితిమేని యాశక్తి ముగి
యువఱ కది కదలుచునే యుండును బలవంతముగ నిల్పవ
చ్చును గదా యందురేమో ఆమాత్రమున శక్తి చావదు.
అప్పుడు గాకున్న నాఁకలనైనను నాశక్తి వ్యయము గావలసినదే.
అట్టులే యొక దేహమునకుఁ బ్రారంభమైన శక్తి యుగి పూర్తి
ముగియువఱకు వ్యయపడదు మధ్యమున విఘ్నములు కలిగెనేని
పిశాచజన్మమో మఱియేదియో లభించును. మేలు లేదు. ఒక
యింటి మట్టిగోడలను రాతిగోడలుగా మూర్పవలసియుండినను
రాతిగోడలను మట్టిగోడలుగా మార్పవలసియుండినను నిల్లం
తయు విఱుగఁ ద్రోచి మరలఁ గట్టవలయునే కాని మఱియొక
విధముగ సాధ్యపడదు మట్టిగోడ రాతిగోడగా మార్పఁగలఁ
చినవాఁడుప్పురిసినపుడు కరఁగిపోయినపుడు రాలతోఁ బూఁత
పూయవచ్చును. అట్టులే యొకసంస్కారమును మఱియొక
సంస్కారముగ నొక దేహమును మఱియొక దేహముగ మూర్పఁ
దలఁచినవాఁడు జన్మాంతరములఁ జేయవచ్చునే గాని యొకజన్మ

ముసఁ బూర్ణముగఁ జేయఁ జాలఁడు. ఏదేహమున నేప్రారబ్ధ
మనుభవింపవలయునో యది యాదేహపాతమువఱ కుండును
గాని నడుమ రాలిపోదు ప్రారబ్ధ మనుభవించియే తీరవల
యును తప్పదు జీవదాత తండ్రి అనఁగా జీవుని స్త్రీగర్భ
మందుఁ (గ)ని వేశపెట్టువాఁడు పురుషుఁడు వానికార్య మంతతోఁ
దీఱినది ఈజీవునికి దేహదాత్రి (దేహము కల్పించునది) తల్లి
ఆమె తినునాహారమును ఆమెనోవ్యాపారమునుబట్టి గర్భ మం
దుండు జీవునకు దేహ మేర్పడును. విత్తనము తర్వాతఁ బెద్ద
వృక్షమైనను తత్త్వము భేదింపదు దోషములచేఁ గొంత
గొంత మార్చినను సంపూర్ణముగ మాఱదు కావుననేకదా
గొంతయో విజ్ఞులైన విదురాదులు "శూద్ర యోనా వహం
జాతః" నేను హీనయోనియందుఁ బుట్టినవాఁడను గావున
బ్రహ్మజ్ఞానవిషయము నేను బోధింపరాదు నాకట్టియధికారము
లేదని యోగానికిఁ ప్రాధాన్య మిచ్చిరి తెలిసికొను నధికారము
గలదు గాని యుపదేశము చేయునధికారము వారికి లేదు సాల
గ్రామశిలనిం జనించునేకదా జాత్యల్పపాషాణముల్ అన్న ట్లుత్త
మవంశములు నీచులు జన్మింపవచ్చును పలుగురాలగనియందు
నేదే నొకవజ్రము పుట్టినట్లు నీచజాతులందు నొకమహాత్ముఁడు
కలుగవచ్చును. గనిలోనుండి వచ్చిన వజ్రమును వజ్రపురాయి
యని గౌరవించినను మీఁదనుండు రాయి మట్టి యంతయుఁ
బోలఁగించి సానకు వేసినతరువాత జనులు దాని శిరసావహిం
తురు గాని పుట్టినగానిని బుట్టినట్టు లాభరణములఁ జేరుతురా?

అట్టులే [illegible]గ్రములందు మహాత్ములును. ఒకానొకగనియందు జనించినరత్నమును లోకులు శిరసావహించి గౌరవించి గని గులకరాలన్నియు, మమ్ము నెత్తిపైఁ బెట్టుకొనుఁడు మేము నాగని యందుఁ బుట్టితిమిగదా యనరాదు ఉపదేశము నొందఁగ యోగ్యతగలవాఁడు పరుల కేల యుపదేశము చేయరాదని [illegible] వాదింతురు ఎంతో కష్టపడి తానుమాత్ర మీఁది యేఱు దాఁటుటకు నేర్చుకొన్నవానికంటెఁ బదుగురను దాఁటింపఁ బూనువాఁ డెక్కువసామర్థ్యము సాధనసంపత్తి (పడవమొదలైనవి) గలవాఁడై యుండవలయును. నే నీఁదనేర్చితినను గర్వముతోఁ బదుగురను నన్ను మీరు పట్టుకొనుఁడు మిమ్ము దాఁటించెదనని చెప్పి యాకార్యమునకై పూనెనేని వాఁడు మునుఁగును వాని నమ్మిన వారును మునుఁగుదురు, కావున నీఁదఁగల వారందఱు [illegible] మితరులను దాఁటించెద మని పూనరాదు

ఒకపాఠశాలయందుఁ జదువ నభిలాషగల విద్యార్థులు కొందఱా పాఠశాలా ప్రధానోపాధ్యాయులయొద్దకుఁ బోయిరి నాయుపాధ్యాయుఁడు వారిని బరీక్షించి యెవఁ డెవఁ డేతరగతిలోఁ జదువ నర్హుఁడో యందు వాని వానిని బ్రవేశపెట్టును అనఁగా నొకవిద్యార్థి కెంతవిద్య వచ్చును వానికి వచ్చిన విద్యకుఁ బైమెట్టేది? ఎందుఁ జేరిన వీఁడు బాగుపడునని యాలోచించి యట్టి తరగతికిఁ బంపునే కాని రెండవతరగతికి యోగ్యుఁడైన వానిని మూఁడవతరగతిలోఁ బ్రవేశపెట్టఁడు అట్టులే యెట్టి సంస్కారములుగలవాఁ డేయోనియందు జన్మ[illegible]

శ్లో॥ భగవంతుఁ డాయా యోనియందే వానిని జన్మింపఁ జేయును. ఆయోని (కులము) ధర్మమే వానికి స్వధర్మము ఒకపాఠశాల యందలి రెండవతరగతికి రెండవతరగతి పాఠములు చదువుట స్వధర్మము. మూఁడవతరగతివిద్యార్థికి మూఁడవతరగతి పాఠములు ఎఱుంచుట స్వధర్మము రెండవతరగతివానికి మూఁడవతరగతిపాఠము పరధర్మము మూఁడవతరగతివానికి రెండవతరగతి పాఠము పరధర్మము. అదిభయకారణము. హానికరము. వీరబాహు వేషధారి హరిశ్చంద్రునివలె నటింపరాదు

రెండవతరగతి యందుండువాఁడు రెండవతరగతిపాఠములు పూర్ణముగ నొకసంవత్సరము చదివినయెడల నుపాధ్యాయుఁడే మఱుసంవత్సరమున నతని మూఁడవతరగతికిఁ బంపును వాఁడు ప్రార్థనము చేయ నక్కఱలేదు. అటుగాక రెండవతరగతిపాఠములు చదువక మూఁడవతరగతి పాఠములు చదువు వాఁడు పునాదిలేని యిల్లు కట్టినవాఁడై భ్రష్టుఁ డగును. కావున మూఁడవతరగతిపాఠము లెంతచదివినను రెండవతరగతి పాఠములు వాఁడుపూర్ణముగ నేర్చుకొనుపఱకు వాఁడుమూఁడవ తరగతి పాఠములయందుఁ బూర్ణుఁడు కాఁజాలఁడు మూఁడవతరగతి యుత్తమునకు సమానుఁడును గాఁడు.

శివునిశిష్యుఁడై క్షత్రియవిద్య పూర్ణముగ నేర్చి నేర్చి ప్రవీణుఁడై కుమారస్వామిని గెలిచిన పరశురాముఁడు స్వధర్మనిష్ఠులైన శ్రీరామ భీష్ములచేఁ బరాభవమొందెను ద్వి తగ స్వనుష్ఠిత పరధర్మంబుకంటె విగుణమైనను మేలు స్వీయధర్మంబు, పరధర్మమెప్పుడు భయకారణంబు. భ. గీ.

ప్రారంభమునఁ జదువవలసిన చిన్నచిన్న గ్రంథములు చదువక పెద్దపెద్ద కావ్యముల కర్థముచెప్పఁ బూనువాఁడు ఏసందర్భమందో యల్పవిషయముల తప్పబడి యపహాస్యాస్పదుఁడగును.

రెండవతరగతిపాఠములను బాగుగఁ జదివినచో బుద్ధిమంతుఁడగువాఁడు విరామకాలముల మూఁడవతరగతిపాఠములను జదువవచ్చును. ఆమాత్రమున వాఁ డదియే పనిగా మూఁడవతరగతిపాఠములను జదువువానితోఁ దాను సమానుఁడ నను కొనుట తెలివితక్కువతనముచేతనే. ఈయుపమానము స్వధర్మప్రసంగములం దన్వయించునది. దీనివలన స్వధర్మ సంకటమైనను ననుష్ఠేయమనియు దాని ననుష్ఠింపక యుండినఁ బ్రత్యవాయము గలదనియు నేర్పడెను.

భారతయుద్ధంబున నర్జునున కీసంకటవశమే ప్రాప్తించెను. అర్జునుఁడు క్షత్రియుఁడు. ఆయనధర్మము క్షాత్రము. ఆయనకు యుద్ధము స్వధర్మము. యుద్ధము హింసారూపకము. అందు బంధుహింస చేయవలసినట్లు తటస్థించెను. దీనివలనఁ బాపమువచ్చుననియు శాంతిదాంతియుక్తమైన బ్రాహ్మణధర్మమే శ్రేష్ఠమని తోఁచి యాయన "నేను యుద్ధము చేయను అడవులకుఁ బోయి తపస్సుచేసి భిక్షావృత్తి నవలంబించెద" ననెను "నీవు క్షత్రియుఁడవు నీ స్వధర్మము దోషయుక్తమైనను నీ వాచరింపవలయును గాని పరధర్మము గుణవంతమైనను నీవు గ్రహింపరా" దని కృష్ణుఁ డనేకవిధముల బోధించెను అప్పు డర్జునుఁడు తాను బొరపడుట యెఱింగి యుద్ధముచేసెను. కృష్ణుఁ

డిట్లు స్వధర్మరక్షాపక ధర్మసంస్థాపనముగావించెను. స్త్రీయని తాటకను వధింప సందేహించిన శ్రీరామచంద్రునకు విశ్వామిత్రుఁ డిట్లే బోధించెను ఈకాలపు స్వధర్మభ్రష్టులు రామాస్త్రములకర్హులైన మలిమంతులు కాఁబోలు.

స్వధర్మప్రాముఖ్యమునుగుఱించి భగవద్గీత యేమి చెప్పుచున్నదో చూతము

నాలుగువర్ణముల స్వభావధర్మములు వివరించినపిమ్మట భ. గీ. ౧౮ అధ్యా ౪౧-౪౪

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః, సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతః సిద్ధిం, యథా విందతి తచ్ఛృణు
యతః ప్రవృత్తి ర్భూతానాం, యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య, సిద్ధిం విందతి మానవః
శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ, కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్
సహజం కర్మ కౌంతేయ, సదోష మపి నత్యజేత్
సర్వారంభాహి దోషేణ, ధూమే నాగ్ని రివా వృతః
శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః ౩.౩౫

మనుష్యుఁడు తన తన కర్మమును శాస్త్రప్రకారము తెలిసి స్వధర్మములందు విశేషప్రీతి గలవాఁడు మోక్షము నొందును స్వధర్మనిరతుఁ డెట్లు మోక్షసిద్ధి నొందు నందువా? చెప్పెద వినుము సర్వభూతములకుఁ బ్రవృత్తి యెవనివలనఁ

గలుగుచున్నదో యెవనిచే నీ ప్రపంచమంతయు వ్యాపింపఁబడి యున్నదో యట్టివానిని స్వకర్మములచేఁ జక్కఁగ నర్చించి మనుష్యుఁడు సిద్ధిని బొందును. పరధర్మమును జక్కఁగ నిర్వహించుట కంటె గుణహీనమైనను (చెడుగుణము కలదైనను) స్వధర్మమునం దుండుటయే శ్రేయస్కరము స్వభావముచే నియతమైన కర్మమును జేయువాఁడు పాపమును బొందఁడు పుట్టుకతోడ వచ్చినకర్మము దోషముతోఁ గూడినను వదలి పెట్టరాదు అగ్నిని పొగవలె సర్వకార్యములు దోషముతోఁ గూడినవే. చక్కఁగా ననుష్ఠింపఁబడు పరధర్మముకంటె గుణహీనమైనను స్వధర్మమే శ్రేష్ఠము పరధర్మము పతనభయమును గలిగించునది (అపాయకరమైనది) కావున స్వధర్మమందుఁ జచ్చుటయే శ్రేష్ఠము

స్వధర్మప్రాశస్త్యమునుగుఱించి శ్రీకృష్ణభగవానుని యీ వాక్యములకంటె నెక్కువఁగ నెవఁడు చెప్పఁగలఁడు ఈవాక్యముల యర్థమును మఱికొంత విశదీకరించెదను ప్రతిమనుష్యుఁడు తా నేవర్ణమందు నాశ్రమమందు నున్నవాఁడో యావర్ణమునకు నాశ్రమమునకు శాస్త్రీయమైన కర్మమేదియో యది యాచరించి ముక్తుఁడు కావచ్చును కావున బ్రాహ్మణుఁడు శాస్త్రీయబ్రాహ్మణకర్మ మాచరించి ముక్తుఁడు కావచ్చును. శూద్రుఁడు శాస్త్రీయమైన శూద్రధర్మమునందుండియే ముక్తుఁడు కావచ్చును. ఎట్టులందురా మోక్ష మిచ్చువాఁడు భగవంతుఁడు. కాని వాఁడువాఁడు చేయు కర్మము గాదు.

భగవంతుని సంతోషపెట్టుట యావశ్యము భగవంతుని
సంతోషింపఁ జేయునది నిర్మల భక్తిజ్ఞానములు గాని కర్మములు
గావు. కావున భగవంతుఁడు ముక్తి నిచ్చునపుడు త న్నేమన
స్సుతో నర్పించె నని చూచును గాని యేసాధనములతో
నర్పించెనని చూడఁడు. ఆయనకు బంగారుపూలు చెట్లపూలు
రెండును సమానములే. పూతన పెట్టినవిషము యశోదచనుబాలు
కాఱుచిచ్చు సమానములు అట్లే యాయనకు బ్రాహ్మణకర్మ
ములు శూద్రకర్మములు రెండు సమానములే. ఎక్కువశక్తి యెవ
నికిఁ గలదో వాఁ డెక్కువకార్యము చేయవలయును. శక్తివం
చన చేయరాదు శక్తిలేనివాఁడు కొంచెము చేయవలయును
ఎక్కువచేయక పోయితి నని దేవురింపవలసిన పనిలేదు లక్ష
రూపాయలు కలవాఁడు లక్షరూపాయలు భగవంతునికి సమ
ర్పించుటయు రెండుకాసులు గలవాఁడు రెండుకాసులు భగవంతు
నికి సమర్పించి పస్తుండుటయు సమానములు ఇచ్చిన శక్తిని
నొకఁడు సద్వినియోగముచేసెనా దుర్వినియోగము చేసెనా
యనియే భగవంతుఁడు చూచును వయస్సువచ్చిన కొడుకు
పెద్దచెంబుతో నీళ్లు తెచ్చిన సంతోషించుతల్లి బాలుఁడు
చిన్నలోటాతోఁ దెచ్చిన సంతోషించును. తండ్రి యొక
కొడుకునకుఁ బదిరూపాయలు మఱియొక కొడుకునకు నొక
రూపాయి యిచ్చి యంగడికిఁ బోయి వస్తువులు తెమ్మని వారు
వచ్చినపుడు పదిరూపాయ లిచ్చినవానిని బదిరూపాయలకు
లెక్క యడుగును. ఒకరూపాయి యిచ్చినవానిని నొకరూపా

యుకే లెక్క యడుగును గాని పదిరూపాయల లెక్క యడుగడు.
తానిచ్చిన పైకము తాను జెప్పినప్రకారము వినియోగింపక
లేక స్వతంత్రించి దుర్వినియోగము చేసెనా యని యడుగును.
మాంచుపట్లే భగవంతుఁడు బ్రాహ్మణునిజూచి బ్రాహ్మణుడా!
నీవు బ్రాహ్మణయోని జనించితివి బ్రాహ్మణకార్యములను
వన్నియుఁ జేసితివా?" యని యడుగును శూద్రునిజూచి
"ఓయీ! నీవు శూద్రయోనియందుఁ బుట్టితివి కదా శూద్ర
కర్మములు నీవు చేసితివా?" యని యడుగునుగాని శూద్రు
శూద్రుఁడా! నీవు బ్రాహ్మణకర్మము లేల చేయలేదని యడు
గఁడు చేయలేదని శిక్షింపఁడు శూద్రుఁడు నేను బ్రాహ్మణ
కర్మమును జేయుచుంటినని నీ కీయధికారము నెవరు
చెప్పిరి. నీకుఁ జెప్పినపని నీవు చేయక యితరుల పని నీవు
చేయుచుంటి వనును. ఒక పోలీసువానిని వానియధికారి
యొకచోట నిలిపి నీ విచ్చట వచ్చుపోవు బండ్లను సవరింపుమని
నియమింప నా కీపని బాగులేదని వాఁడు గుఱ్ఱమెక్కి ఇన్
స్పెక్టరువలెఁ దిరుగఁబోయినయెడల నధికారి యే ...
కావునఁ బ్రతిమనుష్యుఁడు స్త్రీగాని పురుషుఁడుగాని యెవ్వ
వాఁడైనను జన్మముచే నియమితమైన స్వకర్మములను జేయు
యును గాని పరధర్మములకై పాటుపడరాదు దానివలన సు...
లేదు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణకర్మములను భగవత్ప్రీతిగాఁ
జేయవలయును శూద్రుఁడు శూద్రకర్మములను భగవత్ప్రీతి
గాఁ జేయవలయును. ఇరువురకు ఫలము సమానము గృహ

ష్ఠుఁడు గృహస్థధర్మమునకంటె సన్న్యాసము శ్రేష్ఠమని గృహస్థ ధర్మమును దానై వదలి సన్న్యాసియగుట తప్పు. అట్లులే శూద్రుఁడు శూద్రధర్మమును వదలి బ్రాహ్మణధర్మ మనుష్ఠించుటయుఁ దప్పే. స్వధర్మమును వదలినవాఁడు భ్రష్టుఁడే కాని శిష్టుఁడు కాఁజాలఁడు. స్వధర్మమును వదలిన బ్రాహ్మణాదులకంటె స్వధర్మమందుండు చండాలుఁడు శ్రేష్ఠుఁడు. ఏలా? వారు పతితులు. వీఁడు కాఁడు. కావున వర్ణాశ్రమములవారికి స్వధర్మ పరిపాలన మత్యావశ్యకము. అనివార్యము. కావుననే

ఉ. క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మ
ణ। క్షత్రియవైశ్యశూద్రులనఁగాఁ దగు నాలుగుజాతులన్
స్వచా। రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు గాచిన యట్లు
గాఁగ మాం। ధాతృరఘుక్షితీశులు మునుపంబునఁ గాచిరె
మోదముగంగఁబులన్ ॥

అని పూర్వపు రాజులందఱు వర్ణసాంకర్యము లేకుండఁ బ్రజలఁ గాంచుట గొప్పకార్యముగ భావించిరని పురాణములు చెప్పుచున్నవి.

స్వధర్మము ననుష్ఠించినఁ గలుగు మేలు, అనుష్ఠింపకుండినఁ గలుగు కీడునుగూర్చి శ్రీరాముఁడు తల్లి కేటుబోధించెనో వినుఁడు.

చం. హితమతిఁ బుత్త్రవాత్సలము క్రొక్కకయుండఁగాని దే
వతల యజింప మానినను వారిజనేత్రకు భర్తృసేవ స
ద్గతి సమకూర్చుఁ దల్లి! నియతవ్రతయై సతతంబు నార్యయై
సతి పతిభక్తిఁ గొల్వదని సత్యముగా నిరయంబునం బడున్.

ఈజాతి యాజాతి యనువివక్ష లేక స్త్రీల కందఱకు పతి
సేవ స్వధర్మము అనేకులు ఇల్లాలు తక్కిన వ్రతోపవాసములు
సేయుచున్నను సద్గతులను గాంచును పతిసేవ చేయక వ్రతములు
తపములు చేయుస్త్రీ నరకమునకుం బోవును పతిసేవ యుపేక్షిం
పక యేమఱక చేయుచు విరామకాలములందుం జపములు
యోగానుష్ఠానములు చేయవచ్చును శకుంతలా సత్యవతు లిట్లు
చేసినవారలే సీతాదేవి యభిప్రాయమునం బతిసేవకు మించిన
తపస్సు లేదు స్వధర్మమే సర్వఫలప్రదాయకమని యామె యభి
ప్రాయము

అర్జునుఁడు యుద్ధముచేయుట ఘోరకార్యమని సందే
హించి యుద్ధము చేయనన్నప్పుడు శ్రీకృష్ణభగవానులు కొన్ని
పరిహారోక్తులు చెప్పుటఁ గడపట

"స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి" యని
బోధించెను నీవు యుద్ధము చేయవలయునని నేను చెప్పిన
కారణములు నీకు రుచించినను రుచింపకున్నను నీవు క్షత్రి
యుఁడవు గనుక క్షత్రియులకు యుద్ధము సేయుట స్వధర్మము
కావున నీవు దాని నాలోచించియైన యుద్ధము చేయుమని
బోధించెను ఇంతముఖ్యమైన స్వధర్మానుష్ఠానమును నేఁటివా
రేటిగాఁ గలిపి పరధర్మమునకై పాటుపడుట జ్ఞానములేమిచేత నే
కు ధర్మము విడిచియైన సాధింపఁదగినది ప్రతిఫలాపేక్ష లేని నిర్మల
నిష్కామభక్తియే కాని తక్కిన దేదియుం గాదు ప్రహ్లాద-విభీ
షణాదులవలెఁ గులధర్మము విడిచియైన భగవంతుని భక్తిచే

నాశ్రయింపవచ్చును. ఇది వేఱుగతిలేక వచ్చినసంకటసమయ
మందే కాని యితరసందర్భములందుఁ గాదు తక్కిన సంపత్స
ములందు స్వధర్మముచేతనే భగవంతు నర్చింపవలయును

శ్లో॥ యై స్స్వకర్మపరై ర్నాథ, నరై రారాధితో భవాన్
తే తర న్త్యఖిలా మేతాం, మాయా మాత్మ విముక్తయే.

విష్ణుపురాణము ౫ అం. 30 శ్లో

"సర్వవర్ణానాం స్వధర్మానుష్ఠానే పరమపరిమితం సుఖం"

స్వకర్మపరులైన నరులు ని న్నారాధించి మోక్షము
కొఱకు నీమాయ నంతయుఁ దరింతురు. సర్వవర్ణములవారికి
స్వధర్మానుష్ఠానమందుఁ బరమమై యపరిమితమై సుఖము
గలదు. అని యిట్టి ప్రమాణములు కలవు

ఇట్లు స్వధర్మలక్షణము, స్వధర్మానుష్ఠానకారణము, స్వ
ధర్మనిష్ఠాప్రాశస్త్యము తెలిసికొంటిమి ఇప్పుడు మూలవాక్యము
లర్థమగును

కృతయుగమందు నాలుగువర్ణములవారు వారి వారి స్వ
ధర్మమందు నిలిచి వారికార్యము లన్నియు భగవత్సేవగాఁ జేయు
చుండిరి కావున వారందఱు మహామహిమగలవారై యుం
డిరి. అప్పుడు ధర్మము నాలుగుపాదముల నడచుచుండెను

త్రేతాయుగమున నొక్కపాదము ధర్మము నశించెను.
దానిచేఁ గామక్రోధలోభము లంకురించెను భగవత్సేవయందు
ప్రవృత్తి సంకోచించి ప్రభావములు మహిమలు సంపాదించుట
యందు వికసించెను బ్రాహ్మణులకు తా మసప్రవృత్తియందుండి

ఈజాతి యాజాతి యనువివక్ష లేక స్త్రీల కందఱకు పతి
సేవ స్వధర్మము ఆసేవ సేయు నిల్లాలు తక్కిన వ్రతోపవాసములు
సేయకున్నను సద్గతులను గాంచును. పతిసేవ చేయక వ్రతములు
తపములు చేయుస్త్రీ నరకానకుఁ బోవును పతిసేవ యుపేక్షిం
పక యేమఱక చేయుచు విరామకాలములందుఁ దపములు
యోగానుష్ఠానములు చేయవచ్చును శకుంతలా సత్యవతు లిట్లు
చేసినవారిలే. సీతాదేవి యభిప్రాయమునఁ బతిసేవకు మించిన
తపస్సె లేదు స్వధర్మమే సర్వఫలప్రదాయకమని యామె యభి
ప్రాయము

అర్జునుఁడు యుద్ధముచేయుట ఘోరకార్యమని సందే
హించి యుద్ధము చేయనన్నప్పుడు శ్రీకృష్ణభగవానులు కొన్ని
పరిహారోక్తులు చెప్పుచుఁ గడపట

"స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి" యని
బోధించెను నీవు యుద్ధము చేయవలయునని నేను చెప్పిన
కారణములు నీకు రుచించినను రుచింపకున్నను నీవు క్షత్రి
యుఁడవు గనుక క్షత్రియులకు యుద్ధముసేయుట స్వధర్మము
కావున నీవు దాని నాలోచించియైన యుద్ధము చేయుమని
బోధించెను ఇంతముఖ్యమైన స్వధర్మానుష్ఠానమును నేఁటి వా
రేటిలోఁ గలిపి పరధర్మములకై పాటుపడుట జ్ఞానము లేమిచేత నే.
కులధర్మము విడిచియైన సాధింపఁదగినది ప్రతిఫలాక్ష లేని నిర్మల
నిష్కామభక్తియే కాని తక్కిన దేదియుఁ గాదు ప్రహ్లాద-విభీ
షణాదులవలెఁ గులధర్మము విడిచియైన భగవంతుని భక్తిచే

నాశ్రయింపవచ్చును. ఇది వేఱుగతిలేక వచ్చినసంకటసమయా మందే కాని యితరసందర్భములందుఁ గాదు తక్కిన సందర్భ ములందు స్వధర్మముచేతనే భగవంతు నర్చింపవలయును

శ్లో॥ యైః స్వకర్మపరై ర్నాథ, నరై రారాధితో భవాన్
తే తర న్త్యఖిలా మేతాం, మాయామాత్మ విముక్తయే.

విష్ణుపురాణమ్ ౫ అం. ౩౦౬ శ్లో॥

"సర్వవర్ణానాం స్వధర్మానుష్ఠానే పరమపరిమితం సుఖం"

స్వకర్మపరులైన నరులు ని న్నారాధించి మోక్షము కొఱకు నీమాయ నంతయుఁ దరింతురు. సమస్తవర్ణములవారికి స్వధర్మానుష్ఠానమందుఁ బరమమై యపరిమితమైన సుఖము గలదు. అని యిట్టి ప్రమాణములు కలవు

ఇట్లు స్వధర్మలక్షణము, స్వధర్మానుష్ఠానకారణము, స్వ ధర్మనిష్ఠాప్రాశస్త్యము తెలిసికొంటిమి. ఇప్పుడు నారదవాక్యము లర్థమగును

కృతయుగమందు నాలుగువర్ణములవారు వారి వారి స్వ ధర్మమందు నిలిచి వారికార్యము లన్నియు భగవత్సేవగాఁ జేయు చుండిరి. కావున వారందఱు మహామహిమగలవారై యుం డిరి. అప్పుడు ధర్మము నాలుగుపాదముల నడచుచుండెను

త్రేతాయుగమున నొక్కపాదము ధర్మము నశించెను. దానిచేఁ గామక్రోధలోభము లంకురించెను. భగవదర్చయందు నృష్టి సంకోచించి ప్రభావములు మహిమలు సంపాదించుట యందు వికసించెను. బ్రాహ్మణులకు తా మపవృలయందుండి

కందమూలాదులు తిని తినఁగూడు కట్టబట్ట లేక యేల నవయ వలయుఁ బక్కన వర్ణములవారివలె ధన మార్జించి సుఖింత మను దుర్బుద్ధి పుట్టెను తపస్సుచే బ్రాహ్మణులు మహా మహిమగలవా రగుటచూచి యాబలము తాము సంపా దింపఁ గోరి ప్రజాపరిపాలనము వదలి క్షత్రియులు తపస్సు నంగిరి విశ్వామిత్రపరశురాముల కథలు చూడుఁడు. ఈ కారణముచేఁ గృతయుగక్షత్రియులకంటెఁ త్రేతాయుగక్షత్రి యులు తపస్సునం దెక్కుడైనను స్వధర్మమును వీడినకారణముచే వారికంటెఁ దక్కువైరికాని యెక్కువ కాఁజాలరైరి ఈవిధ ముగ బ్రాహ్మణులు క్షత్రియులు కూడ క్షీణించిరి ద్వాపరము రాఁగానే రెండుపాదము లధర్మము ప్రవేశించెను బ్రాహ్మణులు తపస్సు మఱిమఱి యుపేక్షించి ధనాశను బెంచిరి. కావున మఱింత క్షీణించిరి ద్రోణకృపాశ్వత్థామల చరితము చూడుఁ డు. క్షత్రియులు తపస్సు చేయ మన మేలచేయరా దని స్వ ధర్మము వీడి వైశ్యులు తపస్సు చేయ నారంభించిరి కావునఁ బూర్వవైశ్యులకంటె వీరు హీనులైరి కలికాలమందు నధర్మము మూఁడుపాదములు ధర్మమొక్కపాలే యగుటచే వైశ్యులు తప స్సు చేయ మనమేల చేయరాదని శూద్రులు తపస్సు చేయు దురు మోక్షమిచ్చునది తపస్సుగాదు భక్తిజ్ఞానములే ఆ తెలివి ప్రజలందు నశించుటచే తపస్సు తపస్సని వారంగలార్చఁ జొచ్చిరి. కలియుగబ్రాహ్మణులందు మూఁడువాదములు స్వధర్మ నిర్వాహణశక్తి నశించెను

లోకులు స్వధర్మమును విడిచి భ్రష్టులగుట కేమి కారణము? కామమే. ఉన్నదానిని జక్కఁగ నిర్వహించి సంతుష్టి పడక పోవుటయే.

తమ పురుషుల లింగములవంటివే తక్కినపురుషుల లింగములన్నియుఁ దమభార్యల యోనులనంటివే తక్కిన స్త్రీల యోనులనియుఁ దెలిసి తెలిసి వారు వీరు వ్యభిచరింపనేల?

ఈకాలమున గృహస్థులు గృహిణులు కాషాయవస్త్రములం దాసక్తిగలవారగుటకుఁ సన్న్యాసులు పట్టువస్త్రములు అత్తరు గంధములు లోనగువానియం దాసక్తి గలవారగుటకుఁ గారణమేమి?

ఆయుర్వృద్ధికరములైనవి ఆరోగ్యకారణములైనవి యగు మధురాహారములు ఫలాదులుండ రోగము దుఃఖము కలిగించు చుఁ జుట్టను మిరపకాయలమీఁదను చేఁదైన కాకరకాయల మీఁదను మనస్సు పోవనేమి కారణము? వేలకొలఁది విలువ గల నగల ధరియించు స్త్రీలు గాజుపెంకుల సొమ్ములఁ గోరుట కేమి కారణము?

అన్నిటికిఁ గారణము సర్వశ్రేయోహానికరము సర్వానర్థకారణమునైన కామమే. కామము తనయున్నస్థితికంటె నెక్కువస్థితినే కోరునని మేలైనదియే కోరునని నియమము లేదు భగవద్విషయకమైన కామము తప్పఁదక్కిన యేకామమైనను హానికరమే

ప్రకృతిపురుషుల కలయికచేతనే మానవుఁడుగా నగుట ఈరెండుతత్త్వములు పరస్పరవిరుద్ధములు ప్రకృతి చీఁకటి వంటిది ఆత్మ వెలుతురువంటి వాఁడు ఆత్మ ప్రకృతిబంధము నుండి తప్పించుకొని యానందించుటకే యత్నించుచుండును. ఆత్మను బంధించి తనవశమున నుంచుకొనుటకే ప్రకృతి యత్నిం చుచుండును ఈగజకచ్ఛపకలహమందుఁ గొన్నాళ్లాత్మ ప్రబలి ప్రకృతి నణఁగఁ ద్రొక్కును ఇదియే కృతయుగము అక్కడ నుండి దాని బలము క్రమముగ క్షీణింపఁ బ్రకృతిబలము క్రమ ముగ నతిశయించును కలియుగమందుఁ బ్రకృతిప్రాబల్యము మెండు. ఆత్మప్రాబల్యము నామకార్థము ప్రకృతిగుణములైన సత్త్వము రజస్సు తమస్సులందు రజస్సు నడుమనుండి తక్కిన రెంటికి సాహాయ్యము చేయుచుండును ఏది ప్రబలించునో దానికెక్కువగ సాహాయ్యపడును. కృతయుగమున సత్త్వమున కెక్కువసాహాయ్యము చేయుచు కలియుగమునఁ దమస్సునకు నెక్కువగ సాహాయ్యము చేయును కావున నీయుగమునఁ దమోగుణము సంపూర్ణముగ మహోన్నతస్థితికి వచ్చునుగాని రాకమానదు ఎవరు వలయుననినను నెవరువలదనినను నది తనకు వసులైన వారిమీఁద నావేశించి యెంత తాండవమైన నాడించునుగాని మానదు. పగలు పోయినది. సంధ్య పోయి నది అర్ధరాత్రము సమీపించుచున్నది ఇది చోరనిశాచర సంచారసమయము నిద్రాపరవశులుగాక హెచ్చరిక గలిగి

యున్ యమగురువులగు శ్రీసీతారామభూపాల శ్రీసంజీవరాయల నాశ్రయించియుండువారు క్షేమపడుదురు.

నిజమైన భక్తిగలవారు మాత్రమే దాని ధాటి సహించి దానికి లోబడక దాని వేగమునc బడక లోకవృత్తమునకు సాక్షిభూతులైయుండి భగవంతు నాశ్రయించి యామున నాముగ్రహణము చేయుచు నుభయలోకంబుల సుఖింతురు. ఏటియందలి పడవలోc బోవువాcడు పడవతోపాటు నీటను బు చలింపక మానcడు అట్టులే సంసర్గదోషముచే భక్తులను దామసులవలన బాధలు కలుగును దానికి విచారింపదగరాదు. పడవకంటె నేటినీటిలో దుమికిన వేగముగc బోవచ్చునని నీటిలో దుముకను రాదు వచ్చినది సహించుచు భగవదాశ్రయము విడువకుండవలెను దేశకాల వైశిష్ట్యములవలc గర్తవ్యములు మారవలసి వచ్చినను నకార్యములు నిషిద్ధకార్యములు తామె చేయకుండవలెను తనాత్రేయన్ను గోపవారికి సంజీవని చేయు హితోపదేశ మిదియే

ప్రకృతిగుణములను దాcటిపోవు విధము శ్రీకృష్ణభగవాను లర్జునునకు ట్లుపదేశించిరి (భ గీ అ ౧౪-౨౬ శ్లో)

శ్లో మాంచ యోఽవ్యభిచారేణ, భక్తియోగేన సేవతే
సగుణాన్ సమతీత్యైతాన్, బ్రహ్మభూయాయ కల్పతే

ఇతరమార్గములందు, నితర దేవతలందు, నితరఫలములందుc బోని యనన్యమైన భక్తియోగముచే నెవcడు నన్ను సేవించునో వాc డీగుణములను బాగుముగా దాcటి ముక్తుcడగుచున్నాcడు.

వాఁగులు వంకలు నేకమై పాఱినను నేలపొలమున విరోధిసైన్యములు తలలు పగులఁగొట్టుకొనుచున్నను బర్వతాగ్రమున నుండువాఁడు చలింపనట్లు నిశ్చలభక్తిపూర్ణుఁడగు వాఁడు దేశములు తారుమారయినను మనుష్యులు తలలతో నడిచినను గొంచెమైనఁ జలింపఁడు వికలుఁడు గాఁడు ఉదాసీనుఁడై వేడుక చూచుచుండును శ్రీ కోదండరామసేవక సమాజసభ్యులు దీనిని మనస్సున దృఢముగ సర్వదా నిలిపి వర్తింతురుగాక

న మే భక్తః ప్రణశ్యతి యని జగన్నాటకసూత్రధారి భగవంతుఁడే సత్యముచేసి చెప్పెనుగదా శ్రద్ధగలవారి కింతకంటె నభయవాక్యము మఱియేది కావలయును

మూఁడుపాదముల యధర్మము ప్రబలిననాఁడు చేయవలసిన కార్యము శంబుకుఁడు మూఁడుపాదములు ధర్మము ప్రబలియుండు కాలమునఁ జేసెను కావున విపరీతఫలము కలిగెను పరిశుభ్రమైన వస్త్రమునఁ గజ్జ తగిలెనేని వికటముగఁ గనిపించును. మురికిగుడ్డపై నంతగాఁ గనఁబడదు

---

## శ్రీరాముఁడు శంబుకుని వధించుట దుష్టమా

శంబుకుఁడు తపస్సుచేసినది మోక్షమునకుఁ గాదు. స్వర్గసుఖము గోరి. దేహాంతరము గాదు. ఈశరీరముతోనే. ఏవర్ణమువారికైన నీశరీరముతోఁ బోయి స్వర్గమునందుండి సుఖమనుభవించుట యసంభవము త్రిశంకునివంటి యుత్తమ క్షత్రియుఁడు శరీరముతో స్వర్గమునకుఁ బోవఁగోర నది

యసాధ్యమని వసిష్ఠుఁడు చెప్పెను. ఆమాట వినక త్రిశం
కుఁడు విశ్వామిత్రుని నమ్మి యుభయలోక భ్రష్టుఁ డయ్యెను.
ఆగతియైన విశ్వామిత్రుని యోగశక్తిచేతనే కాని త్రిశంకుఁడు
చేసిన యాగమువలనఁ గాదు. కొందఱు ఋషులు స్వర్గము
నకుఁ బోయినట్లు వచ్చినట్లు పురాణములందుఁ జెప్పఁబడెను
గదా యందురేమో సత్యము వారు రాకపోకలు యోగ
బలముచేఁ జేయుచుండిరి ఇది యీకాలమున నాకాశయాన
ములతో (ఏరోప్లేన్) నాకాశమున సంచరించుట వంటిది.
వీరికిఁ బ్రాకృతపదార్థము సహాయము. మునులకు యోగ
బలము సహాయము విమానముతోఁ జిరకాల మాకాశమున
వసింప మనుష్యుల కెట్లు సాధ్యపడదో యట్లులే ఋషీశ్వరులు
చిరకాలము స్వర్గమున నుండసాధ్యపడదు. కొంతకాల ముండఁ
గలిగినను స్వర్గసుఖము లభింపదు. ఏల?

భూలోకము కర్మభూమి స్వర్గలోకము ఫలభూమి.
భూలోకమునఁ గర్మము చేయవలయును ఫలము స్వర్గమున
ననుభవింపవలయును. భగవదర్పణబుద్ధితోఁ జేయుని దానధర్మ
యాగాదిపుణ్యకార్యములకు స్వర్గము ఫలము. స్వర్గము కోరువా
రాపుణ్యములను జేయవలయును. ఇట్లు వేదప్రకారము కర్మ
సాధ్యమైన దానిని శంబుకుఁడు తనతపోబలముచే సాధింపఁ
జూచెను. చట్టముప్రకారము విద్యనేర్చి పరీక్షలందుఁ దరించి
సంపాదింపవలసిన కలెక్టరుపనిని బలాత్కారముగ భుజబలముచే
సాధింప యత్నించెను. వాఁ డట్లుసాధింపఁ గల్గెనేని శ్రుతులు

స్మృతులు వ్యర్థములగును. భగవంతుని యాజ్ఞావాక్యములే కదా శ్రుతులు స్మృతులు. శ్రుతి స్మృతిర్మమై వాజ్ఞా అని ప్రమాణము. అనఁగా శంబుకుఁడు భగవ దాజ్ఞనే యుల్లఘింప సాహసించెను. రాజాజ్ఞ నుల్లఘించువాఁడు దండ్యుఁడు కాఁడా? శంబుకుఁడు స్వధర్మము నుపేక్షించుట మొదటితప్పు. అక్రమమార్గమున స్వర్గమునకుఁ బోవఁబూనుట రెండవతప్పు. ఈ రెండు దోషముల ఫలము బాలుని యకాలమరణము. ఇతరుల మరణమునకు నిష్కారణముగఁ గారణభూతుఁడయినవానికి మరణమె తగినదండనము కావున శ్రీరాములు చేసినదోష మేదియు లేదు ఈశరీరముతో స్వర్గమున నేలదీర్ఘకాలముండి సుఖమనుభవింపరాదని కొంద అడుగవచ్చును పంచీకరణము ప్రకారము మనుష్యులందుఁ బృథివీతత్త్వమెక్కువ కావుననే మనుష్య దేహములు మలినభూయిష్ఠములు. కన్నకసుమాలముతో నిండియుండును. దేవతల దేహమందుఁ దేజ స్తత్త్వమెక్కువ కావుననే వారికిఁ బ్రకాశించువారని దేవతలని పేరు వా రమృతాశనులు. వారు చెమట యెట్టిదో యెఱుఁగరు. దేహములు తేలికలగుటచే నేల దాఁకరు. వారి కాఁకలి డప్పులు లేవు అట్టిస్థలమం దీకసుమాలపు మనుష్య దేహములుండనగునా? గాలిలోనుండు నవి నీళ్లలో నుండఁగలవా? నీళ్లలోనుండునవి గాలిలో నుండఁగలవా? కావున మనుష్యులు మనుష్యశరీరముతో స్వర్గమున నుండఁదగరు మీఁదఁ జెప్పిన యీకారణముచేతనే దేవతలు "రామా! నీవు సురకార్యమును

దీర్చితి వనిరి. శ్రీరామునిమీఁద దృష్టినిలిపి దాయువచే ఆంహా రింపఁబడుటచే శంబుకున కుత్తమలోకము లేకలిగెను.

కొందఱు శంబుకుని జంపిన బ్రాహ్మణబాలకుఁడు బ్రదుకునా యందుచు ఒకటిని నమ్మినవారు రెంటిని నమ్మవలయును లేదా కథయంతయు నసత్య మనవలయును అంతేకాని తమ వాదమున కనుకూలమైన భాగము నమ్మి తక్కినది నమ్మకపోవుట వితండావాదము ఇట్టి వైతండికులు శ్రీరాముఁడు శంబుకుని జంపనే లేదని యూరకుండుట క్షేమము శంబుకుఁడు నాశించిన వెంటనే బ్రాహ్మణబాలుఁడు జీవించె ననుట నమ్మనివారు శంబుకుఁడు తపస్సు చేసిన బ్రాహ్మణబాలుఁడు చచ్చెనని యెట్లు నమ్ముదురు? బ్రాహ్మణబాలకుఁడు చావకుండిన శ్రీరాముఁడు శంబుకుని జంపెననుట యెట్లు విశ్వసింతురు?

శంబుకునివధ గుఱించి పెద్దపూఁడిలోనగు గ్రామములు సంచరించునప్పుడు కొందఱు కమ్మమిత్రులు ప్రశంసించిరి. శ్రీమ ద్రామాయణమునను్న యట్టులు వారి కాచరిత్రము చెప్పితిని. శంబుకవధ యనునాటకమునం దిట్లున్నదే యట్లున్నదే యని కొన్నివిషయములు చెప్పిరి అవి సత్యములు కావు కల్పితము లని చెప్పితిని వారికోరికమేర కీవ్యాసము వ్రాసితిని. పైవ్యా సము వ్రాయుచుండ శంబుకవధ యనుగ్రంథము నామిత్రు లొకరు తెచ్చి యిచ్చిరి.

ఈగ్రంథమున ముఖపత్రమునందు “కృతికర్త శతావధాని త్రిపురనేనిరామస్వామి బారిష్టరు” అని యున్నది. ఇప్పు డీపుస్త

కము నొసంగినవారు దీనిని విమర్శింపఁ గోరిరి గాని దానికి నామన స్వీయకొనకున్నది. గ్రంథకర్తగారి పేరు బిరుదులు గొప్పవి గ్రంథమా అనృతాబద్ధవాక్యభూయిష్ఠము. అసూయాద్వేష పూరితము రాముఁడు-వసిష్ఠుఁడు-శంబుకుఁడు-అంగదుఁడు మొదలగు పౌరాణికనామములు వధ దప్పఁ దక్కినదంతయు నసత్యమే. అన్నియు నపోహములే ఇట్టిదానిని విమర్శించు టెట్లు? అందు "శంబుకునివధ న్యాయ్యమో యన్యాయ్యమో నిష్పాక్షికబుద్ధితో సంతర్వాణులు నిశ్చయింతురుగాత" మని యొకవాక్యము (15-వ పుట 3-4 పంక్తులు) కానవచ్చుచున్నది. నా ప్రార్థన మిదియే ఇది నిశ్చయించుటకుఁ గాను శంబుకచరిత్రము ను పూర్వసంచికయందు వ్రాసితిని ఈనాటకమం దున్నవిధము వివరించెదను ఇందు హనుమదంగదులు ప్రవేశపెట్టఁబడిరిగాని కథాంశమునకు వారు లేకుండిన లోపము లేదు శంబుకుఁడను శూద్రుఁ డయోధ్యాపురసమీపమునఁ దపస్సు చేయుచుండె నఁట ఈకారణమున బ్రాహ్మణు లతనిపైఁ బగసాధింపఁ బూని రఁట. అందువసిష్ఠుఁడు ముఖ్యుఁడఁట ఆయన యొక బ్రాహ్మణ బాలునికి మూర్ఛనుం దిప్పించి మూర్ఛపోయిన బాలుని చచ్చిన వానిఁగా రామునకుఁ గనఁబఱిచి యానెపమున శ్రీరామునిఁ బ్రేరించి శంబుకునిఁ జంపునట్లు చేసెనఁట. ఇదిసారాంశము

రామాయణప్రకారము శూద్రుఁడెవఁడో తపస్సు చేయు చుండవలయును విచారింపుమని శ్రీరామునకుఁ జెప్పినవాఁడు నారదుఁడుగాని వసిష్ఠుఁడు కాఁడు. ఆయన కిందెట్టి సంబం

ధము లేదు నారదుఁడు శూద్రుఁ డని తలంచి కాఁబోలు నాయనమాఱు వసిష్ఠునిపేరిటికింపఁబడెను. కొందఱు మహాను భావులు వసిష్ఠుఁడు వేశ్యాపుత్త్రుఁడు లంజకొడుకని వ్రాసి యుండుట తెలియనికారణముచే వసిష్ఠునిపేరు చేర్పఁబడెనే మో అది తెలిసియుండినచో నిప్పుడు పరమపాపాత్ముఁడైన వసి ష్ఠుఁ డప్పుడు పరమపవిత్త్రుఁడుగాఁ జెప్పఁబడియుండునేమో. శంబుకుఁడు తాను దేహముతోనే స్వర్గమునకుఁ బోవఁదలఁచి తపస్సు చేయుచున్నానని చెప్పినమాట గ్రంథమం దెందును జెప్పఁబడినదికాదు కారణము పాఠకులే గ్రహింతురుగాక. హనుమంతుఁడు రామాయణము వ్రాసెననుట సరిగాదు హను మన్నాటకము హనుమంతుఁడు వ్రాసినదిగాదు ఆ పేరకవి వ్రాసినదని చరిత్రకారులు వ్రాసియున్నారు కావున హను మంతునిగ్రంథము రామాయణము నిక్షాలింపఁబడె ననుట కల్పితము

"ఈ యాశ్రమస్వీకారము గావించి హింసాపరాఙ్ముఖుఁ డనై భగవద్ధ్యానముచేసికొనుటకు నన్నీద్రావిడచర్మ మాటంక పఱుచునా" యని శంక ఆటంకపఱుపదనియే వీరు ద్వేషించు స్మృతులు పురాణములు ఘోషించుచున్నవి ద్రావిడజన్మమే కాదు పరమపాపజన్మమైనను భగవద్ధ్యానమునకు నాటంకము లేదు

మూర్ఛకు మరణమునకు భేదము తెలిసికొనలేని మూ ఢునిగా రాముఁడు చెప్పఁబడెను ఆయన కీమాత్రజ్ఞానము కూడ లేదయ్యెఁగదా మూర్ఛపోయినవాని నూనెకాగులో

వేసినఁ జావనే చచ్చెను. చచ్చెనో మూర్ఛనొందెనో రాముఁడు విచారింపకయె యట్లు చేయించెనా? అంతసభలో నందఱు ద్విజేతరమంత్రులలో నొకరైన నిది చావుగాదు మూర్ఛ యని చెప్పువారు లేరైరా? మూర్ఛనుండువానికి నాడీయాడదా? గుండె కొట్టుకొనదా? ఊపి రాడదా?

ఆహ్య లీదేశవాసులే కాని యెందుండియో వచ్చిన వారు కారను పాశ్చాత్యులవాదమును వివేకానందస్వాములు మొదలగువారు నిరాకరించిరి ఒకవేళ వారముసకై వారన్య దేశీయులని గ్రహించినను వారిదేశమునకు రాకముందేఋగ్వేద ముండెను అందు శూద్రజాతి పేర్కొనఁబడ నెట్లు తటస్థించెను? కావున శూద్రులార్యులే

రాముఁడు "మానమ్మినబంటును నగుహానుమన్నను సాకేతపురమునఁ గట్టివైచెను" అని యీగ్రంథమునఁ గలదు శూద్రులనార్యులని వారియందు విషమబుద్ధిగలిగి హనుమదంగదాదుల సందేహించి హనుమంతు నయోధ్యయందుఁ గట్టివైచిన రాముఁడు వీరికిండఱకు మోక్షమెట్లిచ్చెనో శబరి తపస్సు చేయు నెట్లు సహించెనో ఇంతయేల? అసత్యములు చెప్పి సత్యములు దాఁచి బ్రహ్మక్షత్రియవైశ్యులందు శూద్రులకు ద్వేషబుద్ధి గలిగించుట గ్రంథప్రయోజనముగాఁ గానవచ్చుచున్నది ఇది చాల శోచనీయము.

భవభూతిరచితమైన యుత్తరరామచరితయందు

శ్లో॥ రే హస్త దక్షిణ! ద్విజస్య శిశో ర్మృతస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్
రామస్య గాత్ర మసి దుర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుతస్తే

అర్థము. ఓకుడిహస్తమా! మరణించిన బ్రాహ్మణశిశువును ప్రాణముగలవానిగాఁ జేయుటకుఁగాను శూద్రమునియందుఁ గత్తిని విడువుము నీవు మోయరాని గర్భభారముచే ఖిన్నయైన సీతను దేశాంతరము పంప సమర్థుఁడైన రాముని దేహమవు. నీకు దయయనునది యెక్కడిది?

పై శ్లోకమునకు గ్రంథమం దుండుపద్యము.

చం॥ కరుణ యొకింత లేక కులకాంతను, సాధ్విని బూర్ణగర్భిణిన్
వనికి నరణ్యభూములకుఁ బంపఁగఁజాలిన యట్టి నీకు దు
ర్భరమగునే యొకానొకని ప్రాణము తెసెడుపట్ల మౌనిశే
ఖరుఁడెవఁడోగాక జాలి యెటుకల్గును దక్షిణబాహుదండమా.

సీతను నరణ్యమునకుఁ బంపినది రాముని దక్షిణబాహుదండమఁట!! 'జీవాతవే' యనుశబ్దము నేల భవభూతి యుపయోగించెనో యెఱిఁగియుండిన నీపద్యమిందుఁ గానరాకయే యుండును. ఆమాట వీరికి హృదయశల్యము. ఒకానొక మౌనిశేఖరుఁడఁట! బలేబలే!! "శూద్రమునియందు" నని చెప్పె భవభూతి రాముఁడు చేసినకార్యమునకుఁ గారణము చెప్పెను. రాముఁ డనాలోచితకార్యము చేసెనని యీగ్రంథకర్తగారి తలంపు కాఁబోలు నొకానొకయనిచెప్పుటకుఁ గారణము సత్య

ము లోకమెఱుంగునుగాక "శంబుకవధ మతరక్షణాసక్తిప్రేరితము కాదనియు రాజనీతి ప్రేరితమని యుత్తరరామాయణముఁ జదివిన వారికెల్ల బోధపడకమానదు" అని గ్రంథపీఠికయందుఁ గలదు ఇది కేవలము పొరపాటభిప్రాయము. క్షత్రియులకు స్వమత రక్షణము రాజనీతియం దంగమేకాని భిన్నము కాదు క్షత్రియులకు స్వమతరక్షణము స్వధర్మము క్షత్రియులు ప్రభువులుగా నుండుచోట రెండును గలిసియే యుండును ఇపుడు మన కన్య దేశీయులు నన్యమతజులు ప్రభువులగుటచే మతధర్మము వేఱు రాజనీతి వేఱుగా నయ్యెను.

"రామువవంశవర్ధనః స్థిర స్వధర్మే హిమవా నివాచలః" శ్రీరాముఁడు హిమవత్పర్వతమువలె స్వధర్మమందుఁ జలింపని వాఁడు. "చాతుర్వర్ణస్య రక్షితా" నాలుగువర్ణముల రక్షించు వాఁడని యిట్లు చెప్పఁబడెను వర్ణధర్మరక్షణార్థమై శంబుకుఁడు వధింపఁబడినట్లు రామాయణమున నున్నది. కేవలరాజనీతి ప్రేరితమని నాలోముచెప్పుచున్నది. ఈగ్రంథవాక్యమే ప్రమాణమో రామాయణమే ప్రమాణమో నిశ్చయించుకొనఁ బాఠకులే యోగ్యులు రాముఁడు నాలుగువర్ణముల రక్షించువాఁడని చెప్పినమాటకు నిదర్శనముగా శంబుకవధ చెప్పఁబడెను అనఁగా వర్ణధర్మమిట్లు రక్షించెను గావుననే యాయన కావిశేషణము చెప్పఁబడెనని గ్రహింపవలయును. రామాయణార్థ మిట్లుండ విపరీతములు నిరాకరముగఁ గల్పించువారినోటికి నడ్డము పోవువా రెవరు?

## ఆంధ్రులనార్యులా?

"శూద్రులు వీ రార్యులు కారు" అని నాకటమున వ్రాయఁబడినది వర్ణవిభాగ మార్యులందే కాని తక్కినవారి యందు లేదు. వేదోక్తములైన నాలుగువర్ణములలో శూద్రులు చేరుటచే వా రార్యులే ఈనాలుగువర్ణములనుండి భ్రష్టులైన వారు పంచములు ఆంధ్రులమైన మన మార్యులమే శ్రీభాగవతము నవమస్కంధము 683-వ వచనము చూడుఁడు చంద్ర వంశ్యులగు రాజులఁ జెప్పుచు

"యయాతికొడుకు కనువునకు సభానరుండు" అని మొదలుపెట్టి హేమునకు సుతపుండు సుతపునకు బలియుఁ బుట్టె బలివలన నంగవంగకళింగసింహాపుండ్రాంధ్రులను పేళ్లు గల వారార్వురు కుమారులు పుట్టిరి వారు పూర్వదేశంబు లకు రాజులై దేశంబులకుఁ దమతమ నామధేయంబులిడి యేలిరి" అనియున్నది ఈవచ్చినరాజు లొంటరిగా వచ్చిన వారు కారు బలమైన సేనలతోనే వచ్చి యిందున్న యేనాదుల నిశుంభాదుల జయించిరి ఈయాంధ్రరాజే "ఆంధ్రనాథో మహావిష్ణు" వని పేర్కొనఁబడుచున్నవాఁడు ఇట్లు జయించి యాంధ్రుఁడు రాజ్యమును స్థాపించెను యుద్ధము చేయువారు క్షత్రియులును శూద్రులును మాత్రమే అందు క్షత్రియులు ప్రాయికముగా నాయకులు. శూద్రులు సైనికులు ఇట్లారాజువెంట వచ్చిన నాలుగువర్ణముల సంతతివారే యిప్పటి యీ నాలుగువర్ణములవారు.

అయిరాక్ (ఆర్యశబ్దభవము) పెరిస్యా దేశమునుండి వచ్చినతురుష్కులు హిందువుల జయించి వారి స్త్రీలను గ్రహించి తమమతాచారములు నేర్పిరి వారికిఁ బుట్టినబిడ్డలను దురకలుగానే గ్రహించిరి. ఏకాలమందైనను, ఏ దేశమందైనను నిది జరుగువిధానమే.

ఏనాది శబ్దము అనాదిశబ్దభవము. అనాదులనఁగా మీఁదచెప్పిన యార్యు లిచ్చటికి వచ్చుట కెంతకాలముగనో ముందుగ నున్నవా రనియర్థము ఎఱుకులు ఏనాదులు, చెంచులు లోనగువారు ఆర్యులలోఁ జేరరేమో కాని తక్కిన మన మందఱ మార్యులమే కావునఁ గలహములు పెంచుమాటలు విని యాంధ్రులు మోసపోకుందురుగాక యని ప్రార్థించెదను ఆదితెలియనివా రనాదులు (Aborigines)

గ్రంథకర్తగారు తా ననార్యుఁడనని యనుకొనిన వారు మాత్ర మట్లే యగుదురుగాక. నే నేల కాదనవలె వారుగాక తక్కినవారందఱు నార్యులే ఆర్యగౌరవమున కర్హులేయని నాయభిప్రాయము.

రాముఁ డధర్మిష్ఠుఁ డనుటచేతను స్వధర్మవిచారము చేయవలసి వచ్చుటచేతను, నసత్యములు వెలిపఱుచుటకును శంబుకుఁ డార్యుఁడే యనుటకును, నీగ్రంథమునందలి యసత్యవాక్యముల వలన లోకులందుఁ గలిగిన దురభిప్రాయములు దొలఁగించుట కును భక్తిసంజీవనికి సంబంధములేని కొన్నివిషయములు లఘు

వుగానైన వ్రాయవలసివచ్చెంగదాయని విచారము కలుగు చున్నది.

## జమ్ములపాలెముసభ

శ్రీ కోదండరామ సేవక సమాజముయొక్క రెండవ గుంటూరు మాండలికసభ బాపట్లతాలూకా జమ్ములపాలెములో శుక్లసంవత్సర ఫాల్గున శు ౭-౮-౯ (శుక్ర-శని-ఆది వారములు) లకు సరియగు 1930 సంవత్సరము మార్చి నెల 7-8-9 తేదులందు జరుగుటకు నిశ్చయింపఁబడినది ఆహ్వాన సంఘాధ్యక్షులుగ మ-రా-శ్రీ కుట్టా అంకనుగారి నేర్పాటు చేసికొనినట్లు మ-రా-శ్రీ పంగులూరు వేంకటరత్నముగారు మొదలగు నాహ్వాన సంఘసభ్యులు తెలిపియున్నారు

జమ్ములపాలెము బాపట్ల రైలుస్టేషనుకు ౫ మైళ్లు స్టేషను దగ్గఱ జట్కాలు మొదలగునవియుండును

సమాజసభ్యులెల్లరు సభకు రానుకోటిపుస్తకములను సంవత్సరచర్యలను దీసికొనిరాఁ బ్రార్థించుచున్నాము

సభలోఁ జర్చింపఁదగిన విషయములను, సమాజాభివృద్ధికై యవలంబింపఁదగిన పద్ధతులను, వారివారి యనుష్ఠానానుభవములలోఁగల యంశములను వ్రాఁతమూలముగ సభ్యసంఖ్య వేసి జనవరినెల ౩౧ తేదిలోపలఁ బంపఁ బ్రార్థితులు

విరాళములు

౧౧౬-౦-౦ మ-రా-శ్రీ శాస్త్రి అంజయ్యగారు, పెదపూండి
౧౦౮-౦-౦ ,, జంపాలగోపాలరావు చౌదరిగారు,దుగ్గిరాల.
౧ బ సగ్గుబియ్యము బ్ర శ్రీ విప్పర్ల సుబ్బారావుగారు, ఈమని.

శ్రీరామ.

## శ్రీమదొంటిమిట్ట కోదండరామ సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవము.

దీనికిఁగాను గావలసిన పదార్థముల పేరులును కొందఱి దాతల నామధేయములును పూర్వసంచికయందుఁ బ్రకటింపఁబడెను. తదనంతరము స్వామికి దానముచేయు వాగ్దానముచేసినవారి నామధేయములను నిలువయుంచు పదార్థములను ధర్మాత్ములు భక్తులు సాహాయ్యము చేయుదురని తలంపుతో నిందు వివరింపఁబడెను.

| | పదార్థములు | దాతలు |
|---|---|---|
| ౪ | బ బియ్యము | నారికేనపల్లి జనులు |
| ౧ | బ బియ్యము | రా॥శ్రీ సూదనకుంట పిచ్చయ్యగారు, రాచిరాజు లక్ష్మీనరసమ్మగారు మోదుకూరు |
| ౧ | బ మినపపప్పు | మామిళ్లపల్లి రుక్మిణమ్మగారు, మామిళ్లపల్లి |
| ౧౪ | మ. సీకాయ | బ్ర॥ శ్రీ మోదుకూరు నాగభూషణరావుగారు మోదుకూరు |
| ౧౪ | మ సీకాయ | బ్ర. శ్రీ మతుకుమల్లి రాజేశ్వరరావుగారు మామిళ్లపల్లి. |
| ౧ | మ కుంకుడుకాయలు. | బ్ర. శ్రీ మోదుకూరు రామయ్యగారు మోదుకూరు. |

౧౫ మ. చింతపండు రా॥శ్రీ గోవాడ రంగనాయకులు
గారు మాచవరము.

౧౦ మ ,, రా॥శ్రీ వేజండ్ల అమ్మయ్యగారు
మాచవరము.

౫ మ. ,, బ్ర॥శ్రీ వేల్పూరు శ్రీరాములు
గారు. వేల్పూరు

౧ మ గసగసాలు
౧ మ. మిరియాలు
౦౧౪ మ ఏలకులు
౦౪ మ శొంఠి
} బ్ర॥శ్రీ తురిమెళ్ల నరసింహారావు
గారు. తురిమెళ్ల

౧౦ పలములు ఏలక్కాయలు. గాజురాజురాజమ్మగారు.
మామిళ్లపల్లె

౫ మ. పెండలము రా॥శ్రీ మొగనాని వెంకటరామ
రాజుగారు.

,, ,, చిన్నభానరాజుగారు.
మోదుకూరు.

౧ పుట్టికంద బ్ర॥శ్రీ మతుకుమల్లి నరసింహారావుగారు.

౫౦ గుమ్మడికాయలు రా॥శ్రీ కూనంనేని వేంకట్రామయ్య
గారు. నడిగడ్డపాలెము.

౦౪ మ. లవంగాలు మాదిరాజు రాజమ్మగారు.
మామిళ్లపల్లె

౩౦౧ పింగాణబొండములు బ్ర శ్రీ మునిపల్లె నరసింహా రావుగారు.

౧ మ ఖర్జూరపుపండ్లు రా॥శ్రీ ఓబిలిసెట్టి భూషయ్యగారు.

౧ మ. ,, రా॥శ్రీ పట్టెం వీరేశంగారు.

మోదుకూరు

౧ మ. అల్లము. రా॥శ్రీ కొండమడుగుల సుబ్బారెడ్డిగారు

౧ మ ,, ,, కొల్లి నాగిరెడ్డిగారు.

౦౺ మ. ,, ,, ఆళ్ల వేంకట సుబ్బారెడ్డిగారు

| | | | |
|---|---|---|---|
| ౧౬౦ | నేస్లు. | కందిపప్పు బ్ర శ్రీ వేల్పూరు వేంకటప్పయ్యగారు | సత్తెనపల్లె తాలూకా వేల్పూరు |
| ౧౨౦ | ,, | ,, బ్ర. శ్రీ. వేల్పూరు సూర్యనారాయణగారు | |
| ౧౨౦ | ,, | ,, బ్ర. శ్రీ. వేల్పూరు వేంకట లక్ష్మీనరసయ్యగారు. | |
| ౮౦ | ,, | ,, బ్ర శ్రీ వేల్పూరు విశ్వనాథముగారు | |

౨౫ బండ్లు వంటచెఱకు శ్రీరామకార్యధురంధర ఆకేపాటి సూరారెడ్డిగారు, ఒంటిమిట్ట

బ్ర శ్రీ రా॥శ్రీ. గుండవరపు సుబ్బరావుగారు పట్టినన్ని విస్తళ్లిచ్చుటకు నంగీకరించుటయేగాక హరిద్వారము మొదలు తూర్పు బ్రహ్మపుత్ర దక్షిణము కృష్ణవఱకుఁగల తీర్థములఁ దెచ్చి యిచ్చుట కంగీకరించిరి.

బ్ర శ్రీ రా॥శ్రీ మన్నవరామబ్రహ్మముగారు సింధూనది మొదలు తపతి నర్మదవఱకుఁగల తీర్థములఁ దెచ్చి యియ్య నంగీకరించిరి

శ్రీ అలపర్తి రత్నమ్మగారు మాచవరము (రేపల్లెతాలూకా) దక్షిణతీర్థములన్నియుఁ దెచ్చి యీయ నంగీకరించిరి

మైసూరు ప్రాంతములందలి తీర్థములఁ దెచ్చి యీయ బ్ర శ్రీ శ్రీమాన్ ఎన్. ఎస్. శర్మగారు ముళబాగల్ అంగీకరించిరి.

ఈమధ్యరాష్ట్రమునఁగలుగు తీర్థములను నాయాతీర్థములకు సమీపముననుండు గ్రామములందలి భక్తబ్రాహ్మణులాయా తీర్థములఁ దెచ్చి స్వామి కర్పింతురుగాక యని ప్రార్థింపఁబడుచున్నారు.

ఈయపూర్వమహోత్సవము చూచుటకు వేనవేలుజనులు వత్తురు. ఎండకు నెండల నిలువ నీడలేక యనేకులు తపింపవలసి యుండును కావున ధర్మాత్ములు చలువపందిళ్లు పాకా యేర్పాటు చేయుటకును-దాహముగొన్నవారికి నీళ్లుపోయుటకు పానీయశాలలు (ఒక్కొక్కదానికి నించుమించు ౨౦-౦-౦ లు పట్టును) ఏర్పాటుచేయుటకును ప్రార్థింపఁబడుచున్నారు

కావలెనుపదార్థములు.

| | |
|---|---|
| ౧౮౫౦ బ. బియ్యము. | 30 గాలిదీపములు (Gas lights) |
| ౨౦ బ కందిపప్పు. | ౧౦౦౮ 3-శసేర్ల నీళ్లుపట్టుకుండలు. |
| ౨౦ బ. పెసరపప్పు | ౧౦౦౮ మూకుండ్లు |
| ౮ బ. గోధుమరవ. | ౧౦౦ పెద్దబానలు. |

౯ బ. గోధుమనూక. ౧౦౦ చిన్నముంతలు

౩౦ మ. బెల్లము. ౬౦ నీళ్లకుండలు

౫౦ మ మిరపకాయలు. ౮౦ పెద్దగంపలు

౫ మ. పోకవక్కలు ౬౦ చిన్నగంపలు.

౨౪ సేర్లు ఏలకాయలు. ౧౦౦ చేఁటలు

౧౦౦౦౦ దొప్పలు ౫౦ వార్పుపట్టలు

౨౦౦-౦-౦ లు పుష్పములు. ౬౦-౦-౦ ల తమలపాకులు

౭౮ డబ్బాలు నెయ్యి ౫ బ. వెచ్చిసెనగపప్పు.

౮౦ డబ్బాలు కెరసన్‌నూనె ౨ వీసెలు గంధపుబిళ్లలు.

౧౦౦౦ తాటియాకు చాఁపలు ౧౬ డబ్బాలు మంచినూనె.

౧౦౦ సత్తులోటాలు.

వస్త్రములు.

౧౨౦ ౭ మూరల ధోవతులు ౬ మూరల ఉత్తరీయములు.

౧౨౦ ౧౮-౧౬ మూరల చీరలు.

౧౨౦ ధర్మవరము రవికలు.

౧౨౦ సాధారణపు రవికలు

ధర్మాత్ములు భక్తు లీ పదార్థములు వారివారి శక్తిభక్తుల కొలఁది నొసఁగి శ్రీ సీతారామానుగ్రహమునకుఁ బాత్రు లగుదురుగాక.

ఇట్లు విన్నవించు,
శిష్యపరమాణువు,
యామర్తి వేంకటసుబ్బదాసుఁడు.

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె చక్కగ సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

భక్తసంజీవని ౧౯-౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧-౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co., Printers Triplicane High Road

Regd. No. M. 2443 తేది, ౧-౧-౩౦

శ్రీరామ

# శ్రీ భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి.

లేఖకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు.

ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడపమండలము.

పత్రికా భారనిర్వాహకులు:—శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులు ఆంధ్రదేశంబున నార్యావస్థఁ జెందియున్న భక్తిమార్గము స్వస్థానస్థముఁ జెచ్చుటయే యుద్దేశము భక్తిమార్గమున నడచి యుభయలోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగములైన కర్మ, జ్ఞాన, యోగములు, రుచించిరయే భక్తి [illegible]ణము దాని యనుష్ఠానము గుఱించియుఁ బ్రపత్తిగుఱించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడుచుండును.

## చందాల వివరము.

| | | | | |
|---|---|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౧ | ౦ | ౦ |
| ధారకులు | ,, | ౫ | ౦ | ౦ |
| జీవాతువులు | ,, | ౧౦ | ౦ | ౦ |
| పోషకులు | ,, | ౨౫ | ౦ | ౦ |
| రక్షకులు | ,, | ౫౦ | ౦ | ౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦ | ౦ | ౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు. సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధార ధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపజేయువారు ఉజ్జీవకులు.

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక ० ४ ०

## శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ | అ | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుప్పా సిద్ధయ్యగారు, జమ్ములపాలెము . | ४०० | ० | ० |

రక్షకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు జగ్గాపురము .. | ౫० | ० | ० |

పోషకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయడుగారు, మేల్పట్టు .. | 3० | ० | ० |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ० | ० |

శ్రీకాశ్రమము, | వాసుదాసుడు,
[illegible]టివిషి | [illegible]నిర్వాహకుడు.



# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక
ప్రతి పూర్ణిమా ప్రారంభంబున వెలువడుచుండును
విలేఖకుఁడు - ప్రకాశకుఁడు నావిలికొలను సుబ్బరావు,
(రామదాసుఁడు) ఒంటిమిట్ట

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁ బొందించును ఆయనను దర్శింపఁ
జేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు.


| సంపుటము ౨ | శుక్ల - మాఘము<br>ఫిబ్రవరి నెల ౧౯౩౦ సం॥ | సంచిక ౨ |
|---|---|---|


శా. ఆకారాంబు నవనీల దేహరుచితో నాస్మేరవక్త్రంబుతో
నాకోదండశరంబుతో నభయముద్రాంకత్స్వహస్తంబుతో
నా[illegible] నాళీకపత్రేక్షణా
[illegible] భక్తకల్పద్రుమా!

యదుకులకాంభోజిరాగము ఆదితాళము

(రామలక్ష్మణులార వరేఁబాడవలయును)

శ్రీజయజయజయ - శ్రీకీర్తులమహిత

శ్రీరాముకృపచేతను

రాజితకోదండ - రామ సేవకస
మాజసభ్యుల కెల్ల - మానక సతతము శ్రీజయ.

అతులసద్గుణముల - ననుపమాన మగుచు
విమలసత్కీర్తిని - వెలయునీసభ కెపుడు. శ్రీజయ

భక్తులు యోగసం - సక్తులు జ్ఞానసం
యుక్తవిరక్తులు - నొప్పారునీసభకు. శ్రీజయ

భక్తిప్రపత్తులె - పరమోపాయము లని
రక్తి బోధించుచు - రాజిల్లునీసభకు. శ్రీజయ

చక్కఁగఁ గడతేఱ - దిక్కు తెలియనివారి
దిక్కయి బోధించి - దీపించునీసభకు. శ్రీజయ

హరిదాసభక్తుల - చరణరజంబును
శిరమున ధరియించి - చెలువొప్పునీసభకుం. శ్రీజయ

ఏకశిలేశ్వరు - నేలికగాఁ గొని
లోకక్షేమమునకు - లోలాత్మ యగుసభకు శ్రీజయ.

కొందఱుసభ్యులు సభ్యురాండ్రు తాము భజనముచేయు కాలమందితరసహాయములేక గానముచేయుటకుఁ గావలసిన స్తుతికీర్తనలు-లాలిపాటలు-జోలపాటలు-హారతిపాటలు లోనైనవి వ్రాయుచుండఁ గోరుటచే నిఁకముందు స్తుతిపద్యము బదులు కీర్తనలు వ్రాయఁబడును.

## ప్రకృతివిపరీతచేష్టలు.

మనపురాణములందలి కొన్ని విషయములను నేఁటివారు కొందఱు తమయందు సర్వజ్ఞత్వము నారోపించఁజేసికొని యవి స్వభావవిరుద్ధము. అవి ప్రకృతిశాస్త్రవిరుద్ధములు వట్టి వనుచుఁ దమమూఢత్వమును దామె చాటుకొందురు. ప్రకృతి యనునది భగవంతునిశక్తి దాని పరిణామవిశేషాలు ప్ర సామర్థ్యములు భగవంతునకే తెలియును గాని యితరుల కెవ్వరికిఁ దెలియసాధ్యము గాదు ఆప్రకృతియైనను భగవంతుని సంకల్పానుసారము ప్రవర్తించును గాని స్వతంత్రించి ప్రవర్తింపఁ జాలదు అట్టిసామర్థ్యము దానికి లేదు అని జనవాక్యము కావునఁ బ్రకృతియందుఁ గానవచ్చు వింతలు విపరీతములం కాలానుగుణముగ సంభవించుచు భగవంతుని సంకల్పశక్తిని తెలుపుచుండును. ఇట్టి వానినే మనపూర్వులు మహాత్ములు పురాణములందు వచించిరి. వానినీకాలపుఁ గించిజ్ఞులు నమ్మరు అయిన నట్టివారికిఁ దెలివి కలిగించుటకో, మహాత్ములు చెప్పిన విపరీతకాలధర్మములు జరిపించి వారిని సత్యవచనులఁ జేయుటకో, కొన్నివిపరీతపు వింతలు లోకమున నప్పుడప్పుడు జరుగుచుండును

కొంతకాలమువఱకు స్త్రీగానుండిన శిఖండి తరువాత పురుషుఁడైనాఁడని భారతంబునఁ గలదు కొందఱు కది స్వభావవిరుద్ధమని విశ్వాసపాత్రము గాదని యభిప్రాయము గలదు అంతట్టిస్థితి కలిగించినవాఁడు కుబేరుఁ డని కలదు. కాని

యిప్పుడు స్వభావముచేతనే పురుషుఁడు స్త్రీగా మాఱి యిప్పుడు జీవించియున్నాఁ డని 30-11-29 గల హిందూపత్రిక ప్రకటించెను అందలి విషయము యథాస్థితిగాఁ దెనుఁగున వ్రాయుచున్నాఁడను.

## ౨౫ సంవత్సరములకావలఁ బురుషుఁడు స్త్రీ యగుట

పుత్తూరు డిప్యూటితహశీల్దారు టి వి తంగవేలు మొదలియారుగా రిట్లు వ్రాయుచున్నారు.

నాయధికారమునకు లోఁబడియుండు దేశభాగములో నొకదూరపు గ్రామమందు నేను దిగియుండఁగా స్త్రీపురుషజాతులందు మార్పుగలిగిన యొక మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము నే నిటీవల గ్రహింపఁగలిగితిని ఒకానొకనాఁటి యుదయము గ్రామాధికారియొద్దకు నడచి పోవుచుండఁగా ౨౬-౨౭ ఏండ్లప్రాయముగలిగి పొడుగై చక్కని యాకృతి గలిగి సగము పురుషునివలె సగము స్త్రీవలె వస్త్రము ధరించియుండెడి వాఁడుగా నగపడు పురుషునిఁ జూచితిని.

విచారింపఁగా నాపురుషునిగుఱించి మిక్కిలి వింతయై యుంచుచుండు నట్టిగాని విషయము తెలియవచ్చెను

బాల్యమునందు దతనికిఁ బురుషాంగములన్నియు నందు మితికిమించియే యుండెనఁట కాని కడచిన మూఁడేండ్లుగా నతనియం దొకవింతమార్పు జరుగుచుండెను పురుషావయవములన్నియుఁ గ్రమక్రమముగా స్త్రీయంగములుగా మాఱు

శరీరశాస్త్రజ్ఞుఁ డెవఁడైన దీనిని వివరపఱుపఁ గలఁడా? ఈపుత్త్రాసు రేణిగుంటకు ఆరకోణమునకు నడుమ నున్నది

కొన్నిదినములకు ముందు హిందూపత్రికయం దొక తెకు నాస్తురు బిడ్డ లేక కాలమున జనించినట్టు ప్రకటింపఁ బడెను

౧౯౨౭ డిశంబర్ ౬-ది గల హిందూపత్రికయందు మైసూరు అడ్వకేటు (వకీలు) శ్రీమాన్ బి గరుడాచార్లవారు మైసూరులో నొకస్త్రీ పురుషుఁడుగా మాఱెనని అహోబళమ్మ అహోబళప్ప యయ్యె ననియు నీవిషయము అసిస్టాంటు కమీషనరు శ్రీమాన్ వి ఎన్ నరసింహయ్యంగార్లవారు పత్రికలకు వ్రాసినారనియు వ్రాసిన యుత్తరము ప్రకటింపఁబడెను

ఇవి యన్నియుఁ బూర్వులు చెప్పిన కలికాలచిహ్నములు

---

## —ప్రశ్నోత్తరములు—

ప్రశ్న—విష్ణువునకు సరిసమస్కారములు, శివునకు బేసినమస్కారములు చేయవలయు నని మీ రనుష్ఠానక్రమమందు వ్రాసితిరిగదా! ఆచారమందు మూఁడు ప్రదక్షిణములు మూఁడు నమస్కారములు గురువునకు విష్ణువునకుఁ జేయుట కలదు గదా? అది దోషయుక్తమా?

ఉత్త—కాదు. అనుష్ఠానక్రమమందు సామాన్యవిధి చెప్పఁబడెను పక్షాంతరమున మూఁడునమస్కారములు గ్రహింపఁబడినవి

శ్లో॥ మనో బుద్ధ్యభిమానేన, సహ న్యస్య ధరాతలే
  కూర్మవచ్చతురః పాదాన్, శిర స్తత్రైవ పంచమమ్
  కరణత్రయసంబంధి, ప్రత్యవాయ ప్రశాంతయే
  ప్రణామ మాచరేత్, ఇతి కేచి త్ప్రచక్షతే.

మనస్సు, బుద్ధి, అభిమానము అనువానితోఁగూడ (అనఁగా మూఁడును భగవంతునియందుంచి) తాఁబేటి వలె నాలుగు కాళ్లను, శిరస్సును భూమిపై నుంచి వాక్కు, మనస్సు దేహమను త్రికరణములకు సంబంధించిన ప్రత్యవాయములను నివర్తింపఁ జేయుకొఱకు నమస్కారములు ముఖ్యముగా చేయవలయు నని కొందఱు చెప్పుచున్నారు. ముఖ్యముగా నమస్కరించుట దోషముగాదు. గుణసంపన్నుల యెడ మనస్సు వాక్కు దేహము ననువానితోఁ జేసిన పాపములు, శుభకార్యములు దేవతాకార్యములు జరుగనీక బాధించును. అవి పోవుటకై మనస్సు బుద్ధి భగవంతునియందుంచి దేహాభిమానము వదలి దానిని లోని భగవంతుని కర్పించి సాఁగిలఁబడి పాదములు చాఁచి నమస్కరింపవలయును. ఇట్లు మూఁడుమార్లు చేయవలయును.

## బ్రాహ్మణభేదములు (ప్రపన్నధర్మశాస్త్ర సముచ్చయము)

బ్రాహ్మణులందఱు అనేకవిధములుగా ననికొందఱు తెలుపు చున్నారు గాని యందు దేశ, మత, సంప్రదాయాచార గుణ భేదములచేఁ బెక్కుభేదములు కాన వచ్చుచున్నవి

శ్లో దేవో, ముని, ర్ద్విజో, రాజా, వైశ్య, శ్శూద్రో, బిడాలకః
పశు, ర్మ్లేచ్ఛ, శ్చ చండాలో, దశవిప్రాః ప్రకీర్తితాః

అర్థము.

దేవుఁడని, మునియని, ద్విజుఁడని, రాజని, వైశ్యుఁడని, శూద్రుఁడని, బిడాలకుండని, పశువని, మ్లేచ్ఛుఁడని విప్రులు పదివిధములఁ జెప్పఁబడుచున్నారు.

శ్లో ఉంఛవృత్తి ర్మితాహార, సంతుష్టో విజితేంద్రియః
వేదశాస్త్రార్థతత్వజ్ఞో, దేవో విప్ర స్స ఉచ్యతే

అర్థము.

ఉంఛవృత్తి నవలంబించి, మితముగ భుజించుచు దైవ మిచ్చినదానితోఁ దృప్తిపడుచు నింద్రియముల జయించి వేద శాస్త్రముల యర్థము సరహస్యముగ గ్రహించిన విప్రుఁడు దేవవిప్రుఁ డనఁబడును

శ్లో. ఫలమూలాశనో దాంతో, తపస్వీ వేదశాస్త్రవిత్
కృత్యాకృత్యవిశేషజ్ఞో, సత్యవా న్ముని రుచ్యతే

అర్థము.

ఫలములు-కందమూలములు తినుచు బాహ్యేంద్రియ నిగ్రహముగలవాఁడై, తపస్సు చేయుచు, వేదశాస్త్రముల నెఱిఁగినవాఁడై యీకార్యము చేయవచ్చును ఈకార్యము చేయరాదనుట యందలి విశేషమును దెలిసినవాఁడై సత్యము మాటలాడు విప్రుఁడు మునియని చెప్పఁబడును.

శ్లో॥ షట్కర్మనిరతో నిత్యం, దేవతాతిథిపూజకః
స్వాధ్యాయనిరతః సాధు, స విప్ర ద్విజ ఉచ్యతే

అర్థము

యజనము (యజ్ఞముచేయుట) యాజనము (యజ్ఞము చేయించుట) అధ్యయనము (వేదముచదువుట) అధ్యాపనము (వేదముచెప్పుట) దానము (ఇచ్చుట) ప్రతిగ్రహము (పుచ్చుకొనుట) అను నాఱుకర్మములందు సర్వదా ప్రీతిగలవాడై దేవతలను అతిథులను బూజించుచు వేదపఠనముం జేయువాడై సాధువగు విప్రుడు ద్విజుడనబడును.

పైని మువ్వుర బ్రాహ్మణులలోను దేవతా ఇందు దేవబ్రాహ్మణుడుత్తముడు ముని మధ్యముడు ద్విజుడధముడు.

ఇంక మధ్యమబ్రాహ్మణభేదములు చెప్పబడును

శ్లో. ధనుర్వేద విశేషజ్ఞః, రాజసేవారతశ్చ యః
బ్రహ్మకర్మ న్మహోత్సాహీ, విప్రః క్షత్రియ ఉచ్యతే.

అర్థము

విలువిద్య చక్కగా నేర్చి, రాజసేవయం దాసక్తిగలిగి వేదము చదువుట-యజ్ఞము చేయుట-దానము నిచ్చుట యను మూడుకర్మములుగలిగి మిక్కిలి యుత్సాహము (గొప్పకార్యములు చేయుటయందు నేర్పు) గల విప్రుడు క్షత్రియుడనబడును

శ్లో॥ స్వర్ణరత్నవిశేషజ్ఞో, గోపోషణక తత్పరః
క్రయవిక్రయతత్త్వజ్ఞ, స్స విప్రో వైశ్య ఉచ్యతే.

అర్థము

బంగారు రత్నములు వీని విశేషము తెలిసినవాఁడై ఆవుల నెద్దుల పోషించుటయం దాసక్తిగలిగి యమ్ముట కొనుట యందు నేర్పుగల విప్రుఁడు వైశ్యుఁ డనఁబడును

శ్లో॥ కృషిసేవాధమాచారో, ధాన్యసంగ్రహతత్పరః
గోరక్షణ విశేషజ్ఞ, స్స విప్ర శ్శూద్ర ఉచ్యతే.

అర్థము

సేద్యము సేవ చేయుచు, నధమాచారుఁడై, ధాన్యము సమకూర్చుటయం దాసక్తిగలిగి గోరక్షణమును లెస్సగాఁ దెలిసిన విప్రుఁడు శూద్రుఁ డనఁబడును.

అధమ బ్రాహ్మణులు

శ్లో॥ యత్రకుత్రప్రతిగ్రాహీ, నిత్యంబ్రాహ్మణతత్పరః
స్వకార్యముద్దిశ్యసదా, సబిడాలక ఉచ్యతే

అర్థము.

గుణాగుణవిచారములేక యెక్కడనైన దేనినైనఁ దీసికొనును, నెప్పుడు తనకార్యమునిమిత్తము బ్రాహ్మణులయం దాసక్తికలవాఁడైన విప్రుఁడు బిడాలకుఁ డనఁబడును (బిడాల మనఁగాఁ బిల్లి) ఏవిధముగనైనఁ దనకడుపు నించుకొనఁ జూచువాఁడు బిడాలకుఁడు.

శ్లో॥ గమ్యాగమ్యం న జానాతి, స్త్రియం యోఽశౌచనిగ్రహః ।
కృత్యాకృత్యపరిభ్రాంతః స విప్రః పశురుచ్యతే

ఏ స్త్రీతో సంభోగింపవచ్చును ఏ స్త్రీతో సంభోగింపరాదను తెలివిలేక, శుచిహీనుఁడై మంచిగుణములు లేనివాఁడై కార్యాకార్యము చేయవచ్చును ఇది చేయరాదనుటయందు భ్రాంతి వహించి (అనఁగా శాస్త్రప్రకారము చేయరానిది చేయవచ్చునని చేయఁదగినది చేయరాదని తలఁచుచు) యుండువిప్రుఁడు పశువనఁబడును

శ్లో॥ వాపీకూపతటాకాని, దేవాయతనభేదకః
విప్రవేదాపవాదీచ, సవిప్రోమ్లేచ్ఛఉచ్యతే

బావులు - గుంటలు - చెరువులు - దేవాలయములు పెరికి వేయుచు విప్రులను వేదములను నిందించుచుండు విప్రుఁడు మ్లేచ్ఛుఁ డనఁబడును

శ్లో॥ పశుహింసారతః క్రూరః, పరదారపరాయణః
మిత్రద్రోహాభిలాషీచ, సచండాలోహినిర్దయః

అర్థము

పశుల హింసించుటయం దాసక్తిగలిగి క్రూరుఁడై యితరుల భార్యల నాశించుచు మిత్రద్రోహములందుఁ గోరిక గల దయలేని విప్రుఁడు చండాలుఁ డనఁబడును వీఁ డధమాధముఁడు.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
వేదాభ్యాసేనవిప్రస్స్యాత్, బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మణః.

బ్రాహ్మణుఁడు పుట్టుకచే శూద్రుఁడు అనఁగా శూద్రసముఁడని యర్థము (మీఁదను క్షత్రియుఁడు వైశ్యుఁడు నన్నప్పుడు వారితో సమానుఁడనియే యర్థము శూద్రుఁడు చేయునట్టు లాచారము లేక వర్తించినను దోషి గాఁడనుట యెనిమిదవ యేఁట నుపనయన మగుటవలనకే) ఉపనయనసంస్కారము కాఁగానే కర్మాధికారముగలవాఁడగుటచే ద్విజుఁడగుచున్నాఁడు. అనఁగా బ్రహ్మకర్మాధికారి యగుచున్నాఁడు ఆవల వేదము నభ్యసించుటచే విప్రుఁ డనఁబడుచున్నాఁడు ఆవల వేదాధ్యయనముచేసి యుపనిషదర్థ మెఱింగి బ్రాహ్మణపదమున కర్హుఁ డగుచున్నాఁడు ఇవన్నియు బ్రాహ్మణులందు భేదములుగా గ్రహింపవలయును అంతియకాని బ్రహ్మజ్ఞానముకలవారందఱు బ్రాహ్మణులనఁబడరు. బ్రహ్మజ్ఞానముగల శబరీ-విదుర-జనకాదులు బ్రాహ్మణులుగాఁ జెప్పఁబడ లేదుగదా. కావున బ్రహ్మజ్ఞానము కలిగినంతమాత్రమున నెవ్వఁడైన బ్రాహ్మణుఁ డని కొందఱు తలంచుట సర్వశాస్త్రవిరుద్ధము, సంప్రదాయవిరుద్ధమునైన యభిప్రాయము ద్విజత్వ-విప్రత్వ-బ్రాహ్మణత్వ శబ్దములు బ్రాహ్మణులయందలి యుత్తరోత్తరయోగ్యతాదశాభేదములఁ దెలుపునని బుద్ధిమంతులు గ్రహింతురు అది తెలియక బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణ యని యెట్టివానినైన బ్రాహ్మణుఁ డనుట తోఁకను మాత్రము చూచి యేనుఁగు చీపురుకట్టవలె నున్నదని చెప్పుటవంటి దగును ఇందలి ద్విజుఁడు "షట్కర్మనిరతో" యను శ్లోకమునఁ జెప్పఁబడినద్విజుఁడు కలి

రొకఁడు వేఱు దేశమందో వేఱు కాలమందో కలుగవచ్చును
కావున మనుష్యుని బుద్ధినే ప్రమాణముగాఁ గొనరాదు.
కావున భగవంతునివిషయము భగవంతునికే తెలియును.
ఆయనయే తెలియఁజెప్పవలయును మఱియెవ్వరికి సాధ్యము
గాదు. అట్లు భగవంతుఁడు స్వయముగాఁ జెప్పినవే వేదములు
కావున నివి పౌరుషేయములు గావు. అపౌరుషేయములు
ఆయన యనుగ్రహమునకుఁ బాత్రులై యాయన చెప్పఁగా
విన్నవారు వానిని వెలిపఱుచుటచే నవి శ్రుతు లనఁబడును.
ఆస్తికుల కీవేదములే ప్రమాణములు. వీని నంగీకరింపనివారు
వేదబాహ్యులు పాషండు లనఁబడుదురు ఇందుఁ గర్మకాం
డము జ్ఞానకాండము అని రెండుభేదములు ఉపనిషత్తులు
జ్ఞానకాండమునఁ జేరుచున్నవి వీని కర్థముచెప్పుటయందు
భిన్నాభిప్రాయములు కలవు అందు ముఖ్యములైనవి మూఁడు
ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అని ఆమతములనుండు
వారు ద్వైతులని విశిష్టాద్వైతులని అద్వైతులని చెప్పఁబడు
దురు అనుష్ఠానమందు వీరు మువ్వురు సములు. అందఱకు
స్నానము సంధ్య-జపము - తపము-షట్కర్మములు - అగ్నిహో
త్రాదులు నన్నియుఁ గలవు అందఱు కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులు
తరణోపాయములుగా నంగీకరించినవారే అందుభక్తి శ్రేష్ఠమని
యందఱు సన్నుతించినవారే. వర్ణాశ్రమధర్మనిష్ఠలు నందఱకు
నిష్టమే భగవంతుఁ డొక్కఁడే యని యందఱు వాకొనువారే.
ఇన్ని విధముల సామ్యమున్నను వీనిని బాటింపక తాము చేయు

వది యేమిటో తనమతస్థాపకుం డాచరించిన దేమిటో యాలో
చింపక తనమతోత్కర్షము తెలియక పరస్పరము ద్వేషించుట
పోరాడుట నీచగుణము. ద్వేషమును దూషణమును
నేనుతము త్యాజ్యము.

వేదములను సంస్కరించిన పైమువ్వురు భగవంతుఁ
డొక్కఁడే యనిచెప్పిరి. నాయుఁడు నామములు మాత్రము కొం
దఱు శివుఁడని కొందఱు విష్ణువని పలుకుచున్నారు. ఇవి ఉపాస
కుల యుపాసనాభావభేదముచేఁ గలిగిన భేదములే కాని వస్తు
తత్త్వమునందు భేదము లేదు. భగవంతునియం దనేకకల్యాణ
గుణము లున్నను వారు వారికిఁ బ్రీతికరములైన వానిని తమ
తమ గుణానుసారముగ విశేషముగఁ గొనియాడుచుందురు. ఆ
యొకటియే రూపమును దానిపాలు బ్రాగి సుఖింపఁ గోరువాఁడు
పాడుగ బాగుగ నున్నదా లేదా యని చూచును. మాంస
భక్షకుఁడు కండ మెండుగా నున్నదా లేదా యని చూచును.
మాదిగవాఁడు వాత లేమైన నున్నవా చర్మము మంచివెల
కమ్ముడుపోవునా పోదా యని చూచును. అట్టులే భగవంతుని
యందును లోకులకు దృష్టిభేదము కలదు. సృష్టిస్థితిసంహార
కార్యము లాయనవలననే జరుగుచున్నవి. వానికి భిన్నభిన్న
స్వాతంత్ర్యపురుషులు లేరు. లోకరక్షణగుణముల నాలోచించు
నపుడు విష్ణు వందుము. రక్షణమునకుఁ గావలసిన గుణము
లాయనయందు దయ సౌశీల్యము వాత్సల్యము ఔదార్యము
లో[illegible] విశేషముగ [illegible]

శిక్షణము కావలయును గనుక దానికిఁ గావలసిన యాయుధములు చక్రము శంఖము గద లోనైనవి కలవానిఁగా భావింతుము ఇది మనభావమాత్రమా వాస్తవముగనా? యను సందేహము కలుగవచ్చును వాస్తమేకాని మన మనఃకల్పితము మాత్రము గాదు. రక్షకునిగా మన ముపాసించితిమేని యిన్ని గుణములు సాధనములు గలవాఁడుగా భగవంతుఁడు భక్తులకు గోచరించును. రక్షకత్వము నిర్వహించుకొనుటకే ధనలక్ష్మియైన శ్రీదేవిని, ధాన్యలక్ష్మియైన భూదేవిని భార్యలుగా విష్ణువు గ్రహించెను

సంపూర్ణరక్షణభారము వహించుటచేతనే జీవులు భూలోక స్వర్గలోక నరకలోకములయం దున్నను మోక్షపదవి నందినను వారికి నాధారుఁడై యున్నవాఁడు ఇన్నిటి నను గ్రహించువాఁ డాయనయే

దేహములూ శాశ్వతములు గావు. ఏనాఁటికైన వల్ల కాటికిఁ బోవలసినవే రక్షణకార్యము సత్త్వగుణలక్షణమైనచో సంహారకార్యము తమోగుణలక్షణము కావున నాగుణము ప్రధానముగాఁ గలిగినరూపముతో భగవంతుఁడు సంహారకార్యము చేయును.

శ్లో. అతశ్చ సంక్షేప మిమం శ్రుణుధ్వం
నారాయణ స్సర్వమిదం పురాణః
స సర్గకాలేచ కరోతి సర్గం
సంహారకాలేచ తదత్తి భూయః. విష్ణు. పురా.

అర్థము :— ఈకారణముచేతనే సంగ్రహవాక్యము వినుడు.
సర్వప్రపంచము ప్రాణపురుషుడైన నారాయణుడే. ఆయన
సృష్టికాలమందు సృష్టించును సంహారకాలమున మరల
మ్రింగును అనియర్థము. ఈసంహారకార్యము చేయువాడే
రుద్రుడు. ప్రకృతి భగవంతునిశక్తి. దానిగుణములు సత్త్వరజ
స్తమస్సులు. సత్త్వము మంచిది తమస్సు చెడ్డదనుట మనవిష
యములుగాని భగవంతుని విషయమునగాదు. పాము కోఱల
లోని విషమువలన పామునకు గీడులేదు. ప్రవృత్తిమార్గ
మందుండువారికి సంసారము సుఖావహము. మరణము భయం
కరము. నివృత్తిమార్గమందుండువానికి రెండును సమములే.
మరణించినవాడు శ్మశానమునకు బోవును గావున రుద్రుడు
శ్మశానవాసిగా జెప్పబడెను. శ్మశానమున నుండువానికి
బంగరుదుప్పటములు దివ్యచందనము లెందుండి వచ్చును?
కావున రుద్రుడు భస్మము పూయునట్లు కపాలముల ధరించు
నట్లు తోళ్లు కట్టుకొనునట్లు చెప్పబడెను. చచ్చినవారికి భూత
ప్రేతపిశాచజన్మములు వచ్చును గావున వారికి నధిపతిగా
జెప్పబడెను. ఇట్టి రుద్రునిశక్తి కాళి పుర్రెలదండ ధరించి
నెత్తురు త్రావుచున్నట్లు చెప్పబడెను. తమోగుణప్రధాను
లిట్టియుగ్రరూపము నుపాసింతురు. ఇట్టి యుగ్రోపాసకులకు
ముక్తిలేదు. అయిన రుద్రునకే శివుడనియు శంకరుడనియు
నిట్టిపేర్లు కలవుకదా యందురేమో కలవు. ఏల? మరణించిన
వారికందఱకు భూతప్రేతపిశాచజన్మములు రావు వచ్చినను

దీర్ఘకాల ముండవు ఆభయంకరరూపముల విడలి సౌమ్యరూ
పము ధరింపవలసిన వారగుదురు. అట్టివారికి సౌమ్యరూపము
తోనే దర్శన మగును అప్పు డాయన శివుఁడే (శుభకరుఁడే)
శంకరుఁడే సుఖముగలిగించువాఁడే యగును. పామరులు
మరణమనిన భయపడుదురు గాని సాధువులు భయపడఁ గార
ణములేదు. మరణమువలన మేలే కలదు కావున దానిని గలి
గించువాఁడు శివుఁడే శంకరుఁడే

ఇట్టి దృష్టిభేదముచే రుచిభేదముచే వేదము ప్రమా
ణముగాఁ గొను కొందఱు విష్ణుభక్తులైరి కొందఱు శివభక్తు
లైరి విష్ణుభక్తులు వైష్ణవు లనఁబడుదురు శివభక్తులు శైవు
లనఁబడుదురు శ్రీవైష్ణవులు శైవులు నిరువురు విశిష్టాద్వైతులే
మాధ్వులు వైష్ణవు లనఁబడుదురు సంప్రదాయము భేదము
ఆచరణమందు నద్వైతులందఱు విశిష్టాద్వైతులే వీరియందు
శివభక్తులు విష్ణుభక్తులును గలరు

### దశవిధవైష్ణవులు

శ్లో. అద్వేష శ్చానుకూలీ చ, దివ్యనామధర స్తథా
చక్రాంకో మంత్రపార శ్చ, వైష్ణవ శ్చ తతః పరమ్.
శ్రీవైష్ణవః ప్రపన్న శ్చ, ఏకాంతి చ తతః పరమ్
పరమైకాంతి విఖ్యాతో, దశైతే వైష్ణవాః స్మృతాః

అద్వేషుఁడు, అనుకూలుఁడు, నామధారుఁడు, చక్రాంకుఁడు,
మంత్రపాఠుఁడు, వైష్ణవుఁడు, శ్రీవైష్ణవుఁడు, ప్రపన్నుఁడు, ఏ
కాంతి, [illegible] వైష్ణవులు పదివిధములుగా గలరు.

శ్లో. విష్ణుం లోకనియంతారం, వైష్ణవాన్ లోకపావనాన్
దృష్ట్వా న ద్వేష్టి యో మర్త్యః సో ఽద్వేషః పరికీర్తితః

అర్థము

లోకనియంతయగు విష్ణువును, లోకపావనులయిన యాయన భక్తులను జూచి యెవఁడు ద్వేషింపఁడో యామనుష్యుఁడు అద్వేషుఁ డనఁబడును ద్వేషబుద్ధిగలవా రెంతటివారైనను నెట్టివారైనను యేనిష్ఠయుండుండువారైనను బాగుపడ-జాలరు.

శ్లో. వాసుదేవోత్సవాంశ్చైవ, మహాభాగవతాం స్తథా
అనువర్తేత యో నిత్యం, సోఽనుకూల ఉదాహృతః

అర్థము

భగవంతుఁడైన వాసుదేవుని యుత్సవములకును నాయన భక్తులైన మహాభాగవతులకును ఎప్పుడును అనుకూలుఁడై వర్తించువాఁ డనుకూలి యనఁబడును

శ్లో. స్మృత్యుచ్చారణమాత్రేణ, సర్వపాపప్రణాశనమ్
విష్ణునామపరః పుణ్యో, నామధారీ స ఉచ్యతే

అర్థము ఎవని స్మరించి యాయనపేరు నుచ్చరించిన మాత్రమున సమస్తపాపములు సమూలముగ నాశముగునో యట్టి విష్ణుని పేరుపెట్టుకొన్న పుణ్యుఁడు నామధారి యనఁబడును. పేరుపెట్టుకొన్నవాఁడు పుణ్యుఁ డగుటయేగాక వాని నాపేరఁ బిలుచువారును నజామిళునివలెఁ బుణ్యులగుదురు.

ఇప్పటి వారు కొందఱు పెట్టుకొను వికారనామములు వారి భగవద్వైముఖ్యమును దెలుపుచున్నవి.

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణేషు, విహితం చక్రధారణమ్
యోబిభర్తి హరే శ్చక్రం, చక్రధారీ స ఉచ్యతే.

అర్థము వేదములందు, స్మృతులందుఁ బురాణము లందు చక్రధారణము విధింపఁబడినది. కావున విష్ణుచక్రము నెవఁడు ధరించునో వాఁడు చక్రధారి యనఁబడును.

శ్లో॥ అష్టాక్షరస్య మంత్రస్య, స్మరణా న్ముక్తిదో హరిః
త మావర్తేత యో నిత్యం, మంత్రపార స్స ఉచ్యతే

అర్థము అష్టాక్షరీమంత్రము స్మరించువారికి హరి ముక్తి నిచ్చును అట్టి మంత్రమును నెవఁడు ఎల్లప్పుడు స్మరించునో వాఁడు మంత్రపారుఁ డనఁబడును.

శ్లో॥ దేవతాంతరవ న్నిత్యం, శబ్దాదీ నపి కుత్సయన్
విష్ణుప్రాప్తిఫలాకాంక్షీ, భక్త్యుపాయో హి వైష్ణవః

అర్థము విష్ణుప్రాప్తియనుఫలముగోరి భక్తియుపాయము గాఁ గొని యన్యదేవతలను, అన్యప్రయోజనము అన్యోపాయ మును బరిత్యజించినట్లు నిత్యము శబ్దము స్పర్శము రసము రూపము గంధము ననెడివానినిఁ గూడ నెవఁడు గర్హించునో వాఁడు వైష్ణవుఁ డనఁబడును శబ్దమును గర్హించుట యనఁగాఁ జప్పుడు చెవిలోఁ బడకుండఁ జెవులు మూసికొని యుండుట గాదు భగవద్ధర్మవిషయములు వినిన దోషము లేదు. వానిని అవశ్యము వినవలయును. పామరుల గానము లౌకిక శృంగార

విషయమైన గానము - ముచ్చటలు వినరాదు. ఇట్లే తక్కినవి యూహింపవలయును.

శ్లో॥ బాహ్యార్థనిరతాన్ సర్వాన్, సన్త్యక్త్వా సదా శుచిః
భక్తిమాన్ పుండరీకాక్షే, శ్రీవైష్ణవ ఉదాహృతః

అర్థము ఆత్మవస్తువుకంటె నితరములైన పదార్థములందు విశేషాసక్తిగలవారినెల్లఁ బూర్ణముగ వదలి, ఎల్లప్పుడు లోపల వెలుపల శుచియై లక్ష్మీనమేతుఁడైన విష్ణువునందు భక్తిగల వాఁడు శ్రీవైష్ణవుఁడు.

శ్లో॥ శబ్దాదీన్ విషయాం శ్చైవ, దేహోపాధికబాంధవాన్
త్యక్త్వా హరౌ న్యస్తభరః, స ప్రపన్న ఉదాహృతః.

అర్థము

శబ్ద, స్పర్శ, రూప రస గంధములందలి ప్రీతియు దేహ సంబంధమువలనఁ గలిగిన బంధువులందలి ప్రీతియు, వారు తన్ను రక్షింతురను విశ్వాసమును వదలి విష్ణువునందుఁ దన యోగ క్షేమభారము నైచి యుండువాఁడు ప్రపన్నుఁ డనఁబడును బంధువులను వదలుమని మూలమున నున్నదని తల్లిదండ్రులను భార్యను లేఁతవయస్సుబిడ్డలను విడిచి పోవరాదు రక్షించు వాఁడు భగవంతుఁడే కాని వీ రెవ్వరు కారని యెఱిఁగి వారి యందు భారమునైక భగవంతునియందే భారము నైచవల యును ఆపదలందు వారు తన్ను రక్షింపలేకపోయినను వారిని రక్షించుభారముతనయం దున్నది కావున వారిఋణము తీర్చు కొనుటకై వారిని దాను రక్షింపవలయును. భగవత్కార్యము

లందు వారు ప్రతికూలురై వర్తించిరేని వారి నెవ్వరినైన విడిచి పోవచ్చును అనుకూలురై సహాయులుగా నున్న విడువరాదు.

శ్లో॥ హరే రాజ్ఞానురూపేణ, కర్మజ్ఞానాది యో నరః
సఏకాంతీభవేద్విప్రః, సహిభాగవతః స్మృతః

అర్థము.

కర్మము, జ్ఞానము యోగము లోనైనవి భగవంతుని యాజ్ఞ కావున నేను జేయవలయునని యెవఁడు చేయునో యట్టి విప్రుఁడు ఏకాంతియని, భాగవతుఁడని చెప్పఁబడును ఒక కార్యము చేయవచ్చునా, చేయరాదా యెట్లుచేయవలయు ననుటయందు శాస్త్రము ప్రమాణము ఎవ్వఁ డేకర్మము చేసి నను, జ్ఞాన మభ్యసించినను, యోగము సాధించినను శాస్త్ర ప్రకారము చేయవలయును గాని దాని నతిక్రమించి కాని యక్రమముగఁ గాని చేయరాదు. రాజశాసనము నుల్లంఘిం చువాఁ డెట్లుశిక్షకుఁ బాత్రుఁడగునో యట్లే శాస్త్రము నుల్లం ఘించు వాఁడును దండనమునకును బాత్రుఁడగును. శాస్త్ర ములు భగవంతుని యాజ్ఞారూపములు మనుష్యులను సృష్టించి మీ రీప్రకారము నడువవలయునని యేర్పఱిచిన చట్టములు శాస్త్రములు.

శ్లో॥ శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా, య స్తా ముల్లంఘ్య వర్తతే
ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ, మద్భక్తోపి న వైష్ణవః.

నాశాసనములైన శ్రుతులను స్మృతులను నెవఁ డుల్లం ఘించి వర్తించునో వాఁడు నాయాజ్ఞను మీఱినవాఁ డగుటచే

వాఁడు నాకు ద్రోహియే. వాఁడు నాభక్తుఁడైనను వైష్ణవుఁడు
కాఁడు ఒకఁడు రాజా! నీయందు నాకుభక్తియె కాని నీవు
చెప్పినట్లు నేను వినను అనిన నేమి యర్థము.

శ్లో॥ ప్రీత్యర్థం వాసుదేవస్య, కర్మజ్ఞానాదికం చరేః
స విప్రః పరమైకాంతీ,మహాభాగవతః స్మృతః

భగవంతుని ప్రీతికొఱకై కర్మము జ్ఞానము యోగము
లోనైన వెవఁడు చేయునో యాతఁడు పరమైకాంతి యనియు
మహాభాగవతుఁడనియుఁ జెప్పబడును. భగవంతుని ప్రీతికొఱకై
యనఁగా భగవంతుఁడు తాను సంతోషించుటకొఱకు కర్మ
ాదులను కైంకర్యములను నచేయించుకొనుచున్నాఁడని
పరమైకాంతి తలంపవలయును గాని భగవంతుని సంతోషింపఁ
జేయుకొఱకు నేను కర్మజ్ఞానము యోగము చేయుచున్నా
నని తలఁపరాదు.

(N. B. శైవులయందిట్టిభేదము లున్నయెడల నెవరైన
సప్రమాణముగ వ్రాసిపంపెదరేని సంజీవని ప్రకటింపఁగలదు)

—మహమ్మదీయులు భగవద్గీత—

౧౯౨౯ డిసెంబరు నెల 'మాడరన్ రివ్యూ' అనునొక విఖ్యాతమను పత్రికయందు వైశీరికతో అహమ్మదు షాహి యను మహమ్మదీయుఁడు వ్రాసిన యుత్తరము ప్రకటింపఁబడినది అందలి వాక్యములు గానవచ్చెడి.

"ముసల్మానులకు గీత తెలియనిది కాదు అక్బరు సంస్థానమందున్న ఫైజీయను ప్రసిద్ధపురుషుఁడు పరిశుద్ధపారసీకభాషలోఁ బద్యములుగా దానిని వ్రాసియున్నాఁడు.

అందు మిక్కిలిచక్కఁగను దృఢముగను విశదీకరింపఁబడిన దేవైకత్వములోనగు భగవద్గుణములు కర్మయోగము మొదలైనవి ఇస్లామ్ దేవునిగుఱించి ప్రపంచముగుఱించి బోధించెడువిషయమునకు మిక్కిలిసమీపించియున్నవి నాతండ్రితాతలు దానియందలి కొన్నిభాగము లెంతో యాసక్తితోఁ జదువుచుండఁగను, మసీదులందుఁ గొందఱు మౌల్వీల చేకులు భక్తితో గమనించి యీభాషాంతరీకరణమును జదువుచుండ నేను విన్నాను ఇది ముఖ్యవిషయము ముసల్మానుఁడు ఖురాన్ వలన నేర్చుకొన్న దైవవిషయమువంటి విషయములు గల యేహిందూగ్రంథములనైనను జూచెనేని దానిని భక్తితో గమనించి పఠించును హిందువులు తనయందిట్టి గౌరవము నుంచఁ దలఁచినయెడల మహమ్మదీయులు హిందువుల సమీపించినపుడు అట్టిపద్ధతినే యవలంబింపవలయు ననిచౌనష్టకము.

దేవుఁ డొకఁడే యని గీతాప్రభువైన కృష్ణుఁ డుపదేశించుటచే తురకలయందలి యనేకభాగములవారు ప్రజలకు మార్గదర్శకులుగా భగవంతునిచేఁ బంపఁబడు ననేక (ప్రొఫెట్సు) జ్ఞానులలో కృష్ణుఁ డొకఁడని భావించియున్నారు ఈవిషయము హిందువు లనేకు లెఱుంగుదురా యని నే నాశ్చర్యపడుచున్నాను

హిందువులగ్రంథములన్నియు దేవుఁడొకఁడే ‟ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యనియే స్పష్టముగ బోధించుచున్నవి ముప్పదిమూఁడుకోట్ల దేవత లనువారు ముప్పదిముగ్గురే అని

త్యులు ౧౨ వసువులు ౮ రుద్రులు ౧౧ అశ్వులు ౨ ఈ 33 గురే 33 కోట్లుగాఁ జెప్పఁబడినారు. వీరిని దేవుఁడని భ్రమించు హిందువు లేఁడు. ఇది తెలియని యన్యగుతముల వారు హిందువులు 33 కోట్ల దేవతలఁ బూజింతురని భ్రమ పడుచున్నారు. దేవుఁ డొకఁడె కావున దానికి బహువచన రూపము ఆంధ్రభాషయందు లేదు దేవి శబ్దబహువచనము దేవులు దేవుండ్లు నింద్యగ్రామ్యము ప్రయోగనిషిద్ధము.

టాటోటు యోగులటకిటాంకులు

10-11-29.

బ్ర॥ శ్రీ॥ వా॥ సు॥ రావుగారి పాదపద్మములసన్నిధికి ఆచార్యు

తమ రీలేఖను శ్రద్ధగా పఠికించి నిజముతేల్చి చెప్పి మమ్ముఁ గృతార్థుల సేయుదురుగాక.

ఇట్టి భావము మాప్రాంతమున చాలమందికి కలట్లు కనుపట్టుచున్నది అసత్యము విమర్శించెదరు గాకి

ఇట్లు, మీావిధేయుఁడు

ఆంధ్రదేశమున స్వాన్తాంధకారమును పోగొట్టు అమూల్యములను, అదివఱ కెన్నఁడు కని, విని, యెఱుంగనివియు, నగు ఉపన్యాసము లిచ్చుచు తిరుగుచుండి రని కొందఱిచే ప్రశంసింపఁబడు నొకయోగికి సెఁగరోగముని తెలియవచ్చుటచే నే నొకరివద్ద నీవిషయము నివదించి నిజముగ వీరు మాయాయోగులేనా? అని యంటిని దాని కతఁడు కోపముజెంది పరను హంసలగు వారిపై నిట్టి నిందల మోపిన నధోలోకము ప్రాప్తిం

చుననియు, ఒకవేళ కాంతాలోలురైయెనను వారి కెట్టిదోషము చెందదనియు అంతటి ప్రాణాయామసిద్ధునకు వేయిమంది అచ్చరలు కామోద్దీపనకరములగు పనులఁ జేసినను కామ ముద్దీపింపదనియు వచించి అసంగతమగు ఈవిషయమెందు గంటి వని నన్నడిగెను అంతట నేను ఇది "భక్తిసంజీవని" చెప్పినదని బదులు పల్కితిని అది విని అతఁడు ఓహో! ఇంతవనుక నీవిషయము చెప్పకుంటి వేమి? ఆంధ్రవాల్మీకిగారి కెప్పుడును ఆయోగియందు ద్వేషభావమే? జరుగనిదైనను వారిపైన మోపి నిందించుటయన్నఁ బరమసంతోషము ఇట్టి ద్వేషము పెద్ద లనిపించుకొను వారికి తగదనుచే కాక ఒకచిత్రమగు సంగతిని వచించెను

అది పామఱ్ఱు అనుగ్రామములో జరిగినదఁట. అగ్రామమునందు ఆయోగికి తమకు సంవాదము కలిగెననియు అందు తను రాయోగివచించిన సంగతులన్నిటిని సశాస్త్రీయముగ ఖండించిరనియు అంత నాయోగి నీటిపై పద్మాసనము వైచికొని కూర్చుండిన మీరును అటుల చేయఁబోయి నెగ్గకపోతిరనియు అంత నాగ్రామమువా రందఱు ఆయోగిని ప్రశంసించి కానుక లొసంగిరనియు చెప్పియుండెను. ఈలేఖయందు కల విషయంబుల విమర్శించి ఖండించి మాదృశుల సందేహముల కుద్వాసనము చెప్పించెదరుగాక

ఇట్లు మీబిడ్డఁడు,
K. V. R. Suri
Chaudavaram.

గలదు సంజీవని యెవని నుద్దేశించి వ్రాసెనో యామహాను
భావుఁడు వెలుపల వచ్చి తన్ను గుఱించి సంజీవని యసత్యము
వ్రాసినదని చెప్పఁగలిగెనేని తనవ్రాఁత సత్యమని మఱికొన్ని
విశేషములతో ఋజువుపఱుచు భారము సంజీవని వహింప
సిద్ధముగా నున్నది.

పామఱ్ఱులు చాలగలవు ఏపామఱ్ఱునకును శ్రీవాసుదాసు
గారు పోయియుండనే లేదు. అచట వాసుదాసుగారికి నేయో
గికి సంవాదము జరుగనే లేదు. వారా యోగిని ప్రశ్నములడు
గను లేదు ఆయోగి వారికి సమాధానము చెప్పను లేదు. వారు
దానిని ఖండింపను లేదు. ఏయోగియైనను వారియెదుట
నీటిపైఁ బద్మాసనము వైచికొని కూర్చుండను లేదు.

గురిజాలగ్రామమం దొక రిట్టివారు గలరని విని యాయ
నను ప్రార్థింప నాయన నీటిలో దిగి నీటపైఁ బరుండెను గాని
కూర్చుండ లేకపోయెను. అభ్యాసము తప్పినదనెను నీటిమీఁ
దఁ బండుకొనఁ గలవారు వందలకొలంది మనదేశమున
నున్నారు. కొప్పఱ్ఱు గ్రామమందు 10-12 ఏండ్లబాలురును
నీటిమీఁదఁ బండుకొనుచున్నారు. ఇది యోగవిద్యగాదు.
ఈఁతయందలి నేర్పు. వాసుదాసుగారి కీఁతరాదు. ఇట్టి వెఱ్ఱి
వేషములవేయరు. ఇట్టి గారడివిద్యలు యోగవిద్యలని ప్రజ
లను మోసగింపఁడు. రెండు సంవత్సరములక్రింద కాలుజాఱి
రామతీర్థములోఁబడి మరణాసన్నసమయమునను౦డు నాయనను
గొంపఱు బైట వేసిరి. అట్టివారు నీటిమీఁదఁ గూర్చుండ

యత్నించెదరని వివేకి యెవ్వఁడు నమ్మును? పాపాత్ముల ప్రాణము
నారెవ్వరికి బహుమతులిచ్చిరో తెలియదు.

ఈకాలపు యోగీశ్వరులు పరమహంస పిట్టిమోసాలపు మా
టలచేఁ బొట్టపోసికొనవలసిన వారైయున్నారు.

«డబ్బులు పల్కు వాఁడె కర్తంబు గలఁడు»

## —శబరి—

శబరియనఁగా శబరజాతిస్త్రీ. శబరులు బోయలు. శబరి బోయస్త్రీ. ఈమె విషయము శ్రీమద్రామాయణమున నరణ్యకాండమునఁ గలదు. ఈమె శ్రమణి యని చెప్పఁబడెను. శ్రమణి యనఁగా సంసారసంగము లేక నియతవ్రతమూని బ్రహ్మచర్యమవలంబించి విరక్తురాలై తపస్సు చేయుచుండు స్త్రీ.

శ్రీరామలక్ష్మణులు సీతను వెదకుచు నరణ్యసంచారము చేయునపుడు మార్గమధ్యమునఁ గబంధుని వధించిరి. ఆయన దివ్యరూపము ధరించి శ్రీరామున కిట్లు చెప్పెను.

సీ. ------ అచట మతంగసంయమివరుండు
తప మొనరింప నాతని శిష్యగణములు,
వన్యముల్ దేరంగ వనిని చనఁగ

తే. నమ్మహాత్ముల చెమ్మట లవని వ్రాల
వాన జనియించె నవి గాన వసుమతీశ
యట్టి మహిమంబుఁ గాంచెన య్యవఘు లచట
వీడి చన వారివరిపుఁ బీశ దధి!

కం. చిరజీవివి శ్రమణీమణి
వరధర్మచరిత్ర శబరి స్వర్గముఁ జేరన్
దరిసించి దేవసము నన
వరతంబు సమస్తభూతవందితు నిన్నున్

ఆమెను గనుగొని యరుగు మాపల నని కబంధుఁడు బోధింప శ్రీరాము లట్టులే యామెయొద్దకుఁ బోయి యామెను దర్శింప నామెయు లేచి మ్రొక్కు లిడియెను. అంత శ్రీరాముఁ డిట్టు లామెను బ్రశ్నించెను

సీ. నీతపోవ్రతములు నిర్విఘ్నితంబులై
సాగుచున్నవిగదా సాధుశీల!
యాగ్రహమునయందు నాహారమునయందు
నియమంబు గలదుగా నిర్మలాత్మ!
నీనియమంబులు నెఱవేఱుచున్నవే
మనసు నిమ్మళమయి యొనరు నమ్మ
గురుపరిచర్యలు కొనసాగుచున్నవే
సఫలంబులా యవి చారుచరిత!

ఆ. యనుచు రాముఁ డడుగ నత్తపోధనురాలు
[illegible] సిద్ధరాలు
[illegible] గాంచి ఘనభక్తియుక్తి ని
ట్లనియెఁ దన తెఱంగు వినయమునను.

సీ. ఇప్పుడే కా ఫలియించె హితగురు శుశ్రూష
నిన్నుఁ గాంచుటఁ జేసి నిర్మలాత్మ!

యిపుడె కా సిద్ధించెఁ దపములు వ్రతములు
నీదర్శనంబున నీరజాక్ష
యిపుడె కా నాజన్మమెల్ల సార్థకమయ్యెఁ
గనులార నిన్నుఁ జూడఁ గౌసలేయ
యిఁక నెకా స్వర్గంబు నే నేగఁ గందుఁ
దివుట నిన్ బూజింప దేవవర్య

ఆ. నీదయార్ద్రదృష్టి నిహతపాతక నైతి
నరివిదారి! యక్షయంబులైన
పదములందుదానఁ బరమభవ్యచరిత్ర
యఘులతాలవిత్ర యసితగాత్ర

ఉ. శ్రీరఘురామ! నేఁ బరిచరించుచునుండిన సద్గురూత్తముల్
సారతపోధనుల్ చనుచు స్వర్గముఁ జేరఁగ నాఁడు చిత్రకూ
టోరుధరంబునం దునికియుం బినతమ్ముఁడు నీవు నీయెడన్
జేరఁగ వత్తురంచును విశిష్టగతిన్ మిమ్ముఁ జూచినంతటన్

చం. పదవెడు నవ్యయంబగు ననుత్తమలోకము లంచుఁ జెప్ప స
స్మద మెదఁ గ్రమ్మ నీకొఱకు మంచివి మంచివి యేఱి కోరి పె
క్కు దెగల వన్యసంతతులఁ గూరిచి యుంచినదాన నన్ను ని
ర్వ్యదళిత వైరిజ్ఞాన పదవీ పరిణద్ధ దృఢాత్మ మానసన్.

చం. శ్రమణిని గాంచి యిట్లనియె రాముఁడు త్వద్గురు సత్ప్రభావ
మున్। శ్రమణికో యాదనుప్రభవు సన్నిధి వింటిని గన్ను

లార నా! శ్రమము విచిత్రముల్ గనఁగఁ జాలఁ గుతూహాల
మయ్యె వానినిన్ ! గ్రమముగఁ గానిపింపు మది గల్గిన యేని
యటన్న నామెయున్ ॥

### శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమము సందలి వింతలుచూపుట.

సీ. ఇదె ఘనాఘనతుల్యమృగపక్షిసంకీర్ణ
మైన మతంగవనాంతరంబు
ఇచ్చోటఁ దమమంత్రభృశశక్తిఁ దీర్థముల్
కల్పించి మాగురుల్ గ్రాలినారు
పడమటివేది మత్స్వాములు వణఁకుచేఁ
తులఁ బూలఁ బూజలు సలిపినారు
వారితపఃప్రభావంబున వేదులు
నేఁడును వెలిఁగించె నిఖిలదిశల

ఆ. ఇట్టి పానములను నిర్గతసత్త్వలై
నడచలేమిఁ జింతనంబుసేయ
సప్తసాగరములు చనుదెంచె నిచటికిఁ
జూడవయ్య రామ సుగుణధామ.

ఉ. తాపసులాడి వల్కపరిధానము లీద్రుమశాఖలం దిడెన్
మానవనాథ యాఅవవి నాగురువర్య తపంబు పెంపునన్
మ్లానతనొందకున్నవి సుమంబులుచూడుము వేదపూజయం
దానియమాప్త్యు లుంచినవి యాపసమూర సుశీలతానిధీ.

కం॥ వింటివి వినఁ దగుదానిని
గంటివి ననమెల్ల నింకఁ గాయము విడి చే
దంటలగు నాదుగురువులఁ
గంటకుఁ జన నానతిమ్ము కాకుత్స్థ యనన్

కం॥ అచ్చెలువ పలుకులు విని
మెచ్చుచు శ్రీరామవిభుఁడు చెలఁతకు ననియెన్
వచ్చెను నీదుసాఫల్యలు
సచ్చరిత యథాసుఖంబు చను కోర్కిమెయిన్.

ఉ॥ ఆజనకాత్మజేశుఁ డిటులాజ్ఞయిడన్ ముదిబోయచేడె కృ
ష్ణాజినచేల యాయతజటాన్విత యాత్మసమాధివహ్నిలం
దోజమెయిం గళేబరము కొప్పుగ విడి లసత్ప్రదీప్తియా
రాజితదివ్యదేహయయి క్రచ్చఱఁ జేరె మునీంద్రసన్నిధిన్.

ఇప్పుడు మన మాలోచింపవలసిన విషయములు.

౧ శబరి బోయెతగదా యామెకు బ్రహ్మజ్ఞానమం దధి
కారము గలదా?

౨ శూద్రుఁడైన శంబూకుఁడు తపస్సు చేసెనని యతని
వధించిన రాముఁడు శబరి నెట్లు గౌరవించి కృతార్థురాలను
జేసెను?

౩. శబరి రామునకుఁ బెట్టినవి యెంగిలిపండులా?

శూద్రులకు బ్రహ్మజ్ఞానమందధికారము గలదా?

ఇది మొదటఁ జర్చింపవలసిన విషయము

రాఘవః ప్రాహ విజ్ఞానే తాం నిత్య సబహిష్కృతాన్.

అని మూలమందుఁ గలదు. అనఁగా విజ్ఞానమునందు నిత్యముగ బహిష్కరింపఁబడనిది యని యర్థము ఇచట విజ్ఞాన మనఁగా విశేషజ్ఞానము బ్రహ్మజ్ఞానమని యర్థమేకాని యమ గుఁడు చెప్పిన శిల్పజ్ఞానముగాదు శబరికి లభించిన బ్రహ్మ లోకము శిల్పజ్ఞానముచే రాదు అదిగాక యోగసమాధిచే దేహము విడిచెనని చెప్పుటచే నామె మహాయోగిని యని స్పష్టపడుచున్నది. కావున శబరికి బ్రహ్మజ్ఞానము లేదనుట సరిగాదు

అట్లైనచో బ్రహ్మసూత్రములందు నపశూద్రాధికరణం బున సూ॥ శుగస్య తదనాదరశ్రవణా త్తదాద్రవణా త్సూచ్యతే హి॥

౩౫ క్షత్రియత్వ గతే శ్చోత్తరత్ర చైత్రరథేన లింగాత్

౩౬ సంస్కారపరామర్శాత్ తదభావాభిలాపాచ్చ

౩౭ తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః

౩౮ శ్రవణాధ్యయనార్థప్రతిషేధా త్స్మృతేశ్చ.

ఈసూత్రములు శూద్రుఁడు బ్రహ్మజ్ఞానమున కధికార కాఁడని స్పష్టముగ నిషేధించుచున్నవి. ఈసూత్రములకు

వ్యాఖ్యానము వ్రాసిన శ్రీశంకరరామానుజ మధ్వ శుకబలదేవ నింబార్కాచార్యులందఱు శూద్రుల కధికారము లేదని వ్యాఖ్యానము వ్రాసియున్నారు

నారదచరిత్రమునందు నారదుఁడు పూర్వజన్మంబున దాసికిఁ బుత్రుఁడై యుండినపుడు ఋషులచే జ్ఞానోపదేశము పొందినట్లు భాగవతమునఁ గలదు

విదురుఁడు బ్రహ్మజ్ఞాని యగుట స్పష్టము ఇట్టివారు మఱికొందఱు గలరు

ఈపరస్పర విరుద్ధవిషయములకు సమన్వయ మెట్లు?

సశేషము.

## సూచన.

గుంటూరు కృష్ణా, మొదలగు నుత్తరమండలవాసులలోఁ జాలమంది యొంటిమిట్ట యెక్కడ? ప్రయాణసౌకర్య మెట్లని యడుగుచున్నారు. ఒంటిమిట్ట కడపమండలమందుఁ గలదు. సిద్ధవటముతాలూకాలోనిది మద్రాసునుండి రాయచూరుకుపోవు రైలుమార్గమునందు (North west line broad gauge) ఒంటిమిట్టస్టేషన్ గలదు. స్టేషన్కు గ్రామమునకు నర మైలుకు పైనుండదు బెజవాడప్రాంతీయులు బెజవాడస్టేషన్ లో రైలెక్కిన గూడూరులోదిగి అచటనుండి తిరుపతిపోవు

బండిలో నెక్కి రేణిగుంటలో దిగవలెను. మదరాసునుండి అర్కో-
ణము మీఁదుగవచ్చుబండి రేణిగుంటలో నెక్కిన ఒంటిమిట్ట
స్టేషన్‌లో దిగుదురు

| | మైళ్లు. | మెయిలుచార్జి | ప్యాసెంజరు. |
|---|---|---|---|
| బెజవాడనుండి గూడూరు | 182 | | |
| గూడూరునుండి రేణిగుంట | 52 | 5 - 11 - 0 | 4 - 6 - 0 |
| రేణిగుంటనుండి ఒంటిమిట్ట | 64 | | |
| | 298 | | |
| తెనాలినుండి ఒంటిమిట్ట | 278 | 5 - 5 - 0 | 4 - 2 - 0 |
| బాపట్లనుండి ఒంటిమిట్ట | 252 | 4 - 14 - 0 | 3 - 13 - 0 |

సగానరి టిక్కెట్టు ధరలివి

| | మెయిలుచార్జి | ప్యాసెంజరు |
|---|---|---|
| గుంటూరు నర్సారావుపేట గుంతకల్లుమార్గము 387 మైళ్లు | 6 - 14 - 0 | 5 - 5 - 0 |

కాలినడకనురాఁదలంచినవారు గిద్దలూరుస్టేషన్‌లో దిగి కలసపాడు, బద్వేలు, పోరుమామిళ్ల, సిద్ధవటముల, మీఁదుగ నొంటిమిట్టకు రావలెను గిద్దలూరునుండి 60 మైళ్లునడువవలయును.

N. B గుంతకల్లుమార్గమున ప్రయాణమంత సుకరము కాదు. బెజవాడప్రాంతీయులు కలకత్తామెయిలులో బయలుదేరుటమేలు ప్యాసెంజరులో వచ్చిన ఒక్కొక్కప్పుడు గూడూ-

నుండి తిరుపతిపోవుబండి చిక్కకపోవుటయుఁ గలదు. రాత్రి మెయిలులో బెజవాడ-తెనాలి-బాపట్లలో ప్రయాణముచేయువారు పగలు 10 గంటలకు రేణిగుంట చేరుదురు. అక్కడ 1 గంట విరామముండును.

ఇట్లు ప్రశ్నించు
యాత్రి సుబ్బదాసుఁడు

---

## శ్రీరామభక్తిమతము

శనికినస్సైత వాసుదాసుఁ డాగేపల్లెయందుండఁ డఁగా నిద్దఱు బ్రాహ్మణులు వచ్చి "అయ్యా మీరు భక్తిమతమని యోగ మతమని జ్ఞాన మతమని నూతనమతములనేకము పేరులు చెప్పుచున్నారే వాని కేమి ముఖ్యము? వాని లక్షణములు విధులు - అనుష్ఠానము లెట్టివి? మా పల్నాటిసీమలో నొక భక్తసమాజము గలదు. ఆసమాజమువారు "భక్తి యుండినఁ జాలును నిత్యనైమిత్తిక కర్మములు దేవపిత్రుకార్యములు వక్కఱలేదు" అని చెప్పుచున్నారు. గాని భార్యలకు సొమ్ములు సంపాదించి పెట్టుచున్నారు. భూముల కృషిచేసి పాటుపడుచున్నారు. వ్యవహారముల నిమిత్తమై న్యాయస్థానములకుఁ దిరుగుచున్నారు. మీ రిట్టులే యుపదేశించుచున్నారా?" యని వాసుదాసునిఁ బ్రశ్నించిరి.

వాసుదాసుఁడు రచించినముముక్షుహితచర్య లోనగు భక్తివిషయగ్రంథములు పఠించినవారి కిట్టి సందేహములు గలుగవు. ఈమతత్రయవిభాగము ముముక్షుహితచర్యయందే శ్లోలుత వ్రాయఁబడెను ఈవిభాగము వాసుదాసునిచేఁ గల్పింపఁబడినదికాదు శ్రీభాగవతమున నేకాదశస్కంధమం దున్నట్టు జ్ఞప్తియం దున్నది

ద్వైతము - అద్వైతము - విశిష్టాద్వైత మనునామధేయములు తత్త్వవిషయమునఁ గలిగిన యభిప్రాయభేదములనుబట్టి పెట్టఁబడినవి 'ఏకమే వాద్వితీయం బ్రహ్మ' యను శ్రుతివాక్యమునకు బ్రహ్మ మొక్కటే రెండవది లేదని యర్థము గ్రహించి యీమతమునకు "రెండవది లేదు" అను నర్థముగల యద్వైత మను పేరు పెట్టఁబడెను. ఆవాక్యమునకే బ్రహ్మ మొక్కఁడే అట్టివాఁడు రెండవవాఁడ లేఁ డని ద్వైతవిశిష్టాద్వైతు లర్థము చెప్పిరి. తత్త్వ మొక్కటే యయి రెండవది లేనియెడలఁ బ్రపంచము కానవచ్చుచున్నదే యనినఁ బ్రపంచమంతయు నసత్యమని యద్వైతు లనిరి బ్రహ్మమువంటి పదార్థము రెండవది లేదనఁగానే రెండవవస్తువే లేదని యర్థము గాదు. ప్రపంచ మనునది (ప్రకృతి) మఱియొకటి గలదు బ్రహ్మ మెంతసత్యమో జగ త్తంతసత్యమే కాని రెండును వేఱు వేఱు అని ద్వైతులు చెప్పిరి విశిష్టాద్వైతులో ప్రపంచము సత్యమే. బ్రహ్మము

సత్యమే. అయినను నివి కేవలభిన్నములు గావు శరీరి శరీర భావముచే నైక్యము నల్లగుఱ్ఱ మన్నప్పుడు నలుపు వేఱు. గుఱ్ఱము వే ఱయినను నలుపును విడిచి గుఱ్ఱ ముండదు గుఱ్ఱమును విడిచి నలుపుండదు నలుపు వేఱు. గుఱ్ఱము వేఱని వస్తునిర్దేశము చేసినపుడు రెండును భిన్నములే కాని నల్ల గుఱ్ఱమనునపు డొకవస్తువుగా నెట్లు తలంతుమో యట్లు సమష్టిని జూచిన బ్రహ్మ మొక్కఁడే యని విశిష్టాద్వైతులు మతస్థ పడ్డులైరి.

ఈమూఁడును నూహలే కాని వాస్తవముఁ జూఁచివచ్చి వాఁడు లేఁడు భగవంతుని రహస్యము భగవంతునకుఁ దెలియవలయునే కాని యితరుల కెవ్వరికి నెంతవారికైనను దెలిసికొన సాధ్యమగునది కాదు.

బ్రహ్మము (ప్రభువు) ఒకఁ డుండుట సత్యము.

నేను అనుపదార్థ మొకటి యుండుట సత్యము, యోగ సమాధియందును నిది యనుభవవేద్యము అసంప్రజ్ఞాత సమాధియందును నే ననునది లేకపోదు. తన్మయాత్వముచే సర్వ విస్మృతి గలుగును

ప్రభుశాసనముల నుల్లంఘించి ప్రభువునందు భక్తి లేక వర్తించి దానికి శిక్షగాఁ జెఱసాలయందుఁ (సంసారమందుఁ) బడి మనము పరితపించుచుండుట సత్యము కారాగృహము

నుండివిముక్తునిఁ జేయఁగలవాఁడు చేసిన పిస్తుటఁ దనలోఁ గలుపు కొననీ వేఱుగా నుంచనీ ప్రభువు మాత్రమే.

చెఱసాలనుండి విడుదల కాఁబడు నుపాయము ప్రభువు శాసనములకు లోఁబడి వర్తించుచు నాయనయందు భక్తి గలిగి యుండుటయే

ఇవి మూఁడుమతములవారు నంగీకరించి యున్నారు అహం బ్రహ్మాస్మి యనెడుమాట ముక్తుఁడయి తరువాతఁ గాని ముక్తుఁడయినవానితో సమానుఁడైకాని చెప్పవలసిన విషయమే కాని తదితరు లామాట చెప్ప యోగ్యులుకారు రాజద్రోహు లమై రాజశాసనముల నుల్లంఘించి కారాగృహమందుఁ బరిత పించు మనము రాజానుగ్రహము సంపాదించుకొని చెఱసాల నుండి విడుదలయగు నుపాయము వెదకవలయునా? రాజు-రాముము ప్రజలు నొకటా రెండా మూఁడా నాలా యని యాలోచించుచుఁ గాలక్షేపము చేయవలయునా? కార్యసాధకు లకు సాధనానుష్ఠానము ప్రధానముగాని కేవల శుష్కజ్ఞానము గాదు. జ్ఞానియై యనుష్ఠానపరుఁ డౌట శ్రేష్ఠమే జ్ఞానము లేకు న్నను ననుష్ఠానపరుఁడౌట యావశ్యకము కేవలశుష్కజ్ఞానము వ్యర్థము రోగియైనవాఁడు రోగనిదానము ఔషధబలము తెలిసి చికిత్స చేసికొనుట శ్రేష్ఠమే వైద్యశాస్త్ర మెఱుఁగని రోగి యౌషధసేవ సేయుట యావశ్యకము. వైద్యశాస్త్ర

జ్ఞానము నాకుఁ బ్రధానముగాని యౌాషధముకా దని రోగి యనరాదు

రాజునకుఁ బ్రతికూలురమై, రాజశాసనము నుల్లంఘించి రాజద్రోహులమై రాజుచే శిక్షింపఁబడి పరితపించు నునము మరిల రాజునకు ననుకూలురమై రాజశాసనము ననుసరించి వర్తించుచు (ఇదే కర్మయోగము) రాజభక్తకలిగియుండుట (భక్తియోగము); నిశ్శ్రేయసమార్గము రాజభక్తిప్రాప్తి గుణములు తెలిసినఁ గాని రాజున కనుకూలముగ వర్తించి భక్తి చేయుఁ గాలము గావున నవి యు. తెలియుట శ్రేయస్కరము. ఇదియే జ్ఞానయోగము

ఇది భక్తిసంజీవని బోధించు మతత్రయిలక్షణ సంగ్రహము ఈమతత్రయమందుఁ బరస్పరవైరుధ్యము లేదు. విరోధము లేదు భక్తికి జ్ఞాన, యోగ, సాహాయ్యము లావశ్యకములే. జ్ఞానమునకు భక్తి, యోగ, సాహాయ్యము లావశ్యకములే యోగ(కర్మ)మునకుఁ దక్కిన రెండు నావశ్యకములే జ్ఞానము ప్రధానమైనచో జ్ఞానమతము భక్తిప్రధానమైనచో భక్తిమతము యోగము ప్రధానమైనచో యోగమతము ఒక్కదానియందుండు వానికిఁ దక్కినవి త్యాజ్యములు గావు గ్రాహ్యములే యగు.

కావున శ్రీరామభక్తిమతము కర్మఫలత్యాగము బోధించునేకాని కర్మత్యాగము బోధింపదు. ఈవిషయము భగవద్గీత ౧౮-వ యధ్యాయమునందు విశదముగఁ జెప్పఁబడినది. కావునఁ గర్మత్యాగము చేయ బోధించునది భ్రష్టమతమే కాని భక్తి మతము గాదు దినమునకు నిరువదినాలుగుగంటలు. ౧౪౪౦ నిమిషములు ౮౬౪౦౦ సెకండ్లు భగవంతునందే మనస్సు బుద్ధినుంచి భగవత్కార్యములే చేయుచు భగవచ్చింతనమే కావించుచు నితరచింతలు క్రియలు మాని యుండువాఁడు కర్మలోపమునకు భయపడవలసిన పనిలేదుగాని నడుమ నంతరాయము వచ్చెనా యావిరామకాలమందు విహితకర్మము చేయనలసినదే తప్పదు. లౌకిక వ్యవహారములన్నియుఁ గాను దాసుఁడై చేయవచ్చును గాని నిత్యకర్మములు మాత్రము చేయరాదు కాఁబోలు ఇది కర్మభ్రష్టులు తమదోషమును సమర్థించుకొనఁ జెప్పెడు తుచ్ఛసమాధానమేకాని శాస్త్రీయముకాదు శ్రేయస్కరమైనదికాదు. ఇట్లు చెప్పువారు తాఁజెడ్డ క్రోఁతి వనమెల్లఁ జెఱిచె నన్న సామెతకు నిదర్శనభూతులు. వీ రిట్లు చెప్పుటచే నాత్మద్రోహము లోకద్రోహము శాస్త్రద్రోహము చేయుచున్నవారు ఇట్టి వారి భక్తిమతమునకు సంజీవని బోధించు భక్తిమతమునకు సంబంధము లేదు కావున సంజీవనీవిషయమున విజ్ఞులు విపరీతాభిప్రాయము కలవారు గాకుందురుగాక

మీఁదఁజెప్పిన కర్మభ్రష్టమతమేగాక పూర్వాచార్యులు ఖండించిన శూన్యవాదము. పునర్జన్మరహితవాదము లోనైనవి మరల విజృంభించి యున్నవి మఠాధిపతులు తిండిపోతులై పోఁకులై కామభోగముల నోలలాడుచున్నారు సనాతనధర్మిష్ఠులు పేరమాత్రము ప్రకాశించుచున్నవారు కృషిచేయువాఁడు లేని పొలమునందు ముండ్లుకంపలవలెఁ జెప్పెడు దిక్కులేమిని దుర్మతములు దురభిప్రాయములు విచ్చలవిడి పెరిఁగి యున్నవి కలిపురుషుఁడు కౌపీనము ధ్వజముగ నెత్తి తాండవమాడుచున్నాఁడు వీనియాట లెన్నిదినములో. పరదేశములందలి యనాత్మదేవతలు (ప్రకృతియే పరమార్థమనియెంచువారు) మనదేశమునఁ బుట్టుచున్నవారు పరమాత్మ దేవతలగు మనదేశపుందలి శిష్టులు పరదేశమునఁ బుట్టుచున్నారు పరిశుద్ధదేహి మనదేశమునఁ బుట్టుటకుఁ దగిన తల్లిదండ్రులు కఱవగుచున్నారు

ఆర్యులారా!

బ్రహ్మశ్రీ ఆంధ్రవాల్మీకి వాసుదాసదేశికస్వామి (వావిలికొలను సుబ్బరావు) గారిచే రచింపఁబడి పొత్తములు రామకోటి పుస్తకములు గుంటూరు మండలవాసులు కోరినందున వారి సౌకర్యమునకై తెనాలితాలూకా చుండూరు గ్రామ

ములో బ్ర గుండువరపు వేంకటరత్నయ్యగారి తావున నుంచబడి యైనది కావలసినవారు వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఇట్లు విన్నవించు,
శిష్యపరమాణువు, సుబ్బదాసుఁడు

---

అమృతలూరు, చుండూరు, వెల్లటూరు, మావిళ్లపల్లి, అంగలకుదురు మొదలగు గ్రామములోనుండు శ్రీకోదండ రామసేవక సమాజసభ్యురాండ్రు (బ్రాహ్మణులు) ఒక్కొక్కరు వెయ్యేసియప్పడములు రెండుసేర్లు మినుముల వడియములు అటుకులు సిద్ధముచేసికొని యొంటిమిట్టకు శ్రీసీతారాముల కళ్యాణ, పట్టాభిషేకోత్సవములకుఁ దెచ్చుటకు సమ్మతించిరి వీరికి జానకీరాములు భక్తి, శక్త్యుత్సాహములఁ బ్రసాదింతురుగాత

| పదార్థములు. | దాతల పేర్లు. |
|---|---|
| ౧ మ గసగసాలు<br>౧ మ మిరియాలు<br>౬ ఏ ఏలకులు<br>౪ వీ శొంఠి | బ్ర శ్రీ తుకుమెళ్ల నరసింహారావుగారు దుగ్గిరాల. |
| ౧ బ. గోధుమనూక | బ్ర. గంపవరపు నాగాచలేశ్వరరాయుఁడు గాపు పాం[illegible] |

౧ బ. గోధుమనూక { బ్ర. శ్రీ. చైనం గోపాలకృష్ణయ్యగారు.
బ్ర. శ్రీ. గొల్లపూఁడి సీతారామయ్యగారు

౪౦౦౦౦ విస్తళ్లు  బ్రహ్మశ్రీ గుండవరపు వేంకటసుబ్బరావు
గారు గుంపివరము.

## జమ్ములపాలెముసభ.

ఈసభకు మ-రా-శ్రీ, ఏ. ఎల్. నారాయణరావు నాయఁడుగారు (ఇంపీరియల్ బాంకు బాపట్ల) అగ్రాసనాధిపత్యము వహింపనంగీకరించిరి.

---

# ప్ర క ట న

మంచి తరుణము! మించిన దొరకవు!!

## ఆ ం ధ్ర నా ట క ము లు

| | | రూ. | అ. | పై |
|---|---|---|---|---|
| 1 | శకుంతలా దుష్యంతము - - - - - | 0 | 6 | 0 |
| 2 | సుగ్రీవ పట్టాభిషేకము - - - - - | 0 | 10 | 0 |

పద్యగద్యముల చేతను, సందర్భానుసారములగు పాటల చేతను జదువరుల కానందదాయకములై యున్నవి నీతులను పహుబోధించును

| | | | | |
|---|---|---|---|---|
| 3. | కథామంజరి- - - - - - - - | 0 | 6 | 0 |

వచనము, సులభశైలి, ఇందు బలిచక్రవర్తి, గరుడ, భీష్మ చరిత్రములు గలవు. పితృభక్తి, మాతృభక్తి, పతిభక్తి మొదలగు విషయములను బోధించును. స్త్రీలు పురుషులు చదివి తీరవల యును.

శ్రీకోదండరామ సమాజసభ్యులకు మాత్రము పోస్టు ఖర్చులు లేవు. వలయువారు వెంటనే వ్రాయుడు.

అడ్రెస్. కస్తూరి సుబ్బారావు
అనంతపురం.

# ౧౯౨౯ సంవత్సరము భక్తిసంజీవని విషయసూచిక

---

౩౧౧నెం

# భక్తి సంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము.

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్చావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయము రాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ | పై |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె జక్కగ సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ | అ | పై |
|---|---|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

భక్తి సంజీవని ౧౯-౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧-౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులే యున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co, Printers Triplicane High Road

Regd. No. M. 2443. తేది, ౨-౩-౩౧.

శ్రీరామ

# శ్రీ భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామసేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక

N. B:
Book Name:
President
17. 12. 30
S.K.R.S. Pathaannaaseer &
S.S.K.R. Library. Valuur
K. C. V. Press, Cuddapah

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు సంవత్స
రము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటివా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధార ధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు.

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు.

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక ౦ ౪ ౦

## శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ | అ. | పై. |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుప్పా సిద్దయ్యగారు, జమ్ములపాలెము .. | ౪౦౦ | ౦ | ౦ |
| **రక్షకులు** | | | |
| మ-రా-శ్రీ, ముద్దన. రంగశాస్త్రిగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |
| **పోషకులు** | | | |
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట.

వాసుదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు




# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక
ప్రతి పూర్ణమాసారంభంబున వెలువడుచుండును.
విలేఖకుఁడు - ప్రకాశకుఁడు  వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁ బొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨ | శుక్ల సం॥ ఫాల్గునమాసము<br>మార్చి నెల ౧౯౩౦ సం॥ | సంచిక 3.

వరాళిరాగము. ఆదితాళము

అదిగో నొంటిమిట్ట - కోవెల - యిదిగోఁ గనుఁగొనుఁడీ
ముఖమున సీతారామలక్ష్మణులు
సదమల మూర్తులు - సదయత వెలసెడి ॥ దదిగో ॥

మహిరాము నేవాస - మాజాధ్యక్షుఁడు
రహిగను సంజీవ - రాయుం డుండెడి ॥ ఇదిగో ॥
మార్కండేయన - మర్చిత మగుచును
నర్కు తేజుగల - హరు లింగముఁ గల ॥ నదిగో ॥
మృకండుఁ డాదిము - నీశ్వరు లెల్లరు
సుకముగఁ దపముల - సొలయక సలిపిన ॥ దదిగో ॥
ప్రణవాకారము - పాపవిదారము
ప్రణతాపనపర - రాఘువు లుండెడి ॥ నదిగో ॥
పరమభక్తుఁ డగు - బమ్మెరపోతన
కర మనురక్తిని - గాఁపుర ముండిన ॥ దదిగో ॥
అవని ముక్తిదం - బాంధ్రభాగవత
మవతరించిన - యసమక్షేత్రము ॥ అదిగో ॥
ప్రణుతయశుం డగు - రామభద్రునకుఁ
జనుపా లిచ్చిన - జానకి యుండెడి ॥ దదిగో ॥
పరమైకాంతియుఁ - బంచముఁ డోబన
యసనముతోడఁ త - నలంకరించిన ॥ దదిగో ॥
కృష్ణమూర్తి శ్రీ - కృష్ణచైతన్యుఁడు
తృష్ణతోడ ద - ర్శించినక్షేత్రము ॥ అదిగో ॥
పోతనకొఱకై - పోతులు దామై
ఖ్యాతిని గాంచిన - కరుణాళువఁగల ॥ దదిగో ॥
వాసుదాసుకై - దాసరి యగుచును
వాసిఁదిరుగు రఘు - నర్యుం డుండెడి ॥ దదిగో ॥

వాసిగ రఘువరు - పదములు గొలుచుచు
వాసుదాసుఁడు - వదలకయుండెడి
అదిగో వాల్మీకి యాశ్రమ - మదిగోఁ గనుఁగొనుఁడీ॥
గంగలు మూఁడును - గలసియఘంబుల
భంగించెడి యా - పరమతీర్థమిదె ॥అదిగో వాల్మీకి॥
పోతన దేహముఁ - బొరి రక్షించిన
పోతననుడి యను - పుణ్యకేదారము ॥అదిగో వాల్మీకి॥
పరిక్షితుఁ దిట్టిన - పాపము పోవఁగ
వరమతి శృంగి త - పం బొనరించిన ॥అదిగో వాల్మీకి॥

N. B. ఒంటిమిట్టకు శ్రీసీతారాముల సేవార్థమువచ్చునపుడు భక్తులయినవారు పాడుట కనుకూలముగ రచింప సభ్యులు కోరుటచే నిందుఁ బ్రకటింపఁబడినది.

—శబరి.—

(గతసంచికాశేషము. ౮౩ పుట చూడుడు)

గతసంచికయందు శూద్రులకు బ్రహ్మజ్ఞానమం దధికారము లేదని శారీరకమీమాంసాసూత్రము లనుసరింపఁబడెను. ఆసంచికయందే నారదుఁడు తనపూర్వజన్మమునఁ బరిచారికాపుత్త్రుఁడుగా నున్నప్పుడు కొందఱు ఋషులును, శబరికి మతంగమహాముని శిష్యులును బ్రహ్మజ్ఞాన ముపదేశించినట్లు వ్రాయఁబడెను ఋషీశ్వరచర్య శాస్త్రవిరుద్ధమా యని యాలోచింప వలసియున్నది

సామాన్యవిధి యని విశేషవిధి యని విధులు రెండువిధములు. "సత్యంవద" సత్యమును జెప్పుము. అని శ్రుతి సామా

స్వధర్మము విధించుచున్నది అట్లుండియు నిష్కారణముగ నిరప
రాధులకుఁ గీడుకలుగునట్లు చెప్పెడుసత్యమువలనఁ బాపము
సంభవించుననియు నట్టిసందర్భముల సత్యముఁ జెప్పరాదనియు
శాస్త్రములు చెప్పుచున్నవి. మొదటిది సామాన్యవిధి. రెండ
వది విశేషవిధి

"అహింసా పరమో ధర్మః." అహింసయే యుత్తమధర్మ
మనునది సామాన్యవిధి. యజ్ఞములందుఁ బశుహింస చేయ
వచ్చుననుట విశేషవిధి. సామాన్యవిధికంటె విశేషవిధి బలీ
యము. సామాన్యవిధి ననుసరించి దశరథుఁడు భగవంతుఁడైన
శ్రీరాముని విడనాడి స్వర్గలోకగతుఁ డయ్యెను విశేషవిధి నను
సరించి యసత్యమాడి వసుదేవుఁడు కృష్ణుని దక్కించుకొని
ముక్తుఁ డయ్యెను. అన్నిసామాన్యవిధులకు ఫలము సోపాన
మార్గమున భగవత్ప్రాప్తియే భగవద్ధర్మమునకుఫలము సద్యో
ముక్తియే. కావున సామాన్యవైదికధర్మమునకంటె భగవద్ధర్మము
బలీయము. అనఁగా నట్టి దావశ్యకమైనపుడు వైదికధర్మము వద
లియైనఁ దనకులధర్మము విడిచియైన భగవద్ధర్మము ననుష్ఠించుట
శ్రేయస్కరము. భక్తిసంజీవని బోధించునది భగవద్ధర్మమే భక్తి
ప్రపత్తు లనుష్ఠానమార్గములు కర్మము ప్రధానముగా నెంచి
తరించుటకు దానిపై నాధారపడక భగవంతునే యాధారముగాఁ
గొని కర్మము గౌణముగా నెంచువారు భగవద్ధర్మనిష్ఠులు వీరి
మతము ననుసరించి శబరికి బ్రహ్మజ్ఞానమం దధికారము కలదు
వైదికధర్మము ప్రకారము సంస్కారార్హులై వైదికకర్మ యోగ్యు
లైన బ్రాహ్మణాదులు మాత్రమే ముక్తి కర్హులు.

స్త్రీశూద్రాదులు కాదు భగవద్ధర్మము ప్రకారము భగవంతుఁడు సర్వసముఁడు భక్తప్రియుఁడు దీనజనపక్షపాతి లోకజనకుఁడు కావున నాథ్యనం దుండువా రందఱు జాతివివక్ష లేక ఏదువారనక పుణ్యులు పాపులు బాలురు వృద్ధులు, స్త్రీలు పురుషు లనుభేదము లేక భగవంతు నాశ్రయించినవా రందఱు భగవత్కృపాక్షమునకుఁ బాత్రులే ఎట్లన — భక్తులు ప్రపన్నులు శూద్రులైనను బోయ లయినను జంఢాలు రైనను భగవద్ధర్మనిష్ఠు లైరేని వారిని జాతిసామాన్యదృష్టి ననఁగా వారిని నక్కినశూద్రులను బోయలను జండాలురను జూచునట్లు చూచువారు నరకమునకుఁ బోదురని భగవద్ధర్మశాస్త్రము చెప్పుచున్నది

శ్లో. యశ్శూద్రం భగవద్భక్తం, నిషాదం శ్వపచం తథా
వీక్షతే జాతిసామాన్యా, త్స యాతి నరకం నరః.

అని ప్రమాణము అట్టైనవారిని నే దృష్టితోఁ జూడవలయుననిన

శ్లో. న శూద్రా విష్ణుభక్తాశ్చ, విప్రా భాగవతా స్మృతాః
విష్ణుభక్తులు శూద్రులుగాదు విప్రులు భాగవతులు

అనిచెప్పుటచే నట్టిభక్తులను బ్రాహ్మణులను నందుభాగవతులను జూచుదృష్టిచేఁ జూడవలయునని యర్థము ఇట్టి విష్ణుభక్తులలక్షణ మెట్టిదై యుండవలయుననిన—

శ్లో. మద్భక్తజనవాత్సల్యం, పూజాయాం చానుమోదనమ్
తత్కథాశ్రవణే భక్తిః, స్వరనేత్రాంగవిక్రియా

స్వయ మారాధనే యత్నో, మదర్థే దంభవర్జనమ్
మమానుస్మరణం నిత్యం, యచ్చమాం నోపజీవతి
భక్తి రష్టవిధా హ్యేషా, యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే
స విప్రేంద్రో, ముని, శ్శ్రీమాన్, సయతి స్సచ పండితః
తస్మై దేయం తతో గ్రాహ్యం,స చ పూజ్యో యథా

అర్థము. [హ్యహమ్

నాభక్తజనులయందుఁ బ్రేమ, పూజచేయుటయందు సంతోషము, నాకథలు వినుటయం దత్యంతానురాగము, నాకీర్తనలు పాడుటయందు, నన్నుగుఱించి చెప్పుటయందు డగ్గుత్తిక, దేహమునందు గగ్గురుపాటు, కన్నులయందు నీరు, తానై నన్నారాధించుటయందుఁ బ్రయత్నము (పూజాద్రవ్యములు స్వయం కృషిచే సంపాదించి స్వహస్తములఁ బూజించుట.) నానిమిత్తముగ దంభములేక (మెఱమెచ్చులకుఁగాదు) కార్యములు చేయుట, ఎల్లప్పుడు నన్నే స్మరించుచుండుట, నన్ను విడిచి జీవింపలేక యుండుట యను నీయెనిమిది విధములు భక్తి మ్లెచ్ఛునియం దుండినను వాఁడే విప్రశ్రేష్ఠుఁడు, వాఁడె ముని, వాఁడే శ్రీమంతుఁడు, వాఁడే యతి, వాఁడే జ్ఞాని, వానినిమిత్తమై దానమీయవచ్చును. వానిచే గ్రహింపవచ్చును. నావలె వాఁడును బూజ్యుఁడు. అని భగవద్వాక్యము

ఇట్టిభక్తి గలవాఁడు వర్ణహీనుఁ డని నీచపుదృష్టిఁ జూడరాదు. పూజ్యుఁ డనియే గౌరవింపవలయును.

ఏలన.—అతనియందు మ్లేచ్ఛ-నిషాద-శ్వపచాది శబ్దములు సార్థకములు గావు ఏల? ఆశబ్దార్థముల కతఁడు విషయభూతుఁడు కాఁడు కావున.—

ఈయెనిమిదింటియందు ముఖ్యముగఁ గడపటిదాని గురించి కొంచెము చెప్పవలసియున్నది. అది భక్తికిఁ బరకాష్ఠ కావునఁ గడపటఁ జెప్పఁబడినది.

"నన్ను విడిచి జీవింపలేక యుండుట" యన నేమి? ఈగుణము పరమభక్తిని దెలుపుచున్నది.

శ్లో. "మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం న సంశయః"
భగ ౧౨ న అధ్యా.

నాయందే మనస్సుంచుము. బుద్ధి నాయందే నిలుపుము. ఇటు చేసినయెడల నిటుపిమ్మట నీవు నాయందే వసింతువు. సందేహము లేదు అనియర్థము.

ఏవకారార్థము (అందే) ప్రాకృతపదార్థములందు విషయములందు నేమాత్రమైన మనస్సును బోనీయరాదని నిషేధించుచున్నది అనఁగా నేయుపాయముచేనైన సర్వకాలసర్వావస్థలయందు నేయవయవముతో నేకార్యమును చేయుచున్నను మనస్సు బుద్ధి భగవంతునియందే యుంచవలయును.

అనఁగా ననన్యుఁడై యనన్యశరణ్యుఁడై యనన్యోపాయుఁడై యనన్యప్రయోజనుఁడై సర్వదా యుండవలయును.

అనన్యుఁడు = సూర్యునకు నెండ - చంద్రునకు వెన్నెల-సముద్రమునకు నల, అగ్నిహోత్రమునకు కుణుఁగురునెట్లో యట్లే తాను భగవంతు నంశమై-విశేషణమై ధారణపోషణములకు భగవంతునందే యాధారపడి తాను భగవంతువాఁడే గాని వేఱు గాదనునభిప్రాయముగలవాఁడు.

అనన్యశరణ్యుఁడు=భగవంతునికంటెఁ దన్ను రక్షింపఁ గలవాఁడు, తన్ను రక్షింపు మని కోరఁదగిన యోగ్యుఁడు, వేఱొకఁడు లేఁడని తలఁచువాఁడు.

అనన్యోపాయుఁడు = తరించుటకు భగవంతునికృపదప్ప వేఱుపాయము లేదనుకొనువాఁడు

అనన్యప్రయోజనుఁడు=భగవత్ప్రాప్తిదప్ప వేఱుఫలము కోరనివాఁడు ఇట్టివాఁడు భక్తుఁడు. ఇట్టివానిభక్తి యనన్యభక్తి

భగవదనుగ్రహముఁ దప్ప వేఱేదియు భక్తుఁడు కోరఁడు కావున నది యెంతశీఘ్రముగా లభించునా యని తహతహపడుచుండును. వీనితహతహపా టెట్టిదైయుండు ననిర రామకృష్ణపరమహంస లిట్లు తమశిష్యున కొకనికిఁ దెలిపిరి

రామకృష్ణపరమహంసల నొకశిష్యుఁడు భగవద్విషయమై భక్తునిమన స్సెట్టిదై యుండు నని ప్రశ్నించెను ఆశిష్యుని గంగకు స్నానార్థమై పిలుచుకొనిపోయి గంగయందు వాఁడు మునిఁగినప్పుడు రామకృష్ణపరమహంసలవారు వానిని నీళ్లలో నట్టె యదిమెను. కొంతసేపు వాఁడు నీటిలో గిజగిజ తన్నుకొన్నతరువాత చేయివిడిచి వాఁడు లేచినతరువాత నీటిలో

మునిఁగినప్పుడు నీమనస్థితి యెట్టిదై యుండెనని యడిగెను. ఎప్పు డీముప్పు నుండి తప్పించుకొని బయటఁబడుదునా యెప్పుడు గాలిపీలుతునా యని యుండె నని శిష్యుఁడుచెప్పెను అట్టి పరితాపమే నీకు సంసారవిషయమై యెప్పుడు కలుగునో భగవత్కటాక్షమునకై యెప్పు డేకాంక్షింతువో యప్పుడు నీకు భక్తి కలదని యనుకొనుము అనిచెప్పెను

ఇది నిజమైనభక్తి లక్షణము దీనికే పరమభక్తి యని పేరు ఇదియే యార్తప్రపత్తి ఇట్టిదశ వచ్చువఱకు నెవ్వఁడు భక్తుఁడనుపేరఁ బిలువఁబడుటకు యోగ్యుఁడుకాఁడు. పూజాదులు గౌణభక్తియే యోగసమాధియు గౌణభక్తియే గౌణభక్తి యవ్యవధానమోక్షకారణముగాదు. క్రమముగ నగును పరమభక్తుఁడే సద్యోముక్తి కర్హుఁడు (అవ్యవధానము=ఎడము లేనిది)

శ్లో॥ నచ సీతా త్వయా హీనా,నచాహ మపి రాఘవ
ముహూర్త మపి జీవావో, జలా న్మత్స్యావివోద్ధృతౌ

నిన్ను విడిచి సీతగాని, నేను గాని రామా! నీటినుండి బయటవేసిన చేఁపవలెఁ గొంచెముకాలమైన జీవింపఁజాలము. అని లక్ష్మణుఁడు చెప్పెను అట్లు లే చేసెను.

ఇది పరమభక్తి. ఇది పరమ ప్రేమస్వరూపము.

శ్లో॥. య న్ముహూర్తం క్షణం వాపి, వాసుదేవో న చింతితః
సాహాని స్తన్మహాచ్ఛిద్రం, సాభ్రాంతి స్సాచ విక్రియా.
ఏకస్మిన్న ప్యతిక్రాంతే, ముహూర్తే ధ్యానవర్జితే
దస్యుభి ర్ముషితేనేవ,యుక్త మాక్రందితుం భృశమ్.

అర్థము

వాసుదేవునిఁ జింతింపని యొకముహూర్తమైనను క్షణ
మైనను గలిగెనేని యదియే ప్రాణహాని. అదియే మహాచ్ఛిద్రము.
అదియే భ్రాంతి. అదియే వికారము అల్పకాలమైనను భగవ
ద్ధ్యానము లేక కాల మతిక్రమించెనేని దొంగలచే సర్వస్వము
దోఁపుడుపోయినట్లు వెక్కి వెక్కి యేడువవలయును ఇది పరమభక్తి
లక్షణము ''యచ్ఛమాం నోపజీవతి'' నన్నువిడిచి జీవింపలేక
యుండుట యనుట కిది లక్షణ మని యెఱుంగవలయును.
ఇదియే భగవద్ధర్మసారతమము శ్రీకోదండరామసేవకసమాజ
సభ్యులందఱు నన్నివర్ణములవారు స్త్రీలు పురుషులు నిట్టి యుత్తమ
స్థితి కీజన్మమందే, దేహముపడిపోవుటకుముందే వచ్చుటకు దృఢ
ప్రయత్నము చేయుదురుగాక యని వాసుదాసుఁడు ప్రణామ
పూర్వకముగాఁ బ్రార్థించుచున్నాఁడు ఇట్టిభక్తుఁడైన మ్లేచ్ఛుఁ
డైనను, మనీషాపంచకమందు శంకరాచార్యులవారు ''చండా
లోస్తు సతు ద్విజోస్తు'' అని చెప్పిన జ్ఞాని[illegible]చండాలుఁడు
గాని తనపూర్వపుణ్యవశమున వాసుదాసుఁడునకు లభించునా
యని యేకారుచున్నవాఁడు

బ్రహ్మయు ఘటకారుఁడే నేను ఘటకారుఁడనే కావున
బ్రహ్మవలె నన్ను గౌరవింపుఁ డని కుమ్మరవాఁ డనుటయు,
ఖద్యోతశబ్దము సూర్యునందు నాయందు వర్తించును గనుక
నేను సూర్యుఁడు సమానుల, మని మిణుఁగురుపురుగనుటయు,
శబరీవిదురాదులు శూద్రులు కావున వారికివలె మాకును

బ్రహ్మజ్ఞానమం దధికారము గలదని జాతిమాత్రసామ్యముచే
వారిజాతులవా రనుటయు, సమానములు బ్రహ్మజ్ఞానమునకు
నధికార మావశ్యకము. బ్రాహ్మణుఁడైనను జాతిమాత్రోపజీవి
యగు బ్రహ్మబంధు నగునేని బ్రహ్మజ్ఞానమున కధికారిగాఁడు.
బ్రహ్మసూత్రమునందలి నిషేధసూత్రములు సామాన్యవిధులు.
మీఁద ననువదించిన భగవద్ధర్మశాస్త్రవాక్యములు విశేష
విధులు

మీఁదఁ జెప్పిన పరమభక్తి పరజ్ఞానము లేక రాదు. పర
భక్తిలేక పరజ్ఞానము రాదు. అష్టాంగయోగయుక్త మయిన
గౌణభక్తిలేక పరభక్తి లభింపదు.

శ్లో॥ దర్శనం పరభక్తి స్స్యాత్, పరజ్ఞానం తు సంగమమ్
పున ర్విశ్లేషభీరుత్వం, పరమా భక్తి రుచ్యతే

అర్థము.

దర్శనము (ఆత్మసాక్షాత్కారము) పరభక్తి యగును. ఈ
దశయందు నాత్మను జూచుటమాత్రము కలుగును. దానితోడి
కొంచెము కాలము సంగమము పరజ్ఞానము, దానితోడి వియో
గము కలుగునేమో యను భీతి పరమభక్తి యగును.

“సాక్షాత్కారతుల్యవైశద్యవతీ ధ్యానశబ్దవాచ్యా
పరభక్తిః। తత స్సాక్షాత్కరవా శీత్యభినివేశానంతర
తత్కాలనియత సాక్షాత్కారః పరజ్ఞానమ్।
తతో నిరంతరసాక్షాత్కారాభినివేశ హేతు
భూతా సాక్షాత్కృతే బ్రహ్మణి నిరతిశయవిపుల

చూడవలదని శాస్త్రము చెప్పెనే కాని విప్రుఁడుగా యతిగా మాత్ర నని చెప్పలేదు పరమభక్తుఁడు బ్రహ్మచారిగానో గృహస్థుఁడుగానో వానప్రస్థుఁడుగానో యేయాశ్రమము లేనివాఁడుగానో యుండవచ్చును యతి యట్లుండరాదు గదా. పరమభక్తుఁ డేయాశ్రమమందుండి మరణించునో దానికి విహితమైన పరలోకక్రియలే జరుపవలయును గాని భక్తుఁడను కారణమునఁ దక్కినవారికి జరపు పరలోకక్రియలు యతికి జరుపరాదుగదా. భక్తుఁడు బోడియై కాషాయవస్త్రములు దండకమండలువు ధరించి భిక్షాచర్య నడపవలసినపని లేదు గదా జనక ప్రహ్లాదాదులు సంసారులు గారా? కావునఁ బరమభక్తుఁ డైన మ్లేచ్ఛుఁడు విప్రునితో-యతితో సమానముగఁ బూజింపఁబడ నర్హుఁడే కాని విప్రునకున్న యధికారములు గలవాఁ డగునని యర్థము కాదు. ఇచ్చట విప్ర యతిశబ్దములు జీవచ్ఛవ-జీవన్ముక్త-పురుష సింహశబ్దములవంటివి జీవచ్ఛవ మనఁగా బ్రతికినపీనుఁగు. ఒకకళేబరమునందు జీవుఁడుండునంతకు దానికిఁ బీనుఁగను పేరు రాదు. పీనుఁగను పేరు వచ్చినతరువాత జీవుఁ డుండఁడు. కావున జీవచ్ఛవ మనఁగా బ్రతికియుఁ జచ్చినవానితో సమానుఁ డని యర్థమే కాని శవమునకుఁ జేయుదహనాదిక్రియల కర్హుఁడని యర్థము కాదు.

దీర్ఘరోగియుఁ జిరతరప్రవాసియుఁ బరాన్నభోక్తయు జీవన్మృతు లని నీతిశాస్త్రము చెప్పుచున్నది. ఇట్టివారిని వారు బ్రదికియుండఁగానే దహింపవచ్చునా? పూడ్పవచ్చునా? [చిర

తరప్రవాసి=ఇల్లువిడిచి దీర్ఘకాలము గ్రామాంతరములఁ దిరుగు
చుండువాఁడు. పరాన్నభోక్త=విశేషకాల మితరులయన్నముఁ
దిని బ్రతుకువాఁడు ] అటులే ప్రాకృతదేహధారి యగుజీవి
ముక్తుఁడు కాఁడు ముక్తునకుఁ బ్రాకృతదేహ ముండదు. కా
వున జీవన్ముక్తుఁ డనఁగా జీవించియుండినను బామరులకువలెఁ
బ్రాకృతబంధములు సంసారబాధలు లేనివాఁ డని యర్థము.
పురుషసింహ మన్నప్పుడు మృగములందు సింహ మెట్లు విక్రమ
సాహసాదుల శ్రేష్ఠమో యట్లు వీఁడును బురుషులందు శ్రేష్ఠుఁ
డని యర్థమే కాని సింహమున కుండుతోఁక-కోఱలు మెడవెం
డ్రుకలు గలవాఁ డని యర్థము కాదు. అట్టులే మ్లేచ్ఛయతి
మ్లేచ్ఛవిప్రుఁ డన్నప్పుడు మ్లేచ్ఛుఁడు గుణములందు యతితో
విప్రునితో సమానుఁ డని యర్థమే కాని సంబంధబాంధవా
దుల కర్హుఁడనియు యజనయాజనాదులకు సపంక్తిభోజనమునకు
యోగ్యుఁ డనియు నర్థముగాదు

అధికారము గలవార లేవర్ణమువారైనను స్త్రీలైనను
బురుషులైనను బ్రహ్మజ్ఞానోపదేశము గొనదగ్గువారే యని భగవ
ద్ధర్మశాస్త్రసమ్మతము. అధికారు లందఱు నట్టులు జ్ఞానము
సంపాదించుకొని బాగుపడవలయుననియు, నధికారము చాలని
వా రధికారు లగుటకు సాధనముల సాధింపవలయు ననియు
సంజీవని యభిలాష. ఆవిషయమందే దానిపరిశ్రమము. నిజ
ముగ బాగుపడఁ గోరికగలవారికి నదుపదేశముఁ జేసి బాగు
పఱుచుటయందు సంజీవనికి జాతిమతాదిభేదములు తెలియదు.

యోగ్యతానుసారముగఁ గ్రమమార్గమున బోధించును శిశ్నో
దరపరాయణు లైనకొందఱు సన్న్యాసుల మని-యోగుల మని
వేదాంతుల మని వేషములు వేసికొని తెలియనివారిని మోహ
గించుచున్నారు ఇట్టివారి మాయమాటలకు లోపడి లోకులు
చెడవల దని సంజీవని బోధించుచున్నది గాని నీచమైన జాతి
మతద్వేషమునకు వశపడి యెవరిని గాని మీకు జ్ఞానము సంపా
దింప నధికారము లేదు బాగుపడుయోగ్యత లేదని యధమదశ
యందే యుండుఁడని చెప్పదు. కామదాసులై దొంగవేష
ములు వేసికొని తిరుగువారు తమ యశనశిశ్నములందు సం
జీవని మన్ను వేయుచున్నదని వాపోయినఁ బోనిందు కాని తది
తరులు స్వశ్రేయస్కాములు వారివిలాపప్రలాపవిప్రలాపములు
విని చెడవలసినపని లేదు

### శంక.

బ్రహ్మవిద్య వీరికిఁ దెలుపవచ్చును వీరికిఁ దెలుపరా
దను విధినిషేధము లేల? అందఱకుఁ జెప్పిన వారివారిశక్తి
కొలఁది వారువారు సాధించి బాగుపడరా యనుశంక కొంద
ఱకుఁ గలుగవచ్చును కాని యది సరియైనది గాదు

బ్రహ్మవిద్య విచ్చలవిడిగ నెవ్వరికైనఁ జెప్పరాదని శ్రుతి
స్మృతీతిహాసపురాణములు చెప్పుచున్నవి. ఇట్లు చెప్పుటకుఁ
గారణము లేక పో లేదు

శ్లో. ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్ నిబోధత
క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథం
తత్కవయో వదంతి. కఠోపనిషత్తు

తెమ్మ మేలుకొమ్మ సద్గురువులను జేరి చక్కఁగఁ దెలిసి
కొనుము. ఈమార్గము మిగుల దుర్గమము అతిప్రయాసముచే
నడవఁదగినది. కష్టముతోడఁ దాఁటఁ దగినది మంగలకత్తి
వాదరవలె మిగులఁ బదునైనది యని బ్రహ్మజ్ఞానులుచెప్పుచు
న్నారు" అని యర్థము.

తెమ్మ మేలుకొమ్మ - - - - తెలిసికొమ్మనుటకు మేలు
కొలు పనుగ్రంథమునందు విశదముగ నర్థమువ్రాయఁబడినది
తెలిసికొనఁ గోరువా రాగ్రంథమును బఠింపవలయును.

ఈమార్గము మంగలకత్తియొక్క పదునైనకొనమీఁద
నడచుట యెట్టిదో యంతకష్టమైనదని యీమార్గమున నడ
చిన బ్రహ్మవేత్త లెఱుఁగుదురు అనిన నేమిభావము? ఆమార్గ
మున నడచువారు మిక్కిలి హెచ్చరికతో నడువవలయునని
ప్రమాదపడిన మిగులనపాయకర మని యట్లు నడువఁబూనిన
వారు సాధనసామగ్రి యభ్యాసము లభింపఁజేసికొని యుండ
వలయునని కదా. ఆమార్గమునందలి యపాయము లుపాయ
ములు ననుభవముచేఁ దెలిసినవారగుటచే వా రామార్గమున
నడువఁ గోరువారికి హెచ్చరికవాక్యములు పలికియున్నారు.
పొగబండిమీఁద మనము ప్రయాణముచేయునపుడు ప్రక్కల
హెచ్చరిక. అపాయముఅని వ్రాసినపలకలు స్థాపించియుందురే
యేల? అట్టులే యిదియును

ఈమార్గమందు నడువఁబూనినవారికి రాఁగలయపాయ
ములు నవి తప్పించుకొనునుపాయములు ముందుగ సాధింప

వలసిన సాధనములు చేయవలసిన యభ్యాసములు నివి వ్రాయుట కిది సమయముగాదు.

శ్లో.ఇదం తే నాతపస్కాయ, నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం,నచ మాం యోభ్యసూయతి
భగ. ౧౮. ౭

ఈభగవద్గీతాశాస్త్రము తపస్సు లేనివానికి భక్తి లేని వానికి గురుశుశ్రూష చేయనివానికి నాయం దసూయ గల వానికి నెప్పుడైనఁ జెప్పరా దని యర్థము ఇది శ్రీకృష్ణవాక్యము.

ఇం దసూయ యనఁగా నిర్లక్ష్యభావము. కృష్ణుఁడు మనవంటిమనుష్యుడే. వాఁడు చెప్పుట మనము వినుటయా. వాఁడు మనకంటె నేమిట గొప్పవాఁడు అను తిరస్కారభావ ముతో నుపదేశించినవిషయమందు ననుకూలగ్రహణబుద్ధి లేక యుండుట

శ్రీమద్రామాయణమందును "శ్రోతవ్య మనసూయ యా" అసూయ లేక వినఁదగినది యని చెప్పఁబడెను ఇప్పుడు కొందఱు తామసులు ననధికారులు యసూయాపిశాచగ్రస్తు లగుటచేతనే రామాయణమందును భగవద్గీతయందును భాగ వతమందును విపరీతాభిప్రాయు లగుచున్నారు నిర్మల మైనయద్ద మందుఁ గ్రోఁతులకుఁ గ్రోతులముఖములు సుందరులకు సుం దరముఖములు గదా కనవచ్చును సాత్వికులకు సరియైనయర్థమే రామాయణ భగవద్గీదాదులందు తోఁచును.

శ్లో. న విశ్వాసః క్వచిత్కార్యో, విశేషాత్తు కలౌ యుగే
పాపిష్ఠా వాదవర్షేణ, మోహయంత్యవిచక్షణాన్
గోపయే న్నోచ్చరే ద్ధర్మం, నాపృష్టః కించి దుచ్చరేత్
పృష్టోపి న వదే ద్ధర్మం, గుహ్యాం సిద్ధాంత మేవచ
ఆశ్రితా యాతిభక్తాయ, శాస్త్రశ్రద్ధాపరాయచ
న్యాయేన పృచ్ఛతే సర్వం, వక్తవ్యం శౌచయోగినే
ఆత్మపూజార్థ మర్థార్థం, దంభార్థ మపి భిన్నధీః
అయోగ్యేషు వదన్ శాస్త్రం, సన్మార్గాత్ప్రచ్యుతో భవేత్
ఊషరే నివపేద్బీజం, షండే కన్యాం ప్రయోజయేత్
సృజేద్వా వానరే మాలాం, నాపాత్రే శాస్త్ర ముత్సృజేత్
శాండిల్యసంహిత.

అర్థము.

సదాచారసంపత్తి-భక్తి-గురుసేవ-పెద్దలవలన వినికి లేనివారలయందు లోకులు కొంచెమైనను, నందు విశేషించి కలియుగమందు విశ్వాస ముంచరాదు. పాపిష్ఠులు వాదవర్షముచేఁ దెలియనివారిని మోహపఱిచెదరు.

రహస్యమైనసిద్ధాంతవిషయమును దాఁపవలయును గాని తానై కొంచెమైనను ధర్మరహస్య మడుగనివారికిఁ జెప్పరాదు కొందఱ కడిగినను జెప్పరాదు. (అటయిన శాస్త్రజ్ఞానము లోకమున నశింపదా యుందురేని) ఆశ్రితుఁడుగా నుండి యతిభక్తిపరుఁడై శాస్త్రవిశ్వాసము కలిగి న్యాయ్యమైనమార్గమున వాదమునకుఁ గాక తత్త్వము తెలిసికొని బాగుపడవలయు

నను తలంపుతో నడిగెనేని ,మనోవాక్కాయశౌచముగలవాని
కిఁ జెప్పవలయును తనగౌరవము గోరి గాని, ధనాశచేఁ గాని
దంభమునకై కాని భేదబుద్ధిగలవాఁడు అయోగ్యులకు శాస్త్ర
విషయము చెప్పెనేని సన్మార్గమునుండి భ్రష్టుఁ డగును చవిటి
నేల విత్తనములు నాటవచ్చును. వృషణహీనునకుఁ గన్య నీయ
వచ్చును. క్రోఁతిమెడలోఁ బూలదండ వేయవచ్చును గాని
యనర్హునకు శాస్త్రతత్త్వములు చెప్పరాదు

ఇట్టివాక్యములు ప్రతితత్త్వశాస్త్రమందును గలవు
ఇట్లు వ్రాయుటయందు శాస్త్రకారుల యభిప్రాయ మేమి?
లోకమున జ్ఞానము వ్యాపింపరా దనియా? అటయినచో వా
రా శాస్త్రములు వ్రాయనేల? ధర్మజ్ఞానముచే లోకము బాగు
పడవలయు ననెడి వారియుద్దేశ మెట్లు సార్థకము కాఁగలదు?
ఇతరులు నేర్చుకొనినఁ దమయంతటివా రగుటచేఁ దమగౌర
వము చెడుననియా? అడవులలోఁ గందమూలాదులు దిని
యేకాంతనిరతులై "స్వస్తిప్రజాభ్యః" "లోకాస్సమస్తాస్సుఖినో
భవంతు" అని పూఁటపూట చెప్పుచుండువారికి తమకు చెప్పిన
విషయము లోకమెఱిఁగి బాగుపడవలయు ననునభిప్రాయ
ముండునే కాని దానివలనఁ దమకు గౌరవహాని కలుగు నను
నభిప్రాయముండఁ జాలదు. పలువురు చదివిన కీర్తి హెచ్చును
సమ్మానకాలకూటమ్మని గౌరవమును విషముగాఁ జూచువారికి
నగౌరవభయ మెందుండివచ్చును? కాఁబట్టి యిట్టిదురభిప్రాయ
ములు వారికి లేవు. సదభిప్రాయముతోనే యోగ్యులుగాని

వారు పఠింపరా దని శాసించిరి ఇది వారిమేలు కోరి చేసిన పనియే కాని యితరము గాదు ఈఁతనేరనివారు నీళ్లలో దుముకవల దనుట యన్యాయచేతనా? సాము నేరనివాఁడు కత్తిని త్రిప్పవల దనుట యన్యాయచేతనా! జీర్ణశక్తి లేనివారు గట్టి పదార్థములు దినవల దనుట యన్యాయచేతనా? అట్టులే యిది యును యోగ్యత లేనివారు తత్త్వశాస్త్రము చదివినఁ జెడుదురు వీరికి నవర్థకర మైన యల్పజ్ఞానము కంటె నజ్ఞానము మేలు. అజ్ఞాని కాపద లేదు పెద్దలు చెప్పిన మాటయందు విశ్వాసముంచి యాప్రకారము వర్తించి బాగుపడును. వీనికి శాస్త్రపఠన మనావశ్యకము శబరీనారదాదులే (పూర్వజన్మమున) నిదర్శనములు. అల్పజ్ఞుఁడో కొంచె మేదో తెలిసి యది యహంకారమునకుఁ గారణము కాఁగా ప్రగల్భతచే శాస్త్రవాక్యముల కపార్థముచేసి సర్వజ్ఞత్వభ్రమ నెత్తిపై వేసికొని వక్రమార్గములఁ బోయి చెడును తాను జెడిన మేలే. తాఁ జెడ్డ కోఁతి వనమెల్లఁ జెఱిచినట్లు లితరులను గూడఁ జెఱుచును. అనుభవమే సాక్ష్యము ఎట్లందురా? భగవద్గీతయందు “సోమపాః పూతపాపాః” యనియుండుటఁ జూచి సోమ మనఁగాఁ గల్లనియర్థము చేసికొని భగవద్గీత కల్లు త్రాగవచ్చునని చెప్పుచున్నదని యొకప్రబుద్ధుఁడు వ్రాసెను. మద్యాజీ మాం నమస్కురు అనుచో మద్య+అజ+ఇ సారాయము మేఁక మాంసము గలవాఁడవై నాకు నమస్కరింపవలయు నని కృష్ణుఁడు చెప్పినట్లు కొందఱు మాంసభక్షకగురువులు శిష్యులకు శిష్యురాండ్రకు బోధించుచున్నారు.

ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ఇం
ద్రియము లింద్రియార్థములందు వర్తించుచున్నవి నేను జేయు
నది యేమి లేదు ఇంద్రియము దానిపని యది చేసినపుడు పాపము
నాకెట్లు కలుగును? చేసినవాఁడను నేను గా నని వ్యభిచరింప
భగవద్గీత యనుజ్ఞ యిచ్చుచున్నదని కొందఱు పరస్త్రీలకు
బోధించి వారలఁ జెఱుచుచున్నారు.

కం. జల పెట్టనేని వీనులు
కలియుంగాఁ బెట్టుటకును గలకాలంబున్
గలదే పుడుకల నియమము
దలఁపఁగ నటుగాదె యోనిధర్మం బకటా

చెవులందును, గన్నులందును, ముక్కులందును దూరగ
యెత్తినపుడు యావజ్జీవము నొకవ్రేలే యొక పుల్లయే కాని
వేఱొండు కూడదనునియతి కలదా? అట్టులే కదా యోని
రంధ్రము ధర్మమని యీదుష్టగురువులు స్త్రీలకు వయస్సువిధవలకు
బోధించుచున్నారు తక్కెళ్లపాటిలోను, అచ్చమ్మపేఁటలోను
నిటువంటి మతగురువులకు వాసుదాసునకు జరగినసంవాదము
మఱియొక పత్రికలో వ్రాయఁబడును ఇట్టి మఠాధిపతులు
సన్న్యాసులు అను పేరి కలిదూతలు పెక్కుడున్నారు.

హింస చేసి నేను జేయలే దనుకొనిన హింసాదోషము
రాదని భగవద్గీత చెప్పుచున్నది కావున నెవ్వరైన నెవనినైనఁ
జంపి నేను గాదనిన దోషము రాదని యొకరుచెప్పిరి. ఇట్టు
లర్థము చేసి యట్లు వర్తించువారు చెడుదురనుటకు సందేహము
కలదా?

అట్టులే కామదాసులు శ్రీకృష్ణచరిత్రము చదివి కామ
జయము సంపాదించుటకు మాఱు కృష్ణుఁడు అంకాడె ననియు
మన మట్టులే చేయవచ్చు ననియు, కొందఱు వదరుచున్నారు
రాముఁడు దుష్టుఁడు రావణాసురుఁడు శిష్టుఁ డని చెప్పుపుణ్య
జనులు కలరు గదా.

"ఆకాశో బ్రహ్మ" యను నుపనిషద్వాక్యమునకు నమర
మందు "ఆకాశం గగనం శూన్య" మని యుండుటచే బ్రహ్మము
శూన్య మని యర్థము చేసి కొందఱు దుర్బోధములు చేయు
చున్నారు. శూన్య మనఁగా నాస్తి యని యీమూఢులతలంపు.

"తస్యధీరాః పరిజానంతి యోనిం" ఆయన యోనిని
పండితులు చక్కఁగా నెఱుఁగుదురు. అని యుండుటచే బ్రహ్మ
మునకు స్త్రీలకువలె యోని యున్నదఁట. ఇది "మమయోని
ర్మహద్బ్రహ్మ" నా యోని పెద్దబ్రహ్మయంతది యని కృష్ణుఁడే
యంగీకరించె నఁట. అట్లు యోనిద్వారము లేదేని "ప్రజాపతి
శ్చరతి గర్భే అంతః" ప్రజాపతి గర్భములోపల సంచరించు
చున్నాఁ డను శ్రుతివాక్యము సార్థక మగునా? యోని లేక
పోయిన ప్రజాపతి గర్భములోని కెట్లు పోవును? ఇది యీ వేద
వేత్తలెఱిఁగిన యర్థము. ఇది యూహగాదు. కల్పితము గాదు.

నేను వేలుపూరు గ్రామప్రాంతమందుఁ దిరుగునపు
డొకఁడు బ్రహ్మముఖమునందుండి బ్రాహ్మణులు పుట్టుచున్నా
రని వేదము చెప్పుచున్నదే బ్రహ్మకు ముఖమునందుఁ గూడ
యోను లున్నవా యని ప్రశ్నించెను అవు నని చెప్పినను

లేదని చెప్పినను విపరీతప్రశ్నలు వాదములు బయలుదేఱు నని తలఁచి నీతలలో పేలున్నవే నీతలలో నెన్నియోను లున్నవని యడిగితిని. మరలఁ బ్రత్యుత్తరము వాదము లేకపోయెను. ఈకాలపువైతండికుల కియ్యవలసినవి యిట్టి ప్రత్యుత్తరములే. మూఢుల శాస్త్రజ్ఞాన మెట్లు పరిణమించెనో కంటిరి గదా? రహస్యములు గొప్పవిషయము లల్పులు గ్రహింపఁజాలరు. ఆవిషయమందుఁ గొంతపరిచయము జ్ఞానము అనుకూలభావము గలవానికిఁ గాని చెప్పినను బోధపడదు.

"విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనా వీరాయితం బెంతయుఁ" అను నలంకార శాస్త్రవాక్యమునకుఁ జిన్నప్రాయమందలి సాహిత్యవిద్యార్థికి నుపాధ్యాయుఁ డేమని యర్థము చెప్పి మెప్పింపఁగలఁడు? చెప్పకుండుటకుఁ గారణ మసూయయా నిజగౌరవహానిభయమా? "౨" ఇట్లేల వ్రాయవలె? ౩ యిట్లు ఏల వ్రాయరాదననేమి చెప్పవలయును ౧ + ౨=3 అని తెలియనివానికి సిద్ధాంతగణిత మెట్లు బోధపడఁగలదు.

ఒకబ్రాహ్మణబాలుఁడు గురువునొద్ద సాహిత్యశాస్త్ర మభ్యసించి పంచకావ్యములు చక్కఁగ వల్లించెను అందు మాఘకావ్యంబున స్త్రీలయధరామృతము విశేషించి వర్ణింపఁ బడెను. విద్యయంతయు సాంతముగఁ జదివి గురువునుజ్ఞ దీసికొని తనయూరి కావిద్యార్థి పోవుచుండ దారిలో నొక యెఱుకలిది కల్లుద్రావి నోటఁదమ్ములముంచ నోడలెఱుఁగక పడియుండ దాని నోరనుండి జొల్లు కాఱుచుండెను. ఆబ్రా

హ్మణబాలుఁడు మాఘకావ్యమందుఁ దాఁ జదివినయధరామృత
మిదియే యని తలఁచి దానియొద్దకుఁ బోయి పెదవులక్రింద
దోసిలిపట్టెను కొంతసేపటికి దోసిలి నిండఁగా దానిఁ దన
నోరఁ బోసికొనెను కల్లుత్రాగిననోరు పొగాకుతోడి తమ్ము
లము ఆయధరామృతమహాహా (అధరము=పెదవి-అమృతము=
నీళ్లు-పెదవినుండి వచ్చునీళ్లు.) యెంతరుచి యెంతరుచి యెంత
రుచిగా నుండెనో! హరిహరీ! యావిద్యార్థియవస్థ నేమని
చెప్పను? రుచి తలకెక్కెను కన్నులు గిఱ్ఱునఁ దిరిగెను వాం
తులు పుట్టెను కడుపులోపలి ప్రేగులు వెలికి వచ్చెను. వాస
నకు ముక్కులోని వెండ్రుకలు కమరెను నాలుక బఱికికొనెను
చింతాకు వేసి రుద్దెను పుక్కిలి చెమ్మవేసెను నోరు తెఱచి
కొని కూర్చుండెను ఏమిచేసిన నేమి? ఆయధరపీయూషము
వాసన నతని వదలలేదు. చాలబాధపడి యామూఢుఁడు
మాఘముపైఁ గోపించి మాఘమును గాల్పవలయునని గట్టిగా
నఱచుచుఁ బోయెను తక్కినకథ యప్రస్తుతము ఇప్పుడు
కొందఱు వృద్ధసేవ లేక గురుశిక్ష లేక సంప్రదాయజ్ఞానము
లేక ప్రతిపదమాత్రముగోరి యుద్గ్రంథములఁ జదివి యావిద్యార్థి
గతికి వచ్చుచున్నారు ఇతరులను జెఱుచుచున్నారు ఎన్ని
యసత్యములకు నెన్నిదురూహములకైన జీవబ్రహ్మైక్య వేదాంత
రహస్యమను గ్రంథమందు లక్ష్యములు దొరకఁ గలవు ఆ
పుస్తకమును జదివి చెడినవారెందఱో కలరని వింటిని. ఈ
గ్రంథములోని కొన్ని యసత్యవిషయములను సంజీవని యందు

ముందు లోకమున శెటేఁగింపఁగలదు. "మేలుకొలుపు" చూచి నఁ గొన్ని తెలియఁగలవు

ఐహికవిషయములందుఁ జెడినను బ్రాయశ్చిత్తము పెట్టుకొనవచ్చును. ఆత్మవిషయమందుఁ బ్రమాదముగలిగిన నధోగతియే కావుననే యధికారి కానిశిష్యునికి నాత్మజ్ఞాన ముపదేశింపరా దని శాస్త్రములు శాసించెను శబరి తొలుత మునీశ్వరులయొద్దఁ బరిచారికగాఁ గుదిరినను గురువాక్యశ్రవణమువలనఁ గలిగిన శ్రద్ధాభక్తులు గలదై యీవిషయమునే మననముచేయుచు శిష్యురాలిధర్మ మైనశుశ్రూష చేయుచుఁ దద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా యని కృష్ణభగవాను లుపదేశించినట్టు నమస్కారాదిపూర్వక పరిచర్యచేయుచు గురువాక్యము నమ్మి వితండావాదముసేయక న్యాయ్యమైన ప్రశ్నలు వేయుచు యావజ్జీవ మంతేవాసినియై శిష్యశబ్దమును సార్థకపఱుచుచుఁ గ్రమక్రమమున యోగ్యత సంపాదించుకొని ముముక్షువై యోగసిద్ధికి బ్రహ్మజ్ఞానమునకుఁ బాత్రురా లయ్యెను. ఇట్టి శిష్యులకు శిష్యురాండ్రకు యోగ్యులైనగురువులు తత్త్వరహస్య ముపదేశింపవచ్చును గాని యిట్టియోగ్యత లేనివాఁ డేజాతివాఁడైన నుపదేశింపరాదు ఇఁక శిష్యలక్షణమెటిఁగించెద దానివలన శబరి యోగ్యత తెలియును

సశేషము.

---

## జమ్ములపాళెముసభ.

గుంటూరుమండలమందలి కోదండరామసేవక సమాజము నుపసమాజముయొక్క ద్వితీయవార్షికోత్సవము బాపట్ల సమీపమందుండు జమ్ములపాళెమను గ్రామంబున 1930 మార్చి 7-8-9 తేదులయందు జరగునని దాని కగ్రాసనాధిపత్యమును మహారాజశ్రీ ఏ ఎల్. నారాయణరావునాయఁడుగారు (ఇంపీరియల్ బాంకు - బాపట్ల) వహింతురని యిదివఱకే సంజీవని తెలిపియుండెను ఆహ్వానసంఘమువారు ఆహ్వానపత్రికలను సభ్యులకుఁ బంపియుందురు. ఆహ్వానసంఘమువారు శ్రీమంతులు - ధీమంతులు - శక్తిమంతులు - మర్యాదాపరులు - భక్తిశ్రద్ధలు గలవారు కావున వారు సభ్యులను సభ్యురాండ్రను నాదరించుటయందు సభ చక్కఁగ నిర్విఘ్నముగఁ గీర్తికరముగ నిర్వహించుటయం దెట్టిలోప ముండఁజాలదు. కావున సభ్యులు సభ్యురాం డ్రందఱు నిర్భయముగ నిశ్శంకముగ నాసభకు 6-వ తేది సాయంకాలము చేరపోవచ్చును.

అందఱు వచ్చి శ్రీకోదండరామ సేవకసమాజసభ్యులెట్టి యుత్తమగుణములు గలవారో లోకమునకుఁ దెలియునట్లు లనుగాములకు మార్గదర్శకులై తమకు సమాజమునకుఁ గీర్తికరముగ వర్తించి యాహ్వానసంఘమువారికిని నుల్లాసము యశస్సు కలుగునట్లుసభ జరపి తమకుఁ దెలియనిసంగతులు తెలిసికొని తమకుఁ దెలిసినవి యితరులకుఁ దెలిపి యెవనిచేతను వ్రేలఁజూపించుకొనక వర్తింపఁ బ్రార్థింపఁబడుచున్నారు

సభ్యులు సభ్యురాండ్రందఱు తాము తాము వ్రాసిన శ్రీరామకోటిపుస్తకములను దెచ్చి వాసుదాసునకుఁ జూపఁ బ్రార్థింపఁబడుచున్నారు ఇవి యన్నియుఁ జూచి యిందుబహుమానపాత్రము లేవియో యేర్పఱుపఁబడును ఇక్కడికి రాని వారు ఒంటిమిట్టకు వత్తురు గనుక నప్పుడు తక్కినవారు వ్రాసి నరామకోటిపుస్తకములను జూచి బహుమానపత్రము లీయఁ బడును

సంవత్సరచర్యలు వ్రాసినవారు వానిని దేవలెను. భజనపరులు తమసమాజముతో నుపకరణములతో రాఁ బ్రార్థితులు. ముప్పాళ చాగంటివారి పాళెమువారివలె సాత్త్వికాహారముగోనువారికిఁ దగినయేర్పాటులు ఆహ్వానసంఘము వారు చేయుదురని నమ్మెదను.

అనంతపురము, చిత్తూరు, నెల్లూరు, గోదావరి మండల మండలి సభ్యులును నీసభకు దయచేసి యిట్టిసభలు తమమండలమందును జరుపఁ బ్రార్థింపఁ బడుచున్నారు.

సభ జరిగెడి మూఁడుదినములందును ౧౯౨౯ సంవత్సరము డిశంబరునెలసంచికయందలి ౫౮౧-వ పుటయందు ప్రకటింపఁబడిన "మాండలికసభానియమములు" అనునవి పత్రముపై వ్రాసి సభామండపమున రెండుమూఁడు స్థలముల నటింపవలయును లేదా యట్టలపై వ్రాసి వ్రేలాడ వేయవలయును భజనపరు లుదయమున ౪ గంటలకే నిద్రలేచి భజనము చేయుచు గ్రామమంతయుఁ బ్రదక్షిణించి రావలయును.

తక్కిన స్త్రీలు పురుషులున్నచోటనే భజనమైనఁ జేయవల యును. భగవన్నామకీర్తనలో పద్యములో పఠింపవలయును సూర్యోదయముతోడ నందఱు స్నానములుచేసి నిత్యకృత్య ములు దీర్చుకొని సభ వేళకు మొదటిగంటకు సరిగా సభా మంటపమున నుండవలయును. పూఁటపూఁట సభాసమయ మునకు నయిదు నిమిషములు ముందుగ గంటవాయింపఁ బడును. ఆవల సమయమునకు సరిగా నొకగంట వాయింపఁ బడును రెండవగంటతోడ సభాకార్యము ప్రారంభము కావలయును.

---

## శ్రీకోదండరామస్వాములవారి సామ్రాజ్య పట్టాభిషేకము.

ఈ యపూర్వమహాకార్యము సమీపించుచున్నది మాన మాత్రమే విరామముగలదు. కార్యము సమీపించుకొలఁది ధైర్యము సడలుచున్నది. శ్రీసీతారాములయందు విశ్వాసము హెచ్చుచున్నది. నెయ్యి బియ్యము నీవంతు తక్కినవి మా వంతని ధైర్యము చెప్పి కార్యమునందు వానుదానుని బ్రవేశ పెట్టింప సీతారాము లెవరిని ఆనాఁడు ప్రేరించిరో వారి నిప్పుడు మానము వహింపఁ బ్రేరించిరి వారివాగ్దానము వేంకటగిరి కుమారరాజుగారి దాన శాసనము సమానము లగునట్లున్నది. ఇంత గొప్పకార్యమునం దిటులు చేయఁ దలఁచిన శ్రీరాముల నేమని యందును శ్రీరాముఁడు విముఖుఁడయినను మొదటి

నుండి (పారాయణ ప్రారంభమునుండి) నేఁటివఱకుఁ గన్నతల్లి వలెఁ దోడునీడై యధైర్యపడినపుడు ధైర్యము గలుగఁ జేయుచు నిరుత్సాహి నైనపు డుత్సాహము కలిగించుచు వర్తించు నాతల్లి శ్రీసీతాదేవి నన్నుఁ జేయి వదలి దిక్కుమాలినవానిని జేయదు అని నిశ్చయముగా నంతఃకరణము చెప్పుచున్నది నమ్మియుండిన గొప్పసాహాయ్యము సందిగ్ధమగుటచేఁ గార్యక్రమము కొంత తగ్గించుకోవలసి వచ్చినదని చెప్పుటకు విచారమగుచున్నది. సంకుచిత కార్యక్రమమైనను మహాజనసాహాయ్యము లేక జరుగదు ఆయశస్సున కేపుణ్యాత్ములు పాత్రులు గానున్నారో. అనుకొనిన సాహాయ్యము రామిచే నే నెక్కువ శ్రమింపవలసి వచ్చినది నమ్మకముగా సాహాయ్యము రాఁగలదను కొన్ని చోటులకుఁ బోవుటకు నవకాశము లభించునట్లు లేదు. కావున వారును నితరులును నేను సముఖము రాలేదు ప్రార్థింపలేదని తలఁపక వారివారికిఁ జేనైన సాహాయ్యము చేయఁ బ్రార్థించుచున్నాఁడను. నాకంటె ముందుగానే కొందఱను బ్రేరించి శ్రీసీతాదేవి వారంతటవారే సాహాయ్యపడఁ జేయుచున్నది.

| | |
|---|---|
| శ్రీమతి నగరూరు సుందరమ్మగారు బళ్లారి.<br>సీతాదేవి కిరీటమునకుఁ గాను | ౨౦౦-౦-౦ |
| మ-రా-శ్రీ దేచిరాజు రామరావుగారు,<br>ప్రాఁతగుంటూరు. | ౧౦౦-౦-౦ |

ము మహాలక్ష్మమ్మ, వెల్లిపాకము కడలూరు. చందనబిళ్లలు ౨ వీ.
ఒక భక్తుఁడు కడప. ౫-౦-౦

వంగూరు సీతమ్మగారు ౧ పుట్టి వడ్లీయ సమ్మతించిరి.

వావిలికొలను రుక్మిణమ్మగారు స్వాములవారి పాదుకలకు వెండిపళ్లెరము సమర్పింప నంగీకరించిరి.

చి॥ వావిలికొలను శార్ఙ్గపాణిరావు రామానుజరావు అర పుట్టి వడ్లీయ సమ్మతించిరి.

శ్రీరాములకు పట్టుదోవతి. } మ-రా-శ్రీ కస్తూరి సుబ్బరావుగారు.
సీతాదేవికి పట్టుచీర. }

౧ పుట్టి గనుసుగడ్డలు. ముడిపిరి కోమలమ్మగారు తిరువళిక్కేణి.
౨౦-౦-౦ ,, ఎ. చిన్నయ్య మొదలియార్ గారు,
B M, Press, Proprietor, Madras.

సత్తులోటాలు. కొండమాచుపల్లె కోదండరామసేవకసమాజమువారు గ్రామసంచారమున లభించినవి.

కందిపప్పు.

౪ బ. లంకెలకూరపాటి భక్తులు.
౬ బ. పలుదేవర్లపాడుభక్తులు సత్తెనపల్లె తాలూకా.
౬ బ. దొండపాడుభక్తులు నరసారావుపేట తాలూకా.

పెసరపప్పు.

౧౦ బ. ఫణుకుపాడుభక్తులు.
౯ బ. నార్నపాడుభక్తులు సత్తెనపల్లె తాలూకా.

వస్త్రములు.

౧౨౦ చీరలు. } సాతులూరు గ్రామభక్తులు.
౧౨౦ రవికలు. }

౧౨౦ దోవతులు } గొరిజవోలు మేరికపూండి గ్రామ
౧౨౦ ఉత్తరీయములు. } భక్తులు, సత్తెనపల్లె తాలూకా

చింతపండు

౨౯ మ. గోళ్లపాడు కుందురువారి పాళెము గ్రామభక్తులు, సత్తెనపల్లి తాలూకా

౨౦ మ. గుండాలపాడు గ్రామభక్తులు సత్తెనపల్లి తాలూకా.

మిరపకాయలు

౨౪ మ. గొల్లవరము గ్రామభక్తులు.

౨౩ మ. రుద్రవరము గ్రామభక్తులు సత్తెనపల్లి తాలూకా.

౭౦-౦-౦. వక్కలు. మ రా శ్రీ పాటిబండ్ల రామస్వామి గారు సాతులూరు నరసారావుపేట తాలూకా.

౨౪-౦-౦. అరటియాకు దొప్పలు బండారుపల్లె రత్తమ్మగారు దొండపాడు. నరసారావుపేట తాలూకా.

౨౧౦-౦-౦ నువ్వులనూనె నుదురుపాడు భక్తులు సత్తెనపల్లె తాలూకా.

౨౪-౦-౦. ద్రాక్ష మ రా శ్రీ మందాళ వెంకటరెడ్డిగారు నుదురుపాడు.

కెరిసణ్ సూనె.

౨౫ డబ్బాలు. చందవరము గ్రామభక్తులు నరసారావుపేట తాలూకా

౫ డబ్బాలు మ-రా-శ్రీ, వెంపాటి లింగయ్యగారు ఇరుకు పాళెము సత్తెనపల్లె తాలూకా.

౫౦-౦-౦ తములపాకులు మ రా శ్రీ వంకాయలపాటి కోటి లింగముగారు పొణుకుపాడు సత్తెనపల్లె తాలూకా.

౧౬-౭-౦ ముంతమామిడిపప్పు ఈదర కోటమ్మగారు సాతులూరు నరసారావుపేట తాలూకా.

౧౦-౦-౦ కలకండ ప్రత్తిపాటి చిలకమ్మగారు సాతులూరు.

చలిపందిళ్లు (మంచినీళ్లిచ్చునవి.)

౧ మ-రా-శ్రీ, గుండము రామిరెడ్డిగారు.

,, ,, పెద్దిరెడ్డిగారు.

,, ,, సుబ్బారెడ్డిగారు.

రుద్రవరము గ్రామము.

౧ మ-రా-శ్రీ, కల్లూరి మందయ్యగారు.

,, నున్న వేంకటకోటయ్యగారు.

రుద్రవరము సత్తెనపల్లె తాలూకా.

౧ మ-రా-శ్రీ, కారుమూరి కృష్ణారెడ్డిగారు.

,, ,, వీరారెడ్డిగారు

,, ,, లక్ష్మీరెడ్డిగారు.

,, ,, నారపరెడ్డిగారు.

౧ మ-రా-శ్రీ, ఆళ్ల పుల్లారెడ్డిగారు.
బొల్లవరము గ్రామము.

౧ ముష్ఠాళ చాగంటివారిపాళెము భక్తులు.

౧ మ-రా-శ్రీ, కాకుమాను రామయ్యగారు.

,, కల్లం పుల్లారెడ్డిగారు.

,, ఏపెల గుంట అప్పయ్యగారు

బొల్లవరము గ్రామము సత్తెనపల్లె తాలూకా

౧గో తము బియ్యము | మ-రా-శ్రీ, పేరం రామానాయఁడు గారు
౧గో. టెంకాయలు. | మంగళగిరిఖండ్రిక తిరువళ్లూరు తా

౧ గో. బియ్యము | కొరపాటి రాజలక్ష్మమ్మగారు నీరువాయి
౧ వీ. కర్పూరము. | గ్రామము

౧౦౨-౦-౦ రూ. తి. స. శరణు వెంకాయమ్మగారు అమృతలూరు

౧ గో. బియ్యము బ్ర శ్రీ రా శ్రీ మారుటూరు పుండరీ
కాక్షుఁడుగారు వట్టిచెరుకూరు

౫ గో. బియ్యము బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ॥ దూ సుబ్రహ్మణ్యము
గారు ఇందుకూరుపేట.

౫ బ మినుపపప్పు సంకురాత్రి పాడు గ్రామ భక్తులు

౫ ,, ,, ఎడ్లపాడు గ్రామ భక్తులు

౮ ,, గోధుమరవ చిరుమామిళ్ల గ్రామభక్తులు.

౬ ,, గోధుమనూక తిమ్మాపురం గ్రామభక్తులు.

| | | | |
|---|---|---|---|
| ౩ మ. మ రా శ్రీ నల్లప నేని వీరయ్యగారు. | | | లింగారావు పాళెము భక్తులు. |
| ౩ ,, | ,, | మాకి నేని కోటయ్యగారు. | |
| ౩ ,, | ,, | నంబూరి రామయ్యగారు | |
| ౪ ,, | ,, | ,, బసయ్యగారు. | |

౨౦౧-౦-౦ రూ. పూలు. సోలసగ్రామ భక్తులు.

సశేషము.

తిరుమల తిరుపతి తీర్థములు తెచ్చుటకు వావిలికొలను రామచంద్రరావుగా రంగీకరించిరి. షోళంగివరము మొదలు పంపవఱకుఁగల తీర్థములు తెచ్చియిచ్చుటకు మ-రా-శ్రీ కొమ్మ రాజు రామరావుగారు (మన్నూరు) అంగీకరించిరి.

సంక్షిప్తకార్యక్రమమునకైనను నిపుడు లభించినయాహారపదార్థములు చాలవని భయ మగుచున్నది కావున ధర్మాత్ములు వారివారిశక్తిభక్తికొలఁది వారివారికి సాధ్యమైనపదార్థము లనుగ్రహింతురు గాక.

కావలసిన పదార్థములు.

౫౦ బస్తాలు బియ్యము ౨౦ డబ్బాలు నెయ్యి.
౧౨ బస్తాలు మినుపపప్పు ౩ బస్తాల వెచ్చి సెనగపప్పు.
౨౦౦-౦-౦ కుండలు-గంపలు లోనైనవి.
౧౮౦ గ్లాసులైట్లు
౩౦ మణుగులు బెల్లము
౪ డబ్బాలు మంచినూనె
౨౦౦ రూ. నీళ్లవాండ్రకు

౫౦౧ రూ. వంటవాండ్రకు.
౧౦౦ రూ. వంకాయలు-గనుసుగడ్డలు.
౧౫౦ రూ. పాలుపెరుగు.
౨౫౦౦ రూ. పందిళ్లకు.
౧౦౦ రూ. అర్చకులు
౧౦౦ రూ. వేదపారాయణమువారు

ఇవిగాక వంటవాండ్రకు - నీళ్లవాండ్రకు - పారాయణములువారికి - ఋత్విజులకు-దీపాలకు - పందిళ్లకు - కూరగాయలు-పాలు - పెరుగులకు పైకము కావలసియున్నది ధర్మాత్ములు వారికివారికిఁ దోఁచిన సాహాయ్యము చేయుదురుగాక.

## ప్రార్థనము

వాసుదాసునకుఁ గల యసహాయసంపత్తి - అకించనత్వము-దౌర్బల్యము-అశక్తిమత్త్వము లోక మెఱింగినవిషయమే. ఆయనచే నైనది భిక్షాచర్య యొకటియే. తక్కినయన్నిటఁ బరాధీనుఁడే కావున శ్రీరామభక్తిచేతనో - వాసుదాసునందలి రక్తిచేతనో సామ్రాజ్యపట్టాభిషేకమునకు నన్నివిధములఁ దోడుపడినవారే తా మొసంగినపదార్థములు దుర్వినియోగము కాక సద్వినియోగమే యగునట్లు చేయుటకు, వచ్చినవారిని జక్కఁగా విచారించినారని కీర్తిపొందుటకును కార్యములు వితరణయుక్తములుగ జరుపఁబడినపని పేరు దెచ్చుకొనుటకును పూఁటఁబడియున్నారని వాసుదాసుఁడు సవినయముగ విన్నవించుచున్నాఁడు. వాసుదాసుఁ డొంటరిగాఁ డేమి చేయఁగలఁడు?

కార్యములు చేయువారికి నుపాయములు చెప్పఁగలఁడు వచ్చిన
పదార్థములు కార్యనిర్వాహకుల స్వాధీనము చేయఁగలఁడు.
కావునఁ బ్రముఖులుగా నుండువారు వారివారి స్త్రీలతోడ
చైత్రశుద్ధదశమినాఁడే యొంటిమిట్టచేరి వారివారికి సాధ్యమైన
కార్యములు పూనుకొనఁ బ్రార్థింపఁబడుచున్నారు చైత్రశుద్ధ
సప్తమినాఁటికిఁ దీర్థము లన్నియు నొంటిమిట్ట చేరవలెను
అరఁటికాయలు - కంద - పెండలము-గనుసుగడ్డలు - గుమ్మడికా
యలు మొదలైనకూరగాయలు దశమినాఁడు చేరవలెను. బియ్య
ము-బెల్లము మొదలైనవి పాడ్యమికిఁ జేరవలయును. తా
మిచ్చెద మని వాగ్దానము చేసినపదార్థములకు పైకమును దాతలు
మార్చి 7-8-9 తేదులందు జమ్ములపాళెములో వాసుదాసున
కీయవలెను. వేడుకలు చూడ వచ్చువారు ద్వాదశినాఁడు
రావచ్చును. ఈలోపల వారు చేయఁదగినవి చూడఁదగినవి
యేవియు నుండవు త్రయోదశినాఁడు శ్రీసీతాకల్యాణము
తలంబ్రాలు. చతుర్దశినాఁడు పట్టాభిషేకము పున్నమనాఁడు
రథోత్సవము జరగును. ఈ మూఁడుదినముల నన్నదానకార్య
మందు సమాజసభ్యులు సభ్యురాండ్రు శ్రీరామ సేవాసక్తు
లయిన తదితరులు నెట్టిలోపము లేకుండనడుముకట్టుకొని పని
చేసి వాసుదాసునిఁ గృతార్థునిఁ జేయుదురు గాక సేవాసక్తులై
దశమినాఁడు వచ్చిన స్త్రీపురుషులకు వారివారికి యోగ్యమైన
కార్యములు నియమింపఁబడును.

భగవత్సేవయందు భాగవతసేవయందు నీచత్వ మను
నది లేదు విష్ణుచిత్తునంతటివాఁడు గృహసమ్మార్జనము (దేవా
లయమునందుఁ గసవూడ్చుట) జలాహరణము (దేవాలయము
కడుగుటకు నీళ్లు దెచ్చుట) పల్యంకికావహనము (పల్లకులు
మోయుట) ఆతపత్రధృతి (స్వామికి గొడుగుపట్టుట) లసితు
పూలు మాలలుగట్టుట-గంధముఁ దీయుట-దీపములు పెట్టుట-
వింజామరములు వేయుట లోనగు నిట్టికార్యములందు నన్ను
నియోగింపుమా స్వామీ యని ప్రార్థించెను. మఱియొకరు
"వీథీశోధకకింకరః" నీవు పోవుమార్గమునందుఁ జీపురుకట్టతోఁ
గసవు చిమ్మువాఁడ నని చెప్పుకొనెను ప్రేమతోఁ జేయుకార్య
మందుఁ గృత్యాకృత్య నీచోచ్చభేదము లేదు. కొందఱు తప్పులే
యెన్నుదురు కొందఱు హేళనముచేయుదురు కొందఱు
లేనివి కోరుదురు కొందఱు న్నవి బాగులేదందురు ధర్మానికి
మనము చేయుచుండఁగా వీరిపెత్తనము అధికారము ఏమని
ధిక్కరింపరాదు. ఇది సోమరులు తిని తిట్టుసమయము కార్య
నిర్వాహకులు పనిచేసి మాటలుపడుసమయ మని జ్ఞప్తియుం
దుంచుకొనవలయును. విసుఁగు కొనుటకు కోపపడుటకుఁ గార
ణము లెన్నియో కలుగును సుఖ మనునది యుండదు ఆహార
మునకు నిద్రకు సమయము దొరకదు రెండుకాళ్లొకచోటఁ
బెట్ట నవకాశ ముండదు. కొందఱు నిష్కారణముగఁ గలహిం
తురు. పైపెచ్చు నిందింతురు తాము చేయకుండుటయే గాక
చేతఁగాని యీపనికి నిన్నెవ్వరు రమ్మనినా రందురు. పనులు

చేయువారి పరువు గౌరవముఁ దెలియక కొందఱు చులకన చూతురు పిలిచెడివారికిఁ బ్రశ్నములువేయువారికిఁ బ్రత్యుత్తరము లీయలేక కొందఱకు గొంతులు రాపెక్కును. "లెక్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబుఁ సుఖంబుఁ మదిఁ" అన్నట్లు లిట్టివి కార్యములు చేయువారు లక్ష్యపెట్టరాదు. అన్నిటికి దివ్యౌషధము శాంతి సహనము - కార్యనిర్వాహకు లీ రెండుపదంబుల మనస్సుల దృఢముగ నిలుపఁ బ్రార్థితులు పురుషులందుఁ బరుషభాషణములు స్త్రీలయందు బొమముడులు పెదవి విఱుపులు ఈసడింపులు కానరాక యందఱియందును బ్రసన్నవదనములు - మృదుభాషణములు - చిఱునవ్వులు తప్పుండినను లేకుండినను క్షమాపణవాక్యములు వినఁ గన వచ్చుచుండునుగాక. ఇట్టివారే ఘనకార్యములు చేయ సమర్థులు.

కం. ఎఱుక గలవారి కైనను
గఱుపక తక్క రుచితప్రకారము లెల్లన్
గొఱలుహితు లట్లగుట నం
దఱకును జెప్పంగవలయుఁ దగియెడిబుద్ధుల్.

ఎవ రేదోషము చేసినను దగిలెడిదెబ్బ యేమియు నెఱుఁగని వాసుదాసునకే యని యందఱు మనస్సున నుంచవలయు నని వేఁడుకొనుచున్నాఁడను

## జమ్ములపాళెము వార్షికోత్సవసమయమందు విషయ చర్చాసంఘమువా రాలోచింప వలసిన కొన్ని విషయములు.

౧ సమాజాభివృద్ధికిఁ బారిశుద్ధ్యమునకు నవలంబింపవలసిన విధులు.

౨ ప్రాఁతసభ్యులయందుఁ దొలఁగింపఁబడవలసినవా రెవరైన నున్నారా?

౩. సమాజమునందుఁ జేరఁ దలఁచినపురుషులు ౬ లక్షలు రామకోటివ్రాసి చూపినఁగాని చేరుచుకొనఁబడరను నియమ మవశ్యమా.

౪ పైనియమ మవశ్యమేని యిది సభయందుఁ జేరుటకా లేక చేరి యుపదేశమునొందుటకా?

౫. ఎట్టి ప్రాఁతసభ్యులు సమాజమునుండి తొలఁగింపఁబడ నర్హులు

౬. ఇప్పు డుండునియమములందు నవరణలు కావలసిన వేవైన నున్నవా?

౭ సమాజసభ్యులకుఁ జెప్పవలసినవన్నియు సంజీవనీముఖము నఁ జెప్పవలసియుండుటచే సంజీవనిని సభ్యులందఱు నింటికి నొకటివంతునఁ దప్పక తెప్పించుకొనవలయును

ఇవిగాక యింక నేవైన నుండిన సభ్యులు ప్రతిపాదింప వచ్చును.

ఈవిషయ చర్చసభ 6-వ తేది రాత్రియందే జరపుట ముఖ్యము. 7-వ తేది యుదయమున విరామ ముండదు. దీని యందుఁ బాలుగొనఁగోరు సామాజికులు 6-వ తేది సాయం కాలములోపలనే జమ్ములపాలెము చేరవలయును అక్కడ జేరిన సామాజికులలోఁ బ్రముఖుని నీసభకు నగ్రాసనాధిపతిగా నెన్నుకొనవచ్చును. హతవాదముగాని శరవాదముగాని పనికి రాదు. సమాజయోగక్షేమములే యేకోద్దేశ్యముగా నుండవల యును ఆహ్వానసంఘమువారి యాహ్వానములు వచ్చినపిమ్మ టనే సభ్యులు ప్రయాణసన్నాహము చేయవలయును.

## సంజీవని చందాదారులకు విజ్ఞప్తి

ఈసంవత్సరము జనవరిసంచిక కొందఱకుఁజాల నాలస్య ముగవచ్చినదని కొందఱకు నింకను రానేలేదని యుత్తరములు వచ్చుచున్నవి డిశంబరు సంచికలో ఆనెల 30-వ తేదిలోపల మనిఆర్డర్లు పంపవలసినదిగా చందాదారులు ప్రార్థింపఁబడిరిగాని ౪౫ గురు తప్పఁదక్కినవారు ఆప్రార్థనమును నంగీకరింపరైరి. ఆకారణమున నందఱకు వీ పి లు పంపవలసినట్లు ఏర్పడెను. ఒంటిమిట్టఁ పోస్టాఫీసువారు దినానికి నేఁబది (౫౦) కి మించి తీసికొనమని నిరాకరించిరి ఆపిమ్మటఁ గొన్నినాళ్లకు బొత్తుగ మొదలేతీసి కొనమని నిరాకరించిరి. దీనికిఁదోడు వాను దాసుఁడు ఒంటిమిట్టయందు లేకుండుటయుఁ దటస్థించెను. ఈకారణముచే జనవరిసంచికలు మిగుల నాలస్యముగఁ బంప

వలసివచ్చెను పంపినవి ౩౦౦ త్రిప్పి వేయబఁడెను. ఇది చందా దారులు చేసిన యుపకారము

ఇఁక నొంటిమిట్టయం దీపని చూచువాఁడో యేమని వ్రాయుదును. వాఁడు వచ్చిన మని ఆర్డర్లు తీసికొన సమర్థుఁడయ్యెఁగాని యది లెక్కలకు వ్రాయుటయందుఁగాని ఆప్రకారము పత్రికలు పంపుటయందుఁగాని సామర్థ్యము లేనివాఁడయ్యె. మొదటినెలకుఁ బంపినవారికి నావలిపత్రికలు పంపఁబడవయ్యెను ఈ ౧౦ నెలలుగా వాని యిష్టముచొప్పున రామరాజ్యమే లేను ఏలుచున్నాఁడు ఇవన్నియు నిప్పు డిప్పుడు బయటవచ్చుచున్నవి ఈలోపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తములు సంస్కారములు తరువాత యధావిధి యుత్తరక్రియలు జరుపవలసి యున్నవి ఇవి మే నెలలోఁగాని జరుగఁజాలవు కావున.

i. సంజీవనికి పైకమంపియును పత్రికలు బొత్తిగ రాని వారు

ii. కొన్నివచ్చి కొన్ని రానివారు

iii. మందరమునకుఁగాని పట్టాభిషేకమునకుఁగాని పైకమంపినవారు

iv. వీ పీలుగాఁ బుస్తకములు తెప్పించుకొన్నవారు.

వీరందఱు తామెంతెంత పైక మెప్పుడుపంపినది వివరముగ ఏప్రెల్‌లో వాసుదాసుని పేర వ్రాయఁ బ్రార్థితులు ఆ నెల మొదలు ఆయన సంచారముమాని యొంటిమిట్టయందే యుండును. నీ ఏప్రెల్ కుముం దీవిషయమై యొంటిమిట్టకు

వ్రాయవలదు. అట్లు వ్రాసినయెడలనవి స్వర్గము చేరునే కాని వాసుదాసునకు నందవు ఇదివఱకు జరిగినలోపములు చందాదారులు లోనగువారు క్షమింప బ్రార్థితులు.

ఇట్లు, సవినయముగ విన్నవించు,

దాసోహమ్,

వాసుదాసుఁడు

---

## సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవ దివ్యత్ములకు విన్నపము

ఉత్సవముచూచుటకు వచ్చెడువారికందఱకు ధనాభావముచే పందిళ్లు-పాకాలు-వసతులుఏర్పాటుచేయ వాసుదాసునకు సాధ్యపడదు కావున ధర్మాత్ములు స్వార్థముగను ధర్మార్థముగ పరులకును బందిళ్లులోనైనవి తమకుఁ దమవారికిఁ దామే యేర్పాటుచేసికొందురుగాక. గుంటూరుమండలమువారిట్లే చేయుచున్నారు.

ఇట్లు విన్నవించు,

వా సు దా సు ఁ డు.

# ప్రకటన.

మంచితరుణము! మించిన దొరకవు!!

## ఆంధ్ర నాటకములు.

| | | రూ. | అ. | పై |
|---|---|---|---|---|
| 1. | శకుంతలా దుష్యంతము - - - - - | 0 | 6 | 0 |
| 2. | సుగ్రీవ పట్టాభిషేకము - - - - - | 0 | 10 | 0 |

పద్యగద్యముల చేతను, సందర్భానుసారములగు పాటల చేతను జదువరుల కానందదాయకములై యున్నవి. నీతులను సహాబోధించును.

| | | | | |
|---|---|---|---|---|
| 3. | కథామంజరి - - - - - - - - | 0 | 6 | 0 |

వచనము, సులభశైలి, ఇందు బలిచక్రవర్తి, గరుడ, భీష్మ చరిత్రములు గలవు. పితృభక్తి, మాతృభక్తి, పతిభక్తి మొదలగు విషయములను బోధించును స్త్రీలు పురుషులు చదివి తీరవలయును. సుగ్రీవపట్టాభిషేకము, కథామంజరి ముఖ్యముగా రామకథాకాలక్షేపము చేయువారికి సహాయముగా నుండును.

శ్రీకోదండరామ సమాజసభ్యులకు మాత్రము పోస్టు ఖర్చులు లేవు. వలయువారు వెంటనే వ్రాయుఁడు.

అడ్రెస్. కస్తూరి సుబ్బారావు.
అనంతపురం.

శ్రీరామ.

# భక్తి సంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయం గున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు.

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బారాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ | పై |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములుగా మును పటికంటె జక్కగా సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ. | అ | పై |
|---|---|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

భక్తిసంజీవని ౧౯-౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧-౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co, Printers Triplicane High Road

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధా ధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడంచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక ౦ ౪ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ | అ. | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుఱ్ఱా సిద్దయ్యగారు, జమ్ములపాళెము .. | ౪౦౦ | ౦ | ౦ |
| **రక్షకులు** | | | |
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |
| **పోషకులు** | | | |
| -రా-శ్రీ, సి దొరసామినాయఁడుగారు మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట.

వాసుదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు.




# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక
ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును
విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁ బొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు

సంపుటము ౨ | ప్రమోదసం॥ చైత్రమాసము ఏప్రెల్ నెల ౧౯30 సం॥ | సంచిక ౪.

మ. విమలప్రజ్ఞులు వాసుదాసువిహితుల్ వేతేరఁ దీర్థంబులన్
ప్రమదారత్నసమర్పితాభరణవారాలంకృతాంగుండవై
సకిలాధీశులు గొల్వ భూమిసుతతో సామ్రాజ్యపట్టాభిషే
కమహంబుం గొను మొంటిమిట్టనగరౌకా రామచంద్రప్రభూ.

## ఆంధ్రవాల్మీకిగారి గ్రంథములు కొనఁగోరువారి కిది మంచిసమయము

### మందరము

శ్రీసీతారామ కరుణాకటాక్షవీక్షణమునను, నాప్తులయు భక్తులయు భక్తురాండ్రయు శ్రీకోదండరామసేవక సమాజ సభ్యులయు సభ్యరాండ్రయు సాహాయ్యమునను, శ్రీరామ సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవ సముద్రమున మునుఁగకఁ బుణమకరములచే మ్రింగుడుపడక, తీరముచేరు భాగ్యముగలిగ నేని వాసుదాసుఁడు సంచారము కొంతకాలముమాని మందర రచనకుఁబూని ప్రమోదూతయందలి విజయదశమినాఁడు బాల కాండము ముద్రణము నారంభింప సంకల్పించినవాఁడు-విపరీత మైనచో విపర్యయమగును అప్పు డపరాధి దైవమే

ఈ ముద్రణము ప్రారంభించుటకు నధమపక్షము ౨౫౦౦-౦-౦ లు అయినను జేతనుండవలయును. పద్యములు వ్యాఖ్యానముతోఁడ ముద్రింపఁబడును నైవేద్యమునకు స్వామికి నెలకు ౧-౦-౦ వంతున మూఁడుసంవత్సరము లిచ్చువారికి ముద్రితగ్రంథము వెంటవెంబగాఁ జేరుటకై ౦-౮-౦ లకు వీపిగా క్షేమము పంపఁబడను గ్రంథమంతయు ౧౨ భాగము లుగా ముద్రింపఁ దలంపుగలదు ప్రతిభాగము వెల రమారమి 3-౧-౨ లుండును మందరప్రకటనమునకై ధర్మార్థముగ విరాళ మొసంగినపుణ్యాత్ములు నామధేయములు భక్తిసంజీవనియందే గాక శ్రీరామాయణ ముఖపత్రమందును బ్రకటింపఁబడును

నష్టికష్టములు కోర్చియయిన సంకల్పప్రకారము ముద్రణము సకాలమునఁ బ్రారంభించుటకుఁ గావలసిన ధనమునిమిత్తమై వాసుదాసుగ్రంథములన్నియు వెలలు తగ్గించి బ్రహ్మోత్సవ కాలంబున నొంటిమిట్టయందు విక్రయింపఁబడును.

ఆంధ్రవాల్మీకిరామాయణము మునుపటివెల  ౮-౦-౦
ఇప్పటివెల  ౬-౮-౦

తక్కిన గ్రంథములన్నియు ౦-౧-౦ వెలకుఁబైపడిన భక్త కల్పద్రుమశతకము వాసుదాసకీర్తనలు తప్ప ౧-౧-౦ కు ౦-౪-౦ వంతునఁ దోసివేసి యియ్యఁబడును. ఇట్లు ౨౫౦౦-౦-౦ లు పూర్తియగునటుకుమాత్రమే విక్రయింపఁబడును ఆవల మును పటివెలలే కావలసినవారొంటిమిట్టకు వాసుదాసునకే వ్రాయ వలయును ఈ వెలలమీఁద కమిషన ఇయ్యఁబడదు

---

ధనుర్విద్యావిలాసము.

సంక్రాంతిపాడు గ్రామనివాసులయిన మహారాజశ్రీ, సామంతపూఁడి గామభద్రరాజుగారు పూర్వమస్మనుఁడు చూపిన ధనుర్విద్యయందలి నేర్పులన్నియు బ్రహ్మోత్సవకాలమున నొంటిమిట్టయందొకనాఁడు కనఁబఱుప దయయుంచి యంగీకరించినారు, క్షత్రియులమనుకొనువారు తమ కులవిద్య యెట్టిదో యాసమయమునఁ జూచియైనఁ దెలిసికొని,

ఎలువిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిరాదు గువ్వలచెన్నా.

యనువాక్యము స్మరించి కులోచిత విద్యనభిమానించి నేర్చుకొని క్షత్రశబ్దమును సార్థకపఱుచుకొందురుగాక.

### శ్రీకోదండరామసేవక సమాజసభ్యులకు విజ్ఞప్తి.

ప్రతిసంవత్సరము నొంటిమిట్టయందు జరుగు నీ వార్షికోత్సవ మీ సంవత్సరమందును బ్రహ్మోత్సవకాలమందు ననుకూలములైన మూఁడు దినములందు జరుపఁబడును ఉత్సవకల్లోల మెట్లుండునో తెలియదు కావున దినములు నిర్ధారింప సాధ్యపడ లేదు. మూఁడవదినము స్త్రీలసభ జరుగును.

ఈ వార్షికోత్సవమందుఁ జాలముఖ్యములై సభ్యులచే నిండుమనస్సుతో నాలోచించి తీర్మానింపవలసిన విషయములు చర్చకువచ్చును కావున సంఘసభ్యులు సభ్యురాండ్రు తప్పక యీనారి యొంటిమిట్టకు దయచేయవలయును పోతనజయంతియు జరుపఁబడును ఈ సభయందు బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ॥ కొండముది నరసింహశర్మగారు పోతన నివాసస్థానమునుగుఱించి యుపన్యసింతురు ఈ విషయమై వారెక్కువ కృషి చేసి స్థలములన్నియు దర్శించియున్నారు ఒంటిమిట్టకు వచ్చువారు తమ తమ శ్రీరామకోటులను నొంటిమిట్టకుఁ దెచ్చెదరుగాక.

### దోషైకదృక్కులకు దోషజ్ఞులకు విన్నపము

సంజీవనీ సూక్తులయందుఁగాని వాసుదాసుని చర్యయందుఁగాని కార్యాచరణమందుఁగాని సందేహములుగలవారు దుశ్శ్రుతముల ననృతముల వ్యాపింపఁజేయువారు నొంటిమిట్టయందు జగగు సభలయందుఁ బ్రశ్నించిన యెడల వాసుదాసుఁడు తగిన ప్రత్యుత్తరముల నీయఁగలఁడు సత్యమై న్యాయ్యమైన దోషములను బహిరంగముగఁ గాని యంతరంగమునఁ గాని

తెలుపువారికి కృతజ్ఞుఁడై నమస్కరించి తనదోషములను సవ
రించుకొనఁ గలవాఁడు.

హెచ్చరిక.

గతసంచికయందు నొంటిమిట్టకు వచ్చుపోవు పొగబండ్ల
కాలక్రమము ప్రకటింపఁబడెను గాని మార్చి ౧-వ తేదినుండి
యది మాఱిపోయినది. కావున విచారించి వారివారికి సుకర
మైనవిధముగఁ బ్రయాణము చేయవలయును

—చందాదారులకు విన్నపము—

సంజీవనివిషయమై యొంటిమిట్టయందలి కార్యనిర్వా
హకునివలనఁ గలుగు నక్రమములగుఱించి గతసంచికయందు
విన్నవించుకొనియుంటిని కొందఱకు వీ పీ లు రెండేసిమార్లు
వచ్చినటుల నాయందలి దాక్షిణ్యముచే వారు రెండును
గ్రహించినట్లును కొందఱకు పత్త్రికలే పంపఁబడనట్లును దెలియ
వచ్చుచున్నది.

ఒక సంవత్సరమునకు రెండుమార్లు వీ పి నెవరుగ్రహిం
పవలసినపనిలేదు వారివారివిషయమునఁగాని వారివారిమి
త్త్రులవిషయమునఁగాని జరగిన యెట్టిలోపమైనను వాసుదా
సుఁడు సవరింపసిద్ధపడియున్నాఁడు. ఆవిషయమై యెవరును
మనసునొచ్చుకొనవలదనియు ౧౯౨౯ జూన్ మొదలు ౧౯౩౦
ఏప్రిల్ వఱకు జరగిన యన్నిలోపములను వారువారే కారా
ణముచేనైన నెంతమొత్తము నొంటిమిట్టకుఁ బంపినది తెలుప
వలయుననియు సవినయముగఁ బ్రార్థించుచున్నాఁడు. పైకము

పంపికాని పంపక కాని పత్రికలు పుస్తకములు పంపఁగోరినవారి కిఁ బత్రికలు పుస్తకములు రావయ్యేనేని వారును దయయుంచి తెలుపుదురుగాక తగనివాని నేర్పాటుచేసిన దోషము వాసుదాసునిదే కావునఁ జందాదారుల కెట్టినష్టిప్రాప్తించినను దానినిభరింప వాసుదాసుఁడు బద్ధుఁడైయున్నాఁడు. కావున నొంటిమిట్టకువచ్చు స్త్రీలు పురుషులు వారివారికి కలిగిన లోపముల దయయుంచి తెలుపుదురుగాక యని పొరింబొరి ప్రార్థించుచున్నాఁడు. తక్కినవా రుత్తరముల మూలమునఁ దెలుపుదురుగాక. చందాదారు సంఖ్య తెలుపక వ్రాసిన నుత్తరమిచ్చుట యందాలస్యమగును.

ఈవిషయమును సంజీవనీపాఠకు లంజలిఘటింపఁ దెలుపఁ బ్రార్థించుచున్నాఁడను.

వాసుదాసుఁడు

## సమాజసభ్య నామధేయ ప్రకటనము

కొందఱుసభ్యులు తమ గ్రామమందుండు సభ్యులెవ్వరో తమకుఁ దెలియలేదనియు, నట్టివారి నామధేయములను దెలిసిన నందఱుగలసి కార్యములు చేయ ననుకూలపడుననియు వ్రాసియున్నారు. కావున మే నెలనుండి సభ్యుల నామధేయములు, మండలము, తాలూకా, గ్రామము, వర్ణము, సోపాన సంఖ్య, సభ్యసంఖ్య సమాజమందుఁ జేరిన తేది తెలియునట్లు క్రమక్రమముగ ముద్రింపఁబడుచుండును.

---

## దేవతలవలన మనుష్య స్త్రీలకు సంతానము కలుగుటకు నూతన సులభోపాయము.

నిరపాయము - అపూర్వము - అభినవము - నైనమార్గము ప్రజాపతి యనుగ్రహముచేఁ ఒకానొక హనుమదుపాసకునిచేఁ గనిపెట్టఁబడినది ఇఁక బిడ్డలకై స్త్రీలు శనివారములు - వ్రతములు - తీర్థయాత్రలు - ఉపవాసములు - యంత్రములు - మంత్రములు - తంత్రములు నన్నియు నకలిపెట్టవచ్చును తనుకు బిడ్డలు పుట్టింపలేని మగలకు రాజీనామాలు పెట్టవచ్చును

ఒక గ్రామమునకు హనుమదుపాసకుఁడొక బ్రాహ్మణుఁడు వచ్చెను ఆయన మహానుభావుఁడని యెంచి యొక యాయన యొద్దకు నొకయత్తకోడలితోడ పోయి కోడలికి సంతానము గలుగ రక్షరేకు నిమ్మనికోరెను సంతానము కావలసియుండిన నేనిరువదిదినములు మంత్రజపము చేయవలెను అనిచెప్పి దానికిఁ గావలసిన ద్రవ్యము తీసికొని కడుపారభజించి యిరువదిదినము లయినతరువాత నత్తను గోడలిని బిలిచి నేఁటిరాత్రి హనుమంతునితో నాకుఁ దన్మయత్వము కలుగును నామీఁద హనుమంతుఁడా వాహనమగును అప్పుడు నీకోడలా యూంజ నేయునితోడ సంభోగించెనేని హనుమంతు నంతటివాఁడు కుమారుఁడు పుట్టునని యా యుపాసకుఁడు చెప్పెనఁట

ఆవల జరగినచర్య చెప్పవలసిన పనిలేదు ఆపుట్టెడు కొడుకు తోఁకతోడఁ బుట్టునో తోఁక లేకయే పుట్టునో హనుమదుపాసకుఁడు చెప్పినవాఁడుగాఁడు భవిష్యజ్ఞానము లేనిసంజీవనియుఁ జెప్పఁజాలదు

ఇప్పుడు మర్త్యలోకముల నొక గందరగోళము పుట్టినది ఒంటికన్ను, సగముముక్కు, ఒంటిచన్ను, ఒంటితొడగల పార్వతిమీఁద శివునకు జుగుప్సతోఁచినది దానివలనఁ గొందఱు మనుష్యులమీఁద నావాహనమై పూర్ణస్త్రీలతో సంభోగింపఁ బోవనున్నాఁడు గోకులమందు బృందావనమునఁ జేతికిదొరకిన వయస్సు గొల్లపిల్లల ననుభవింపక విడిచితినిగదా నాకంటె లబ్ధనాశుఁడెవఁడు? ఆకొఱఁత నెట్లు తీర్చుకొందునా యని వైకుంఠమందు కేశవుఁ డాలోచించి యెవరిమీఁద నావేశింతమా యని యోజించుచున్నవాఁడు అపుత్రస్యగతిర్నాస్తి యని శాస్త్రవాక్యముకలదు గదా ఈస్వరూపముతో సంభోగింప నాయొద్ద కే స్త్రీవచ్చును కావున నేమనుష్యుని మీఁద నావహించి నావంటికొడుకులఁ గందునా యని విఘ్నేశ్వరుఁ డాలోచించుచున్నవాఁడు.

ఇట్టులే శంకర వాహనము, శునవాహనము, భైరవ వాహనము బకాసుర కుంభకర్ణులు తమసంతానము మనుష్యుల యందు విస్తరింపఁజేయు నాలోచనలు జరగుచున్నవి కంసుని యాజ్ఞప్రకారము తనజన్మకాలమునఁ గూయక తన ప్రాణము రక్షించెనని కృష్ణుఁడుసంతోషించి నీకేమివరము కావలయునని కాపభూపతినడిగనఁట నాకు మనుష్యస్వరూపమున మానవ స్త్రీలయందు సంతానము కలుగ ననుగ్రహింపుమని యతఁడు వేఁడెనఁట కలియుగంబున నట్టులే యాఁగాక యని శ్రీకృష్ణ భగవానుఁడు వరమిచ్చెనఁట ఈ దేవరహస్యములు నారద

సాహూర్తి సంజీవనీదేవతకుఁ దెలిపెను. వీరందఱు నేదేశమునఁ బుట్టుదురని సంజీవనీదేవత యడిగెనఁట. ఇంతటిభాగ్యము మఱియే దేశమునకుఁగలుగదు నునకు ముఖ్యమైన యంధ్ర దేశమునందే యట్టి దేవతలకుఁ దగిన స్త్రీలు యందు జనించి యట్టి సంతానము వదలి యాంధ్రమాతను బవిత్రను జేయుదు రని చెప్పెనఁట ఇఁక నొడ్డుగాలుకూడ ఉపాసకుల నుహిమ చే దేవతలకు బిడ్డలను గనును

అభినవనారదుఁడు.

---

శబరి.

(గతసంచికాశేషము ౧౩౯ పుట చూడుఁ)

శిష్యలక్షణము

ఇది కొంత మేలుకొలుపునందుఁ జెప్పఁబడినది అయి నను మరలఁ గొంతచెప్పవలసి యున్నది

శ్లో॥ సద్బుద్ధిస్సాధుసేవీ, సముచితచరిత, స్తత్త్వబోధాభిలాషీ,
శుశ్రూషు, స్త్యక్తమానః, ప్రణిపతనపరః ప్రశ్నకాలప్రతీక్షః
శాంతో, దాంతోఽన
నూయు, శ్శరణముపగత, శ్శాస్త్రవిశ్వాసశాలీ,
శిష్యః, ప్రాప్తఃపరీక్షాం, కృతవి, దభిమత, స్తత్త్వ
తశ్శిక్షణీయః

అర్థము.

సద్బుద్ధిః=మంచిబుద్ధిగలవాఁడు. చెప్పినవిషయమును జక్కఁగాగ్రహించుశక్తిగలిగి సాత్త్వికమైన మనస్సుగలవాఁడు.

సాధుసేవీ=సాధువుల సేవించినవాఁడు. జ్ఞానవృద్ధులు సదాచారవృద్ధులు నగువారియొద్ధనుండి వారిసేవసేయుచు వారు చెప్పువిషయములు శ్రద్ధాభక్తులతో వినుచు, వారియాచార మును గనుచు లోపమున్నయెడలఁ దన నడవడి సవరించు కొనువాఁడు శ్రేయస్కాముసకుఁ బ్రథమసోపానము సాధుసేవ.

సముచితచరితః=గురువుపట్లఁ - బెద్దలపట్ల - విజ్ఞులపట్ల - సమానులపట్ల, నెట్టిమర్యాదతో వర్తింపవలయునో యదియె ఱెఁగి భయభక్తులతో వినయ విధేయులతో స్నేహభావముతో వర్తించు వాఁడు

తత్త్వబోధాభిలాషీ=ఈశ్వర జీవ ప్రకృతుల వాస్తవరహ స్యమును సలక్షణముగ సప్రమాణముగఁ దెలిసికొనుటయందు మిక్కిలి కోరికగలవాఁడు.

శుశ్రూషుః=గురువుచెప్పినది వినుటయం దాసక్తిగల వాఁడై యాప్రకారము నడుచువాఁడు.

త్యక్తమానః=లజ్జాభిమానములు వదలినవాఁడు ఇత రులుచూచుచుండఁ దనగురువునకో తల్లి దండ్రులకో పెద్దలకో చేయుసేవ (కసవుచిమ్ముట నీళ్లుమోయుట అలుకుట పాదము లొత్తుట) లోనగు కార్యములనుజేయ బిడియపడుటలేనివాఁడు నేనింతటిగొప్పవాఁడనే ధనికుండనే అధికారముగలవాఁడనే బలముగలవాఁడనే దేశప్రభువనే గొప్పవిద్యావంతుఁడనే నన్ను వీఁడు నేలఁగూర్చుండుమనెనే నాకీయల్పకార్యము చేయుమని చెప్పెనే నాగౌరవమెంచఁడాయెనే నేలఁగూర్చుండిన నాచలువ

ద్రోపతి మాయునే నేలఁబసుండిన దేహము ధూళియగునే యని
యిట్టిదురభిప్రాయములు లేనివాఁడు.

ప్రణిపతనపరః=సాష్టాంగ నమస్కారము చేయుట యందు
నాసక్తిగలవాఁడు బోరగిలఁబడిన దేహమునకు మట్టియగునే
యెట్లుపడుదునా యని రెండుచేతులు జోడించి కుడిభుజము
మీఁదనో యెడమభుజము మీఁదనో యుంచువాఁడు కాఁ
గూడదు ముసుఁగులోఁ జేతులు జోడించువాఁడును గాఁగూ
డదు. ఏవర్ణమువారైనను సమకంటెఁ దక్కువవర్ణమువారికి
నమస్కరింపరాదు

ఉచ్ఛిష్టము - సూతకము ఆశౌచము వీనితోఁ గూడిన
వానికిని, పరువెత్తువానికిని, ధనమదముగలవానికిని, చెట్టెక్కి
యుండువానికిని, అపరిశుద్ధునకు, బరువుమోసికొని పోవువానికి,
దూరమునందుండువానికి, తలంటుకొనియుండువానికి, విరుద్ధ
కర్మములు చేయువానికి, పతితునకు, భగవద్భక్తిలేని లేనివానికి
కర్మచండాలునకు నమస్కరింపరాదు భరద్వాజులు

శ్లో. పితాచ మాతాచ పితామహాశ్చ
జ్యేష్ఠః పితృవ్యః శ్వశురస్తథార్త్విక్
మాతామహోధ్యాపకమాతులాశ్చ,
మాన్యాస్సురేతే క్రమశోఽభివాద్యాః.
స్మృతిదర్పణము.

అర్థము

తండ్రి - తల్లి - తండ్రి తండ్రి - అన్న - తండ్రితోఁడఁబుట్టిన
వాడు - మామ_ఋత్విజుఁడు - తల్లితండ్రి వేదాధ్యయనము చేయిం

ఇది యంతేవాసియగు శిష్యునియందు నన్వయించును గాని భిన్నదేశములనుండు వారిపట్లఁ బూర్ణముగ నన్వయింపదు.

బుభుక్షువై సైవరుఁడగు శంబుకునకు, ముముక్షువై శాస్త్రబద్ధయగు శబరికిఁగల తారతమ్యమెఱిఁగి వారివిషయమున నజ్ఞలోకము దుఃఖప్రాయములు మానునుగాక.

—— ప్రశ్నోత్తరములు ——

ప్రశ్న — ధర్మరాజు దేహముతో స్వర్గమునకుఁ బోయెఁగదా. అట్టులే శంబుకుఁడు పోయినచేమి దోషము

ఉత్త — ధర్మరాజువలె యోగీశ్వరులు మునులు స్వర్గమునకుఁ బోవుటగలరని ముందే చెప్పఁబడెను శంబుకుఁడు కోరిన వట్టి రాకపోకలుగావు వాఁడుకోరినది దేవత్వప్రాప్తి. మనుష్యదేహముతో దేవత్వమురాదు.

ఇప్పుడు కొందఱు హిందువులు అమెరిక ఇంగ్లాండు దేశములకుఁ బోవుచున్నారు మనము నల్లనివారమని కొన్ని దేశములవారు మనలను దమదేశమునందు నడుగు పెట్టనీయకున్నారు రానిచ్చువారుకూడ మనల నీచదృష్టిఁ జూచుచున్నారు హిందువెంత విద్యావంతుఁడు. సమర్థుఁడు ప్రముఖుఁడైనను ఆంగ్లదేశమునకుఁ బోవచ్చును రావచ్చునేకాని యక్కడ నెన్నిసంవత్సరములుండినను ఆంగ్లజాతివాఁడు గానేరఁడు దేహతత్త్వములు సమముగానుండు నీలోకమందే యిట్టి భేదములు గానవచ్చుచుండ దేహతత్త్వములే భేదించిన భిన్నలోకముల

కట్టిమత్యాదయుండుట వింతగాదు ప్రకృతి విరుద్ధమునుగాదు ధర్మరాజు దేహము విడిచినప్పుటనే దేవత్వమును గాంచెను.

## జమ్ములపాళెము సభలు.

శ్రీకోదండరామసేవక సమాజముయొక్క ద్వితీయ గుంటూరుమాండలికసభ ౧౯౩౦ సంవత్సరము, మార్చి నెల ౭-౮-౯ తేదిలను బాపట్లతాలూకా జమ్ములపాలెములో జక్కఁగ జరుపఁబడినది. ఈసభ నాహ్వానించిన ప్రముఖులు సమాజ సభ్యులు కాకున్నను, కేవలభాగవత సేవారతులును, ఏతత్సమాజస్థాప నాచార్యులగు శ్రీవాసుదాస స్వామివారియెడల నత్యధికభక్తియుతులును, సమాజహితైషులును నభిమానులునని వేఱుగఁ జెప్పవలసిన పనిలేదు. సభాసందర్శనాభిలాషులై చనుదెంచిన సభ్య, సభ్యేతరులయెడ వీరు చూపిన యాదరణము ప్రశంసనీయము ఈసభకధ్యక్షులు మ-రా-శ్రీ, ఎ ఎల్. నారాయణరావు నాయఁడుగారు వీరు సమాజసభ్యులు. ఈసభాకార్యక్రమమును ఆహ్వానసంఘమువారు చాల నేర్పుతో శాంతముగ నిర్వర్తించిరి. వీరికిసమాజసభ్యులందఱు కృతజ్ఞతాసూచక వందనము లర్పించుచు మా శ్రీసీతారాముల కృపామృతరస ప్రవాహము వీరిహృదయకేదారములఁ బ్రవహించి భక్తిసస్య ప్రవర్ధనకరమై యలరారుటకై యాశించుచున్నారు. వారు సమాజమువారి కర్పించిన స్వాగత పంచరత్నముల వేఱొకచోట ముద్రించుచున్నాము. సభకు గుంటూరు

మండలమందలి వివిధ ప్రాంతములవారు సుమారు ౨౫౦ పురు
షులు స్త్రీలు వచ్చిరి కృష్ణా, నెల్లూరు, కడపమండలములనుండి
కొలఁదిమంది మాత్రము సభ్యులువచ్చిరి సభ్యులందఱు పర
మోత్సాహముతో భగవద్గుణభజన ప్రసంగములతోఁ గాలము
పుచ్చిరి కార్యక్రమము కొద్దిమార్పులతో జరిగినది మ-రా-
శ్రీ, మధుర రంగారెడ్డిగారు, గుంటూరుమండలమున శ్రీవాసు
దాసా శ్రమమొకదానిని నెలకొల్పుట వసరమని యొక తీర్మాన
ముపపాదించిరి సభ్యులలోఁ జాలమంది యామోదించిరికాని
శ్రీదేశికస్వామివారొక హితోపదేశము గావించిరి

“మీరు వ్యయప్రయాసములకోర్చి మందిరములను గట్టిం
చెదరు వాసుదాసుఁ డెన్నిచోట్లకైనారాఁ గలఁడు అది చిర
స్థాయిగానుండుటయెట్లు? ఇందు కష్టమెక్కువ ఫలముతక్కువ.
కావున నిజముగ మీకు గురువునందు భక్తిగలదేని ప్రతి
సభ్యుఁడును, ప్రతిసభ్యురాలును నాయుపదేశమును గైకొని
యనుష్ఠించి మీ హృదయములనే వాసుదాస సదనములుగ
మార్చివేయుఁడు అప్పుడుగా సర్వసభ్య హృదయాంతర
వర్తియయి వాసుదాసు విరాజిల్లఁగలఁడు అప్పుడుగదా మీనిశ్చల
మగు గురుభక్తి విశదపడును” అని 7-వ తేది సాయంకాలము
4 గంటలు మొదలు 7 గంటలవఱకు సమాజోద్దేశములు నియ
మములునుగుఱించి యామూర్తి సుబ్బదాసుఁ డుపన్యసించెను.
బ్ర.శ్రీ వంగిపురపు భద్రాచలపతిదాసుగారు,గంగవరపు వేంకట
రాయశర్మగారు, కుందుర్తి వేంకటనరసయ్యగారు మున్నగువారు

వివిధవిషయములను గుఱించి ప్రసంగించిరి. వీని వివరము రాఁగల సంచికలు మీకుఁ దెలుపఁగలవు ముక్తియననేమి? సిద్ధాసనమెట్టిది? అను మొదలగు అనేక ప్రశ్నలు శ్రీవాసుదాస దేశికస్వామివారిని సమాజసభ్యులు అడిగిరి. వారి అనుభవపూర్వకమగు సమాధానములు సభాసదులనందఱ విస్మయహర్షమనస్కులఁ గావించెను. కేవల శిశ్నోదరపరాయణులగు శుష్కవేదాంత మాయాయోగ, కపటసన్న్యాస క్రూరసత్త్వములకు వాకట్టుమంత్రములయినవి శ్రీ వాసుదాసస్వామివారి సమాధానములు మూఁడవదిన ముదయమున స్త్రీలసభ జరిగినది సాయంకాలమున అధ్యక్ష్యకోపన్యాసము కేవల గురుభక్తి పూరితవాగ్రత్నములతోఁ గూడి సభాసదుల యామోదమును బడసినది.

రాఁబోవు మాండలికసభను తిరిగి యాగ్రామమునందలి ఊట్లసుబ్బయ్యగారు మొదలగువారు ఆహ్వానించిరి కొంతమంది ఇదివఱకు సభనాహ్వానించినవారిపై కక్షచేఁ బిలిచిరని యభిప్రాయపడిరి. ఇతరు లభిప్రాయడినట్లు వీరు కక్షకుఁ బిలిచినవారని మాయభిప్రాయముకాదు. కోక పోటీకే పిలిచిరని యభిప్రాయపడినను సత్కార్యాచరణమున మచ్చరముపూనుట మేలెగాని కీడుగాదు శ్రీఅంబరీషుని రాజ్యమున ప్రజలు మచ్చరము హరికైంకర్యమం దవహించి యుండిరని భాగవతమున వ్రాయఁబడినది కాఁబట్టి ఇట్టి స్పర్ధసర్వశుభదాయిని యనుటకేమాత్రము సందియము లేదు. వీరికి శ్రీసీతారాము లుత్సా

హామును, శక్తియు, సంతోషాయు రారోగ్యములఁ బ్రసాదించు టకు సభ్యులందఱు కుతూహలులై ప్రార్థించుచున్నారు

సభాంతమున శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేక కార్యమునకై సభ్యు, సభ్యేతరులు వస్త్ర, ధనాదికములు సుమారు యేడెనిమిదివందల రూప్యములదాఁక సహాయ మొనర్చిరి

౧౦ వ తేది దినము (నాల్గవదినము) శ్రీవాసుదాస దేశికేంద్రులవారితో [illegible] సాహాయ్యసంఘము [illegible] లు మున్నగు వారు భాగవతపటమును వేయించుకొని [illegible] హములకు శ్రీదేశికేంద్రులవారిని పిలిచికొనిపోయి యుచ్చాసనాసీనుఁగావించిరి. వీరికి శ్రీదేశికేంద్రులవారియెడఁ గలభక్తి వర్ణనాతీతము ఏంకి భాగవతసేవా భాగ్యము నిరంతరము చేకూరునుగాక.

ఇట్లు విన్నవించు —

శిష్యపరమాణువు, సుబ్బదాసుఁడు.

గుంటూరుమండలిక శ్రీకోదండరామసేవక సమాజ ద్వితీయవార్షికోత్సవ సందర్భమున జమ్ములపాలెము చెఱువు గ్రామప్రజలు సమర్పించు స్వాగత పంచరత్నములు.

శా॥ శ్రీనర్ధిల్ల సమస్త భక్తజన సంసేవ్యుండు మారాధితా।
గోవిందుండు చిరాయురున్నతులు శ్రీకోదండరామాం
ఘ్రి సే।వావిస్ఫూర్తియు వాసుదాస పదవిశ్వాసంబు
మోహైక యో।గావిర్భావముఁగూర్చి బ్రోచుతను మి
మ్మాచంద్ర తారార్కముల్॥ ౧

చం అనిశము బంధుమిత్రవనితార్థ విలాసవిశేషమత్తులా। జన
ములఁ బ్రోవనాంధ్రవని జన్మము నొందియు రామనామ
పా। వనమధురామృతంబు భవబంధవిమోచనమంచుఁ
జాటనో। పిన గుటివాసుదాసునకుఁ బ్రీతినొసంగెడు స్వాగ
తంబిదే॥ ౨.

సీ. స్వాగతంబిదియె శ్రీజానకీరామ పా
దాంబుజ మత్తభృంగంబులార!
స్వాగతంబిదె యోగమార్గాంత జ్ఞాన
శాస్త్రనైపుణ్య విశాలులార!
స్వాగతంబిదె యాంధ్రవాల్మీకవాసుదా
సప్రబోధిత పథచారులార!
స్వాగతమిదె సంస్కృతాంధ్రాంగ్లభాషా ప్ర
శస్తాధికార పదస్థులార!
గీ. స్వాగతము దేశ భక్త విస్తారులార!
స్వాగతంబు పతివ్రతా జనములార!
ప్రథిత కోదండరామ సేవకసమాజ
సభ్యులార! మీకిదియె సుస్వాగతంబు. ౩.

మ. అరయన్ జాలితి భక్తిమార్గము మ
హాత్మా! మిమ్ములన్ బోలుధీ
వరులన్ బెక్కురఁగూర్చి లోకులుతరిం
పన్ జేయ స్వీయేతరాం

తరభేదంబులు లేని భక్తిమతముఁ
జాటంగనర్థిక్కులఁ
బహుపంగావలె సంఘగౌరవ మెల
ర్పఁ రామభక్తాగ్రణీ ౪

సీ. పటుతర బ్రాహ్మణ బ్రాహ్మణేతరపక్ష
దుర్వాదములు సేయఁదొడఁగు వేళ,
వేదశాస్త్రపురాణ విశ్వాసములఁగంటి
పాశ్చాత్యవర్తన ప్రబలు వేళ,
మతవిభేదముఁ బూని మతులెల్లఁ బోనాడి
పోరాటమును సల్పఁ బూను వేళ,
కాంచన కామినీ సంచయముఁ గోరి
గురునామధారులు పరఁగు వేళ,

గీ. జాగరూకులై వాదంపు, జాడఁబోక,
భక్తివిడక మతభేద, రక్తిఁగనక,
దొంగగురువులకూఁతల, భంగపడక,
భక్తిమతమును జాటుఁడీ, ప్రాజ్ఞులారా!! ౫

ఇట్లు విన్నవించు,
సుజనవిధేయులు,
కొలువు, జమ్ములపాలెము ప్రజలు.

## —శ్రీరామపరత్వము—

పూర్వసంచికా శేషము (౬౦౭-వ పుట చూడుఁడు.)

ఈదశయందు భగవంతుఁడు సృష్ట్యాదికార్యములు లేక యూరక యాకాశమువలెనై సర్వమును భరించియుండును. ప్రపంచ మేదశయం దున్నను నాకార్య మాయనకుఁ దప్పదు. ఇది మహాప్రలయము బ్రహ్మకు నూఱేండ్లు నిండినప్పుడు కలుగునది బ్రహ్మకొక రాత్రికాలమునఁ బ్రలయమగును. ఇది యవాంతర ప్రలయము. ఇందుపై మూఁడు లోకములు నీటమునుఁగవు

ఉ. సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడున్
సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుం డగుచక్రపాణి యీ
సర్వశరీరులున్ విగమసంగతిఁ జెంది విశీర్యమాణులై
పర్వినచో నభంబుగతి బ్రహ్మము దాఁ జెడకుండు నెప్పుడున్.

భగవంతుఁడు ప్రలయకాలమున వటపత్రశాయియై యున్నాఁడనఁగా నిరాశ్రయుఁడై యున్నాఁడని యర్థము భగవంతుని యాదశను జెప్పునపుడే యాయన నిరాకారుఁడని నిర్గుణుఁడని నిష్క్రియుఁడని చెప్పుదురు

ఈశబ్దములకుఁ గొందఱు విపరీతార్థములు చెప్పుచు న్నారు. వారిమాటలకు మీరు మోసపోవలదు నిరాకారుఁ డనఁగా నిర్దిష్ట మైనయొకయాకారము లేనివాఁడని యర్థము. అనఁగా మనుష్యుఁ డన్నప్పుడు మనకొకవిధమైన యాకా

రము మనస్సునకుఁ దోఁచును వృక్షమన్నప్పు డొకవిధమైన యాకృతి స్ఫురించును. బట్టయన్నప్పు డొకవిధమైన రూపు పొడఁగట్టును భగవంతుని యాకార మిట్టిదే యని యొక విధమైన యాకారము చెప్ప సాధ్యపడదు మీనముగా నున్న వాఁ డాయనయే కూర్మముగా నున్నవాఁ డాయనయే వరాహ ముగా నున్నవాఁ డాయనయే నరసింహమూర్తిగా నున్నవాఁ డాయనయే. మనుష్యస్వరూపముతో నుండినవాఁ డాయనయే. హంసగా నున్నవాఁ డాయనయే. ఇంకను దేశకాలోచితముగ నేరూపమైన ధరించువాఁ డాయనయే ఇట్టులుండ నేయా కారము భగవంతునియాకార మని చెప్ప నగును? కాఁబట్టి నిరాకారుఁడు నీటియావిరి కేది రూపము? అదియే నీళ్లై యా నీళ్లే మంచుగడ్డగా నగుట లేదా? ఆవిరి చేయుపని నీళ్లుచేయఁ గలవా? నీళ్లు చేయుపని మంచుగడ్డ చేయఁగలదా? కావుననే భగవంతునకు నైకరూపుఁ డనిపేరు కావునఁ గార్యముకొలఁది రూపము మేఘమునకు నీటికి గాలికి నాకాశమునకు నేవి రూపములు. ఇవి నిరాకారములు గావా? అశరీరో వాయు రభ్రం విద్యుత్ స్తనయిత్ను రశరీరా ణ్యేతాని॥ వాయువు ఆవిరి - మెఱుపు - మేఘము ఇవి శరీరములు లేనివని యుపనిష త్తులు పలుకవా? కావున నిరాకారుఁ డనఁగా శూన్యుఁ డని యర్థము గాదు.

విష్ణుసహస్ర నామములందు "అమూర్తి" యనియు "అమూర్తిమంతుఁ" డనియు రెండునామధేయములు గాన వచ్చుచున్నవి.

అమూర్తిశబ్దమునకు,

"స్థూలభౌతికమూర్తిభ్యో వ్యావృత్తో౽మూర్తి రుచ్యతే.
నిరు స్థూలపాంచభౌతికమూర్తి వంటిమూర్తిగలవాఁడు కాఁడని యర్థము.

అమూర్తిమంతుఁ డనుటకు,

శ్లో. అమూర్తిశబ్దేనోచ్యంతే హ్యవ్యక్తపురుషాదయః
త ఏవ యస్య స్వ మితి సస్మృత స్స్యాదమూర్తిమాన్

నిరు అమూర్తు లనఁగా నవ్యక్తపురుషాదులు. అవి యెవని సొమ్మో యతఁడు అమూర్తిమంతుఁడు.

అమూర్తిమాఀ న యస్యాస్తి మూర్తిః కర్మనిబంధనా॥

కర్మబద్ధ మైనయాకార మెవనికి లేదో యతఁ డమూర్తి మంతుఁడు

భగవంతుని నాకాశముతోఁ బోల్చుటచేతను, ఆకాశం గగనం శూన్య మ్మనియుండుటచేతను భగవంతుఁడు శూన్యుఁడే కదాయని కొందఱందురు.

ఆకాశశబ్దమునకు సర్వత్రప్రకాశించునది యని యర్థము అంతటఁ బ్రకాశించునది యని చెప్పినచోట నది శూన్యము (హుళిక్కి) యని యెట్లు చెప్ప సాధ్యపడును? సర్వత్రప్రకాశించునది యొకపదార్థమేకదా యగును పరమాకాశముమాట యటుండనిండు పంచభూతములలోఁ జేరినయాకార మైనను శూన్యమా?

శ్లో॥ భూమి రాపో నలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥
భ గీ ౭-౪.

భూమి - జలము - అగ్ని - వాయువు - ఆకాశము - మనస్సు బుద్ధి (మహత్తు) అహంకారము అని యెనిమిది విధములుగా నుండుప్రకృతి నాయదియే యని భగవంతుఁడుచెప్పెను పంచ భూతములలోఁ జేరినయాకాశము శూన్య మెట్లయ్యెను. శూన్య మొకదానికిఁ బుట్టుటయు మఱియొకదానికిఁ గారణ మగుటయుఁ గలదా? శూన్యమనఁగా నాస్తి యని యర్థము కాదు

పఠ్యాదులు - జలము - భూమి - అగ్ని - వాయువు సను భూతములందు నిరాఘటముగఁ బాడింటిలో నడ్డము లేక పిక్క దూటినట్టు ప్రవేశించుటకు సాధ్యముగాను ఆకాశమునం పట్టి యడ్డము లేదు కావున నది శూన్య మనఁబడును "నివార కాభావాత్ శునే హితం శూన్యం అడ్డపెట్టువాఁడు లేమిని శునకమునకు హితమైనది" యని శూన్యశబ్దమునకు వ్యుత్ప త్త్యర్థము

శూన్యశబ్ద భవమే సున్న ౦ దీనియం దాద్యంతములు (కొనమొదలు) లేవు ఇదిపూర్ణము కావున భగవంతుఁడు పూర్ణుఁడనియు నాద్యంతములు లేనివాఁడనియు నర్థము.

పంచభూతములోఁ జేరినయాకాశము జడము గదా భగ వంతునిజడ మందురా? అట్లైన సచ్చిదానందస్వరూపుఁ డను దానిగతియేమి?

కావున నిరాకారుఁ డనఁగాఁ గర్మకారణమై పాంచభౌతి కమై యీమనరూప మిట్టిదేకాని మఱియొకవిధమైనది కాదని నిర్ధారింప సాధ్యము గానివాఁడని యర్థము. ఇది యంతర్యా మ్యవతారమందలి స్థితి

పంచీకరణముప్రకార మైనను, పాశ్చాత్యుల ప్రకృతి శాస్త్రములఁబట్టి యైనను, బ్రతిపదార్థమందును నగ్ని గలదు. మంచుగడ్డయందును వేఁడిమి గలదు ఒకబండెఁడుకట్టెలు మీ యెదురనుంచెను. అందలియగ్నిచేఁ జలికాఁచుకొనెదరో నీళ్లుకాఁచెదరో వంటచేసెదరో చూతముకానిండు. అట్లే యంతర్యామి యైనభగవంతుఁడు జగద్ధారణమునకుమాత్రము చేయునుగాని తక్కినయేకార్యమును జేయఁడు సాకారుఁ డయి యే కార్యముచేయవలయును ఇట్లు సాకారుఁ డగుటకు నుపా సకులభక్తియే ముఖ్యకారణము కట్టెలయందుండి మంటను, పెరుఁగునుండి మథించి వెన్నను తీసినట్లు అంతర్యామియైన భగవంతుని భక్తిచే మథించిన మనయిష్టము నెఱవేర్పఁ దగు రూపమును ధరించి గోచరించును.

"తిలేషు తైలం దధినీవ సర్పి రాప స్స్రోత స్స్వరణీషు చా గ్నిః। ఏవ మాత్మాత్మని జాయతే సా సత్యేన తపసా యో నుపశ్యతి॥"

అర్థము. నూవులయందు నూనె, పెరుఁగునందు నేయి, క్రిందియూటకాలువలందు నీరు, అరణియందు నగ్నినెట్లుండునో

యట్లు తనయందుండు పరమాత్మను సత్యముచేతను, తపస్సుచేతను, నెఱఁగుమాచునో యది వానియందుఁ గానవచ్చును.

వాస్తవ మిట్లుండఁ గొందఱు మతిమాలినవారు సాకారము తక్కువని నిరాకార మెక్కువ యని తలంతురు కట్టెల యందుండు కానరాని యగ్నియే యెక్కుడో చుంటఁగాఁ గానవచ్చునగ్నియే యెక్కుడో మీరే చెప్పుఁడు. ఒకరు చెప్పనేల? భగవంతుఁడే యీవివాదమును బరిష్కరించి యున్నాఁడు. సాకారోపాసనము మేలా నిరాకారోపాసనము మేలా యీరెండు తెగల యుపాసకులలో నెవ్వ రుత్తమయోగులని యర్జునుఁడు శ్రీకృష్ణమూర్తిని బ్రశ్నింపఁగా సాకారోపాసకులే యుత్తమయోగు లనియు వీరికే స్వాభీష్టసిద్ధి భగవత్ప్రాప్తి తానే శీఘ్రముగ లభింపఁ జేయుదు ననియు నిరాకారోపాసకులకు నీఘలమే గలుగును గాని వారు విశేషముగ శ్రమింపవలసి యుండుననియు నాభగవంతుఁడు సెలవిచ్చెను. ఎట్లన —

శ్లో॥ ఏవం సతతయుక్తా యే, భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం, తేషాం కే యోగవిత్తమాః
భ గీ ౧౨-౧.

ఏవం=ఈవిధముగా,

అర్జునుఁడు శ్రీకృష్ణుని లీలామానుష వేషమును జూచెనే కాని భక్తు లుపాసించునట్టియుఁ బొందఁగోరునట్టియుఁ బరబ్రహ్మత్వాది విశిష్టాకారమును జూచినవాఁడుకాఁడు. ఇట్లుండఁ గృష్ణుఁడు తనవిభూతులను జెప్పుచు నది నేను ఇది నేను సర్వము

నేనని చెప్పఁగా నీయన యివన్నియు నెట్లయ్యె నని యర్జునుఁడు తెలియఁగోరి నీనిజస్వరూపమిదియో చూపుమని శ్రీకృష్ణునిఁ గోరెను ఏలన దేనినైనఁ గనులారఁ జూచినయెడలఁ గలుగు జ్ఞానము రుచి వినికిడిచేఁ గలుగఁజాలదు కాఁబట్టి నీవిశ్వరూప మును జూపు మని యర్జునుఁడు కోరెను అర్జునుఁడు శిష్యుఁడు-ప్రపన్నుఁడు-దీనుఁడై వేఁడుచున్నాఁడు కావున నధికారి య య్యెను ఇట్టివానికోరిక భగవంతుఁడు నిరాకరింపఁడు కావున సత్యసంకల్పుఁ డగుటచే నిజస్వరూపమును జూప శక్తిగలిగి యపారకరుణాపారావారుఁడు గావున విశ్వరూపమును జూపెను. చూపి,

శ్లో. నాహం వేదై ర్న తపసా,న దానేన నచేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం, దృష్టవానసి మాం యథా.
౧౧-౫౩.

అర్జునా! భక్తిలేక వేదాధ్యయనముచేయువారికిని, దప స్సుచేయువారికిని, దానముచేయువారికిని, యాఁగాదులుచేయు వారికిని, నిప్పుడు నీవు నన్నెట్లు చూచితివో యట్లు చూచుటకు సాధ్యముగాదు. అట్లైన నెవరికి సాధ్య మందువా?

శ్లో భక్త్యా త్వనన్యయా శక్య, అహ మేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన, ప్రవేష్టుంచ పరంతప. ౧౧-౫౪.

అర్జునా వినుము. అనన్యమైనభక్తిచేతనే యీవిధముగా యదార్థముగాఁ దెలిసికొనుటకుఁ, గన్నులారఁ జూచుటకుఁ, బరిపూర్ణముగాఁ బొంది యనుభవించుటకు సాధ్యపడుదును

అనన్యమైనభక్తి యనఁగా ౧. భగవత్ప్రాప్తి తప్ప మఱియొక ప్రయోజనము గోరనట్టిదియు ౨ భక్తి ప్రపత్తులు తప్ప మఱియొకయుపాయమును గోరనట్టిదియు ౩ భగవంతునియందుఁ దప్ప నితరదేవతలయం దుంచఁబడనట్టిదియు నైనభక్తి యని యర్థము ఏకప్రయోజనము, ఏకమార్గము, ఏకదేవతోపాసనము అనన్యభక్తిలక్షణము. ఇట్టిభక్తి నీకుఁ గలిగెనేని భక్తిచే సాధ్యమైన భగవత్స్వరూపజ్ఞానము ఆవల భగవత్సాక్షాత్కారము. ఆవల భగవత్ప్రాప్తి కలుగును కావున నర్జునా!

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో, మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు, య స్స మా మేతి పాండవ ౧౧-౫౫

నాకార్యములే చేయుము లేదా - నీవుచేయు శాస్త్రవిహిత కార్యములన్నియు నాకైంకర్యములుగానే చేయుము నీ వేకార్య మారంభించినను నన్నే పరమోద్దేశ్యముగాఁ దలంపుము. నాయందలిప్రీతిచే నాకథలే వినుట, యితరుల కవియే చెప్పుట, నన్నే ధ్యానించుట నన్నే స్తుతించుట, నాకీర్తనలే పాడుట నన్నే యర్చించుట, నాకే నమస్కరించుట నాసేవయే చేయుటలోనగు భక్తికార్యములు చేయుము నాభక్తులతోడి సాంగత్యము దప్పఁ దక్కిన పామరజనసాంగత్యము, ప్రాకృత సాంగత్యము వదలుము. సమస్తభూతములు భగవత్స్వరూపములు. భగవదాత్మకములు గావున నవి యేమి చేసినను భగవత్ప్రేరితములై చేసెనని తలంచుటచే దేనియందును విరోధభావము వహించుటకుఁ గారణము లేదు గావున దేనియందును

బగప్రూనక దయగలవాఁడై యుండుము ఇట్టుండు వాఁడు నన్నుఁ బ్రాపించునని బోధించెను ఇట్లుపదేశింపఁగా నర్జునుఁడు (ఏవం సతతయుక్తా యే యనుశ్లోకము చూచునది)

ఏవం=ఈవిధముగా (ఇప్పుడు నీవు చెప్పినట్లు) సతత యుక్తాః=ఎల్లప్పుడు నీ స్మరణ ధ్యాన దాస్య కీర్తనార్చనాదుల నీతోడి యోగము గలవారై, యేభక్తాః=ఏభక్తులు, త్వాం= నిన్ను, పర్యుపాసతే=పూర్ణముగా భజింతురో, అటుగాక, యేచ= ఎవరు, అవ్యక్తం=కన్నులు మొదలైన యింద్రియములకుఁ దెలియరాని, అక్షరం=శుద్ధాత్మ స్వరూపమును, (ఉపాసతే= ఉపాసింతురో) ఈయిరువురిలో, యోగవిత్తమాః=యోగమును (భగవత్ప్రాప్తిని) శీఘ్రముగా సులభముగాఁ బొందువా రెవ్వ రు? అని ప్రశ్నించెను. ఇరుతెగలవారికి ఫలము సమానము గావున నిష్టప్రాప్తియందు భేదములేదు కావున సులువుగాఁ జేయఁదగినదై శీఘ్రముగా ఫలమిచ్చుటచే శ్రేష్ఠమైనమార్గ మేది యని ప్రశ్న. ఈప్రశ్నమునకు భగవంతుఁ డిట్లు ప్రత్యు త్తర మిచ్చెను.

శ్లో॥ మయ్యావేశ్య మనో యేమాం, నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా, స్తే మే యుక్తతమా మతాః
భ గీ ౧౨

ఎవ్వరు నన్నే ప్రాప్యముగాఁగోరి నాయందు మనస్సుంచి, నిత్యసంబంధమును గోరినవారై మిక్కిలి శ్రద్ధ గలవారై నన్నుపాసించుచున్నారో వారే యోగవిత్తములని నాయభి

ప్రాయము. అట్లైన శుద్ధాత్మ నుపాసించువారికి ఫలము లేదా
యందువేమో? రెండవవారికంటె మొదటివారు వ్యర్థులని
నేను జెప్పలేదే

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ, కూటస్థ మచలం ధ్రువమ్
సన్నియమ్యేంద్రియగ్రామం, సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః ౧౨ ౪.

ఇంద్రియసమూహమును నిగ్రహించి, సర్వజీవకోటుల
యందు సమబుద్ధియు, సమస్తభూతములకు మేలు చేయుటయందే
ప్రీతియుఁగలిగి యెవ్వ రిట్టిదనినిర్దేశింప రానిదియు, నింద్రియ
ములకు గోచరింపనిదియు, దేవమనుష్యాది సమస్తదేహములం
దుండునదియు, నిట్టిట్టిరూపము గలదని చింతింపరానిదియు,
సర్వసాధారణమై యాకారములతో సంబంధము లేనిదియు, పరి
ణామవికారములు లేక యెల్లప్పు డేకరీతిగ నుండునదియు నిత్య
మైనదియునగు నాత్మస్వరూపమును ధ్యానించుచున్నారో వారు
కూడ నన్నేపొందెదరు అట్లైన నీక నొకరెక్కువ యేమి?
మఱియొకరు తక్కువ యేమి యందువా? ఫలమునం దెక్కువ
తక్కువలు లేవుగాని

శ్లో. క్లేశోధికతర స్తేషా, మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం, దేహవద్భి రవాప్యతే ౧౨. ౫

ఇంద్రియగోచరము గానిదానియందు నాసక్తిగల మనస్సు
గలవారికిఁ గష్టము మిక్కిలియధికమైనది ఏలనఁ బ్రకృతిసం

బంధ మైన దేహము గలవారు ప్రకృతిసంబంధములైన యింద్రి యములకు గోచరింపనిదాని గ్రహింపుట కష్టముగదా. దేహాభిమానము లవమైనఁ గలవారికి నాత్మసాక్షాత్కారము గలుగ దని భావము అట్టైన భక్తులమార్గము సుఖతరము శీఘ్రముగఫల మిచ్చునది యెట్లయ్యెనందువా? వినుము

శ్లో. యే తు సర్వాణి కర్మాణి, మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే
తేషా మహం సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరాత్పార్థ, మయ్యావేశితచేతసామ్ ౧౨-౬.

అర్జునా! కర్మములే చేయకుండుటకు నిమిషమైన నెట్టి వానికి సాధ్యముగాదు కావున దేహయాత్రకుఁ గావలసిన వృత్తికార్యములను, దేహధారణమునకుఁ గావలసిన యాహా రముగొనుట లోనగు లౌకికకార్యములను, సంధ్యావందనాది వైదికకర్మములను ఫలమునందాసక్తి లేక ఫలము నాకర్పణ చేయుచుఁచేసి, నేనే పరమగతి యని తలంచి, యనన్యమైన భక్తియోగముచే న న్నెవరు ధ్యానింతురో (ధ్యానమనుటచే స్తుతికీర్తనార్చన నమస్కారాదులును జేరుచున్నవి) సేవింతురో, అట్లు నాయందు మనస్సుగల వారలను శీఘ్రకాలమందే మృత్యుస్వరూపమైన సంసార సముద్రమున మునుఁగకుండ నేను లేవఁదీసెదను.

ఈషత్పాతము నీకేలయందువా? భక్తులు తను దేహము ప్రాణము ఇల్లు వాకిలి భూములు పుత్రులు పెండ్లామును బిడ్డలను ఇంతయేల చేతనాచేతనాత్మక మైన తన సర్వస్వము నాకు సమర్పించి యేఫలమును గోరక, ఫలము భారము నాయందు వైచి వేఱుప్రయోజనముగాని, వేఱుమార్గముగాని, వేఱురక్షకునిగాని గోరక స్వామునకు నేనే యుని, నన్నే నమ్మియుండురు గావున వారి నుద్ధరించు భారము నాయం దున్నది. కావున నాఋణమును నేను వేగిరము తీర్చికొనెదను,

అవ్యక్తోపాసకులో పాండిత్యబలముచే, స్వయంకృషిచేఁ, దమమేధాబలముచే, స్వశక్తిచే నుత్తరించువారు కాఁబట్టివారై నాయొద్దకు రాఁగలిగినప్పటికే గాని [illegible] నడవలేనిబిడ్డను తల్లి తానే యెత్తికొనిపోవును నడచి వచ్చెద నన్నబిడ్డను నడచి రమ్మనును ఇంతకు తల్లిదోష మేది గలదు? అట్లనే నేనును ''

ఆర్యులారా! భక్తులను నేనే యుద్ధరించెదనని భగవంతుఁడు పెక్కుసందర్భములఁ జెప్పియున్నాఁడు.

గీ. నన్నె కాని యన్య మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టివారి నైన

శ్లో. సత్యం బ్రవీమి మనుజాః స్వయ మూర్ధ్వబాహు
ర్యో యో మాం ముకుంద నరసింహ జనార్దనేతి
జీవన్ జప త్యనుదినం మరణే ఋణీవ
పాషాణకాష్ఠసదృశాయ దదామి ముక్తిమ్. నృసి. పుగా.

అర్థము మనుజులారా! స్వయముగ నేను జేయెత్తి సత్యము పలికెదను. జీవించియుండు సమయంబున నెవ్వఁడు ప్రతిదినము ముకుందా నరసింహా! జనార్దనా! యని నన్నుఁ బలుమారు స్మరించునో జపించునో యట్టివాఁడు మరణసమయమున స్మృతిదప్పిపాషాణమువలెను, కట్టెవలెనుబడియుండి నను నప్పుగొనినవాఁడు మరల నప్పు చెల్లించునట్లు నేనే వానికి ముక్తి నిచ్చెదను.

శ్లో॥ స్థితే మనసి సుస్వస్థే, శరీరే సతి యో నరః
ధాతునామ్యే స్థితే స్మర్తా, విశ్వరూపం చ మామజమ్
తతస్తం మ్రియమాణంతు, కాష్ఠపాషాణసన్నిభమ్
అహం స్మరామి మద్భక్తం, నయామి పరమాం గతిమ్.

మనస్సు చంచలత్వము లేక కుదిరికతో నిలిచి, శరీరము స్వస్థమై, వాత పిత్తశ్లేష్మధాతువులు సమంబులయియున్న సమయమున యెవ్వఁడు విశ్వరూపుఁడ నగుటఁజేసి యంతటను (సర్వత్ర సర్వస్వరూపముతో నుండుటచేత దేనినిజూచినను నేను స్మరణమునకు వత్తును నన్ను మఱచి పోవ నవకాశము లేదని భావము) అజుఁ డనగుటచేత నెల్లకాలమందును సన్నిహితుఁడై యుండు నన్ను స్మరించునో యంత నదియే నెపముగాఁ గైకొని మరణకాలమున వాఁడు స్మృతిదప్పి నన్ను స్మరింపలేక ఱాయివలెఁ గట్టెవలెఁ బరవశుఁడయి పడియుండినను నాభక్తుని నేనే స్మరించి పరమపదంబు నొందించెద.

మఱియు,

శ్లో. సకృదేవ ప్రపన్నాయ, తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో, దదా మ్యేతద్వ్రతం మమ॥

ఒక్కసారియే (ఎలుమాఱుగాదు) 'నీవాఁడను' అని యెవఁడు యాచించునో యట్టివానికి సర్వభూతములవలన భయములేకుండ రక్షించెదను ఇదియే నాకు వ్రతము మఱియు,

శ్లో సర్వధర్మా న్పరిత్యజ్య, మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచః.

మోక్షసాధనములైన జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము మొదలైన వేవియు విని లోనొకటైన నేను జేయ నేనే. నాగతి యేమియని విచారపడకుము పాహిపాహి యని నన్నొక్కనినే శరణువొందుము. ఇది చేసిన నేనే నిన్ను సమస్త పాపములనుండి విడిపింపఁ జేసెదను ఇది నాపని.

ఓహో రామా! యావధిగ "నిన్నే నన్ను స్మరించుచుండిన యెడ నేనే సముద్ధరించెదను" అని ప్రొమ్ము గుద్దుకొని భగవంతుఁడు గంటవేసినట్టు చెప్పుచుండఁగా నది యుచింపదే మనకంటె నిర్భాగ్యులెవ్వరు? విస్తరిలోని సిద్ధాన్నమును విడిచి తానే మడికట్టి యుండించి ధాన్యము తెచ్చి వంటచేసికొని తినవలెనని పోవువాఁడెంత బుద్ధిమంతుఁడో? భక్తి మార్గమును గడచి స్వయంకృషిచే బహుకష్టముచే సుదీర్ఘకాల సాధ్యమైనత్రోవలఁ బోవువాఁ డంత బుద్ధిమంతుఁడే.

నిర్గుణోపాసనమందుండు దుష్కరత్వమును, సగుణోపాసనమందుండు సౌలభ్యమును మీామనస్సునకు వచ్చునట్లుఁ గఁ గొంచెము చెప్పెదను.

భగవంతుఁడు వత్సలుఁడు, పరమకారుణికుఁడు నని మనము చెప్పినపుడు వాత్సల్యము, కారుణ్యమున నెట్టి వో మన కనుభవమందుఁగలవు వానివలని ఫలము మనమెఱుఁగుదుము. మనబిడ్డలయందు మనకెట్టి ప్రేమయో యెఱుఁగుదుము గావున నది విశేషముగఁ గలవాఁడని చెప్పినపుడు మనమది యెట్టిదో గ్రహింపఁగలము ప్రేమయనునది మేలునే యిచ్చునని మనమెఱుఁగుదుము. అట్టి ప్రేమయే మనబిడ్డలను మనము మనలను మన తల్లిదండ్రులు రక్షించు విధమున భగవంతుఁడు మనల రక్షించుచున్నపు డదియెట్టిదో సులభముగ గ్రహింపఁగలము. ఇఁక నామము రూపములేనిది వాక్కునకు మనస్సునకు గోచరముకానిది యని, యేది లేనిది యేదికానిది యని చెప్పటచే నట్టిది మనస్సునకెట్లు రాఁగలదు? ఉన్నవస్తువు మనస్సునకు రాఁగలదుగాని లేనిదెట్లు రాఁగలదు? పాఠశాలయందుఁ జదువు విద్యార్థులను సూర్యునకు భూమికి నెంతదూరమనిన ౯౨౦,౦౦౦,౦౦౦ ల మైళ్లని చెప్పుదురు. బ్రహ్మదేవుని యాయుస్సు ౮౯౨౬౩౧౮౦౦౦౦౦౦౦౦౦ సంవత్సరములని శాస్త్రము చెప్పుచున్నది ఇదియెంత కాలమో మనస్సుచే గ్రహింపఁగలరా? పరిమితకాలము, పరిమితదేశము మీకు మనస్సునకు రాఁజాల దేని యపరిమితమై రూపనామక్రియలు లేనిదానిని మీ రెట్లు గ్రహింపఁగలరు? సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు సర్వవ్యాపియనఁగానే యేమి తెలిసినట్లు? కావున నిర్గుణోపాసనము దుస్సాధము. ఆమార్గమునఁ బోవువాఁడు నంతటి బుద్ధిమంతుఁడే.

సాకారోపాసనము తక్కువయని నిరాకారోపాసనము శ్రేష్ఠమని మతిమాలినవారు కల్పించినదేకాని శ్రుతు లట్టులు చెప్పలేదు పూర్వాచార్యులు నట్లుచెప్పలేదు.

శ్లో॥ సాకారం చ నిరాకారం, నిర్గుణంచ గుణాత్మకమ్
తత్త్వం తత్పరమం బ్రహ్మ, ఇతి వేదాంతడిండిమః ॥

సాకారంబును, నిరాకారంబును, నిర్గుణంబును గుణాత్మకము నగు పరమతత్త్వమేదియో యదియే పరబ్రహ్మము అని శంకరాచార్యులవారు చెప్పిరి సగుణబ్రహ్మ మనిత్య మని కాని, నిర్గుణబ్రహ్మమునకంటె హీన మనికాని, దానికంటె భిన్న మనికాని శంకరాచార్యులవారి మతముగాదు. ఆచర్చ యుప్రస్తుతము

"సగుణ నిర్గుణస్వరూపంబ్రహ్మ"

"తద్వ త్పరబ్రహ్మణ స్సార్వాత్మికస్య సాకారనిరాకారభేదవిభాగో నాస్త్యేవ."

"తస్మా త్పరబ్రహ్మణః పరమార్థతః సాకారనిరాకారౌ స్వభావసిద్ధౌ"

ఇత్యాదివాక్యములు మహానారాయణోపనిషత్తునందుఁ గానవచ్చెడి కావున సాకారనిరాకార బ్రహ్మమునఁ దారతమ్యముగాని పృథక్త్వత్వముగాని యనిత్యత్వముగాని చెప్పెడువారు తెలిసి చెప్పెడువారుగారు ఒక్కబ్రహ్మాండమందే సృష్టిస్థితి సంహారములు ప్రతినిమిషమునందును జరగుచుండును. ఇటువంటి బ్రహ్మాండము లనేకకోట్లగలవు. ఒక బ్రహ్మాండమునఁ

ప్రలయము ప్రారంభ మయినపుడు వేఱొక బ్రహ్మాండమున సృష్టియగుచుండును. మఱియొక బ్రహ్మాండమున నర్థరాత్రమై యుండును మఱియొక బ్రహ్మాండమున మధ్యాహ్నమైయుండును ఇట్టి దశయందు భగవంతునకు విశ్రాంతియెక్కడిది? నిరాకారుఁడు నిర్గుణుఁడై యెప్పుడుండఁగలఁడు? క్రియాశక్తి వ్యర్థమైపోవునా?

నిర్గుణబ్రహ్మమును బొందఁగోరువారికైనను సగుణోపాసన మవశ్యకము "సగుణమును నాశ్రయించిన శ్రమము లేకుండ గొప్పదియగు నిర్గుణమునకుపోవచ్చును" అని మధుసూదన సరస్వతులవారి యభిప్రాయము వీరు నిర్గుణబ్రహ్మముతోఁ దమకుఁ బనిలేదని యిట్లుచెప్పిరి సగుణోపాసన లేకయుండిన నిర్గుణోపాసన మసాధ్యమని శ్రీభాగవతము,

శ్లో॥ ధ్యానాభ్యాస వశీకృతేన మనసా యన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కంచన యోగినో యది పరంపశ్యంతి పశ్యంతు తే
అస్మాకంతు తదేవలోకన చమత్కారాయ భూయాచ్చిరం
కాలిందీ పులినేషు యత్కిమపి తన్నీలంమహో ధావతి

ధ్యానాభ్యాసముచే వశపడిన మనస్సుచేఁ గొందఱు యోగులు నిర్గుణము నిష్క్రియమునైన పరంజ్యోతిని జూచినఁ జూతురుగాక మాకో యమునానది యిసుకగిబ్బలయందుఁ బరువెత్తుచుండిన నల్లని తేజస్సే చిరముగ మాకన్నులకు నావిధముగ గోచరించుచుండునుగాక యని కృష్ణుని బ్రార్థించిరి

యథార్థమెఱిఁగినవారి మూర్తిత్రయైక్యమును [illegible] వినఁ
నారాయణత్వముగలవలె నద్వైతసన్యాసులు ఆత్మ తెలియని
యోగి కద్వైతములు మెండని సత్యజ్ఞానము లేనివారి నోటికి
వచ్చినట్లు పలుకుచుందురు.

ఉ॥ కారణ కార్యహేతువగు కంజదళాక్షునికెంతొ సచ్చరి
త్రామును లేనమంత్రి! భగవంతుని నగుణుఁడని సైద్ధాంతి
దాఁతని సద్గుణావళు లుదాత్తములింగని యూహకెంకినన్
జేరు వచిత్తముల్ ప్రకృతిఁ జెందని నిర్గుణ [illegible].

సాకారమెట్టిదో సగుణమట్టిదే ప్రకృతిసంబంధమైన
సత్త్వరజస్తమస్సులనుగుణములు రామునకు [illegible]
గుణములు లేనివాఁడు కావున భగవంతుఁడు నిర్గుణుఁడు

వాత్సల్య సౌశీల్య సౌలభ్య కారుణ్యదాక్షిణ్య సౌందర్య
సౌగంధ్య సౌకుమార్యాది కల్యాణ గుణములు గలవాఁడు
కావున సగుణుఁడు

అయమాత్మా అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో
విజిఘత్సో౽పిపాస స్సత్యకామః సత్యసంకల్పః యని శ్రుతులు
చెప్పుచున్నవి అనఁగా నీయాత్మ పాపసంబంధము లేనిది - ముసలితనము
లేనిది - మరణము శోకము ఆఁకలిదప్పి లేనిది యని హేయగుణ
ములు లేకుండుట చెప్పి సత్యకాముఁడు సత్యసంకల్పుఁడనని
మంచిగుణములుండుట చెప్పుచున్నవి

పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల
క్రియాచ.

ఈయన పరశక్తి స్వభావముగ జ్ఞానము - బలము - క్రియ మొదలైనవని నానావిధములఁ దెలియఁబడుచున్నది.

కాఁబట్టి భగవంతుఁడు సద్గుణహీనుఁడనుట శ్రుతులంగీకరింపవు. అదియునుగాక యాకారముగలవాఁడని యెప్పుడంగీకరించితిమో యప్పుడేగుణములుకలవాఁడని యంగీకరింపక తప్పదు - గుణములేనిపదార్థములేదు - పదార్థములేక గుణముండదు పదార్థమునువిడిచి తెలుపు నూహింపసాధ్యమా? అట్లు తే తెలుపులేనిపాలు - మల్లెపూలు లోనైనవి యూహింపశక్యమా. భగవంతుఁడు సచ్చిదానందస్వరూపుఁడన్నప్పుడు సత్తు - జ్ఞానగుణము - ఆనందగుణము కలవనియే యంగీకరింపవలయును. ఉనికిగుణము లేనియునికి - జ్ఞానగుణములేని జ్ఞానము - ఆనందగుణములేని యానందముననుట వెలుతురులేనిజ్యోతి, యెండలేని సూర్యుఁడునని చెప్పుటయగును అనఁగా జ్యోతిలేదు - సూర్యుఁడులేఁడని చెప్పుటగును ఇఁక నాస్తికవాదమెట్టిదో

కావున మన దేవుఁడు జగన్మోహనాకారముగలవాఁడే. సమస్త కల్యాణగుణసంపన్నుఁడే - హేయగుణహీనుఁడే - కావుననే పిలిచిన వచ్చువాఁడు - కోరినవి యిచ్చువాఁడు - ఆపదల నాదుకొనువాఁడు - చేయూఁతగ నుండువాఁడు - ఉభయవిభూతి నాయకుఁడు - భుక్తిముక్తిదాయకుఁడు. ఇఁక మన కేలవిచారము. శ్రద్ధాభక్తులతో సేవించుట మనవంతు - రక్షించుట యాయనవంతు - తక్కిన ప్రశంసమన కక్కఱలేదు.

వైకుంఠధామముఁ డెట్టులేల, యయోధ్యా రాముఁడయ్యె నో విచారింతము. ఆయన రహస్య మాయన వెలిపుచ్చకున్న నెవరు తెలిసికొన సమర్థులు కావున నాయనయే యిట్లు చెప్పెను

శ్లో॥ అజోపి స న్నవ్యయాత్మా, భూతానా మీశ్వరోపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ, సంభ వా మ్యాత్మమాయయా.
౪-౬

అర్జునా! పుట్టువులేని వాఁడనయ్యు, క్షయింపని జ్ఞాన శక్తి స్వభావములుగలవాఁడనై సమస్తప్రాణులకు నియామకుఁడనై నాస్వభావమును నేను విడువకయే నాయిష్టప్రకారము నేను జనించుచున్నాను

అర్జునుఁడు —కృష్ణా! నీవు మావలెనే పుట్టితివి నీవును మావలె నే యెప్పుడో దేహమును జాలింపవలసినవాఁడవే యయియు న్నావు ఇఁక మాకునీకు నేమిభేదము?

కృష్ణుఁడు —'అజాయమానో బహుధా విజాయతే' యన్నట్లు నాకుఁ బుట్టువు లేకుండినను బహువిధములఁ బుట్టుచుందును మీకు నాకు భేదమేమనెదవా? మీరు మీచేసిన పుణ్య పాపములకు వశులై మీకిష్టముండినను లేకుండినను, కర్మ పాశబద్ధులై పాంచభౌతికమైన దేహములతోఁ బుట్టుచుందురు నేను బుట్టుటకుఁ గర్మము కారణము కాదు ప్రేమ కారణము. ఫలకాంక్ష లేక కర్మములు చేయుదునుగావునఁ గర్మములు నన్నేమియుఁ జేయఁజాలవు నీకుఁగల జ్ఞానశక్తి

స్వభావాదులు నశించునవి. వానికి సంకోచ వికాసములు గలవు నాజ్ఞానశక్తి స్వభావములకు వినాశము లేదు సంకోచమును లేదు ప్రాణికోటులన్నియును నా నియమమునకు లోపడివర్తించును గాని నేనొకరికి లోపడి వర్తించువాఁడను గాను కాఁబట్టి నేను జన్మింపవలయునని సంకల్పము కలిగినపుడు నాయిష్టప్రకారము నేను గ్రహించిన దివ్య విగ్రహముతో నాపరమేశ్వర స్వభావము వదలక జనింతును మీకును నాకును భేద మింతయే.

అర్జునుఁడు — కృష్ణా! మేము పుట్టుట కర్మఫలానుభవమునకంటివి అగుఁగాక నీకట్టిబాధ లేదు గదా నీవేలపుట్టుచున్నావు? ఎంత మందమతియైనను ప్రయోజనము నుద్దేశింపక యొకకార్యము చేయఁడు కావున నీవు జన్మించుటకొక ప్రయోజన ముండవలయునుగదా? అదియేమి?

శ్లో. యదా యదా హి ధర్మస్య, గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజా మ్యహమ్
పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే

కృష్ణుఁడు — నేనెప్పుడు జన్మింతునో యేలజన్మింతునో చెప్పెద వినుము ఎప్పుడెప్పుడు లోకమున ధర్మమునకు హానికలుగుచున్నదో, యధర్మము వృద్ధియగుచున్నదో యప్పుడు నేను నన్ను సృజించుకొనుచున్నాను మిమ్ము సృజించువాఁడు మఱియొకఁడుగలఁడు నేను స్వతంత్రుఁడనగుటను నన్ను నియ

మింపఁగలవాఁడు నాసముఁడుగాని నాకంటె గొప్పవాఁడు
గాని లేకుండుటచే నన్ను నేనే సృజించుకొందును. ఎప్పు
డంగుదా? లోకమున నెప్పుడు ధర్మముచెడునో, యధర్మము
ప్రబలమగునో యప్పుడు

అర్జునుఁడు — నిన్ను నీవు పుట్టించుకొని యేమిచేయుదువు?

కృష్ణుఁడు — సాధువుల రక్షింతును, దుష్టుల శిక్షింతును. ధర్మ
మును జక్కఁగా స్థాపింతును ఈకార్యములను జేయుటకై
యుగయుగమందును జన్మించుచుందును

అర్జునుఁడు — కృష్ణా! నేను గొప్పవాఁడనని చెప్పుకొనుచు
న్నావు కావున నిన్ను నే నాక్షేపింపరాదుగాని గోటఁ
బోవుపనికి గొడ్డలి తెచ్చుచున్నావని వృథాశ్రమ పడు
చున్నావని నా యభిప్రాయము ఎట్లందువా? వినుము.
సంకల్పముచేతనే బ్రహ్మాండములను సృష్టించి రక్షించి
ధ్వంసము చేయువాఁడవు దుష్టులు నాశమగుదురుగాక
శిష్టులు వర్థిల్లుదురుగాక యని సంకల్పించిన నాకార్యములు
గావా? అవి రెండు చక్కఁబడిన ధర్మము తనంతటఁదాను కుదు
టఁబడదా? ఈ యవతారము లేల? ఈ పడరాని పాటులేల?

కృష్ణుఁడు — అర్జునా! పూర్ణముగ నాలోచింపక యే యాక్షే
పించుచున్నవాఁడవు పైరులో మొలచిన గడ్డిగాదము పీఁకి
వైచినంతమాత్రమున నే పైరుఫలించునా? కలుపు నాటు
వలదా? నీరుపెట్టవలదా? పశువులు రాకుండఁ గంచెవేయ

వలదా? పశువులు దొంగలురాకుండ కాచుకుండవలదా? ఈకార్యము లే నేను జేయుచున్నాను. సంకల్పముచేతనే దుష్టులనాశము చేసితి ననుకో-సంకల్పముచేతనే శిష్టులకు ధనధాన్యాదులు సమకూర్చితి ననుకో. ఆమాత్రమునఁ నేమై నట్టు! నీకు మనస్సునకువచ్చుటకై దృష్టాంతపూర్వముగఁ జెప్పుచున్నాను.

కృతయుగమందు హిరణ్యకశిపుఁడు నాభక్తుఁడైన ప్రహ్లాదుని బహువిధముల బాధపెట్టెను అప్పుడు నేను సంకల్పముచేతనే హిరణ్యకశిపుని జంపితిననుకో నింద లేక పోంది పోదు గనుక నొక మహామారినిబంపి వానిని వధించితి ననుకో. అప్పుడు లోక మేమనును. అందఱుచచ్చినట్టు వానికి నొకరోగమువచ్చి చచ్చినాఁడని జనులు తలంతురే కాని నాభక్తుని దుష్టుఁడు బాధపెట్టినకారణముచే నేను దండించితిననితలంతురా? తలంపరుగదా అప్పుడు ప్రహ్లాదుఁడు 'భగవంతుఁ డున్నాఁడు భక్తులరక్షించును' అని చెప్పినమాటల సత్యత్వము స్థాపితమగునా? కాదుగదా? అప్పుడు లోకమునందు భగవంతుఁడుకలఁడు. ఆయన భక్తరక్షకుఁడునను విశ్వాసముచెడదా? నాస్తికవాదమే సిద్ధాంతితముగాదా? ఇప్పు డేమనుచున్నారు? భగవంతుఁడు సర్వత్రగలఁడు ఆయన భక్తపక్షపాతి తనభక్తులను బాధించిన వారిని హింసించును భక్తిచేసినవారిని రక్షించును" అని విశ్వాసముగలవారై భక్తిచేసి బాగుపడుచున్నారుగదా?

అట్టులే మకరిని నేను సంకల్పముచేఁ జంపిన నెట్టి ఫలముగలిగియుండునో నేను సమక్షముగఁ బోయి చంపికరి రాజును గాచుటచే ఫల మెట్టిదైయున్నదో యాలోచింపుము. ఈవిధముగనే ప్రత్యవతార విషయమై యాలోచింపుము

అదియునుగాక నాభక్తులు నాసాక్షాత్కారమును బ్రత్యక్షదర్శనమును గోరుచుందురు ఇది న్యాయ్యమేకదా కల కాలము నాకై శ్రమించుచు నాసేవకులై నాదాస్యముచేయుచు నన్నే స్మరించుచు సర్వము నాకప్పగించి నేనే దిక్కని యుండు వారు నన్నొకనారి తమకన్నులారఁ జూడఁగోరుట తప్పా? నా వలన వారేలాభముఁగోరక యింత యల్పవిషయము గోరి నపుడు వారికోరిక నేను వ్యర్థముచేసితినేని నాకంటెఁ గృతఘ్నుఁడు నిర్దయుఁడు కఠినచిత్తుఁడెవఁడు? ఇట్టివారి కోరిక నే నెట్లు సంకల్పముచే నెఱవేర్పఁగలను మామావేషములు చూపించిన వారిని నేను మోసగించినవాఁడనే కదా యగు దును. వారిసేవకిది యాఫలము? కావున నాభక్తులకు నేను యథార్థస్వరూపముతో దర్శన మియ్యకతప్పదు. అట్లుచేసిననే వారు తృప్తులగుదురు. కావున నే నవతరింపక తప్పదు.

అర్జునుఁడు — అవతరించితివి సంతోషమె ఒప్పెను. నీభక్తులకుఁ గానవచ్చినట్లే లోకుల కందఱకు నీభక్తులుగాని వారికిఁగూడఁ గానవచ్చుచున్నాఁడవు కావున నీదర్శనము వలన నీభక్తుల కెంతమేలుగలదో యంతమె లీలోకమున కంతయుఁ గలుగవలయును గదా అమోఘదర్శనుఁడవైన నీదర్శనము వ్యర్థము పోరాదుగదా

కృష్ణుఁడు —

అవ్యక్తం వ్యక్తి మాపన్నం, మన్యంతే మా మబుద్ధయః
పరంభావ మజానంతో, మమావ్యయ మనుత్తమమ్ ౭-౨౪

అర్జునా! నీవుచెప్పినది సత్యము. భక్తులు నా పరమ స్వభావమును దెలిసినవారై కేవల కారుణ్యముచేతనే లోక రక్షణార్థము పరత్వమందెట్లు వ్యక్తుఁడనై యుందునో యట్లే యిప్పుడు నున్నానని తెలిసిసేవింతురు. కావున వారికి నాదర్శనమునలన లాభముగలదు. అవివేకులో నేనవ్యయుఁడనని, నాకంటె నుత్తములు లేరని నాపరస్వభావము విడువకయే జన్మించితినని తెలియక పూర్వము తెలియఁబడక యిప్పుడు కర్మబద్ధులై తాముజనించి లోకమునకుఁ దెలియవచ్చునటులే నేనుసు దెలియవచ్చుచున్నానని తలంతురు ఇట్టివారికి నాదర్శనమువలన నేమిలాభముగలదు? నేను బరమందు వ్యక్తుఁడనే. ఈలోకమందు వ్యక్తుఁనే ఆదశయందు నిత్యసూరులు ముక్తులు చూడఁగలరు. ప్రకృతి బద్ధులైన లోకులా దశయందు నన్నుఁ జూడలేరు గావున వారు తరించుటకై వారినిమిత్తమై కేవల కరుణయే కారణముగా నవతరింతును. ఇంతసులభుఁడనయ్యును వారు నన్నుఁ దెలిసికొనలేరు. తమవలె సామాన్యమనుష్యుఁడనియే భావింతురు

**అర్జునుఁడు —** కొందఱు నిన్నుఁ దెలిసికొనఁ గలుగుటకుఁ గొందఱు తెలిసికొనలేక పోవుటకు నేమికారణము?

కృష్ణుఁడు —
శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య, యోగమాయా సమావృతః
మూఢోయం నాభి జానాతి, లోకో మామజ మవ్యయమ్.
౭ - ౨౫

కృష్ణుఁడు — అర్జునా! మనుష్యాకారమునఁ గాన వచ్చు నన్ను భక్తులు తెలిసికొనుటకు నితరులు తెలిసికొనలేకపోవుటకుఁ గారణముగలదు నేనవతరించునపుడు నా యోగమాయను నాశ్రయించియే యవతరింతును. ఈమాయ యనునది దివ్యమై యద్భుతకార్యములు చేయు విచిత్రశక్తి. అవతారదశయందు నన్నిది యావరించియే యుండును ఆ కారణముచే బుద్ధిలేని లోకులు నన్ను జననమరణములు లేనివానిఁగా నెంచక తమతోఁ బాటివానిఁగా నెంచుచు నపహాస్యము సేయుదురు

అర్జునుఁడు — కృష్ణా! నీవు వంచకుఁడవు. నీమాయచేత నీవు లోకమును వంచించుటయేగాక యింక బుద్ధిలేనివారనుచున్నావు. నీ వాస్తవ స్వరూపముతో నీవు వచ్చియుండిన లోకము నిన్నుఁ దెలిసికొని సేవించి బాగుపడునుగదా.

కృష్ణుఁడు — అర్జునా! నేను వంచకుఁడనుగాను నా తేజస్సులో నొక పరమాణువంత తేజస్సును సూర్యునియందుంచియున్నాను. దానినే లోకులు చూడలేకయున్నారు. ఇఁక నన్నేమి చూడఁగలరు? సూర్యుని జూడవలయుననినఁ బొగ మారినయద్దములో రంగుగలయద్దములో కన్నులకడ్డముగా నుంచుకొనికదా లోకులు చూతురు. అట్లే వారు నన్నుఁ

జూడఁగలుగుటకై మాయనడ్డము వేసితిని కావున వారు నన్నుఁ జూడ శక్తులై యున్నారు. రంగుగల యద్దములోనుండి సూర్యునిఁ జూచిన నాయన బింబ మొక యద్దపుబిళ్లవలెఁ గానవచ్చును ఆకారణముచే సూర్యుఁడొక యద్దపుబిళ్లలే యని తలఁచువారు బుద్ధిమంతులా మూఢులా? అట్టులే మాయ యడ్డముపడుటచేఁ దమవలెనే నేనొక మనుష్యుఁడుగఁ గానరాఁగా నునవంటివాఁడే వీఁడని యెంచి యుపేక్షించిరేని యది నాదోషమా? మనుష్యాకారముతో నేల తోఁచెదవందువేమో? మనుష్యులను జక్కఁబెట్టఁగోరిన నాకు మనుష్యాకారముగాక మఱియేయాకారము తగిన దగును పశువులవలెఁ బక్షులవలెవచ్చి హితముపదేశించితినా తిర్యగ్జాతిజంతువులు వీనిమాటలకేమి లే యందురు. దేవతాకారముగావచ్చి చెప్పి యాప్రకారము నడచిచూపితినా దేవుఁడు కాఁబట్టి యిట్లు చేయుటకు సాధ్యపడెను. మానవుల కదిసాధ్యమా? యందురు. కాఁబట్టి తమవంటి వాఁడనే యై తమలోఁగలసిమెలసి తిరిగి తెలియనివి చెప్పుటకుఁ జెప్పినవి చేసిచూపుటకు, మానవుల కీ కార్యములు సాధ్యములని తోఁపఁజేయుటకు మానవుఁడుగానె కానరావలసివచ్చినది సశేషము.

---

N. B ౧౯౩౦ ఏప్రెలుసంచిక ప్రథమమున "విమలప్రజ్ఞులు" అను పద్యము మూఁడవపాదమున సకలాధీశులుగొల్వ" అనుటకు బదులు "సమదేశేంద్రము నెక్కి" అని చదువవలెను.

శ్రీరామ.

# భక్తిసంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి స్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విశేషకుడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు (వాసుదాసుడు)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము.

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకు పైబడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకు తక్కువ గ్రహింపబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను పిడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయము రాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపజేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలక్షణటీకతోడ రెండు సంపుటములుగా మును పటికంటె చక్కఁగా సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

భక్తిసంజీవని ౧౯-౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧-౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Reid & Co., Printers, Triplicane High Road

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారినంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారాధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

ఈసంవత్సరపు విడిపత్రిక ౦ ౮ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ. | అ. | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుక్కా సిద్దయ్యగారు, జమ్ములపాళెము .. | ౮౦౦ | ౦ | ౦ |

రక్షకులు.

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |

పోషకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట.

వాసుదాసుఁడు, కార్యనిర్వాహకుఁడు.




# శ్రీ భక్తి సంజీవని

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక
ప్రతి పూర్ణిమాసారంభంబున వెలువడుచుండును.
విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట.

«భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥» మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁబొందించును ఆయనను దర్శింపఁజేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨ { ప్రమోద సం॥ జ్యేష్ఠమాసము జూన్ నెల ౧౯౩౦ సం॥ } సంచిక ౬.

కాంభోజి రాగము - ఆది తాళము.

నిన్నె నచ్చితి - దేహము - నీకె యిచ్చితి
సన్నుతాంగ ఏకశిలా - స్వామి సీతారామచంద్ర ॥నిన్నె॥

భయములేనిది - పరులకు - బాధగానిది
జయము కలయది - శాస్త్ర - సమ్మతంబిది
నయము కలయది - ఏమి నష్టి లేనిది
అయముగఁ డెంకాయచిప్ప - హస్తాభరణము గాఁగొనుచు
రయముగ నీసేవయందె ప్రాణము దేహము విడువఁదలఁచి॥
అలవియైనది - పర - మార్థమైనది
సులువునైనది - దాతకు - సుకృతమైనది
ఖలముగానిది - సూరి - కీర్తితంబిది
అలఁత లేక కొంచెమైన - నక్షయపాత్రము కేలఁగొనుచు
జలజనేత్ర నీదు సేవ సలుపఁగరుణఁ బ్రోతువనుచు ॥నిన్నె॥
కామములేనిది మోక్ష - కరమునైనది
సామమునైనది - భవ - శాంతమైనది
క్షేమమైనది హరిహర - సేవితంబిది
రామభిక్షాం దేహి యనుచు - గ్రామగ్రామముసంచరించి
స్వామినీసేవచేసిసౌఖ్యమున వర్తింపఁగోరి ॥నిన్నె॥

# ప్రకటన.

ఆంధ్రవాల్మీకిరామాయణవ్యాఖ్యానము సుందరము ముద్రింపఁ బ్రారంభించుటకు ౨౫౦౦-౦-౦ రూపాయలు కావలసియుండుటచే నా మొత్తము లభించువఱకు ఆంధ్రవాల్మీకి రామాయణము రెండు సంపుటములు ౬-౮-౦ కును శ్రీ భక్తి కల్పద్రుమశతకము ౦-౪-౦ శ్రీ వాసుదాసకీర్తనలు ౦-౪-౦ శ్రీ రామకోటిపుస్తకములు ౦-౬-౦ ఛాయాపటములు తప్పఁ దక్కినవానిపై ౧౦౦ కి ౨౫ వంతునఁ ద్రోసివేసియు నియ్యఁబడును ఆవల నెప్పటి వెలలే వావిలికొలను సుబ్బరావుగారి గ్రంథములన్నియు నికమీఁద నొంటిమిట్టయందే లభించును.

---

## —చచ్చినవాఁడు బ్రదుకుట.—

28-4-30 తేదిగల "ఇంగ్లిష్‌మాన్" అను పత్రికయం దీక్రిందివిషయము ప్రకటింపఁబడినట్లు 2-5-30 గల హిందూ పత్రిక యనువదించుచున్నది దానిని తెనుఁగున వ్రాయుచున్నారము "అలికో ఇ లిలియస్" అను పత్రికాధిపతి తానతికష్టము మీఁద పికింగు అను పట్టనములోనుండు మహాలామా దేవాలయమునకుఁ బ్రవేశింప నాజ్ఞపడసితిననియు, నందు పసుపు, ఎఱుపు వన్నెగల చీనా దేశపు టక్షరములతో విస్తారముగ నలంకరింపఁబడిన పెద్దశవపేటి (పీనుఁగుల నుంచుపెట్టె) యుండెననియు, నందు వేషమును బట్టిచూడ చక్రవర్తి తరగతికిఁ

జేరినాఁడని తోఁచు మనుష్యుని దేహముండెననియు వ్రాయు చున్నాఁడు. చచ్చినట్లు కానవచ్చు నీమనుష్యుని కన్నులు పూర్తిగా మూఁతపడియుండలేదు. కనుగ్రుడ్డులు గాజువలె నుండెను. ప్రాణచిహ్నములేవియు లేవు. వానిది మరణించిన వానిముఖమే. మీసములమీఁద ముఖముమీఁద దుమ్ము నిండి యుండెను. తరువాత నొకనాఁడు ఆదేవాలయమందే యీ లిలియను తాను చాలగొప్పదై మనస్సు నాకర్షించు నొక యుత్సవము లామాపురోహితులు జరపఁజూచెను దానిపేరు "చచ్చినవారు బ్రదుకుగంట" ఈయుత్సవమందు పండ్రెండు గురు ఆశవపేటిని మోచి తెచ్చిరి ఉత్సవమధ్యమందు శవపేటిలో నుండుమనుష్యుఁడు లేచి బలిపీఠమునొద్దకు కొన్ని యడుగులు నడచి అందున్న బుద్ధవిగ్రహమునకు నమస్కరించి సర్వము నిశ్శబ్దముగా నుండఁగాఁ దన విశ్రమస్థానమైన శవపేటిలోనికిఁ బోయెను. అతనికి సహాయపడినవారెవ్వరు లేరు లామాపురోహితు లింకను గదలమెదలకుండిరి కాని దీర్ఘనిద్రకై యతఁడు పరుండఁగానే వాహకులు వాద్యగాండ్రును నాపెట్టెను నావలికి మోచికొనిపోయిరి." పికింగ్ అనునది చీనాదేశ ముఖ్య పట్టనము. అందు బౌద్ధమతము ప్రబలము.

---

## ప్రశ్నోత్తరములు.

ప్రశ్న — ఉపాసన మనఁగానేమి?

ఉత్త — ఉపాసనమనఁగా సమీపమందుండుట యని యర్థము. (ఉప=సమీపము అస్ ధాతువున కుండుటయని యర్థము)

భక్తులగువారు మూర్తిమంతమైన భగవత్స్వరూపమును (తమయిష్టదేవతా స్వరూపమును) తమసమీపమందున్నట్టే ధ్యానింతురు. జపింతురు. అర్చింతురు. నమస్కరింతురు. వీరికి భక్తిశ్రద్ధ లెక్కుడగు కొలఁది యాదేవతవారికిఁ స్వస్వరూపముతోనో వేషస్వరూపముతోనో గోచరించి వారివారికోరికలఁ గొనసాగించుచుండును. ఉపవాస పదఁగా నియర్థమే. సమీపమందు వసించుట యనియర్థము ఉపవాసదినములందు భగవద్ధ్యాన పూజాదులు ముఖ్యము. ఆహారనియమము రెండవది మొదటిది లేక రెండవదిమాత్ర మనుష్ఠించుట యారోగ్యమాత్రఫలదము రెండు ననుష్ఠించుట యాముష్మిక ఫలప్రదము

ఉపనిషత్తన్న నీయర్థమే సమీపమందుఁ గూర్చుండుట యనియర్థము గురువునకు శిష్యుఁడు సమీపమందుండిననే రహస్యార్థములు బోధింప సాధ్యపడును అట్లు బోధింపఁబడిన రహస్యార్థములే యుపనిషత్తులు. దైవమందు గురువందుఁ బర భక్తికలిగి పైవిధమున నుపదేశముఁబొందిన మహాత్ములకే యీ రహస్యవిషయములు హృదయమున స్పష్టముగఁ బ్రకాశించును. పుస్తకపాఠకులకుఁ బ్రకాశింపఁజాలదు. మాటలయర్థము మాత్రము తెలియవచ్చును. ఇట్లని శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పుచున్నది.

ప్రశ్న.—సోహమభ్యసించుట యెట్లు?

ఉత్త —సోహమనునది గొప్పమంత్రము. ఈమంత్రమునకు ఋషి, అంగన్యాసకరన్యాసములు లోనైనవి కలవు ఇది తురీయు లభ్యసింపవలసిన మంత్రము దీని లక్షణము నెఱుఁగక యీకాలమునఁ దమమీఁదఁ దాటిచెట్టు ప్రమాణమునకుండు సంసారమను బురదగుంతలో మునిఁగియుండు వారుకూడ దీనిని జపించువారై యున్నారు వాసుదాసుఁడు గుంటూరు నగరమున మ-రా-శ్రీ బ్ర-శ్రీ మన్నారు కృష్ణరావుగారి మేడమీఁద గదిలోనుండ నిద్దఱు విధవలు చూడవచ్చి ప్రసంగవశమునఁ దాము సోహమభ్యసించుచున్నామని చెప్పిరి ఎన్నాళ్లుగా నభ్యసించుచున్నారని వాసుదాసుఁ డడిగెను ౧౨ సంవత్సరములుగా నభ్యసించుచున్నామని వారుచెప్పిరి ఏమిఫలము కలిగినదని వాసుదాసుఁ డడిగెను ఏమియుఁగలుగలేదని వారనిరి. ఏమి ఫలము కలుగునని మీగురువులవారు చెప్పిరని వాసుదాసుఁ డడిగెను శ్వాసమునిలిచి పోవునని చెప్పిరని వారు చెప్పిరి ౧౨సంవత్సరములుగాఁ జేయుచున్నను మీకు శ్వాసమునిలుప లేదేని మీకు శ్వాసనిలుచుట కడపటికాలమందే యని వాసుదాసుఁడు చెప్పెను ఎట్లు చేయుచున్నారన సోహం సోహమనుచున్నామనిరి ;ఈవిధముగా సోహ మభ్యసించు వారు పెక్కురుగలరు

సః + అహమ్ అను రెండు పదములుగలసి సోహమ్ ఆయెను సః=వాఁడు, అహమ్=నేను అని యర్థము

ఇది భగినన్యాసమని శ్రీమధ్వాచార్యులవారి యభిప్రాయము వర్ణసమామ్నాయమునందుఁ బాణిని సూత్రముల ప్రకారము ... మొదటిది (అఇఉణ్) హకారము (హల్) కడపటిది. కావున అహమ్మనునది శబ్దబ్రహ్మమును దెలుపునని వారి యభిప్రాయము.

అద్వైతులలో వాఁడె నేను. జీవాత్మగానుండునే నాపరమాత్మనే ఇరువురి కిభేదముండదు

విశిష్టాద్వైతులు సూక్ష్మ చిదచిద్విశిష్టుఁడైన వాఁడే యీ స్థూల చిదచిద్విశిష్టుఁడని యర్థము చెప్పుదురు. త్రిమతముల వారికి నీమంత్రము గ్రాహ్యమే

కాశిలోనుండువాఁడే రామేశ్వరమందుండు వాఁడన్నప్పుడుగాని రామేశ్వరమందుండు నట్టివాఁడె కాశీయందుండు వాఁడనికాని చెప్పినపుడు ఇరువురిలో నొకరినైనఁ జూచియుండినఁగాని రెండవవాని లక్షణస్వరూపము లెఱుఁగఁజాలము అయితే సః అహమ్ అనునపుడు సః అనువాఁ డెవ్వఁడో చూచియుండిన అహమ్మనువాఁడు వాఁడేకదా లేక యట్టివాఁడేకదా యని యెఱుఁగవచ్చును ఇరువురను తెలియక రామేశ్వరములో నుండువాఁడే కాశిలోనుండువాఁడు కాశిలోనుండువాఁడే రామేశ్వరములో నుండువాఁడని వదరినట్లు వాఁడే నేనని వదరినలాభమేమి ఇరువురను నిర్ణించుటలో దన్నుఁదాను జూచుకొనుట సులభము కావున ముందు అహమ్మనునది గురువుచే బోధగాని

యతఁ ఁ షపదేశించినరీతి నభ్యసింపవలయును. అట్టు లాత్మావలోకనమైన పిమ్మటఁ బరమాత్మావలోకనమునకు శ్రమింపవచ్చును

సోహమ్ అనునది త్రిప్పిచదివిన హంస యని యేర్పడును. మనశ్వాసమునకే హంసయనిపేరు సాధారణ స్థితియందు మనుష్యుఁడు ౨౪ గంటలలో ౨౧౬౦౦ మార్లు శ్వాసము విడుచును అనఁగా నిమిషమునకు ౧౫ మార్లు శ్వాసమువిడుచును. ఇది హెచ్చుటయుఁ దగ్గుటయుఁగలదు అంతకెక్కువ శ్వాసము విడిచెనేని యాయువుక్షీణించును. అంతకెంతెంత తక్కువచేయునో యంతంత యాయుర్వృద్ధియగును. ఒకనిమిషమున ౧౦ మార్లు విడిచి యావలినిమిషమున ౨౦ మార్లు విడిచినఁ బ్రయోజనము లేదు. గడియారము దగ్గఱనుంచుకొని పరీక్ష చేసికొనుచు నొకనిమిషమందైన నెక్కువ తక్కువలులేక యేకరీతి నుండునట్లభ్యసింపవలెను. ఈప్రకారము కాలుగంట అరగంటచేసిన ప్రయోజనము లేదు గంటలకొలఁది యొక్కొకసారి రెండుమూఁడు దినములుకూడఁ గూర్చుండవలయును దీనికి నాసనసిద్ధి ప్రాణాయామ మావశ్యకములు. ఇంతకాలము మంత్రార్థమందు మనస్సు నిలుపవలయును కావునఁ బ్రత్యాహార ధారణలు నావశ్యకము లగుచున్నవి ఇదియే దీర్ఘకాలము చేసిన సమాధి యనఁబడును భక్తిహీనునకు, బలహీనునకు, ప్రమాదసహితునకు, క్రమమువిడిచి తపస్సుచేయువానికి నూఱుజన్మములెత్తినను నాత్మావలోకనము సిద్ధింపదు విహారనియమము, ఆహా

రనియమము, బ్రహ్మచర్యనియమము, ఆసనజయము, ప్రాణ
జయము లేనివానికి, నవ్యవసాయబుద్ధికి సోహం సిద్ధింపదు.
సః అన్నప్పుడు పూరకము అహమన్నప్పుడు రేచకము చేయ
వలయును. తక్కినవి గురుముఖమున నేర్చుకొనవలయును.

---

శ్రీరామమతధర్మములు

## నిర్వ్యాపారత్వమే విచారము.

అద్వైత జ్ఞానమార్గనిష్ఠులు విచారమే శరణోపాయ
మన్ని విచారసాగరమునఁ గేవలబుద్ధిబలమే యాధారముగఁ
గొని మునుఁగుచుఁ దేలుచు దరి గానక తపించుచుందురు.
ఈమార్గమునఁ బోవువారికిఁ దర్కవ్యాకరణ మీమాంసాదు
లందుఁ బాండిత్యము విశేషప్రతిభ యూహామీఁద నూహ
యుక్తిమీఁద యుక్తినాగించు బుద్ధిబలములో నైనవి కావలయును.
ఇవి లేనివాఁడు ఈఁతరానివాఁడు తెప్పలేనివాఁడు నీళ్లలోఁ బడి
నట్టే ఈ విధముగా వేలకొలఁది జన్మములు తపింపవలయును
ఇట్లు చేయువారిలో లక్షకొకఁడైన నొడ్డుచేరువాఁడు లేఁడు.
ఇట్లని శంకరాచార్యులవారే సెలవిచ్చినట్లు ప్రొఫెసరు రాధా
కృష్ణయ్యగారు శంకరతత్త్వమను గ్రంథమందు వ్రాసియున్నారు.

తా మాచరింపకపోయినను ఆచరింప సాధ్యముకాక
పోయినను నన్నతాచలంబులు కొందఱు శిష్యులకు శిష్యరాం
త్రకు విచారమే పరమార్థమని బోధించి వారిని విచారంబునఁ
ద్రోయుచుందురు.

భక్తునకు విచారము కలిగినను దాని వెన్నంటివచ్చు విషాదముకలుగను బనిలేదు. నీవు చెప్పునది చేయునదియేమన —

శ్లో. సంసారావర్తవేగ ప్రశమన శుభదృగ్దేశిక ప్రేక్షితోహం
సంత్యక్తోన్యైరుపాయైరనుచితచరితేష్వద్య శాంతాభిసంధిః
నిశ్శంకస్తత్త్వదృష్ట్యా నిరవధికదయం ప్రార్థ్య సంరక్షకం
త్వాంన్యస్యత్వత్పదాబ్జే వరదనిజభరో నిర్భరోనిర్భయోస్మి

భక్తుల కోరికలు నెరవేర్చు స్వామీ సంసారమనెడి సుడిగుండముయొక్క వేగమును నణంపజాలు శుభదృష్టిగల యాచార్యునిచేఁ బంపఁబడి నేను మోక్ష సాధనములని చెప్పఁబడు నుపాయములవలనను, ననుచితచరితముల యందలి యభినివేశముచేతను విడువఁబడినవాఁడనై యథార్థదృష్టిచే నిస్సందేహముగాఁ బారములేని దయగల నిన్ను సంరక్షకునిగాఁ బొందినవాఁడనై నాభారమును నీపాద పద్మములయందుంచి యన్నివిధముల భారములనుండి విడివడినవాఁడనై భయము లేకయున్నాను ఇఁకమీఁద నన్ను రక్షించుభారము నీదేకాని నాదికాదు. నీపాదపద్మముల శరణుచొచ్చుట తప్ప మఱియే తరణోపాయమును నేను బూనువాఁడనుగాను

ఈవిధముగాఁ జెప్పి భక్తుఁడు తల్లిదండ్రులపొదిగిటిబిడ్డవలె స్వరక్షణమందే భయము విచారము లేక యుండును దీనికి గట్టినమ్మకతప్ప పాండిత్యము ప్రతిభలోనైన ననావశ్యకములు. కావున నెట్టివారైన నీమార్గమున నమ్మకముండిన దరింపవచ్చును.

యథార్థజ్ఞానమునందు విచారమున కవకాశము లేదు. మనస్సున సందేహము కలిగినపుడు, అజ్ఞానదశయందు విచారము కలుగును వందమంది స్త్రీలలో నొక శిశువును విడిచి నీతల్లియొద్దకుఁ బొమ్మనిన నాశిశువు చక్కఁగఁ దనతల్లియొద్దకుఁ బోవును. ఆగుంపులోఁ దనతల్లి లేదేని యప్పుడు నలువురివంక నాలోచించుచుఁ జూచును కానరాకపోయిన నేడ్చును. అప్పుడు తల్లియే యెందుండినను వచ్చును కావున నమ్మకముగఁ దన తల్లి దండ్రులని సీతారాములను దెలిసిన భక్తులకు విచారకారణము లేదు. ఒకవేళ నేదైన సందేహముకలిగినా అమ్మా నాయనా యని యేడిచిన వెంటనే వారు పరువెత్తివత్తురు

## భక్తి జ్ఞాన ప్రదానమే దానము.

దానమనఁగా నీవి. ఒకరికిచ్చుట. దానమేకం కలౌయుగే కలియుగమందు దానమొకటే ప్రధానము తస్మాద్దానం పరమం వదంతి. కావున దానము శ్రేష్ఠమని విజ్ఞులు చెప్పుదురు యజ్ఞము దానము తపము నివి వివేకులను బవిత్రులను జేయును. అను వాక్యములు దానశ్రేష్ఠత్వమును జాటుచున్నవి కామము క్రోధము లోభము ననునవి నరకద్వారములు. అందు లోభగుణము పరమనీచము లోభమునకు విరోధిదానము రాజస దానము (ప్రతిఫలాపేక్షతోఁ జేయుదానము) స్వర్గమునకు, నిష్కామదానము (సాత్త్వికదానము) మోక్షమునకుఁ గారణమగును సాత్త్వికదానము కామక్రోధ జయమునకును గ్రమ

క్రమముగఁ గాంఛనుగుచున్నది ఇన్ని సుగుణములున్నను దానమునకుఁ తగినపాత్రము ముఖ్యము అపాత్రదానము హానికరము.

కొందఱు లోభులు తమలోభగుణమును గప్పి పెట్టుటకో జ్ఞానమే లేకయో కుంటికి గ్రుడ్డికి బిచ్చము వేయుట కూడదనియు, వారు పూర్వజన్మమునఁ జేసిన పాపము ఫలము నిప్పు డనుభవించుచున్నారనియు నట్టివారికి సాహాయ్యము చేసిన వారి కర్మానుభవమును దప్పించిన వారమై యాకర్మము మన మనుభవింపవలసి వచ్చుననియు నొకఁడు దొంగతనము చేసి ప్రభువుచే శిక్షింపఁబడి చెఱసాలయందుండఁగా వాని నాచెఱనుండి తప్పించినఁ బ్రభువు మనపైఁ గోపించి మనల శిక్షింపఁడాయని వాదించుచున్నారు

ఈయుపమానమే యనాలోచితము కుంటికి గ్రుడ్డికి బిచ్చము వేసినయెడల వానికుంటితనము గ్రుడ్డితనము పోదు. ఆవిధముగా వారియనుభవమునకు మనదానమడ్డపడదు వీరి దుర్మతము సమ్మతమైనయెడల రోగి కెవ్వరు మందీయరాదు రోగమును బోఁగొట్టుటవలన రోగి కర్మానుభవమునకు వైద్యుఁ డడ్డపడినవాఁడగునుగదా? కావున వైద్యశాలలు మూఁతలు వేయవలసినదే. వైద్యశాస్త్రము తగులఁబెట్టవలసినదే అట్లే గ్రహచికిత్సలు లోనైన సర్వచికిత్సలు మానవలసినదే. ఈ లోభుల బోధ తా మొకరి కీయవలసివచ్చినప్పుడు మాత్రమా? తమ కట్టిగతి సంభవించినపుడు కూడనా? తమకో దారపుత్రా

దులకో రోగమువచ్చిన నితరులు మందడుగరా? అక్కఱలన
సమయముల నితరుల యుపకారము నపేక్షింపరా? అప్పుడు డీ త్రేరింగ
నీతులెందుఁ బోవునో. ఒకని ప్రారబ్ధము నొఱియొకఁడు తప్పిం
పలేఁడు. ఎవఁడును తప్పించుకొనలేఁడు. వారివారి కర్మ
ఫలమువారు వారనుభవింపవలసినదే అని తప్పదు ఉపకా
రమువలన మేలు పొందువాఁ డుపకారము పొందినవాఁడు
మాత్రమేకాదు రాజపదాన మందిరవృక్షకు ఫలము సమాన
మైనను సాత్త్వికత్యాగమంతో దాతయే యెక్కువఫల మనుభ
వించువాఁడగును దానముచేయువాఁ డెప్పుడు దయాగుణము
గలవాఁడై యుండును దయాగుణము లేనివాఁడు నిజమైన
దాతకాఁజాలఁడు ఉపకార మెక్కువచేయుకొలఁది దయాగుణ
మెక్కుడగుచుండును దయాగుణమతిశయించుకొలఁదిఁ బరో
పకారబుద్ధి హెచ్చుచుండును. ఇట్లు నిష్కామబుద్ధితోఁ
బరోపకారముచేయు వానితో నేయోగియు నేజ్ఞానియు, నే
భక్తుఁడును, నేకర్మఠుఁడును దులదూఁగఁజాలఁడు. వాఁడు మోక్షా
ధికారి యగుట నిస్సందేహము. వీనిని గాపాడునది వృద్ధికిఁ
దెచ్చునది వీని భావముగాని వీఁడిచ్చు ధనముగాదు పదార్థము
గాదు. కావున మనస్సును నిర్మలపఱుచుటయందు దానముతో
సమానమైనది తపస్సుగాదు యజ్ఞము (పూజ) గాదు తక్కిన
యన్నిదానములకుఁ బాత్రవిచారమావశ్యకమేకాని యాఁకలి
గొన్నవారి కాహార మిడుటయందు నావిచారము గూడదు.
ఇట్లు దానము శ్రేష్ఠమైనను దీనివలన బాగుపడువాఁడు దాత

నొక్కఁడై ప్రతిగ్రహీత (దానము పొందువాఁడు) కుఁ గలుగు ఫల మైహికమే కాని మోక్షముగాదు ఇఁక భక్తిజ్ఞానములో యితరులఁ దరింపఁ జేయును తానొక్కఁడు బాగుపడుటకంటె నితరులనుగూడ మోక్షార్హులఁ జేయుట యొక్కువ శ్రేయస్కరముగదా. ఈ కారణముచేతనే కదా శరణకళేబర దాతలయిన తల్లిదండ్రులకంటె జ్ఞాన దాతయైన యాచార్యుఁడెక్కుడు పూజ్యుఁడయ్యె. కావుననే కదా

కం॥ జ్ఞానము కేవల కృపన
జ్ఞానికి విధిహితముగాఁ బ్రజనితము చేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధికతరఫల మరయన్

అని భారతము ఘోషించెడి.

కావునఁ గోదండరామసేవకసమాజసభ్యులు లోభగుణమునూని సాత్త్వికదానము యథాశక్తి యొనర్చుచు భక్తిజ్ఞానము నజ్ఞానులందు విస్తరింపఁ జేసి సార్థకజన్ములగుదురుగాక యని ప్రార్థింపఁబడుచున్నారు.

---

# తత్పాద తీర్థమే యమృతము.

తత్పాదతీర్థమనఁగా భగవత్పాద తీర్థమని యర్థము. ఇది దివ్యామృతమునకంటె శ్రేష్ఠమైనది అమృతము త్రావిన దేవతలకు మరల జన్మము లేకపోలేదు భగవత్పాద తీర్థము తీసికొనువారికి మరల జన్మము లేదు భగవత్పాద తీర్థమగు

# శ్రీ సీతారామమూర్తి పూజయే మహాయజ్ఞము.

వైదిక కర్మములయిన పంచమహాయజ్ఞములు జ్యోతి
ష్టోమా పౌండరీకాశ్వమేధాదులు సత్రయాగములు లోనైనవి
మోక్షసాధనములు గావు భక్తిలేక భగవదర్పణముగఁ గాక
చేయఁబడు నీయజ్ఞములు పునర్జన్మకారణములగును ఇవి
చేయకున్నను శ్రీ సీతారాముల పూజచేయువారికి భుక్తిముక్తులు
రెండునుగలవు యజ్ఞములు ధనసాధ్యములు ఎంతటి నిర్ధనుఁ
డైనను సీతారామపూజ చేయవచ్చును యజ్ఞముల కన్య
సాహాయ్య మావశ్యకము దేవపూజకు నది యనావశ్యకము
యజ్ఞములందు నియమవిధానము తప్పిన నపాయముగలదు
దేవపూజయందు భక్తిభావనచేఁ గ్రియలు తారుమారయి
నను భగవంతుఁ డాగ్రహింపఁడు యజ్ఞాదులకు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యులు పురుషులుమాత్రమే యధికారులు. స్వామి
పూజకు స్త్రీలు శూద్రులు చండాలురు మ్లేచ్ఛులయిన నధి
కారులే

--

## శ్రీ కోదండరామ సేవక సమాజము

### చతుర్థ వార్షికోత్సవము ఒంటిమిట్ట

ఈ వార్షికోత్సవము యథాపూర్వము బ్రహ్మోత్సవ కాల
మందే జరుగవలెనుగాని జన బాహుళ్యమునలనను, గార్య
భారాతిశయమునను, నెప్పటివలె మూఁడు దినములు జరుప

సాధ్యపడదయ్యెను. కావున ఏప్రిల్ నెల ౧౫-వ తేదియందు మాత్రమే శ్రీకోదండరామాస్థానాధిపత్యము క్రింద సభ జరుపఁబడెను. ఈసభయందు జమ్ములవారిచే సభయందుఁ గావింపఁబడిన తీర్మానము శ్రీ కోదండరామసేవక సమాజ సభ్యులింటికొకప్రతిచొప్పున భక్తసంజీవనిఁ దెప్పించుకొని చదువవలయునను తీర్మానము ఏకగ్రీవముగ నంగీకరింపఁబడెను. కావున నీనాఁటికి సంజీవనిఁ దెప్పించుకొననివారు వెంటనే చందాదారులుగాఁ జేరఁ బ్రార్థింపఁబడుచున్నారు. ఆవల వాసుదాసుఁ డుపన్యాసము నారంభించి యుపవనము పుచ్చుకొనినపిమ్మట వోలంగపురముఁ జేరుటయు నందు స్వప్నంబునఁ దోఁచి రామ లక్ష్మణు లొంటిమిట్టకుఁ బిలిచి కైంకర్యమందు నియోగించుటయు నిచ్చటివారు చేసిన మోసము వలనఁ బూనిన కార్యము సాధింప వేఱుమార్గము లేక భిక్షాటనమున వర్తింపవలసివచ్చుటయు ఓపాద్రవ్యము చేతను పుస్తకముల విక్రయమువలనను వచ్చిన ధనమువలన జరిగినకార్యములు కొన్ని మీరు కన్నులారఁజూచి యున్నారనియుఁ గొన్ని కానరానివి కలవు కాని యవి పూర్వపుస్థితి చూచినవారికి మాత్రమే యెంతపని జరిగినదో తెలియఁ గలదనియు నిల్లు జరిగిన విషయములఁ గొన్ని తెలిపెను.

తల్లులారా తండ్రులారా! శ్రీ సీతారామానుగ్రహము చేతను, మీయందఱి సాహాయ్యముచేతను సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవ సముద్రము దాఁటి తీరముఁ జేరితిని. మీరాఁగి

ముసిండిపలెఁ గూర్చుండి యింతకార్యము చేయించుకొను నీ దంపతులకును (సీతారాములకును) వారి భక్తులైన మీకును సాష్టాంగ నమస్కారంబులు శౌనః పున్యంబుగ సమర్పించు చున్నాఁడను నయయుంచి యంగీకరింతురుగాక కడపవారు నమ్మించి గుండెలో వేసిన రాయియు, బల్లానీటిలోని యాశా భంగము, ఆరేపల్లె ముస్సావి పెద్దమనుష్యుఁడు చేసిన మోసము, భక్త సంజీవని కలిగించిన మనోవేదన యివి యన్నియు నాకుఁ గలిగించిన సంకటము నన్నింతవఱకు జీవింప జేసినదే యాశ్చర్యము విూఁది కారణములచే నిరాశుఁడనై భగవత్సాహాయ్యముఁ దప్పినదని నిశ్చయించుకొని యభిషేక కార్యము చాలించుకొని యీ గ్రామముఁ జేర నిశ్చయించి కొంటిని భగవత్కార్యవిధానక్రమము భగవంతునకే తెలియ వలయును. ఈ కాలమున నారికేళపల్లి భావయ్యగారును, చాగంటివారిపాలెము మధురంగారెడ్డియుఁ గూడనుండిరి. చుంకూరు ప్రాంతమునఁ జూడఁదగిన గ్రామములు రెండు మూఁడున్నవి అందు నిట్టులేయైన యెడల మీకు వెళ్లిపోవచ్చును రండని భావయ్యగారు పిలుచుటచేఁ జుంకూర్పులో దిగితిని అందలి గ్రామజనులు ౪౦౦-౧-౦ లు సాహాయ్యము చేసిరి ఆవల నా గ్రామసమీపమందున్న వేఁటపాలెమునకుఁ బోయితిని. ఆ గ్రామజనులు ౧౦౪ బస్తాలు వడ్లు సాహాయ్యము చేయ వాగ్దానము చేసిరి. ఇవన్నియు జనుకూర్చి ప్రాంతబియ్యముగా మార్చి రెమెంటిమిట్ట చేరఁబంపుభారము మ-రా-శ్రీ, కావూరు సీతా

చేష్టల కెడమే లేకుండెను. ఇవన్నియు మీరు కన్నులారం జూచిన విషయమే, కావున నేను జెప్పవలసిన పనిలేదు ముంజేతి కంకణమున కద్దమేల? వివాహమునకు మంగళ సూత్రమువలె నభిషేకమునకుం దీర్థములు ప్రధానములు

బ్ర॥ శ్రీ॥ మన్నవ రామబ్రహ్మముగారు, గుండవరపు సుబ్బరావుగారు ముప్పాళ హనుమంతరావుగారు కొమ్మరాజు రామరావుగారు వావిలికొలను రామచంద్రరావుగారు ఎస్. ఎన్ శర్మగారు (ముళబాగల్) శి. వెంకోబరావుగారు వీరందఱు ఆసేతు హరిద్వారము, ఆసింధూ బ్రహ్మపుత్రము నగు తీర్థముల నెల్లం దెచ్చి సమర్పించిరి. వీరందఱు నాగ వారు పూర్వపరిచితులు. ఆప్తులు. బంధువులు. వీరుగాక తి॥స॥ అలసర్తి రత్నమ్మగారు (మాచవరము తాలూకా) అపరిచి తలయ్యు వారికి నేనతిథినై వారియింట దిగినప్పుడామె యంతట నామె యె తీర్థములు తెచ్చియిచ్చెదనని చెప్పి యాప్రకారము చెన్నపురి మొదలు సేతువునఱకుంగల సమస్తతీర్థములను బ్రాహ్మణులచే నెత్తించికొనివచ్చి స్వామికిసమర్పించెను వీరికందఱకు సాష్టాంగ నమస్కారము లర్పించుచున్నవాఁడను ఈకార్యమున నాహో య్యపడిన యందఱకు నేమాత్రమైన యుపకృతి చేయఁజాలని యకించనుఁడను కావున వీరి నానమస్కారములే ప్రతికృతిగా నెంచి క్షమింపఁ బ్రార్థించుచున్నాఁడను. సింధ్వాదినదుల తీర్థములు తెచ్చిన బ్ర॥ శ్రీ॥ మన్నవరామబ్రహ్మముగారిను బియ్యముపంపిన మ-రా-శ్రీ కావ్రూరు సీతారామయ్యగారును, రామికి వగచుచున్నాఁడను

నేనిఁక నా కార్యమందుండ వలసియున్నది కావున సంచార
కార్యము సంక్షేపింపవలసియున్నది ఓంకారయ చిప్పను బట్టాభి
షేకమునాఁడు స్వామికి సమర్పించి కలమును గైకొనుట మీ
రెల్ల రెఱుఁగుదురు అటనుటచే వెలుపలనెక్కడ రానని రాఁ
బోవనని యర్థము గాదు. మునుపటివలె భిక్షాటనమందుఁ గాల
వ్యయము చేయ నిష్టము లేదు ఇది నా సంకల్పము భగవత్సం
కల్పమెట్లున్నదో ఫాల్గునమాసమున సభకు రావలసియుండును
గదా కావున స్నేహమర్యాద ననుసరించి చుట్టమువలె నత్యా
యిక కార్యము పడినప్పుడు వచ్చుచుందును. అట్లయినఁ గాని
యీ కార్యము జరుగదు. అదినాంతముగ జరుగఁజేయు భారము
మీయందే కదా యున్నది ఈ కాలములో స్వామి నైవేద్య
మునకుఁగాను అందరు నెలకొక్క రూపాయ నీయ వేఁడితిని
ఆసంఖ్య యింకను బూర్తికాలేదు ౨౦ గురు కావలెను అదియైన
యెడల నీమూఁడు సంవత్సరములు స్వామి పస్తుండునను భయము
లేదు ఇఁక నిక్కడ జరుగవలసిన కైంకర్యములలో (1) నిత్యనైవే
ద్యము. (2) వాహనముల నిర్మాణము (3) గోపురములు చక్కఁ
బఱుచుట ముఖ్యములైనవి. ఈమూఁటిలో నిత్యనైవేద్యమున
కేర్పాటు జరుగుట మిక్కిలి ముఖ్యమైనది తక్కిన రెండు కార్య
ములు తామొక్కొక్కరే నిర్వహింప శక్తిగలవారు మీలో
స్త్రీలును గలరు పురుషులును గలరు భగవంతుఁడు వారిమన
స్సులందు సంకల్పము గలిగింపవలసిన దొకటే కొంత నిత్య
నైవేద్యమునకుఁగా నొక విధమైన యేర్పాటు చేసిన బాగని

వారి క్రింగా నేర్పాటుచేయుట బాగని తోంచినది ఈవిషయము బాపట్లలో మ-రా-శ్రీ తల్పశాయిగారితోను మ-రా-శ్రీ ఏ ఎల్ నారాయణరావుగారితోను పొన్నూరు సబ్ మేజస్ట్రీటు మ-రా-శ్రీ శ్రీనివాస రావుగారితోను, నెల్లూరిలో మ-రా-శ్రీ టి వి. శివరామయ్యగారితోను, నెంపలూరిలోని మ-రా-శ్రీ ఏ పరశురామరావుగారితోను, కడపలోని మ-రా-శ్రీ కే. గుండూరావు గారితోను మాటలాడియున్నాను. అందఱు నది మేలైనస్థితి యనియు నీచట్టముక్రింద రిజష్టరుచేయుట బాగో యాలోచించి చెప్పెదమనియు నాకార్యార్థమై యిచ్చటికి వచ్చెదమనియును గూడం జెప్పియున్నారు ఆకార్యము త్వరలోనే జరుగు నాలోచన చేసెదను. ఇంతవఱకు నేనొక్కండనే వహించియుండిన భారి మింక మీఁదు ౧౦౦ మంది భరింప వలసియుండును. ఇంతకంటె నెక్కువ బాగుగం గార్యములు జరుగుననియు నమ్మెదను చక్కని యేర్పాటు చేయలేదను నింద నుండి నేను ముక్తుండనయ్యెదను. భక్తులు భక్తురాండ్రు కొందఱు సీతారాములకు నాభరణములు చేయించి వానిని సమయము పడినప్పుడు సీతారాములకు సమర్పించి మరలం దీసికొని రక్షింపవలసినదిగా నాయొద్ద నిచ్చియున్నారు. కావున ట్రెవారికి నేను విశ్వాసినై యున్నాను. ఈ కారణముచే నే నీ యాభరణాదులందు దేనిని దేవాలయ ధర్మకర్తల స్వాధీనమం దిచ్చినవాండనుగాను. ఈ యూరిలోం దక్కిన చోటులందువలె గృహిణు లుత్సవకాలంబున స్వామి కలంక

రింపఁ బడు యాభరణము లిచ్చి యుత్సవానంతరమున వానిలఁ
తీసికొనుచున్నారు ఆ వ్యక్తి తనే తన యింటియందుంచుకొను నా
సర్వస్వము సమాజమునకు రిజిస్టరు చేసిన ఏని గూడ
నాప్రముఖుల స్వాధీనము చేసెదను. అందువలన స్వామి
యాభరణములు ఇంపీరియల్ బాంకులో దాఖలైయుంచె
దను ఉత్సవకాలంబులఁ దెచ్చుచు మరల నా బాంకులోనే
దాచిల పఱచవచ్చును

ఇప్పుడు దేశ మల్లకల్లోలముగనున్నది ఏ నాఁటి రాజ్య
మేలునో తెలియకున్నది. దేశమున శాంతి [illegible]ంచినప్పుడు నా
ప్రకారముచేసెదను అనాచార దురాచారములు లేక శాస్త్రీ
యాచ్ఛవ జరగుచు నధికారి నిరోధము ప్రజవిరోధము లేకుండ
వలను స్వామిసేవసేయుచు నిందే యుండెదను

మఠమొక చిన్నదువి. మీరు నెలనెల కిచ్చునదిగాని
సంవత్సరమున కొకసారి యిచ్చునదిగాని పూర్తియైనయెడల
స్వామి నైవేద్యమునకు సరిపోవును నాయుఁవేతనము కుటీర
ములోఁ బనిచేయువారికిఁ జాలిచాలక సరిపోవును. సంజీవనీ
కార్యము మందరకార్యము నిర్వహించువారికి సంజీవనిలో
నేమైన మిగిలిన సరిపోవును ఇప్పటి చందాదారుల సంఖ్యపట్టి
చూచిన సంవత్సరమునకు ౨౦౦-౦-౦ లు కూడ మిగులునట్లు
తోఁచ లేదు ఈ సంవత్సరము ౧౦౦-౦-౦ నష్టము కావునఁ
చందాదారులను నెక్కుడుగఁ జేర్ప సభ్యులను ప్రార్థించెదను.
గతసంవత్సరమున జరిగిన యాగములకు మీఁద జరుగఁజాలవు

మ-రా-శ్రీ గూ ...త్తి సుబ్బరామగారే యీకార్యము నిర్వహిం చుచు మం... కార్యమునకును సహాయపడం బూనియున్నారు కావున సంజీవని... దినదినమును జరగిన లోపముల సవరింప నింకొక మూపము ... ట్టినను అసల నేలోపములు మూయందు గలుగజాలవు అన్ని... యు నట్లు చెల్లుపోవ బ్రహ్మోత్సవ కాల ము... దు మిూరంటివి వారి కన్నదానము జరుగవలసియున్నది దానికి ౫౦౦-౧-౦ లకుం దక్కువపట్టదు ఈ విషయమై నా ప్రార్థన చేసిన మన సమాజసభ్యులే భద్రాచలము పోవు మార్గమున ... కాలంబున నన్నదానము చేయుచున్నవారు అది చిరకాలముగ సుప్రసిద్ధస్థలము. కావున నందొకరు చేయ వేచియుండుదు. ఇది యట్టిదిగాదు సనాతనముగం గన్న ... తెలిచిన శిశువు పోషించువారు లేరేని శోషించును కావున వారి ...సాన్ద్ర... ృష్టి యీ బీదరామునియందుం బ్రసరింప జేయం బ్రార్థించెదను.

నాభారము మీయందు వైచుటకుం గారణము లేక పోలేదు కోడెలు వహింపవలసిన భారము బడుగెద్దులు మోయం జాలవు నేనేమియుం దగిన యేర్పాటులు జీవిత దశయందే చేయకపోయితినేని యిహలోకమందు నిందతప్పదు పరలోక మందు నాకు శాంతియులేదు. సుందరకార్యాదులకు నాజీవిత శేషముకడపం దలంచిన విధానమునకు నేకాగ్రచిత్తత్వము ముఖ్యము బహుకార్యభార వ్యగ్రమనస్కునకు ననన్యచిత్తత్వము దుర్లభము కావున నెట్టులైన నీ జంజాటము దొలం

| | | | |
|---|---|---|---|
| ౭ | మధురె పెదసుబ్బారెడ్డిగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౮. | ,, రంగమ్మగారు. | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౯ | అన్నపరెడ్డి పెదసుబ్బమ్మగారు. | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౦. | మాగూరి లచ్చిరెడ్డిగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౧ | ,, కోటమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౨. | ,, కోటిలింగారెడ్డిగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౩ | ,, రంగమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౪. | ,, మహానంది రెడ్డిగారు | ౫౦-౦-౦ | ౫౦ ౦-౦ |
| ౧౫. | ,, కృష్ణమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౬. | అన్నపరెడ్డి కోటిరెడ్డిగారు. | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౭. | ,, కోటమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౮ | ,, చినకోటిరెడ్డిగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౧౯ | ,, సుబ్బమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౨౦ | మారిసెట్టి రామన్నగారు, రేలంగి. | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౨౧ | ,, రత్తమ్మగారు రేలంగి | ౩౩-౫-౪ | ౩౩-౫-౪ |
| ౨౨ | కంచర్ల జగన్నాథముగారు, రేలంగి. | ౩౩-౫-౪ | ౩౩-౫-౪ |
| ౪౭. | రాజా వెంకటస్వామి సెట్టిగారు, ధర్మవరము. | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౫౧. | గుంటాల సుందరమ్మగారు, ఆత్మకూరు (నెల్లూరు) | ౫౦-౦-౦ | ౨౦-౦-౦ |

సర్వకలుషములం బోంగొట్టి నిత్యశుభముల నొసంగబద్ధకంక
ణుండై యెవండు సన్నిహితుండై యుండెనో, యేజగదాదిమూర్తి
భూతలవాసులపైగల యవ్యాజానురాగమున శ్రీసుదేకశిలా
నగర, వేంకటాచల శ్రీరంగ నీలాచలాది పుణ్యక్షేత్రసీమలం
దనయర్చావతారమూర్తుల ననుగ్రహించి యుండెనో యా
దేవదేవుని, యాలీలావిభవావతారుని, ఆహేయగుణరహితా
నంతకళ్యాణగుణపూర్ణుని,ఆభక్తవత్సలుని,ఆశ్రీసీతారామచంద్ర
భూపాలుని సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవము కన్నులారం
గాంచం గలిగితిమి. ఎంత ధన్యాత్ములమోకదా! ఏపుణ్యా
తిశయ ప్రభావముననో నీజన్మమం దిచ్చటం గనుగొంటిమి

శ్రీ జగన్నాథుండు దేవాదిదేవుండు త్రేతాయుగమున
నయోధ్యాపతియగు దశరథనృపతికిం గౌసల్యాసతికి శ్రీరామ
చంద్రుండను పేర సుతుండై యవతరించి, సవనావనార్థము గాధే
యునను సరించి, తాటకాసుబాహుల సంహరించి, యజ్ఞము
శాంతవిఘ్నముగ నొనరించి, నిజచరణ సరసిజరజోలేశ
మున గౌతమపత్ని శాపముహరించి, నుగ్రధర్మవిపాటన మాచ
రించి, నిత్యానపాయినియగు శ్రీసీతామహాలక్ష్మిని వరించి,
పితృవాక్య పరిపాలన నెపమున జాయానుజులతోం బదునాలు
గేండ్లు వనుల మునిరీతిం జరించి, దశాననాపహృతయగు జనక
జకై వనచరుల సఖ్య మంగీకరించి, సాగరముత్తరించి, సపుత్ర
మిత్ర బంధుపరివారముగ లంకాధీశుని రావణుని మనుమాడి,
శ్రీసీతాలక్ష్మణ సహితుండై యయోధ్యం జేరె, భరతాది

సోదరులు, కౌసల్యాది మాతృవర్గము, సుమంత్రాది మంత్రి వరులు, వసిష్ఠవామదేవాది పురోహితులు, ధనకనక వస్తువాహనాద్యుపాయనములఁ గొని భక్తియుతులై గొలిచినిలిచిన వివిధ దేశాగతనృపతితతియు, బంధుజనులు, మిత్రులు ప్రమోద సంభరితమానసులై యెడనెడఁ గొలిచియుండఁ గపివీరులుగొని తెచ్చిన ఆసేతుశీత నగమధ్యపుణ్యనదీనదపావన తీర్థములు, ప్రాక్పశ్చిమ దక్షిణోత్తరసముద్రజలములు, వసిష్ఠాదులుగొని యభిషేకింప మహావైభవముతో శ్రీరామచంద్ర భూపాలుఁడు సామ్రాజ్యాభిషిక్తుఁడయ్యెనని శ్రీమద్రామాయణమున శ్రీ వాల్మీకిభగవానులు తమ యమృతవాక్కులచే శ్రీసీతారాముల విమలచరితామృత రసాయనమును వీనులవిందుగా వినిపించిరి గీర్వాణభాష తెలిసిన వారది చదివి యానందించుచున్నారు.

శ్రీ ఆంధ్రవాల్మీకి మహర్షులవారు మనకు (ఆంధ్రులకు) శ్రీమద్రామాయణమును దెనుఁగుఁ గావించి, గీర్వాణభాష తెలియని లోపమును దీర్చుటయేగాక శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ మహార్ణవమును మందరముతోఁ దరచి యమృతమును మన కొసఁగుటకై సంకల్పించి యీ సామ్రాజ్య పట్టాభిషేకము దానికి పూర్వాంగముగాఁ గావించియుండుట మీకందఱకుఁ దెలిసినవిషయమే

ఇట్టి మహత్తర యజ్ఞమునకు సంభారముల సేకరించుటకై వెంకాయుచిప్పతో మొదలు ౧౯౨౯ సం॥ మే ౧౧ తేది మొదలుకొని ఉత్సవమగునంతక దమారమి ౧౧ నెలలు వారు

సలిపిన కఠిన దీక్ష స్థైర్యబలము లేనిచో కొనసాగునది కాదని
సూఢిగఁ జెప్పఁగలను. కొన్నిచోట్ల పండ్లేవియు దొరకవయ్యె
కొన్నితావులఁ జాలన్న చెట్లపాలే కొన్ని ప్రదేశములఁ ద్రాగ
నీరు కఱవయ్యెను. కొన్నిరాత్రులు శివరాత్రులుగా సాగినవి
వేళయనిలేదు. పాళయనిలేదు రెండు రెండు గ్రామము
లోనికిఁ బోవలయును. అని పిలువఁగనే ఆహారము తీసికొన
నిండు. లేకపోనిండు. అప్పుడు బయలుదేఱవలసినదే మరల
విడిదలకువచ్చుట యేతెల్లవాఱుజామునకో అప్పుడు మేలు
కొనియుండి యెవ్వరైనఁ బాలిచ్చిన పుచ్చుకొనుట సంభవించు
చుండెడిది తెనాలి మొదలగుచోట్ల తీవ్రమగు జ్వరము దగ్గుచే
బాధపడుచుండియు స్వామికార్యమునకై గ్రామసంచారమునకై
పోయియుండిరి పాలుమాలియుండిన దినమొకటి యున్నాలెక్క
లోనికి వచ్చినదికాదు స్వామికార్య మొనర్చుటయం దిట్టి
యాసక్తి, పట్టుదల, కార్యదీక్ష, ధైర్యము వీరియందు మూర్తీ
భవించి యున్నవని సత్యము వచించుచున్నాను గ్రామము
లోనికిఁబోయి తిరిగివచ్చి కొంచెము విశ్రమించుటకుఁ జూచు
చుండిన నప్పటికప్పుడె సందేహములు తీర్చుకొనఁ గాచుకొని
యుండువారు చుట్టుమూఁగెడివారు. వారితో నొక్కొక్క
ప్పుడు తెల్లవాఱిపోవుచుండెడిది. రోగులకు మందులు వ్రాసి
యిచ్చుచు, ప్రశ్నములడుగువారికి విసుగుకొనక ప్రత్యుత్తరము
లిచ్చుచు, సంజీవనికిఁ బ్రతినెలకు వ్యాసములంపుచు నొకక్షణ
మైన వ్యర్థపఱుపక కాలమును సద్వినియోగ పఱుచుట యీ

మహనీయునికి నాజమైనది. ఇట్లు కష్టపడి వీరు చేసిన ప్రయత్నముయొక్క ఫలము భుజియింతురుదాతలు భక్తవరులు అను వీరివాక్యము యథార్థము. ఈలోపునగలిగిన కొన్నికొన్ని పరిస్థితులనుగుఱించి, సీతాదేవి చెఱవోయిన పదినెలలోఁ గలిగిన సంకష్టము లిట్లే యున్నవనియు నింకేమేమిరానున్నవో రానిండు చూతమనియు మాతో నప్పుడప్పుడు శ్రీస్వామివారనుచుండెడి వారు. జరాభారము, దానికి తోడు కార్యభారము, వీనికిఁ జేయూఁతయొసఁగుచు సకాలమున కాహారనిద్రా విహారములు లేమియు, నడుమ నడుమ జ్వరాదిబాధలును శరీరమును నెంత నొవ్వఁ జేయుచున్నను వెనుకంజవేయక విసుగుకొనక కార్యసాధనమున కెన్నెన్నివిధములనో శ్రమించి, తాము సర్వమును త్యజించి విరాగియై కేవల కౌపీనధారియై స్వామికిఁ గిరీటములు, మహారాజవస్త్రములు వివిధభోగములు సమకూర్చి సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవమును జరిగించి మనలకందఱకుఁ గనులపండువు జేసిన వీరిఋణమును మన మెన్నిజన్మములకైనఁ దీర్చుకొనఁ గలమా? ఆ వాల్మీకి రామరాజ్యమున శాంతచిత్తముతో శ్రీ సీతారాముల చరితమును వ్రాసి శ్రవణపర్వము మాత్రము గావించిరి. కాని యీ ఆంధ్రవాల్మీకులవారు రాజాదరణములేని దినములలో శరీరమున రోగబాధకలిగియు రామాయణము నాంధ్రీకరించియు శ్రీరాము సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవమును జరిగించియు చెవులకుఁ గనులకుఁగూడ విందు గావించిరి. ఇమ్మహోత్సవ దర్శనమంచొక మహాఫలమిమిడి యున్నది. అవాఁడె యోధ్యలో పట్టాభిషిక్తుఁడైన శ్రీ సీతా

రాములఁ గననేరని మందభాగ్యులు నేఁడిచ్చోట ౫౦౦ పావన తీర్థములచే నభిషిక్తుఁడైన స్వామిని దర్శించి తీర్థమును బాన మొనర్చి రేని మరల మాతృస్తన్యపానము సలుపకుండుట నిశ్చయము మహావిశ్వాసముగలవారి కీ ఫలము నిశ్చితము. నమ్మిన వానిది సొమ్ము. నమ్మనివానికి దుమ్ము. మా సభ్య సోదరులలో మాత్రము శ్రీరంగనాథుని దర్శించి తత్పాదతీర్థపాన మొనరింప నిరాకరించిన వృథాభిమానియవస్థకు రాకుందురుగాక. ఒకనాఁటికైన యాద్విజోత్తముఁడు

చం. కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధిలేదు నేఁ
డిటహరిగానఁబో నెఱుఁగ నేము దురాత్ములమేము కల్మషో
ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల తపంబు లేల ప
ర్యటనము లేల శీలములు యాగములుల్ మఱి యేల కాల్చనే.

అని పశ్చాత్తాపపడిన బ్రాహ్మణులవలెఁ బశ్చాత్తాపతప్తుఁడు కాకుండునా? పోనిండు శ్రీసీతారాము లా మహాత్మునకుఁ ద్వరలోఁ బశ్చాత్తాపబుద్ధి ప్రసాదించెదరుగాక!

సభ్యసోదర సోదరీమణులారా! శ్రీవాసుదాసభక్తులారా? మహావిశ్వాసమున శాశ్వతపదవిగనుఁడు వారు శ్రీభక్తకల్పద్రుమ శతకమున వ్రాసిన యీపద్యమును బ్రమాణముగఁ బరమవిశ్వాసముతో సంగీకరింపుఁడు.

శా. ఆనాఁ డల్ల యయోధ్యలోన నినుఁ
గన్నారం గనఁగ లేని శ్రీ
హీనుల్ నేఁడిట నిన్నుఁ గాంచుటను
దా మెత్తంగఁ బో దుర్విపై

క్ష్మానాథాతనువుల్, నిజంబు మరలన్
సందగ్ధసర్వాఘులై
నానాకర్మలు నొంటిమిట్ట
రఘుచంద్రా? భక్తకల్పద్రుమా?

వారు పర్యటనము గావించునపుడు నేనును వారివెంట నుండి వారు పడెడు శ్రమము కనులారఁ గాంచినవాఁడనగుట నాహృదయాంతర్వర్తి శ్రీకోదండరాముని యానతిమేరదాఁటఁజాలక యిటులు వ్రాసితిని ఇఁకఁ బ్రస్తుత మనుసరింతము

చైత్ర శుద్ధ త్రయోదశి శ్రీసీతాకళ్యాణము సాయంకాలము నాలుగుగంటలవేళ మహావైభవముతో జరిగినది. శ్రీసీతాదేవికి నూటెనిమిది మంగళసూత్రముల స్వర్ణహారము శ్రీవాసుదాసస్వామివారు సమర్పించిరి.

సామ్రాజ్యపట్టాభిషేక వేదికపై నదిపఱకే మంటపము లేర్పఱిచి యందుఁ ౧౦౦౮ గలశముల స్థాపించి యోషధుల చేతను జలములచేతను మంత్రయుతముగ నాకలశముల నింపి యుంచిరి సేతువు మొదలు హరిద్వారమునకును, సింధువు మొదలు బ్రహ్మపుత్రవఱకును గల పుణ్యనదీనద తీర్థములుగల ౫౦౧ కలశములను ద్రయోదశినాఁడే మంగళవాద్యములతోను శ్రీసీతారామ సంకీర్తనములతోడను శ్రీరామసేవాకుటీరము నుండి నగరకీర్తనము గావించుకొనుచుఁ గొనివచ్చి సామ్రాజ్య పట్టాభిషేక వేదికయందుంచిరి. సామ్రాజ్యాభిషేకమహోత్సవ దిదృక్షువుల యుత్సాహము నిమిషనిమిషమునకు నధికమగు

చుండెను. ఎపుడు తెల్లవాఱునా ఎపుడు పట్టాభిషేక మహో త్సవము కనులారఁ గాంతుమా యని యువ్విళూరు మనంబుల జనులు నిరీక్షించుచుండిరి శ్రీకోదండరామ సేవకసమాజ సభ్యులును భక్తులును శ్రీసీతారామ నామసంకీర్తన పరులగుచు వేకువజామున నేలేచి కార్యములఁదీర్చి రామతీర్థమున సున్నాతు లై ధౌతవస్త్రధరులై భగవద్గుణకీర్తన పరులగుచు శృంగిపర్వత మునకు శ్రీవాల్మీకి ఆశ్రమమునకుఁ జేరిభజనలు గావించుచుండిరి. శ్రీ ఆంధ్రవాల్మీకి వాసుదాసస్వామియు నిత్యకృత్యములు దీర్చి కొని యొక వెండిపళ్లెరమున సువర్ణమయపాదుకలను, నింకొక దానియందు తాముపారాయణము గావించిన శ్రీమద్రామాయణ సంపుటములను నునిచి షోడశోపచార పూజలు గావించి భక్త లతోఁగలిసి భజనము చేయుచుండిరి ఉదయ మెనిమిదిగంట లయినది బ్యాండు నాగస్వరాది మంగళ తూర్య రావములు సెలంగుచుండ శ్రీసీతారామభజనమెల్లెడ జరుగుచుండ శ్రీ ఆంధ్రవాల్మీకుల వారొక రజత పళ్లెరంబునఁ బాదుకల నునిచి వేఱొక దానియందు రామాయణ సంపుటములనుంచిరి. తాము పాదుకలను శిరంబున ధరించిరి ఆబాగుచూడ జటావల్క లాజినధరుండయి పాదుకలను గొనిపోవు భరతుఁడు స్మరణకు వచ్చుచుండెను. "వ్యాఖ్యానమును వ్రాయఁబూనిన వారీ రామాయణములఁ దేవలసినదని నవ్వుచు శ్రీవారునుడివిరి దానికి మనవిగా అప్పా! ఆపని మీకుగాక యితరులకగునా?" యని నేనంటిని శ్రీ ఆంధ్రవాల్మీకులవారిచే, అష్టోత్తర శతవారం

బులు పారాయణంబు గావింపఁబడిన శ్రీమద్రామాయణ సంపుటముల మోచి తెచ్చు భాగ్యము నాపురాకృత సుకృతవశమున నాకు లభించినది. అప్పుడు శ్రీకోదండరామ సేవక సమాజ సభ్యులును దదితర భక్త, భాగవతశిరోమణులు పరవశములగు తనువులతో నానందబాష్ప పూర్ణాక్షులతో భగవన్నామ భజనము చేయుచు శ్రీవాసుదాసస్వామి ననుసరించి నూరు మెఱవడి గావించి సుమారు ౯-౩౦ గంటలకు అభిషేకవేదికకుఁ జనుదెంచిరి హరినామ సంకీర్తనము సేయనినోరును తాళములు వేయని కరములును నృత్యముసల్పని చరణములును, ఆనాఁ డెందును గఱనయ్యెను అప్పటికప్పుడే జనము క్రిక్కిఱిసి యుండెను. ఎట్టులో మేము అభిషేకోత్సవము జరుగు వేదికపైకిఁ బోవఁగలిగితిమి.

ఇంత జనసమ్మర్దముండినను స్త్రీలకును బురుషులకును గూర్చుండుటకుఁ బ్రత్యేకపు టేర్పాటులు గావింపఁబడినవి ౧౨ గంటలకు శ్రీస్వామికి అభిషేకమొనర్చుటకు ఋత్విజులు ప్రారంభించిరి. ఒకవంక వేదపారాయణము గావింపఁబడుచుండెను విధ్యుక్తక్రమమున నొక్కొక్క కలశమును దెచ్చి శ్రీరామభూపాలునకును శ్రీసీతామహాదేవికిని లక్ష్మణపెరుమాళ్లకును నభిషేకించుచుండిరి ఆంధ్రవాల్మీకిహస్తంబు నలంకరించి, వేనవేలుగ రూప్యములు సేకరించి, అందులోనొక్క దమ్మిడీయైనను దాఁచుకొనక స్వామిసేవనలిపిన కలికిగుణముల తిప్ప టెంకాయచిప్పను, అందు రెండు కలములనుంచి, శ్రీవా

సుదాసస్వామివారు శ్రీరామస్వామిసన్నిధియందుంచిరి టెంకాయ చిప్పవంటి నిష్కామసేవాపరులఁగాక, స్వామిపేరుచెప్పి ద్రవ్యమార్జించిదిగమ్రింగువారికిని స్వామికని తెచ్చిన పదార్థములను స్వార్థమున కుపయోగించుకొను పాపమతులకును టెంకాయ చిప్పకు దొరికిన పదవిదొరకునా? వాసుదాసుఁడు టెంకాయ చిప్ప స్వామిపాదములకడనుంచఁగానే యిఁక నాయన సంచారమునకై మన గ్రామములకు రాఁడేమో యని గుంటూరు-నెల్లూరుమండలమందలి స్త్రీపురుషులు కొందఱువగచిరి కొందఱు కన్నీరుగార్చిరి

పూర్వోక్తములైన మంటపములందలి కలశోదకములఁ గొంతవఱ కభిషేకము జరిగినపిమ్మట హరిద్వారశుద్ధగంగ, సింధుబ్రహ్మపుత్రాది పుణ్యనదీనదతీర్థములచే శ్రీస్వామికి నభిషేకముగావించిరి ఇరుగడల వింజామరలవేయుచుండిరి వెండి బెత్తములఁబూని ముందిరువురు నిలఁబడి బరాబరులు చెప్పుచుండిరి. ప్రేక్షకులందఱు కూర్చుండినచోటునుండి కదలక భగవద్భజన సలుపుచుండిరి నడుమనడుమ శ్రీస్వామికి నివేదన, నీరాజనములు జరుగువేళల జయరమారమణగోవిందా, హరీ! యని ఉచ్చై స్స్వరమున భగవన్నామము గావింపఁబడుచుండెను మధ్యాహ్నము పండ్రెండుగంటలు దాఁటునప్పటికి నభిషేకము సంపూర్ణమయినది. అప్పుడు శ్రీవాసుదాసస్వామివారు శ్రీసీతారాములను, సభాసదులను జూచి ఆర్యులారా! స్వామి తనకార్యములన్నియు నెట్టులో చేయించుకొనెను.

ఇంక టెంకాయచిప్పను స్వామిసన్నిధియందు సమర్పించుచు న్నాను ఈలేఖినులను ఆయన సంకల్పము ననుసరించి తీసి కొనుచున్నాననిచెప్పి టెంకాయచిప్పనం దునిచి కలములను దీసికొనిరి. అంతట భోజనకాలమగుటచే నందఱు భోజనము లకుఁ జనిరి అన్నదానము శ్రీరామనవమినుండియు జరుగు చున్నను శ్రీ సీతాకళ్యాణ, పట్టాభిషేక రథోత్సవములు మూఁ డుదినములు దినమునకు సగమువక్షమున ౨ వేలమంది బ్రాహ్మ ణులకు, వేయిమంది క్షత్రియులకు ౧౫౦౦ మంది వైశ్యులకు, ౪-౫ వేలమంది శూద్రులకు తదితరజనములకు నన్నదానము గావింపఁబడినది

సాయంకాల మయిదు గంటలకు శ్రీ స్వామిని చక్ర వర్తి యుడుపులతో నలంకరించి దర్బారు ఉత్సవము జరుగు నని తెలియనయ్యెను. స్థలము దొరకదని రెండు మూఁడు గంటలకే జనులెల్లను సామ్రాజ్యాభిషేక మంటపమెల్లనిండి పోయిరి ఒక అంగుళమైన నిమ్ములేకుండ శ్రీ స్వామి వేంచేసి యుండువేదిక పైఁగూడ జనులుండిరి శ్రీస్వామికి నూత్న స్వర్ణమయ కిరీటములను శ్రీ వాసుదాస స్వామి నారర్పింప నర్చకులు శ్రీ సీతారామ లక్ష్మణులకు నలంకరించిరి ౧౦౮ పట్టాభిషేక పతకముల సరమునుగూడ స్వామి కర్పించి శ్రీ వాసుదాసుగా రర్చకులచే నలంకరింపించిరి. నూత్నకిరీట స్వర్ణహారా భిశోభితులును లోక కళ్యాణకరులును నిజభక్తలో చనచకోరచంద్రులునునగు శ్రీ సీతాలక్ష్మణయుతులునగు శ్రీ

రామచంద్ర చక్రవర్తిని పుంసాం మోహనరూపుని దివ్యమంగళ విశ్వమోహన రూపము నాపోవని తమిఁగని కన్నులకలిమి నేటికిఁ సార్థకమయ్యెనని జను లమందానంద పరవశులయిరి. శ్రీ సీతారామ నామ సంకీర్తన మొకనిమేషమైనను వినఁబడని తావు ఆలయావరణమున గానరాదయ్యెను.

శ్రీ వాసుదాస స్వామివారు సామ్రాజ్య పట్టాభిషేక కైంకర్యార్థముగ దేశ పర్యటనము గావించు తఱిగలిగిన సంఘటనల సూత్ర ప్రాయముగఁ దెలుపుచు శ్రీభక్తకల్పద్రుమ శతకమును రచించి ముద్రింపించి యుండిరి శ్రీ సీతారామ సార్వభౌమ శిరోమణి నిండుగొలువున్నవేళ నా శతకమున స్థాలీపులాక న్యాయముగ నచటచట ముఖ్యములగు విషయములు గల పద్యములఁ జదువవలసినదని మద్గురు స్వాములగు శ్రీ వాసుదాస స్వామి యానతిచ్చిరి శ్రీ హరినామ నాదమే భూవభోంత రాళములెల్ల నిండియున్న నాచోట నా కంఠ స్వరమెవరికి వినఁబడును. ఎట్టులో సందుచేసికొని సన్నిహితులుగా నుండువారికి మాత్రము వినఁబడునట్లు నాలుగైదు పద్యములను జదువఁ గలిగితిని శతక రాజమును స్వామి కర్పించిన పిమ్మటఁ బ్రకటింపఁబడి కావలసిన వారికి విక్రయింపఁబడెను. ఇట్లు శ్రీరామ సామ్రాజ్యాభిషేక మహోత్సవము శాంత విఘ్నమై సర్వజనానంద హేతువై, త్రిజగత్కల్యాణకమయి పరిసమాప్తిం జెందినది ఆంధ్ర దేశమున సామ్రాజ్య పట్టాభిషేకము లని చాలమంది చేయు

న్నారు అందు శ్రీమద్రామాయణ మేయేఁబది నలుగురో రాయణ మొనర్చుట చూచున్నారము గాని ఒకరే మాయణము నూటెనిమిది సారులు పారాయణము గావిం టగానము. అది శ్రీ వాసుదాస స్వామి వారొక్కరే వించిన్నారు ఇదియే శాస్త్రసమ్మతపద్ధతి.

ఒక్కొక్కమహనీయుఁ డొక మహత్తరకార్య మొనరింప సంకల్పించి దానికి పూర్వాంగముగ నొక్కొక్కకార్యము గావించుటాచారమైయున్నది. పంచమవేదమును రచించుటకుఁ బూర్వము శ్రీతిక్కనమంత్రి యజ్ఞముచేసి సోమయాజియయ్యె ను భక్తిరసామృతసింధువగు భాగవతరచనకుఁ బూర్వము శ్రీపో తనామాత్యులు గంగాయాత్రగావించినట్లు ప్రమాణములు గలవు

శ్రీరామాయణ క్షీరవారాశిం దఱచియమృతముం దేఱఁ బూని శ్రీవాసుదాసులు శ్రీరామసామ్రాజ్యపట్టాభిషేక మహా యజ్ఞమొనరించియున్నారు శ్రీవాసుదాసస్వామివారే కార్య ము చేసినను తమకొఱకుఁగాక జగద్ధితమునకేయనుట యాంధ్ర ప్రపంచమునకుఁ గ్రొత్తగాఁ దెలుప నక్కఱలేదు. ఇప్పుడు వీరు పూనినమందర వ్యాఖ్యానప్రకటనకార్యము వారుగాక మఱియిరువురుమనుష్యులకు మూఁడు సంవత్సరములు నడుములు విఱుగఁబనియున్నదని చెప్పుచున్నారు ఇంక వారి కెంతపని యుండునో చదువరులే యూహించుకొందురుగాక ఇది యొకటే పని కాదే. పత్రికా నిర్వహణము, సమాజభారము

స్వామి నిత్యభోగకల్పనము గూడ వీరు సమర్థింపవలసిన కార్య ములయ్యున్నవి దినదినము వీరికివచ్చు జాబులకుఁ బ్రత్యు త్తరములు వ్రాయుటకే పూఁటపట్టును జనధనైక సాధ్యము లగు నీకార్యమును మనసునకు వచ్చుటకై మనవి వ్రాసికొంటిని. సుందరము బాలకాండము ప్రకటించుటకు సుమారు నాలుగు వేల రూప్యముల దాఁక కావలసియుండును ద్రవ్యముచేత నుండిన కదా ఏకార్యమైనను కొనసాగును ఆ ద్రవ్యము సమకూఱుసంత దనుక వారు వ్రాసిన గ్రంథములను ధరలు దగ్గించి విక్రయించు చున్నారు ఆ వివరము నీసంచికయందే వేఱొకచోట వ్రాసియున్నారు.

ఓ కోదండరామసేవక సమాజసభ్య సోదరసోదరీంత్న ములారా! మీరు శక్తికొలఁది ప్రచారము గావించి వారి గ్రంథము లీయదనునఁ బ్రతియాంధ్ర గృహము నలంకరింపఁ జేసి స్వధర్మరక్షణమును గావింపఁ బూనుఁడు. సంజీవనికిఁ జందాదారులుగాని సభ్యులు చందాదారులుగఁ జేరుఁడు చందాదారులను జేర్పుఁడు స్వదేశికుని సంకల్పమును గుర్తె ఱిఁగి తదనుకూలాచరణమున నిజగురుసేవాభాగ్యమును చూ ఱఁగొనుఁడు. గురుపూజయనఁగాఁ బూలుపత్రితోఁ బూజిం చుటే పూజకాదు వారు సేయఁబూనినకార్యములకుఁ దోడయి వారికిఁగల భారమును నేయుపాయముచే నైన తగ్గించుచువారి మనస్సునకు మెప్పుపుట్ట వర్తించుట పూజకాదా వారి యాదే శాను సారముపర్తించి రామాయణ సముద్రమథనమునకు దేవ

తలవలెఁ దోడయి యనుసృతమునుగొందు. మనోవాక్కర్మముల నిజగురుచరణ సేవ మఱవకగావించిధన్యులుకందు. గురువే దైవము. గురువే తండ్రి గురువే తోడునీడ వేయేల సర్వము గురువే యని త్రికరణశుద్ధిగ నమ్మి వారిసంకల్పమునకుఁ దోడు పడుఁడు. ఇట్టిసేవ కోరినపుడెల్ల దొరకదు

ఓ ఆంధ్రమహాశయులారా! మందరమునగాని, సంజీవనిగాని వాసుదాసులవారికిఁ దెలుపు క్రొత్తవిషయములు లేవు. భక్తిమతోద్ధరణము గావించి లోకసేవసేయుటే వారి యాశయము ఏకాంతు లెవ్వని నేమియుఁ గోరక భద్రచరిత్రంబు పాడుచుందురనుట యదార్థము లోకసేవసేయుట వారి నైసర్గిక లక్షణము. వారు వృద్ధులైనారు. ౭౦ సంవత్సరములు వచ్చినవి ఈయీనాడున మందరకార్యమును బూనుటను వారికి దైవబలమే యాధారమని నమ్మవలసియున్నది త్వరలో మందర వ్యాఖ్యాన ప్రకటనము జరుగ గలందులకు మీరందఱు తగిన సహాయమొనర్చి రామాయణామృత సారపానమును గావింపుఁడు. శ్రీసీతారాముల కరుణాకటాక్షములు మిమ్మెల్లకాలము సత్కార్యాచరణ ధురీణులఁ గావించుఁ గాక!

శ్రీసీతారామప్రసాదసిద్ధిరస్తు.

ఇట్లు విన్నవించు, శిష్యపరమాణువు,

సుబ్బదాసుఁడు.

---

## శ్రీ రామపరత్వము.

పూర్వసంచికా శేషము (౨౪౪-వ పుట చూడుఁడు.)

బాలురు బాలిక లాడుకొనునపుడు తమయీడువారి తోనే యాడుకొందురుగాని తమకంటెఁ జిన్నవారితోఁగాని తమకంటెఁ బెద్దవారితోఁగాని యాడుకొని సంతోషింతురా? తండ్రి పెద్దవాఁడై యెత్తుగునగుఁగు మీఁదనుండి బాలుఁడు క్రింద నాడుకొనుచుండి తనయొద్దకు రావలయునని యేడిచెనేని తండ్రియటుఁగుదిగి క్రిందికివచ్చి "బిడ్డనెత్తుకొని కదా మరల నటుఁగుమీఁదికిఁబోవును ప్రపంచమేలెడు చక్రవర్తియైనను బాలునితో నాడునపుడు వానివలె నటింపవలయును గదా. నేనిట్టులేచేసినదోషమూ? ఇప్పుడు మనుష్యుల నుద్ధరించుటకై మనుష్యునివలె నయితిని ప్రపంచమంతయు నేకార్ణవమయి నప్పుడు మీనముకా లేదా? కొంతజలము కొంతస్థల మేర్పడి నపుడు రెంటియందును దిరుగఁగల కూర్మముకా లేదా? తరువాత విశేషభూమి యేర్పడినపుడు వరాహమూర్తిని గా లేదా? తరువాత సగముమనుష్యుఁడును సగము మృగమునునైన నరసింహమూర్తినిగా లేదా ఆవలఁ బొట్టిమనుష్యుఁడను గా లేదా? ఇట్లే సమయోచితమగు వేషములతోఁ గానవచ్చి చేయవలసిన కార్యములు చేయుచునేయున్నాను మానవుల నిమిత్తము మానవుఁడనైతిని. తెలివిలేనివారు తెలిసికొనలేకయున్నారు కొందఱు ద్వేషించుచున్నారు తముఁగా నుత్తముఁడగఁ దోఁచినఁగాని నామాట గౌరవింపరని తమకు సాధ్యముగాని యమానుష

కృత్యము లప్పుడప్పుడు చేయుచునే యున్నారు. వానిని జూచి కొందఱు తెలివి తెచ్చుకొని సేవించి బాగుపడుచున్నారు పెద్ద బుద్ధులివి యింద్రజాలమనుచున్నారు. కడుపుకోసికొనినను గారడి విద్య లేయనిన నేనిం చేయఁగలను ఇట్టివారు తమకంతలె జనన మరణములకు లోపడిన నా మానుష్యమానవునిఁగా నెంచి యథార్థము తెలిసికొనలేక యున్నారు వారిని శాసించుటకు బుద్ధి నీయక పోయితినా? సరియైన మార్గములో నడచుటకు స్వాతంత్ర్యమిగా నుకపోయితినా? రెంటిని దుర్వినియోగము చేసి చెడిన నే నేమి చేయఁగలను?

అర్జునుఁడు — కృష్ణా! యిట్లగుటకు నేమి కారణమందువు?

కృష్ణుఁడు – చెప్పితినిగదా మాయయనియిది యే ప్రకృతియని.

రంగద్దములు కంటికిఁ దగిలించుకొన్నవారికిఁ జూపుతక్కువై నట్లు ప్రకృతి యడ్డముపడినవారికి జ్ఞానము సంకోచించును

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః, ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా, ఆసురం భావ మాశ్రితాః॥

౭ - ౧౫

నాయందు విపరీతజ్ఞానముగలవారు, నా స్వరూప స్వభావములు తెలిసియు నాయందాసక్తి లేనివారు, జ్ఞానము కలిగియుఁ గుయుక్తులచే దానిని బోఁగొట్టుకొనువారు, అసురసంబంధము గలవారై దేవుఁడు లేఁడు పరము లేదు మా స్వశక్తిచేతనే కార్యలన్నియుఁ జేసికొనుచున్నామని యన్నిటికిఁ దామే కర్తలని నన్ను ద్వేషించువారు నన్ను భజింపరు నశేషము

## సమాజసభ్యులకు విజ్ఞప్తి

సామ్రాజ్యపట్టాభిషేకమునకు వచ్చినపుడు సభ్యులుగాఁ జేరి యప్పటికి సిద్ధముగా నుంచని కారణమున శ్రీసీతారామ స్మరణ చిహ్నపతకములు మొక్కలైనవి లభ్యము గానివారు వెంటనే "వాసుదాసస్వామివారు, వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడపజిల్లా" అను విలాసమునకు వ్రాయఁబ్రార్థితులు. మీపేరు పోస్టు, యేపతకము కావలసినది వివరముగ వ్రాయవలయును. వి పి. చార్జిలు కొనువారే భరింపవలయును ఒకసారి తీసికొన్నవాడు మరల రెండవదానికి వ్రాయరాదు. ఒకరికి రెండు పతకము లీయఁబడవు బంగారుపతకము రూ. ౨౦-౦-౦ వెండిది ౧-౮-౦ రూపాయలు

ఇట్లు విన్నవించు,
దాసోహమ్, శిష్యపరమాణువు,
సుబ్బదాసుఁడు

నిత్యనైవేద్యమునకు రు ౫౦-౦-౦ లిచ్చిన వారు కొందఱు స్వామికి విశేషోత్సవము లేవైన జరుగుచున్నవా? వానికే మివ్యయమగునని ప్రశ్నించిరి

ప్రతి శుక్రవారము రాత్రికాలమున దేవాలయమందు నుయ్యాల యుత్సవము దేవాలయమందే నెఱవడి జరుగుచున్నది. దీనికి ఒకనాఁటికి రు ౪-౦-౦ లు పట్టును.

పునర్వసునాఁడు తిరుమంజనములోనైనవి జరగును. దీనికి ౧౦-౦-౦ లు పట్టును.

ఇట్లు విన్నవించు,
సుబ్బదాసుఁడు.

శ్రీరామ.

# భక్తి సంజీవని.

---

## ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి

విలేఖకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము

### చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయు వారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయము రాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. అ. పై |
|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె చక్కగ సవరింపఁబడినది | 8 0 0 |
| మూఁడు సంపుటములు | 10 0 0 |
| ఏడు సంపుటములు | 13 0 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ. అ. పై |
|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 14 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 14 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 2 0 |

భక్తి సంజీవని ౧౯—౨౯.

| | |
|---|---|
| ౧—౨ సంచికలు | 3 0 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 5 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co., Printers, Triplicane High Road

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారా ధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు.

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు.

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

ఈసంవత్సరపు విడిపత్రిక ౦ ౪ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ | అ. | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కట్టా సిద్దయ్యగారు, జమ్ములపాలెము .. | ౪౦౦ | ౦ | ౦ |

రక్షకులు.

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |

పోషకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట.

వాసుదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు.



# ప్రతి భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక.
ప్రతి పూర్ణిమా మాసారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట.

“భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి ।
భక్తివశః పురుషః ॥” మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁబొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨ { ప్రమోద సం॥ ఆషాఢమాసము<br>జూలై నెల ౧౯౩౦ సం॥ } సంచిక ౭

సౌరాష్ట్రరాగము - ఆది తాలము.

(కృష్ణలీలాతరంగములందలి మధుసూదన మధుసూదన వలె)

అరుణారుణ నయనాంబుజ హరచాపవిభంగ
కరుణారస వరుణాలయ ఖగరాజతురంగ

ధరణీధర భరణాంచిత కరనఖరసుసంగ
రఘునందన రఘునందన చరణౌ తవ శరణమ్

అఘశోషణ మఖపోషణ హతరాక్షసపాల
అఘదూషణ ఖరదూషణ హార దుష్టవిఫాల
మఘవార్చిత పదపల్లవ మధుకైటభకాల
రఘునందన రఘునందన చరణౌ తవ శరణమ్

వాణీ శర్వాణీ గీర్వాణీ ధవవినుత
పాణౌకృతక్షోణీ సుత వీణాముని ఫణిత
ఘోణాయుధ చూర్ణీకృత క్రూరాసురనిచయ
రఘునందన బుధచందన చరణౌ తవ శరణమ్

స్మరసుందర ధృతమందర మమమందిర వాస
దర కంధర రుచికంధర నశకంధర మార
వరదాభయకర దానవవర దారణశీల
రఘునందన బుధచందన చరణౌ తవ శరణమ్

వరవాసు సమాలాపన మాకృష్ట మనోజ్ఞ
పరివాసుసుహా పానతపరరాజ సమూహా
కరపల్లవ పరిశోభిత ఖగచాప కలాప
రఘునందన బుధచందన చరణౌ తవ శరణమ్.

---

## జమ్ములపాలెము సభయందలి ప్రశ్నోత్తరములు.

ప్రశ్న - రామరామ యనుచుఁ బాపములు చేయవచ్చునా?

ఉత్త - రామనామ మెట్టిపాపములనైన హరింపఁ గలదనికదా ఇఁక నేపాపముచేసిన నేమి భయము పాపము చేయుచుండ వచ్చును రామరామయని దానిని బోఁగొట్టుకొనుచుండ వచ్చు నని కొందఱ తలంపు. ఇది చాలఁ బొరపాటభి ప్రాయము

శ్లో॥ న వేద బలమాశ్రిత్య పాపకర్మరతి ర్భవేత్

అని యనుశాసనము స్పష్టముగఁ గలదు. అనఁగా నీ పాపముచేసిన నీప్రాయశ్చిత్తముచే నాపాపముపోవునని వేద వాక్యము గలదు. కావునఁ బాపముచేసిన నేమిభయ మని పాపకార్యము చేయరాదని యనుశాసనమున కర్థము. తెలియక చేసినపాపములకే ప్రాయశ్చిత్తములు గాని తెలిసితెలిసి బుద్ధి పూర్వకముగఁ జేసినపాపములకుఁ గావు.

శ్లో॥ అవశ్య మనుభోక్తవ్యం ఫలం కర్మ శుభాశుభమ్.

అన్నట్లు చేసినపుణ్యపాపముల ఫలము లనుభవింపక పోవు

సీ॥ అజ్ఞుండు చేసినయపరాధములను
జేపట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుట.

అన్నట్లు జ్ఞానహీనుఁడు చేసినపాపములను భగవంతుఁడు క్షమించినను క్షమింపవచ్చును గాని తాను భక్తుఁడ నని తలఁ

చుచుఁ దాను పాపములు చేసినను భగవంతుఁడు క్షమించు నని తలఁచి బుద్ధిపూర్వకముగఁ బాపములఁ జేయువానిని క్షమింపఁడు. ఎక్కువశిక్ష విధించును.

ఎవఁ డేపాపము చేసినను నది భగవద్విషయమైన యపచారమే కాని యితరము కాదు. ఇప్పటి లౌకికవ్యవహారమందును బరాయిదొంగను శిక్షించుటకంటెఁ దీవ్రముగ సేవకుఁడైన దొంగను శిక్షించుటయు నట్లు శిక్షాస్మృతియుండుటయు సర్వజనవిదితమే. కావున మనుష్యుఁడు తన్ను శరణుచొచ్చెనేని వాఁడానిమిషమువఱకుఁ జేసినపాపముల నెల్ల భగవంతుఁడు నాశము చేయును. నిండుమనస్సుతో భగవంతు నాశ్రయించిన వాఁ డావలఁ బాపమును జేయనే చేయఁడు. ఒకవేళఁ బ్రమాదమునఁ జేసెనా రాజు తనకుమారునకువలె స్వల్పశిక్ష చేసి భగవంతుఁడు క్షమించును. బుద్ధిపూర్వకముగఁ జేసెనా కఠినశిక్షకు వాఁడు పాత్రుఁ డగును.

ప్రారబ్ధేతరపూర్వాఘ మఖిలం ప్రామాదికం చోత్తరమ్
న్యాసేన క్షపయేత్.

అనుశ్లోకము స్మరించునది. అనఁగా భగవంతుని శరణు చొచ్చుటచేఁ బ్రారబ్ధముతప్పఁ దత్పూర్వము చేసినయాగామిసంచితపాపములు, తరువాత ప్రమాదవశమునఁ జేసినపాపములు క్షయించునని యర్థము. అంతియకాని బుద్ధిపూర్వకముగఁ జేసినపాపముల ఫలము లనుభవింపక నశింపదు.

ప్రశ్న.—మార్జాల మర్కటకిశోరన్యాయములం దేది శ్రేష్ఠము.

ఉత్త — ఈరెండు న్యాయములు లోకమునఁ గానవచ్చునవే ఇందొకటి హెచ్చని మఱియొకటి లొచ్చని చెప్పరాదు. దశాభేదమున మనుష్యులయందు రెండు నవ్వయించును. మార్జాలకిశోరన్యాయ మనఁగాఁ - బిల్లిపిల్లలు తాము తమ రక్షణమం దేవిధమైన ప్రయత్నముచేయక తల్లి యెచ్చట నుంచునో యచ్చటనే పడియుండును అట్టిపిల్లలకుఁ దల్లి తానై వచ్చి పాలిచ్చును.

మర్కటకిశోరన్యాయము క్రోఁతిపిల్లచందము ఇది పుట్టి నదిమొదలు తల్లిని గఱచుకొనియే యుండును తల్లి కొమ్మలు దాఁటినను గోడలు దూఁకినను బిల్లమాత్రము పట్టు విడువదు.

మొదటిన్యాయ మవలంబించువారు పురుషప్రయత్న మావశ్య మందురు. రెండవన్యాయ మవలంబించువారు పురుషప్రయత్న మావశ్యక మందురు

మార్జాలకిశోరన్యాయము కేవలభగవత్పారతంత్ర్య మును సూచించును,

శ్లో॥ సర్వజ్ఞోపి హి లక్ష్మీశ, స్సదాకారుణికోపి సన్
సంసార తంత్రవాహిత్వా, ద్రక్షాపేక్షాం ప్రతీక్షతే.

లక్ష్మీవిభుఁడైన నారాయణుఁడు సర్వజ్ఞుఁడు సర్వదా దయావంతుఁడైనను సంసారరూపకమైన ప్రపంచలీల లీలా విభూతినాటకము జరుపవలసియున్నది కావున రక్షింపుమని కోరువాని నిమిత్తమై యెదురు చూచుచుండును అను విషయ మును సూచించుచున్నది.

నిష్కారణముగ రక్షింపఁబూనినచో భూతకోటుల నెల్లఁ
బుణ్యపాపవిచారము లేక యొక్కసారిగ నొక్కక్షణమందే
రక్షింపవలసి యుండును లేదా పక్షపాతదోషమునకుఁ బాలు
పడవలసియుండును. కావున రక్షింపు మని కోరినవారిని
మాత్రము రక్షింపఁబూనిన నట్టి దోషమునకు నాకర ముం
డదు అజగరవ్రతస్థునకైనను హస్తాదానము ముఖాదానవ్రతస్థుల
కైనను యాదృచ్ఛికముగ లభించిన యాహారమునకై నోరు
తెఱచుట మ్రింగుట యనుపురుషప్రయత్నములు కావలయును
గదా

[కొండచిలువవలె నొకచోటనే కదలకయుండి నోటి
యొద్దకు వచ్చిన యాహారమును గ్రహించుట యజగరవ్రతము

చాఁచిన చేతులలోఁ దనంతటఁబడిన యాహారము దినుట
హస్తాదానము.

నోరు తెఱచికొనియుండి నోటిలోఁ బడినదానిని గినుట
ముఖాదానము]

ఆఁకలిగొన్న వేళకుఁ దల్లి వచ్చి పాలియ్యదేని పిల్లిపిల్లలు
హూనలమ్మ సంగీతములు దీయుట లేదా? దీని పేరేమి?

మనుష్యులందైనను శిశువునకుఁ దల్లియే వచ్చి పాలి
చ్చును. అయినను నాఁకలిగొన్న శిశువు పాలకై యేడ్చుట లేదా
ఇది రక్షాపేక్షగాదా. ఇది మార్జాలకిశోరన్యాయమేకదా!

కొంచెమువయస్సు వచ్చినతరువాత (కాళ్లువచ్చిన
పిమ్మట) శిశువే పాలకై యేడ్చుచుఁ దల్లియొద్దకుఁ బోయి పీడిం
చును. గదా. ఇది మర్కటకిశోరన్యాయముగాదా.

మనుష్యత్వము వచ్చువఱకు దేహములకు జ్ఞానము లేదు అంతవఱకుఁ బరిణామక్రమమున భగవంతుఁడే క్రిందిమెట్టున నుండి పైమెట్టునకుఁ దెచ్చుచుండును ఇంతవఱకు మార్జాలకిశోరన్యాయమే. మనుష్యత్వము వచ్చినపిమ్మట మీప్రయత్నము మీరే చేసికొనుఁ డనును ఇది మర్కటకిశోరన్యాయము పరిణామక్రమమందును మార్జాల మధమదశయం దున్నట్టును, వానరము దానికంటె నుత్తమదశయం దున్నట్టు తెలియుచున్నది మార్జాలము వ్యాఘ్రాదులవలె హింసాత్మకజీవనము కోరునది వానరము (నర ఇవ వానరః) నరునివంటిదై శాకభక్షణము చేయునది

సర్వవిధముల నశక్తుఁడై యకించనుఁడై భక్తుఁడై జ్ఞానపూర్వకముగ సమస్తస్వరక్షాభారము ఫలము భగవంతునిపై వైచి నిష్కామబుద్ధి భగవత్కార్యములు మాత్రము చేయువానికి మార్జాలకిశోరన్యాయ మన్వయించును.

భగవంతున కున్నపనులు చాలక మనకన్న మాయనయే తెచ్చి నోటిలోఁ బెట్టుపని కూడఁ గల్పింపవలయునా? ఆఁకటిచిచ్చు చల్లార్చుటకు భిక్షాన్నము చాలదా కాయ గసురులు చాలవా యని యాఁకలి నణఁప నేదియో యింత యుదరపాత్రమున వ్రేయుచు దాస్యమే మనకు స్వత్వ మని కైంకర్యమందే కాలము గడుపువారివిషయమున మర్కటకిశోరన్యాయ మన్వయించును. భగవద్రక్షా కార్యమునకుఁ గారణ మీజన్మమందో పూర్వజన్మమందో కలిగియుండును గాని కలుగక యుండదు.

నిర్వంచనముగఁ జేయువాని కేమార్గమైనను మంచిదే.

ప్రశ్న.—సిద్ధాసనము వాసుదాసుఁడుగారు మా కొకవిధముగా నేర్పిరి జీవబ్రహ్మైక్యవేదాంతరహస్య మనుగ్రంథమందు మఱియొక విధముగా నున్నది ఇం దేది సరి?

ఉత్త—జీవబ్రహ్మైక్య వేదాంతరహస్య మనుగ్రంథమందు సిద్ధాసనలక్షణ మిట్లు వ్రాయఁబడినది చూడు పుట ౩౯-౪౦.

“సిద్ధాసన మనఁగా ఎడమకాలిపాదము కుడితొడక్రింద నుంచి కుడిపాదము ఎడమమోకాలిపిక్క తొడలకు మధ్య పైఁగా నుంచి శిరస్సు కంఠము రొమ్ము మొదలగునవి సరిగఁ జిత్రప్రతిమ (బొమ్మ) వలె నిలిపి చిన్ముద్రను బట్టి నిష్ఠయం దుంచవలయును” ఇది సిద్ధాసన మని యేయోగగ్రంథమం దున్నదో వ్రాసినవారికే యెఱుక. నేను జూచినగ్రంథములందు నిది సిద్ధాసన మని చెప్పఁబడలేదు. హఠయోగాసనముల సాధించినవారిని జెన్నపురియందును, దిరుమలయందుఁ గొందఱ బైరాగులను జూచితిని వారు చూపిన సిద్ధాసన మీక్రింద వ్రాయఁబడిన విధముగా నున్నది కాని జీవబ్రహ్మైక్యవేదాంత రహస్యమందుఁ జెప్పినట్లులేదు

ఘేరండసంహితయందు సిద్ధాసన మిట్లు వర్ణింపఁబడినది

శ్లో యోనిస్థానక మంఘ్రిమూల ఘటితం సంపీడ్య గుల్ఫేతరమ్। మేఢ్రోప ర్యథ సన్నిధాయ చుబుకం కృత్వా హృదిస్థాపితమ్। స్థాణుః సంయమి తేంద్రి యోచలదృ శ్రావశ్యేత్ భ్రువో రంతరమ్। ఏవం మోక్షవిధాయతే ఫలకరం సిద్ధాసనం ప్రోచ్యతే.

అర్థము.

అభ్యాసకుఁడు ఇంద్రియముల నియమించి యోనిస్థానమం దొకమడిమను రెండవమడిమను లింగమువిూఁదను నుంచి గడ్డమును హృదయమందు నిలిపి మొద్దువలె కదలక నిట్టనిలువుగ గూర్చుండి చంచలముగాని చూపుతో రెండుకనుబొమల నడుమఁ జూచుచుఁ గూర్చుండుట సిద్ధాసన మని చెప్పఁబడును

"మత్స్యేంద్రసిద్ధాసనము"

శ్లో. "యోనిస్థానక మంఘ్రిమూల ఘటితం కృత్వా దృఢం విన్యసే। న్మేఢ్రే పాదమ థైక మేవ హృదయే కృత్వా హనుం స్థిరమ్। స్థాణు స్సంయమి తేంద్రి యోఽచల దృశా పశ్యేద్భ్రువో రంతరం। హ్యేతన్మోక్షకవాటభేద జనకం సిద్ధాసనం ప్రోచ్యతే॥

తా॥ గుదమునకును ఉపస్థమునకుఁ మధ్య ప్రదేశమగు యోనిస్థానమును ఎడమకాలి గుదిచే హత్తించి కుడిపాదము యొక్క గుదిచేత ఉపస్థమునకు పైభాగమున (లింగమువిూఁద) చక్కఁగా హత్తించవలయును  హృదయమునందు గడ్డమును జక్కఁగా నుంచి ఇంద్రియములను విషయములందుండి అడ్డగించి చలనములేని చూపుతో భ్రూమధ్యమును వీక్షింపవలయును. ప్రసిద్ధమైన యిది మోక్షకవాటము (ప్రతిబంధకము) యొక్క భేదమును (నాశమును) కలుగఁ జేయు సిద్ధాసన మని చెప్పఁబడుచున్నది

మతాంతరసిద్ధాసనము

శ్లో॥ మేఢ్రా దుపరి విన్యస్య సవ్యం గుల్ఫం త దోపరి
గుల్ఫాంతరంచ నిక్షిప్య సిద్ధాసన మిదం భవేత్.

తా॥ ఉపస్థమునకు పైభాగమందు (లింగముమీఁద) ఎడమ మడిమనుంచి అట్లే ఎడమపాదముమీఁద కుడిమడమ నుంచుట మతాంతర సిద్ధాసనము ''

పై రెండువిధముల సిద్ధాసనములను హఠయోగప్రదీపిక నుండి యెత్తి వ్రాయఁబడెను హఠయోగులు మూఁడవ విధమైన సిద్ధాసనము నభ్యసించుట గలదు అది యీ రెంటి కంటె శ్రేష్ఠమని నా యభిప్రాయము జీవబ్రహ్మైక్య వేదాంత రహస్యమందుఁ జెప్పఁబడినది యిందు నెందును జేరదు. సిద్ధాసన భేదములందును జేరదు

''మేఢ్రాదుపరి'' యనుటకు ''లింగము మీఁద'' నని యర్థము వ్రాయఁబడినదిగాని యది యపార్థమును బోధించుచున్న దని నా యభిప్రాయము. ఆ మాటల కాయర్థమె కాని యాసనరహస్యవిదులు మఱియొక యర్థము చెప్పుదురు ఆ విధమైన యాసనము విశేష ఫలకారి.

శివసంహితయందు పద్మాసనమిట్లు నచింపఁబడినది.

శ్లో॥ యోనిం సంపీడ్యయత్నేన, పాదమూలేనసాధకః
మేఢ్రోపరి పాదమూలం, విన్యసేద్యోగ విత్సదా
ఊర్ధ్వం నిరీక్ష్య భ్రూమధ్యం నిశ్చలః సంయతేంద్రియః
విశేషోఽవక్రకాయశ్చరహస్యుద్వేగవర్జితః
ఏతత్సిద్ధాసనంజ్ఞేయం, సిద్ధానాం సిద్ధిదాయకమ్

౩-వ అధ్యాయము.

అభ్యాసి యొకమడిమచే సీవనిని పీడించి యోగ మెఱింగినవాఁడు రెండవమడమలింగముపై నుంచవలెను. ఇంద్రియములఁ జలింప నీక కనుబొమలనడుమ నెగఁజూచుచు దేహమునందు వంకరయనునది యేమాత్రము లేక రహస్య స్థలమందు మనస్సు నిశ్చలము చేయవలయును దీనికి సిద్ధాసనమని పేరు ఇది యోగసిద్ధులకు సిద్ధినిగలిగించును అని యర్థము

కావున జీవబ్రహ్మైక్య వేదాంత రహస్యమునందలి సిద్ధాసన లక్షణము దుష్టము యోగీశ్వరుఁడు వ్రాసిన యీ గ్రంథమందుఁ బ్రాణాయామ విషయమైనఁ జక్కఁగ వ్రాయఁ బడిన దేమో చూడుఁడు	పుట ౩౬౬

"ప్రాణాయామము, లేక, సంధ్యావందనము చేయువారు ఎడమ ముక్కునుమూసి, కుడిముక్కున శ్వాసము నిలుపవలయు నని చూపించుటకై నటరాజు మొదట కుడికాలును లేవనెత్తి నటనము చేసి చూపించెను"	పుట ౩౯౯.

"నూతనముగా యోగాభ్యాసము చేయువారు పద్మాసన మందుఁ గూర్చుండుట మిక్కిలి కష్టముగా నుండును గనుక పరిశుభ్రముగాఁ జేసియుంచిన గదిలో వేసియున్న పీఁటపై మునుపు చెప్పినరీతిగా సిద్ధాసనమున గూర్చుండి నాలుగు గుటకల నీరు త్రాగి కండ్లను మూసి మీ గురువును దలఁచి స్తుతిచేసి కుడిచేతి బొటనవ్రేలును బవిత్రపువ్రేలును గుడి యెడమ ముక్కులమీఁదనుంచి యెడమ ముక్కును బవిత్రపు

వ్రేలితో మూసి కుడిముక్కును దెఱచి కుడినురుగుదబ్బ (Right lung)లో నిలిచియుండెడి కార్బానిక్ ఆసిడ్ గ్యాస్ అనెడి ప్రాంతబొగ్గుపులుసుగాలిని శ్వాసమంతయు కుడిముక్కు మార్గముగా విడిచిపెట్టి దాని వెంబడినే ఆక్శిజన్ అనెడి ప్రాణవాయువుతో ఓం ఓం ఓం ఓం ఓం అనుప్రణవమును జేర్చి మనస్సుననే యుచ్చరించుచు నురుగుదబ్బలో నెంత శ్వాసము పట్టుచున్నదో యంతశ్వాసమును బీల్చి మ్రింగవల యును మ్రింగినవెంటనే మఱియు శ్వాసమింకను బట్టు చున్నదా యేమి యని చూచుటకు మరల నొక పర్యాయ మదేముక్కున నీడ్చి చూడవలయును అప్పుడొక్కటియో రెండో లేక మూఁడంగుళముల పొడు గంతశ్వాసము మరల కుడిముక్కుతో ప్రవేశించును. అప్పు డాశ్వాసమునుగూడఁ బీల్చి మ్రింగవలయును.'' జీ బ్ర. వే రహస్యము

ఈయను వాదములు తొలుతఁ గుడిముక్కుతో పూర కము చేయవలయునని చెప్పుచున్నవి కదా! యోగగ్రంథము లేమి చెప్పుచున్నవో చూతము

శివసంహిత. ౩ వ యధ్యాయము.

తతశ్చ దక్షాంగుష్ఠేన నిరుద్ధ్వా,పింగళాం సుధీః
ఇడయా పూరయే ద్వాయుం, యథా శక్త్యాతుకుంభ యేత్
తతస్త్యక్త్వాపింగళ యా, శనై రేవ నవేగతః

బుద్ధిగలసాధకుఁడు కుడి బొటనవ్రేలిచే పింగళ (కుడి ముక్కు) మూసి యెడమముక్కుచే వాయువు·పూరించి శక్తి

యున్నంతవఱకు కుంభింపవలయును ఆవల కుడిముక్కుతో త్వరయనునది లేక మెల్లగా విడువవలయును

విష్ణుతిలకము 3 వ యధ్యాయము.

శ్లో॥ వామేనపూరయేద్వాయుః, తతః కుర్వీత కుంభకమ్
హృత్పద్మేకర్ణికామధ్యేమాంభజే త్కనకప్రభమ్
ప్రణవం వ్యాహృతీస్సప్త గాయత్రీం తస్యమస్తకమ్
జప్త్వాత్రివారం వాయుంతం దక్షిణేన విసర్జయేత్.

ఎడమముక్కుతో గాలిపీల్చి యావల గుంభకము చేయవలయును. బంగారువర్ణముగల నన్ను హృదయపద్మమున దుద్దునందున్నట్లు ధ్యానింపవలయును ప్రణవము సప్తవ్యాహృతులు గాయత్రీశిరస్సు మూఁడుమార్లు జపింపవలయును. ఆవలఁ గుడిముక్కుతో గాలి విడువవలయును

హఠయోగప్రదీపిక

శ్లో. బద్ధపద్మాసనో యోగీ, ప్రాణం చంద్రేణ పూరయేత్
ధారయిత్వా యథాశక్తి, భూయ స్సూర్యేణ రేచయేత్

తా. పద్మాసనస్థుఁడై యుండుయోగియైనవాఁడు ప్రాణవాయువును చంద్రుఁ డనెడి ఇడానాడిచేత (ఎడమముక్కు) పూరించి శక్తిగలవఱకు కుంభించి మరల సూర్యుఁడనెడి పింగళానాడిచేత (కుడిముక్కుతో) రేచింపవలయును

సూతసంహిత ౧౩ అధ్యాయము 3-౪-౫ శ్లోకములు

శ్లో. ఇడాయా వాయు మాకృష్య, పూరయి త్వోదరస్థితమ్
శనై షోడశభి ర్మాత్రై రకార తత్ర సంస్మరేత్

పూరితం ధారయే త్పశ్చా, చ్చతుష్షష్ట్యాతు మాత్రయా
ఉకారమూర్తిం తత్రాపి సంస్మరన్ ప్రణవం జపేత్
యావద్వా శక్యతే తావ ద్ధారయే జ్జపసంయుతః
పూరితం రేచయే త్పశ్చా న్మకారే ణానిలం బుధః
శనైః పింగళయా విప్ర ద్వాత్రింశ న్మాత్రయా పునః
ప్రాణాయామో భవే దేష తత శ్చైవం సమభ్యసేత్ ॥

ఈసంహితయు నెడమముక్కుతో ౧౬ మాత్రలుకాలము పూరించి ౬౪ మాత్రలుకాలము కుంభించి ౩౨ మాత్రల కాలములో కుడిముక్కుతో రేచింపవలయు నని చెప్పుచున్నది.

శౌనక పరిశిష్టము నందు

శ్లో॥ రేచకే దక్షిణేన్య స్యేత్ పూరకం వామ నాసికే
అంగుష్ఠాంగుళిభి శ్చైవం ప్రాణాయామం సమాచరేత్.

రేచకము కుడిముక్కుతోను, పూరక మెడమ ముక్కుతోను బొటనవ్రేలు అంగుళములతో నీవిధముగ ప్రాణాయామము చేయవలయును.

యోగతత్త్వోపనిషత్తునందు

శ్లో॥ తతో దక్షిణహస్తస్య అంగుష్ఠే నైవపింగళాం
నిరుధ్య, పూరయే ద్వాయు మిడయా తు శనైశ్శనైః
యథాశక్త్య విరోధేన తతః కుర్యా చ్చ కుంభకం
పున స్త్యజే త్పింగళయా శనై రేవ నవేగతః ॥

కుడిచేతి బొటనవ్రేలితోఁ గుడిముక్కు మూసి యెడమ ముక్కుతో గాలి మెల్లఁగాఁ బీల్చి శక్తియున్నంతవఱకు నిలిపి యావల గుడిముక్కుతో విడువవలయు నని యర్థము

యోగకుండల్యుపనిషత్తు

ఇడాయాం వహతి ప్రాణే బద్ధ్వా పద్మాసనం దృఢం
ద్వాదశాంగుళ దైర్ఘ్యంచ అంబరం చతురంగులమ్
విస్తీర్య తేన తన్నాడీం వేష్టయిత్వా తతః సుధీః
అంగుష్ఠ తర్జనిభ్యాంతు హస్తాభ్యాం ధారయే ద్దృఢమ్
స్వశక్త్యా చాలయే ద్వామే, దక్షిణేన పునః పునః ॥

ఇందును నెడమముక్కుతోనే పూరకము ప్రారంభింప వలయు నని యున్నది

ప్రాణంచే దిడయా పిబే న్నియమితం భూయోన్యయా రేచయేత్ అని యోగచూడామణ్యుపనిషత్తునందును ఎడమ ముక్కుతోనే ప్రాణాయామము ప్రారంభింపవలయు నని యున్నది

యోగయాజ్ఞవల్క్యమునందు,

ఇడయా వాయుమాపూర్య, బాహ్యం ద్వాదశమాత్రకమ్
పూరయిత్వోదరం తేన, నాసాగ్రనయనద్వయః
ధ్యాయన్ విరేచయేత్పశ్చా న్నందం పింగళయాపునః

ఎడమముక్కుచే గాలిపూరించి కుడిముక్కుతో గాలి వదల నలయుననియే యున్నది.

పంచకాల ప్రకాశమునందు,

కనిష్ఠానామికాభ్యాం వామ నాసికాం రుద్ధ్వా దక్షిణ
నాసయాంతస్థం వాయుం తూష్ణీం బహిర్విసృజ్య
అంగుష్ఠేన దక్షిణనాసికాం సమ్యగ్రుద్ధ్వా వామనాస

యోవాయు మాపూర్య అంగుళిభిస్తాభిరేవ
నాసికా ద్వయంపద్ధ్వా దక్షిణ నాసయా వాయుం
శనైశ్శనైర్విసృజేత్ ॥

కనిష్ఠానామికలచే నెడమముక్కుమూసి కుడిముక్కుతో లోపలి గాలినంతయు మెల్లగా వదలి కుడి బొటనవ్రేలితో కుడి ముక్కు చక్కఁగామూసి యెడమముక్కుతో గాలిపీల్చి యా వ్రేళ్లతోనే రెండుముక్కులు మూసి కుడిముక్కుతో మెల్ల మెల్లగా వాయువును వదలవలయును

ఘేరండసంహితయందు,

శ్లో॥ వాయుబీజం తతో ధ్యాత్వా ధూమ్రవర్ణం సతేజసమ్
చంద్రేణ పూరయే ద్వాయుం బీజం షోడశకైః సుధీః

ఇట్టు లెడమముక్కు రంధ్రముతోనే వాయువు తోలుతఁ బీలుప వలయు నని యున్నది

యోగీశ్వరుల మనువారి ఆసనబోధ మట్లున్నది. ప్రాణాయామ బోధ మిట్లున్నది తతో దక్షిణహస్తస్య యనుశ్లోక ముదాహరించియు నవకతవక వ్రాఁతలకుఁ గారణము నిశ్చయజ్ఞానము లేమియేకదా. కావున నీగ్రంథమందు విశ్వాసబుద్ధి గలిగి వర్తించు వారు చెడుట యాశ్చర్యము కాదు చెడకుండిన వింతయే ఈగ్రంథమందుఁ బటమున గడికోటలో నాశ్రము మున్నట్టు కనఁబఱుపఁబడినది అది పుస్తకమందుఁ బటములో నున్నదిగాని భూమిమీఁద లేదని మ-రా-శ్రీ యామర్తి సుబ్బారావుగారు వేణుగోపాలుఁడు చూచి వచ్చి సభలోనే చెప్పిరి

కదా సత్యమెఱుఁగఁ గోరినవారు పోయి చూచి యాశ్రమ స్థితిని, దానికై వేయఁబడినబాటరీతిని, కనులారఁ జూచి నిశ్చయ జ్ఞానము గలవారు కావచ్చును అప్పుడు మఱియు ననేకచిత్రములు గ్రామజనులవలన వినవచ్చును

గడికోటకు పోవఁదలఁచిన వా రొంటిమిట్టకు వచ్చి రేని దోవతోడుగ సహాయుల సంజీవనీ కార్యాలయము వా రీయఁ గలరు గడికోట యొంటిమిట్టకు ౧౬ మైళ్ల దూరమందున్నది. ప్రత్యక్షవిషయమున నిట్లసత్యములు తెలుపు గ్రంథము తక్కిన వాని విషయమున నెంతకు సాహసించియుండునో పాఠకులే యూహింపవచ్చును

ఈ గ్రంథమందు జ్ఞానకృతములు - అజ్ఞానకృతములు నైన కల్లవ్రాఁతలు పెక్కు లున్నవి. అందుఁగొన్ని మేలుకొలుపునందు వ్రాయఁబడినవి మచ్చునకై యవి పాఠకులు చదువుదురు గాత అవి గాక యింకను నాచారవిషయమందును మంత్రవిషయమందును నీమొదలైన విషయముల నవలక్షణములు పెక్కులు గలవు ఆగ్రంథమును జదువువారు హెచ్చరిక కలిగి సత్యాసత్యములు విచారింపక దానియం దున్నట్టు లాచరించి రేని చెడుట సత్యము ఆగ్రంథవిమర్శనమున బుటలు నింపుట కిష్టములేదు అట్టి దావశ్యకమగు నేని యప్పు డా విషయ మాలోచింపఁబడును ఆగ్రంథమును నమ్మి లోకము చెడకుండునుగాక గ్రంథలక్షణము తెలియుటకు విజ్ఞులకు మేలుకొలుపునందు నిందుఁ జూపినదోషములు చాలును గ్రంథకర్త

గారుగాని, జమ్ములపాళెము లోని యప్పికట్ల మొప్పెగాని, చిగి చెర్లలోని శ్రీకృష్ణపరమహంసలుగాని యీ యాక్షేపములకు సమాధానములు చెప్పిరేని సంజీవని లోకహితమునకై ప్రక టింపఁగలదు.

ప్రశ్న — పతితుఁడైన భర్తను గలభార్య గతియేమి? ఆమె యును బతితకావలయునా?

ఉత్త — భార్యకు సహధర్మచారిణి యని పేరు. భర్త చేయు ధర్మకార్యములందు భార్యయుఁ దోడై యుండవలయును. ధర్మకార్యములందు భర్తకుఁ దోడుపడదేని భర్త చేయుపుణ్యా మందు భార్యకు భాగము కలుగదు భర్తృసాలోక్యమును రాదు అంతియకాని భర్తచేయు దుష్టకార్యమందు భార్య తోడుపడరాదు అట్లు తోడుపడునేని యాపాపమందు భాగము పంచుకొనును తోడపడదేని యాపాపమందు భాగములేదు వాఁడు దుర్గతికిఁ బోయినను ఆమె స్వర్గము నకే పోవును గాని నరకమునకుఁ బోదు దుష్కార్యము లందు స్వరూపహాని కలిగించుకార్యములందు భార్య భర్త మాట వినకున్నంతమాత్రమునఁ బాతివ్రత్యహాని లేదు.

పతితుఁ డనఁగా తా నున్నస్థానమునుండి పడినవాఁడు. చెట్టుకొనకొమ్మనుండెడి యాకు తనస్థానమునుండి పడిన యెడల నేలపైఁ బడునట్లు మనుష్యుఁ డేపాపము చేసిన నేవర్ణమునందుఁ జేరక యధోగతి పాలగునో యట్టి పాపము చేసినవాఁడు పతి తుఁడు. దృష్టాంతము బ్రాహ్మణుఁడు పతితుఁ డయ్యెనేని జాతి

చండాలునికంటె నీచుఁ డగును. ఇట్టిదశయందు నాలుమగలి ద్దరును పతితులైనచో వీరి నుద్ధరించువా రెవ్వరు? భర్తాభార్యా పరస్పర మ్మన్నట్లు భర్తను భార్య, భార్యను భర్త యుద్ధరింపవలెఁ గాని యది యితరులచే నగుకార్యము గాదు. భర్త పుణ్యకార్య ములుచేసి భార్యను నుద్ధరింపవలయును. భార్య శీలవతియై భర్త నుద్ధరింపవలెను. ఇరువురు సమానధర్ములయిరేని చందన మందుఁ బచ్చకర్పూరము చేరినట్టు లగును ఇరువురు పాపరతు లయిరేని బంగాకులో నుమ్మెత్త కలిపిన ట్లగును మగఁడు పతి తుఁడైనచో భార్య యతని విడిచి శీలవతియై యుండి తాను స్వర్గమునకుఁ బోయి నరకమునఁ గూలి యధోగతుల పాలుగా నున్న భర్తను మాంత్రికుఁడు పుట్టలోని పాముసు దోఁకపట్టి పైకి లాగినట్లు తనయొద్దకు లాగుకొనును.

ఆ వె మగఁడు పతితుఁడైన మగువ పాతివ్రత్య
మహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. భాగ

పాతకియైన మగనిని భార్య వదలిపెట్టవచ్చు నని శ్రీభా గవతంబున దశమస్కంధంబునఁ గలదు శ్రీకృష్ణుఁడు గోపికల కుపదేశించిన వాక్యము విమఁడు [యా

శ్లో భర్తృశుశ్రూషణం స్త్రీణాం పర ధర్మో హ్యమాయ
తద్బంధూనాం చ కల్యాణ్యః ప్రజానాం చానుపోషణమ్
దుశ్శీలో దుర్భగో వృద్ధో జడో రో గ్యధనోపివా
పతిస్త్రీభి ర్నహాతవ్యో, లోకేప్సుభి రపాతకీ

వంచనలేక భర్తకు శుశ్రూషచేయుట యతనిబంధువులను బిడ్డలను పోషించుట స్త్రీలకుఁ బరధర్మము.

దురాచారముగలవాఁడైనను, కురూపుఁడైనను, ముసలివాఁడైనను, రోగియైనను, దరిద్రుఁడైనను బుణ్యలోకముల నిచ్ఛగించు భార్య తనభర్త పాతకిగాఁడేని విడువరాదని యర్థము. దీనివలన మహాపాతకములు చేసిన భర్తను భార్య విడువవచ్చును ఈశ్లోకమునకు వీరరాఘవీయమందిట్లు వ్యాఖ్యానము వ్రాయఁబడినది

దుశ్శీలో=దురాచారరతః, దుర్భగః=కురూపః, వృద్ధః=జరితః, రోగీ=రోగోస్యాస్తీతి-తథా నవిద్యతే, ధనం=విత్తం, యస్యతథాభూతోపిపతిః, లోకేప్సుభిః=పుణ్యలోకానిచ్ఛంతీభిః, నత్యాజ్యః, మహాపాతకసంయుక్తస్తుహాతవ్య ఇత్యభిప్రాయేణవిశినష్టి అపాతకీతియద్వా, ఏవంవిధోపి పతిరపాతకీస్త్రీణాం నిర్దుష్ట ఏవ అతస్స నహాతవ్య ఇత్యర్థః దీనియర్థముపైన వ్రాయఁబడినదే

తోషిణీవ్యాఖ్యయందు

కించపతిత్యాగేతత్పాపేన లోకద్వయభ్రంశ ఇత్యాహ దుశ్శీల ఇతి.

చౌర్యాదిరతః-దైవహీనః జరావ్యాప్తః సామర్థ్యహీనః మహారోగే, స్వోదరభరణే ప్యసమర్థ ఇతి క్రమేణార్థః అపిప్రత్యేక మన్వయః-అపాతకీతి=పతనహేతు పాపవాఙ్ హేయఇత్యర్థః,

దుశ్శీలుఁడు=దొంగతనములోనైనవి చేయువాఁడు.
దైవహీనుఁడు=దైవభక్తిలేనివాఁడు.
జరావ్యాప్తః=ముదిమివచ్చినవాఁడు.
సామర్థ్యహీనుఁడు=శక్తిచాలనివాఁడు.
మహారోగి=చెడ్డరోగముకలవాఁడు.
స్వోదరభరణేప్య సమర్థుఁడు=తనకడుపునకుఁ గూడఁ దాను సంపాదించుకొన లేనివాఁడు. ఇట్టివాఁడైనను పతన కారణములైన పాపములు చేయఁడేని విడువఁ దగినవాఁడుకాఁడు కాని యెట్టివాఁడైనను మహాపాతకములు చేసెనేని భర్తవిడువఁ బడఁదగినవాఁడే

బంగారు దొంగిలించుట కల్లు సారాయము లోనైన మదపదార్థములు తినుట త్రాగుట జారత్వము, ఇండ్లకు నిప్పు పెట్టుట విషము పెట్టుట లోనైనవి మహాపాతకములు ఇట్టి వారితో సాంగత్యము చేయువాఁడును పాతకియే శూద్రస్త్రీ యందు సంతానము పడసిన బ్రాహ్మణుఁడు పతితుఁడే శూద్రుని రేతస్సు గర్భమందు ధరించిన బ్రాహ్మణస్త్రీవంటివాఁడే శూద్రుని చేనుపదేశింపఁబడిన మంత్రముమనస్సునధరించు బ్రాహ్మణుఁడు కావున నీయిరువురు పతితులే ఇట్టివారిని విడనాడిన దోషము లేదు దేవుఁడు లేఁడని చెప్పువాఁడును పతితుఁడే ఇట్టి పతితులతరగతిలోఁ జేరువారు మఱియుఁ గొందఱు గలరు. కర్మ చండాలురు పతితులే వీరిసాంగత్యము సహవాసము సపంక్తి భోజనము నిషిద్ధములు

శ్లో॥ కులటా షండ పతిత వైరిభ్యః కాకణీమపి
ఉద్యతా మపి గృహ్ణీయా దాప ద్యపి కదాచన మనుస్మృతి.

అంకుటాలు, షండుఁడు, పతితుఁడు పగవాఁడు వీరు తమంతటఁదామే తెచ్చి తీసికొమ్మని యిచ్చినను నెంతయాపద నుండినను నెప్పుడేని పుచ్చినగవ్వయైనఁ దీసికొనరాదు అని యుండుటచే నొక గ్రామమందు నొక నికృష్టజాతివాని శిష్యుఁడని యెఱుఁగక వాఁ డిచ్చినపాలు త్రాగిన దోషమున కని వాసుదాసుఁడు ప్రాయశ్చిత్తము పెట్టుకొనవలసివచ్చెను

శ్రీరామమతధర్మములు.

# లక్ష్మణ భరత శత్రుఘ్నులే మార్గ దర్శకులు.

శ్రీరామావతారవిషయమున న్యాయ్యమైన యొకసందేహము కలుగవచ్చును. రావణ కుంభకర్ణ లవణ గంధర్వుల వధింప నొకమూర్తియే చాలియుండ "కృత్వాత్మానంచతుర్విధ" మ్మని విష్ణువు నాలుగురూపములఁ నవతరింపనేల? యని ప్రశ్న రావచ్చును. త్రేతాద్వాపరసంధియందు శ్రీరామావతారము "యజ్ఞ యజ్ఞైః త్రేతాయాం" మ్మన్నట్టులు యజ్ఞముల చేనగ్నుల మూఁటినిబూజించుటే త్రేతయందుఁ బరమార్థముగా జనులు భావించియుండిరి తొలుతఁదొలుత నీయజ్ఞములు భగవదారాధన బుద్ధితో జ్ఞానయుక్తముగఁ జేయుచు వచ్చినను నాయుగము

కడపట భక్తిభావనపోయి శుష్కకర్మమాత్రము జరుగ నారం
భించుచుండెను అట్టికర్మము నిష్ప్రయోజనము

పరశురాముఁడు రాజులనందఱ నుఱుమాడుటచే యాగ
ముచేయువారికి ముఖ్యమైన రాజసాహాయ్యము దుర్లభమా
యెను దేశ మించుమిం చరాజకమై యుండెను ఏయుఁవు
లందో యెవరో చేయఁబూనినను రాక్షసులవలన విఘ్నపడు
చుండెను యజ్ఞములందఱకు సాధ్యములా? ఇట్టిసందర్భము
లందు ముముక్షువులకుఁ బోవు త్రోవయేది?

అవతారములు ముఖ్యోద్దేశ్యము ధర్మస్థాపనము సమస్త
ధర్మములందు మోక్షధర్మము శ్రేష్ఠము సర్వవిద్యావరిష్ఠా మ్మని
కదా శ్రుతి చెప్పుచున్నది

దేశమరాజకమైనపుడు మోక్షధర్మములే గాక సామాన్య
ధర్మములు కూడ జరుగఁ జాలవు నీతులు ప్రీతికరములు గావు
పుత్రధర్మము పితృధర్మము మిత్రధర్మము భ్రాతృధర్మము పతిధర్మము
సతీధర్మము రాజధర్మము కులధర్మము లోనైన వన్నియు నుండ
వలసినరీతి నుండఁజాలవు. ఇట్లు దేశము తాఱుమాఱైనను
త్రేతాయుగము గావున ధర్మ మొకపాదముమాత్రమే లోపించు
టచే ధర్మమార్గమున వర్తించువారిని జూచి తక్కినవారు తమ
నడవడి సవరించుకొనఁజాలు తెలివి తేటలు గలవారై యుండిరి
కావున నిట్టికాలమున ననుష్ఠానపరులు కావలసియుండిరి బోధ
లతోఁ బనిలేదు ఈ యనుష్ఠానమునునది లోకవ్యవహారము
నకు సంసారతరణమునకుఁ గూడ నుపయోగపడునదియై

యుండుట యావశ్యక మయ్యెను మీఁదఁజెప్పినధర్మము లన్నియు నొకఁడే యనుష్ఠించి చూప సాధ్యపడదు. భ్రాతృ ధర్మములో నైనవి యొకఁడే యెట్లనుష్ఠింపఁ గలఁడు. సంపూర్ణ యోగానుష్ఠానము కైంకర్యము పారతంత్ర్యము లో నైనవి యొకఁడే యెట్టు లనుష్ఠింపఁగలఁడు. కావున భిన్నమూర్తు లావశ్యకము లయ్యెను ఈ నలువు రొకతల్లికే జనింపరాదా? వేఱు వేఱు తల్లులకేల జన్మింపవలెనను సందేహము కలుగ వచ్చును

రామలక్ష్మణు లేకోదరులై యుండిరేని రాముని వెంట లక్ష్మణుఁ డరణ్యమునకుఁ బోవుట "జగామహ" యని నారదు నకు నాశ్చర్యము కలిగించునంతటి గొప్పవిషయమై యుండదు. రామభరతు లేకోదరులై యుండిరేని "భ్రాతలందఱు భరతుని పాటి గార"ని రాముఁడు మెచ్చఁ గారణ ముండదు ఏకోద రులై యుండుటకంటె భిన్నోదరులయ్యు భక్తపరులై యుండుట యందే యెక్కువ స్వారస్యము కానవచ్చుచున్నది

నలువురయందు శ్రీరాముఁడు కర్మయోగియై స్వధర్మా నుష్ఠానమే శ్రేయోమార్గ మని లోకమునకుఁ జూపెను. లక్ష్మ ణుఁడు కైంకర్యపరుఁ డయ్యెను భరతుఁడు భగవత్పర తంత్రుఁ డైన భాగవతుఁ డయ్యెను భగవంతునకు భాగవతునకు విశేషభేదము లేక ఒకవిధమున భగవత్సేవకంటె భాగవతసేవయే శ్రేష్ఠమని గ్రంథములు చెప్పుచున్నవి. రామభరతులు సమా నులు కాను రాముఁడు స్వతంత్రుఁడు భరతుఁడు పరతంత్రుఁడు

కావున భిన్నోదరు లైరి సేవాధర్మము సమానముగాన దానిని స్వధర్మముగఁ గొన్నవారగుటచే లక్ష్మణ శత్రుఘ్నులొక్క తల్లి బిడ్డలై పుట్టిరి.

కింకరభావము కైంకర్యము దాసభావము దాస్యము స్వమ్ అస్యాస్తీతి స్వామీ యన్నట్లు స్వమ్ సొత్తు కలవాఁడు అనఁగాఁ దనయిచ్చ వచ్చినట్లు సొత్తును వినియోగించు నధికారము గలవాఁ డెవ్వఁడో వాఁడు స్వామి. గృహస్వామి గృహస్థుఁడు. దేహస్వామి జీవుఁడు సర్వస్వామి భగవంతుఁడు భగవంతుఁడు పూర్ణుఁడు జీవుఁ డంశము. భగవంతుఁడు విశేష్యము జీవుఁడు విశేషణము (నల్లగుఱ్ఱమన్నప్పుడు నలుపు విశేషణము గుఱ్ఱము విశేష్యము) శంకరాచార్యులవారు చెప్పినట్లు సముద్రుఁడు విశేష్యము అల విశేషణము. ఆధారము విశేష్యము ఆధేయము విశేషణము. శరీరి విశేష్యము శరీరము విశేషణము. ధారణపోషణములు చేయువాఁడు భగవంతుఁడు ధారణపోషణములకు భగవంతునిపై నాధారపడియుండువాఁడు జీవుఁడు. ఎండకు సూర్యుఁ డాధారము అలకు సముద్రమాధారము. సూర్యునకు నెండయాధారము గాదు సముద్రమునకు నలయాధారముగాదు అటులే మహాకాశమునకు ఘటాకాశ మాధారము గాదు. పూర్ణము మహాకాశము. దానియం దేకదేశము ఘటాకాశము (ఏకదేశము=ఒక భాగము) గుణమునం దభేదమైనను పరిమాణమందు భేదముగలదు కావున రెంటికి సంపూర్ణైక్యము కలుగదు ఒకటి యల్పమై నచో నింకొకటి మహత్తు అల్పము మహత్తునకంటె గొప్పది కాఁజాలదు.

సమానము కాఁజాలదు కావున దానికంటె లోచ్చే. ఇట్టి తారతమ్యముండుటచేతను నల్పమైన జీవుఁడు మహాత్ముపై (భగవంతునిపై) నాధారపడియుండుటను భగవంతునకు జీవుఁడు దాసుఁ డని కింకరుఁ డని చెప్పఁబడును. కావుననే

శ్లో. స్వోజ్జీవనేచ్ఛా యది తే, స్వసత్తాయాం స్పృహా యది
ఆత్మదాస్యం, హరే స్స్వామ్యం, స్వభావం చ సదాస్మర
శ్లో దాసభూతాః స్వతస్సర్వే హ్యాత్మనః పరమాత్మనః

నీవు నిన్నుజ్జీవింపఁ జేసికొనుటయం దిచ్ఛయు, నీసత్తయందుఁ గోరికయు నుండెనా, యాత్మదాసుఁ డని హరి స్వామి యనియుఁ దత్సంబంధ స్వభావములను స్మరింపుము

ఆత్మలన్నియు స్వతసిద్ధముగా స్వరూపభావములచేఁ బరమాత్మకు దాసులు గనుక జీవుఁడు కైంకర్యముచేతను దాస్యముచేతను భగవంతుని మెప్పించి యాయన యనుగ్రహముచే బంధముక్తుఁడై స్వతంత్రుఁడు కావలయునుగాని వేఱుమార్గము లేదు నేరము చేసి చక్రవర్తిచే శిక్షితుఁడై చెఱసాలయందు బంధింపఁబడినవాఁడు శిక్షకులోఁపడి నడచుచు గుణవంతుఁడై తన గుణములచేఁ జక్రవర్తి యనుగ్రహము సంపాదించుకొని చెఱసాలయందుండి యాయన యాజ్ఞచే విడువఁబడి స్వతంత్రుఁడై లోకమునఁ దిరుగవచ్చును గాని చెఱసాలయందున్నప్పుడు నేనే చక్రవర్తిని. చక్రవర్తీ నీవు నే నొకటే నీవు మనుష్యుఁడవు నేను మనుష్యుఁడను. కావున నేనే నీవు. నీవే నేన నుట సరిగాదని భక్తుల యభిప్రాయము. శ్రీమద్రామాయణ

మంగళి సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సుగ్రీవగుహ
శబరీవిభీషణాదు లీయభిప్రాయముకలవారే కావుననే లక్ష్మ
ణుఁడు

శ్లో॥ అహమస్యావరో భ్రాతా, గుణైర్దాస్య ముపాగతః
కిష్కింధ ౪-౯

నే నీయనతమ్ముఁడను. గుణములచే నీయనకు దాసుఁడ
నైతిని అని హనుమంతునితోను,

కథం దాసస్య మే దాసీ భార్యా భవితు మిచ్ఛసి
దాసుఁడనైన నాకు నీవు భార్యవై దాసివిగా నుండ
నెట్లు కోరెద వని శూర్పణఖతోను,

మయా ప్రేష్యేణ కాకుత్స్థ కి మర్థం పరితప్యసే
రామా! దాసుఁడను నేనుండఁగా నీవేల విచారపడెదవు.
అని చెప్పెను. ౩-౨

భరతుఁడు తనతల్లితో,

శ్లో॥ యో మే భ్రాతా పితు ర్బంధు ర్యస్య దాసోఽస్మి ధీమతః
ధీమంతుఁడైన యెవనికి నేను దాసుఁడనో యెవఁడు నాకు
నన్నయుఁ దండ్రియుఁ జుట్టమో

శ్లో॥ దాసభూతో భవిష్యామి సుస్థితే నాంతరాత్మనా
స్థిరమైన మనస్సుతో నేను దాసుఁడ నయ్యెదను అని
చెప్పెను. శ్రీరాములుతో,

శ్లో॥ తస్య మే దాసభూతస్య ప్రసాదం కర్తు మర్హసి
భ్రాతుః శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి ౨-౧౦౪

అట్టిదాసుఁడనైన నన్ననుగ్రహింపఁ దగుదువు తమ్ముఁడు శిష్యుఁడు దాసుఁడు నైన నన్ననుగ్రహింపఁ దగుదువు. అనిచెప్పెను. హనుమంతుఁడు లంకలో,

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః సుంద.

నీచకార్యములు చేయుని కోసలేంద్రుఁడైన రామునకు నేను దాసుఁడను. రావణునితో,

శ్లో. సత్యం రాక్షసరాజేంద్ర! శ్రుణుష్వ వచనం మమ
రామదాసస్య దూతస్య, వానరస్య విశేషతః ౫౧-౫౧

రాక్షసరాజా! సత్యము చెప్పెదను రామదాసుఁడను. దూతను. విశేషించి వానరుఁడనైన నా మాట వినుము (ఇచ్చట విశేషించి వానరుఁడనైన నామాటవినుమని చెప్పుటకుఁ గారణము నీవు రాక్షసుఁడవు రాముఁడు నరుఁడు నేను మీయిరువురిజాతులలోఁ జేరినవాఁడను గాను కావున నాయందు స్వజాత్యభిమాన మారోపించి పక్షపాతబుద్ధిచేఁ జెప్పుచున్నావని నిరాకరింప నీకుఁ గారణములేదని భావము) అని చెప్పెను. సుగ్రీవుఁడు రావణునితో,

శ్లో. లోకనాథస్య రామస్య సఖా దాసోస్మి రాక్షస

రాక్షసుఁడా జగత్ప్రభువైన రామునకు నేను సఖుఁడను దాసుఁడను

విభీషణుఁడు రామునితో,

ప్రేష్యోహం సఖ ల్వాజ్ఞాపయామి తే ౬-౧౨౪.

నేను దాసుఁడను నిన్నాజ్ఞాపించుటగాదు సుమీ యనెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో,

శ్లో॥ ఇమౌస్మ మునిశార్దూల కింకరౌ సముపాగతౌ. ౧. ౩౧.

మునిశ్రేష్ఠా వీరు మాకింకరులు వచ్చియున్నారు అని చెప్పిరి.

ఇంతయేల శ్రీమద్రామాయణ మంతయును శరణాగతినే కదా బోధించుచున్నది ఆకారణముచేతనే దానికి దీర్ఘశరణాగతి యని శరణాగతిసారమని పేరు. శరణాగతి దాసలక్షణము గాక మఱియేది కాఁగలదు.

దాస్యలక్షణ మెఱుఁగనివా రది నీచమందురు నీచసేవ నీచముగాని తానైపూనిన మహత్సేవ యేనాఁడును నీచము కానేరదు నీచసేవనంబు కర్తవ్యంబు గా దని పురాణములు చెప్పుచున్నవి కాని సేవనే నిషేధింపలేదు ప్రతిఫలకాంక్ష లేక యుపకారబుద్ధితో కర్తవ్యమను జ్ఞానముతోఁ జేయు నెట్టి సేవయైన శ్లాఘ్యమై యాత్మోద్ధారకమై యుండ మహత్సేవ యెట్లు శ్లాఘ్యతమము గాకుండు. కావున మాతృసేవ, పితృసేవ, గురుసేవ, దేశసేవ, లోకసేవ లోనైనవి యవశ్యకర్తవ్యములు కానఁ గదా సేవను భవభూతి లోకారాధన మని వచించుట

కావున నిట్టిసందర్భములం దెల్ల సేవాశబ్దము బదులు ఆరాధనశబ్దము నుపయోగించుటే ప్రశస్తము. నీచసేవ నిష్ఫలమగుటయే గాక యనర్థకము కూడ నగును కావుననే నీచులను గురువులుగాఁ గాని మిత్రులుగాఁగాని గ్రహింపరాదు

లోకమునందు దాసులు గానివారు లేరు అర్థదానాజనాస్సర్వే యని భీష్ముఁడు చెప్పినట్లు జనులు ధనదాసులు కామదాసులు ఇంద్రియదాసులు, కీర్తిదాసులు, ప్రతిష్ఠాదాసులు, కుక్షిదాసులు, వేశ్యాదాసులు, కులటాదాసులు, భార్యాదాసులునై యున్నారు తుదకు నాస్తికులైన యచలమతస్థులును గురుదాసులై యున్నారు కోదండరామ సేవక సమాజసభ్యులు తదితర భక్తులు రామదాసులు కృష్ణదాసులు నరసింహదాసులు హరిదాసులునై యున్నారు వీరుత్తములు లోకమునందందఱు దేనికో యొకదానికి దాసులై యుండఁ గామదాసులగుట మేలో, రామదాసు లగుట మేలో బుద్ధిమంతు లాలోచింతురుగాక

కింకరుఁడు = స్వామివిషయమునఁ గుత్సితకార్యము అల్పకార్యము నయినను జేయువాఁడు (కించిత్ = కుత్సితంవా కరోతి కింకరః) అని రామాశ్రమి

దాసుఁడు = "దాసృదానే" అనువ్యుత్పత్తి ప్రకారము తనసర్వస్వము స్వామికై యిచ్చినవాఁడు (దాస్యమును గుఱించి ౧౯౪౯ సంవత్సరము సెప్టెంబరు అక్టోబరు నెలలసంజీవనులును జూడవలెను) నిష్కామకైంకర్యదాస్యఫలము లేదని శ్రీమద్రామాయణంబునఁ జెప్పఁబడెనో చూతము.

అయోధ్యాకాండము ౧౦౩వ సర్గము కౌసల్య సుమిత్రతోఁ జెప్పిన వాక్యము.

శ్లో॥ ఇత స్సుమిత్రే పుత్ర స్తే, సదా జల మతంద్రితః
స్వయం హరతి సౌమిత్రి ర్మమ పుత్రస్య కారణాత్
జఘన్య మపి తే పుత్రః, కృతవా న్నతు గర్హితః,
భ్రాతు ర్యదర్థ సహితం, సర్వం తద్విహితం గుణైః॥

అర్థము

ఈరేవునుండి సుమిత్రా! నీకొడుకు లక్ష్మణుఁడు నా కొడుకునకుఁగాను జాగరూకుఁడై నిత్యము తాను స్వయముగా నీళ్లు మోచికొని పోవుచున్నాఁడు

ఇట్టి నీచకార్యము చేసెనని నీకొడుకు నిందింపఁబడఁడు. అన్న నిమిత్తమై చేయు సర్వకార్యములు గుణవంతములే య నఁగా శ్రేయస్కరములే

అయోధ్యాకాండము ౪౪-వ సర్గము సుమిత్ర కౌసల్యతో,

శ్లో. వర్తతే చోత్తమాం వృత్తిం, లక్ష్మణోస్మి న్సదానఘః
దయావా న్సర్వభూతేషు, లాభ స్తస్య మహాత్మనః॥ ౫.

దోషరహితుఁడును, సర్వజీవికోటులయందు దయగల వాఁడు నగులక్ష్మణుఁ డీయుత్తమ వ్యాపారమందు (సేవచేయుట యందు) వర్తించుచున్నాఁడు. ఇది యా మహాత్మున కెంతో శ్రేయస్కరము

అయోధ్యాకాండము ౪౭-వ సర్గము

శ్లో॥ ఏక స్సత్పురుషో లోకే, లక్ష్మణ స్సహ సీతయా
యోనుగచ్ఛతి కాకుత్స్థం, రామం పరిచర న్వనే॥ ౭

కకుత్థ్సవంశమునఁ బుట్టిన రామునకు నడవియందు సేవ సేయుటకు లక్ష్మణుఁడు సీతతో నాయనను వెంబడించి పోయెను. కావున లోకమందు సత్పురుషుఁడు లక్ష్మణుఁడొక్కఁడె. రామునిపరిచర్య నిమిత్తమై సీత యరణ్యములకుఁ బోయెను వారిరువురకు శుశ్రూష చేయ లక్ష్మణుఁడు పోయెను

అయోధ్యాకాండము ౫౨-వ సర్గము సుమంత్ర వాక్యము

శ్లో. ఇమే చాపి హయా వీర, యది తే వనవాసినః
పరిచర్యాం కరిష్యంతి, ప్రాప్స్యంతి పరమాంగతిమ్.
తవ శుశ్రూషణం మూర్ధ్నా, కరిష్యామి వనే వసన్
అయోధ్యాం దేవలోకం వా, సర్వథా ప్రజహామ్యహమ్.

వీరుఁడా రామా! యీ గుఱ్ఱములు వనములందు సంచరించుచు నీకు సేవచేసెనేని యుత్తమగతిని బొందఁగలవు. వనములందుండి నేను నీకు శిరస్సుతో శుశ్రూష చేయుచు సర్వవిధముల నయోధ్యనుగాని దేవలోకమునుగాని వదలెదను

నీ సేవవలన నా రెంటియం దనుభవించు సుఖమునకంటె నెక్కువసుఖ మనుభవింపఁగలను

దీనివలనఁ గైంకర్యము మనుష్యులకే కాక పశుపక్ష్యాదులకుఁగూడ లాభకరమే యని యేర్పడుచున్నది కావుననే కదా యయోధ్యా బృందావనములవలి తిర్యక్కులను జటాయువులోనగు వారును ముక్తికి యోగ్యలగుట

యుద్ధకాండము ౧౨౨ సర్గము దశరథవాక్యము

శ్లో. అవాప్తం ధర్మచరణం యశశ్చ విపులం త్వయా
రామం శుశ్రూషతా భక్త్యా, వైదేహ్యా సహసీతయా

లక్ష్మణా, సీతతోఁగూడిన రామునిశుశ్రూష నీవు భక్తితోఁజేసి విస్తారమైన యశస్సు ధర్మలాభము పొందినవాఁడవైతివి  సశేషము.

## సంధ్యావందన నియమములు.

సంధ్యావందన విషయమై శాస్త్రజ్ఞానముగాని యాచారజ్ఞానముగాని లేక జీవబ్రహ్మైక్య వేదాంతరహస్యమను నొక గ్రంథమందు వ్రాయఁబడిన విపరీతపు వ్రాఁతలఁజూచి యెందఱు చెడనున్నారో యనితోఁచుటచే సంధ్యావందన నియమములు కొన్ని యిందు వ్రాయవలసివచ్చెను ఇది సంధ్యావందనమంత్రముల కర్థముగాదు భాష్యముగాదు శాస్త్రనియమవాక్యములే సూత్రప్రాయములుగ వ్రాయఁబడినవి

౧. ద్విజులకుఁ దప్పఁ దక్కినవారికి సంధ్యావందన మందధికారము లేదు బ్రహ్మక్షత్రియ వైశ్యులు ద్విజులు. వీరికి వేదోక్త కర్మాధికారము గలదు

౨ సంధ్యావందనము నిత్యకర్మము. ఏ కర్మము చేయకుండిన యెడలఁ బ్రత్యవాయముకల దని శాస్త్రము చెప్పుచున్నదో దానికి నిత్యకర్మమని పేరు

౩ సంధ్యయెఱుఁగనివాఁడు, రోగి కాక శక్తియుండియు సంధ్యవారువనివాఁడు, బ్రతికి యున్నప్పుడు శూద్రుఁడు

చచ్చి తామిస్రనరకమువారై కుక్కయై మరల జన్మించును

౪ సంధ్యవారుపనివాఁడశుచి. వాఁ డెట్టి కర్మమునకు యోగ్యుఁడు కాఁడు.

౫. జాతాశౌచ మృతాశౌచములందు సంధ్య మానసికముగ వారువవలయును. జపోపస్థానములు లేవు అర్ఘ్యము మాత్రము విడువవలయును ప్రాణాయామమే సంధ్యయనెడి వ్రాఁత పిచ్చివ్రాఁత యని యెఱుంగునది

౬. రాజ్య మరాజకమైనపుడును రోగపీడితుఁడైనపుడును రాజుచేతఁ బీడితుఁడైనపుడును సూతకమందును శక్తియుండియు సంధ్యవారువకున్న దోషము లేదు రోగియై కూర్చుంచుటకు శక్తిగలవాఁడు సాయంసంధ్యను వేఁడి నీళ్లతో నాచమించి యథాశక్తి సంధ్యవార్వవలయును. కూర్చుండుటకును శక్తిలేనివాఁడు తండ్రినో తమ్మునినో యన్ననో నాకు బదులు నీవు వార్వుమని యధికార మీయవచ్చును ఇట్లు వార్చువారు "మమ" యనక 'యజమానస్య' అని చెప్పవలయును

౭. దేవతాకార్యము - ద్విజకార్యము - అగ్నికార్యము - విద్యాకార్యము లోనగు గొప్ప కార్యమందుండినవాఁడు సంధ్య వారువకుండిన దోషము లేదు

౮ అర్థము తెలియక సంధ్యవార్చుటకంటె నర్థము తెలిసి వార్చుట శ్రేష్ఠము

౯. ప్రాతస్స్నానము చేసియే సంధ్య వారువవలయును. స్నానము చేయుటకు వలనుపడనపు డూరకయే సంధ్య వార్వ

వచ్చును. "అశుచిర్వా శుచిర్వాపి కాలే సంధ్యా విధీయతే" అను వాక్యముచొప్పున సకాలసంధ్యావందనము శ్రేష్ఠము మానసమంత్రస్నానము లనుష్ఠేయములు

౧౦. సూర్యబింబ మెఱ్ఱబాఱు సమయమందు సాయంసంధ్య వారువవలయును ఇదిసరియైన కాలము. సూర్యాస్తమానము మొదలు చుక్కలు కానరాకుండువఱకు నైనది మధ్యమము నక్షత్రములు కానవచ్చు కాల మధమము. బారెఁడుప్రొద్దుండ సంధ్యవార్వవలయు నను వ్రాఁత యున్నత్తప్రలాప మని యెఱుంగునది.

౧౧ ప్రాతస్సంధ్యకు నక్షత్రములు కానవచ్చుకాలము ముఖ్యము తారకలుగానరాకపోవుటకు సూర్యుఁ డుదయించుటకు నడిమికాలము మధ్యమము. సూర్యుఁడు కనఁబడినతరువాతికాల మధమము

౧౨ మధ్యాహ్నసంధ్య మధ్యాహ్నమం దుత్తమము సంగవ (సంగమ) సమయమందు మధ్యమము. అపరాహ్ణమం దధమము

సూర్యోదయము మొదలు సూర్యాస్తమయకాలమువఱకు గలకాలము ౨౪ భాగములు చేసిన నందు మొదటిది ప్రాతఃకాలము (ఆఱుగంటలకు సూర్యుఁ డుదయించెనేని 8-24 వఱకు ప్రాతఃకాలము) 10 - 48 వఱకు సంగవకాలము 1 - 12 వఱకు మధ్యాహ్నకాలము 3 - 36 వఱకు అపరాహ్ణము 6 - వఱకుసాయంకాలము.

౧౩ సరియైనకాలములో సంధ్యవార్చుటకు వలనుపడని యెడల ప్రాతఃకాలమందు ౩, సంగవకాలమందు ౬,

మధ్యాహ్నమందు ౯, అపరాహ్ణమందు ౧౮, సాయం
కాలమందు ౩౬, ప్రాణాయామములు ప్రాయశ్చిత్త
ముగాఁ జేయవలయును.

ఇట్లు చేయఁడేని సూర్యహత్యాదోషము లభించును.

౧౮ రాత్రి ౯ గంటలమీఁదఁ గర్మమనుష్ఠింపరాదు మాన
సికముగఁ జేసి నుఱునాఁ డుదయమున యథావిధి
వార్వవలయును సశేషము

## సమాజము.

పశువులసమూహమునకు సమజ మనిపేరు ఇట్టివి కుట్టు
వుచే సమానమైనవి కావున వానిగుంపునకు సమజ మని పేరు
మనుష్యులసమూహము సమాజము. పుట్టువునందును ఆకార
మునందును మనుష్యులంద ఱొకవిధమువారైనను సంతయందో
యుత్సవాదులయందో ధూమశకటఘట్టములందో వినోదప్ర
దర్శనములందో చేరుమనుష్యులగుంపునకు సమాజమను పేరు
రాదు సమాజమునకు నైకమత్యము ప్రాణము అట్టి యైక
మత్యము లేని నిర్జీవసమాజమునకు సమజమునకు విశేషభేదము
లేదు.

ఐకమత్య మనఁగా నొక్కవిధమైన మనస్సుఅభిప్రా
యము గలిగియుండుట. ఒకసమాజమునందుఁ జేరిన యందఱు
యుద్దేశ మేకమై యుండవలయును అందఱు యుద్దేశ్యము
ఉద్దేశము నడవడి యొక్కటై యుండవలయును భిన్నవర్ణముల
వారు వేఱువేఱు వయసులవారు రథమును లాగునపు డెట్టు
లేకోద్దేశముగలవారై యొక్కపూనికగలవారై ప్రయత్నిం

తురో యట్టులే యొకసమాజమందుఁ జేరినవారును బ్రవర్తింప వలయును తేరికిఁగల రెండుమోకులను నొకదానిఁ గొందఱు మఱియొకదానిఁ గొందఱు పట్టుకొని యొకతెగ తూరుపున కీడ్చిన మఱియొకతెగ దక్షిణమున కీడ్చినరథము గతి యెట్టు లగునో భిన్నాభిప్రాయములు గలవా రొకసమాజమునఁ జేరిన నాసమాజముగతి నట్టిదే యగును కావున సమాజసభ్యు లందఱు నొక మార్గమును బట్టి పోవువారుగా నుండవలయును

ఎప్పు డందఱు నేకాభిప్రాయము గలవారగుదురో యప్పుడే వారియందుఁ బరస్పరమైత్రి కుదురును. మిత్రభావము మైత్రి అనఁగాఁ దనతోఁ గలిసినవానిని రక్షింపవలయు నను నభిప్రాయము. మైత్రి యెప్పుడు కుదురునో ద్వేషము-మాత్సర్యము అసూయ లోనగు విషమగుణము లన్నియు నిర్మూల మగును ఎప్పుడు మైత్రి కుదురునో సహన మప్పుడె కలుగును రథము నీడ్చువా రొకరికాళ్లు మఱియొకరు త్రొక్కి నను నొకరిరాపిడి మఱియొకరికిఁ గలిగినను రోషము ద్వేషము నెంచరుగదా బలహీనునిఁ జూచి బలవంతుఁ డపహసింపఁడు గదా ఉడుతకు నుడుతభక్తి యన్నట్టు లింతటి బలహీనుఁడు బాలుఁడు అబల బాలిక తనయుద్దేశము నామోదించి దానికి సహాయపడ వచ్చెనని బలవంతుఁ డెంచునే కాని వారిని నీస డించునా? రథము నీడుచువా రొక్కరొక్క రొక్కొక్కసారి యీడువక యొకకాలమం దంద ఱొళ్లు లాగుదురో సమాజ మునఁ జేరినవారు నట్లే చేయవలయును కాని రథము లాగుట గంట రెండుగంటల పని యనియు సమాజకార్యము యావజ్జీవ ముండునదియనియు స్మృతియం దుంచవలయును.

రథముమీఁద నుండు సర్చకుఁడు వింజామరము వీచినపు డాసైఁగ గ్రహించి దానికిలోఁపడి యెట్లు ప్రజలు రథము నీడ్తురో యట్లే సమాజాధికారి మాటను సభ్యులందఱు గౌర వించి వర్తింపవలయును తనయందు గౌరవములేని భటులను దోలుకొని పోయి సేనానాయకుఁ డెట్లు యుద్ధమున జయింపఁ గలఁడు? అట్టి భటుల గతియేమి? మనస్సు చెప్పినట్టు కాళ్లు చేతులు కదలుటకు, వాతరోగము వారి కాళ్లు చేతులు తమంతటఁ దామె కదలుటకు భేదము లేదా? కావునఁ దమకిష్ట ముండినను లేకుండినను గష్టమైనను నిష్ఠురమైనను తుదకుఁ బ్రాణగొడ్డమై నను నాయకు వాక్యముల ప్రకారము సభ్యులు నడచుకొన వలెను విధేయత ప్రథమ శుభ చిహ్నము. మీఁదఁజెప్పిన మైత్రి సహనము ఏకోద్దేశము లోనైన వెప్పుడు కలుగును? మనస్సు నిర్మలమైనప్పుడే మనస్సు నిర్మల మగుట యనఁగా నేమి? స్వలాభము స్వప్రతిష్ఠ స్వోత్కృష్టత్వము లోనైనవి లేక యుండుటే. నిర్వంచనమైన పరోపకారబుద్ధి (పరులకు హితముచెప్పుట చేయుట) యొక్కటి దృఢముగనుండిన మనస్సు నిర్మలమగును ఇది దంభార్థముగ నుండఁ గూడదు. దంభా ర్థము కార్యము చేయువాఁ డాత్మవంచకుఁడు ఒకరిని మోస గింపఁ బోయి తుదకుఁ దానే మోసపోవును.

ఒకసమాజమని యేర్పడెనేని సమాజనియమములు సమాజసభ్యులగు వారు జీవించి సమాజమనునది యుండు నఱకు నిర్విఘ్నముగ ననుష్ఠింపఁ బడుచుండవలెను. ఈవిధ ముగ ననుష్ఠింపఁబడెనేని క్రమక్రమముగ దానిశక్తి వృద్ధియై మఱ్ఱిచెట్టువలె శాఖోపశాఖలుగలిగి నానాదిక్కుల వ్యాపించి

యనేకుల కాశ్రయమగును కనుకఁ దత్కాలనాయకుఁడును
దనపూర్వనాయకు లనుష్ఠించిన నియమములనుండి తొలఁగక
యుండుట యావశ్యక మగుచున్నది అటుగాక పూర్వనాయకుఁ
డొకవిధముగను వాని వెనుకటివాఁడు మఱియొకవిధముగను
వర్తించిన సమాజసత్త చెడును సభ్యులమనస్సులందును వికా
రములు జనించును

కావున నియమానుష్ఠాన మత్యావశ్యకము. అట్టియను
ష్ఠానమున కశక్తుఁడైనవాఁడు సమాజమునుండి తొలఁగుట
శ్రేయస్కరము సమాజమునందుండి మనోవాక్కాయములు
సమాజమున కపకీర్తి కలుగునట్లు వ్యవహరించెనేని వాఁ డిహ
మునఁ బరమునఁ గూడ నాశ మగును

తాను దోషముచేసియు లేదని వాదించువాఁడును,
దానుచేసినది సరియని వాదించువాఁడును, నిరువురు నుభయ
లోకములఁ జెడుదురు

శ్రీ కోదండరామసేనక సమాజమునకుఁ బ్రభువు శ్రీకో
దండరామమూర్తి. నాయకుఁడు సంజీవరాయుఁడు. సభ్యులో
సమాజనియమముల ప్రకారము యావజ్జీవము వర్తించెదమని
ప్రమాణముచేసినవారు వీరు కామక్రోధాసూయాది గుణ
ములకు లోనై విరుద్ధవర్తనులయిరేని ప్రభువునకు, నాయకునకు
సమాజమునకు ద్రోహము చేసినవా రగుదురు కావున నీవిష
యము మనస్సు నందుంచుకొని మైత్రి సహనము ఏకమ
త్యము అనసూయత లోనగు గుణములు గలవారయి చిన్న
వాండ్రను బెద్దవారు, స్త్రీలను బురుషులు తెలియనివారిని

దెలిసినవారు, నాదరించి తాము చక్కనినడవడి గలవారై దాని నభివృద్ధికిఁ దెత్తురుగాక.

## —శ్రీరామాష్టాక్షర మంత్రము—

ద్వితీయసోపానమున ౨౫-వ పుటయందుఁ జెప్పఁబడిన జపాంతపఠనీయ శ్లోకముల యర్థము

శ్లో. కేయూరాంగదకంకణై ర్మణిగణై ర్విద్యోతమానం సదా
రామం పార్వణచంద్ర కోటిసదృశచ్ఛత్రేణ వైరాజితమ్
హేమస్తంభసహస్రషోడశయుతే మధ్యే మహామంటపే
దేవేశం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్

అర్థము

కేయూరములు, బాహుపురులు, కంకణములు, రత్న సమూహములు వీనిచేఁ బ్రకాశించువాఁడును, కోటిపూర్ణ చంద్రులతో సమానమైన తెల్లనికాంతిగల గొడుగుచే రాజిల్లు వాఁడును, పదునాఱువేల బంగారు స్తంభములతోఁ గూడిన గొప్పమంటపమధ్యమందు భరతాదులతోఁ జుట్టఁబడినవాఁడును నీలమేఘ చ్ఛాయగలవాఁడును నగు శ్రీరామచంద్ర మూర్తిని నెల్లప్పుడు భజించెదను

## శ్రీమాష్టాక్షర మంత్రమహిమ

శ్లో. కింమంత్రై ర్బహుభి ర్వినశ్వరఫలై రాయాససాధ్యైర్వృథా
కించిల్లోభ వితానమాత్రవిఫలై సంసారదుఃఖావహై,
ఏకస్సన్నపిసర్వమంత్రఫలదో లోభాదిదోషోర్ఝితః
శ్రీరామశ్శరణంమమేతిసతతం మంత్రోయమష్టాక్షరః

కాలక్రమమున నశించిపోవు ఫలమును గలవియు వ్యర్థముగా విశేషముగా శ్రమించి సాధింపనగునవియు నేవేవి

కొంచెము లోపములు కలిగినంతమాత్రముననే విఫలములగు నవియు మరల సంసారదుఃఖము కలిగించునవియు నగు పెక్కు మంత్రములతోఁ బ్రయోజనమేమి?

శ్రీరామాష్టాక్షరీమంత్రము ఒక్కటియయ్యు సర్వమంత్రములు జపించిన నేఫలముగలదో యాఫలమును నిచ్చునట్టిదియును లోభము లోపము మొదలగు దోషములు లేనిదియు నెనిమిదియక్షరములు గలదియు శ్రీరాముఁడే యెల్లప్పుడు నాకు దిక్కు-రక్షకుఁడు నను నర్థముగలదియునై యున్నది ఈమంత్రము భుక్తిముక్తుల రెంటిని నీయఁగలదు. పొరపాటున నను స్థానమందుఁ గొంచె మేదేని లోపము జరిగినను గీడు గలిగింపదనియర్థము. కావున నిది సర్వవర్ణముల వారికి సంహారులకును జపింప యోగ్యమైనది

శ్రీరామమంత్రము షడక్షరిగాని యష్టాక్షరిగాని సిద్ధికై యక్షరలక్ష జపించువారు

౧ దినమునకు మూఁడుమార్లు చల్లనీళ్ల స్నానము చేయవలయును. అస్తమానానంతరమున స్నానము నిషిద్ధము.

౨. ఫలమూలములు పాలుమాత్ర మాహారముగాఁ గొనవలెను లేదా పాలు-హవిస్సన్నమును భుజింపవచ్చును. మంత్రవంతముగ భగవంతునకు నివేదించిన యన్నము హవిస్సు

౩. ఆఱురసములు (ఉప్పు-పులుసు-కారము-చేఁదు-వగరు-తీపు) వర్జింపవలెను. అనఁగాఁ పాలలోఁ జక్కెరకూడ వేసికొనరాదు.

౪ ఆశ్రమధర్మము వదలరాదు అనుష్ఠింపవలెను

౫. స్త్రీలు మొదలగు భోగ్యములయందు మనోవాక్కాయ ములనెట్టి కోరికయు నుండరాదు

౬ మనోవాక్కాయముల శుచియై యుండవలెను.

౭. నేలపైఁ బరుండవలయును

౮ బ్రహ్మచర్య మవలంబింపవలయును.

౯. నిష్కాముఁడుగా నుండవలయును

౧౦. గురుభక్తిగలవాఁడై యుండవలెను.

౧౧ స్నానము దేవపూజ జపము ధ్యానము హోమము చలుప వలెను.

౧౨ ఇతరవిషయములమీఁద మనస్సు పోనీయక గురు వుపదేశించినమార్గమున శ్రీరాముని ధ్యానింపవలెను.

౧౩ సూర్యుఁడు - చంద్రుఁడు - గురువు - దీపము - గోవు - బ్రాహ్మణుఁడు వీరి సమీపమందు - శ్రీరాములసన్నిధానమందు - మంత్రార్థముఁ దలఁచుచు మౌనియై జపింపవలయును

౧౪. దినమున కిన్నియని నియమమువలయును.

౧౫ కూర్చుండుటకు వ్యాఘ్రచర్మము శ్రేష్ఠము

౧౬ స్వస్తికములోనగు నాసనములలో దేనియందైన నొక దానియందు తులసి - పారిజాతము - మారేడు - ఈ చెట్లక్రిందనో దీని సమీపమందో కూర్చుండవలయును

౧౭. మనస్సునందే మంత్రము జపింపవలెను

౧౮. వైష్ణవపీఠమందు నర్చింపవలెను

౧౯. జపసంఖ్యలోఁ బదవభాగముగాని దానిలోఁ బదవభాగముగాని పాలతోఁ దర్పణము చేయవలెను. దానిలోఁ బదవభాగము నేతితోఁ జేసినపదార్థములతో భోజనము

పెట్టవలెను. (అనఁగా ౧౦,౦౦౦ ల వంతున జపము సాగెనేని ౧౦౦౦ తర్పణములు చేసి ౧౦ మందికి భోజనము పెట్టవలెను)

౨౦ తరువాత మూలమంత్రముతోఁ బుష్పాంజలి సీయవలెను.

౨౧ ఈప్రకారము చేయువాఁడు మంత్రసిద్ధుఁడగును.

౨౨ ఇట్టివాఁడు మననశీలుఁడై జీవన్ముక్తుఁ డగును.

౨౩ ఇట్టివాఁ డైహిక కార్యములకుఁగాని మహాకష్టదశయందుఁగాని రామమంత్ర సాహాయ్యము కోరరాదు మోక్ష సాధకుఁడు శుభాశుభము లనుభవింపవలయునే కాని మేలు రావలయుననికాని కీడుపోవలయుననికాని కోర రాదు కష్టములు గలిగినపుడు హనుమంతు స్మరింప వలెను శ్రీరామభక్తులకు సహాయపడెద నని హనుమంతుఁడు దీక్ష వహించియున్నాఁడు. ఆయన రామభక్తుల విషయమున జాగరూకుఁడయియే యున్నాడు ఆయనయే మన సమాజమునకు నాయకుఁడు

శ్లో॥ ససర్వసిద్ధి మాప్నోత్య హ్యంతే రామపదం వ్రజేత్
చింతయే చ్చేతసా నిత్యం, శ్రీరామ శ్శరణం మమ.

శ్రీరాముఁడే నాకు రక్షకుఁడు అను నర్థముగల మంత్రమును నిత్యము నెవ్వఁడు చింతించునో వాఁడు సర్వసిద్ధులు పొందినవాఁడై యంతమున శ్రీరాముల పరధామమును బొందు చున్నాఁడు.

(శ్రీరామ యనెడు నామము మాహాత్మ్యము శ్రీరామ నామమాహాత్మ్య మనుగ్రంథమునఁ జూడవలెను)

శ్రీరాముఁడే నాకురక్షకుఁడని నే నెప్పుడు చెప్పితినో యప్పుడే నాకు శ్రీరాముఁడుతప్ప మఱి యెవ్వరు రక్షకులుగా రని యర్థము స్పష్టమగుచున్నది కావున నితర దేవతలఁగాని సోపాధిక బాంధవులయిన తల్లి దండ్రి మొదలయిన వారినిగాని తనకు రక్షకులని పీకు తన్నుద్ధరించెదరని మనస్సునందైనఁ దలఁ పరాదు మన కేదిమేలో యేది కీడో యజ్ఞులమైన మన కేమి తెలియును? మన యోగక్షేమములు సర్వజ్ఞుఁడైన భగవంతునకుఁ దెలియును శిశువులు తమ కేదిక్షేమకరమో తెలిసికొనఁ గలరా? తల్లిదండ్రులకుఁ దెలియును. కావున మన కేది మేలో యది భగవంతుఁడే సమకూర్చును కావున మన మేల యవి కావలె నివి కావలె నని కోరుట యని యెకోరికలు కోరక నిర్వి చారముగ నుండవలెను మనము భగవంతుని రక్షకునిఁగా గ్రహించితిమి పరమకరుణాకరుఁడు వాత్సల్యజలధి దయా సముద్రుఁడు సర్వశక్తుఁడు నగునాయనకంటె మఱియెవఁడు రక్షకుఁడు గలఁడు ఆయన పాదములపైఁ బడి యాయననే యుపాయముగాఁ గొనుటవలన మేలుగాఁదుగాని యాయన యనుగ్రహము సంపాదింప మఱియొకసాహాయ్యము నే నేల కోరవలె అట్లువేఱు సాహాయ్యముకోరితినేని యాయన రక్ష కత్వమునందు నాకు నమ్మకములేదని కదా యర్థము అట్టియభి ప్రాయము కలిగించితిమేని యావల నెంత సేవచేసి యేమి ప్రయోజనము? ఎందఱచేతఁ జెప్పించి యెన్నియుపాయములు చేసి యేమిప్రయోజనము నీవే దిక్కు రక్షింపుమని ప్రభువు కాళ్లపైఁ బడితిమి ఆయన రక్షింప నుద్యుక్తుఁడయ్యి నుండెను. అట్టిచోట వంటవాండ్రతో నీళ్లవాండ్రతో సేవకులతో నీవు

కాపాడు నీవు కాపాడు మని వారి నాశ్రయింప నేల? ప్రభువు నకు రక్షింప నిష్టములేనియెడల వీరు చెప్పిన వినునా? ఆయన కిష్టమున్నయెడల వీరితోడ నేమి పని? కావున మోక్షసాధకుఁడైన శ్రీరామభక్తుఁడు (1) రామునే నమ్మియుండవలెఁగాని యితరదైవములను బంధువులను రక్షకులుగా గ్రహింపరాదు. (2) ఆయన యనుగ్రహము సంపాదింపుకొనుటకు నాయనను దప్పు మఱియెవరినిగాని కర్మజ్ఞానయోగాదులనుగాని యుపాయము (సాధనమార్గము) గా గ్రహింపగాదు (3) ఆయన యేమి ఫలమిచ్చునో దానితో సంతుష్టిపడి యుండవలెనుగాని తదితరప్రయోజనము గోరరాదు ఇట్టివారికి భగవదనుగ్రహముచే సర్వసిద్ధులు లభించును గాని వాఁడు వాని గ్రహింపఁడు. అంతమున భగవత్ప్రాప్తియుఁ గలుగును సశేషము

| నామధేయములు | వాగ్దాన మొత్తము. | చెల్లించిన మొత్తము. |
|---|---|---|
| ౫౯. కొండూరు వేంకటశివరాజుగారు | ౧౦౦-౦-౦ | ౧౦౦-౦-౦ |
| ౬౦. ,, సిద్ధిరాజుఖండ్రిక | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |

పునర్వసువునకు నిత్యభోగమునకును సశేషము

మందరము వ్రాయుకాలములో శ్రీస్వామి నైవేద్యమునకు నెలకు రూపాయవంతున మూఁడుసంవత్సరములవఱకిచ్చుటకు వాగ్దానముచేసిన భక్తులవివరము

| నామధేయములు. | వాగ్దాన మొత్తము | చెల్లించిన మొత్తము |
|---|---|---|
| ౧ కలగోట్ల కోటిరెడ్డిగారు, చాగంటివారిపాలెము | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |

| | | | |
|---|---|---|---|
| ౨. | పప్పుల పానశాలరెడ్డిగారు, నుదురుపాడు | ౨౫-౦-౦ | ౨౫-౦-౦ |
| | ,, ,, ,, | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౬ | కాట్రపాటి లక్ష్మీనారాయణగారు, వట్టిచెఱుకూరు. | ౩౬-౦-౦ | ౨౪-౦-౦ |
| ౨౬, | చిల్లర లక్ష్మాయమ్మగారు, వెల్లలూరు | ౩౬-౦-౦ | ౩౬-౦-౦ |
| ౨౮. | ఆవటపల్లె రాఘవరావుగారు గన్నవరము. | ౩౬-౦-౦ | ౨౪-౦-౦ |
| ౩౪ | కిక్కురు అప్పిరెడ్డిగారు, నుదురుపాడు | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౩౫ | వర్సిశేషశయనశర్మదాసుగారు, ఎద్దనపూండి | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౩౬. | ఎద్దనపూండి నాగభూషణశర్మగారు | ౩౬-౦-౦ | ౩౬-౦-౦ |
| ౩౭ | ఆదిపూండి సూర్యనారాయణదాసుగారు | ౩౬-౦-౦ | ౧౨-౦-౧ |
| ౫౫ | కాట్రపాటి దుర్గాప్రసాదరావుగారు వట్టిచెఱుకూరు | ౩౬-౦-౦ | ౨౪-౦-౦ |
| ౫౬. | పసుమూరు రోసెమ్మగారు లేమల్లెపాడు | ౩౬-౦-౦ | ౩౬-౦-౦ |
| ౬౧ | వి టి ఏకామ్ర శాస్త్రిగారు బి ఎ. జమ్ములమడుగు తహశీలుదార్ | ౩౬-౦-౦ | ౩౬-౦-౦ |

సశేషము

శ్రీరామ.

# భక్తి సంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయము రాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు

విడిపత్రిక 0—5—0

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు.

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధార ధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు.

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

ఈసంవత్సరపు విడిపత్రిక ౦ ౮ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుత్తా సిద్దయ్యగారు, జమ్ములపాలెము .. | ౮౦౦ | ౦ | ౦ |

రక్షకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |

పోషకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట. | వాసుదాసుఁడు, కార్యనిర్వాహకుఁడు.



# శ్రీ భక్తి సంజీవని


ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక.

ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు  వావిలికొలను సుబ్బరావు,

(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట.


«భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥»  మా. శ్రుతి.

భక్తియే భగవంతుని బొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే. భగవంతుఁడు భక్తివశుఁడు.


సంపుటము ౨. { ప్రమోద సం॥ శ్రావణమాసము. ఆగష్టు నెల ౧౯౩౦ సం॥ } సంచిక ౧.


వాసుదాసుఁడు రామభిక్షుకై సంచారముచేయు సమయంబునఁ గొన్నిగ్రామములందుఁ గొందఱి యిండ్లవాకిట హరిదాసులతోడ భజనముచేయుచు నిలఁబడఁగా నాయింటి గృహస్థు లింటిలోనికిఁబోయి కలదు లేదని చెప్పక కాలుగంట

యరగంట నిలువ వేయఁగా నీగీతము రచించెను గాని యింతో
నెఱకుదీని వెలిపఱుప లేదు

యమునా కల్యాణి రాగము - ఆదితాళము
గరుడగమన రారా వలె.

ఎంతకఠినమతులో - వీరల - దెంతపాపరతులో
ఎంతో వినయముగ - నెంత వేఁడినను
స్వాంతమునఁ దయ - నింతయుఁ దలఁపరు ॥ఎంత॥
తలఁప లేరు వీరు - మాకిటఁ - గలిగెడి వెత తీరు
నిలిచినిలిచి జోములు దిగెఁ బదములు
నలుపుచు నున్నవి - నిలువ లేము యిఁక ॥ఎంత॥
వీళ్లులు కడసొంపు - మాటలు - వినఁగ వినఁగఁ గంపు
ఒళ్లు స్రుక్కినది - వ్రేళ్లు పొక్కినవి
కాళ్లు వాఁచినవి - నోళ్లు లెండినవి ॥ఎంత॥
రాముని దర్శించి - కామక - రక్తిని నర్పించి
సేమము నొందఁగఁ - జింతాకంతయుఁ
దాము మనంబులఁ - దలఁపఁగ లేరిదియొ ॥ఎంత॥
అతిశయశుభకరణా - ఏకశీ - లాలయ జనశరణా
భిక్షమెత్తు మని నాకటఁ దెలిపియు
భిక్షం బిడుఁ డని - వీరికిఁ దెలుపవు ॥ఎంత॥
వానలు లేవనుచుఁ బలుకులు ప్రశ్నల నడిగెదరు
వానల నిచ్చెడి వరదైవంబును
భావన సేయరు పరమలోభమున ॥ఎంత॥

గజిబిజి సామదిలో - నాకయి - గలుగదు లవమైన
భజనముచేసెడి భగవద్దాసులు
పడియెడిబాధకుఁ బరితపించెదను　　　॥ఎంత॥
వాసుదాసుఁ డిట్లు - తిమతమ - వాకిట నిలుచుండి
గాసిపడంగను - వీసంబైనను
వాసితలంపను - దోసం బెంచగు　　　॥ఎంత॥

---

## హితసమితికి విన్నతి.

శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహముచేఁ గొంచె మా రోగ్యము లభించుటవలన నా శ్రమముఁ జేరి జ్యేష్ఠశుద్ధపంచమి నాఁడు మందరకార్యమున యథాశక్తి పరిశ్రమింపఁ బ్రారంభించితిని. దీనిని నాంతముగ నిర్వహించుభారము శ్రీసీతారాములయందును వారిభక్తులయందును గలదు ఆ యిరువురతోడ్పాటు లేక యీకృతి కొనసాగదు. తాపత్రయాదులచే విఘ్నము రాకుండను, తెలియనిదానిని దోఁపఁజేయను శ్రీసీతారాములే గతి.

కం॥ అననిజపతి గలఁ డనియెడి
పావ రొక్కటి నిక్కఁ గంఠపావరేఁ జదువుం
బావరేఁ ధనమునఁగలిగిన
పావరేని యు లేమ కృతని బూనుటయుండున్.

శా॥ తానైన రమ్మని పిల్చి నన్నిటకు మోదంబారఁ గైంకర్య మున్ । బూనంజేసి తదర్థమై తిరుగుచో భూముల్ వనుల్ భిక్షకై । తానే తోడయి ముస్నుగాఁ జనును నన్ ధన్యా

త్తుఁ గావింపఁగా। నానాఁ డుండిన జానకీవిభుఁడు లేఁడా
నేఁడు నాపాలిటన్॥

మ. శతవారంబులు మీఁద నెన్నిదియు నౌ సారుల్ పఠింపించు
చుక్। గృతి స్వీయంబు నిరంతరాయముగ సంపీఠిక్ జగ
చ్ఛ్లాఘ్యమా। గతి సామ్రాజ్యమహాభిషేకమును దాఁగ్రై
కొన్న శ్రీజానకీ। క్షితిజాకాంతులు నేఁడు లేరె కృతినిక్
శ్రీమంతముం జేయఁగన్॥ మందరపీఠిక.

దైవసాహాయ్యమునకై శ్రీ సీతారాములఁ బ్రార్థించు
నట్లే మనుష్యసాహాయ్యంబునకై నాహితులును నా శ్రేయ
స్కాములును నగు భక్తులను భక్తురాండ్రను నేకవినయముగఁ
బ్రార్థించుచున్నాను. కొందఱు సభ్యులును సభ్యురాండ్రును
తమగ్రామములకు రారమ్మని యుత్తరములు వ్రాయుచున్నారు.
నాయందు వీరికిఁగల వాత్సల్యమునకు స్వామికార్యమందలి
యాసక్తికి వీరి కెల్లరకు మఱిమఱి నమస్కారములు గావించు
చున్నాఁడను. వీరు వ్రాసినట్లు పట్టాభిషేకసమయమున పదా
ర్థముల నిచ్చెదమనినవారు కొందఱు తీయకపోవుట చేతను బంపిన
వారు సకాలమునకుఁ బంపక కాలము మించి పంపినను పదార్థ
ముపయోగమున కనర్హమగుట చేతను ౧౦౦౦-౦-౦ రూపా
యలవఱకు నష్టపడి ఋణపడవలసివచ్చుట సత్యమే. సగము
చేసి విడిచిన వాహనముల మంటపములోనైనవి పూర్తి కావలసి
యుండుట యథార్థమే. స్వామికార్యమునకై ధనమో ధాన్య
మో కావలసియుండుటయు నిజమే మందర ప్రకటనమునకై

ధనము కావలసియుండుటయు వాస్తవమే. ఈ నాలుగు కార్యములు ధనైకసాధ్యములు. ఈనిమిత్తమున వీనిని శ్రీరామచంద్రమూర్తి తనపాదములసన్నిధికి రప్పించుకొనె నేని వీనికి దుర్గతులు రాకుండ వీనిని ఋణవిముక్తునిఁ జేయు వాసక్తియు, శక్తియు, శక్తియుఁ గల స్త్రీరత్నములు పురుషపుంగవులు మనసభయందే కలరు భగవంతుఁ డట్టి సంకల్పము వారి కిచ్చెనేని కొలఁత పనులు పూర్తి చేయఁగలవారును గలరు స్వామికి నిత్యనైవేద్యము న కీయశక్తిగలవారును గలరు కాని మంవరకార్యమును నిర్వహింపఁ గలవారు కలరా యని సందేహము లోకమునఁ బండితులు లేరా ప్రతిభావంతులు లేరా తత్త్వవేత్తలు లేరా యందు రేమో వేనవేలు నాకంటె గొప్పవారే కలరు కాని నాభావ మెట్టిదో వా రేమి యెఱుఁగఁగలరు. మూలమున నొకవిధముగ నున్న నర్థము మఱియొక విధముగ వ్యాఖ్యానము వేఱొకవిధముగ వ్రాసినవారు లేరా? ఇది యాలోచించియే కదా ప్రముఖులు సుందరముకై కూర్చుండు మని వీని నాజ్ఞాపించుట తటస్థించెను అట్లుగాకున్నఁ గార్యదుర్ఘటత్వము తనదుర్బలత్వము తెలిసితెలిసి వీఁ డేల దానికై యత్నించును. మహదాజ్ఞ మీఱలేకయే హృదయాంతర్వర్తి యీశ్వరుఁడు ప్రేరించుటచేత నే

కన్నులు దీసిన దేవుఁడు మతి యిచ్చి నస్నట్లు నన్ను దుర్బలునిఁ జేసినను అపూర్వపద్ధతిని బ్ర॥ శ్రీ॥ యామూర్తి వేంకటసుబ్బదాసుని నొకయంతేవాసిని సాహాయ్య మిచ్చుటచేత నే

భగవంతుఁడు శ్రీరామచంద్రమూర్తి సీతాసమేతుఁడై యీ కార్యమునందును దోడుపడుచున్నాఁ డని సాంతముగ నిర్వహింపఁగలఁ డని నమ్మకము కలిగినది. శ్రీసీతారాము లింతవఱకే గ్రంథరచనమందును నేవశయుం దేవిధమైన మనుష్యసాహాయ్యము వీని కిచ్చినవాఁడు కాఁడు. శ్రీరామచంద్రమూర్తి, ముఖ్యముగ సామ్రాజ్య పట్టాభిషేకము నిర్వహించుకొనిన శ్రీసీతాదేవి యిట్టి సాహాయ్యము నీయకున్న మందరము మందర మయియే యుండును

ఈవిధముగ సాహాయ్యసంపత్తి నొనగూర్చినవారు మఱి యొక బలిష్ఠమైన విఘ్నభయమును మీఁదవివరించిన ఋణాది చతుష్కమును దొలఁగింప కుందురా? పుస్తకములవలన వచ్చు మొత్తముతో ఋణబాధ దీఱును వాహనములను మండపములను బూర్తిచేయకుండిన వీనిని దండించువారు లేరు మందర ప్రకటనమునకు ధనము దొరకదేని వ్రాఁతప్రతి సిద్ధము చేయుటయందు నాటంక ముండదు ఎవ్వరి నమ్మి యాంధ్రవాల్మీకి రామాయణము రచింపఁబడెను? శ్రీరాముఁడే దానిప్రకటనమునకై పిఠాపురము మహారాజుగారిని బ్రేరింపలేదా? ఆనాఁటి రాముఁ డీనాఁడు లేఁడా? కావున నావిచారము వీనిని బాధింపదుగాని స్వామినైవేద్యమున కెట్లులా యని మాత్రము విచారము కలుగుచున్నది దానికై శాశ్వతనిధి రు. ౫౦-౦-౦, ౧౦౦-౦-౦, ౧౫౦-౦-౦ ఈప్రకార మిచ్చెద మని భక్తులు వాగ్దానము చేసిరికదా యందురేమో? కొందఱు పుణ్యాత్ములు

వాగ్దానము చేయుటయుఁ గొంద ఱిచ్చియుండుటయు సత్యమే. వాగ్దానము చేసినవా రందఱు నిచ్చుటకు సంవత్సరముపట్టును ౩౬౫ మందికి ౧౬౫ మందియే వాగ్దానము చేసినవారు ఇంక రమారమి ౨౦౦ మంది కొఱఁతపడియున్నారు వీరందఱు నేర్పడి సంవత్సరములో పూర్తిమొత్త మిచ్చినను దగువాత సంవత్సరమున కావలెఁగదా దానిపై వడ్డివచ్చుట. అది స్వామి నైవేద్యమున కుపయోగపడుట అంతవఱకు నొంటిమిట్ట నుండు సామాన్యముగ సంవత్సరమునకు వ్యయము.

రు ౪౭౦-౦-౧ వీనియుపవేతనము ఇది రామసేవాకుటీర కార్యనిర్వాహకులకు నెలవునకు సరిపోవును

౨౫౦౦-౦-౦ ఇంకను నథమపక్షమున ౩౦౦ సుందిన్యైన చందాదారులు చేరిరేని సంజీవని దన్నును, దనినిర్వాహకులు మందరధురంధరులునగు నలువురను భరింపఁగలదు.

౩౦౦౦-౦-౦ శ్రీరామకటాక్షము చక్కఁగ నుండిన నాను దాసరచిత పుస్తకములు శ్రీరామజయ మందిరమును, సేవాకుటీరమందలి అతిథులను నభ్యాగతులను భరింపఁగలవు

౧౨౦౦-౦-౦ భక్తులవాగ్దానము కార్యరూపముగఁ బరిణమించెనేని స్వామినిత్యనైవేద్యమునకు సరిపోవును

భిక్షాటనమున వచ్చినది స్వామికైంకర్యమునకుఁ బ్రతి సంవత్సర బ్రహ్మోత్సవమున నన్నదానమునకు వినియోగింపఁ

బడును. ఇది జరగుపద్ధతి కొంత ఆచ్చటి స్థితిగతులు తెలియఁ జేయు మని కోరుటచేతను వెలుపలివారు కొందఱు తమధన మొంటిమిట్టయందు వాసుదాసుని బంధువులు తినిపోవుచున్నా రనియు నొంటిమిట్టయందలి యతనిబంధువులు వచ్చినదంత యుఁ బరాయివారికిఁ బెట్టుచు నయినవారిని వెడలఁగొట్టు చున్నాఁడనియు నిష్ఠురములాడుటచేతను నున్న దున్నట్టులు చెప్పవలసివచ్చెను. ఏవిషయమున వరుంబడితగ్గునో యావిష యమునఁ గార్యము సంక్షేపింపఁబడును. తక్కినవన్నియు హీన ములైనను యాపజ్జీవ ముపవేతనము రాక మానదు కావున వాసుదాసునకు జీవికహాని భయము లేదు కాలవైషమ్యమున భగవత్కృపచే నుపవేతనముకూడ నష్టమయ్యెనేని పరార్థశ్ర మము, వాసుదాసువలనఁ బరులకు బాధ, తొలఁగి చిరకాలాభి వాంఛితము చేకూరి సర్వసంగములు వదలి పరార్థము నిర్వ్యాకులమనస్సుతోఁ గృషిచేయు భాగ్యమువానికిఁ గలు గును ఆ యోగదుఃఖగునకు నంతటిభాగ్యభోగములు కూడ నా? భగవంతున కంతటికృప వచ్చునఱకు నిష్టమైనను, నసిష్ట మైనను, గష్టమైనను బాధ సహ్యమే?

శ్లో॥ కౌపీనం శతరంధ్ర జర్జరతరం కంథా పున స్తాదృశీ
నైశ్చింత్యం నిరపేక్షభైక్ష మశనం నిద్రా శ్మశానే వనే
స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాంతం ప్రశాంతం సదా
స్థైర్యం యోగమహోత్సవే.

నూచించుచుఁగోఁచి, యట్టిదే భ్రాంత, నిర్విచారము నిరపేక్షితమునైన భిక్షాన్నము. భూశయ్య, యథేచ్ఛావిహారము, ప్రశాంతస్వాంతము యోగస్థైర్యము. ఇవి లభించి

శ్లో. ఏకాకీ నిస్పృహః శ్శాంతః పాణిపాత్రో దిగంబరః
కదా రామ భవిష్యామి కర్మనిర్మూలనక్షమః.

ఒంటరివాఁడనై కోరికలులేనివాఁడు శాంతుఁడు, అరచేతులే పాత్రముగాఁ గలవాఁడు, దిగంబరుఁడునై రామప్రభూ యెప్పుడు కర్మము నిర్మూలము చేయువాఁ డ నగుదునో కదా. (శంభో యనునది రామా యని సవరింపఁబడెను.)

ప్రకృత మనుసరామః పాయసం భక్షయామ ప్రకృత మనుసరింతము పాయసము భక్షింత మన్నట్లు ప్రకృతనాటక రీతి విన్నవించుకొనెదను

దీనికై ప్రతిసంవత్సరము

మ-రా-శ్రీ మేల్పట్టు సి దొరసామినాయఁడుగారు బియ్యము ౪ బస్తాలు, తాడిపత్రి మ-రా-శ్రీ, పామిడి సుబ్బన్న గారు బియ్యము ౫ బస్తాలకు తక్కువ లేక,

మ-రా-శ్రీ చంగనునాయుఁడుగారు ౧ బస్తా బియ్యము, మ-రా-శ్రీ కొండూరు వేంకట శివరాజుగారు ౧౦ మణువులు చింతపండు, చాగంటివారి పాళెమువారు మిరపకాయలు పెసలు ౨-౩ బస్తాలు నిచ్చుచున్నారు నెల్లూరుజిల్లా కల్లూరు, కుల్లూరు రాచపాళెము గ్రామములవారు దినదినము బిచ్చము వేసిన మొత్తము ౬౦-౭౦ రూపాయలవఱకుఁ బంపుచున్నారు.

మ-రా-శ్రీ వాకా చెన్నయ్యగారు రు ౪-౦-౦ లు యిచ్చు చున్నారు. ఇవంతయు బ్రహ్మోత్సవమునందుఁ గొంతవఱకు నన్నదానమున కుపయోగ పడుచున్నది. స్వామికై దాన మిచ్చిన భూములు పండిన సంవత్సరమునకు ౩౦-౦-౦ ల వఱకు వచ్చుచున్నవి

మందిరము వ్రాయు మూఁడుసంవత్సరముల కాలములో నెలకు రు ౧-౦-౦ వంతున నిచ్చెదమని వాగ్దానముచేసిన వారికిఁ గొందఱకు నుత్తరములు వ్రాయఁగాఁ బ్రత్యుత్తరము లేదు ఆ సంఖ్య పూర్తియగుటకు నింకను ౨౦ గుండ్రైనఁ గావలసి యున్నారు సంజీవని చందాలయందును గొఱఁతే కలదు ఈ విషయములఁ బరుల సాహాయ్య మావశ్యకము.

స్త్రీ రత్నములందు సమాజ సభ్యురాలు శ్రీమతి సౌభాగ్యవతి లోకా కామమ్మగారు (సోమశిలాగ్రహారము) దిన దినము శ్రీరామభిక్ష వేసిన బియ్యమువెల మొత్తము సంవత్సరమునకు రు ౧౨-౦-౦ లు పంపుచున్నది. ఈమె తక్కిన బిచ్చగాండ్రకు వేసినట్లులే శ్రీరాముని పేర దినదినము దోసెఁడు బియ్యము వేయుచున్నది. అట్లు వేయఁగా నెలకు ౧-౦-౦ బియ్య మగుచున్నది. ఈ ప్రకారము ౯ సంవత్సరములుగాఁ బంపుచున్నది.

ఎప్పిగాలలో నిరుపుద సమాజసభ్యురాండ్రు చెన్నమ్మ (వైశ్య) వేంకట సుబ్బమ్మ (బ్రాహ్మణి) శ్రీరామశ్రీరామ యని యొంచిన బియ్య మప్పు డప్పుడు ౧౮ సేర్లు పంపుచుందురు.

ఇట్లు బియ్యము పంపుట సమీపమున నుండు గ్రామముల వారికి
సాధ్యమే గాని దూరమున నుండువారికి సాధ్యపడదు. అట్టి
వారికి శ్రీమతి కామమ్మగారి మార్గమే యను సరణీయము.
స్త్రీ రత్నములందఱు దినదినము దోసెఁడు బియ్యము రామభిక్ష
వేయుఁ డని కోరను. చేరెఁడు బియ్యము వేసి దానివెల
మొత్తము లోభము లేని మనస్సులతో లోపింపక పూర్తిగ నొక
సారి కాని ఏ నెల దా నెలకు కాలణా అరణా టపాలా బిళ్లలు తీసి
లకోటాలో పెట్టి కాని పంపవచ్చును. బీదలకు బిచ్చము వేయని
పాపి కాలము మన దేశమున కింకను రాలేదు కావున స్త్రీ
రత్నము లట్లు శ్రీరామునకుఁగా దినదినము బిచ్చము వేయుచు
వచ్చి రేని స్వామి నైవేద్యమునకుఁ గాను నిర్విచారముగఁ
గొనసాగఁ దోడుపడినవా రగుదురు మొండి బండశిఖండుల
వలె వాసుదాసుఁడు వాకిట వచ్చి నిలిచినపుడు శ్రీరామున
కని స్త్రీలును పురుషులు చేసిన సాహాయ్యమునకంటెఁ బరోక్ష
మున దినదినము శ్రీరాముల పేరు చెప్పి వాసుదాసుఁడు వాకిట
స్తంభమువలె నిలిచినట్లు భావించి బిచ్చము వేయుట యెక్కువ
భక్తి శ్రద్ధలకుఁ బ్రీతి విశ్వాసములకు నిష్కామధర్మమునకు దినదిన
శ్రీసీతారామ స్మరణమునకుఁ గారణ మగుచున్నది ఈవిషయము
బ్రహ్మోత్సవసభయందే వాసుదాసుఁ డెల్లరకు విన్నవించుకొ
నెను అప్పుడు లేనివారిని, ఉండియుఆచినవారిని నిట్లు కార్య
భారమువలన నురల సంబోధించుచున్నాఁడు. మనుష్యున కొక
పుష్పము దేవున కొకమాల.

ఉన్న సందర్భములు చెప్పుట యావశ్యకము గావున పూర్తము విడిచి చెప్పుటయ్యెను తరువాత వారివారి యిష్టము ప్రకారము నర్తింపవచ్చును సంజీవని భిక్షాపత్రికగాదు. కావున నింకమీఁద నీవిషయము మది ప్రచురింపఁ జాలదు. లోకులాదరించిరేని యది చేయుకార్యము వేఱుగఁ గలదు

గతసంవత్సరమున సంజీవనీ కార్యనిర్వాహకుని యక్రమ చర్యవలనఁ జాల నష్టిసంభవించెను. అది మామగారు వైద్యము చేయరానిస్థలమునఁ బుట్టినపుండు కావున ననుకొనరాదు. అనుభవించియే తీరవలయును ఈనష్టివలన నన్నివిధములఁ గష్టముగానే యున్నది పట్టాభిషేకమునకై వాగ్దానముచేసిన పుణ్యమూర్తులు సత్యవాక్కులగుదురేని కొంతకష్టము తగ్గును. భగవంతుఁడు వారికి మోసబుద్ధినేయిచ్చునో, ధర్మబుద్ధినేయిచ్చునో, పట్టాభిషేకమునకై వచ్చిన మొత్తములో చాలధనము మిగిలినట్టు వాడుక గలదని కొందఱుచెప్పిరి మందరమునకై యుపయోగింపఁగోరి పుస్తకములను దక్కువ వెలలకమ్మఁగా వచ్చిన మొత్తములో ౧౭౦౦-౦-౦ మ-రా-శ్రీ సూరారెడ్డిగారికిని. ౧౮౦౦-౦-౦ చెన్నపురికిని బంపఁబడెను. ఇంకను ౭౦౦-౦-౦ లు ఋణమున్నది. ఈవిషయము చాగంటివారిసాక్షము మధిర రంగయ్యలోనగువారువచ్చి లెక్కలుచూచి వెళ్లినారు. కావున సంశయచిత్తులు దురభిప్రాయముల మానుదురుగాక యని ప్రార్థింపఁ బడుచున్నారు.

ధర్మోదయుతు.

---

## ప్రశ్నోత్తరములు.

ప్రశ్న — "నాత్మాన మవసాదయేత్" ఆత్మను బాధింపరాదు. అని యుండుటచే నేకాదశి యుపవాసమువలన నాత్మకు హింసగదా? ఉపవాస మన్నదినమందు నాత్మ మలము భక్షించును గదా. ఇది పాపకారణము గదా?

ఉత్త —

శ్లో॥ ఉద్ధరే దాత్మా నాత్మానం, నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు, రాత్మైవ రిపు రాత్మనః

విషయములందు నాసక్తిలేని మనస్సుచే నాత్మను సంసారమునుండి యుద్ధరింపవలయును గాని విషయాసక్తమైన మనస్సుచేత దాని నధోగతి పాలుచేయరాదు ఆత్మకు వశపడిన మనస్సే బంధువు ఆత్మకు వశపడని మనస్సే శత్రువు

శ్లో॥ బంధు రాత్మాత్మన స్తస్య, యే నైవాత్మా జితః
అనాత్మ నస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్. ౬-౬

ఎవఁడు విషయములందు తనమనస్సును బోనీక జయించిన వాఁడగునో అట్టివానికి వానిమనస్సే బంధువు మనస్సును జయింపని వానికి వానిమనస్సే శత్రువువలెనై వానిని నధోగతుల పాలు చేయును. అని యర్థము.

కావున నాత్మాన మవసాదయేత్ అనఁగా పురుషుఁడు తనకు వశపడని మనస్సునకు దాసుఁడై యాత్మను నధోగతుల పాలు చేయరాదని యర్థము.

ఉపవాసము మనుష్యుని నధోగతుల పాలుచేయునా? అది దేహమునకుఁ గాని యాత్మకుఁ గాని హానికరమా యను విషయము లాలోచింపవలయును.

తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః.
పతంజలి

తపస్సు స్వాధ్యాయము ఈశ్వరప్రణిధానము ఇవి యోగసాధకులు చేయవలసిన కార్యములు

గీ ధారణీసురులకుఁ దపము విద్యయు రెండు
ముక్తిదంబు లగుచు మొనయుచుండు            భారతము.

మహాభారతమున ననుశాసనపర్వమందు ధర్మరాజు భీష్ముని దపస్సులలో నేది శ్రేష్ఠ మని యడుగఁగా "మతం మ మాత్ర కౌంతేయ తపో నానశనా త్పరమ్" ధర్మరాజా నాయభిప్రాయమున ననశనమునకంటె (ఆహారము తీసికొనక యుండుటకంటె) శ్రేష్ఠమైన తపస్సు లేదు అని చెప్పెను.

భగీరథుఁడు బ్రహ్మతో
"తపో హి నాన్య చ్చానశనా న్మతం మే"
నాయభిప్రాయమున నాహారము తీసికొనక యుండుట కంటె తపస్సు లేదు.

గీ. మాతకును, వేదమునకు ధర్మంబులకును
బరములగు గురు, శాస్త్రలాభములు లేవు
తపము లే దుపవాసవ్రతంబు కంటె
నధికమైనది యుండ్రు మహాత్ము లనఘ.      మహాభారతము.

పద్మపురాణమందు

న త్వేవ భోజనం కైశ్చి దేకాదశ్యాం బుధై స్సృతమ్.

ఏకాదశినాఁ డెవఁడైనను భోజనము చేయనేరా దని జ్ఞానులు స్మరించిరి

అంగిరసుఁడు

య ఇచ్ఛే ద్విపులాన్ భోగాన్, ముక్తిం చాత్యంతదుర్లభామ్.
ఏకాదశ్యా ముపవసే త్పక్షయో రుభయో రపి

ఇహమందు విస్తారభోగమును, పరమందు దుర్లభమైన ముక్తిని గోరువాఁడు రెండుపక్షంబులందలి యేకాదశులం దుపవసింపవలెను

గారుడపురాణము

ఉపోష్యైకాదశీ నిత్యం పక్షయో రుభయో రపి

రెండుపక్షములందును సర్వదా యేకాదశినాఁ డుపవసించి.

సనత్కుమారసంహితయందు.

ఏకాదశీ సదోపోష్యా పక్షయోః శుక్ల కృష్ణయోః.

ఎల్లప్పుడు నెలనెల శుక్లకృష్ణ పక్షములందలి యేకాదశులందు నుపవాసము చేయవలయును.

ఎల్లప్పు డనఁగా డెబ్బదియెనుబది సంవత్సరములవఱకు యని యర్థము.

విష్ణురహస్యమందు.

ఉపోష్యైకాదశీ రాజన్ యావదాయు స్సువృత్తిభిః.

సదాచారముగలవారు జీవించియుండువఱకు నేకాదశియం దుపవసింపవలెను.

కణ్వుఁడు.

ఏకాదశ్యా ముపవసే న్నకదాచి దతిక్రమేత్

ఏకాదశియం దుపవాసముచేయవలెను. ఒకప్పుడైనను దాని నతిక్రమింపరాదు.

సనత్కుమారసంహిత.

శ్లో. నకరో తీహ యోమూఢః, ఏకాదశ్యా ముపోషణమ్
స నరో నరకం యాతి, రౌరవమ్ తమ నావృతమ్
ఏకాదశ్యా తు యో భుంక్తే, శక్తిమా న్నిరుపద్రవః
సురాపాన సమం పాపం, భవే త్తస్య నసంశయః
మద్యపానా న్మునిశ్రేష్ఠ, పా తైవ నరకం వ్రజేత్
ఏకాదశ్య న్నకామస్తు, పితృభి స్సహమజ్జతి
యానికానిచ పాపాని, బ్రహ్మహత్యా సమాని చ
అన్న మాశ్రిత్య తిష్ఠంతి, సంప్రాప్తే హరివాసరే
తాని పాపా న్యుపాశ్నాతి, సంప్రాప్తే హరివాసరే
మాతృహా పితృహా చైన, భ్రాతృహా గురుహా తథా
ఏకాదశ్యాం తు యో భుంక్తే, పతుయో రుభయో రపి
రటం తీహ పురాణాని, భూయో భూయో మహామునే
నభోక్తవ్యం నభోక్తవ్యం, సంప్రాప్తే హరివాసరే

తెలివిమాలి యెవఁ డేకాదశి నుపవాసము చేయఁడో వాఁడు చీకటితో నిండిన రౌరవ నరకము పాలగును. శక్తి

యుండి యుపద్రవము లేనివాఁడు ఏకాదశినాఁడు భుజించెనా వానికిఁ గల్లుత్రాగిన పాపము నిశ్చయముగాఁ గలుగును. మద్యపానము చేసినవాఁడు వాఁడు మాత్రమే నరకమునకుఁ బోవును. ఏకాదశినాఁ డుపవాసము చేయనివాఁడు తనతండ్రి తాత ముత్తాతలు లోనగువారితోడ నరకమునఁ గూలును. బ్రహ్మహత్యతో సమానములైన పాపము లేవి గలవో యవి యేకాదశినాఁడు అన్నమును నాశ్రయించి యుండును రెండు పక్షముల నేకాదశి నుపవసింపక భుజించువాఁడు తల్లిని దండ్రిని అన్నను గురువును జంపినపాపమునఁ బోవును (వీనివలన వారికి నధోగతులు గలుగును గనుక) మునీశ్వరా! పురాణములు ఏకాదశినాఁడు భుజింపఁ గూడదు భుజింపఁగూడదని పలుమారు మొఱలు పెట్టుచున్నవి అని యర్థము.

ఇట్టిప్రమాణము లనేకములు గలవు. విస్తరభీతిని వ్రాయలేదు. (వీని కపవాదములు గలవు గాని) యవి యిప్పు డప్రస్తుతములు

శాస్త్రము లిట్లుండ శుష్కవేదాంతులు తిండిపోతులై యేకాదశినాఁ డుపవసించిన నాత్మ మలభక్షణము చేయు నని వదరుట యెంతనీచత్వమో కంటిరా.

ఆత్మకు చేతులు నోరు కడుపు కలదా? కలదందు రేని దానికేమి ప్రమాణము? అపాణిపాదమ్మని ఆత్మకుఁ గాళ్లు చేతులు నోరు కడుపులో నైనయంగములు లేవని శ్రుతులు చెప్పుచున్నవి కదా?

అట్లులే దండు రేని నేచేతితో నెత్తి యేనోటిలోఁ బెట్టు కొనిన నేకడుపుంగోనికిఁ బోవును? ఆత్మకు నాఁకలి కలదా? ఆత్మ విజిఘృత్సుః అపిపాసః ఆఁకలి దప్పి లేనిదని శ్రుతి చెప్పు చున్నది కదా. ఆహారము తినుటవలన నాత్మబలిసి తినకపోయిన చిక్కునా? రోగులకు లంకణములు వేసినపుడు ఆత్మ యేమి తినుచున్నది? ఉపవాసములవలన వ్యాధు లెట్లు కుదురుచున్నవి? రుక్మాంగదుఁడు, అంబరీషుఁడు, సీతాదేవి, శ్రీరాముఁడు లోనైన వారును, వారిభక్షులు, వాయుభక్షులు నైన ఋషీశ్వరులు ఆత్మహింస చేసినవారా? ఇంద్రియములు మదించుటకుఁ బ్రథమ కారణ మాహారము. ఇంద్రియముల జయించుటకుఁ బ్రథమ సాధన ముపవాసము. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతము లేల యేర్పడినవో యీ విపరీతవేదాంతులు చెప్పెదరా? దేహము చెడకుండునట్లు ఇంద్రియములు వశపడియుండున ట్లెంతమాత్ర మాహారము ఎట్టి యాహారము నెప్పుడు తీసికోవలెనో తెలిసి వర్తింపవలెను వాసుదాస రచితమైన రుక్మాంగదచరిత్ర చూడుఁడు.

ఉపవాసములవలన నాత్మచెడు నేని కృచ్ఛ్రాదివ్రతము లేల చెప్పఁబడెను

శ్లో. పాపాత్మానస్తు పాపేభ్యః కృచ్ఛ్రై సంతారితా నరాః
గతపాపా దివం యాంతి, నాత్ర కార్యా విచారణా.

పాపములు చేసినవారు కృచ్ఛ్రాది వ్రతములవలన పాప మును బోఁగొట్టుకొన్నవారై స్వర్గమునకుఁ బోవుచున్నారు.

ఈ విషయమున సందేహము లేదు. ఈ శంఖస్మృతి వాక్యము ప్రకారము పాపాత్ములు కృచ్ఛ్రాదివ్రతములవలనఁ దమపాపములు నశించుటచే వారు స్వర్గమునకుఁ బోదురుగదా. ఈ కృచ్ఛ్రాదివ్రతము లవ నెట్టివో చూతము.

అఘమర్షణవ్రతము.

త్ర్యహం త్రిషవణ స్నాయీ, స్నానే స్నా నేఘమర్షణమ్
నిమగ్నస్త్రీ పరే దప్సు నభుంజీత దినత్రయమ్.

మూఁడుదినములు దినమునకు మూఁడునార్లు నీట మునిఁగి స్నానము చేయుచు నఘమర్షణమంత్రములఁ బఠింప వలయును. మూఁడుదినములు భోజనము చేయరాదు.

ప్రాజాపత్యవ్రతము.

శ్లో. త్ర్యహంసాయం త్ర్యహం ప్రాత స్త్ర్యయమద్యా దయూచితమ్। త్ర్యహం పరంచ నాశ్నీయా త్ప్రాజాపత్యం చరన్ వ్రతమ్॥

ప్రాజాపత్యవ్రతమునఁ జరించువాఁడు మూఁడు దినముల మూఁడుఁ రేపులు మూఁడుమాపులు నెవరిని యాచింపక లభించినదానిని దినవలయును ఆవల మూఁడుదినములు భోజనము చేయఁగూడదు.

ఇట్లుపవాసములవలనఁ బాపములు క్షయించునని శాస్త్రములు చెప్పుచుండఁ బాపము వచ్చు ననెడి వా రెంత వివేకులో.

అట్లుపవాసమువలనఁ బాపమువచ్చునేని "తపో నానశనాత్పరం" ఉపవాసమునకంటె శ్రేష్ఠమైన తపస్సులేదని వేదమేల చెప్పును

శ్లో. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదపంతి యజ్ఞేన,
దానేన, తపసానాశనేనైత మేవం విదిత్వా మునిర్భవతి"
బృహదారణ్యకోపనిషత్తు

ఈయాత్మను వేదవచనములచేతను, యజ్ఞము (దేవ పూజ) చేతను దానముచేతను, తపస్సుచేతను, ఆహారము మానుటచేతను (అనశన రూపకతపస్సుచేతను) నీ విధముగాఁ దెలిసికొని బ్రహ్మనిష్ఠుఁడు మునియగుచున్నాఁడు. ఆత్మ సాక్షాత్కారమున కాహార నియమ మేల శ్రుతి చెప్పుచున్నదో. లోకులను దుర్బోధముచే శుష్క వేదాంతులవలె నాశముచేయవలయు ననని వేదపురుషుఁడు తలఁచెఁ గాఁబోలు.

## సంధ్యావందన నియమములు

గతసంచికా శేషము (330-వ పుట చూడు.)

౧౫. సంధ్యవార్చుటకు ముఖ్యకాలమందు సాధ్యముకాక గౌణకాలమందు వారుప వలసివచ్చెనేని గాయత్రీ పూర్వకమైన యర్ఘ్య మొకటి హెచ్చుగ విడువవలయును ఎక్కువగ ప్రాణాయామము చేయవలయును. ఇవి రెండు ప్రాయశ్చిత్తము లని యెఱుంగునది.

౧౬. సాయంసంధ్యయందు ప్రాతస్సంధ్యయందు మూఁడేసి యర్ఘ్యములు విడువవలయును. కొందఱు మధ్యాహ్నమం దొక్కటి విడుతురు. కొందఱు మూఁడు విడుతురు

౧౭. అర్ఘ్యప్రదానము ప్రాణాయామపూర్వకముగ నుండవలయును.

సరియైన కాలమందైన నొక ప్రాణాయామము చాలును.

౧౮. ప్రాతఃకాలమం దర్ఘ్యము విడుచునపుడు సూర్యున కెదురుగ నిలఁబడి వంగి విడువవలయును. మధ్యాహ్నమందుఁ జక్కఁగ నిలఁబడి సాయంకాలమందుఁ గూర్చుండి యర్ఘ్య మీయవలయును.

౧౯. అర్ఘ్యపాత్ర మనఁగా నర్ఘ్య మిచ్చుటకై నీటితో నించిన జలపాత్రము. అర్ఘ్యము విడుచు పాత్రము గాదు. దోసిట నీళ్లు తీసికొన ననుకూలపడునట్లు ఇది మూతి వెడల్పు గలదై యుండవలయును.

౨౦ అర్ఘ్యజలము దోసిటితో నెత్తి గాయత్రితో మంత్రించి గోశృంగమాత్రము పైకెత్తి (తనచనుముక్కులకు సరిగా నెత్తవలయును) ఒకఁడు ముక్కుకొనకు సరిగా నని వ్రాసెను. ప్రాతస్సంధ్యయందు మధ్యాహ్నసంధ్యయందు నీట విడువవలయును. నీళ్లు లేనిచోట కొంచెము నీళ్లు ముందుగఁ బ్రోక్షించి యాతడి నేలయం దర్ఘ్యము విడువవలయును సాయంకాలమం దర్ఘ్యము జలములందు విడువరాదు.

౨౧. అర్ఘ్యము విడుచునపుడు బొటనవ్రేలు చూపుడువ్రేలితోఁ గలిసి యుండరాదు.

౨౨. సంధ్యారంభమందు, అర్ఘ్యమునకుముందు, జపమునకు ముందు, సంధ్యాంతమందు ప్రాణాయామము విధింపఁబడినది.

౨౩. సంధ్యయందు ప్రాణాయామము చేయువారు నెడమ ముక్కురము మూసి కుడిముక్కురముతో కడుపులోనుండు గాలియంతయు మెల్లగా వెలుపలికి విడువవలయును. ఇట్లు విడిచి మరల గాలి లోపలి కీడ్వక వెంటనే బొటన వ్రేలితో కుడిముక్కు మూసి యెడమముక్కుపై నున్న వ్రేళ్లు తెఱచి యొకసారి గాయత్రి పఠించు నంతకాలము గాలి మెల్లగ లోపలికిఁ బీల్వవలయును. ఆవల నాముక్కు రమునుగూడ మూసి ఒకసారి గాయత్రి జపించు నంత సేపు లోపల నే గాలిని నిలుపవలయును. ఆవల కుడిముక్కు తెఱచి మెల్లగ నొకసారి గాయత్రి విడుచునంతకాలములో గాలి వెలుపల విడువవలయును. ఆవల వెంటనే కుడిముక్కు తోనే గాయత్రి యుచ్చరించు నంతకాలమాత్రములో గాలి లోపలికి పీల్చి కుడిముక్కు మూసి యంతకాలమే లోపల నిలిపి యీవల నెడమముక్కురము తెఱచి యంత కాలములో గాలి వెలుపల విడువవలయును

ఇది యొకప్రాణాయామము. ప్రాణాయామ గాయత్రి సప్తవ్యాహృతులతోను మంత్రముతోను గాయత్రిశిరముతోను గూడి యుండవలయు. ఈగాయత్రియందు ౧౦ ప్రణవము లుండును ఇప్పుడు వరేణ్యమ్మని చెప్పవలయును గాని వరేణియ మ్మని చెప్పరాదు.

౨౪. ప్రాణాయామే వినియోగః అని తొలుత చెప్పునపుడు 3 ప్రాణాయామములు చేయవలయును.

౨౫ ఈప్రాణాయామమందు గృహస్థులు ౫ వ్రేళ్లతో ముక్కును బట్టుకొందురు. తర్జని వర్జ్యము వానప్రస్థులు ౪ వ్రేళ్లుపయోగింతురు. బ్రహ్మచారులు యతులు చిటికెనవ్రేలు ఉంగరపువ్రేళ్లతో నెడమముక్కురమును బొటనవ్రేలితో కుడిముక్కురమును బట్టుకొందురు.

దీనినే యోంకార ముద్ర యందురు

(హఠయోగమందలి ప్రాణాయామ పద్ధతి యిది కాదు)

౨౬. ప్రాతస్సంధ్యయందు నీశానదిక్కు తిరిగి సాయంకాలమందు వాయవ్య దిశవైపు తిరిగి సంధ్య వార్చవలయును. మధ్యాహ్నమందు తూర్పుదిక్కై యుండవలయును

౨౭. ప్రాతఃకాలమందు బొడ్డునకు మధ్యాహ్నమందు ఱొమ్మునకు సాయంకాలమందు ముక్కుతుదకు సరిగ జపమాల యుంచవలయును.

౨౮. ప్రాతఃకాలమందు నిలిచియే జపింప వలయును మధ్యాహ్నమందు నిలిచియైనను గూర్చుండియైనను జపింప వలయును సాయంకాలము కూర్చుండియే జపింపవలెను

౨౯. సరియైన కాలమందు ౧౦ మార్లు గాయత్రి జపించినం జాలును ఆకాలము మీఱెనేని బ్రహ్మచారి గృహస్థుఁడు ౧౦౮ మార్లు వానప్రస్థుఁడు సన్న్యాసి ౧౦౦౮ మార్లు చేయవలెను.

ఆశౌచకాలమందును ఆపత్తునందును పదిమార్లు జపింప వచ్చును. తక్కినకాలమందు ౧౦౮ కాని ౧౦౦౮ కాని,

జపము చేయవలెను ౧౦ కి తక్కువ యెప్పుడు నెవరు చేయరాదు.

౩౦ ఆచమించునపుడు మొదటివ్రేలు కడవ్రేలు తక్కినవ్రేళ్ల తోఁ గలిసి యుండరాదు

౩౧ ఆచమనమునకు నెడమచేతఁ గైకొనిన నీరము పనికిరాదు. ఇప్పు డుద్ధరణితో నీరు గ్రహించుట వాడుక యైనది

౩౨ మార్జనమంత్రములతోఁ జల్లుకొను నీ రీవల నావల లపైఁ బడరాదు

౩౩ గాయత్రి జపించునపుడు వరేణియ మ్మనియే జపింపవలెను. తక్కినసమయముల వరేణ్య మ్మని చెప్పవలెను.

౩౪. గాయత్రి దండాకారముగా జపింపరాదు ౫ స్థలములందు నిలుపవలెను ప్రణవము, వ్యాహృతులు మూఁడుపాద ముల తుదలు నిలుపవలసిన ౫ స్థానములు.

౩౫. నీళ్లయందుండి సంధ్యవార్చునెడల మోఁకాటిలోఁతు నీళ్లలో నిలువఁబడవలెను స్థలమునందు గొంతుకూ ర్చుండి కాని ఒకపాదము నీళ్లలో నొకపాదము వెలుపల నుంచికాని సంధ్య వారువవలయును. తడిగుడ్డలతో సంధ్య వార్వరాదు అట్లు వారువ వలసివచ్చెనేని మోఁ కాటిలోఁతు నీళ్లలో నిలువఁబడి ప్రదక్షిణనమస్కార ములు వదలి యుపస్థానము చేయువలెను.

౩౬. తడివస్త్రమును గట్టిగా పిండి ఏడుమార్లు గాలిలో జాడిం చినయెడల శాస్త్రార్థ మది యెండిన వస్త్రముగా నెంచ వలయును.

౩౭ గాయత్రిమంత్రము తప్ప మఱి యేమంత్రమైనను గూర్చుండియే జపింపవలెను. తూర్పుముఖమైకాని యుత్తరముముఖమైకాని యుండవలెను.

౩౮ రావిచెట్టు-అగ్ని-సూర్యుఁడు-చంద్రుఁడు గురువు జలము తనకు వెనుకప్రక్కగా నుండునట్లు జపించినవాఁడు స్థావరముగాఁ బుట్టును.

౩౯. ఏపుండ్రము ధరించువారైనను పాదుముఖముతో సంధ్య వారువరాదు నీటితో నూర్ధ్వపుండ్రము ధరింపవలెను.

౪౦ జపించునపుడు-ఆవలింత-తుమ్ము-ఉమ్మివేయుట, క్రోధము, సోమరితనము, నిద్ర, మదము, పతితులను, కుక్కలను, అంత్యజులను చూచుట కూడదు. ఒకవేళ తటస్థించెనేని మరల మొదటినుండి జపింపవలెను. పతితులతో సంభాషించిన స్నానముచేసి మరల జపింపవలెను మౌనము ముఖ్యము

౪౧ జపకాలమందు తనబొడ్డునకు క్రిందిభాగమును తాఁకరాదు తాఁకెనేని చేతులు కడుగుకొనవలెను.

౪౨ జపమధ్యమున మాటలాడ వలసివచ్చెనేని «ఇదం విష్ణుర్విచక్రమే» యనుమంత్ర ముచ్చరింపవలెను లేదా నారాయణ స్మరణము చేయవలెను

౪౩. జపమధ్యమందు భాగవతులు వచ్చిరేని వారి నాదరించి నమస్కరించి యోగక్షేమముల విచారించి వారి యను

జ్ఞచే జపము పూర్తి చేయవలెను. మరల మొదలు పెట్ట వలసినపని లేదు

౪౩. ప్రదోషమందును, అనధ్యాయరాత్రులందును ఆపత్తులందును గాయత్రి సంకోచింపవలెను.

అనఁగా పాడ్యమి-పూర్ణిమ-అమావస్య రాత్రులందు ౩౬.

చతుర్థీ-అష్టమి-చతుర్దశి రాత్రులందు ౫౪.

సప్తమి రాత్రి ౩౭.

విష్వాయన త్రయోదశుల రాత్రులందు ౨౮.

౪౫. త్రయోదశీ ప్రదోషము మహాప్రదోష మనఁబడును. ఆనాఁడు పగటిపూట ౮ వ భాగము మొదలు అర్ధరాత్రమువఱకు గాయత్రి జపము సాయంకా లౌపాసనము వైశ్వదేవము సాయ మభిగమనము, భగవ దారాధనము నందుఁ దప్ప తక్కిన సమయమందు కాష్ఠమౌనము వహింపవలెను

౪౬. శ్రాద్ధభోజనము నాఁడు రాత్రి ౧౦ మార్లు జపింపవలెను.

౪౭ జలమునందుండి యర్ఘ్యమును జలమునందే విడువవలెయును. స్థలమునందుండి స్థలమందే విడువవలయును. స్థలమందుండి జలమందు విడువవచ్చును జలమందుండి స్థలమందు విడువరాదు.

౪౮. తిరుగుచు సంధ్య వార్వరాదు ఒకవేళ స్థానము విడువలసివచ్చిన ౨౪ అడుగుల కెక్కువ తిరుగరాదు.

## ప్రదోషకాలము.

చతుర్థి సప్తమి త్రయోదశులందు సూర్యాస్తమయ కాలమునకు తరువాతికాలము ప్రదోష మనఁబడును.

చతుర్థీ సప్తములందు సూర్యాస్తమానము మొదలు మూఁడుముహూర్తముల కాలము ప్రదోషము. త్రయోదశి యందు పగటియెనిమిదవభాగము మొదలు అర్ధరాత్రమువఱకు ప్రదోషము. ఏదినము సూర్యాస్తమయానంతరము ౯ గడియలుకు చతుర్థీతిథి వచ్చునో ఆ దినము ప్రదోషము (నాడీ= గడియ= ౨౪ నిమిషములు ముహూర్తము ౪౮ నిమిషములు)

తక్కినదినములందు సూర్యాస్తమయానంతరము చతుర్థి రెండుగడియ లుండినను ప్రదోషమే. ఏదినము సూర్యాస్తమయానంతరము ౧౫ గడియలకు ముందు సప్తమి వచ్చునో ఆ దినము ప్రదోషము తక్కినదినములందు సూర్యాస్తమయానంతరము సప్తమి ౧ గడియయుండినను ప్రదోషమే. ఏదినమందు సూర్యోదయము మొదలు ౬౦ గడియలకులోఁగా త్రయోదశి వచ్చునో యాదినము ప్రదోషము. తక్కినదినములందు సూర్యాస్తమయానంతరము అరగడియ త్రయోదశి యుండినను ఆ దినము ప్రదోషమే ఈప్రదోషకాలమందు గాయత్రితప్ప మఱి యేమంత్రము జపింపరాదు. గాయత్రి జపించినను మీఁద చెప్పినట్లు సంకోచించియే జపింపవలెను. సమాజ సభ్యులీవిషయమును మనస్సున నుంచుకొని ప్రదోషకాలముల గాయత్రిదప్ప మఱి దేనిని జపింపకుందురుగాక, కొందఱు ద్వారా

జ్ఞచే జపము పూర్తి చేయవలెను. మరల మొదలు పెట్ట వలసినపని లేదు.

౪౨. ప్రదోషమందును, అనధ్యాయరాత్రులందును ఆపత్తులందును గాయత్రి సంకోచింపవలెను.

అనఁగా పాడ్యమి-పూర్ణిమ-అమావాస్య రాత్రులందు ౩౬.

చతుర్థి-అష్టమి-చతుర్దశి రాత్రులందు ౫౪.

సప్తమి రాత్రి ౩౭.

విష్వాయన త్రయోదశుల రాత్రులందు ౨౮.

౪౫. త్రయోదశీ ప్రదోషము మహాప్రదోష మనఁబడును. ఆనాఁడు పగటిపూట ౮ వ భాగము మొదలు అర్ధరాత్రమువఱకు గాయత్రి జపము సాయంకా లౌపాసనము వైశ్వదేవము నాయ మభిగమనము, భగవ దారాధనము నందుఁ దప్ప తక్కిన సమయమందు కాష్ఠమౌనము వహింపవలెను

౪౬. శ్రాద్ధభోజనము నాఁడు రాత్రి ౧౦ మార్లు జపింపవలెను.

౪౭ జలమునందుండి యర్ఘ్యమును జలమునందే విడువవలయును. స్థలమునందుండి స్థలమందే విడువవలయును. స్థలమందుండి జలమందు విడువవచ్చును జలమందుండి స్థలమందు విడువరాదు.

౪౮. తిరుగుచు సంధ్య వార్వరాదు ఒకవేళ స్థానము విడువవలసివచ్చిన ౨౪ అడుగుల కెక్కువ తిరుగరాదు.

## ప్రదోషకాలము.

చతుర్థి సప్తమి త్రయోదశులందు సూర్యాస్తమయ కాలమునకు తరువాతికాలము ప్రదోష మనఁబడును.

చతుర్థీ సప్తములందు సూర్యాస్తమానము మొదలు మూఁడుముహూర్తముల కాలము ప్రదోషము. త్రయోదశి యందు పగటియెనిమిదవభాగము మొదలు అర్ధరాత్రమువఱకు ప్రదోషము. ఏదినము సూర్యాస్తమ యానంతరము ౯ గడియలుకు చతుర్థీతిథి వచ్చునో ఆ దినము ప్రదోషము (నాడి= గడియ= ౨౪ నిమిషములు ముహూర్తము ౪౮ నిమిషములు)

తక్కినదినములందు సూర్యాస్తమయానంతరము చతుర్థి రెండుగడియ లుండినను ప్రదోషమే. ఏదినము సూర్యాస్తమ యానంతరము ౧౫ గడియలకు ముందు సప్తమి వచ్చునో ఆ దినము ప్రదోషము తక్కినదినములందు సూర్యాస్తమ యానంతరము సప్తమి ౧ గడియయుండినను ప్రదోషమే. ఏదినమందు సూర్యోదయము మొదలు ౬౦ గడియలకులోఁగా త్రయోదశి వచ్చునో యాదినము ప్రదోషము. తక్కినదినములందు సూర్యాస్తమయానంతరము అరగడియ త్రయోదశి యుండినను ఆ దినము ప్రదోషమే ఈప్రదోషకాలమందు గాయత్రితప్ప మఱి యేమంత్రము జపింపరాదు. గాయత్రి జపించినను మీఁద చెప్పినట్లు సంకోచించియే జపింపవలెను. సమాజ సభ్యు లీవిషయమును మనస్సున నుంచుకొని ప్రదోషకాలముల గాయత్రితప్ప మఱి దేనిని జపింపకుందురుగాక, కొందఱు ద్వారా

చయ్య యని కుక్కుటాసనమందుండి రెండుమా ర్లాచమించి దామోదరవఱకే పండ్రెండునామములు రెండుమార్లు పఠింతురు. వారివారి సాంప్రదాయానుసారముగ వారువా రాయాస్థలముల వర్తింపవచ్చును.

రెండుమా ర్లాచమించుట యాదరా ద్విరుక్తి యను న్యాయము ననుసరించి యధిక న్యాధికం ఫలమ్మను కారణమని యొకరు వ్రాసిరి కాని సరియైనకారణము ౨౪ గాయత్రీ మంత్రాక్షరములకు నొక్కొక్క దానికి నొక్కొక్క నామమని తోఁచుచున్నది. ఎటుతిరిగి ౨౪ పూర్తికావలయునుగదా.

౪౯. ఆచమించునపుడు పాదములు పీటపై నుండరాదు. ఆసనము వేసికొని కూర్చుండరాదు. చేతులు రెండు తొడలకు వెలుపలనుండరాదు. భోజనానంతరాచనమున నాసనము తగును.

ముఖ్యనియమములు సూత్రప్రాయముగ వ్రాయఁబడినవి. ద్విజులకు ననఁగా బ్రహ్మక్షత్రియవైశ్యులకు సంధ్యావందనము ప్రాణము వంటిది ప్రాణము లేని దేహమెట్టిదో సంధ్యవారువని ద్విజుఁడు నట్టివాఁడే సంధ్యాధిదేవత ప్రాణశక్తియే కదా. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు పుట్టువుచే శూద్రసములు. గాయత్రీ నుపదేశము నొందుటచే ద్విజులైరి అట్టి గాయత్రిని వారు పోఁగొట్టుకొనిరేని వారు ద్విజు లెట్లగుదురు ధనము సంపాదించి ధనికుఁ డనిపించుకొన్నవాఁ డాడధనమును గోలుపోయెనేని దరిద్రుఁడే కదా యగును. ఈవిషయము జన్మనా

జాయతే శూద్రయను శ్లోకమునకు నర్థము ప్రాయుచుం జర్చిం పఁబడెను. (చూడుడు ఫిబ్రవరి 1930 సంచిక పుట ౬౧)

శ్లో॥ విప్రా శ్శూద్ర సమా, స్తావ ద్విజ్ఞేయా స్తు విచక్షణైః
యావ ద్వేదే నజాయంతే, ద్విజా జ్ఞేయా స్తతః పరమ్.

శంఖ స్మృతి

బ్రాహ్మణులు తెలిసినవారిచేత నుపనయన మగునంతకు శూద్రసములుగాఁ దెలియఁబడుదురు ఎప్పుడు వేదముచేత పుట్టుచున్నారో ఆవల ద్విజు లని తెలియఁబడుదురు.
మను స్మృతియు నిట్లే చెప్పుచున్నది.

కొందఱు జాతిచేత నందఱు శూద్రులే. అందు బ్రహ్మ జ్ఞానముకలవారు బ్రాహ్మణులని చెప్పెదరు అదిమూర్ఖవాదమే కాని శాస్త్రీయవాదము కాదు.

వైద్యనాథ దీక్షితీయము.

"నచప్రా గుపనీయనాత్, బ్రాహ్మణ్య మేవ నా స్తీతి శంకనీయం॥

శ్లో॥ బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా న్నైన, హ్యుత్పన్నో బ్రాహ్మణః స్మృతః। సవర్ణేభ్య స్సవర్ణాసు, జాయంతే హి సజాతయః ఇతి। హారీత యాజ్ఞవల్క్యాభ్యా ముత్పత్తిమాత్రేణ నాజాత్యస్యాభిధానాత్॥
స్త్రీ శూద్రేణ సమస్తావ, ద్యావన, ద్వేదే నజాయత
నహ్యస్య విద్యతే కర్మ, కించిదామౌంజిబంధనాత్॥
వృత్త్యా శూద్రసమా స్తావత్, యావ ద్వేదే నజాయత
ఇతి వసిష్ఠ స్మరణాత్॥

శ్లో॥ భక్ష్యా భక్ష్యే తథాపేయే, వాచ్యావాచ్యే తథానృతే
అస్మిన్ కాలేనదోష స్స్యాత్, సయావ న్నోపనీయతే
ఉపనీతైవ దోషోస్తి, క్రియమాణై ర్విగర్హితై రితి.

అర్థము.

ఉపనయనమునకు ముందు బ్రాహ్మణత్వమే లేదని సందే హింపరాదు. బ్రాహ్మణ స్త్రీయందు బ్రాహ్మణునివలనఁ బుట్టు వాఁడు బ్రాహ్మణుఁ డని స్మృతులు చెప్పుచున్నవి సవర్ణ పురుషులవలన సవర్ణస్త్రీలయందు జనించువారు సజాతీయు లగుదురు.

అని హారీతుఁడు యాజ్ఞవల్క్యుఁడు జననముచేతనే సజాతీయత్వము చెప్పిరి.

ఎంతవఱ కుపనయనము గాదో యంతవఱకు వారు బ్రహ్మ క్షత్రియ వైశ్యబాలురు స్త్రీ శూద్ర సమానులు మౌంజి కట్టునఱకు వారికిఁ గర్మములు లేవు బ్రహ్మోపదేశమగునఱకు వారు వృత్తిచే శూద్రసములు అని వసిష్ఠుఁడు చెప్పెను

ఉపనయనమునఱకు నిది తినవచ్చు నని యిది తినరాని దని యిది చెప్పవచ్చు నని యిది చెప్పరాని దని యిది యసత్యమని నియతి లేదు ఇట్లని యుపనయనము ౧౬ ఏండ్లకుఁ జేసిన నంతవఱ కని కాదు. ఉపనయనము ౮-వ యేట జరిగిన ను ౭ ఏండ్లవఱకే.

శ్లో॥ జన్మనైవ తు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః
కుర్యా దన్యం నవా కుర్యా, న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥

ఈశ్లోకము మహాభారతమందును శంఖధర్మశాస్త్రమందును గలదు

బ్రాహ్మణుఁడు గాయత్రీజపముచేతనే సిద్ధి పొందుచున్నాఁడు ఈవిషయమంగు సందేహము లేదు. ఇతరకర్మమును జేసినను జేయకున్నను మైత్రః=సూర్యోపాసనాపరుఁడు బ్రాహ్మణుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. దీనివలన గాయత్రి యెంతముఖ్యమో ద్విజు లాలోచింతురుగాక. నగాయత్ర్యాః పరం మంత్ర మ్మని కలదుగదా. గాయత్రియే బ్రహ్మాస్త్రమంత్రము

కొందఱు గృహస్థులు తాము సన్న్యాసులమైనఁ గాని ముక్తి కర్హులుగా మని భ్రాంతి పడుచున్నారు అది మిక్కిలి పొరపాటు

శ్లో. న్యాయాగత ధన స్తత్త్వ జ్ఞానని ష్ఠోతిథిప్రియః
శ్రాద్ధకృ త్సత్యవాదీ చ గృహస్థోపి విముచ్యతే

ఈయాజ్ఞవల్క్యవాక్యముపై వైద్యనాథదీక్షితులు 'న కేవలం పరివ్రాజ ఏవ ముక్తి కర్మిణ స్తత్త్వజ్ఞాన నిష్ఠస్య గృహస్థస్యా పీ త్యర్థః' అని వ్రాసెను

అర్థము న్యాయార్జితధనముతో జీవించుచు, తత్త్వజ్ఞాననిష్ఠుఁడై యాత్మచింతనము చేయుచు, నతిథుల నభ్యాగతుల నాదరించుచు, శ్రాద్ధములు చేయువాఁడు గృహస్థుఁడైనను ముక్తుఁడే. సన్న్యాసికి మాత్రమే కాదు ముక్తి జ్ఞాననిష్ఠుఁడైన గృహస్థునకును గలదు ››

శ్లో.వీతరాగ భయ క్రోధో, లోభ మోహ వివర్జితః
సావిత్రీ జప్యనిరత శ్శ్రాద్ధకృ న్ముచ్యతే గృహీ ॥ వ్యాసులు ॥
అర్థము రాగము భయము క్రోధము లోభము మోహము
విడిచి గాయత్రిజపించుచు శ్రాద్ధములు జరుపువాఁడు ముక్తుఁ డగును.

శ్లో.గాయత్రీ మాత్రసారోపి వరో విప్ర స్సుయంత్రితః
నియమముతో గాయత్రి మాత్రము జపించు గృహస్థుఁడు ముక్తుఁ డగును

శ్రాద్ధమందు నిమంత్రణము చెప్పుటకు నెట్టి బ్రాహ్మణులు యోగ్యు లని ధర్మరాజు భీష్ముని బ్రశ్నించెను. వేదాధ్యయనము శమదమాదులు లోనగు నుత్తమ బ్రాహ్మణ గుణములు గలవా రని భీష్ముఁడు చెప్పెను. ఇట్టివారు కలియుగమందు దొరకరుగదా అప్పు డేమిమార్గ మని ధర్మరా జడిగెను. గాయత్రి జపించువాఁడు దొరికిన గ్రహింపవచ్చు నని భీష్ముఁడు చెప్పెను. శివసర్వస్వమందు.

శ్లో.యావ న్నకీర్తయే ద్రామం, కలికల్మషసంభవమ్
తావ త్తిష్ఠతి దేహేస్మిన్, భయం చాత్ర ప్రవర్తతే.

అని గలదు కలియుగమందు వర్ణధర్మములు జరగవే గతి యేమి యని ప్రశ్న. దానికిఁ బ్రత్యుత్తరము.

ఎంతవఱకు రామనామము కీర్తింపఁబడదో యంతవఱకు కలికల్మషము వలనఁ గలిగిన భయ ముండును. అనఁగా రామనామము స్మరించువారిని కలికల్మషములు బాధింపవు.

చ్యవన స్మృతియందు.

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణేషు, రామనామ సమీరితమ్
  తన్నామకీర్తనం భూయ స్తాపత్రయ వినాశనమ్.

వేదములందు స్మృతులందుఁ బురాణములందు రామ నామము చెప్పఁబడియున్నది. పలుమా ఱానామము కీర్తించు టచే తాపత్రయములు నాశ మగుచున్నవి అని ప్రత్యుత్తరము.

కావున సమాజసభ్యులు పరులను జెఱుచుట ముఖ్య వ్రతముగాఁగల శాస్త్రవిచారదూరుల మాటలను బాటింపక తాముచేసిన ప్రమాణములను స్మరించి యాప్రకారము నడ చుచు ద్విజులు గాయత్రిజపము, భగవద్గీతా రామాయణపారా యణము రామనామకీర్తనము ఇష్టదేవతా జపముచేసి ద్విజత్వ మును గాపాడుకొని ముక్తులగుదురు గాక.

## —శ్రీరామమత ధర్మములు.—

### లక్ష్మణకైంకర్యము.

కింకరభావము కైంకర్యము కింకరుఁ డనఁగా నీకార్య ముత్తమము మనయోగ్యతకుఁ దగినది యని కాని యిది నీచ కార్యము మనయోగ్యతకుఁ దగినది కాదనికాని యెంచక యెట్టి కార్యమైనను స్వామిహితార్థమై చేయువాఁడు దంస యతే స్వామికార్యాణి సావధానే నేతిదాసః దసి దశ దర్శన యోః స్వామికార్యములను సావధానముగాఁ జూచువాఁడు దాసుఁడు.

తనయభిప్రాయప్రకారము తన స్వామి కేది సుఖము సంతోషము గలిగించునో యది మొగమోటములేక కింకరుఁడు చెప్పును. జేయును. కింకరునకుఁ గైంకర్యము ప్రధానము. దానికి విఘ్నము కలుగు కార్యము తనస్వామి చెప్పినను జేయఁడు. కాని స్వామికి హిత మని తనకుఁ దోఁచినది స్వామి కాదు కూడ దనెనేని దానిని జేయఁడు ఏల? తన కంటెఁ దనస్వామి యన్నివిధముల గొప్పవాఁడని యతని యభిప్రాయము. కావునఁ దా నాలోచన లేక యేదియైనఁ జేసినఁ దనస్వామి కదిహితము ప్రియము గాకుండునేమో? తా నే యే వేళకు నే దేది చేయవలయునో యది చేయకుండినఁ దనస్వామికి సుఖభంగము కలుగునేమో యని యెంచి మిక్కిలి హెచ్చరిక కలిగి వర్తించుచుండును కావున రాత్రిగాని పగలుగాని యొక గడియయైన స్వామిని విడిచియుండఁడు స్వామి కార్యార్థమై యుండిన నుండును గాని మఱియొక కారణముచే నెడఁ బాయఁడు తనస్వామిని విడిచి పోవుట యనఁ బ్రాణము పోవుటే. కింకరునకుఁ దనస్వామిని మించిన వారు నాప్తుల యిన వారు లేరు తన స్వామి తప్ప వేఱె దైవము గలఁ డనియును నతఁడు తలఁపఁడు కష్టము నెంచఁడు ప్రతిష్ఠఁ గోరఁడు. వినయము విడువఁడు. ఇట్టివాఁడు కింకరుఁడు. దాసుఁడు. వీఁడు తనప్రాణ మిచ్చియైనఁ దనస్వామికీర్తి ప్రతిష్ఠలు కాపాడును కొందఱు కైంకర్యము సుకర మని ంతురు గాని యది సుకరము గాదు. కర్మ జ్ఞాన యోగముల

కంటె కష్టతరమైనదే. ఆ యోగములందు కార్యము చేయువాఁడు దానిఫల మనుభవించువాఁడు నొకఁడే స్వతంత్రుఁడు. కావున సోమరితనము చేతనో మఱియేకారణము చేతనో ముఖ్యకాలములందుఁ జేయఁదగు కార్యము గౌణకాలమందుఁ జేయవచ్చును బొత్తిగ విడిచినను విడువవచ్చును అడుగువాఁడు లేఁడు కైంకర్యమం దట్టి సోమరితనమునకు నుదాసీనత్వమునకు నెడములేదు గదా తన యభిప్రాయము ప్రకారము తాను బోవుట సుకరముగాని యితరుల చిత్తవృత్తి యేక్షణమున కెటులుండునో యెఱిఁగి దాని కనుగుణముగాఁ జరించుట కష్టముగదా

మీఁద వివరించిన కైంకర్య లక్షణ జ్ఞానము మనస్సునందుంచుకొని లక్ష్మణుని కైంకర్యానుష్ఠాన మెట్టిదో చూచి యా ప్రకారము మనము చేసి బాగుపడుదముగాక.

ప్రహ్లాదునకు జ్ఞానవిశిష్టమైన భక్తివలె లక్ష్మణునకు జ్ఞానయుక్తమైన కైంకర్యాభిమానము తల్లికడుపునందుండినది మొదలు లభించెను. కావుననే కదా.

ఉ. చిన్నతనాన నుండియును జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడు లోకరాముఁడౌ । నన్నకు లక్ష్మివర్ధనుఁ డనంతము గూఁడుచు స్నేహభక్తిసం । పన్నుఁడు లక్ష్మణుండు వెలిప్రాణము నేకము నౌశరీరముల్ । కన్నను మిన్నయుల్ సకలకార్యహితాచరణుం డజస్రముల్

ఉ. రాముఁ డుదారవిక్రముఁ డరణ్యముకై మృగయావినోదకేళీమతి నశ్వ మెక్కి చన లీలమెయిం జను నీడవోలె ను

ద్రామజవాన లక్ష్మణుఁడు దారుణచాప శరాస పాణియై
యేమఱ కెప్పుడుం దిరుగు నెంతయు భక్తిరసప్రపూర్ణుఁడై

ఇట్టి కైంకర్యపరు విషయమున రాముఁ డెట్లుండెనో చూడుఁడు.

కం॥ జనయిత్రియె మృష్టాన్నము
గొనివచ్చి యదెంత వేఁడుకొన ముట్టండుౕ
గనుమూయఁడు పురుషోత్తముఁ
డనుఁగుందమ్ముండు లక్ష్మణాఖ్యుఁడు లేమిన్.

దీనివలనఁ గైంకర్యము వ్యర్థము పోదు. దాసులందు భగవంతుఁడు ప్రేమయుంచక మానఁడు అని యేర్పడుచున్నది. తక్కిన మార్గములందు ఫలము లేదా యందురేమో ఇంత శీఘ్రముగ భగవంతుఁ డనుగ్రహింపఁడు భోజనసమయమందుఁ దనతోడ లక్ష్మణుఁడు లేక తల్లి పెట్టినను ఇష్టమృష్టాన్నమైనను భుజింపఁ డనుటచే ముందు భక్తుల కాహారము (అన్న ముప లక్షణము) అనఁగా యోగక్షేమముల కేర్పాటుచేసి కాని భగవంతుఁడు తనసుఖము చూచుకొనఁ డని భావము.

శ్లో॥ శరీ రారోగ్య మర్థాంశ్చభోగాం శ్చై వానుషంగికాౕ
దదాతి ధ్యాయినాం నిత్య మపవర్గప్రదో హరిః

తన్ను ధ్యానించువారికి మోక్షమిచ్చు నారాయణుఁడు శరీరారోగ్యము ధనము భోగము వీనిని గూడనానుంగును ధనలక్ష్మి శ్రీదేవి. ధాన్యలక్ష్మి భూదేవి. వీ రిరువురను భార్యలుగాఁ గల భగవంతు సేవించువారికి నిహమందుఁ బరమందు

నేలోపము గలుగదు. ఇట్లు సర్వకాల సర్వావస్థల శ్రీరాము నకుఁ గుడిభుజమై సేవించువాఁ డగుటచేత విశ్వామిత్రువెంట శ్రీరామునితో పాటు తానును లక్ష్మణుఁడు పోయెను ఇట్లు పోవునపుడు విశ్వామిత్రుఁడు దాటకను వధింపు మని శ్రీరాముని ప్రేరించెను. రాక్షసవధార్థము విశ్వామిత్రుఁడు రాముని బంపు మని దశరథుని వేఁడెను. దశరథుఁడు శ్రీరామునే యా కార్యమందు నియోగించెను. లక్ష్మణుఁడు బంటువలె వెంటఁ బోయినవాఁడే. ఇట్లుండియు లక్ష్మణుఁడు తాటకయందు శ్రీరామునకుఁ దోడుపడెను. ఏల? శ్రీరాముఁడు తానొకఁడే తాటకను జంపఁ జాలమిచేతనా? కాదు. ప్రముఖుఁ డొకఁడు పూనిన పనియందు మఱియొకఁడు తోడుపడినఁ బ్రముఖుని కీర్తికి లోప మని లక్ష్మణుఁ డెఱుంగఁడా? ఎఱుఁగును. కుంభ కర్ణునిచేతఁ జిక్కిన సుగ్రీవుని విడిపింప హనుమంతుఁ డేల పోలేదు? సుగ్రీవున కపకీర్తి వచ్చు నని కదా. శివువింటిని రాముఁ డొకఁడే విఱువక యిరువురు కలిసి విఱిచియుండిన శ్రీరామున కిప్పుడు వచ్చినకీర్తి వచ్చియుండునా?

శ్రీరామున కపకీర్తి తేవలయు నని తాను కీర్తిసంపాదింప వలయు నని లక్ష్మణు నభిప్రాయము గాదు తాటక తమ మీఁదికి వచ్చుచుండుట చూచి కరుణాకాకుత్స్థుఁ డనిపేరు పొందిన రాముఁడు స్త్రీ కావున దానిని జంపనొల్లక లక్ష్మణునితో,

శ్లో. ఏనాం పశ్య దురాధర్షాం మాయాబల సమన్వితామ్
వినివృత్తాం కరో మ్యద్య హృత కర్ణాగ్ర నాసికామ్.

మాయాబలముతోఁ గూడినదియు జయింప రానిదియు నైన దీనిముక్కు సెవులు గోసి మరలి పోవునట్లు చేసెదను అని చెప్పెను. ఇంతలోఁ దాటక పైపడి రానే వచ్చెను. శ్రీరాముఁడు దూరమునుండియే దానిని బాణములచే నొప్పించుచుండెను. తనకు సాధ్యమైనప్పుడు స్వామి పూనినకార్యము ప్రాణ మిచ్చియైనఁ దాను నెఱవేర్పవలసినది కింకరునికి విధి కావునఁ దాను ముందు దూఁకి దానిసమీపమునకుఁ బోయి లక్ష్మణుఁడు ముక్కు సెవులు గోసెను. ముక్కులు సెవులుగోసినవాఁడు తలయే నఱికియుండరాదా? రామున కప్పటి కాయభిప్రాయము లేదు. సౌమ్యముగ దండింప వలనుండిన నేల చంపవలయుననీ రాముని యభిప్రాయము స్వామి యభిప్రాయమునకు విరోధముగ దాసుఁడు పోరాదు

విభీషణునకు నభయ మిచ్చినవాఁడు శ్రీరాముఁడే కాని లక్ష్మణుఁడు కాఁడు అట్లుండ విభీషణుని జంప రావణుఁడు శక్తిని బ్రయోగించినపుడు ఆశక్తి తగిలిన విభీషణుఁడు మరణించు నని యెఱిఁగి తాను విభీషణునకు ముందు దూఁకి విభీషణుని తనవెనుక వేసికొని యాశక్తిచే హతుఁడై పడి శ్రీరాముని శరణాగత రక్షకబిరుదమును సార్థకము చేసెను. లక్ష్మణుఁ డడ్డపడకుండిన శ్రీరామున కపకీర్తి తప్పియుండదు. శరణాగతరక్షక బిరుదము వ్యర్థమై యుండును తా నరణ్యమునకుఁ బోకుండినఁ గన్నతండ్రి యసత్యవాది యగు నని యరణ్యములకుఁ బోయినవాఁడు రాముఁడు. తా నడ్డపడకుండిన సవతితల్లి కొడు

కిచ్చిన యభయదానము వ్యర్థ మగు నని ప్రాణ మిచ్చినవాఁడు లక్ష్మణుఁడు తారతమ్య మరయుఁడు-లక్ష్మణుఁడు తా నిట్టి వాఁడ నని కౌసల్యతో ముందుగనే.

శ్లో. దీప్త మగ్ని మరణ్యం వా, యది రామః ప్రవేక్ష్యతి
ప్రవిష్టం తత్ర మాం దేవి, త్వం పూర్వ మవధారయ.

రాముఁడు మండెడుమంటయందుఁ గాని యడవి యందుఁగాని ప్రవేశించుటయే కలిగెనేని తల్లీ! యాయనకు ముందు నేను ప్రవేశించిన వాఁడనుగా నెఱుఁగుము.

కైంకర్యము త్రికరణశుద్ధమై యుండవలయును అను కూలత కొలఁది యథాసుఖముగఁ దీరిక యున్నప్పుడు వేఱు పనిలే నప్పుడు చేయు కష్టములేని కైంకర్యము కైంకర్యము కాదు ముందు ప్రతిష్ఠకుఁ బ్రగల్భము లాడి యావల కార్య భాగమందు వెను కంజ పెట్టుట కింకరలక్షణముగాదు

శ్రీరామునకు లక్ష్మణుఁడు సవతితల్లి కుమారుఁడు. కావున జ్ఞాతియే కదా! జ్ఞాతి శ్చే దనలేన కి మ్మన్నట్లు జ్ఞాతియైన వాఁ డింటనుండి నేని యా యింటిని దహించుటకు వేఱే యగ్ని హోత్రముతోఁ బనిలే దని నామెత జ్ఞాతియనఁగా దాయా దుఁడు. దాయభాగమున కర్హుఁడైన వాఁడు. విరోధమునకు సాధా రణముగా కామినీ కాంచనములు కారణములు. గావున దాయ యనఁగాఁ బగవాఁ డని యర్థము కావున రామలక్ష్మణులు సహజముగ విరోధులయి యుండవలెను ఏకోదరులందే యిట్టి విరోధము ప్రచురమై యుండ నిఁక సవతితల్లిబిడ్డల విషయమై

యడఁగవలయునా? రావణ విభీషణు లేకోదరులు. ఒక తల్లి కుమారులు - అట్లుండియుఁ దనకుఁ బ్రియమును జెప్పక హితము ను జెప్పె నని మాటమాత్రమునకు.

కం॥ జ్ఞాతుల స్వభావ మంతయు
నా తెలియనియదియె త్రిభువనంబులలోనన్
జ్ఞాతులకు వ్యసన మబ్బిన
జ్ఞాతులకును సంతసంబు సమకూడుఁ గదా.

కం॥ ఆతతమతియుతు ధర్మో
పేతు ననుత్తముని శూరు హితసాధకునిన్
జ్ఞాతులు మెచ్చరు మఱి పరి
భూతియు నొనరింత్రు సమయమున్ గనుఁగొనుచున్.

గీ. కలసి మెలసి నట్లు కనుపించుచుందురు
క్రూరకర్మములకు రోయ కుంద్రు
మనసు నీము రెడరునను జంపఁ జూతురు
భీతికరులుగారె జ్ఞాతులెందు.

అని నిందించి ఛీ పొమ్మని వెడలఁ గొట్టెను తాను జెప్పినమాట యన్న వినఁ డాయె నని కోపించి విభీషణుఁ డతనిని విడిచి పోయెను.

లోకవర్తనమి ట్లుండ లక్ష్మణువర్తన మెట్టిదో చూడుఁడు. కైకగాని దశరథుఁడుగాని త న్నరణ్యమునకుఁ బొమ్మన లేదు. కావున రామునకు వలె లక్ష్మణునకు నరణ్యమునకుఁ బోవలసిన పని లేదు పతివెంట సతి యుండవలయు నను నిర్బంధము సీతకుఁ

గలదు. సీత రామునివెంటఁ బోకుండిన లోకనిందలకుఁ బా(లు)
పడి యుండును

లక్ష్మణున కట్టిశాస్త్రనిర్బంధము లేదు. ౧౪ సంవత్స
లకుఁ జాలినన్నిచీరలమూట నెత్తిపైఁ బెట్టుకొని గంప, గడ్డపాఱ,
త్రోకుడుపాఱ, యన్నవి విండ్లు బాణములు కవచములు లోనైన
వన్నియు మోచికొని భార్యను దల్లిని ఇల్లువాకిలి సమస్తైశ్వ
ర్యము బంధువులు మిత్రులు పరిచారకులు వీరి నందఱ నఁలి
లక్ష్మణుఁ డరణ్యమునకుఁ బోవఁ గారణ మేమి? ఆయనను
బొమ్మన్న వా రెవరు? రమ్మ న్నవా రెవరు?　స శేషము.

## శ్రీరామాష్టాక్షరీ మంత్రార్థము.

శ్లో॥ చిద్రూప స్యాత్మనోరూపం పారతంత్ర్యం విచింత్య చ
చింతయే చ్చేతసా నిత్యం శ్రీరామ శ్శరణం మమ.

### అర్థము.

జ్ఞానాకారమైన తనరూపమును తనపారతంత్ర్యమును
చక్కఁగా నాలోచించి శ్రీరాముఁడే నాకు శరణము అని యెల్ల
ప్పుడు మనస్సుచే ధ్యానించుచుండవలెను.

### తాత్పర్యము.

దేహేంద్రియాది విలక్షణమై అణువై జ్ఞానానందా
కారమై జ్ఞానానందగుణకమై యుండు తనస్వరూపమును భగ
వంతుని స్వామిభావమును తనదాసభావమును విశేషముగ చిం
తించి శ్రీరాముఁడే నాకు రక్షకుఁడు శ్రీరాముఁడే నా కుపా

యము శ్రీరాముఁడే నా కునికిపట్టు (ఇల్లు) అని సర్వదా చిం
తించుచుండవలెను.

జీవస్వరూపలక్షణము.

దేహేంద్రియాదివిలక్షణుఁడనఁగా దేహమునకు నింద్రి
యములకు వేఱైనవాఁడు. దేహేంద్రియముల లక్షణములు
వేఱు జీవుని లక్షణములు వేఱు పరస్పరవిరుద్ధములు.

సాధకుఁ డీవిధముగ నాలోచింప వలయును నేను విను
చున్నాను నేను కనుచున్నాను నేను తినుచున్నాను. నేను
మూచూచుచున్నాను నేను నడచుచున్నాను. నేను వ్రాయు
చున్నాను. నాకు కడుపు నొప్పి. నాకు విరేచనము లయినవి.
ఈవిధముగాఁ జెప్పుచున్నాముగదా! "నే" నను పదార్థ మేది?
కన్నా? చెవియా? ముక్కా? నోరా! కాళ్లా? చేతులా? కడుపా
వీనిలో "నే" నెవరు? ఏదియుఁగాను. వీని యిన్నిటిసముదాయ
మైన దేహమా? అదియుఁ గాదు దేహమే 'నే' నైన యెడల
నా దేహ మని యేలయందును. దేహము నాదియన్నప్పుడు
ఇల్లు నాది యన్నట్లు దేహము వేఱు "నేను" వే అని కదా
భావము ఈకర్మేంద్రియములు 'నేను' కాక పోదునుగాక వీని
గుణములైన 'నే' నగుదునా? నాది మనుష్యరూపమా? మను
ష్యరూపము నాదైన పక్షమునఁ బుణ్యముచేసి దేవరూపమును.
పాపముచేసి తిర్యగ్రూపమును నెట్లు ధరింపఁగలను. ఒక
ద్రవ్యమే నేను గానప్పుడు దాని గుణము మాత్రము నే నెట్లగు

దును కావున కర్మేంద్రియములు నేను గాను. జ్ఞానేంద్రియములు నేను గాను. మనస్సు నేను గాను. పంచభూతములచే నైనదిగదా యీదేహము దేహము నేను గానప్పుడు పంచభూతములు నే నెట్లగుదును? కావునఁ బృథివ్యాదిమహాభూతములు నేను గాను పంచభూతముల సూక్ష్మదశయేకదా తన్మాత్రలు కావున నవియు నేను గాను ఇ వన్నియుఁ బ్రకృతికి సంబంధించినవి ప్రకృతి జడము నేను జడము కానే కావున ప్రకృతి సంబంధములైన తమస్సుగాని మహత్తుగాని యహంకారముగాని ప్రకృతిగుణములైన సత్త్వరజస్తమస్సులుగాని నేను గాను. కోపిగా నున్నవాఁడు శాంతుఁడు గానగుట లేదా. ఇట్టు లే యాలోచింప నాఁకిలి దప్పులు లోనైనవి నేనుగాను అని యిట్లు దేహసంబంధములైన యన్నిటిని నిషేధింపవలయును. ఇ ట్లన్నిటిని కాదు కా దని నిషేధించి యివన్నియు నేను గాక పోదును గాక. నేను నేను అనుకొనుచున్నానే కావున వీని కన్నిటికంటె భిన్నమైనది నేను అనునది యొకటి యుండవలయును గదా. అట్లుండిన నాస్వరూప మెట్టిది? గుణ మెట్టిది? అది యెట్టిదో నేను జూచితినా. అయినను నాగుణములు జ్ఞాన మని ఆనంద మని తెలియుచున్నది ఎట్లందువా? జ్ఞాన మనునది నాగుణము కాకపోవునేని నేను ఉన్నా నని యెట్లు స్ఫురింపఁగలదు. కావున జ్ఞానము నాగుణమే. నాకు నేనున్నాను అను జ్ఞానము నాకిప్పుడుగదా కలిగినది ఇట్లు క్రొత్తగా వచ్చినది నాసహజగుణ మెట్లు కాఁగలదు. తప్పు. తప్పు ఇది

క్రొత్తగా వచ్చినది కాదు ఇదివఱకు మఱుఁగుపడి సంకుచితమై యుండినది. ఇప్పుడు ప్రకాశమునకు వచ్చినది అంతియ కానిది లేఁది రాలేదు లేనిది యెప్పుడు లేనిదే అల్పముగానో స్వల్పముగానో కానవచ్చియో కానరాకయో యున్న శక్తియే కాలాంతరమున ననుకూల సందర్భములందు వెలికి గోచరించును గాని లేనిదానికి నుంకుట యనునది యెన్నటికి సందర్భింపదు. కావున నేను దివ్యజ్ఞానదశయం దున్నప్పుడు నిది యుండినది కాని ప్రకృతి యనునది బలిష్ఠమై యావరించి యుండుటచేఁ బ్రకాశము నొందకుండినది. నే నేయే దేహములందుండినను జ్ఞానమువలెనె యానంద మనునది నన్నుఁ గూడియేయున్నది కొలఁదిగనో గొప్పగనో ఆనందానుభవము పశుపక్ష్యాదులందును లతాగుల్మవృక్షాదులందును గనుచున్నాముగదా కావున నాగుణములు జ్ఞానానందములు. రత్నకాంతియున్నప్పుడు రత్నము వేఱు కాంతి వేఱుగాఁ దోఁచినట్లు నాగుణము లున్నప్పుడు నేను వేఱు గుణములు వేఱుకదా. మొదటిసందేహమె కలిగెనే. అట్లుగాదు. ప్రకృతిగుణము లని చెప్పిన వానిని తొలఁగించిన నాకు స్వరూపహానిలేదు ఆఁకలి చచ్చిన నేను జత్తునా? ఎప్పి చచ్చిన నేను జత్తునా? శోకము పోయిన నేను పోదునా? కావున వానిహానివలన నాకు హాని లేదు అట్టులే నాయందుండి జ్ఞానము ఆనందము దీసి వేసిన నాకు స్వరూపమే లేదు కావున నేను జ్ఞానానందస్వరూపుఁడనే. కావుననే కాఁబోలు నన్ను (ప్రజ్ఞానఘనుఁడు) గడ్డ

గట్టిన జ్ఞాన మని శ్రుతులు చెప్పుచున్నవి. సంతోషమే కాని నే నెంతలావు ఎంత పొడుగున నున్నాను ఏనుఁగునందు నేనుఁ గంత చీమయందు చీమయంత మనుష్యునందు మనుష్యు నంత యున్నానా? అట్లైన దేహము పుట్టినపుడు శిశువంతయై క్రమక్రమముగాఁ బెరుఁగుచు క్షీణించుచుండవలెను గదా. నాకు నిలుకడ లేదాయెఁ గదా. అట్లు గాదు శాస్త్రములును, కన్నులారఁ జూచిన యోగులును నన్ను అణువంత యని చెప్పుచున్నారుగదా వెంట్రుకకొన నూఱుభాగములుగాఁ జీల్చి యందొక్క భాగమును మరల నూఱుభాగములు చేసిన నందొక్క భాగ మెంతయుండునో నాది యంత పరిమాణ మని యుపనిషత్తులు చెప్పుచున్నవి కదా వారు చెప్పుచున్నారు వీరు చెప్పుచున్నారు అని నేను విని తృప్తిపడి యుండవల యునా? లేక విన్నది ప్రత్యక్షముచేసికొను మార్గము కలదా? నన్ను గుఱించి నాకే ప్రత్యక్షానుభవము లేదేని పరుల మాటలు నమ్మియా నే నున్నాను నేను జ్ఞానానందస్వరూపుఁడ నని చంకలు తట్టుకొనవలయును. పరులమాటలు నమ్మవలసిన పనిలేదు. ప్రత్యక్షముగా నన్ను నేఁ జూచుమార్గములు శాస్త్రములు చెప్పుచున్నవి ఆమార్గము ననుసరించి యభ్యసించెద నని సాధకుఁడు తీర్మానించుకొని చిత్తచాంచల్యము లేక మీఁద సంగ్రహముగాఁ జెప్పిన దాని నింకను విశదముగ విచారించి దేహమును బొత్తిగ మఱచి యాత్మయందే చలింపని మనస్సు నుంచి యొఱలోనుండి కత్తిని వెలికి దీసినట్లు దానిని దేహము

నుండి వెలికిఁదీసిన నది గోచరించును అప్పుడు శాస్త్రవాక్యములు సత్యము లని దృఢపడును కావున శాస్త్రవాక్యములందు శ్రద్ధగలిగి భక్తితో శాస్త్రము చూపినమార్గమున నడచిన శాస్త్రమునందుఁ జెప్పినఫలము ప్రత్యక్షముగ ననుభవమునకు వచ్చును అట్టులు చేసినవారు కలరుగదా. ఓర్పు, ఓపిక శ్రద్ధాభక్తులు శాస్త్రీయమైన పద్ధతి ననుష్ఠానము విశేషధ్యానము లేనివాని కాఫలము గలుగదు

ఇది పత్రికకు వ్రాసెడి వ్రాఁత కావున నింతకు మించి వ్రాయసాధ్యపడదు, అనుభవమునఁ గలుగుసందేహములను పెద్దలవలనఁ దెలియవలయును. సంజీవని కంతటిపుణ్యము గలదేని మఱి యెప్పుడైన నీ విషయము చర్చింప నవసరము పడినప్పుడు మఱికొన్ని విషయములు తెలుపఁ గలదు. సంజీవని మాసపత్రికయే కాని యాచార్యకాదు గదా. కావున నది మార్గదర్శిని మాత్రమే యగుట పాఠకులు స్మరింతురుగాక కొంతవఱకైన సరియైన మార్గము చూపినచో మోసగాండ్ర వలలోఁ బడి లోకులు కంటకమార్గమునఁ బోకుందురుగాక యనియే సంజీవని యుద్దేశముగాని యాచార్యత్వము వహింపవలయు నని కాదు.

ఇట్లు తనస్వరూపమును దాను సాక్షాత్కరించు కొని కాని, దర్శనముతో సమానమైన ధ్యాననిగాఢత్వము కలిగిగాని యిటు లాలోచింప వలయును.

సశేషము.

శ్రీరామ.

# భక్తిసంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు

విడిపత్రిక 0—5—0

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుఱ్ఱుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధార ధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు.

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

ఈసంవత్సరపు విడిపత్రిక ౦ ౪ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.

| | రూ. | అ. | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుఱ్ఱా సిద్దయ్యగారు, జమ్ములపాళెము . | ౪౦౦ | ౦ | ౦ |

రక్షకులు.

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, ముద్దన. రంగయ్యగారు, జగ్గాపురము .. | ౫౦ | ౦ | ౦ |

పోషకులు.

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి. దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట. | వాసుదాసుఁడు, కార్యనిర్వాహకుఁడు.

# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక.
ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును.
విలేఖకుఁడు - ప్రకాశకుఁడు. వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట.

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిఁబొందించును ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే. భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨. { ప్రమోదసం॥ భాద్రపదమాసము. సెప్టెంబరు నెల ౧౯౩౦ సం॥ } సంచిక ౯.

పంతువరాళి - ఆదితాలము.

(రామనామముఁ బల్కవే వలె.)

ఎన్నిమాసము లాయెరా - నాకన్నతండ్రి - శ్రీరామచంద్రా
నిన్నెడఁబాసి ॥ఎన్నిమాసములాయెరా॥

ఎన్నిమాసము లాయెను - నిచట నే నిను విడిచి
యెన్నెన్ని దేశాలో - యెటులో తిరుగుచునుంటి ॥ఎన్ని॥
నీచరణములనె కొల్చి - ననుఁగన్నతండ్రి -
నీనామస్మరణచేసి -
ఆచతురానన హరశక్రముఖులైన
నోఁచనట్టిపదవి - నొందనె యిటనుండి ॥ఎన్ని॥
కదుపును నెడఁబాసిన - కాకుత్స్థతిలక -
మొదవును సరిపోలి నా
హృదయరంగమున - నెంతో తాపము పుట్టె
సదయహృదయ యిట్లు - సలుపుట న్యాయమ ॥ఎన్ని॥
నీపసికూన నన్ను - నెవరునఁ గనుమా
నీరజదళలోచనా
నీపసిపాపని - నీపాదములనుండి
పాపనీరీతిని - బాడిగాదుర తండ్రి ॥ఎన్ని॥
నామేలు నీవు కోరి - నీదాస్యమున
స్వామి నన్నిటులు నిల్పి
నీమహితశాసనము - నేఁ దలఁదాలిచి
గ్రామపర్యటనముఁ - గావించుచుండితి ॥ఎన్ని॥
గాసి నన్నిటు పెట్టఁగా - రామయ్యతండ్రి
వాసివన్నెయుఁ బెరుఁగునా?
వాసుదేవుఁడ వీవు - వాసుదాసుఁడ నేను
భాసురముగ మన - వాసిఁ దలంపుమి ॥ఎన్ని॥

ఏకశిలానాయకా - లోకైకరక్షక
శ్రీకర శుభదాయకా
ఏకాలమందైన - నేలోకమందైన
నేకారణంబైన - నెడఁబాయకుము నన్ను ॥ఎన్నిమాన॥

## శ్రుతిప్రబోధము.

1. ఉత్తిష్ఠత! జాగ్రత!! ప్రాప్యవరాన్నిబోధత!!!
క్షురస్యధారా నిశితాదురత్యయా
దుర్గం పథస్త త్కవయోవదంతి. కఠోపనిషత్తు.

గీ. లెమ్ము! మేలుకొమ్ము నమ్మతి సద్గురుఁ
గొలిచి బోధ గొనుము, క్షురముధార
కరణిఁ దత్పథంబు కరవాఁడిదుర్గంబు
దాఁటరాదటంచ్రు తత్త్వవిదులు.

2. నాయమాత్మా ప్రవచనేనలభ్యో
న మేధయా నబహునా శ్రుతేన
యమేవైషవృణుతే తేనలభ్య
స్తస్యైష ఆత్మావృణుతే తనూంస్వామ్. కఠోపనిషత్తు.

గీ. వేదపఠనములను మేధను బెక్కులు
నాలకింప దొరక దాత్మ యెపుడు
అదియె యెవని వలచు నవ్వానికే యది
గనఁగఁజేయుఁ జుమ్ము తనదుఠావు.

3. సత్యేనలభ్యస్త పసాహ్యేష ఆత్మా
సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్

అంతశ్శరీరే జ్యోతిర్మయోహిశుభ్రో
యంపశ్యంతి యతయః క్షీణదోషాః. ముండక.

గీ. నిజశరీరమందు నిర్మలజ్యోతియై
హతసమస్తదోషయతులు గాంచు
నాత్మ, తపము, సత్య, మతులితజ్ఞానంబు
బ్రహ్మచర్యమునను బ్రాప్త మగును.

గీ. కాన బ్రహ్మవేత్త జ్ఞానంబు సమకూర్చి
బాలునట్లు మెలఁగవలయుఁ జుమ్ము
బాల్యమున మెలంగి పాండిత్యముం బొంది
యనల మౌన మూనవగును బుధుఁడు.

గీ. బలములేనివాఁడు పడయలేఁ డీయాత్మ
మత్తుఁడేఁ తపః క్రమంబు విడిన
నీయుపాయములను నేజ్ఞాని యత్నించు
బ్రహ్మధామ మొందు వానియాత్మ.

1 తస్మైసహోవాచపితామహశ్చ
శ్రద్ధాభక్తిధ్యానయోగాదవేహి ॥ కైవల్యోపనిషత్తు.

కం. ధ్యానశ్రద్ధాభక్తులు
మానక వైరాగ్య మూని మదిఁ గొలిచిన న
న్యానావ్యయసౌఖ్యంబుల
మానుగ లక్ష్మీశుఁ డొసఁగు మమతం గరుణన్.

శ్లో. 2. యత్రైవయత్రైవమనోమదీయం
తత్రైవ తత్రైవ తవస్వరూపమ్

యత్రైవ యత్రైవ శిరోమదీయం
తత్రైవ తత్రైవ పదద్వయం తే.

కం. ఎందెందు నిలుచు నామది
యందందే కలదు తావకాకారము నే
నెందెందు శిరము వ్రాల్తునొ
యందందే కలదు తావకాంఘ్రియుగంబున్.

శ్లో. ౩ దేహాభిమానేగళితే, విజ్ఞాతేపరమాత్మని
యత్రయత్రమనోయాతి, తత్రతత్రసమాధయః.

గీ. మేనిపై నభిమానంబు మాని యాత్మఁ
గనిన వానికి నెందెందు మనసు నిలుచు
చుండు నందె సమాధులు నుండుఁగాని
బొక్కలను దూఱనేటికిఁ గొక్కులట్లు.

గీ. తనువు నీటిబుగ్గ ధనములు, మేఱుపులు,
ఋణముగొలఁది దాపరించువారు
బంధుజనులు, నమ్మి పాడయిపోవక
మేలుకొనుఁడు జనులు మేలుకనుఁడు.

గీ. లెమ్ము మేలుకొమ్ము నెమ్మది దరిఁజేరు
పఱకు నిలకు, చూపు పదరనీకు
విసిఁగి వెఱచి లజ్జ వెనుకంజపెట్టకు
దాగుపడెడి తలఁపు పంతమున్న.

## ప్రశ్నోత్తరములు.

ప్రశ్న.—పతివ్రతయనఁగాఁ బతిని సేవించు వ్రతముగలది గదా? పతి మరణించినస్త్రీకిఁ బతిని సేవించుభాగ్యము కలుగదుకదా. కావునఁ బతివ్రతాత్వము విధవలందుఁ గలదా? స్త్రీలకుఁ బాతివ్రత్యమువలెఁ బతులకు భార్యలవిషయమై నియమములు లేవా?

ఉత్త—పతికి హితమైన వ్రతము పతివ్రతము అట్టివ్రతముగల స్త్రీ పతివ్రత యనఁబడును. పతివ్రతాభావము పాతివ్రత్యము. పతి మరణించినను జీవించినను స్త్రీలకుఁ బాతివ్రత్యము విధ్యుక్తధర్మము దానిని విడువరాదు పతియెదురుగ నున్నప్పుడే హితమాచరింపవలెఁగాని కనుమఱుఁగైన హితము చేయరాదనుట సరిగాదు. హితము కాయికము మానసికము నని రెండువిధములు ఎదురుగనున్నప్పుడు దేహముతోఁ జేయవలసిన సేవలు చేసి సంతోషపెట్టవలయును ఎదురుగ లేనప్పు డాయన క్షేమమును సౌఖ్యమును సర్వదా తలఁచుచుండవలెను. పతి మరణించెనేని బ్రహ్మచర్యవ్రత మవలంబించి సన్న్యాసినివేషమును బూని యాయనకుఁ బరలోకమున హితమైన క్రియలు సలుపుచుండవలయును. మగఁడు పొరుగూరికిఁ బోయెనేని యెదురుగా లేఁడని భార్య పతివ్రతగా నుండరాదా? భార్య పుట్టినింటికిఁ బోయిన సమయమందు భర్త వ్యభిచరింప వచ్చునా? వివాహమాడినభా

ర్యను విడిచి కామాసక్తి వేఱొకస్త్రీతో సంభోగించు భర్త బ్రాహ్మణచండాలుఁ డని భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పెను.

శ్లో. అథచే దన్యథా కుర్యా, ద్యది కామా ద్వ్యతిక్రమేః
యథా బ్రాహ్మణచండాలః పూర్వసృష్ట స్తథైవ సః.
అనుశాసన ౧౨ అధ్యాయము.

తనతల్లిని విడిచి పరస్త్రీతో సంభోగించు తండ్రియందుఁ గుమారుఁడు తండ్రియను గౌర ముంపరా దని చిరకారిచరిత్ర యందుఁ గలదు. (భారతము)

కం. స్త్రీ సంతోషించు తెఱం
గౌసపడని మనసుగలుగు నట్టిని ధముఁ డి
చ్చో నడిఁ గనుఁజని యుచ్చో
గాసింబడు యమునిభటులు గాఱియ పెట్టన్ భారతము

ఇచ్చట స్త్రీయనఁ దనభార్య యని యర్థమే కాని దేశము నందలి గుడిసెవాటి లంజ యని కాదు.

శ్లో. అదుష్టాం వినతాం భార్యాం
యౌవనే యః పరిత్యజేత్
సప్తజన్మభవేత్ స్త్రీత్వం
వైధవ్యంచ పునః పునః స్మృతిముక్తిప్రజో.

జారత్వము లేక వినయముగలదై యుండుభార్యను యౌవనమందు నెవఁడు వదలుచున్నాఁడో వాఁ డేడుజన్మములందు స్త్రీగాఁ బుట్టి మరల మరల వైధవ్య మనుభవించును.

ఇట్లు భార్యను విడిచినవాఁడు గాడిదచర్మమును గప్పు కొని భార్యనువిడిచినవానికి భిక్షము పెట్టుఁడని యేడిండ్ల భిక్ష మెత్తి యాఱునెలలు దిని జీవింపవలయును. అని యిట్లు పారాశరస్మృతి చెప్పుచున్నది.

సూ దారవ్యతిక్రమీ ఖరాజినం బహిర్లోమ పరిధాయ
దారవ్యతిక్రమణే భిక్షా మితి సప్తాగారాణి
చరే త్సావృత్తిః షాణ్మాసాన్ పరాశరస్మృతి.

శ్లో. పాణిబంధం స్వయం కృత్వా సహధర్మ ముపేత్య చ
యదా యాస్యంతి పురుషాః స్త్రియో నార్హంతి యాంప్య
భరణాద్ధి స్త్రియో భర్తా, పాలనాద్ధి పతి స్తథా [తామ్
గుణాన్యస్య నివృత్తౌతు, నభర్తా నపునః పతిః.

అర్థము. తాను స్వయముగఁ బాణిగ్రహణము గావించి యది తనతోడ ధర్మకార్యములుచేయుచుండఁగా నట్టిభార్యను విడిచి వేఱొకస్త్రీతో సంగమించువాఁడు ఏవర్ణము వాఁడైనను తండ్రియను గౌరవమునకు నర్హుఁడు గాఁడు భరించుటచే భర్త యగును పాలించుటచే పతియగును. ఆ రెండుకార్యములు చేయనివాఁడు భర్తయుఁ గాఁడు పతియును గాఁడు. అనఁగా వాఁడు భర్తయని పతియని గౌరవింపఁ దగినవాఁడు కాఁడని యర్థమే కాని వానిని విడిచి వేఱొకమగనిని వెదకికొమ్మని కాదు.

అట్టివాఁడు పతితుఁడు గాఁడేని వాని దౌష్ట్యము సహించి సేవించు స్త్రీకి నెక్కువఫలమే కలదు వాఁడు చెడె నని తన కార్యము తానుజేయక తానేల చెడవలయును.

శ్లో॥ పత్యురప్యవలిప్తస్య, కార్యాకార్య మజానతః
తదాజ్ఞాన తు కర్తవ్యం, పతితస్యతు సర్వదా     ॥పరాశర॥

గర్వముచే నిదిచేయఁదగినది యిది చేయరానిది యను జ్ఞానములేని పతియొక్క యాజ్ఞను భార్య చేయరాదు. పతితుఁడైన వానియాజ్ఞ యేకాలమందును జేయరాదు

వేశ్యాసామాన్య. దానికి ఇది నాది యను పతి లేఁడు. కావున దానితో సంగమించిన నేమి దోషమని కొందఱు పశుప్రాయులు తలఁతురు.

'పశు వేశ్యాభిగమనే ప్రాజాపత్యవ్రతం చరేత్'

పశువుతోను వేశ్యతోను సంగమించినవాఁడు ప్రాజాపత్యమును బ్రాయశ్చిత్తముగ ననుష్ఠింపవలెను దీనివలన వేశ్య పశువుతో సమాన మని తేలుచున్నది. ఇది సత్యమే యెట్లందురా. జ్ఞానయుక్తమైనది మనుష్యజన్మము. నీతి - జ్ఞానము - ఆచారము మనుష్యుల కన్వయించునే కాని పసరమున కన్వయింపవు కదా. అవిలేని మనుష్యులు పసరములుగాక మనుష్యు లెట్లగుదురు జాతిపశువు చతుష్పాత్తు (నాలుగుకాళ్లుగలది) పసరములందు నీపెంటి నాది యను పోతులేనట్లు వేశ్యనాది యనుమగవాఁడు లేఁడు కావున పెంటిపై నేపసరమైన నెక్కినట్లు వేశ్యపై నెవఁడైన నెక్కవచ్చును. లంజబిడ్డకుఁ దండ్రి యెవఁడు? లంజకొడుకు కబ్బకుఁ బెట్టు తద్దినం బని సామెతలు కలవు కదా. కావున వేశ్య పసరమనియు దానితో సంగమించువాఁడును పసరముతో సంగమించువాఁడును సమాను లనుటయందు

నేదోషము లేదు. కావుననే యిరువురకు సమానప్రాయశ్చిత్తము. కావుననే కదా.

వేశ్యా శ్మశానసుమనా ఇవ వర్జనీయా. మృచ్ఛకటిక.
వేశ్యను శ్మశానపుష్పమువలె వర్జింపవలెను.

కం. జారభటచోరచేటక
చారనటప్రభృతినీచజననిష్ఠీవా
ధారశరావము వార
స్త్రీ రమ్యాధరము సంస్పృశింతురె కులజుల్.

గొప్పకులమందుఁ బుట్టినవారు జారులు చోరులు నటులు విటులు మొదలగు నీచజనుల యెంగిళ్లు నుమ్మివేయు మూఁకుడైన భోగముదానిపెదవిని దాఁకుటకైన నంగీకరింతురా?

భర్తృహరి.

శ్లో. వృషలీ ఫేన పీతస్య, నిశ్వాసోపహతస్య చ
తస్యాంచైవ ప్రసూతస్య నిష్కృతి ర్నవిధీయతే మనుః.

శూద్రస్త్రీ పెదవులు ముద్దుపెట్టుకొన్నవానికిని (జొల్లు త్రాగువానికిని) యదివిడుచు నూర్పుగాలి తగిలినవానికిని దానియందు బిడ్డలఁ గన్నవానికిని ఈముువ్వురపాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు.

శ్లో. శూద్రయోనౌ పత ద్బీజం, హాహా శబ్దం ద్విజన్మనః
కృత్వా పరుష గర్తేషు, పతిత స్మీతి దుఃఖితః
మా మధః పాత యేత్యేష పాపాత్మా కామపీడితః
అధోగతిం ప్రజే త్క్షిప్ర మితి శప్త్వావ తేత్తు తత్.

వ్యాసులు.

బ్రాహ్మణక్షత్రియవైశ్యుల రేతస్సునందలి జీవుఁడు శూద్ర స్త్రీయోనియందు 'హాహా' కారములతో దుఃఖించుచు నయ్యో యయ్యో యీపురుషపుగుంతలోఁ బడుచున్నానే ఈపాపాత్ముఁడు కామపీడితుఁడై న స్నీయధోలోకమునఁ ద్రోయుచున్నాఁడే వీఁడును శీఘ్రముగ నధోలోకముల పాలగును గాక' యని శపించి పడును. ఇంతవఱకు వేశ్యలందఱు నికృష్ట శూద్రలేకదా జాతివేశ్యలకంటె నికృష్టలైనకులట లితర వర్ణములందున్నను బ్రాహ్మణకాఫీహోటల్ అన్నట్టు బ్రాహ్మణ వేశ్యలమని క్షత్రియవారకాంతలమని వైశ్యగణికలమని కాఁపు పురమండనములమని వాకిటఁ బలకలువేసికొను కాలమింకను రాలేదు. అదిమాస్వతంత్రియని చెప్పుకొను పరకీయలుసు లేరు.

(కులట - పరకీయ = అంకుటాలు)

(వేశ్య - గణిక - పురమండనము = భోగముది)

శ్లో. శూద్రాశయన మారోప్య, బ్రాహ్మణా యాత్యధోగతిమ్
జనయిత్వా సుతం తస్యాం, బ్రాహ్మణ్యాదేవ హీయతే
దైవ పిత్ర్యాతిథేయాని, తత్ప్రదానాని యస్య నా
నింపంతి పితృ దేవా స్తే, స చ స్వర్గం నగచ్ఛతి.

అర్థము శూద్రస్త్రీతో శయ్యయందుఁ బరుండిన బ్రాహ్మణుఁ డధోలోకముల పాలగును. దానియందు బిడ్డలఁ గనెనా బ్రాహ్మణత్వమునే కోలుపోవును. వీఁడుచేయు దేవకార్యములు, పితృకార్యములు, ఆతిథ్యములు, వాఁడు చేయుదానములు

సర్వము వ్యర్థములు వానిని దేవతలు గ్రహింపరు. వానికి స్వర్గప్రాప్తి లేదు

ఇచ్చట బ్రాహ్మణశబ్ద ముపలక్షణము కావున క్షత్రియ, వైశ్యుల గతియు నంతయే యని యెఱుఁగునది. శూద్రస్త్రీతో సంగమించు బ్రాహ్మణాదులు పంక్తికిఁబనికిరారు. కావున వేశ్యాసంగము మెట్టివారికైన శూద్రులకైనను ఒతన హేతువే.

ఇట్టి భ్రష్టుల సహవాసము సపంక్తిభోజనము లోనైనవి శ్రీకోదండరామ సేవకసమాజసభ్యు లేవర్ణము వారైనను చేసి చెడ కుందురుగాక.

కావున వ్యభిచారము మగనికైనను మగునకైనను దుష్టమే. ఈవిషయమైన సీతా దేవివాక్యములు సందేహము తీర్చుచున్నవి.

శ్లో. ఇహలోకే చ పితృభిర్యా స్త్రీ యస్య మహామతే
అద్భిర్దత్తా స్వధర్మేణ ప్రేత్య భావేపి తస్యసా

అయోధ్య. ౨౯.

ఈలోకమందుఁ దల్లిదండ్రులచే నేస్త్రీ స్వధర్మ మనుస రించి ధారాయుతముగ నెవనికి దానము చేయఁబడుచున్నదో యతని మరణానంతరము కూడ నాస్త్రీ యతనిదే.

కావున మరణము భార్యాభర్తల నెడఁబాపఁ జాలదు.

శ్లో. పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా
పతిలోక మభీప్సంతీ నాచర త్కించి దప్రియమ్.

తన్ను పాణిగ్రహణము చేసికొనిన భర్త జీవించినపుడును మరణించినతరువాతను పతి సాలోక్యమును గోరుస్త్రీ భర్త కప్రియమైన కార్యము చేయరాదు.

శ్లో.పత్యౌ మృతేపి యా యోషి ద్వైధవ్యం పాలయేత్క్వచిత్
నా పునః ప్రాప్య భర్తారం స్వర్గభోగాన్ సమశ్నుతే. వ్యాసః

మగఁడు మరణించినను నేస్త్రీ వైధవ్యధర్మమును పరిపాలించునో యామె మరల మగనిని గలిసి స్వర్గసుఖము ననుభవించును

శ్లో.మృతే భర్తరి యానారీ, బ్రహ్మచర్యే వ్యవస్థితా
నామృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః.
పరాశరుఁడు.

మగఁడు మరణించిన స్త్రీ బ్రహ్మచర్యవ్రతమును జరిపెనేని యామె మరణించి బ్రహ్మచారులవలె స్వర్గసుఖ మనుభవించును.

శ్లో మృతే భర్తరి యానాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే న్యవస్థితా
స్వర్గం గచ్ఛ త్యపుత్రాపై యథా తే బ్రహ్మచారిణః.

మగఁడు మరణించినస్త్రీ పతివ్రతయై బ్రహ్మచర్యవ్రతమునందుండెనేని కొడుకులు లేకపోయినను బ్రహ్మచారులవలె స్వర్గమునకుఁ బోవుచున్నది అంతమాత్రమే కాదు.

శ్లో.నపితా నాత్మజో నాత్మా నమాతా ననఖీ జనః
ఇహప్రేత్యచ నారీణాం, పతిరేకో గతి స్సదా.

అర్థము. ఈలోకమందైనను, బరలోకమందైనను, స్త్రీకిఁ బతియొక్కఁడే గతి. కాని తండ్రి గాఁడు. తల్లియును గాదు. తాను గాదు. తనసఖీజనులును గారు. కొడుకులును గారు. పతినివిడిచిన స్త్రీకి వీ రెవ్వరును గతులు కల్పింపలేరు. తాను గల్పించుకొనఁజాలదు.

శ్లో. వ్యాళగ్రాహీ యథా వ్యాళం, బిలాదుద్ధరతే బలాత్
ఏవం స్త్రీ పతిముద్ధృత్య, తేనైవ సహమోదతే.

పరాశరుఁడు.

నరకమునఁ గూలినపతిని పతివ్రతయగుస్త్రీ తన పాతి వ్రత్యబలముచే మాంత్రికుఁడు మంత్రబలముచే పుట్టలోనుండు పామును బోఁకపట్టుకొని బలవంతముగా వెలికి లాగునట్లు స్వర్గమునకు లాగుకొనును.

భార్యలేనిశూద్రుఁడు శూద్రవేశ్యతో సంగమించిన నేమి దోషమనుప్రశ్న పుట్టును.

ఒకపురుషునకు నిరువురు మువ్వురు భార్యలు రాఁ గారణ మేమి యని విచారించునపుడు దుష్కామసంబంధమే యని యిదివఱకే సంజీవని తెలిపియున్నది. ఆధర్మమనుసరించి శూద్ర వేశ్యతో సంభోగించు శూద్రునకు నావేశ్యయే మఱుజన్మ మున భార్యగా దాపరించును గాని పూర్వజన్మవాసనాబలమున దాని పూర్వజన్మవృత్తి వదలకపోవుటచే నది జారిణి యగును. ఈజన్మమున జారిణులైన భార్యలు గతజన్మమున వేశ్యలుగానో వేశ్యావృత్తియుండుండు కులటలో యగుదురు. ఇప్పు డిట్టి భార్య దాపరించెనని విలపించినఁ బ్రయోజనము లేదు. నవ్వు చుఁ జేసినది యేడ్చుచు ననుభవింపవలయును. వ్యతిక్రమము కొంచెమైన సహ్యముగాదనుట యనివార్యవిధి.

ప్రశ్న:—పుండ్రము రాత్రులందుఁ గూడ ధరింప వలయునా? ఎవ రెట్టిపుండ్రము నెట్లు ధరింపవలయును? పుండ్రము

ధరించుటయం దుద్దేశ మేమి? ఏపదార్థము శ్రేష్ఠము? గ్రాహ్యము? ఏది నిషిద్ధము?

ఉత్త—ఈప్రశ్నము పలువు రడుగుచున్నారు. సభయందును నడుగఁబడెను? కావున శాస్త్ర మాధారముగఁ దెలిసిన విషయము వ్రాయఁబడును.

పుండ్రశబ్దము వ్యుత్పత్తి యెట్టులన. పుణతీతిపుండ్రః పుణ శుభకర్మణి శుభకర్మమును జేయునది యని గురుబాల ప్రబోధిక పుణి=ఖండనే. రామాశ్రము-పాపములను ఖండించునది. శుభముకలిగించునది యని పుండ్రశబ్దార్థము. ఇందు నిలువుగాఁ బెట్టఁబడునది యూర్ధ్వపుండ్రము. అడ్డముగాఁ బెట్టఁబడునది తిర్యక్పుండ్రము-ప్రశ్నించినవా రేపుండ్రవిషయ మైనది వ్రాసినవారు గారు కావున రెంటివిషయము తెలిసినంత తెలుపఁబడును పితృదేవతాకార్యముగాని దేవతాకార్యముగాని పుండ్రము ధరింపక చేయరాదు

శ్లో॥ యోగో దానం తపో హోమః స్వాధ్యాయ పితృతర్పణమ్
భస్మీ భవతి తత్సర్వ మూర్ధ్వపుండ్రం వినాకృతమ్

యోగము-దానము తపస్సు-హోమము-స్వాధ్యాయము (జపము-పారాయణము-అధ్యయనము లోనైనవి) పితృతర్పణము ఇవన్నియు నూర్ధ్వపుండ్రములేక చేసిన భస్మమై పోవును. అనఁగా నిష్ఫల మని యర్థము-తీర్థాదులందు స్నానముచేసి సంధ్యావందనాదులు తీర్చుకొనుటకుఁ బుండ్రము ధరింపవలను పడనపుడు జలోర్ధ్వపుండ్రము ధరించి విహితకృత్యములఁ దీర్ప వచ్చును గాని శూన్యలలాటముతో నేపనియుఁ జేయరాదు.

శ్లో. ధృతోర్ధ్వపుండ్రం పర మీశితారం
నారాయణం సాంఖ్యయోగాభిగమ్యమ్
జ్ఞాత్వా విముచ్యేత నర స్సమస్తైః
సంసార పాశై రిహా చేతి విష్ణుమ్. మహోపనిషత్తు

అర్థము ఊర్ధ్వపుండ్రమును ధరించి జ్ఞానయోగముచేఁ బొందఁదగినవాఁడును నారాయణుఁడును బరమేశ్వరుఁడు నునగు విష్ణువును దెలిసికొని మనుష్యుఁడు సంసారపాశములన్నిటినుండి విడువఁబడుచున్నాఁడు.

శ్లో. ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ
విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా
స్వరేణ మంత్రేణ హృది స్థితేన
పరాత్పరం యన్మహతో మహాంతమ్. కరశాఖ.

ఊర్ధ్వపుండ్రమును ధరించి చక్రధారియై (చక్రాంకనముగావించుకొని) యేమహాత్ముఁడు స్వరయుక్తమైన మంత్రముతో హృదయమందుంగు పరాత్పరుఁడును మహాత్ములన్నిటికంటె మహాత్తైనవాఁడును బరమపురుషుఁడు నైన విష్ణువును ధ్యానించునో.

ఊర్ధ్వపుండ్రము ధరింపవలెననుట కిట్టి ప్రమాణములనేకములు గలవు.

ఆకారము.

హరేః పాదాకృతి మాత్మనో హితాయ మధ్యే చ్ఛిద్ర మూర్ధ్వపుండ్రం యో ధారయతి స పరస్య ప్రియో భవతి స పుణ్యభాగ్భవతి - సవిష్ణుం భతి. అధర్వణము.

అర్థము. తన క్షేమముకొఱకు నడుమనెడ ముండ నట్లు విష్ణుపాదముయొక్క యాకారముగ నూర్ధ్వపుండ్రము నెవఁడు ధరించునో వాఁడు భగవంతునకుఁ బ్రియుఁ డగును- పుణ్యవంతుఁ డగును. విష్ణువును బొందును

దీనివలన భగవంతుని పాదమువలె నూర్ధ్వపుండ్రము ఉండవలెను

నాసాదికేశపర్యంత మూర్ధ్వపుండ్రం ధారయేత్

నాసికామూల మారభ్య యని ముక్కుమొదలు మొదలు కొని తలవెండ్రుకలపర్యంత మూర్ధ్వపుండ్రము ధరింపవలెను.

ఊర్ధ్వపుండ్రము నెవరు ధరింపవలెను?

శ్లో. గృహస్థో బ్రహ్మచారీచ వానప్రస్థ స్తథా యతిః
అవశ్యం ధారయేత్పుణ్య మూర్ధ్వపుండ్రం సుశోభనమ్.

బ్రహ్మాండపురాణము.

శుభకరమైన యూర్ధ్వపుండ్రమును గృహస్థుఁడు-బ్రహ్మచారి-వానప్రస్థుఁడు-సన్న్యాసి తప్పక ధరింపవలెను.

ఎట్లు ధరింపవలెను?

శ్లో. అంగుష్ఠం పుష్టితః ప్రోక్తో మధ్య మాయుష్కరీ భవేత్
అనామి కాన్నదా నిత్యం, ముక్తిదా చ ప్రదేశినీ
ఏతై రంగుళిభేదై స్తు కారయే న్ననఖం స్పృశేత్.

అర్థము. బొటనవ్రేలితో నుంచుకొనినఁ బుష్టియు, నడిమివ్రేలితో నుంచుకొనిన నాయుస్సువృద్ధియు, అనామి

(ఉంగరపు వ్రేలి) తో నుంచుకొనిన నన్నసమృద్ధియు, జుట్టన వ్రేలి (చూపుడువ్రేలు) తో నుంచుకొనిన మోక్షము లభించును. గోరు తగులరాదు. సన్న్యాసులు తర్జని మాత్రమే యుపయోగింపవలెను.

ఏవస్తువుతో నుంచుకోవలెను?

శ్లో. పర్వతాగ్రే, నదీతీరే, మమక్షేత్రే విశేషతః
సింధుతీరే చ, వల్మీకే, తులసీమూల సంశ్రితే,
మృద ఏ తాస్తు సంగ్రాహ్యా వర్జ్యా శ్చాన్యత్ర మృత్తికాః

అర్థము. పర్వతములపై పేటులయందు, నదులయొద్దున, సముద్రతీరమందు, పుట్టలయందు, తులసిచెట్లమొదళ్లయందు నాక్షేత్రములయిన యీామైదింటియందుండు మృత్తిక గ్రహింపవలయును గాని తక్కినమృత్తికలు పనికిరావు.

ధరించుకాలము.

శ్లో. ప్రాత ర్మధ్యందినే సాయ మూర్ధ్వపుండ్రం తు కేశవః
అకృతైర్వాపి సుకృతై, స్తై స్తైః ప్రీణాతి కర్మభిః
ప్రభాతే దివ్యలోకస్థం, మధ్యాహ్నే చార్కమధ్యగమ్
తోషయత్యూర్ధ్వపుండ్రేణ, సాయం స్వాత్మగతం హరిమ్.
భరద్వాజసంహిత.

పుణ్యముచేయువారైనను గాకున్నను నుదయమున మధ్యాహ్నమందు సాయంకాలమునం దూర్ధ్వపుండ్రము ధరించియే యుండవలెను. దానివలనఁ గేశవుఁడు సంతోషించును. ఉదయ

మున ధరించుటచే వైకుంఠవాసియు, మధ్యాహ్నధారణముచే సూర్యమండలమందుండువాఁడును, సాయంకాలమందు ధరించిన తనయాత్మయందుండువాఁడును సంతోషించును. ఊర్ధ్వపుండ్రము రెండు రేఖలనడుమ హారిద్రాచూర్ణము రేఖగా దీప కళికవలె ధరింపవలెను.

శ్లో. ఊర్ధ్వపుండ్రేషు సర్వేషు హారిద్రాం ధారయే చ్చుధాన్
అభిషిక్తం తు యచ్చూర్ణం విష్ణుబింబేతు యోనరః
హారిద్రం ధారయే న్యస్తు సోశ్వమేధం ఫలం లభేత్
సచ్చరిత్రరక్ష.

శ్లో ఊర్ధ్వపుండ్ర స్యాంతరాళే హారిద్రాం యో నధారయేత్
సనైష్ణవో లలాటేతు శ్రియం మాం చ వ్యపోహతి.
సంగ్రహము.

అన్నివిధములైన యూర్ధ్వపుండ్రములయందుఁ దడిసిన పసుపుపొడి ధరించుట శ్రేయస్కరము అట్లూర్ధ్వపుండ్రము నడుమ పసుపుపొడి (శ్రీచూర్ణము) నెవఁడు ధరింపఁడో వాఁడు లక్ష్మిని నన్నుఁ గూడఁ గోలుపోవును (ఇదిభగవద్వాక్యము) లక్ష్మీనారాయణులకు వియోగము లేదు. కావున నారాయణుఁ డున్నచోట లక్ష్మియు నుండవలెను. హరివక్షస్థలము నడుమ లక్ష్మియుండుటచే నిచటను నడుమ నుండవలెను.

సారాంశము.

పైప్రమాణవాక్యములవలన దేవకార్యములుగాని నిత్య కార్యములుగాని యూర్ధ్వపుండ్రము ధరింపక చేయరాదనియు,

ముఖమున నూర్ధ్వపుండ్రధారణము హరిపాదము శిరసావ హించినట్లని భావింపవలయుననియు, నూర్ధ్వపుండ్రము సర్వదా ధరించియే యుండవలయుననియు, మీఁదఁ జెప్పిన పంచ మృత్తికలతోనే యూర్ధ్వపుండ్రము ధరింపవలయుననియు, దీని ధరించుటయందు మొదటివ్రేలు కడపటివ్రేలు తప్పఁ దక్కినవ్రే ళ్లుపయోగింపవచ్చుననియు, గోరు తగులరాదనియు, నడుమ శ్రీచూర్ణము ధరింపనలయుననియు, నిది రెండు కన్నుల లో కొలుకులకు నడుమనుండు ముక్కు మొదటిభాగమునుండి యూ ర్ధ్వముగా వెండ్రుకలు ప్రారంభమగు స్థలమువఱకు నుంచు కొనవలయుననియు, నాలుగువర్ణములవారు, నాలుగాశ్రమముల వారు దీని ధరింపవలయుననియు నేర్పడుచున్నది ఇది సమం త్రకముగ భగవద్ధ్యానపూర్వకముగఁ జేయవలయును గాని యూరక చేయరాదు. ఇది శాస్త్రపద్ధతి. ఆచారమం దెట్లుండు నది నేను జెప్పవలసిన పనిలేదు. ఇప్పుడు వాడుకొనఁబడు తిరుమణి (శ్వేతమృత్తిక) యనునది పర్వతాగ్రమృత్తిక యని పేరేగాని అదియెంతవఱకు సత్యమో మెత్తని సుద్ద రాలెందుం డియో తెచ్చి సిద్ధముచేయుచున్నారు. పసుపుపొడి యెఱ్ఱని రంగుపొడిగా మాఱినది. లక్ష్మీదేవి హిరణ్యవర్ణకావునఁ బసుపు పొడి శ్లాఘ్యమే. ఆదిత్యవర్ణ కావున నెఱ్ఱనిపొడియు సాంప్ర దాయభేదముచే వాడుకలోనికి వచ్చెను ఇది సత్సంప్రదాయ సిద్ధమై సదాచారప్రసిద్ధమౌట గ్రాహ్యమే. కాని యేదియై నను మంత్రపూతముగాక భక్తిలేక కేవలలౌకికముగ మతచిహ్న

ముగ ధరించుట శ్లాఘ్యముగాదు ఆమంత్రములు తెలియనివా రష్టాక్షరీమంత్రముతోఁ గాని షడక్షరీమంత్రముతోఁ గాని ద్వాదశాక్షరితోఁ గాని విష్ణుగాయత్రితోఁ గాని యిందేదియుఁ దెలియనివారు "కృష్ణాదినామభిర్వా ధారయేత్" అని యుపనిషత్తు నందుండుటచే రామకృష్ణనారాయణాది నామము లుచ్చరించుచుఁ గాని ధరింపవచ్చును. ఇట్లు మంత్రపూతముగ ధరింపఁ బడని యూర్ధ్వపుండ్రము కొందఱు పరిహసించునట్లు 111 నూటపదునొకండని "వి" (V) మార్కని "వై" (Y) మార్కని కొని చెప్పుటకుఁ దగియుండును.

గోపీచందనము పై నైదువిధముల మృత్తికలలోఁ జేరి నది కావున శ్లాఘ్యమే. శ్రీగంధము గ్రాహ్యమే.

బ్రహ్మా విష్ణు మహేశ్వరులు 3
వ్యాహృతులు (భూర్భువస్సువర్) 3
ఋ గ్యజు స్సామ వేదములు 3
అగ్నులు (ఆహవనీయము దక్షిణాగ్ని గార్హపత్యము) 3
జ్యోతిష్మంతులు సూర్య చంద్రాగ్నులు 3
కాలములు (భూతభవిష్యద్వర్తమానములు) 3
అవస్థలు (బాల్యము యౌవనము వార్ధకము) 3
త్రివిక్రమావతారమున నడుగులు 3
అకార ఉకార మకారమయమైన యూర్ధ్వపుండ్రములు 3

ఉకారము లక్ష్మీవాచకము కావున శ్రీచూర్ణము నడుమ నుంచఁబడును.

ఓంకార మూర్ధ్వలోకములకుఁ గొనిపోవును గావున తన్మయమైన యూర్ధ్వపుండ్రమును ధరించువాఁ డూర్ధ్వలోకములకుఁ బోవును. ఊర్ధ్వలోకములకుఁ బోఁగోరువాఁ డూర్ధ్వముగానే పుండ్రమును ధరింపవలెను. కావుననే యూర్ధ్వపుండ్రము క్రిందినుండి పైకి పెట్టనలయును గాని పైనుండి క్రిందికిఁ బెట్టరాదు. (ఊర్ధ్వమున్నమయత ఇత్యోంకారాధికారీ తస్మా దూర్ధ్వపుండ్రం ధారయేత్ )

"తస్య మధ్యే వహ్నిశిఖా అణీ యోర్ధ్వా వ్యవస్థి
తా నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా
నీవార శూకవ త్తన్వీ పీతాభా స్వ త్తణూపమా"

యని యుండుటచే మధ్యమున దీపకళికవలె శ్రీచూర్ణ ధారణము.

"అతః పుండ్రస్థం హృదయపుండరీకేషు త
మభ్యసేత్ । క్రమా దేవం స్వమాత్మానం భావయే
న్మాం పరం హరిమ్
ఏకాగ్రమనసో యో మాం ధ్యాయతే హరి మవ్యయమ్
హృత్పంకజేన స్వాత్మానం స ముక్తో నాత్ర సంశయః.

అర్థము. ఇ ట్లూర్ధ్వపుండ్రస్థుఁడైన హరిని హృదయకమలమందు ధ్యానింపవలెను. ఎవ్వఁ డేకాగ్రమనస్సుతో

హృదయకమలమందుండు నన్ను ధ్యానించునో వాఁడు ముక్తుఁడగుటకు సంశయము లేదు.

బ్రహ్మరంధ్రము (వాసుదేవస్థానము) భ్రూమధ్యము (కేశవస్థానము) హృదయము (మాధవస్థానము) ఇవి భగవంతుఁడు శరీరమందుండు స్థానములలో ముఖ్యములైనవి కావున నే శిరస్సునందుత్రిపుటి (మెడమీఁదవెనుకప్రక్క దామోదరస్థానము) (Medulla oblaugata ఉండు స్థలమిదియే) హృదయమునఁ బుండ్రము ధరించిధ్యానింపవలెను.

ఊర్ధ్వదండుఁడు - ఊర్ధ్వరేతస్కుఁడు - ఊర్ధ్వపుండ్రధారి ఊర్ధ్వయోగవంతుఁడు నూర్ధ్వలోకగామి యగును. ఈవిషయము వాసుదేవోపనిషత్తు నుండి గ్రహింపఁబడినది.

మీఁదవివరించిన గొప్పఫలము భక్తిశ్రద్ధలతో శాస్త్ర ప్రకార మూర్ధ్వపుండ్రము ధరించువారికే కాని పాడుగోడకు సున్నపుపట్టెలు - ఎఱ్ఱనున్నపట్టెలు పెట్టిన ట్లావేళ కేదియో యెట్లో ముఖమునకు రాఁచుకొనువానికిఁ గాదు

సశేషము.

### ⁓ సమాజ నియమాతిక్రమణము. ⁓

బాపట్లయందుండు మ-రా-శ్రీ, ఏ ఎల్. నారాయణ రావుగారు తమకు దేహ మనారోగ్యముగా నున్న దని మాంసాహారము తీసికొనినఁ గాని దేహమునకు మరలఁ బుష్టిరాదని కావున సమాజనియమము జరుపుటకు సాధ్యపడదని చెప్పి

సభ్యత్వమునుండి ముక్తులైరి. పతిగతి యనుసరణీయమని (జిహ్వా చపలత చేఁగాదు) వీరి ధర్మపత్నియు నట్టులే చేసిరి

ఆఱుమాసములు కష్టించి పర్వతాగ్రముపై నెక్కి నిమిషమునఁ గ్రిందికి దొరలిరి ఈవిషయమై సంజీవని యేమియుఁ జెప్పఁ దలఁచుకొనలేదు గాని సమాజమునందుండి యకార్యములుచేసి తాముచేసిన ప్రమాణములకు విరోధముగ వర్తించి పాపము మూటగట్టుకొనుటకంటె వీరివలె వర్తించుట శ్లాఘ్యము.

ఈవిషయమునఁ బామర స్త్రీలకుఁ గల ధైర్య స్థైర్యములు విద్యావంతులు బుద్ధిమంతులు నగుపురుషులకు లేవా యేఁగదా యని విచారముకలుగుచున్నది నెల్లూరుమండలమున ఆత్మకూరుతాలూకాలో కుల్లూరని యొకగ్రామము గలదు అందు శ్రీమతి తులసమ్మ యని యొకబలిజకుటుంబిని గలదు ఈమె విద్యావతికాదు భక్తురాలు నగును. వాసుదాసుఁ డాగ్రామమునకు భిక్షార్థమై పోయినపుడు తనయింటిలోనికిఁ బిలుచుకొనిపోయి యాదరించి తొలుత పాలిచ్చిన తల్లి యీమెయే.

ఈమె సమాజసభ్యురాలు గాకపోయినను సమాజనియమములను విని యాప్రకారము నర్తింపఁగోరి మాంసాహారమును వదలెను. అత్తగారిపోరు భర్తపోరు బంధువులపోరు బలమయ్యెను. రెండుమాసము లట్లుండఁ గలిగెను గాని వీరల బాధవలన మఱియు భుజింపసాగి తరువాత ౪-౫ మాసములకు మరల మానెను. అప్పు డీమెకు జ్వరబాధ తటస్థించెను. మందు లిచ్చిరి. గుణము లేదు. భర్తయు బంధువులు మాంసా

హారము వదలుటచే నీకీవ్యాధి గలిగినది. మందు పట్టుట లేదు మరల భుజింపుమని యెన్నెన్ని విధములనో పీడించిరి. కాని యామె లోపడినది కాదు. ఈ దేహము నాయన కర్పించితిని. ఇది యాయనసొత్తు కాపాడినఁ గాపాడుకొననీ పోఁగొట్టు కొనినఁ బోఁగొట్టుకొననీ యని వారినెల్లఁ దిరస్కరించి యప్పుడు నెల్లూరనుండు వాసుదాసున కీవిషయము తెలుపుచు నుత్తరము వ్రాయించి పంపెను. భయపడవలదని వాసుదాసుఁడు బదులిడుచు నౌషధములఁ బంపెను. దైవానుగ్రహమువలనను నామె మనోబలముచేతను దేహము స్వస్థపడెను ఆవల శ్రీరామ యనుమూఁడక్షరములు నేర్చి రామకోటి తాను వ్రాయుటయే గాక యింటిలోనికి మాంస మను వస్తువు రాకుండఁ జేసి భర్తను పుత్త్రులనుగూడ దానినంట కుండఁ జేసెను

కొండమాచుపల్లె గ్రామమందు శ్రీమతి చెన్నమ్మ యను సభ్యురాలి చంటిబిడ్డకుఁ బ్రబలవ్యాధి వచ్చెను బంధువు లందఱు కోడిని జంపి బలియిచ్చినఁ గాని బిడ్డబ్రదుకఁడని యెంతెంతో బోధించిరి. కులసంప్రదాయ మనిరి. బిడ్డను బోఁగొట్టుకొనెదవా యనిరి. ఎవ రెన్నిచెప్పినను ఆదంపతు లాఘోరకార్యమును జేసినవారు కారు. ఆబిడ్డఁ డిప్పటికి క్షేమముగా నున్నాఁడు. ఇవి రెండుజరగి యిప్పటికి ౫-౬ సంవత్సరము లయినవి. ౪-౫ సంవత్సరములనాఁడు మాంసాహారము మానుటచే నిప్పుడు దేహబాధకలిగిన దని నారాయణరావుగారు భయపడిరి.

ఆహారమును మార్పఁదలఁచినవారు క్రమక్రమముగ మార్చుట శ్రేయస్కరము తటాలున నొక్కనాఁటనే మార్చినవారు కలరు. గాని యది పెక్కురకు రోగకారణమగును. కావున నెవ్వరికైనను క్రమమార్గమే నిరపాయము - జీర్ణకోశమం దొక్కొక్కవిధమైన యాహారమును జీర్ణింపఁ జేయుటకు నొక్కొక్క విధమైన యేర్పాటులను భగవంతుఁడు చేసియున్నాఁడు మాంసభక్షకుల జీర్ణకోశమునకు శాకాహారుల జీర్ణకోశమునకు భేదముగలదు మాంసమును భక్షించు మృగముల దంతములకు గడ్డిమేయు పశువులదంతములకు నెట్టి భేదము గలదో జీర్ణకోశములం దట్టిభేదమే కలదు కావునఁ దటాలున మార్చితిమేని నూతనవిధాహారముఁ జీర్ణముగాకపోవును దానివలన వ్యాధులు సంభవించును. ప్రాఁతయాహారముతోపాటు నూతనాహారమును గొంచెము కొంచెముగా మిశ్రమము చేయుచు హెచ్చించితిమేని జీర్ణకోశము క్రమక్రమముగా నూతనాహారమునకు పనువడును ఆహారదోషమువలన వ్యాధివచ్చినను, ఆఱుమాసములు కాకుండిన సంవత్సరములోపలనే వచ్చునుగాని యావల రాదు. క్రమమార్గమున వ్యాధియే రాదు.

తమశ్రేయస్సు దాము గోరి నిండుమనస్సుతో సమాజ నియమములను బాటింపఁ దలఁచిన వారిని మాత్రమే సమాజము దనలోఁ జేర్చుకొనును గాని మఱియెవరిని బలవంత పెట్టదు. సమాజములోఁ జేరినపిమ్మట నానియమములను బాటింపలేని వారు యథాసుఖముగఁ దొలఁగి పోవచ్చును.

ఇట్లు పోవువారు పత్రికములను మరలనిచ్చి వాసవాసికైయిచ్చిన పైకమును మరల గ్రహింపవలయును. ఇదియుత్తముల లక్షణము. ఇటుగాక కొందఱు సమాజములోనుండి యకార్యములు చేయుచున్నట్టు తెలియవచ్చెను. సకరంకంటిలోని బ్రాహ్మణ విటీవిటులకును, మంగళగిరిఖండ్రికలోని యొకదురాచారికిని సమాజములోనుండియేల తొలఁగింపఁగూడదో తెలుపవలసినదిగా నుత్తరములుపోయియున్నవి. గడువులోపలఁ దగిన సమాధానమురాదేని వారిపేర్లు సమాజసభ్యులపట్టినుండి తొలఁగింపఁబడు నాలోచనలు చేయఁబడును. వారిపేర్లు సమాజ సభ్యులకుఁ దెలుపఁబడును

కొమ్మూరుగ్రామమున నొకవేశ్య సమాజములోఁ జేరఁదలఁచి వాసుదాసు నడిగెను. నీవృత్తి మానుమని నేను బలవంతపెట్టను గాని భార్యలుండు పురుషులను నీవు నీయింటికి రానీయవలదని యాయన చెప్పెను. భార్యలు లేనివారు నాకెక్కడ లభింతురని చెప్పి యామె వెడలి పోయెను. ఈమె బుద్ధిమంతురాలు. తన దుర్బలత్వము తనకుఁదెలిసి సమాజమందుఁ జేరక మానుకొనెను.

సమాజమందుఁజేరక యేయకార్యములు చేసినను ఆ గ్రామముననో ప్రక్కగ్రామములందో తెలియును. సమాజమందుఁ జేరి యకార్యములను జేయువారు అకృత్యదోషమునకేకాక చేసిన ఘోరప్రమాణభంగమునకును నరక మనుభవింపవలసియుండుటేకాక వీరిచేష్టలు ఆంధ్రలోకమునకంతయుఁ దెలి

యును. కాఁబట్టి దుష్టకార్యములు చేయువారు సంజీవని ప్రక టింపకముందె వారంతటివారె సమాజమునుండి తొలఁగి పోవుట వారికిని శ్రేయస్కరము సమాజమునకుఁ గీర్తికరము. దుష్కర్మపరులు వారెంతటివారైనను, నెంత ప్రముఖులైనను సహింపఁబడరు. తమశ్రేయస్సునకై చేయవలసినకార్యములుఁ చేయనివారు వారుమాత్రమే మేలుపడరు. చేయరానికార్యములు చేయువారు మఱికొందఱకు మార్గదర్శకులై సమాజమున కపకీర్తి సంగదోషము గలిగింతురు. కావున సమాజనియమోల్లంఘనము సర్వదా సర్వథా దుష్టము. అసహ్యము.

## సంజీవనీ దోషములు.

సంజీవనికిఁ గలచందాదారులలో విశేషజనులు శూద్రులుండినను వారికిఁ గావలసినవి వ్రాయక బ్రాహ్మణులకుఁ గావలసినవి మాత్రమే వ్రాయఁబడుచున్నవని కొందఱనుకొనుచున్నారని యొకచందాదారుఁడు వ్రాసెను ఈ యనుకొనువారు చందాదారులో తదితరులో తెలియదు. సంజీవని చందాదారులలో నేజాతివా రెక్కువగానున్నారో యది సంజీవనికే తెలియదు ఆలెక్క పెట్టలేదు పెట్టవలసిన పనియును లేదు ఇట్లుండ నీయనుకొనువారి కెట్లు తెలిసెనో యూహింపరాకున్నది మఱికొందఱు రామునివిషయమే విశేషించి యిందు వ్రాయఁబడుచున్నదని శివునిగుఱించి వ్రాయఁబడుట లేదని కొందఱు వ్రాసిరి.

ఈ రెంటికిని సమాధానము సంజీవని తొలి తొలి పత్రికలయందే ప్రకటించెను. అవి చదువకయో చదివినవిషయములు మనస్సునకు రాకయో వారివారి యిష్టానుసారము వారు వా రాక్షేపించిన నెవ్వరేమి చేయఁగలరు.

భక్తిసంజీవని శైవపత్రిక గాదు - వైష్ణవపత్రిక కాదు - బ్రాహ్మణపత్రిక కాదు - క్షత్రియపత్రిక గాదు - వైశ్యపత్రిక గాదు - కాఁపుపత్రిక గాదు - శూద్రపత్రిక గాదు - ఒకమతమును శ్లాఘించి యొకమతమును దూషింపవలయునని కాని యొక దేవుని గొండమీఁదఁబెట్టి తక్కిన దేవతలను గుండులలోఁ గలుపవలయుననికాని సంజీవని యభిప్రాయముగాదు - శైవ - వైష్ణవ - బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యాదులకు వేర్వేఱు పత్రికలు గలవు. తత్తదభిమాను లాపత్రికల వలన సంతుష్టిపడవచ్చును. ఈపత్రిక భక్తిసంజీవని. ఎవ్వరే దేవతను గొలిచినను - ఎవ్వరేవర్ణమువారైనను, వర్ణహీనులైనను ముక్తియందు నభిలాషగల వారైరేని వారికుత్తమమార్గము భక్తియే యని భక్తిసంజీవని ఘోషించుచున్నది కర్మజ్ఞానమార్గములు వ్యర్థములుకాకపోయినను నీకాలమున నసాధ్యములు కేవల కర్మయోగమున - కేవల జ్ఞానయోగమునఁ దరించువా రీయుగమున లేరు. ఇట్లని శాస్త్రపురాణములు చెప్పుచు భక్తియే యీకాలమునకుఁ దగినదని చాటించుచున్నవి ఈవిషయము దెలియక యనేకులు స్త్రీలు పురుషులు శిశ్నోదరపరాయణులయిన దొంగసన్న్యాసులయు - శుష్కవేదాంతులయు - మాయాయోగులయు మాయమాటలకు లోఁబడి యిహమునఁబరమునఁ జెడుచుండుట చూచి బాగుపడ నిశ్చయమైన కోరికగలవారికి భక్తిమార్గముఁ దెలుప

వలయునని సంజీవని తెలుపఁజేను ఈసమాజమునఁ జేరువారు వారివారి యిష్టదైవమును విడనాడవలసిన పనిలేదు. వారి యిష్టమంత్రమును మానుకొనవలసిన పనిలేదు. మార్గము మాత్రము భక్తియోగముగా నుండవలయుననియు దానికిఁ గావలసిన సాధనము లివియనియుఁ దెలుపును భక్తియోగమునకుఁ గర్మయోగము జ్ఞానయోగము అష్టాంగయోగము అంగములు కావున వానివిషయము దెలుపును. ఏయోగమునకైనను సదాచారసంపత్తి కావలయును గావున ఆవిషయము దెలుపును ఆచారసంపత్తికి స్వధర్మనిర్వహణము ముఖ్యము కావున నేయేవర్ణమువారే యేయాశ్రమమువా రెట్లు వర్తింపవలయునో తెలుపును. భక్తి సర్వవర్ణసామాన్యము కావున నందఱకుఁ గావలసినవి తెలుపును ఇంతవఱకు వ్రాసిన దానిలో సంధ్యావందనము మూఁడువర్ణముల వారికి మాత్రము కావలసియుండును తక్కినవిషయము లన్నివర్ణములవారికిఁ గావలసినవే. వానినిగ్రహింపలేనివారు ఇది మాకుఁ గాదు. ఇదిమాకుఁ గాదని త్రోసివేసిన సంజీవని యేమి చేయఁగలదు సంజీవని రత్నములను బాఱఁజల్లుచున్నది వెలదెలిసిన పురుషులు వానిని హృదయపేటికయందుఁ బదిలపఱుచుకొనుదురు. స్త్రీరత్నములు వానిని గ్రహించి శిరసావహించి యలంకరించుకొందురు. కోళ్లు కాళ్లతోఁజీఱి యివి జొన్నగింజలు కావే-కందిగింజలుకావే యని ముత్యములను గెంపులను నావలఁ ద్రోయును ఇదిరత్నముల దోషమా? చల్లినవానిదోషమా? సంజీవని శ్రీరాములగుఱించి విశేషించిచెప్పుటకుఁ గలకాగ్యములు రాఁగలపత్రికయందుఁ దెలుపఁబడును.

---

## శ్రీ రామపరత్వము

పూర్వసంచికా శేషము (౪౯౧-వ పుట చూడుఁడు)

అర్జునుఁడు — అయినను నీమాయ తొలఁగిపోవు టెట్లు?

కృష్ణుఁడు —

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే, మాయామేతాం తరంతి తే.

౭-౧౪

దైవమగు నాకు సంబంధించినదై సత్త్వరజస్తమస్సులను గుణములను గలదై లోకమును మోహింపఁజేయు శక్తియగు నామాయ (ప్రకృతి) నతిక్రమింప నెవ్వరికిని నేయుపాయముచేతను సాధ్యముగాదు. ఎవ్వరు నన్నే శరణువొచ్చెదరో వారికీ మాయను దాఁటగలవారగుదురు

అర్జునా — నాశక్తినిమించిన శక్తి లోకములందు లేదు, అదియితరోపాయములచే జయించుటకు సాధ్యపడునది కాదు నాకంటె గొప్పవాఁడుండినఁగదా నా శక్తికంటె మించినశక్తి వేఱొకటి యుండును అట్టి నా సంకల్పమును వ్యర్థము చేయఁగలయుపాయము లోకములందు లేదు నా పూర్వసంకల్పము మార్పవలయునని నేనే మార్పవలయును కాఁబట్టి యెవరు నన్నే యాశ్రయించి పాహి పాహి యని శరణు చొత్తురో వారు నా యనుగ్రహముచే నా మాయను దాఁటఁగలుగుదురు.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ, భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్, బ్రహ్మభూయాయ కల్పతే.

౧౪-౨౬.

అర్జునా! నామాయ (నాప్రకృతి) సత్త్వము రజస్సు తమస్సు ననెడి మూఁడుగుణములు కలది. భూతకోటియంతయు నీ మూఁడుగుణములకు వశపడియున్నది కావున బాగుపడఁ గోరువారీ మూఁడుగుణములకు సంబంధించిన కార్యములను చేయుట మానవలయును. అది నాకు సాధ్యమా యందు వేమో అది నీకు సాధ్యముగాదు. నన్ను నన్యమైన యేకాంత యోగముచే సేవింపుము. ఆ మూఁడుగుణములు తొలఁగి పోవును. అప్పుడు నీకు బ్రహ్మస్వరూపము ప్రాప్తించును ఎట్టు లనఁగా మూఁడుగుణములు తొలఁగిపోఁగానే యాత్మజ్ఞానము కలుగును. అప్పుడు సర్వము బ్రహ్మ మన్నట్టు తోఁచును. ఆమా త్రముచేతనే మేలులేదు. అట్టి జ్ఞానముగలవాఁడవై యేకా గ్రమై చలింపని యనన్యభక్తితో సేవించిన ముక్తునిఁ జేయుదును నీకృషి, నీజ్ఞానము, నీశక్తి నిన్ను రక్షింపఁగలనని నమ్మవలదు ఎట్లం దువా? కంటికి వేసికొనిన రంగద్దములు తీసివేసిన సూర్యుఁడు యథాస్వరూపముతోఁ గానవచ్చును ఆమాత్రముననే మన వ్యాధులు నివృత్తించునా? సూర్యునివలన నారోగ్యముఁ గోరు వారు సూర్య నమస్కారములచేతను మఱి యేవిధముగనో సూర్యోపాసనచేసి యాయన యనుగ్రహమునకుఁ బాత్రులై రోగబాధ తొలఁగించుకొన్నట్లు నన్ను భక్తిచే సేవింపకుండిన ముక్తిలేదు.

శ్లో. జన్మ కర్మచ మే దివ్య, మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ, నైతి మామేతి సోర్జున!

భగ. ౪-౯.

అర్జునా! నాదివ్యావతారరహస్యము తెలియఁజెప్పితిని. నే నవతరించువిధము, కారణము, అవతరించిచేయు కార్యము సర్వము చెప్పితిని ఈ రహస్య మున్నదున్నట్టు లెవఁడు తెలిసికొనునో తెలిసికొని నేను జెప్పినట్టు చేయునో వాఁడీ దేహమును విడిచినపిమ్మట మరల జన్మింపఁడు. నన్నే పొందును. అని భగవంతుఁడైన కృష్ణుఁడే తన యవతారరహస్యమును బోధించెను.

సభ్యులారా! దీనివలన వైకుంఠధాముఁ డయోధ్యారాముఁ డెట్లయ్యెనో స్పష్టపడెనుగదా. అయినను నింకను మిమ్మొక సందేహము బాధింపవచ్చును భగవంతుఁ డవతరించువిధము, అవతారమూర్తిని సేవించినఁగలుగు ఫలము సరియే కాని, శ్రీరాముఁ డట్టి యవతారమూర్తి యనుటకుఁ బ్రమాణముకలదా? యందురేమో? అట్లైన వినుఁడు

"అథచ రామకృష్ణావతారేష్వ ప్యద్వైత పరమానంద లక్షణ పరబ్రహ్మణః పరమతత్త్వ పరమవిభ వానుసంధానగ్ంస్వీయత్వేన శ్రూయతే సర్వత్ర మహానారాయణోపనిషత్తు.

శ్లో. రమంతే యోగినో నంతే, నిత్యానందే చిదాత్మని।

ఇతి రామపదేనా సౌ, పరబ్రహ్మాభిధీయతే॥

రామతాపన్యుపనిషత్తు.

అనంతుఁడును, నిత్యానందస్వరూపుఁడును, జిదాత్మకుఁడునైన యెవ్వనియందు యోగులు రమింతురో యాపరబ్రహ్మమే యీ రామపదముచేఁ జెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. రామేతి కీల వర్ణాభ్యాం, బ్రహ్మేతి ప్రతిపాద్యతే
కారణం సర్వభూనా, నువధిః పరికధ్యతే.
అయోధ్యా కోసలే దేశే, సరయూ పులినే స్థితా
యత్ర రాజీవపత్రాక్షో, రామో దశరధాత్మజః
పరమాత్మా సముద్భవం, జానకీరూపయా త్వయా
తయో ర్లీలానుసంధానా, న్ముక్తి ర్భవతి సద్గతిః.
బృహద్బ్రహ్మసంహిత.

రామ యను రెండక్షరముల చేతనే బ్రహ్మమనుపదము ప్రతిపాదింపఁబడుచున్నది. ఆయనయే సర్వభూతములకుఁ గారణము. అంత్యము. కోసలదేశమందు సరయూతీరమున నయోధ్యయను నగరముగలదు. అచ్చటఁ బుండరీ కాక్షుఁడైన పరమాత్మ దశరథునికొడుకైన రాముఁడై జానకీరూపముధరించిన సీతతోఁగలసెను. ఆయిరువురలీలలను స్మరించుటచే ముక్తియను సద్గతి కలుగుచున్నది.

శ్లో. రామఏవ పరబ్రహ్మ, రామ ఏవ పరంతపః
రామ ఏవ పరంతత్త్వం, శ్రీరామో బ్రహ్మతారకమ్
రామరహస్యోపనిషత్తు.

రాముఁడే పరబ్రహ్మము రాముఁడే పరమతపము. రాముఁడె పరతత్త్వము. శ్రీరాముఁడే తారకబ్రహ్మము.

శ్రీరాముఁడు=లక్ష్మీదేవియందు రమించువాఁడని యర్థము.

శ్లో. చిన్మయేస్మి౯ మహావిష్ణౌ,జాతే దాశరథే హరౌ
రఘోః కులే ఖిలం రాతి, రాజతే యో మహీస్థితః

స రామ ఇతి లోకేషు, విద్వద్భిః ప్రకటీకృతః.

రామతాపన్యుపనిషత్తు.

అయ్యా! నీవనువదించిన వాక్యములన్నియు నితర గ్రంథములలోనివి. అవట్లుండనిమ్ము. శ్రీరాముని సమకాలికులెవ్వరైన నాయనను భగవంతుఁడని యంగీకరించిరా? యని మీరడుగవచ్చును. శ్రీరామకృష్ణావతారములకు లభించినంత నిష్పక్షపాత సమకాలికసాక్ష్యము మఱియే యవతారమునకు లేదని చెప్పవచ్చును శ్రీకృష్ణునిగుఱించి శ్రీకృష్ణావతారతత్త్వమందు వ్రాసితిని. శ్రీరాములవిషయమై చెప్పెదవినుఁడు

శ్రీ సీతారాముల జీవితచరిత్రము శ్రీమద్రామాయణము.

సీ. శ్రీరామ! నేనే ప్రచేతసుపదియవ
పుత్రుండ మదినైన బొంకుఁదలఁప
నీ పుత్రులిక్వాకు నీపుత్రులేయమ్మ
పెక్కువే లేఁడు లేనుక్కడంపుఁ
దపమొనరించితి ధరణిజ దుష్టయే
దపముఫలంబెల్ల దగ్ధమగుత
మనసునఁ గర్మంబునను వాక్కుచేతను
గలుషంబు నే నెప్డుసలుపలేదు.
గీ. వానిఫలమునాకుఁ బ్రాపించుభూసుత
పాపహీనయేని పార్థివేంద్ర! ఉత్తర ౧౧౦౬. వ.

ఇట్లు బొంకెట్టిదో యెఱుఁగని వాల్మీకిమహర్షి యాగ్రంథకర్త ఆ గ్రంథము సీతారాములును వారితోడివారును

నందఱుజీవించి యుండఁగ నే చెప్పఁబడి వారికందఱకు వినిపింపఁ బడినది. వారిచే సరియని యంగీకరింపఁబడినది. ఈ వాల్మీకి మహర్షి దశరథునిమిత్రుఁడు.

కం. రమణీయంబులు కడుఁబు
ణ్యములుఙ వెతపడకుమమ్మ యటదశరథభూ
రమణునసఖుండగు విప్రుఁడు
విమలమనస్కుఁడు తపస్వి వితతయశుండుఙ.

ఉత్తర. ౯౯౮.

కం ముని వాల్మీకివసించును. ఉత్తర. ౯౯౫.

ఇట్లు దశరథునిమిత్రుఁడగుటచే శ్రీరాముల కుటుంబ విషయము చక్కఁగఁదెలిసినవాఁడు.

శ్రీ సీతారామలక్ష్మణులు చిత్రకూటంబున నీయనను దర్శించిరి.

శ్లో. ఇతి సీతా చ రామశ్చ, లక్ష్మణశ్చకృతాంజలిః
అభిగమ్యాశ్రమం సర్వే, వాల్మీకి మభివాదయఙ
తా న్మహర్షిః ప్రముదితః, పూజయామాస ధర్మవిత్.

అని యయోధ్యాకాండంబునఁగలదు

చిత్రకూటంబున శ్రీరామభరత సంవాదసమయంబున ఋషులమధ్యంబున నుండినవాఁడువాల్మీకి. రావణాసురవధను గోరిన యీమునులు భరతునికి సమాధానముచెప్పిపంపిరని యుండుటచేఁ గాఁగలకార్యమందఱు ఋషీశ్వరులతోపాటు వాల్మీకియుసెఱిఁగినవాఁడే. ఈకారణములచే నీయన శ్రీరా

ములకు సమకాలికుఁడు. భరతుఁడు చిత్రకూటమునకు వచ్చి పోయినవెనుక ఋషులందఱు నా పర్వతమునువదలి పోయి నపుడువాల్మీకియుఁ దమసాతీరమును జేరెను. పూర్వపరిచయము విశ్వాసముగలకారణముచేతనో భావివృత్తమెఱుంగుటనో శ్రీ రాముఁడు లక్ష్మణునితో సీతను వాల్మీకాశ్రమమున విడిచిరమ్మని చెప్పెను వాల్మీకిచే నాదరింపఁబడి సీతాదేవి పదియు రెండు సంవత్సరములాయన యాశ్రమమందే ఋషిపత్నులచే సం రక్షింపఁబడుచుండెను. ఇచ్చటనే యీమెకుఁగుశలవులు జనిం చిరి.

ఇట్లు శ్రీరాముఁడు రాజ్యముచేయుచు సీతాదేవి తన యాశ్రమమందుండు సమయంబున వాల్మీకికి బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై మునీంద్రా! సరస్వతీదేవి నా యనుమతిఁగొని నీ వాక్కునందు

ఉ॥ అమరఁగనిల్చిపల్కెను, ఘుణాక్షర ధర్మముగాదు నీవు ప
ద్యము రచియించుచెల్ల, నటులౌటను రామకథా ప్రపంచమ
త్యచులినభక్తి యుక్తిని, మహాకృతిసేయుము నారదోక్త త
త్త్వమమున, సద్గుణాంబునిధి ధర్మియురాముఁడె చూ మునీశ్వరా.

ఉ॥ ఆమతిమంతు సచ్చరితమందున గూఢ నిగూఢవృత్తముల్
రాముని తత్సహోదరుని రాక్షసపాళుల సీతవృత్తముల్
ధీమహితా! భవన్మతికిఁ దెల్లముగాఁగను గోచరించెడిన్
నీమహనీయ కావ్యమున నేరదు దబ్బఱలోకంబునుం జూరన్.

బాల ౧౭౬.

అని వరమిచ్చిపోయెను.

ఇట్లు వరమును బొందియుఁ దుష్టిపడక వాల్మీకి యోగ దృష్టిచే రాముని వృత్తాంతమంతయుఁ గరతలామలకముగఁ జూచెను.

ఆ. స్త్రీ తృతీయుఁడైన శ్రీ రఘురాముఁడు
సత్యసంధుఁ డగుచుఁ జలిపెనెవ్వి
కానలోనఁ గట్టి కార్యంబు లన్నియుఁ
గరతలామలకము గాఁగఁ గాంచె.

ఆ మఱియుఁ గోరి యోగమార్గావలంబుఁడై
నెఱిఁ దదేకనిష్ఠఁ గోఱలికాంచి
యనఘ రామకథ యథార్థంబుగా సర్వ
మొండు కృతిరచింప నూనె నపుడు. బాల ౧౯౦.

ఈ గ్రంథరచనమందు వాల్మీకికిఁ బ్రాకృతదృష్టి, స్వానుభవము, కథానాయకులతోడి పరిచితి, నారదోపదేశము, బ్రహ్మవరము, సరస్వతి యనుగ్రహము, పారమార్థిక ధర్మబుద్ధి, యోగ బలము సహాయపడెను కావున నిది సర్వవిధములఁ బ్రమాణ గ్రంథమే. ఈ గ్రంథమందు శ్రీరామచంద్రమూర్తి యెవ్వ రని వాల్మీకి చెప్పెనో చూతము.

౧ దశరథుఁడు పుత్రకామేష్టి చేయు సమయంబున బ్రహ్మాయు నింద్రుఁడు లోనుగాఁగల దేవతలు భాగార్థులై వచ్చి యుండిరి ఆ సమయమున రావణాసురునిచేఁ దమపడెడు పాటులు, వానివలన స్త్రీలకుఁ గలుగుచున్న మానభంగము వివరించి తమ్ముఁ గాపాడువారు లేరాయని ప్రార్థించిరి.

కం. ఈలోనన జాంబూనద
చేలుండు జగత్ప్రభుండు శ్రీకరతనుఁడు
గ్గాలుఁడు శంఖచక్ర గ
దాలలితుఁడు విష్ణుమూర్తి త్వర విచ్చేసెన్.

ఇట్లు వచ్చి తాను దశరథునకు నలుగురు పుత్రులుగా జనించి రాక్షసబాధ మాన్పెదనని యభయహస్త మిచ్చెను.

ఆవరప్రకారము,

౨ కం కౌసల్యజగత్పతి శ్రీ
వాసుని యర్ధాంశమూర్తి వరశుభచిహ్నున్
భాసురరఘుకులవర్ధను
వాసిఁగనెన్ సర్వలోకనందితు రామున్

విష్ణుమూర్తి శ్రీరాముఁడనుపేర కౌసల్యానందనుఁడై జనించెను

౩ శ్లో స హి దేవై రుదీర్ణస్య, రావణస్య వధార్థిభిః
అర్థితో మానుషె లోకే, జజ్ఞే విష్ణు స్సనాతనః
రావణుఁజంప దేవతా

బృందనుతిన్ సనాతనుఁడు విష్ణువుపుట్టె ధరన్ నరాకృతిన్

అని సనాతనుఁడైన విష్ణువే శ్రీరాముఁడుగా నవతరించె నని చెప్పెను

౪. శ్లో అక్షయ్యం మధుహంతారం, జానామి త్వాం సురే
[శ్వరమ్ ౭౬-౧౭.
త్వయా త్రైలోక్యనాథేన, యదహంవిముఖీకృతః
౭౬-౧౯.

చం ఎఱిఁగితి నాశరాసనము నీగతినీడ్చి శరంబుఁ బూన్పఁగా
నెఱవడి యక్షయుండవని, నీవు మధుప్రతిపక్షుఁడంచు నే
మఱపునఁ దప్పుచేసితిని మన్నన చేయుము బాల ౧౩౪౬ప.

అని పరశురాముఁడు శ్రీరాముని స్తుతించెను.

పరశురాముఁడావేశావతారము అట్టివానిని సామాన్య మనుష్యులు గెలువఁజాలరు. శ్రీరామచంద్రమూర్తి పూర్ణావతారము.

ఇట్లు కొఱనెఱయవతారములు భూమిపైనుండునపుడు కార్యముతీరఁగానే కొఱయవతారము తేజస్సు నెఱయవతారము తేజస్సులో లీనమైపోవును.

౫. మఱియును రావణ వధానంతరము

శ్లో. భవా న్నారాయణో దేవం, శ్శ్రీమాం శ్చక్రాయుధో విభుః
ఏకశృంగో వరాహ స్త్వం, భూతభవ్యసపత్నజిత్
త్వం త్రయాణాం హి లోకానా, మాదికర్తాస్వయం ప్రభుః
సీతాలక్ష్మీ, ర్భవా న్విష్ణుః
వధార్థం రావణస్యేహ, ప్రవిష్టో మానుషీం తనుమ్
యుద్ధ. ౧౨౦. స.

రామా! నీవు నారాయణుండవు, దేవుఁడవు, లక్ష్మీనాథుఁడవు, చక్రాయుధుండవు, ఒంటికొమ్ము వరాహమూర్తివి, చన్నరానున్న విరోధులజయించువాఁడవు, నీవే మూఁడులోకములకు మొదటికర్తవు స్వయముగా జనించువాఁడవు. నీవు సీత లక్ష్మీదేవి. నీవు విష్ణుఁడవు రావణవధార్థమై మనుష్య స్త్రీ దేహమునఁ బ్రవేశించితివి

అని బ్రహ్మస్తుతించెను

౬. అవతారసమాప్తికాలమున బ్రహ్మోక్తి,

సీ. కాలుండనేను నీ వాలింపుమో దేవ
వారిజగర్భుని వాక్యములను
స్వీయలోకంబును జేరి రక్షింపఁగ
సమయమియ్యదినీకు సౌమ్యచరిత
పూర్వంబుజగములఁ బొలియించి మాయచే
స్వయముగ జలరాశి శాయివగుచుఁ
దొలుతసృష్టించితి జలముల యందు న
న్నవల జలేశయమైననాగ

గీ. వరమనంతమనెడి పురుభోగవంతంబు. ఉత్తర. ౧౦౪౩.

.. .. .. .. .. .. . .. . .. .. .. .. .. .. ..

గీ. దివ్యమై తామరసహితదీప్తిఁదనరు
వారిజంబున నీనాభివలననన్నుఁ
గలుగఁజేసి ప్రాజాపత్యకర్మమునను
నీవనిలిపితి వో దేవనిత్యముగను.　　ఉత్తర. ౧౦౪౮.

౭. శ్లో. ఆగచ్ఛ విష్ణో భద్రం తే, దిష్ట్యా ప్రాప్తోసి రాఘవ
భ్రాతృభిస్సహ దేవాభైః, ప్రవిశస్వ స్వకాం తనుమ్ [మ్
యా మిచ్ఛసి మహాబాహో, తాం తనుం ప్రవిశస్వ కా
వైష్ణవీం తాం మహాతేజో, య ద్వాకాశం సనాతనమ్
త్వం హి లోకగతి ర్దేవ, న త్వాం కేచన జానతే.

ఉత్తర ౧౧౦. ౮.

సీ. జతనంబుచేయుంగ సరసిజసంభవుఁ
డాకసంబుననిల్చి యనియెనిట్లు
రారమ్మువిష్ణు భద్రంబగు మాయదృ

ష్టంబునవచ్చితి సాధురక్ష
సురనిభులగు భ్రాతృవరులతో నీకోరు
విధినిప్రవేశింపు స్వీయతనువు
వైష్ణవంబగు మహావరతేజమో సనా
తనమగు నభమొనీమనసు పగిది

గీ. నీవగతి యెల్లజగతికి, నీదుమాయ
శ్రీ విశాలాక్షి పూర్వపరిగ్రహంబు
గాక యెవ్వఁడు తెలియంగఁగలఁడునిన్ను
నఘచయవిభంగ! విమలదయాంతరంగ. ఉత్తర. ౧౬౫౪.

పైపద్యములయర్థమును విశేషవిషయములను జక్కఁగా గ్రహింపఁ బ్రార్థించెదను

౮. శ్లో. త్వం గతిః పరమా దేవ! సర్వేషాం నః పరంతప
పరంతపా! మాకందఱకు నీవేపరమగతివి.

అని దేవతలుచెప్పుటచేఁ బరిత్వమునకసాధారణమైన సర్వశరణ్యత్వము శ్రీరామునందుఁ జెప్పఁబడియె.

౯. శ్లో. తతో దేవర్షిగంధర్వా, స్సరుద్రా స్సాప్సరోగణాః
స్తుతిభి ర్దివ్యరూపాభి, స్తుష్టువు ర్మధుసూదనమ్.

రుద్రులతోను, నచ్చరలతోనుగూడి దేవర్షులు గంధర్వులు దివ్యరూపములైనస్తుతులచే మధువిరోధినిస్తుతించిరి. అనుటచే సర్వలోకస్తుతిపాత్రుఁడు శ్రీరామచంద్రుఁడే యని యేర్పడియె

౧౦. "వేదాహ మేతం పురుషం మహాంతం, [యజ్ఞేన
తమేతం వేదా నువచనేన, బ్రాహ్మణా వివిదిషంతి,
దానేన, తపసానాశకేన".

అను వేదవాక్యార్థముగల

శ్లో. అహం వేద్మి మహాత్మానాం, రామం సత్య పరాక్రమమ్
వసిష్ఠోపి మహాతేజా, యే చేమే తపసిస్థితాః.

గీ. ఏనెఱుంగుదు రాజేంద్ర! యీమహాత్ము
రాముసత్యపరాక్రమోద్దాముమతిప్ర
సిద్ధతేజోధికుం డగు వసిష్ఠమునియు
నీ తపస్వితులెల్లరు నెఱుఁగువార.　　　బాల. ౫౯౪.

యీ విశ్వామిత్రవాక్యముచే వేదోక్త మహాపురుషలక్షణము తపోబలములేక యీయన తెలియరామియు స్పష్టపడియె. తపశ్శక్తి కొంచెమైన లేనికారణముచేతనే శ్రీరామచంద్రమూర్తిని గుఱించి కొందఱు వెఱ్ఱివెక్కురులు నసరుచున్నవారు

౧౧ శ్లో. సహస్రచరణ శ్శ్రీమాన్, శతశీర్ష స్సహస్రదృక్.

అనేకపాదములు తలలు, కన్నులుగలవాఁడవు లక్ష్మీదేవితో నిత్యసంయోగముగలవాఁడవని బ్రహ్మచెప్పటచేఁ బురుషసూక్తవాచ్యుఁడు శ్రీరాముఁడే యయ్యె.

౧౨ శివకేశవయుద్ధమునందు విష్ణుదేవునిహుంకారమాత్రముననే శివుని విల్లు పెటలిపడఁగా,

"అధికం మేనిరే విష్ణుం, దేవా స్సర్షిగణా స్తదా"

అప్పుడు దేవ ఋషిగణములు శివునికంటె విష్ణువే యధికుఁడని తలంచిరి. అని చెప్పటచే శ్రీరాముఁడే దేవతల యందఱికంటె గొప్పవాఁడని యేర్పడియె

౧౩. అరణ్యకాండమున మారీచుఁడు,

శ్లో. అప్రమేయం హి తత్తేజో, యస్యసా జనకాత్మజా.

సీతయెవనిదో యట్టివాని తేజము పరిమితి లేనిది యని చెప్పుటచే శ్రీరాముఁ డపరిచ్ఛేదాతిత మహిమ గలవాఁడని యేర్పడియె.

౧౮ శ్లో. నివాసవృక్ష స్సాధూనాం, మాపన్నానాం పరాగతిః
ఆర్తానాం సంశ్రయ శ్చైవ, యశస శ్చైకభాజనమ్
జ్ఞాన విజ్ఞానసంపన్నో, నిదేశేనిరతః పితుః
ధాతూనామివ శైలేంద్రో, గుణానామాకరో మహాన్
త్వ మప్రమే యశ్చ' దురాసదశ్చ
జితేంద్రియశ్చో త్తమధార్మికశ్చ
అక్షయ్యకీర్తిశ్చ విచక్షణశ్చ
క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః. కిష్కింధా.

ఉ. సాధులవాసవృక్షము, ప్రశస్తమహాగతి యార్తకోటికిన్
బాధితపాళికాశ్రయము బంధురకీర్తికి నేకపాత్ర,మా
రాధిత శాస్త్రలౌకిక వరప్రతిపచ్ఛుభశీలి వల్లభా
భూధరమెల్లధాతులకుఁ బోలె గుణంబులకెల్లనిక్కయా.

క౦. జనకుని సూనృతవాదిగ
నొనరింపఁగవచ్చె.

సీ. అప్రమేయుఁడవు దురాసదుండవు నీవు
విజితేంద్రియుఁడవును విశ్రుతైక
ఘన ధార్మికుఁడవు నక్షయ్య కీర్తివిని వి
చక్షణుఁడవు క్షమక్షమకు నాటి
క్షతజోప మాక్షుండవతుల బాణాసన
బాణపాణివి మహాబలుఁడ వనఘ.

అని తారరాము నుద్దేశించి వచించుటచే శ్రీరామునందు జ్ఞానానందాది సమస్తకల్యాణ గుణాకరత్వము చెప్పఁబడియె

౧౫ గీ అధిప బ్రహ్మస్వభువు చతురాస్యుఁ డైనఁ
త్ర్యంబకుఁడు రుద్రుఁడను బుగహారుఁ డైన
నింద్రుఁడు మహేంద్రుఁడను సురాధిశుఁ డైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ గావలేరు. సుందర ౧౧౭౬

అను హనుమంతుని వచనమువలన శ్రీరామునందు సర్వ సంహారకత్వము చెప్పఁబడియె

ఇట్లు శ్రీరామమూర్తియే రావణుతోఁ జెప్పెను

కం వినరా యింద్రునిఁ గాలుని,
దిననాథుస్వయంభు శంభు దిగ్ధశకంబుల్
జనినను నిను విడువర్ నీ
తనువునకుం బ్రాణమునకుఁ దగులముఁ జేటుతోల్
యుద్ధ.

౧౬. సీ కానరాముండు నిక్కము మహాయోగి య
నాది మధ్యాంత సనాతనుండు
పరమాత్ముఁడును బరాపరుండు మహాత్ముఁడు
బరమ మహత్తుచు బరమ ధాత
శ్రీవత్సవత్సుండు శ్రీనిత్యనిలయుండు
శంఖచక్ర గదాది సాధనుండు
శాశ్వతుండు ధ్రువుండ జయ్యుండు సత్య ప
రాక్రముఁడగు విష్ణుఁ డవనిమీఁద

గీ. మానుష శరీరమునుబూని వానరత్వ
కలితవి బుధులతోడ జగద్విభుండు

భువనహిత కామ్యమున నిన్నుఁ బూర్వదేవ
సంతతులతోడ ద్రుంచె సంగరమున

అను మండోదరీవాక్యమువలనఁ బరమాత్మత్వము శ్రీపతిత్వము లోనైనవి శ్రీరామునందుఁ జెప్పఁబడియె

౧౭. చం అనిననకంపనుండనియె నాన్నృపు విశ్రుత విక్రమంబులన్ । వినుమసురేంద్ర! కింకగొనెనేని యసాధ్యుఁడు, నిండువెల్లినేన్ । ఘనతర బాణపంక్తి నరికట్టు, సతారము సగ్రహంబునో । ఘనపదమున్ శరంబులఁబగల్చుఁజుమీ రఘురాముఁడుద్ధతిన్ ॥

శా. శ్రీమంతుండతఁ డుద్ధరింపఁగలఁడుర్విన్, లీలఁగూపారవేలామర్యాదనడంచి యంబునిధి కీలాలంబులన్ వేఁగ । త్రోసమం బెల్లనుముంపఁజాలు గురుశక్తుం, డంబురాశిస్థయం । బామూలంబుహరించు, మారుతమునే నాఁకట్టు బాణంబులన్ ॥

చం. ఘనతర విక్రమంబునను గాఢమహాయశుఁ డాతఁడెల్లలోకనికరమున్ హరించియును గ్రమ్మఱ సృష్టియొనర్పఁజాలు, నామనుజమృగేంద్రుఁడీ ప్రజలమానుగ నట్టులె చేయు నీకునామనుజవసుండ నాథ్యుఁడని మన్నతమియ్యది పంక్తికంధరా.

అను నకంపను వచనంబులవలన శ్రీరామునందు జగత్సృష్టిస్థితి సంహారకర్తృత్వ, మఘటనఘటనా సామర్థ్యముఁ జెప్పఁబడియె

శ్రీరామ.

# భక్తిసంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము — వాల్మీక్యాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమాతను విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయము రాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు

విడిపత్రిక 0—5—0

Regd. No. M 2443. తేది, ౨-౪-౨౯.

శ్రీరామసేవ.

# భక్తిసంజీవనీ నియమములు.

౧. ఇది ప్రతిహూణమాసారంభమున వెలువడుచుండును.

౨. ముముక్షువులకు శ్రేయస్కరములైన సాంగభక్తి ప్రపత్తులమార్గ ప్రదర్శనము ముఖ్యోద్దేశ్యము

3. చందాలు ముందు చెల్లించినవారికిమాత్రమే యిది పంపఁబడును.

౪ పత్రికనుగుఱించిగాని తన్నిర్వాహకాదులగుఱించికాని వ్రాయఁబడు ముఖస్తోత్రాదు లిందుఁ బ్రకటింపఁబడవు

౫. ఉపవిలేఖకుల యభిప్రాయములకుఁ బత్రికానిర్వాహకు లుత్తరవాదులు గారు

౬. భిన్నాభిప్రాయములు ప్రకటింపఁబడును గాని విద్వేష కారణమైన విషయములు-వ్యాసములు-వాక్యము లిందుఁ బ్రకటింపఁబడవు.

౭. వ్యర్థచర్చలకు వితండావాదముల కిందు స్థలము లభింపదు

౮. ఉపవిలేఖకుల వ్యాసములు ప్రకటించుటకు నిరాకరించుటకు భాష సవరించుటకుఁ బత్రికా ప్రధానలేఖకులు స్వతంత్రులు. నిరాకరణమునకుఁ గారణము తెలుపఁబడదు పోస్టేజి పంపినయెడల మరల నవి పంపఁబడును

౯ ఉత్తరములు వ్రాయువారు ప్రత్యుత్తరమునకై ౦-౧-౦ బిళ్ల పంపినచో ప్రత్యుత్తరము పంపఁబడును.

౧౦. భక్తిసంజీవని యన్యమతద్వేష మెఱుఁగదు. భక్తివిషయ మెందుండినను గ్రహించును మతత్రయ సామరస్యమునకై యత్నించును

౧౧ ఉపవిలేఖకులు పత్రముల కొకవైపుననే విశదములైన యక్షరములతో వ్రాయవలెను.

౧౨ పత్రికావిషయ మెఱుంగఁగోరువారు, పత్రికా నిర్వాహకుల పేర ౦-౧-౦ బిళ్లతోడ వ్రాయవలయును. వ్యాసములు వీరిపేరనే పంపవలయును.

౧౩ ఇందుఁ బ్రకటింపఁబడు వ్యాసముల యుఁ బుస్తకములయు సర్వస్వామ్యము పత్రికాధిపతులదే. దీనికి సమ్మతించినవారే వ్యాసములు గ్రంథములు పంపవలయును.

౧౪ ౧౯౨౯ సం॥ జనవరి ౧ తేది మొదలు సంవత్సరగణనము సంవత్సరపుఁ జందాకుఁ దక్కువఁ దీసికొనఁబడదు.

౧౫ ఈపత్రికవలన వచ్చులాభము ఒంటిమిట్ట కోదండరాముల వారిదే కావున దీనిని బోషించువారు శ్రీరామ కైంకర్య లాభమును సంపాదించినవా రగుదురు

౧౬. వేవురైనను (౧౦౦౦) ఉదారులైన చందాదారులు చేరిరేని మందరము (ఆంధ్రవాల్మీకిరామాయణ వ్యాఖ్యానము) ప్రకటింప యత్నింపఁబడును.

| | రూ | అ. | పై |
|---|---|---|---|
| **భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు.** | | | |
| మ-రా-శ్రీ, కుట్టా సిద్దయ్యగారు, జమ్ములపాలెము .. | ౪౦౦ | ౦ | ౦ |
| **పోషకులు** | | | |
| మ-రా-శ్రీ, సి దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు | ౨౫ | ౦ | ౦ |
| ,, ఎస్ నారాయణరావుగారు, బి ఏ, బి. ఎల్ బళ్లారి . .. . .. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట

వాసుదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు.





శ్రీరామాయ నమః.

# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు
మాసపత్రిక

ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట.

సంపుటము ౧ { విభవనామసంవత్సరము / ఏప్రెల్ ౧౯౨౯ సం॥ } సంచిక ౮


చం. ఎలమిఁద్రిలోకముల్ గొలిచె నెయ్యవి? యెయ్యవి భూష
ణంబులై । బలిశిరమందుఁ బొల్పెసఁగెఁ? బావనతీర్థసరి
త్ప్రసూతికిన్ । దలి యయి యొప్పె నెవ్వి? యెవి దాల్తురు
బ్రహ్మముఖామరుల్ శిరం । బుల నలపాదపద్మములఁ బూర్ణ
మతిన్ శిరసావహించెదన్ ॥

## ఒంటిమిట్ట కోదండరామస్వాములవారి బ్రహ్మోత్సవము

ఈ మహోత్సవము చైత్రశుద్ధ నవమినాఁడు ప్రారంభమగును ౧౦ దినములు జరగును శ్రీరామనవమినాఁడు పోతన జయంతి జరగును త్రయోదశి ఆదిత్యవారమునాఁడు (21-4-29) శ్రీకోదండరామ సేవకసమాజ తృతీయవార్షికోత్సవముజరగును సమాజసభ్యులు తదభిమానులు దయచేయఁ బ్రార్థితులు పున్నమనాఁడు రథోత్సవము (23-4 29) తక్కినవిషయములు ప్రత్యేకపత్రికలవలనఁ దెలుపఁబడును.

### భక్తిసంజీవని చందాభేదములు.

చందాదారుల కందఱకుఁ బంపునవి యొకవిధమైన సంచికలే యైనను రెండురూపాయ లని యైదురూపాయ లని యిట్లు భేద మేర్పఱుప నేమికారణ మని కొందఱు ప్రశ్నించుచున్నారు. వారివారికిఁ గలభేదములు ప్రకటనపత్రికయందే విశదీకరింపఁబడియెను శ్రీరామానుగ్రహంబున నెలకు ౪౮ పుటలగ్రంథమునకుఁ దక్కువలేక ప్రతిమాసమునందును సంజీవనియందు విషయములు ప్రకటింపఁబడుచుండును ఈ ౪౮ పుటములగ్రంథమే నెలకు ౦-3-౦ లగుచున్నది. అనఁగా సంవత్సరమునకు ౨-౪-౦ ముఖపత్రము నెలకు ౦-౧-౦ చొప్పున సంవత్సరమునకు ౦-౧౨-౦ అగుచున్నది దీనిమీఁద టప్పాల్ భృతి ౦-3-౦ అగుచున్నది. ఇప్పటికి వెరసి 3-3-౦ లగును ఇదిగాక యప్పుడప్పుడు చిత్రపటములు లోనైనవి ముద్రింపఁబడుచుండును.

అవి చేయించుటకు-ముద్రించుటకు-లోనుగా నెంతయగునో పారకులే నిర్ణయించుకొందురు గాక.

ఇట్టు లగుటచే సంవత్సరమునకు ౨-౦-౦ లిచ్చువారు స్వామిద్రవ్యముతోఁ గొంత తినువా రగుదురే కాని స్వామి కేమియు నిచ్చినవారు కాఁజాలరు ఆకారణముచే ధర్మబుద్ధి గల భక్తులు భక్తురాండ్రు నధికముగ నిచ్చినఁ గాని సంజీవని జీవింపఁజాలదు. కనుక నట్టివారు సాహాయ్యముచేయుదురు గాక యని యట్లు ధేవ మేర్పఱుపవలసివచ్చెనుగాని వేఱుకారణము లేదు. కలిమికొలఁది చిన్నెలు మగనికొలఁది వన్నె లన్నట్టు వరుమానమెక్కువ యైనచో సంజీవనియు నెక్కువగఁ బ్రకాశించుచు నెక్కువగ లోకసేవయు దేవసేవయుఁ జేయఁగలదు. ఇది క్షణభంగురమైన పత్రికగాదు ఒకసారి చదివి యావలఁ బాఱవేయునది గాదు. తమశ్రేయస్సు గోరు వారికిఁ దరతరములకు నుపయోగపడునది దీనిసాహాయ్యమున మందరప్రకటనాది గొప్పకార్యములు చేయుతలంపును గలదు దీనికైయిచ్చు మొత్త మొకకాసైన దుర్వినియోగపడదు వ్యర్థమును జేయఁబడదు కావున శక్తిగలవారు గొప్పగ సహాయము చేసినచో హెచ్చు చందానీయలేని పేదలకు నిది లభ్యపడుటచే వారును బాగుపడుదురు గొప్పకార్యములును జరగును. కావున వారి వారి శక్తికొలఁది సహాయపడఁ బ్రార్థితులు

వాసుదాసుఁడు.

---

## గజేంద్రమోక్షణ తత్త్వము (పుట ౧౪౪ చూడు)

శేషము.

ఆకారణముచే మనస్సున కాయాసము తోఁపదు. భక్తి మార్గనిష్ఠుఁడు సర్వసుఖము లింటనుండి యనుభవించుచు భక్తి చేయవచ్చును. దీనివలనఁ బక్కినయూఁడాశ్రమములకంటె గృహస్థాశ్రమమే శ్రేష్ఠ మని యేర్పడుచున్నది శ్రుతిస్మృతు లిట్లె చెప్పుచున్నవి దీనిచే బ్రాహ్మణుఁడై సన్యాసాశ్రమము గైకొనినఁగాని మోక్షము లేదనువాదము నిరస్తమయ్యెను. హీనయోనులం దుద్భవించియు భక్తిచే ముక్తి సాధింప నగునని యు దీనిచేఁ దెలియనయ్యెడిని ఇట్టులేకదా జటాయువు స్వామికిఁగా స్వప్రాణము లర్పించి ముక్తుఁ డయ్యెను అయోధ్యా బృందావనములందలి పశుపక్ష్యాదులును భక్తిచేఁ బునరావృత్తి రహితశాశ్వతపరమపదము నొంద యోగ్యము లయ్యెఁగదా. "సమోఽహం సర్వభూతేషు" అని భగవంతుఁ డెట్లు సమస్త భూతములపట్ల సముఁడో యట్లే భక్తియు సర్వభూతములకు సమానఫలము నిచ్చునదియై యున్నది. కులతారతమ్యముగాని, జాతితారతమ్యముగాని, మతతారతమ్యముగాని స్త్రీ పురుష బాలవృద్ధ విద్యాధన తారతమ్యములుగాని భక్తి యెఱుఁగదు. భక్తికొలఁది ఫలము.

ఈగజేంద్రమోక్షణచరిత్రము ముఖ్యముగ గృహస్థులను ద్దేశించియే చెప్పఁబడినది అన్నియాశ్రమములకంటె గృహస్థాశ్రమము శ్రేష్ఠ మనుట నిర్వివాదవిషయము దీనికై పెక్కు

వాక్యము లేల యుదాహరింపవలెఁ గాని యల్లసానిపెద్దన్న చెప్పిన యొక్క పద్య ముదాహరించినఁ జాలును.

సీ «కెలఁకులనున్నతంగేటి జున్నుగృహమేధి
 యజమానుఁ డంకస్థితార్థపేటి
పండినపెరటి కల్పకము వాస్తవ్యుండు
 దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి[1] కాఁపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
 సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమ ప్రప[2] కులపతి
 యాఁకటి కొదవు సస్యము కుటుంబి.

గీ బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలి కాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె» మనుచ.

గృహస్థులు జీవించినపుడు గృహస్థధర్మము చక్కఁగా యథాశక్తి నడపుచుండిరా పరులకు ననాథులైన వారికి సుఖము వారు మరణించిరా వారికి నాముష్మికసుఖము తక్కిన యాశ్రమములం దన్నిట నిహలోకసుఖము నున్న అవి చక్కఁగ నిర్వహింపఁబడక పోయెనా పరలోకసుఖము హుళిక్కి యథాశక్తి యతిథుల కింతయన్నము పెట్టుచుండిన గృహస్థాశ్రమము

---

[1] వేల్పుగిడ్డి=కామధేనువు. [2] ప్రప=బాటసారులకు మంచినీళ్లిచ్చు చలువపందిలి

సార్థకము గృహస్థాశ్రమమున లోపము జరగినఁ బ్రాయశ్చిత్తము గలదు కావునఁ బతనభయము లేదు దానగుణమునకుఁ దోడు భక్తియు నుండెనా ముక్తికరతలామలకము. ధనముండియు లోభగుణము పనికిరాదు గాని ధనములేమిని దానము చేయకున్న దోషము లేదు దాహము గొన్నవానికి మంచినీళ్లిచ్చినఁ జాలును సర్వకాల సర్వావస్థలందు భగవన్నామ ముచ్చరించుచుండినఁ జాలును. మఱియేదియుఁ జేయవలసినవిధి లేదు

వాస్తవార్థ మిట్లుండ నీకాలమునఁ గొందఱు సన్న్యాసము శ్రేష్ఠమని భ్రమపడి సంసారము విడిచి భ్రష్టు లగుచున్నారు. దారపుత్త్రాదుల భరింపలేక, యప్పులవారిబాధ సహింపలేక వారిని ముంపఁ గోరి, గృహస్థులయింట దినదినము మృష్టాన్నమిష్టముకొలఁది తినవచ్చు ననీ, తేరకు అంకుటాండ్రు దొరకుదురని యాసపడి యిట్టి దురాశయములచేఁ దలలు బోడులు చేసికొని కావిగుడ్డలు కట్టుకొని తిరుగు దొంగసన్న్యాసులమాటయేల కాని వాస్తవముగ నది శ్రేష్ఠమని తలఁచువారివిషయమై కొంత వ్రాయవలసి యున్నది కావున నప్రస్తుతప్రశంస యని పాఠకులు కినియకుందురు గాక.

సన్న్యాసాశ్రమము పుచ్చుకొనినఁ గాని మోక్షము లేదనుట నిరాకరము "న లింగం ధర్మకారణ" మ్మని మనువు వచించె అనఁగా వేషములు చిహ్నములు మోక్షకారణములు కావు అని యర్థము.

కం. “దండమును గాషాయంబును,
　　ముండితయును గమండులువును మోక్షమొసఁగ వె
　　ట్లుండేని లింగములకు న
　　ఖండజ్ఞానప్రపత్వకలనము గలదే”　　భారతము

వీనివలన మోక్షకారణములు చిహ్నములు వేషములు గావని స్పష్టపడియెను　కావున శ్రీకృష్ణభగవానులు (భగవద్గీత ౧౮-వ యధ్యాయము) మోక్షసన్న్యాసయోగమున

శ్లో. “కామ్యానాం కర్మణాం న్యాసం, సన్న్యాసం కవయోవిదుః
　　సర్వకర్మఫలత్యాగం, ప్రాహు స్త్యాగం విచక్షణాః”

కామ్యకర్మములు చేయక మానుకొనుటయే సన్న్యాసము చేసిన సమస్తకర్మములఫలము తత్సచ్ఛ్రహ్మార్పణము స్తని భగవంతున కర్పించుటయే త్యాగము అనిచెప్పెను　త్యాగ మనినను, సన్న్యాస మనినను విడుచుట యనియే యర్థము. కామ్యములైన కర్మములనే చేయక వదలుము　తక్కిన విహితకృత్యములు చేసి వానిఫలమును భగవంతునకు వదలుము అని శ్రీకృష్ణుఁడు బోధించెను. గృహస్థుఁ డీప్రకారము చేసి మోక్షార్హుఁ డగును. భగవంతుఁ డింతతో వదలక (౧౮-వ యధ్యాయమున)

శ్లో “స్వే స్వే కర్మణ్యభిరతః, సంసిద్ధిం లభతే నరః
　　స్వకర్మనిరత స్సిద్ధిం, యథా విందతి తచ్ఛృణు
　　యతః ప్రవృత్తి ర్భూతానాం, యేన సర్వ మిదం తతమ్,
　　స్వకర్మణా త మభ్యర్చ్య, సిద్ధిం విందతి మానవాః.

శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ, కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్
సహజం కర్మ కౌంతేయ, సదోష మపి న త్యజేత్
సర్వారంభాహి దోషేణ, ధూమే నాగ్నిరి వావృతాః.''

భగ. ౪౭-౪౮.

నాలుగువర్ణములవారి స్వభావధర్మములు చెప్పి పిదప భగవంతుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

తా నేవర్ణమందు నేయాశ్రమమం దున్నాఁడో యందుఁ దనకు శాస్త్రీయమైన కర్మ మేదియో దానిని జేయుటచేతనే మనుష్యుఁడు మోక్షమును బొందుచున్నాఁడు తనకర్మము నాచరించువాఁ డెట్లు మోక్షమును బొందు ననెదవా విను. ఎవనివలన సమస్తభూతములు పుట్టుచు నుండుచు లయించు చున్నవో సర్వవ్యాపకుఁ డైనవాఁ డెవ్వఁడో (ఇట్టివాఁడు తానే యనిమతియొకచోటఁ జెప్పెను.) యట్టి భగవంతుని స్వవర్ణాశ్రమమునకుఁ దగిన కర్మములచే నారాధించునట్టివాఁడు మోక్షము బొందును. ఇతరుల ధర్మములను దాను జక్కఁగాఁ జేయుటకంటె, గుణము లేనిదైనను దనధర్మమునందె యుండుట శ్రేష్ఠము తనకు స్వభావనియత మైనకర్మమును జేయుటచేఁ బాపము రాదు దోషయుక్తమైనను సహజముగ వచ్చినకర్మమును వదలరాదు. ఏలన దుఃఖయుక్తముకాని కర్మమే లేదు కర్మారంభములైనను, జ్ఞానారంభములైనను దుఃఖముచే నావరింపఁబడియే యున్నవి.

విదురధర్మవ్యాధాదులవలె దీనివలన శూద్రుఁడు శూద్ర ధర్మమందుండియే తరింపవచ్చును వైశ్యుఁడు వైశ్యధర్మమందుం డియే తులాధారునివలె మోక్షము నొందవచ్చును. క్షత్రి యుఁడు క్షత్రియధర్మమం దుండియే జనకాదులవలె సిద్ధి నొంద వచ్చును బ్రాహ్మణులు బ్రాహ్మణవృత్తియం దుండియే తరింప వచ్చును అట్టులే బ్రహ్మచారి బ్రహ్మచర్యముచేతనే మోక్షము నొందవచ్చును గృహస్థుఁడు గృహస్థధర్మ మాచరించి తరింప వచ్చును ఇట్టులే వానప్రస్థసన్న్యాసులును కావున నిందొకటి యెక్కుడనగాని మఱియొకటి తక్కువగాని కాదు. గాలిలో సంచరించుపక్షులు గాలిలో సంచరించుట సుకరము నీళ్లలో సంచరించుచేఁపలు నీళ్లలో సంచరించుట సుకరము ఏలన వాని కవి స్వభావముచే వచ్చినవి అటుగాక పక్షులు గాలిలో సంచరించుట కష్టము తుపానుబాధ వేఁటగాండ్రబాధనుండి తప్పించుకోవచ్చునని నీళ్లలో దాఁగ యత్నించినను, నీళ్లలోని చేఁప లట్లే యాకాశమున నెవరి కందక హాయిగా సంచరింప వచ్చును బెస్తలబాధ తప్పిపోవు నని యాకాశమున నెగిరిపోవ యత్నించినను నెట్లు చెడిపోవునో యట్లే గృహస్థుఁడు గృహ స్థధర్మము నిర్వహింపఁజాలక సన్న్యాసాశ్రమముఁ గైకొన్నను, సన్న్యాసి గృహస్థువలె మెలంగినను జెడుట సత్యము.

ఏదినమందు వైరాగ్యము జనించెనో యాదినమందే సన్న్యసింపవలయుననుట పూర్వయుగధర్మము కాని యీ యుగ ధర్మము గాదు. ఈవాక్య మెఱుంగకయా పరాశరులు కలి

యుగమున సన్న్యసము నిషిద్ధమని శాసించిరి కలియుగమునఁ బ్రథమదినమునందుండి యిది యవలంబించినఁ గలుగు కష్టము లాలోచించి వ్యాసులు కలియుగమున ౪౪౦౦ సంవత్సరములవఱకు గ్రాహ్యమనియు నావల సన్న్యస మగ్రాహ్యమనియు భారతమున వచించెను. కావున నీకాలమున సన్న్యసాశ్రమస్వీకారము గ్రాహ్యము గాదు.

ఆర్యులారా! ఇహలోకసుఖమును, బరలోకసుఖమును రెంటిని గోరువాఁడు గృహస్థుఁడు మోక్షము నాజన్మమందే కోరువాఁడు సన్న్యసి. యతి చెడిన గతి లేదు గదా అట్టి సన్న్యసినియమములఁ గొన్ని వివరించెదను వానినిబట్టి సన్న్యసము గృహస్థాశ్రమముకంటెను భక్తిమార్గముకంటెను సుకరమేమో మీరే యాలోచింపుఁడు.

ఉపనయనానంతరము ౨౫ సంవత్సరముల ప్రాయము వఱకు గురుకులవాసము గావించి విద్య నేర్చి యావల ౨౫ సంవత్సరములు భార్యతోఁడ గార్హస్థ్యము జరపి యావల ౨౫ సంవత్సరములు వానప్రస్థుఁడై ౨౪ సంస్కారములఁ బొంది విరక్తి యుదయింపకున్నను నావల ౭౫-వ యేఁట సన్న్యసాశ్రమము స్వీకరింపవచ్చును ఇది క్రమమార్గము ఇట్లు చేయువానికిఁ గర్మసన్న్యసి యని పేరు అటుగాక వాస్తవ వైరాగ్య ముదయించెనేని యే యాశ్రమమునందుండియైన సన్న్యసి కావచ్చును వీరు మూఁడు తెగలవారు

పూర్వపుణ్య పరిపాకవశమున వైరాగ్య ముదయించి సన్న్యసించువారు వైరాగ్యసన్న్యసులు.

శాస్త్రజ్ఞానముచేఁ బాపపుణ్య లోకానుభవశ్రవణము చేఁ బ్రపంచమం దుపరతి గలిగి క్రోధేర్ష్యాసూయా హంకారాభిమానాత్మకసర్వసంసారము వదలి దారైషణ ధనైషణ లోకైషణాత్మకమైన దేహవాసన శాస్త్రవాసన లోకవాసన వదలి యీ సర్వము గ్రక్కినకూటివలె హేయముగాఁ జూచుచు సాధనచతుష్టయము సాధించి సన్న్యసించువారు జ్ఞానసన్న్యాసులు

క్రమముగా సర్వ మభ్యసించి యనుభవమునకుఁ దెచ్చుకొని జ్ఞానవైరాగ్యములచే స్వరూపానుసంధానముచే దేహమాత్రావశిష్టులై సన్న్యసించి దిగంబరులై యుండువారు జ్ఞానవైరాగ్యసన్న్యాసులు

ఈ సన్న్యాసు లాఱువిధములవారు గలరు.

౧ శిఖ యజ్ఞోపవీతము దండము కమండలువు గంతగోఁచి ధరించి గంప గడ్డపాఱ చిక్కము గలవాఁడై తల్లిదండ్రులను గురువును సేవించుచు, నొక్కగుడిసెయందుండి యొకయింటియన్నమే తినుచు మంత్రమును సాధించువాఁడు కుటీచకుఁడు. వీఁడు తెల్లని యూర్ధ్వపుండ్రమును ద్రిదండమును ధరింపవలయును.

౨ పైచిహ్నములే కలిగి మధుకరవృత్తి నివసించుచు నెనిమిదికబళముల గ్రాసము మాత్రము దినువాఁడు బహూదకుఁడు.

౩ జడలు ధరించి త్రిపుండ్రము నూర్ధ్వపుండ్రము ధరించి యసంకౢప్త మధుకరాన్నము దినుచు గోఁచితునుక ధరించి యుండువాఁడు హంస యనఁబడును.

౪ శిఖాయజ్ఞోపవీతములు లేక యైదిండ్లలో భిక్షించి దినమున కొకపూఁటఁ దినుచుఁ గరమే పాత్రముగాఁ గలిగి యొక్కగోఁచి యొక శాటి యొక వేణుదండము (వెదురుకఱ్ఱ) గాని యొక శాటీమాత్రము ధరించిగాని సర్వము త్యజించి బూడిదపూసికొని యుండువాఁడు పరమహంస

౫. ఆవువలె నోటితోఁ దినుచు, ఫలాహారిగాని యన్నాహారిగాని యైనపక్షమున నయిదిండ్ల భిక్షించి తినుచు దేహము మాత్రము మిగులునట్లు దిగంబరుఁడై పీనుఁగువలె శరీరవ్యాపారముకలవాఁడై యుండువాఁడు తురీయాతీతుఁడు

౬. నియమము లేనివాఁడై జారులు - హత్య చేసినవారు - కులభ్రష్టులు నగువారిని విడిచి యజగరవృత్తి నవలంబించి యెవ్వ రాహార మిచ్చినఁ దినుచుఁ బరస్వరూపానుసంధానము చేయువా రవధూతలు

సంపూర్ణజ్ఞానవైరాగ్యములు - సర్వభిక్షుకధర్మములు గల కర్మసన్న్యాసులు లేరుగాన నిప్పుడందఱు వైరాగ్యసన్న్యాసులని యే చెప్పవలసియున్నది

ఇట్టివీరు నాలుగుమాసము లొకచో వానకాలమునం దుండవచ్చును తక్కినయెనిమిది నెలలు నేకాకిగ సంచరించుచుండవలయును దినమున కొకసారి తప్ప నాహారము తీసి

కొనరాదు భయపడిన జింకవలె నొకచోట నిలుపరాదు ఈఁదినదులు దాఁటరాదు చెల్లక్కరాదు దేవోత్సవదర్శనము చేయరాదు బాహ్యదేవతార్చనము కూడదు మాధుకరము దిని జీవింపవలెను తృప్తింపవలెను దేహమును బలియు నియ్యరాదు నేతిని నెత్తురువలెఁ జూడవలెను ఏకరాత్రా న్నము మాంసమువలెను, గంధలేపన మమేధ్యలేపనమువలెను, కారము ఉప్పు మాలవానివలెను, వస్త్రమును నెంగిలికుండ వలెను, కోరికను గోమాంసమువలెను, దెలిసినదేశము మాల వాడవలెను, బంగారును స్త్రీని బాముపలెను, గాలకూటము వలెను, సభాస్థలము శ్మశానమువలెను, రాజధానిని గుంభీ పాకమువలెను చూడవలెను కామక్రోధాదులఁ గాల్చి త్రిగు ణాతీతుఁడు కావలెను గ్రామమునం దొకరాత్రియుఁ, బట్నము లందు క్షేత్రములందుఁ దీర్థములందు నైదైదురాత్రు లుండ వచ్చును ఎప్పుడు నొంటరిగా నుండవలయును గాని తోడు రెండవవాఁ డుండరాదు సర్వదా స్వాహాపానుసంధానము చేయుచుండవలెను కుటీచకుఁడు మూఁడుమార్లు, బహూదకుఁడు రెండుమార్లు, హంస యొకసారి స్నానము చేయవల యును పరమహంసకు మానసికస్నానము తురీయాతీతునకు భస్మస్నానము అవధూతునకు వాయవ్యస్నానము సన్న్యాసులు వాహనము లెక్కరాదు కృత్రిమదీపము లుపయోగింపరాదు ఎక్కడఁ జీఁకటిపడునో యక్కడనే పండుకొనవలయును కుటీ చక బహూదక హంసలకు నితరుల కుపదేశించు నధికారము

లేదు హంస పరమహంసలు ధ్యానాధికారులు తురీయాతీతా వధూతులు పరమహంసలకును నుపదేశింప నధికారులు గృహస్థులు భుజించినపిమ్మట సన్న్యాసులు భిక్షకై పోవలయును గృహస్థులతో పాటు గూర్చుంఁడి భుజింపరాదు భిక్షకై తిరుగు వేళ నెవరైన సమ్మానించి నమస్కరించిరా యాదిన ముపవాస ముండవలయును ఇంకను నిట్టినిర్బంధము లనేకములు గలవు ఈకాలమునకు నిషిద్ధమైన యీకష్టమార్గ మవలంబించి భ్రష్టు లగుట మేలో, పతనభయములేక భక్తివైరాగ్యము లవలంబించి భక్తియంగముగాఁగల ప్రపత్తి సాధించుట మేలో బుద్ధి మంతు లాలోచింతురుగాక ఇట్టి ప్రపత్తిలక్షణము మున్ముందు వివరింపఁబడును

ఈ సమాజసభ్యులకుఁ గొందఱకుఁ గల సన్న్యాస ముత్కృష్ట మనుభ్రాంతిని బోఁగొట్టుటకై యింతదూరము వ్రాయ వలసివచ్చెను. అట్లయిన సన్న్యాసము మేలుగాదా యందు రేమో. నిర్వహించుకొ‍న శక్తిగలవానికి నది యొకవిధమున మేలైనదే దానిని స్వీకరించినవాఁడు నేఁటి కొందఱ సన్న్యాసులవలె భ్రష్టుఁడుగాక ముందు వివరించినట్లు సర్వసంగపరిత్యాగము చేసి యేకాకియై విరాగియై యుండునేని సర్వకాల సర్వావస్థల నిరంతరాయముగ భగవద్ధ్యాన మొనర్చుటకు నెంతో సహాయపడును. అంతియే కాని మహావృక్షము కొట్టకొన కొమ్మ నెక్కినవాఁడు కాలు జాఱిపడినట్లు లా గొప్పవ్రతము నుండి పతితుఁ డయ్యెనా యధమాధమలోకములకు నేగు నని

యుపనిషత్తులు చెప్పుచున్నవి ఇప్పు డట్లు రౌరవాదులపాలు గానివా రెందుఁ గలరో. ఇట్లు వీరు భ్రష్టు లగుటయే కాక వీరి పిచ్చిచేష్టలకుఁ దోడుపడు గృహస్థులును జెడియెదరే యని భయపడవలసియున్నది సన్న్యాసాశ్రమముకు దీసికొనకయే జ్ఞానధ్యానవైరాగ్యత్యాగములను గృహస్థాదు లభ్యసించి సంసారముఁ దరించుట బుద్ధిమంతుల లక్షణము ఇట్లు స్త్రీలు పురుషులుగూడఁ జేయవచ్చును. భక్తిని మాత్రము ప్రధానముగా నుంచుకొనవలయును జ్ఞానం సన్న్యాసిలక్షణ మ్మని యుండుటచే బరమభక్తులే నిజమైన జ్ఞానులు నిజమైన సన్న్యాసులు పరమైకాంతులు. ఈకాలమున బ్రాహ్మణులు బ్రాహ్మణ్యమును దక్కించుకొనలేక చెడుచుండఁగా నాలుపైసాల జన్నిదముతో బ్రాహ్మణులమైతి మని కొందఱు సంతసించునట్లు కొందఱు బోడితలలతోను గాషాయవస్త్రములతోను సన్న్యాసుల మైతిమని సంతసించుచున్నారు. వీరికి ముక్తిలేకున్నను భుక్తిలాభము గలదు. మొదటివారి కదియు లేదు. శ్రీభాగవతమున దశమస్కంధమందు యజ్ఞము చేయుబ్రాహ్మణులు తాము కృష్ణు ననాదరించుట తలంచి పరితపించుచు,

చం. "కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధి లేదు
　నేఁ। డిట హరిఁ గానఁ బోనెఱుఁగ మేము దురాత్ముల మేము
　కల్మషో। ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల తపంబు
　లేల ప। ర్యటనము లేల శీలములు యాగములుం మఱి
　యేల కాల్పనే॥"

అని యిట్లు విలపించిరి ఇందుఁ బర్యటన మనఁగాఁ బరి వ్రజనము అనఁగా సన్న్యాస మని యర్థము

శ్లో "ద్వా విమౌ పురుషౌ లోకే, సూర్యమండలభేదినౌ।
పరివ్రాడ్యోగయుక్తశ్చ, రణే చాభిముఖో హతః॥"

యోగయుక్తుఁడై బ్రహ్మరంధ్రము భేదించి పోవు సన్న్యాసియు యుద్ధరంగమున వెన్నీయక పోరాడి యభిముఖుఁడై ఖడ్గమున దెబ్బ దిని యో శిరము ఖండింపఁబడి యో మరణించు వీరుఁడును నిరువురు సూర్యమండలమును భేదించికొని పోవు పురుషు లని కలదు కదా ఇప్పటిసన్న్యాసుల కట్టి శక్తి లేమిని జచ్చినపిదప టెంకాయలతోఁ (కొబ్బెరకాయలతో) దల పగులఁగొట్టుచున్నారు. ఏమిటికో. జీవుఁడు దేహము విడిచి యే యధోలోకమునకో పోయినతరువాత పీఁకఁగుపుఱ్ఱె పగులఁ గొట్టఁగానే జీవుఁడు బ్రహ్మరంధ్రము భేదించికొనిపోయి నట్లగునా? ఇఁకఁ బ్రకృత మనుసరింతము

ఈగజేంద్రునిభక్తిగుఱించి ప్రహ్లాదుఁడు భగవంతునితో నిట్లు విన్నవించెను

మ "తపముల్ వంశముఁ దేజముల్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగముల్। నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములుల్ నిష్ఠాబలప్రజ్ఞలుల్। జపహోమంబులుఁ జాల వీశ్వర! భవత్సంతుష్టికై దంతియూ। థపుచందంబున భక్తిచేయవలయుఁ దాత్పర్యసంయుక్తుఁడై॥"

గజేంద్రునందుఁ దపము వంశము లోనగు నుత్తమగుణములలో నొక్కటియైన లేకుండినను నిండుమనస్సుతో భగవంతునియందు భక్తియుంచినకారణమున నతఁడు మోక్షమున కధికారి యయ్యెను కావున మోక్షమునకు భక్తి ప్రధానము గాని కులగోత్రవిద్యాధనతపోబలాదులు ప్రధానములు గావు జటాయు వెవ్వరు?

ఆ "దనుజ భుజగ యక్ష దైత్యమృగాభీర
సుందరీ విహంగశూద్రశబరు
లైనఁ బాపజీవు లయిన ముక్తికిఁ బోదు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి"

కావున భక్తిప్రపత్తుల కెట్టివారైన నర్హులే

ద్వి "తొలిజన్మమునఁ జేయుదురితంబుకతన
వెలఁదులు కోమట్లు వృషలులు గాఁగ
జనియించినట్టి యేజనులైనఁ గాని
నను నాశ్రయించి యనంత మాగతిని
బొందుచు నున్నారు భ. గీ ౯-౩౨.

ఈగజేంద్రమోక్షణకథను నుదయకాలమునఁ బఠింపవలయు నని శ్రీభాగవతంబునఁ గలదు ఉదయమున ౪-౪½ గంటకు నిద్దుర లేచి హరి హరి యని యేడుమార్లు స్మరించి లేచి కాలు సేతులు కడిగికొని నీళ్లు పుక్కిలించి యుమ్మివైచి యావల నీకథను బూర్ణముగఁ బఠింపవలయును అంత విరామము లేని వారు పోతనరత్నములలోఁ జెప్పఁబడిన స్తుతిపద్యములైనఁ బఠింపవలయును అదియును జేయఁజాలనివారు,

శ్లో. "గ్రాహగ్రస్తే గజేంద్రే రువతి సరభసం తార్క్ష్య మారు
హ్యధావ౯। వ్యాఘూర్ణ౯ మాల్యభూషావసనపరికరో
మేఘగంభీరఘోషః। ఆబిభ్రాణో రథాంగం శర మసి
మభయం శంఖ చాపౌ సఖేటౌ। హస్తైః కౌమోదకీ
మప్యవతు హరిరసా వంహసా సంహ తేర్నః॥"

శ్లో "నక్రాక్రాంతే కరీంద్రే ముకుళితనయనే మూలమూ
లేతిఖిన్నే। నాహం నాహం నచాహం నచభవతిపున
స్తాదృశో మాదృశేషు। ఇత్యేవం త్యక్తహస్తే సపదిసుర
గణే భావశూన్యే సమస్తే। మూలం యః ప్రాదురాసీ
త్సదిశతు భగవా౯ మంగళం సంతతం నః॥"

ఈరెండుశ్లోకము లైనను,

సీ. "గ్రాహంబు దన్నేఁపఁ గరిరాజు దీనుఁడై
కావవే జగదీశ దేవదేవ!
భక్తరక్షాదీక్ష పాహి పాహి యటన్నఁ
గరుణోక్తు లాలించి గరుడు నెక్కి
సరభసంబుగ మాల్యసాధన భూషాళి
వ్యాఘూర్ణ మగుచుండఁ బరువుపాఱి
వారివాహోరు గంభీరఘోషంబున
వచ్చితి భయపడ వల దటంచు

గీ. నభయసూక్తులు పలుకుచు నసిరథాంగ
శంఖఖడ్గగదాఖేటశరశరాస
ధారియై వచ్చి మకరసంహారి యైన
హరి శమించును గాత నాదురితములను."

సీ. "సుకరంబు దన్నేఁప ముకుళితనయనమై
మూల మెవ్వఁడు సర్వభూతములకుఁ
దన్నట్టియీశుండు దయను రక్షించుత
మని ఖేదమున నేడ్వ విని సురాళి
నేఁగాను నేఁగాను నేఁగాను నేఁగాను
లేఁడు మాలో నట్టివాఁ డటంచుఁ
జెయి వీడి వేడ్క వీక్షించుచుండఁగ విశ్వ
విభుఁ డాదిమూలంబు వేగవచ్చి
గీ. భక్తరిత్సాపరత్వంబు ప్రకటముగను
మకరి వధియించి కరిరాజు మనిచినట్టి
రమ్యగుణహారి యాదినారాయణుండు
సకలశుభములు నాకు నొసంగుఁ గాత"

ఈ రెండుపద్యములైనను బఠింపవలయును.

మూర్తీభవించిన తమోగుణము గజము మందబుద్ధి తమోగుణలక్షణము 'గజానాం మందబుద్ధిశ్చ,' యను వాక్యము విశ్రుతమే కదా (బ్రాహ్మణులయం దనేకత్వము, సర్పములం దతినిద్ర, యేనుఁగులయందు బుద్ధిమాంద్యము లోకము మేలుకొంటఁ కేర్పడెనని చాటుశ్లోకము కలదు) అది యునుగాక "మూఢలుబ్ధ కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు" మని కదా యగస్త్యుఁ డింద్రద్యుమ్న మహారాజును శపించెను. ఇఁకఁ జీఁకటియుఁ దమోగుణ సూచకమే చీఁకటిపోయి వెలుతురు వచ్చుసమయము ముదయము అది తమస్సయిన నిద్రనుండి

(యజ్ఞానమునుండి) మేల్కొనుట (జ్ఞానయుక్తుం డగుట) తెలుపును. కావున నప్పు డీ గజరాజమోక్షణము పఠనీయము

చీఁకటిలోఁ గొఱకొఱనిద్రలోఁ గన్నులు పులిమికొనుచు లేచువానికి వస్తువులు యథావస్థితముగ స్పష్టముగఁ గానరావు అట్టులే యజ్ఞానదశనుండి జ్ఞానదశలోనికి రాఁ బ్రారంభించిన వానికి భగవత్స్వరూపము స్పష్టముగఁ దెలియక యో సర్వేశ్వరా! యో సర్వశక్తుఁడా! యో సర్వజ్ఞుఁడా! యని పెట్టి కేకలు పెట్టును. ఈ గుణములుకూడ భగవంతునియందుండుటచే వీఁ డెట్లు పిలిచినను దన స్వరూపముతోనే యాయన కానిపించును. వెలుతురు వచ్చినపిమ్మట సర్వపదార్థములు స్వస్వరూపములతో యథావస్థితముగా నున్నదున్నట్లు కనిపించును దూరముననుండు నొకపురుషుఁడు గుర్తింపరానప్పు డో యయ్యా యో యబ్బీ యో గొడుగయ్యా యని పిలుతుము సమీపమునందుఁ బేరుబెట్టి రామయ్యా పుల్లయ్యా యెల్లయ్యా యని పిలుతుము. ఇట్లులే భగవంతునితోడి నిత్యసాంగత్యముగల భక్తులు పరిచయబలమునఁ బేరుపెట్టి యవయవవర్ణనముతోఁ బిలుతురు తక్కినవారి కట్టి పరిచితి చనువు స్వాతంత్ర్యము లేవు భక్తులకుఁ దక్కినవారికిఁ గల తారతమ్య మిది "జ్ఞానీత్వాత్మైవ" యని చెప్పెను గదా అనుదినము దీనిని స్మరించువారికిఁ గాలక్రమమునఁ దమోగుణము వదలి దైవానుగ్రహమున సత్త్వగుణము వృద్ధి యగును భక్తి యుదయించును. ఆ కారణమున భగవత్ప్రాప్తియు లభించును.

ఈ గజేంద్రుఁడు పూర్వజన్మంబున నింద్రద్యుమ్నుఁ డను రాజై జపనిష్ఠయం దున్నప్పు డగస్త్యమహర్షి రాఁగా జపము చేయునపుడు మౌనము వహింపవలయుననిమాత్ర మెఱిఁగిన వాఁ డగుటచే నా రాజా మునీశ్వరుఁ బలుకరింపక యాదరింపక యూరకుండెను ఆ కారణముచే నగస్త్యుఁడు "మూఢ లుబ్ధ కరీంద్రో త్తమ యోనిఁ బుట్టు" మని శపించెను. ఎట్టినిష్ఠయం దున్నను శిష్టు లగు భాగవతులు వచ్చినపుడు గౌరవింపవల యును గాని యుపేక్షింపరాదు భగవంతునకు భాగవతులకు భేదము లేదు భగవంతు ననాదరించినను భాగవతుల ననాద రింపరాదు

శ్లో "జపమధ్యే గురు ర్వాపి, వైష్ణవో య స్సమాగతః
సంభాషణాదిపూజాంతు, తస్య కృత్వాయమాన్య చ
అనుజ్ఞాప్య తతః కుర్యాత్, జపశేషం సమాహితః
సర్వస్య ప్రభవో యస్మా, ద్విష్ణుపాదాశ్రయా నరాః
తస్మాలతః క్రియా స్సర్వా, స్సఫలాస్తు భవంతిహి"
బోధాయనులు.

తాను జపముచేయుచుండఁగా గురువైనను, వైష్ణవుఁ డైనను వచ్చెనేని జపము చాలించి యాయనను బూజించి సం భాషించి యాయనకార్యము నెఱవేర్చి యావల జపశేషము పూర్తిచేయవలయును విష్ణుపాదాశ్రయు లైన నరులు సర్వమున కుఁ బ్రభువులు వా రనుగ్రహించిన సర్వకార్యములు సఫలము లగు నని యర్థము.

ఒకసారి మనుష్యజన్మమెత్తినవానికి మరల నధమజన్మము లేదనియు, నెంతపాపముచేసినను మరల నధమమనుష్యుఁడు గానే పుట్టును గాని యంత కధమజన్మము రాదనియుఁ గొంద అనుచున్నారు. గజేంద్రకథయు, జడభరతునికథయు రంభా నలకూబరమణిగ్రీవ నృగమహారాజ సహుషకథలు వారివాక్య ములను బొంకుచేయుచున్నవి. దీని కుపనిషత్తునం దీ ప్రమాణ వాక్యములును గలవు.

శ్లో. "ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం,
నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః
నాకస్యపృష్ఠే తే సుకృతేనుభూ
త్వేమం లోకం హీనతరం వా విశంతి"

మూఢులైనవా రలిష్టాపూర్తములే శ్రేష్ఠము లని తలంచి యంతకంటె శ్రేయస్కరము లైనవి తెలియలేక యున్నారు ఇట్టివారు స్వర్గమున సుఖమనుభవించి యీలోకమునో యింత కంటె హీనతరమైనదానినో మరలఁ బ్రవేశించుచున్నారు అని యర్థము.

మహాపాపములఁ జేసి యధమజన్మములకుఁ బోయినవారు మరలఁ బరిణామక్రమప్రకారమే యూర్ధ్వజన్మములకు రావలసి యుండును శాపాదికారణములచే నధమగతులకుఁ బోయినవా రేజన్మమునుండి యధమగతికిఁ బోయిరో యాజన్మమునకో యంత కుత్తమజన్మమునకో వత్తురు వీరి కవాంతరజన్మములు లేవు. కొందఱు నిరాకారబ్రహ్మము శ్రేష్ఠమనియు సాకార

బ్రహ్మము నికృష్టమనియుఁ దలంతురు అట్టివారు సత్యము దెలిసినవారు గారని యీచరిత్రము దెలుపుచున్నది. గజేంద్రుఁడు ధ్యానించినది నిరాకారబ్రహ్మమునే. ఆయనకు సాక్షాత్కరించి యనుగ్రహించినవాఁడు లక్ష్మీశంఖచక్రాదివిశిష్టుఁడైన నారాయణమూర్తియే

శ్లో "యే త్వక్షర మనిర్దేశ్య, మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యంచ, కూటస్థ మచలం ధ్రువమ్
సన్నియమ్యేంద్రియగ్రామం, సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్నువంతి మామేవ, సర్వభూతహితేరతాః."

ద్వి "అరసి నిర్దేశింప నలవి గానిదియుఁ
బరఁగుచునంతట వ్యాప్తమౌనదియుఁ
దెలియంగరానిది, స్థిరమైనయదియుఁ
జలియింపనిది, యెంచశక్యముగాని
దియును గూటస్థమై దీపించునదియు
నయిన యక్షర మింద్రియ గ్రామములను
జక్కఁగ నియమించి సర్వంబునందు
నొక్కటి యౌబుద్ధి యొప్ప నెవ్వార
లన్నిభూతముల హితాసక్తి వఱలు
చున్నారొ వారొందుచున్నారు నన్నె"
ద్వి భ గీ ౧౨ అధ్యా.

అను భగవద్వాక్యములు యథార్థపడియెను

దుశ్శాసనుఁడు తనచీర లొలుచునపుయంబునఁ దన ప్రయత్నముచేఁ దనమానమును గాపాడుకొనఁ జేతనైనం తస్వసామర్థ్యంబున యత్నించియుఁ దనకు బలిష్ఠుఁడైన దుశ్శాసను దుష్కృత్యము దుర్నివారమని తలఁచి

శ్లో "హాకృష్ణ! ద్వారకావాస! క్వాసి యాదవనందన
ఇమామవస్థాం సంప్రాప్తాం, కి మనాథా ముపేక్షసే"

కృష్ణా! ద్వారకావాస! యాదవరత్నమా! యెందున్నాఁడవు ఇటువంటి దురవస్థ ప్రాప్తించిన యీ దిక్కులేని దాని నేల యుపేక్షించితివి

అని భగవంతు వేఁడిన ద్రౌపదివలెనే, కరిరాజును దన సామర్థ్యముకొలఁది మొసలితోఁ బెక్కువేలసంవత్సరములు యుద్ధముచేసియుఁ దనకు దానిని జయింపఁ దనకు నసాధ్యమని తోఁచి భగవంతునే "నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నిం పందగుం దీనుని రావే యీశ్వర" యని ప్రార్థింపఁగా నప్పుడు భగవంతుఁడు రక్షింపవచ్చెను కావున భక్తుఁడు శరణాగతుఁడు కేవల భగవత్పరతంత్రుఁడు ననన్యగతికుఁడు (మఱి యొకరక్షకుని లేనివాఁడు) దీనుఁడై యుండవలయునని యేర్పడుచున్నది స్వాతంత్ర్య మేమియుఁ బనికిరాదు కొంచఱు గజేంద్రుఁడు జ్ఞానియే కావుననే యూరుపేరుచెప్పక భగవంతుని ధ్యానించె నందురు అవుఁగాక "జ్ఞానీతు పరమైకాంతి" యన్నట్టు నిజమైనజ్ఞాని పరమైకాంతియే అది గజేంద్రుని చరిత్రమువలననే స్పష్టపడుచున్నది. గజేంద్రుఁడు కొంచఱు

చెప్పినట్లు శుష్కవేదాంతియే యైయుండినయెడల భగవంతుఁ డొకఁడు రక్షకుఁ డున్నాఁడని, తాను రక్ష్యుఁ డని (రక్షింపఁ బడువాఁడని) భక్తి సాధన మని తలఁచియే యుండఁడు "అహం బ్రహ్మాస్మి" నేనే బ్రహ్మమని యూరకుండును. గజేంద్రుఁ డట్లు చేయలేదు కదా గజరాజునకు వచ్చిన విపద్దశవంటి విపద్దశ శ్రీశంకరాచార్యులవారికిఁ బ్రాప్తించినపుడు తత్త్వమసి యని కాని అహం బ్రహ్మాస్మి యనికాని ధ్యానింపక లక్ష్మీనృసింహా మమ దేహి కరావలంబ మని కదా ధ్యానించి భగవంతునిచే రక్షింపఁబడి జీవింపఁగలిగిరి కావున భక్తిలేనిజ్ఞానము వ్యర్థము.

అయ్యా ద్రౌపదిని గజరాజును బోల్చి చెప్పితివి ద్రౌపదిని శ్రీకృష్ణభగవానుఁలు సంకల్పముచేతనే రక్షించెఁగదా అట్లులే మకరిని జంపుటకు భగవంతుఁడు చక్రమును బంపినఁ జాలునే తానై యేల రావలయును? అంబరీషునివిషయమం దట్లే వర్ణించెఁగదా? యని మీ రడుగవచ్చును.

ద్రౌపది గోరినది మానరక్షణము మాత్రమె ఆ కార్యము చేయుటకు భగవంతుఁడు ప్రత్యక్షముగ రావలసినపనిలేదు గజేంద్రుఁడో మరణమే నాకు లభించునేని మరల నాకు జననము లేకుండఁ జేయు మని భగవంతుని శరణుచొచ్చెను శాపాంత కాలము, దేహావసానకాలము, భక్తిపరిపక్వమైనకాలము, తటస్థించెను. భగవంతునికిఁ జేసినశరణాగతి వ్యర్థము పోరాదు. సఫలమే కావలయును. గజరా జార్తప్రపన్నుఁడు కాని దృప్తుఁడు కాఁడు. అట్టివానికి ఫలము వెంటనే కలుగవలయును. అర్చి

రాదిమార్గమునఁ బ్రయాణము తక్కినవారికే గాని యార్త ప్రపన్నునకుఁ గాదనియుఁ, బ్రపన్నునిఁ గొనిపోవ భగవంతుఁడే వచ్చుననియు సీతోపదేశంబున వివరించితిని. దాని నిపు డను సంధించునది.

భగవంతుఁ డెవ్వరి నేవిధముగ ననుగ్రహించునో యది చెప్పుటకు మనకు సాధ్యమగునది కాదు. భగవత్సాక్షాత్కారము భక్తివలననే యగునుగాని మఱి యేయుపాయముచేతను గాదు.

శ్లో. "నాహం వేదై ర్న తపసా, న దానేన నచేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం, దృష్టవానసి మాం యథా॥"
భగ. ౧౧-౫౩.

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య, అహ మేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన, ప్రవేష్టుంచ పరంతప॥"
భగ ౧౧-౫౪

వేదాధ్యయనముచేతను, దానముచేతను, దపస్సుచేతను, యాగములచేతను, నీవు చూచిన నా రూపమును జూడ సాధ్యుఁడనుగాను అర్జునా! యితరప్రయోజనమును గోరని భక్తిచేతనే తెలిసికొనుటకుఁ, జూచుటకుఁ, బ్రవేశించుటకు సాధ్యపడుదును. అని యర్థము. దర్శనయోగ్యత గలుగునే కాని తప్పక దర్శనమగునని చెప్ప వలనుపడదు ఆయన కెవరియం దనుగ్రహబుద్ధి పొడమునో వానికిమాత్రమే తనస్వరూపమును గానఁజేయును.

"నా యమాత్మా ప్రవచనేన లభ్యో
నమేధయా నబహునా శ్రుతేన
యమే వైషవృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ " కఠ

కావునఁ దల్లులారా తండ్రులారా భగవంతునియెడ ననన్యభక్తి గలిగి దర్శనయోగ్యత సంపాదించుకొని భగవదనుగ్రహమునకుఁ బాత్రుల రగుదురు గాక.

వాసుదాసుఁడు.

## —శ్రీకోదండరామసేవక సమాజనియమములు—

౭ పెద్దవారియందు వినయవిధేయతలుగలిగి ప్రవర్తింపవలయును ఇహమునందును బరమునందును శ్రీరామానుగ్రహమున బాగుపడనున్నవారియందు వినయవిధేయతలు ముఖ్యచిహ్నములై కానవచ్చును వినయవిధేయతలు గలవారు పెద్దలయాశీర్వచనములకు లోకులసదభిప్రాయములకుఁ బాత్రులగుదురు. ఇట్టివారియం దందఱకు మంచియభిప్రాయమే యుండును కావున నితరులవలన వీనికిఁ గావలసినకార్యములు సులభముగా నగును. వీరు లోకుల కందఱకు మిత్రులే యై యుందురు. ఎవ్వఁడో పరమపాపి తప్ప వీరిపై నెవ్వరు ద్వేషింపరు గర్వమును సమూలముగ నాశము చేయఁగలవి వినయవిధేయతలకంటె శ్రేష్ఠములైనవి వేఱొండులేదు వీనిచే నహంకారము చచ్చును అహంకారము నొక్కదానిని జయించినవాఁడు మూఁడులోకములు జయించినవాఁడే యగును. నిక్కడువారిని

దలపై మొట్టువా రందుకు గాని మ్రొక్కెడువాని ముంజేతులు గోయువారు లేరు శత్రువు లయినను క్షమింతురు వినయ వంతునకు మనస్సు సర్వదా ప్రసన్న మయి యుండును.

గీ విద్య యొసఁగును వినయంబు, వినయమునను
బడయుఁ బాత్రతఁ, బాత్రతవలన ధనము,
ధనమువలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మికంబుల నందు నరుఁడు　　భార.

విద్య యనఁగా నిప్పుడు పాఠశాలయందు మనపిల్ల కాండ్రు చదువునది కాదు. అది విపరీతవిద్య గావున విపరీత ఫలమునే యిచ్చుచున్నది. 'విద్యయాఽమృతమశ్నుతే' యని యుండుటచే మోక్షకారణ మైనజ్ఞానమును గలిగించునది విద్య. ఈవిద్య గ్రంథపఠనముచేతను, సద్గ్రంథముల వినుటచేతను, పెద్ద వారిబోధమువలనను రావచ్చును. కావునఁ జదువుటకు వ్రాయు టకు రాకపోయినంతమాత్రమున విద్యాహీనులని చెప్పరాదు చదివినవానికంటెఁ జాకలవాఁడు మే లనుసామెతగలదు గదా. కావున సద్విద్యాఫలము వినయము. దీనివలననే యైహిక సుఖము, ఆముష్మికసుఖము లభింపఁగలవని భారతము బోధించు చున్నది.

భక్తి ప్రపత్తులందు వినయవిధేయతలు ముఖ్యాంగము లుగా నాశాస్త్రములు చెప్పుచున్నవి. దీనినే నైచ్యానుసం ధాన మందురు అనఁగా భక్తుఁ డైనవాఁడు తానే తక్కిన యందఱికంటె నికృష్టుఁ డనియు నందఱు తనకంటె గొప్పవా

రనియుఁ దనకంటె నీచుఁడు లేఁడనియు నెంచి యణఁగి మణఁగి యుండుట. కావుననే

శ్లో ॥ "త్వద్భృత్య భృత్యపరిచారక భృత్యభృత్య
భృత్యస్యభృత్య ఇతి మాం స్మరలోకనాథ"

నీ భృత్యానుభృత్యులకు భృత్యుఁడని జగదీశ్వరా! నన్ను జ్ఞప్తియందుంచుకొనుమని కులశేఖరులు ముకుందమాలయందు వచించిరి వేదాంత దేశికు లను పరమభక్తుఁడు భిక్షించి జీవనము చేయుచుండెను ఈయనను బరిభవింపవలయు నని యొక వైష్ణవుఁడు తన వాకిటికడ్డముగాఁ జెప్పులతోరణము గట్టెను బిచ్చమునకై యింటిలోఁ బ్రవేశించునపుడా చెప్పులు తలఁ దగిలినఁ జెప్పుతోఁ గొట్టిన ట్లగునని యా పాపి తలఁచెను. వేదాంత దేశికు లాయభిప్రాయము గ్రహించి

శ్లో. "కర్మావలంబినః కేచి, త్కేచి జ్ఞానావలంబినః
వయం తు విష్ణుభక్తానాం, పాదరక్షావలంబినః"

అని చెప్పుచు నా చెప్పులు తల దగులుచున్నను నింటిలోపలఁ దూరెను. కొందఱు మోక్షము సంపాదింపఁ గర్మయోగము సాధనముగాఁ గొందురు. కొందఱు జ్ఞానయోగమాధారముగఁ గొందురు మేమో విష్ణుభక్తుల పాదరక్షల నాధారముగఁ గొందుమని పై శ్లోకమున కర్థము. అహంకారమెంతయో నశించినఁ గాని యిట్టివాక్యము నోరవచ్చునా? "వీధిశోధనకింకర" యని భగవంతుఁడు పోవుమార్గమునఁ గసవూడ్చువాఁడనని మఱియొకరుచెప్పిరి.

కావున వినయవిధేయతలు సాధించుట ముఖ్యకార్యము. ఈకాలమునఁ గొందఱు తాము పొడుగుగఁ బెరుఁగుటచే గొప్పవార మైతిమని తలంచి (జ్ఞానముచేఁగాదు) తల్లిదండ్రులకు గురువులకు నింతయేల దేవునకే నమస్కరించుటకు సిగ్గుపడు చున్నారు జ్ఞానము గొప్పతనము లక్షణము గాని పొడుగుగాఁ దాటి మ్రాఁకువలెఁ బెరుఁగుట గాదు కావున వాస్తవముగ బాగుపడఁగోరినవారు వినయవిధేయతలు గలవారై బాలురు బాలికలు ప్రతిదిన ముదయమున నింటిలోని పెద్దవారికిని, పుత్రులు పుత్రికలు తల్లిదండ్రులకును, భార్యలు భర్తలకును, సాష్టాంగముగఁ నమస్కరింపవలయును గురువుల యొద్దకుఁ బోయినపుడు దేవతాసన్నిధానమందు నట్లే నమస్కరింపవల యును తక్కినవారికిఁ గేవలనమస్కారము చాలును.

ప్రత్యక్షదైవతము లయిన తల్లిదండ్రులకు, గురువునకు, భర్తకు నమస్కరింపనివారు పరోక్షదైవతమున కెంత శ్రద్ధాభక్తు లతోఁ నమస్కరింపఁగలరు కావున స్వశ్రేయస్కాములు దీని నుపేక్షింపకుందురుగాక.

౮ భజనచేయక గాని, కీర్తనలు పాడక గాని, రామా యణభాగవత భక్తవిజయ విష్ణుపురాణాది భక్తిగ్రంథములఁ జదివి కాని, చదివించి విని కాని, భక్తులతోడ నగరసంకీర్తనలు పాడి కాని, వీనిలో నాకేది సాధ్యమో యది చేయక నిద్రిం పను, ఏదియు నాకుసాధ్యము కాదేని నిద్రకుముందును, నిద్ర లేవఁగానే ౧౦౮ మార్లు సీతారామ సీతారామ యని జపింతును.

ఇది స్పష్టముగ నున్నది కావున దీనిని గుఱించి విశ్లేషించి వ్రాయవలసినగిలేదు

౯. ఏకాదశినాఁడు నాశక్తికొలఁది వంచనము లేక జాగరణము నుపవాసము చేయుదును అమావాస్యనాఁడు నాతోడ భజనము చేయువారు దొరకిరేని యట్లు చేయుదును లేక భగవద్ధ్యానము చేసెదను.

ఏకాదశివ్రతముగుఱించి రుక్మాంగదచరిత్రమందు విపులముగ వ్రాయఁబడియుండుటచే మరల నిచట వ్రాయవలసిన పనిలేదు బాలురు వృద్ధులు రోగులు గర్భిణు లుపవాసము చేయఁబనిలేదు భర్తయాజ్ఞలేక ముత్తైదువులు నిత్రుపానము చేయరాదు అమావాస్య విషయమై కొంత చెప్పవలసియున్నది

శ్లో "అమావాస్యా త్వమావస్యా, దర్శ స్సూర్యేందుసంగమః।
అమావాస్య - అమావస్య - దర్శస్సు - సూర్యేందు సంగమము ॥"

ఇవి యమావాస్యకుఁ బేర్లు

అమా సహ వసతః రవిచంద్రౌ అస్యా మి త్యమావాస్యా అమావస్యాచ-వసనివాసే. దీనియందు సూర్యచంద్రులు కూడఁకొనియుందురు తక్కినశబ్దములకు నీయర్థమే గ్రహింపవలయును సూర్యచంద్ర సమాగమదినమే యమావాస్య. కావుననే చంద్రుఁడీదినమునఁ గానరాఁడు. ఇది మనకుఁ బ్రత్యక్షవిషయమే.

ప్రత్యక్షమైన వాస్తవవిషయమును నాధారము చేసి కొనియే దానివలనఁ దత్త్వము గ్రహింపఁబడునే కాని తత్త్వమును సూచించుగాథ లసత్యములు గావని మున్నొకచోఁ దెలుపఁబడెను గదా. ఇప్పుడు దీనివలన నధ్యాత్మవేత్తలు యోగులు నేర్చుకొనవలసిన దేమో యోజింతము. ప్రవృత్తి మార్గమం దుండువా రీదినమునఁ బితరుల నుద్దేశించి తర్పణాదులు గావింతురు

నివృత్తిమార్గమం దుండువారికిఁ గర్తవ్య మీయమావాస్యసూర్యేందుసంగమ మనుశబ్దములే బోధించుచున్నవి

ఇడాపింగళానాడులకుఁ జంద్రసూర్యనాడు లని యోగశాస్త్రమునఁ బ్రసిద్ధము అట్టులే సుషుమ్నకు మధ్యనాడి యనియు బ్రహ్మనాడీ యనియుఁ బేరులు గలవు సామాన్యముగఁ బ్రాణాయామమున పూరక కుంభక రేచకము లను మూఁడును గలవు ప్రాణాయామమందుఁ గుంభకము సాధింప రేచకపూరకములు కొంతకాలమువఱకు సహాయములగుటచే గౌణములే కాని ముఖ్యములు గావు. ముఖ్యమైనది కేవలకుంభకమే. దీనిని సాధించినవాఁడే ధన్యుఁడు. ఇందు రేచకపూరకములు లేవు. ఇది సాధింపనివాఁడు సార్థకయోగి కాఁడు.

వాసుదాసుఁడు రామభిక్షకై గ్రామసంచారము చేయునపు డొక గ్రామమునఁ గేవలకుంభకము సాధించినయోగి యున్నాఁడని విని యాయనయింటికిని భిక్షమునకై పోయినపు

డాయనను జూచెను ఆయోగి స్థూలకాయుఁడు. సిద్ధిపొట్ట
వాఁడు యోగిలక్షణము లివి కావు ఇప్పు డొకఁడు యోగీ
శ్వరుఁడ నని పేరు పెట్టుకొని చెన్నపురి ధూమశకటఘట్టము
నొద్ద నొకయింటఁ గొన్నిదినంబులుండి వెడలివచ్చి నలువది
దినములు భూమిలోనుండి లేచి వచ్చితి నని పత్రికలు పల్లె
టూళ్లలఁ బ్రచురించెను అట్లు చేయుటకుఁ బ్రభుత్వము వారి
యనుమతి కానలయును అట్టిదేదియుఁ గానరాదు ఇటువంటి
వా రిప్పుడు పల్లెటూళ్లజనముల నానావిధముల మోసగించు
చున్నారు.

కేవలకుంభకమం దుచ్ఛ్వాసనిశ్వాసములు రెండును
లేవు. ముక్కులవెంట గాలి రాను రాదు. పోను బోదు. ఎంత
సేపైనను గడుపు కదలదు లోపలికిఁ బోదు వెలుపలికి రాదు
అధమపక్షమున ౨౪ నిమిషములైన నిటులుండలేనివాఁడు
కేవల కుంభకము సాధించినవాఁడుకాఁడు. కావున సమాజ
మునఁ జేరి యోగ మభ్యసించుస్త్రీలు పురుషు లీయవధి
సాధింప దృఢప్రయత్నము చేయవలయును ఇది ప్రథమమందు
రాదు. ఆహారనియతి కలిగి యాసనము జయించి లఘుప్రా
ణాయామమును సాధించి యుత్తమప్రాణాయామము ప్రారం
భించి దానియందుఁ గొంతకాలము శ్రమింపవలయును వారి
వారిపట్టుదల అభ్యాసక్రమము శ్రద్ధాభక్తులకొలఁది కాలము
పట్టును ఇది సాధించినసర్వము సుకర మగును.

ఇట్లూపిరి బిగఁబట్టి కూర్చుండినఁ జాలునా? మఱేమైనఁ
జేయవలసిన దున్నదా? యని సభ్యులు ప్రశ్నింపవచ్చును.

మీఁదఁ జెప్పినది సూర్యేందుసంగమము ఇందు నిడాపింగళలు భ్రూమధ్యమందుఁ గలయుచు దీనికిఁ జేరికగా నమావాస్య చేయవలయును. అకారమకారములకూడిక దేనియందుఁ గలదో యది యమావాస్య యని యర్థము

అకారో నారాయణస్య ప్రథమాభిధాన మ్మన్నట్లు అకార మనునది నారాయణునకుఁ బేరు మకారో జీవవాచక యన్నట్టు మకారమునకు జీవుఁ డని యర్థము అకారమకారముల కూడిక యనఁగా జీవాత్మపరమాత్మల యైక్యము దీనినే యుపనిషత్తు లన్నియు బోధించును

"బ్రహ్మణే త్వా మహ స ఓ మిత్యాత్మానం యుంజీత"
శ్లో "ప్రణవో ధను శ్శరోహ్యాత్మా।
బ్రహ్మో తల్లక్ష్య ముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం।
శరవ త్తన్మయో భవేత్ ॥"

ఏకాదశీమాహాత్మ్యముతో నమావాస్య సాధించువాఁడే సార్థకజన్ముఁడు. మూఁడవ సోపానమునకు వచ్చినవారి కిది సాధ్యము గాని యితరులకుఁ గాదు. నియమమం దుండువిశేషము తెలుపవలయును గావున వ్రాయఁబడియెను. తక్కిన వారు ౯-వ నియమమందున్నంత పైకిఁ దెలియవచ్చినంత చేసినఁజాలును పూర్వవయస్సున నుండుస్త్రీలు పురుషులు నియమము వహించి దృఢసంకల్పులై యోపిక-యోర్పు-పట్టుదల-శ్రద్ధా-భక్తిగలవారై దంభాహంకార లజ్జాభిమానాదుల

మాని యేకచిత్తముతో నభ్యసించిరేని దైవసంకల్ప మనుకూ లించిన నీజన్మమందే సిద్ధి లభించును కష్టముకొలఁది ఫలము.

అకారమకారములకూడిక అమావాస్య యనియు దీనికి నేకాదశీసాహాయ్యము గావలయుననియు మీఁదఁ జెప్పఁబ డెను. ఏకాదశేంద్రియము మనస్సు ఏకాదశినాఁ డుపవాస మనఁగా మనస్సున కాహార మీయకుండుటయే.

ఇంద్రియముల మూలమున మనస్సు విషయము లనెడునాహారము గ్రహించును కావున విషయేచ్ఛ మాను టయే మనస్సున కుపవాసము ఇది నిట్రుపాసె మయినచో మిగుల శ్రేష్ఠము ఇట్టి శుష్కోపవాసమునకు శక్తిలేనివారు సాధ్య మైనంతవఱకు విషయేచ్ఛాహారమును దగ్గింపవల యును. శక్తికొలఁది యెంత తగ్గించిన నంత మేలుగలదు అన్నివ్రతములలో శ్రేష్ఠమైన దీయుపవాసవ్రతమె ఇదియే తపస్సులం దుత్తమ మైనది దీనివలన నింద్రియములు మనస్సు నశపడును. ఇట్లు మనస్సు వశపడినవానికే యమావాస్య సాధ్యపడును మనస్సును స్వాధీనపఱుచుకొనకుండినవాఁడు పాపాత్ముఁడగును గావుననే యేకాదశీవ్రత మాచరింపకుండిన దోషమని పురాణాదులు చెప్పుచున్నవి మనస్సును జయించిన వాఁడే పుణ్యాత్ముఁడు వాఁడే యోగి. చిత్తవృత్తినిరోధమే కదా యోగము. దాని కీవ్రత ముత్తమసాధనము. మనస్సు చెవులవలన శ్రావ్యమై మధురమైనధ్వని యనునాహారమును గ్రహించును మృవస్తుదర్శనము నేత్రముల కాహారము.

కమ్మనివాసన నాసికకాహారము. ఇంపైనభోజనము జిహ్వ
కాహారము గంధముపూఁతలు-పూలసరములు-విలువగల వలు
వలు లోనైనవి చర్మమున కాహారము ఈ యాహారములను
గోరక వీనికి విముఖుఁడై యుండుటే మనస్సును బస్తుంచుట.
మనస్సును వీనిమీఁదఁ బోనీయరాదు ఇది యేకాదశినాఁటి
యుపవాసలక్షణము ఇట్టి యుపవాసముండక కేవలము కడుపు
గాల్చినంతమాత్రమున విశేషప్రయోజనము కలుగదు. అయిన
నాహారమును దీసికొనకుండుట వ్యర్థమా యందురేమో వ్యర్థ
మెన్నఁటికినిగాదు. బాహ్యమును సాధింపలేనివాఁ డంతరిం
ద్రియమును సాధించుననుట కల్లమాట బాహ్యేంద్రియ
ములు వశపడినవానికే యంతరింద్రియము వశపడునుగాని
తక్కినవానికి వశపడదు ఆస్తికులు తప్పఁ దక్కినవా రెవ్వ
రైనను పైకి మే మెట్లుండిననేమి? ఏమి తినిననేమి? లోపల
శుద్ధముగా నున్నవారమని చెప్పుచు దురాచారములకు దుష్ట
భోజనములకు, దుశ్చేష్టలకుఁ బాలుపడియుండువారు దొంగ
లని మోసగాండ్రని నమ్మవలయును. ఆస్తికులైనను వారి
కనావశ్యకములైన విహితకర్మములను మానుదురుగాని శాస్త్ర
విరుద్ధకార్యముల నెన్నఁటికిని జేయరు కావున నేకాదశినాఁడు
భుక్తి మానుటయు నావశ్యకమే

ఏకార్యముచేసినను త్రికరణశుద్ధి యుండవలయును మ
నస్సు-వాక్కు-దేహము వీనికిఁ ద్రికరణము లనిపేరు. మన
స్సున నేమి తలంతుమో యేది నిజమని నమ్మెదమో దానినే

నోరఁ జెప్పవలయును నోరఁ జెప్పినట్లు కార్యమును జేయవల యును మనస్సులో ననుకొనునది యొకటి, నోరఁ జెప్పునది మఱియొకటి, చేతఁజేయునది వేఱొకటిగా నుండరాదు దీనికి త్రికరణశుద్ధి యనిపేరు. సన్న్యాసివేషము వేసినవాఁడు జ్ఞాన భక్తివైరాగ్యత్యాగములగుఱించియే ప్రశంసించుచుండవలయు ను సర్వదా భగవంతునే ధ్యానించుచుండవలయును అంత రంగికత్యాగము నుండవలయును గాని యింద్రియలోలుఁడై యుండరాదు కార్యములు చేయునపుడు కార్యములందే మన స్సుండును కావున విషయరుచినిగాని త్యాగియై కార్యములు చేయుచుండినచో మనస్సు దానియందే లయించును అటు గాక సన్న్యాసి నని పేరుపెట్టుకొని వేషమును వేసికొని యిం ద్రియచపలత్వము మానక-స్త్రీసాంగత్యము వదలక-యిష్టమృష్ట దుష్టాన్నముల భుజించుచు స్వైరసంచారము మానఁడేని వాఁడు భ్రష్టుఁడు పతితుఁడే కాని సన్న్యాసి గాఁడు ఏలయందురా? మన స్సీకార్యములయందే కదా యుండును అట్లైనచోఁ బామ రునకు వీనికి నేమి భేదము? దొంగవేషముమాత్రమే భేదము. మనస్సు శుద్ధ మగుటకు నశుద్ధ మగుటకు నాహారము కార ణము. సాత్త్వికాహారము తినువారిమనస్సు సత్త్వగుణవిశిష్ట మయియే యుండును తామసాహారము తినువారిమనస్సు తమోగుణ విశిష్టమయియే యుండును కావున మనస్సు శుద్ధ ముగ నుండఁగోరువారు సాత్త్వికాహారమునే భుజింపవలయును. సాత్త్వికకార్యములే చేయవలయును. సాత్త్వికగుణము నేల

యభ్యసింపవలయును. సాత్త్వికసంభాషణమే చేయవలయును తక్కినవన్నియు మూలముట్టుగ వదలవలయును అట్టివారికే యమావాస్య సుసాధమగుచు

౧౦-వ నియమము

సమాజమున కపకీర్తి దెచ్చు కార్యము దేనిని జేయను.

తమత్రేయస్సుగోరు సమాజసభ్యులకు ౯-వ నియమ మెంతముఖ్యమో యీనియమము సమాజమున కంత ముఖ్యము

"ప్రారబ్ధేతరపూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరం న్యాసేన క్షపయన్" అన్నట్టు భగవంతుని శరణుచొరఁగానే యాగడియకు ముందువఱకు చేసిన పాపములు, పొరపాటున నావలఁ జేయు పాపములు హరణమగును. ఆరీతినే యీసమాజములోఁ జేరుటకు ముం దెట్టినడవడిగలవారైనను ఆవిషయము గమనింపఁబడదు మంచిమార్గము తెలియక యూరకున్న వారిని, జెడినవారిని, జక్కఁబఱుపఁ దగునుగాని మంచిమార్గమం దే యుండుభక్తులను జక్కఁబఱుచున దేమున్నది మొదటివారీసమాజములోఁ జేరుట తాము బాగుపడుట కనియు రెండవవారు చేరుట సమాజమునకుఁ గీర్తి తెచ్చుటకును దోడివారిని జక్కఁజేయుటకును ననియు నెఱుంగవలయును రెండవవారు సమాజమునందుఁ జేరఁ బ్రార్థింపఁబడుదురుగాని మొకటిరకము వారు ప్రార్థింపఁబడరు. వారిమేలు వారు చూచుకొనవలయును.

భగవంతుఁ డెట్టివారిని బాగుపఱుపఁగోరి, వారికిఁ దాము బాగుపడవలయునని బుద్ధి పుట్టించి యీ సమాజమందుఁ జేరి విధుల ననుసరించి వర్తించిన బాగుపడుదు మనుదృఢ మైన నమ్మకము కలుగునో వారుమాత్రమే యిందుఁ జేరవలయును. ఇట్టివారు బుద్ధిపూర్వకముగ మరలఁ జేయరానికార్యములను జేయరు వెనుకటిగుణ మేల మాను వినరా సుమతీ యని యఘోరప్రారబ్ధ మడ్డపడ మరలనట్టియకార్యములఁ జేసిరేని యావిషయము సమాజసభ్యుల కందఱకుఁ దెలిపి "అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శేషాంగశ్రేణికి రక్ష సేయుక్రియఁ" జేయఁబడును హెచ్చరికగా నిది చెప్పవలసి చెప్పఁబడెనేకాని యితరము కాదు. ఇట్టివా రీసమాజమున లేరు. కలుగఁబో రనినమ్మెద

ఏరోగమునకైనను మందు, అనుపానము, ముఖ్యములు. అట్టులే భవరోగమునకు నౌషధము అనుపానము సేవించు విధముఁ దెలుపఁబడెను ఈమాత్రము నియమము లనుష్ఠింప లేనివా రీసమాజమునఁ జేరఁ బనిలేదు. నిశ్శేషముగ రోగము శమించువఱకు నౌషధసేవ మానరాదు అట్టులే భవరోగ మునకు మనోలయము పూర్ణముగఁ గావలయును అంతవఱకుఁ బైవిధులు మానరాదు అభివృద్ధికి రాఁగోరినవారు దినచర్య వ్రాయుచు భక్తిప్రసూనమాలికాగ్రంథములు హితచర్యాగ్రంథములు ముఖ్యముగఁ జదువవలయును

## బ్రాహ్మణుల కార్త్మావలోకనము

పూర్వసంచికయందు బ్రాహ్మణత్వ దుర్లభత్వమును గుఱించి లక్షణోక్తులు కొన్నివచింపఁబడెను. అది యెంతటి కష్టసాధ్యమైనది నిదర్శనరూపముగఁ దెలిపెదను స్మృతీతిహాసపురాణము లన్నిశోధించినను జన్మముచే బ్రాహ్మణుఁడుగానివాఁడు కర్మముచే బ్రాహ్మణత్వమును సంపాదించుట దుర్ఘటమని తెలుపు నొక్క విశ్వామిత్రచరిత్రమే కానవచ్చుచున్నది.

## విశ్వామిత్ర చరిత్రము

బ్రహ్మదేవునకుఁ గుశుఁ డనునొకకుమారుఁడు కలఁడు. ఆయన క్షత్త్రధర్మమం దాసక్తి కలవాఁడై కుశాంబుఁడు, కుశనాభుఁడు, అధూర్తరజసుఁడు, వసు వనునలుగురుకుమారులఁ గని వారిని బ్రజాపాలనమందు నియోగించెను. అందుఁ గుశనాభునకు గాధియనుకుమారుఁ డుదయించెను ఆరాజునకు సత్యవతి యనుపుత్త్రిక కలిగెను ఆమెను భృగువంశమునఁ బుట్టిన ఋచికుఁ డనుమహర్షి కిచ్చి వివాహము గావించెను. ఈ ఋచికుఁడు తనకుఁ గుమారుఁ డుద్భవింప హోమము చేయఁదలంచెను. అప్పుడు సత్యవతితల్లి తనయల్లునిమహిమ యెఱుంగుటఁ జేసి తనకుఁ గుమారుఁ డుదయింప ననుగ్రహింపఁ బతిని బ్రార్థింపు మని తనపుత్త్రికను సత్యవతిని వేఁడెను ఆమెయుఁ దన తల్లియభిప్రాయము మగని కెఱిఁగించెను ఆయనయు వల్లెయని రెండు చరువుల (పాయసాన్నము) సిద్ధము చేసి యొకదానిని బ్రహ్మతేజోవంత మగుమంత్రంబులను, రెండవ

దానిని క్షత్రియవీర్యవంతము లగుమంత్రములను సిద్ధముచేసి
భార్యను బిలిచి యాచరువుల మాహాత్మ్యంబు వేఱువేఱఁ దెలిపి
బ్రహ్మమంత్రవంత మైనచరువు నీవుపయోగించికొని క్షత్రవీర్య
వంతమైనది నీతల్లి కిమ్ము నీతల్లి ఋతుస్నాత కాఁగానే నీవు
మేడిచెట్టును, నీతల్లి రావిచెట్టును గౌఁగిలించికొని వచ్చి
యావల వీనిని నేను జెప్పినట్లు పుచ్చుకొనుఁ డని బోధించెను
సత్యవతియుఁ దనతల్లి కావార్త దెలిపెను

అప్పుడు జనని తనయ కిట్లనియె కూఁతురా! యెట్టి
వారును దమకు మంచిపుత్రులు గలుగఁ గోరుచుందురు అం
తటిశ్రమము శ్రద్ధ యితరులపట్ల వినియోగింపరు కావున
నీమగఁడు నీకు నుత్తముఁడైనపుత్రుఁడు కలుగునట్లు చరువును
మంత్రించి యుండును కావున నది నాకిచ్చి నాకుఁగా నుద్దే
శించినది నీవు కొనుము నేను మేడిచెట్టును గౌఁగిలించెదను.
నీవు రావిని గౌఁగిలింపుము. నాకు మాత్ర ముత్తమకుమా
రుఁడు వలదా యందువేమో. నీమగఁడు నీకు వశుఁడు కావున
మరలఁ బ్రార్థించితివేని యుత్తమపుత్రుఁడు కలుఁగ ననుగ్ర
హించు నని చెప్పెను తల్లియందలిప్రీతిచే సత్యవతియు నంగీ
కరించెను అవలఁ దల్లి మేడిచెట్టును గౌఁగిలించి బ్రహ్మమంత్ర
పూరితం బైనచరువును భుజించెను సత్యవతి యత్తిచెట్టును
గౌఁగిలించి తక్కినచరువును భుజించెను ఉభయులకు గర్భ
ములు నిలిచెను. ఆవల గర్భచిహ్నములనుబట్టి ఋచికుఁడు
సందేహించి యోసీ! నీవేమి పనిచేసితివి? నీకడుపున మహా

క్రూరకర్మశీలుఁడైన తనయుఁడు పుట్టఁగలఁడు నీతల్లికి బ్రాహ్మణగుణములుగలవాఁడు జనించును ఇది నీవు నీతల్లి యందలి ప్రీతిచేఁ జేసినచరువ్యత్యాసమునను, వృక్షవ్యత్యాసమునను నిట్లయ్యె నని చెప్పెను అప్పుడు సత్యవతి భయమున వడఁకుచు మీకుమారుఁడు క్రూరకర్ముఁడై క్షాత్రధర్మమున నభిరుచిగలవాఁ డగుట సరిగాదు ఆఁడుదాన నగుట తెలివిమాలి మీమాట వినక యకార్య మొనర్చితిని క్షమింపుఁడు నా కడుపున బ్రహ్మతేజోవంతుఁ డుదయింప ననుగ్రహింపుఁ డని పాదముల వ్రాలి ప్రార్థించెను వీర్యవంతము లగుమంత్రముల చేఁ జరువు నభిమంత్రించితిని అవి వ్యర్థముగాఁ జాలవు. నన్నిప్పుడేమి చేయు మనెదవు? అని ఋచికుఁ డనెను

అట్లయినచో నామనుమఁ డట్టివాఁ డగును గాక. నా గర్భమున బ్రాహ్మణోత్తముఁడే జనియింప ననుగ్రహింపుఁడని సత్యవతి చెప్పెను. అట్లే కానిమ్మని యాయన యంగీకరించెను. ఆసత్యవతికి జమదగ్నిమహర్షి కుమారుఁ డయ్యెను జమదగ్ని కుమారుఁడు పరశురాముఁడు, బ్రాహ్మణుఁడుగా జనించెను గాని మంత్రబలముచే క్షత్రియవృత్తి నవలంబించెను

అక్కడ గాధిరాజునకు విశ్వామిత్రుఁ డుదయించి తండ్రి యనంతరము ధరాపాలనభారంబు వహించెను

ఇట్లు భూమిపరిపాలనము చేయుకాలమందు విశ్వామిత్రుఁ డొకప్పుడు సకలసేనలతోడ భూసంచారము చేయుచు వసిష్ఠునాశ్రమంబునకు వచ్చెను.

వసిష్ఠుండును మహారాజు తనయాశ్రమంబున కతిథియై వచ్చె నని సంతోషించి సర్వవిధముల నాదరించి సర్వసైన్య సమేతుం డైన యాయనకు విందొనరింప డెందమునఁ దలఁచి కామధేనువును బిలిచి యిట్లనియె

ఓశబలా! విశ్వామిత్రమహారాజు మనయింటి కతిథియై సేనాసమేతుఁ డయి వచ్చియున్నవాఁడు ఆయన యోగ్యతకుఁ దగురీతి నాయన కాతిథ్య మియ్యవలయు. కావున సమస్త జనులకును గరితురగాదులకును వలసినంతయాహారము సమకూర్పుము అని యాదేశించెను

ఆశబలయు నట్లుగాక యని మనుష్యులకు వలయుపంచ భక్ష్యపరమాన్నంబులను నానావిధఫలంబులు,. స్నానమునకు వలసినపిండులు ధరించుటకువలసిన వస్త్రములు మాల్యములు పరిమళపదార్థములు లోనైన వన్నియు యథేచ్ఛముగ నవారిగఁ గొఱఁతలేక సమకూర్చెను.

విశ్వామిత్రుండును ససచివ సపుత్ర ససేనానాయకాదులతోడ నాతిథ్యం బంగీకరించి సంతుష్టుండై వసిష్ఠుం జూచి యిట్లనియె

మునీంద్రా! నీవు నిష్కాముఁడవు అరణ్యవాసివి. నీకు గోవులవలన కావలసినవి పాలే కదా! ఆనిమిత్తమున నీకు వేయి మేలిధేనువుల నిచ్చెద. నా కీశబల నిమ్ము. అని యడిగెను.

వసిష్ఠుండును మహారాజా! నాకు వేయికదువులతోడ నేమికార్యము గలదు? అవన్నియు నీయఁగలిగినవి యీయ

లేనివి సమస్తము నా కీయావే సంఘటించును మొదవు లెక్కువ యగుకొలఁది పరామర్శ మెక్కుడగుఁగాని లాభము గాని సుఖము గాని లేదు నా కిదియొక్కటిచాలును. నీవేయి గోవుల నీవే యుంచుకొనుము దీని నేనీయఁ జాల ననెను

విశ్వామిత్రుండును బదివేలయావులను గుఱ్ఱములను ధనములను నేవేవియో యింకను నిచ్చెద ననెను గాని వసిష్ఠుఁడును నీవేమి యిచ్చినను రాజా యీయావును నీ కీయననెను.

విశ్వామిత్రుఁడును వసిష్ఠుతో రాజులు రత్నహారు లగుట యెఱుఁగవా? శ్రేష్ఠములైనపదార్థములెల్ల రాజునొద్ద నుండ వలయును గాని యడవులలో ముక్కుపట్టుకొని తపముచేయుచు నాకులలములు దిని కాలముగడపుబాఁపనవాండ్ర కిట్టివేల యని భటులను బిలిచి బలాత్కారముగ నాకామధేనువును బట్టి కొనిపొండని యాజ్ఞాపించెను. వసిష్ఠుఁ డేమియుఁ జేయఁ జాలక యూరక చూచుచుండెను రాజభటులు పగ్గంబులఁ గట్టి యాధేనువును బలవంతముగ నీడ్చికొని పోయిరి.

అట్లు కొంతదూరము పోయి యాయావు కట్లు ద్రెంచుకొని భటులను బడఁద్రోసి పరువెత్తి వసిష్ఠునొద్దకు వచ్చి యిట్లనియె

మునీంద్రా! నన్ను నీ వెడఁబాయ సహించి రాజభటులు నన్నుఁ గట్టి బలాత్కారముగఁ గొనిపోవ నూరక చూచుచుండితివి. నీ విట్లుసేయ నీకు నే నేయపరాధమును గావించితిని. అని కన్నీరు మున్నీరుగఁ గాఱ శోకించెను.

వసిష్ఠుఁడు సోదరివలెఁ బరితపించుదానిఁ గని దేవ ధేనువా! నీయం దెట్టిదోషమును లేదు నా కేయపరాధము నీ వొనర్చినదానవు గావు నిన్నెడఁబాయుతలంపును నాకు లేదు అయినను బలవంతుఁడైన ధరాకాంతుఁడు నిన్నుఁ బట్టి కొనిపోవ ససహాయుఁడను, సాధనహీనుఁడు, దుర్బలుఁడను, బక్కబాఁపఁడ నైన నే నేమిచేయఁగలవాఁడను? రాజులదుండ గము లిట్టివి వెఁగే చేనుమేసినట్టు ప్రజల రక్షింపవలసిన రాజులే చోరులు కృతఘ్నులునై కుడిచినయిల్లులనే గుర్దఁ బూనినపు డెవరేమి చేయఁగలరు శక్తిహీనతచే నూరకయున్న వాఁడఁ గాని నీయందలి రక్తిహీనతచేఁ గాదు

అనిన శబల యిట్లనియె మునీంద్రా! తెలియనివాని వలె నీవిట్లు పలికెన నేనేమి చెప్పఁగలదానను బ్రహ్మబలమే బలము గాని క్షత్రియబలము బల మనఁదగునా? నీవు కోపిం చితివేని యీ క్షత్రబంధు వెంతటివాఁడు నా కనుమతి యొసఁ గుము వానిమదంబు సదమదంబు చేసి సేనల నేల పాలుచేసె దను అనిన నామునీ యటులే కావింపు మనెను.

అంతట నాగోవు తనయంగములనుండి యవనాదినానా జాతుల పురుషుల జనియింపఁజేసి నరపాలుసేనల నేలపాలు గావించెను.

సశేషము.

శ్రీరామ

# భక్తి సంజీవని.

## ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి.
విశేషకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు).
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడప మండలము.

పత్రికా భారనిర్వాహకులు — శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులు. ఆంధ్రదేశంబున మూర్ఛావస్థఁ జెందియున్న భక్తిమాతను స్వస్థావస్థకుఁ దెచ్చుటయే యుద్దేశము భక్తిమార్గమున నడచి యుభయ లోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగములైన కర్మ, జ్ఞాన, యోగ ముల గురించియు భక్తిలక్షణము దాని యనుష్ఠానము గురించియుఁ బ్రపత్తిగురించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడు చుండును

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు.

సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

Regd. No. M. 2443　　　　　　　　　　　　తేది, ౨-౭-౩౯

శ్రీరామ

# శ్రీ భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామసేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి.
విశేషకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు.)
ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడపమండలము.

పత్రికా భారనిర్వాహకులు —శ్రీ కోదండరామ సేవక సమాజ సభ్యులు ఆంధ్రదేశంబున మూర్ఛావస్థఁ జెందియున్న భక్తిమాతను స్వస్థావస్థకుఁ దెచ్చుటయే యుద్దేశము. భక్తిమార్గమున నడచి యుభయలోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీ కోదండరామసేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగములైన కర్మ, జ్ఞాన, యోగముల గుఱించియు భక్తిలక్షణము దాని యనుష్ఠానము గుఱించియుఁ బ్రపత్తిగుఱించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడుచుండును.

## చందాల వివరము.

| | | | | |
|---|---|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨ | ౦ | ౦ |
| ధారకులు | ,, | ౫ | ౦ | ౦ |
| జీవాతువులు | ,, | ౧౦ | ౦ | ౦ |
| పోషకులు | ,, | ౨౫ | ౦ | ౦ |
| రక్షకులు | ,, | ౫౦ | ౦ | ౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦ | ౦ | ౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు. సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధార ధారగా పోయునారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడఁచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక ౦ ౪ ౦

శ్రీ భక్తిసంజీవనీ ప్రతిష్ఠాపకులు

| | రూ | అ. | పై |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, కుఱ్ఱా సిద్దయ్యగారు, జమ్ములపాళెము .. | ౪౦౦ | ౦ | |

పోషకులు

| | | | |
|---|---|---|---|
| మ-రా-శ్రీ, సి దొరసామినాయఁడుగారు, మేల్పట్టు .. | ౩౦ | ౦ | ౦ |
| ,, చమర్తి చిన్నపిచ్చయ్యరాజుగారు, కోడూరు. | ౨౫ | ౦ | ౦ |
| ,, ఎన్. నారాయణరావుగారు, బి. ఏ, బి. ఎల్ బళ్లారి . .. . .. | ౨౫ | ౦ | ౦ |

వాల్మీకాశ్రమము,
ఒంటిమిట్ట.

వాసుదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు.




శ్రీరామాయనమః.

# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు

మాసపత్రిక.

ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు    వావిలికొలను సుబ్బరావు,

(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట.

సంపుటము ౧ { శుక్లనామసంవత్సరము జూలై నెల ౧౯౨౯ సం॥ } సంచిక ౨.

చం ఎవఁడొకో నాల్గువర్ణముల సృష్టి యొనర్చియు, ధర్మహానిచే
నవి వికలత్వ మొంద నపుడప్పుడు వానిని జక్కదిద్దఁగా
భువి జనియించి శిష్టులను బ్రోచుచునుండెడు నొంటిమిట్ట స
ద్భవనుఁడు రామమూర్తి మనపాలఁ గలండు విచార మేటికిన్.

శ్రీకోదండరామసేవక సమాజము
ద్వితీయ. గుంటూరు మాండలికసభ

ఈసభ యీసంవత్సరము బాపట్లకు సమీపమున నుండు జమ్ములపాళెము వాస్తవ్యులు మహారాజశ్రీ పంగులూరి వేంకటరత్నముగారు, మ-రా-శ్రీ ఊట్ల చిన్నవీరయ్యగారు లోనగు ప్రముఖులు ద్వితీయ గుంటూరు మాండలికసభను దమ గ్రామమునకు నాహ్వానించిరి వీరు సమాజసభ్యులు కాకున్నను సభయందును సభ్యులయందును వీరికిఁ గల భక్తి విశ్వాసములు శ్లాఘ్యములు ఇట్టివారికోరిక నిరాకరింపరాదు గావున నచ్చటనే సభజరుప సభ్యులందఱు నేకకంఠముతో సంతోషముతో నంగీకరింతురు గాక మీ ఔదార్యముచేతను, నడవడిచేతను, నాదరణబుద్ధిచేతను, భక్తిశ్రద్ధచేతను ముప్పాళ - చాగంటివారిపాళెము వారికంటెను నెక్కువ శాశ్వతకీర్తి ప్రతిష్ఠలు సంపాదింతురని వీరి నెఱిఁగిన పెద్దమనుష్యుల నమ్మకము

వాసుదాసుఁడు.

---

చందాదారులసంఖ్య.

ఇఁకముందు భక్తిసంజీవని పంపునపుడు పైవిలాసమునందు (చిఱునామా) సంఖ్యపేరు ముద్రించి పంపఁబడును. పేరునకు ముందుగ నుండుసంఖ్యయే చందాదారుసంఖ్య. 2443 అనునది చందాదారు సంఖ్యగాదు అంతపుణ్య మింకను సంజీవని చేయలేదు. 2443 అనునది పత్రికాసంఖ్య. ఉత్తరములు వ్రాయువారు తమ నామధేయమునకు ముందుండు సంఖ్యను దెలియఁ బఱుచుచుండవలయును. అటు చేయనియెడలఁ బ్రత్యుత్తరములు సందేహములు,

## శ్రీ కోదండరామ సేవక సమాజ తృతీయ వార్షికోత్సవము

ఇది శ్రీకోదండరాములవారి బ్రహ్మోత్సవ సమయమున నొంటిమిట్టయందు ఏప్రెల్ నెల ౨౦ ౨౧ ౨౨ దులయందు జరిగెను ౨౦-వ తేది సాయంకాలము సభగూడెను ఆసభయందు సమాజాభివృద్ధిగురించియు, సామాజికాభివృద్ధిగురించియు, వాసువాసుఁ ఉపన్యసించెను. కలెక్టరాఫీసు ఇంగ్లీషు హెడ్డుక్లార్కు మ రా శ్రీ వీరభద్రరావుగా రగ్రాసనాధిపత్యము వహించిరి. సమాజాభివృద్ధిగురించి యుపన్యసించుచు నీ శ్రీరామనవమినాఁటి కీసమాజమందు ౨౯-గురు పురుషులు ౨౦౯-గురు స్త్రీలు నున్నారనియు, నీపైకి నీసంవత్సరమున ౧౩౬ పురుషులు ౧౦౧ స్త్రీలు చేరిరనియుఁ, బురుషులయం దొక తురుష్కుఁడు రామభక్తుఁడు గలఁడనియు, సామాజికసంఖ్యాధిక్యముచే వచ్చుగౌరవము గౌరవము కాదనియు, సమాజనియమములప్రకారము నడచుకొని సామాజికు లిహాపరముల నభ్యుదయముగాంచిరేని యది కీర్తికరమనియు, దానికై సామాజికులు విశేషముగ స్వలాభనిమిత్తమై ప్రార్థనాపత్రికయందలి విషయములు స్మరించుకొనుచు నెక్కువ కృషి చేయవలయుననియు నీసంవత్సరమున నిరువురు స్త్రీలు మాత్రమే తృతీయసోపానమునకు రాఁగలిగిరనియు, (పురుషుఁడొకఁడు రాఁదగినవాఁడు పితృవియోగాది కారణములచే వెనుకఁ బడినాఁడు) నిది తృప్తికరము గాదనియు, రెండవసోపానమం దుండువారిలో

నాల్వురుస్త్రీలు నాల్వురుపురుషులు యోగాభ్యాసము చేయు
వారు గలరనియుఁ, బురుషులు, కొందఱుస్త్రీలు నూతనముగఁ
జేరిరనియు, విశేషసంఖ్యాకులు ప్రథమసోపాన మందుండువారే
యనియు, సక్రమముగా బ్ర. శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య
గారు మాత్రము ప్రతిమాసమునకు దినచర్య పంపుచున్నా
రనియు, నీదినచర్య వ్రాయుటవలనఁ గలుగుఫలమింకను సభ్యు
లకుఁ జాలమందికిఁ దెలియ లేదనియుఁ, వాస్తవమున బాగుపడు
కోరికగలవా రందఱు దానిని వ్రాయుచుండవలయు ననియుఁ
గాలము ప్రవాహవేగము దేహము క్షణభంగురము యముఁడా
నిర్దయుఁడు, చేసినదోషములా యసంఖ్యాకములు, కావున
వానిబాధనుండి తప్పించుకొనువాఁడు బుద్ధిమంతుఁడు గాని
సోమరియై శిశ్నోదరపరాయణుఁడై కాలముగడపి యమకింక
రులు వచ్చి పాశముల లాగికొని పోవునపుడు పుణ్యమ్ముచేయ
నైతిఁ బాపరతినైతి నని పలవరించువాఁడు బుద్ధిగలవాఁడు
కాఁడనియుఁ గొంప కాలిపోవునపుడు బావిత్రవ్వ యత్నించు
వాఁడు తెలివికలవాఁడా యనియు, వార్ధకమునఁ గావలసినవి
పూర్వవయస్సునందే సంపాదింపవలయు ననియు, రాత్రికిఁ
గావలసినవి పగటియందే యార్జింపవలయు ననియు, వానకాల
మునకుఁ గావలసినవి యెండకాలమందే సంతరింపవలయు
ననియుఁ, బరలోకమునకుఁ గావలసినదానికి నీలోకమందే
సంతనకట్టవలయు ననియు, దీనికి నీసమాజమునఁ జేరి యీ
విధులప్రకారము నడుచుకొనుచుఁ దెలియనివిషయములు నేర్చు

కొని యాచరించుటకంటె సులభోపాయము సుఖతమోపా
యము వేఱొండులేదనియుఁ గావున లోకులారా! హెచ్చరిక!
హెచ్చరిక! యనియుఁ బ్రార్థనాపత్రమందేమి ప్రమాణముచేసి
వ్రాసియిచ్చితిరో దాని మఱవవలదనియు దానిని మఱచి
యకార్యములుచేయువారి కేయధోలోకములు గాచియున్నవో
యనియు, సరియైన తరణోపాయము తెలియక పరితపించు
వారికి సాహాయ్యము చేయుకోరికయే సమాజస్థాపనమునకుఁ
గారణము కావున నదిలేకున్నఁ దనకుఁగలుగు నష్టిగాని కష్టము
గాని మఱేదియు లేదనియు, దేహమునందెందో యొకకుష్ఠ
రోగము పొడయుండిన దేహమంతయు నింద్యమగునట్లు సమా
జములోఁ జేరినవాఁడొకఁడు భ్రష్టుఁడైనను నపకీర్తి సభ్యుల
కందఱకుఁ గలుగును గావున నట్టివారిని సమాజమునుండి
తొలఁగింపఁ జేయుభారము సమాజము వారియందే యున్న
దనియు నటులు గాదేని తొలుతనున్నటు లెవరెవరికార్యములు
వారువారు చేసికొనుచు నీసంఘములు సమావేశములు లేక
యుండుట మేలనియు, బొండల్లనివారు కర్మపుంజముపాలై
యనియు నుపన్యసించిరి సేవకసమాజసభ్యులు సభ్యరాండ్రు
వ్రాసిన రామకోటి పుస్తకములను, దినచర్యలను, సంవత్సర
చర్యలను, సభయందుండు పెద్దమనుష్యులు చూచి మెచ్చి
కొని యిట్టినియమములతోఁ బనిచేయువా రుత్తీర్ణ లగుట కేమి
సందేహమని శ్లాఘించిరి ఇఁకమీఁదఁ బ్రతి సంవత్సరము
బ్రహ్మోత్సవకాలమున జరగువార్షికోత్సవమందాయాసంవత్సర

మున శ్రీరామకోటి చక్కఁగా వ్రాసినవారికి స్త్రీలకు వేఱుగను, బురుషులకు వేఱుగను వెండిపతకము లియ్యఁబడునని వాసుదాసుఁడు తెలిపెను

ఆవల నీసభవంటిసభ లాయామండలముల సమావేశ మైనయెడల లాభము గలదా నష్టిగలదా యనువిషయము బ్ర శ్రీ యామర్తి వేంకటసుబ్బదాసుఁ డి ట్లుపన్యసించెను

సభాధ్యక్షప్రతినిధీ! సభ్యసోదర సోదరీమణులారా!

శ్రీకోదండరామసేవక సమాజస్థాపన మైనదాది సభ్యులొకచోట సమావేశమయిన దొకముప్పాళ్లలో జరిగిన గుంటూరుమాండలిక సభయందు మాత్రమే అప్పటినుండియు సభ్యులలోఁ గొందఱకుఁ గొన్నిసందియములు బాధించుచున్నట్టులు వినవచ్చెడిని ఒకపనికిఁ బూనుటకు ముందుగా సాధక బాధకములను, లాభనష్టములను లెస్సగా విచారించి చేయుటయే బుద్ధిమంతులలక్షణము కీడెంచి మేలెంచవలెనను పెద్దల మాట గీటునఁ బుచ్చఁదగదు విమర్శించినపిమ్మట మేలని తోఁచినచోఁ జేయఁదగును. కీడేయగునేని వెంటనే మానవచ్చును

ఈసమాజమునఁ జేరినసభ్యు లొకరితో నొకరు కలిసి చేయవలసినపను లేవియు లేవు ఎవరికి వారే శ్రమము చేయవలసినది ఫల మెవరికి వారే యనుభవింపవలసినది సాంఘిక రాజకీయములన్ననో యట్టివి కావు పరస్పరసాహాయ్య మవసరము. అట్టి దిందేదియు లేదు. కాన నీసమావేశములవలనఁ

ప్రయోజనము లేదు. విశేషించి ధననష్టము. శరీరకష్టము వృధాకాలవ్యయము! అని సభ్యుల కభిప్రాయము గలదు. ఇంకొకభయముగూడ సభ్యులలో వ్యాపించినది ఏమన నీసమాజమున నిప్పటికిఁ జాకల, ఏనాది, తురక, శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ, జాతులవారు సభ్యులుగఁ జేరియున్నారు 'మన మందఱ మొకగురువునకు శిష్యులము ఒకసమాజమున సభ్యులము మనమేల కలిసి యేకపంక్తిభోజనము చేయరాదు' అనుసంకల్పములు పొడమి నేఁటి కలివిజృంభణములో దురాచారములుప్రబలి వర్ణసాంకర్యము కలుగునేమోయని

ఈయంశములన్నియుఁ బూర్ణముగ మనము విమర్శింప వలసినవే

ఈ సమాజసభ్యు లొకరితో నొకరు కలసి పనిచేయ వలసిన విషయము లేవియు లేనిమాట వాస్తవమే. అయినను, జేరవలసినచో టొక్కటియే యయి, యొకదానికే కృషిసలుపు వా రొక్కచోటఁ గూడుట సంభవమైన నెవరెంతె యెట్లు పని చేసినది' ఎంత యాభివృద్ధిగాంచినది, యెట్టిలోపములు తమయందున్నవో యెవరియం దెట్టి సద్గుణములు కలవో తెలిసికొని తమ తమ లోటుపాట్లను సవరించుకొని నిర్దుష్టపథమున నడువవచ్చును. 'స్పర్థయావర్ధ తేవిద్యా' యన్నటు లొకరికంటె నొకరు ముందుకు నడువవలయునను నుత్సాహము, పట్టుదల కీ సమావేశములు చాల నాయపడుటనిజము స్పర్థ మేలిగుణమా యందురేమో! అంబరీషునిరాజ్యమున బ్రజలందఱు మచ్చరము

హరికైంకర్యములంద పూని యుండిరి సద్విషయమున నందు భగవత్ప్రాప్తికై కృషిసలుపుటయందు స్పర్థపూనుట ధర్మవిరుద్ధము కానేరదు తీవ్రఫలకారి యగును లోకవృత్త మెట్టిదో, యెంతెంతపాటుపడి దైవకృపకుఁ బాత్రులైన మహానుభావులెందఱుగలరో మనయింటిలో మనము కూపస్థమండూకముల వలెఁ బడియుండిన నెట్లు తెలిసికొనఁగలము. దురభిమాన దురహంకారపిశాచములచేఁ బీడితుఁడగు నాబోఁటి గర్వపరత్వమస్తకునకుఁ గులమున బలమునఁ, జదువున, సంపదను నయమున భక్తిని నధికులయ్యుఁ బరమ వినయభూషణుల నీ సమాజసభ్యులందుఁ జూచినంతనే, నాయవగుణములను దలఁచుకొని, సిగ్గుపడి, వినయవంతుఁడ నగుటకేల బ్రయత్నింపకుందును. 'ఎందఱో మహానుభావులందఱికి వందనము' లని శ్రీత్యాగరాయలవా రనుట కిట్టి సమావేశమేకదా కారణము. నానాదేశాగతులయిన సభ్యసాధుసోదర, సాధ్వీసోదరీ సందర్శనమత్యంతానంద జనకమునులాభదాయకమును గాదనువారును గలరా!

ఇఁక ధననష్టమును విషయములో, నిజమే, నష్టము లేదనను కాని యిది యొక్కరే భరించునదిగాదు పదుగురుమీఁదిపని మన మొనరించు వృథావ్యయముల లెక్కచూచుకొందుమేని యం దిది కీసపాలుండదు ఇది దుర్వ్యయమన నెట్లు నోరాడును? భగవత్ప్రాప్తికై శ్రమించువా రెల్లరును సాధువులును సజ్జనులును గదా! అట్టివారి సేవకై వినియోగిం

పఁబడు విత్తమును రిత్తవ్యయమనువా రున్మత్తులుగారా! 'ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీజ్ఞానీచ భరతర్షభ' అను భగవద్వచనముఁ బట్టి యిందుఁ జేరినవా రీ నలువురిలోఁ జేరినవారేకాని తద్భిన్నులు కారు అందువలన నంఱు సుకృతులు ఇట్టి వీరి నీ నెపమున నైన నాదరించి సేవించుట కలిగినది ఇందునకై వెచ్చింపఁ బడిన ధనము నష్టముకాదనియు విశేషలాభమే యనియు మనవిచేయుచున్నాను

శరీరాయాసమా నిజమే నడచియో పొగబండిమీఁద నో పోవలెను. స్వగృహమునందువలె సమస్తసౌకర్యము లచ్చట దొరకనిమాట వాస్తవము. వేళకుఁ దిండి, పడకసని, కుదురివు. అన్నలారా! ఏదేని వ్యవహారమునకై పోవునప్పు డెట్టి యగ చాట్లయిన నోర్చి పోవుచుండుటలేదా! అస్థిరములును నవర్థ కారులును నగు వానికై యెంతయో పాటుపడుచుందుమే అందు మనకుఁ దక్కునది శ్రమ మొక్కటేకదా. ఇందో స్వా ర్థముకూడఁ గలదు విచారించి చూడుఁడు ద్వంద్వసహిష్ణుత మన కిం దలవడును మనల పీడించుచున్న క్షుత్తృణ్ణిద్రల గెలువ వీలగును స్వార్థపరిత్యాగ మొనర్చి వచ్చినవారినెల్లఁ దగు మన్ననల మర్యాదల నాదరించుచు సేవసేయు భాగ్యము లభిం చును అహము చంపుకొని వినయవంతులమై నిష్కామ కర్మాను ష్ఠాన పరులముకావుట కిందుఁ జక్కని యవకాశము చిక్కును కార్యదీక్ష తితీక్ష యిందు మనకుఁ జేపడను

కాలవ్యయమును గుఱించి విచారించితిమేని చూచితిమి గదా! ఒక్కనిమిషమైన వ్యర్థముగాఁ బోయినదికలదా! కాలము చాలక పోయెనేయను విచారము ప్రతిసభ్యునకుఁ గలుగలేదా! కడుపునిండఁదిని, కంటినిండనిద్రపోవు వారికిమాత్ర మిదియప కారమని యొప్పుకొనకతప్పదు 'సోమరునకుఁ శామరునకుఁ జోటులేద'ను శ్రీవాసుదాస స్వామివారి సుభాషితమును వారు తెలిసికొనిరేని జిత్తశాంతి దొరకొనును

ప్రతినిత్యము మనమెంతకాలము లోకాభి రామాయణ ములతో, నెల్లమ్మపుల్లమ్మ ముచ్చటలతోఁ బాడుచేయుచున్నా రముకాము పోయిననిమిషము తిరిగిరాదే! ఇందువినోసము లకుఁ దావులేదు భగవంతునిగుఱించి భక్తిగుఱించి భగ వత్ప్రాప్త్యు పాయములగుఱించియే మనకాలమంతయు సద్వి నియోగమగుటయు నిట్టితరుణము మరల రానేరాదనియు సభకు వచ్చిన సభ్యులకందఱకు విశదమె

ఈసమాజము కేవల శాస్త్రవిధుల ననుసరించి స్థాపింపఁ బడినదేకాని నేఁటి పరిస్థితుల కనుకూలముగ నిచ్ఛకములకుఁ దావిచ్చునదికాదని సభ్యులందఱు జ్ఞప్తియందుంచు కొందురు గాక వర్ణాశ్రమధర్మముల నుల్లంఘించువారి సమాజమున సభ్యు లుగాఁ జేర్చుకొనఁబడరు ఇచటికివచ్చిన వారందఱు కలిసి యొక్కచోట, వర్ణవివక్షతలేకుండ నేక పంక్తిని భోజనముచేసి తీరవలెనను నియమనిర్బంధములులేవు అట్టి యక్రమవర్తనమున కిందుఁ దావొసంగఁబడదు అదియుఁగాక ఎవరికిష్టమైనట్లు

నారికనుకూలమగు విధమున భోజనమునకు వసతిచూచుకొనుట
కీసమావేశమున నెంతమాత్ర మభ్యంతరము కల్పింపఁబడదు
కాఁబట్టి వర్ణసాంకర్యమగు ననుభయమును సభ్యులు పొంద
నక్కఱ లేదు

ఈ సమావేశమువలన నింకొక మేలుకలదు తామస
రాజసాహారముల కలవాటుపడిన సభ్యులును, సాత్త్వికభుక్తి
కష్టసాధ్యమును గడుపు నిండదనువారును నీ మూఁడునాళ్లు
మిశ్రసాత్త్వికభోజన మొనరించి తృప్తులై యన్నివిధముల నీ
భుక్తి యనుకూలమైనదని యభిప్రాయపడుటయేగాక యిఁకఁ
దమ రిండ్లయం దీ విధానమునే యవలంబించెదమనియుఁ గష్ట
మేమియు లేదనియుఁ దెలియఁగలిగిరి.

ఏనాఁడీ సభలో, సమాజసభ్యులందు మూఁడవ మెట్టు
నకు వచ్చినవారిలో నొక పురుషుఁడు 3 గురు స్త్రీలుగలరని
చెప్పితిమో యానాఁడు సభ్యులలోఁ జాల కలవరము గలిగినది
నిర్వేదము పొడమినది సమావేశము సమాప్తమైన మఱునాఁటి
నఱకుండి పదుగురు మగవారు యోగ మభ్యసింపఁబూని శ్రీ
వాసుదాస సద్గురుస్వామివారిసన్నిధిలోఁ గొన్నిసాధనలు నేర్చు
కొనియున్నారు. ఈ సమావేశమే లేకుండిన వీరి కీ సత్సంక
ల్పము పుట్టుటకైన వీలుకలుగునా?

ఇప్పుడీ సమాజమున నైదునూర్లకుఁ బైఁగా సభ్యులు
గలరు ఇట్టి సమావేశమువలననే కదా గుంటూరుమండల
మందలి సభ్యులలోఁ జాలమందియుఁ గడప, అనంతపురము,

చిత్తూరు, గోదావరి, కృష్ణా మండలములనుండియు సభ్యులు విచ్చేయుట యనేక నూతనవిషయములఁ దెలిసికొనుట గలిగి నది  లేనిచో వీరందఱికడకు శ్రీస్వామివారు వచ్చుటకుఁగాని వారిసన్నిధికి వీరు పోవుటకుఁగాని తమతమకుఁగల సందియ ముల నివారించుకొనుటకుఁగాని సాధ్యపడియుండునా!

కాఁబట్టి యెన్నివిధముల నాలోచించిచూచినను నిట్టి సమావేశములు మిక్కిలి యవసరములును లాభదాయకములు ననుట కేమాత్రము సంశయము లేదు. నష్ట మించుకంతయు లేదు. కావునఁ బ్రతిమండలమువారును నిట్టి సమావేశముల సమకూర్చి సభ్యులగు తామేగాక ప్రేక్షకులగు నితర జనులు గూడ నుభయలోకముల బాగుపడఁ బ్రయత్నించెదరని వేఁడు చున్నాను. శ్రీవాసుదాస సద్గురుస్వామివారి యమూల్యోప దేశముల శిరసావహించి నిర్వంచనముగ నాచరించి శ్రీసీతా రాముల దివ్య కరుణాకటాక్షవీక్షణామృత వృష్టిచే శాంత తాపులై శాశ్వతానంద సామ్రాజ్యవైభవోపేతులయి శ్రీ కోదండరామ సేవక సమాజసభ్య సాధ్వీసాధు సోదరీ సోదరు లభ్యుదయ పరంపరల విరాజిల్లెదరుగాక.

౨౧-౮-౨౯ యందు సాయంకాలము మరల సభగూడెను.

ఈసభకుఁ గడపమండల న్యాయాధిపతులైన బ్ర శ్రీ నాగపూఁడి చంద్రశేఖరయ్యరుగా రగ్రాసనాధిపత్యము వహించిరి.

ప్రధానసభవారి యంగీకారము నిమిత్తము గుంటూరి మాండలిక సభవారు పంపిన,

I. కీర్తిశేషులయిన ముడిపిరి వేంకట సుబ్బారావుగారిని గుఱించియు,

II. భక్తిసంజీవనీ స్థాపకులయిన మ-రా-శ్రీ కుఱ్ఱాసిద్దయ్య గారిని గుఱించియు,

III ఆంధ్రవాల్మీకిరామాయణ వ్యాఖ్యానమైన మందరముగుఱించియు,

IV. శ్రీ వాసుదాస జీవితచరిత్ర గుఱించియు,

తీర్మానములను నీసభవా రేకగ్రీవముగ నామోదించిరి.

మందిరముగుఱించి వాసుదాసు విన్నపమాలించి ౨౦ గురు కోదండరామస్వామికి మాసాశనము నెలకు ౧-౦-౦ ఇయ్య నంగీకరించిరి ఇట్టివారింకను ౩౦ గురు కావలసియున్నవారు. ఇట్టి సాహాయ్యముచేయఁగల ధర్మాత్ము లంధ్రదేశంబున నుండిరేని వారి నామధేయములు భక్తిసంజీవనీ నిర్వాహకునకుఁ దెలుపఁ బ్రార్థితులు

ఆవల ‹‹అన్నియోగ ముద్రలలో శ్రేష్ఠమైన ముద్ర యేది›› యను విషయముగుఱించి శ్రీవాసుదాసుగా రుపన్యసించిరి.

సభ్యనారాయణులారా!

నిమిత్తములేక యెవ్వఁడేకార్యమును జేయఁడు. ‹‹అన్ని యోగముద్రలలో శ్రేష్ఠమైనముద్రయేది›› యనువిషము

నేఁడుపన్యసింపఁ గారణముగలదు మోక్షమార్గములన్నిటిలో భక్తియే శ్రేష్ఠమైనదని యీసమాజము సిద్ధాంతపఱుపఁ బూనినది కావునదీవిషయమై లోకులకెవ్వరికేనిగల సందేహములు దీర్చుట ముఖ్యకార్యమైయున్నది భక్తియనునది Penitential supplicatory abjectness తపోసూచకమై దేహియని యాచనాసూచకమైన నీచత్వమని యొకరాక్షేపించుటచేతను అదిద్వైతభావముగలవారికేగాని తమయద్వైతమున కన్వయింపదని మఱియొకరు వ్రాయుటచేతను విస్పష్టముగ భక్తిదైవభావము గలదగుటచేతను, దానియందారోపింపఁబడిన నైచ్యము భక్తియందుఁగలదా యనువిషయము ముప్పాళసభయం దుపన్యసించితిని కొందఱు హఠతారక యోగాభ్యాసపరు లవియే శ్రేష్ఠమనియు నందలిముద్రలు సాధింపకముక్తిలేదనియు నీసమాజసభ్యులతో వాదించి నట్లుశ్రవణ గోచరమయ్యెను కావుననే యోగము శ్రేష్ఠమో యందేముద్ర శ్రేష్ఠమో విచారింపవలసి యున్నది

---

## యోగమనఁగా నేమి?

యోగస్సన్నహనే, ధ్యానే, యుక్తౌ, సంగ, త్యుపాయయోః.

యోగమనఁగా యుద్ధసన్నాహమునకు, ధ్యానమునకుఁ, గూఁడియుండుటకుఁ, ఉపాయమునకుఁ బేరు. అనినిఘంటువు

యోగః చిత్తవృత్తి నిరోధః ॥ పతంజలి.

చిత్తవ్యాపారముల నడ్డగించుటయే యోగము.

పరిపరివిధములఁ బోవుమనస్సు నట్లుపోనీయక యడ్డకట్టుటయే యోగమనఁబడును.

"సమత్వం యోగఉచ్యతే"　　　భ గీ. ౨-౪౮

సుఖదుఃఖ, లాభాలాభ, మానావమాన, శీతోష్ణాది ద్వంద్వములయందు మనస్సు నేకరీతియుంచుటే యోగమని భగవద్గీత

యోగః కర్మసు కౌశలమ్.　　　భ గీ ౨-౫౦

నిపుణమైన బుద్ధితోఁ గర్మములుచేయుట యోగము.

సంయోగోయోగ ఇత్యుక్తో, జీవాత్మపరమాత్మనోః॥

జీవాత్మపరమాత్మలకూడికకే యోగము అనిపేరు.

శ్లో. ఆత్మప్రయత్నసాపేక్షా, విశిష్టాయా మనోగతిః
తస్యాబ్రహ్మణిసంయోగో, యోగఇత్యభిధీయతే వి పు.౬-౭

యోగస్సమాధి –వ్యాసులు.

సమాధికి యోగమనిపేరు　అనఁగా సమాధియందు (అనఁగా గోరీయందని యర్థముకాదు) నుండఁగలవాఁడే యోగి యని పిలువఁబడ నర్హుఁడుగాని యాదశ సాధించువఱకు యోగి యని పిల్వఁబడఁడు అంతవఱకుఁ జేయునది గౌణము అట్టులే పరమభక్తి లభించినవానికి భక్తుఁడనిపేరు గాని యంతకుఁ దక్కువస్థితిలోనుండువాఁడు ఆబిరుదుపదమున కర్హుఁడుగాఁడు. అంతవఱకు వాఁడుచేయునది గౌణభక్తియే అది సాధనమే. ఫలముగాదు. అట్టులే సర్వత్ర సర్వావస్థల బ్రహ్మసాక్షాత్కారము నొంది యపరోక్షాను భూతిగలిగి ప్రకృతిసంబంధము సవాసనముగ నిర్మూలించినవాఁడెవఁడో వాఁడుజ్ఞానిగాని యాదశ రాని వాఁడు జ్ఞానిగాఁడు　ధనవంతునిఁజూచి వానికేమి మహా

రాజనియందుము. ఆమాత్రముచేతనే వాఁడు సింహాసనా సీనుఁడై నాఁడని యర్థమా? కావున యీదశరాని వారి నాపేరఁ బిలుచుట యుపచారమాత్రమని యెఱుఁగవలయును కర్మ యోగము - జ్ఞానయోగము - భక్తియోగము - ప్రపత్తియోగము - ఆచార్యాభిమానమను నవియైదు ముఖ్యములైన ముక్తిమార్గ ములు అష్టాంగయోగము - కర్మయోగమున కంతర్భాగముగఁ బూర్వులు చెప్పిరి ఇదియేకాక వైదికకర్మములు హఠ - రాజమంత్ర లయయోగములుకూడఁ గర్మయోగాంగములే సీతారామాం జనేయ సంవాదవీరికయుం దీవాక్యములు గానవచ్చెడిని

"బ్రహ్మసూత్రములలో నీయోగమును వ్యాసులవారు ఖండించిరి ఇది గురూపదేశము లేనిది తక్కిన శాస్త్రములవలెఁ గేవల గ్రంథాధ్యయనమువలన నలవడునది కాదు

యోగాభ్యాసపరులైన కొందఱిటీవలివారు యోగము లోఁ దమచే ననుభూతములైన కొన్నినూతనాంశములను జేర్చి కొన్నిగ్రంథములను నూతనముగ రచించియున్నారు ఇందుల కుదాహరణముగఁ బాతంజల యోగసూత్రమందు వక్కాణిం పఁబడనిహఠయోగ, రాజయోగ, మంత్రయోగ, లయయోగ విభాగము సాంఖ్య, తారకామనస్కవిభాగము, ఆకాశపంచ కము షట్చక్రోద్ధారము, నాదబిందుకళలు, హంస మొదల గునవి శివసంహిత, శారదాతిలకము, తంత్రసారము, తంత్ర రాజము, దశోపనిషదితరోపనిషత్తులు మొదలగునర్వాచీన గ్రంథములయందుఁ గానవచ్చుచున్నవి అష్టాంగయోగాంగ

మైన సమాధికూఁ భక్తియోగాంగమనియే శాండిల్యమహర్షి మతము.

కర్మయోగము మొదలైనపదములందలి యోగమునకు పాయమనియర్థము భగవత్ప్రాప్తికిఁ గర్మ ముపాయమగునేని యది కర్మయోగము ఇట్టులే తక్కినవి యోగము సాక్షాన్ముక్తి ప్రదముకావని బాదరాయణులు బాదరాయణులు యోగ మును ఖండించినపుడు, శాండిల్యాదులు యోగముచఁ జరమ దశమైన సమాధియు గౌణభక్తియని శాసించినపుడు కర్మయోగ మునకంటె భక్తియేశ్రేష్ఠమని నారదుఁడు సూత్రించినపుడు భక్తిహీనంబులైన కర్మజ్ఞానాదులు నిరర్థకంబులని శ్రీశుకులువ్యా సులు సిద్ధాంతముచేసినపుడు కర్మయోగమున కంగమైన యష్టాం గయోగమున కంగములైన హారాదియోగములు సాక్షాన్ముక్తి ప్రదములుకావని వేఱుగఁ జెప్పవలయునా? కావున నాంగమైన కర్మయోగము సద్వారక మేగాని యద్వారకముగాదు

ఎట్టిది శ్రేష్ఠము

I ఉత్తమఫలదమై II ఉత్తమోత్తమమై III. సర్వజననా మాన్యమై IV సర్వజనసులభమై V శీఘ్రఫలదమై VI. ఇతర నాపేక్ష్య మపేక్షింపనిదై VII నిరపాయమై VIII ఉత్తమజన శ్లాఘ్యమై IX. ప్రతిపద ప్రోత్సాహదానందదమగునది శ్రేష్ఠము.

ఉత్తమఫలదము

కొన్నికొన్నికార్యములు కొన్నికొన్నిఫలములనిచ్చును ఆఫలములందధమమని మధ్యమమని యుత్తమమని భేదములుం

డును. అధమముకంటె మధ్యమము శ్రేష్ఠము. మధ్యమము కంటె నుత్తమము శ్రేష్ఠము బుద్ధిమంతుఁడగువాఁ డుత్తమఫల మునేకోరవలయును దేహతాప మణఁచుదానికంటె, మానస తాపమణఁచునది శ్రేష్ఠము దానికంటె నాత్మసంతాపమణఁచు నది శ్రేష్ఠము ఐహిక సుఖముకంటె స్వర్గసుఖము శ్రేష్ఠము దానికంటె మోక్షసుఖము శ్రేష్ఠము. దానినిమించినదివేఱొం డులేదు గావునవిరుగాల పశువులుగాక సార్థకనామధేయులయిన మనుష్యులందఱు దానికయియే శ్రమింపవలయును. దానినే సాధింపవలయును

11. ఉత్తమోత్తమము

ఉత్తమఫలము నిచ్చునవి యొకటికంటె నెక్కువగనుండె నేని వానిలో నేది యుత్తమమో యది శ్రేష్ఠము. దానికై బుద్ధిమంతుఁడు పాటుపడవలయును మీఁదఁజెప్పిన మోక్షో పాయములలో నేది శ్రేష్ఠమో మతిమంతుఁడు దానినే సాధింప వలయును అన్నియు నుత్తమములైనప్పుడు వానిలోఁ దార తమ్యము తెలియుట యెట్లంటేని,

111. సర్వజన సామాన్యము.

సర్వజనసామాన్యమైనది వానిలో శ్రేష్ఠము ఉత్తమ ఫలము నిచ్చునదియై, వీరు వారను నధికారనియతిలేక, బ్రాహ్మ ణులకుఁ, బంచములకు, స్త్రీలకుఁ, బురుషులకు, ధనికులకుఁ, బేద లకు, బాలురకు, వృద్ధులకు నెండవలె వానవలె భగవ దనుగ్ర హామువలె సమానముగ వర్తించునది యేదో యది శ్రేష్ఠము.

IV. సర్వజన సులభము.

అది యందఱియందు సమానముగ వర్తించి సమాన ఫలమిచ్చునదియైనను గోరిన వందఱకు నది కష్టములేక లభించు నదియై యుండవలయును గంగాజలము శవ్వుఁద్రావిన యం దఱపాపములు శమింపఁజేయును గాని యది పేదకు బక్కకుఁ గుంటికి గ్రుడ్డికి నెట్లు లభించును?

V. శీఘ్రఫలదము

ఉత్తమఫలము నిచ్చువానిలో శీఘ్రముగ ఫలమిచ్చు నది యేదో యది శ్రేష్ఠము ఒకఁడొక కార్యముచేసి నెలకు ౧౦౦-౧-౦ లు సంపాదించును. మఱియొకఁడు వేఱొక కార్యము చేసి యంతయే కష్టపడి యంతబుద్ధియే వినియోగించియు నెలకు రు ౨౦-౦-౦ లు సంపాదించినయెడల నేవృత్తి శ్రేష్ఠ మైనది? మొదటిదేకదా? అట్లుండఁ గష్టముతక్కువై ఫలము సమానమై యదియును శీఘ్రముగఁ గలుగునేని యది శ్రేష్ఠ మనిచెప్పక తప్పదుగదా

VI. స్వతంత్రము

స్వతంత్రమనఁగా నితరు సహాయముతోఁ బనిలేనిది.

సర్వం పరవశం దుఃఖం। సర్వమాత్మవశం సుఖమ్॥.

అన్నట్లు పరాధీనము ప్రాణసంకటము తనకుఁ గావల సిన పదార్థములకు సుఖమునకు నితరులమీఁద నాధారపడి యుండుటకంటె దుఃఖము లేదు తనకుఁ గావలసినవన్ని తానే స్వయముగ నితరసాహాయ్య మపేక్షింపక సాధించుటకంటె

సుఖము లేదు పరాధీనపు బ్రదుకుబ్రదికి పప్పన్నము తినుట కంటె స్వతంత్రుఁడై యంబలి త్రాగుటే సుఖము అదియే శ్రేష్ఠము అట్టులే మోక్షమార్గములందును నితరసాహాయ్యా మపేక్షించువానికంటె నితరసాహాయ్యా మపేక్షింపనిమార్గమే శ్రేష్ఠము

VII. నిరపాయము

ఒక గమ్యస్థానము (కాశి) చేరుటకు ౩-౪ మార్గము లుండెనేని యందుఁ జోరభయము-అగ్నిభయము-మృగభయ ములోనైన భయములు లేక యొంటిరిగానైన నెవరైన నిర్భయ ముగాఁ బ్రయాణింపనగు మార్గమేదియో యది శ్రేష్ఠము

VIII. ఉత్తమజన శ్లాఘ్యము

ఒక గమ్యస్థానము (కాశి) చేరుటకు ౩-౪ మార్గము లుండెనేని యా మార్గములన్నియుఁ దెలిసినవారు దేనిని మేలని చెప్పుదురో యది శ్రేష్ఠము ప్రతిమనుష్యుఁ డన్నిమార్గ ములు శోధించి మేలైనది తెలిసికొనిపోవుటకు సాధ్యముగాదు. కావున నన్నిమార్గములు తెలిసినవా రేది మేలనిచెప్పుదురో యాత్రోవఁబోవుట బుద్ధిమంతులలక్షణము

IX. ప్రతిపద ప్రోత్సాహదానందదము

అడుగడుగనకు నానందమును వికసింపఁజేయునది గమ్య స్థానమునకు ౩-౪ బాటలుండెనేని యందొకటి మరుభూమి త్రాగను నీళ్లులేవు నిలువను నీడలేదు. మఱియొకటి దోవ డొంక చక్కఁగాలేని యరణ్యమార్గము మఱియొకటి తాలు

గుండ్లు కంపలుగలది వేఱొకటి శ్రోవపాడుగునఁ జలిపంది
మలు సత్రములు పలుకుతోడులు మార్గదర్శకులు రాజపోషణము
కలది. వీనిలో నేదిశ్రేష్ఠమో చెప్పవలయునా? ఈ శ్రేష్ఠత్వ
లక్షణములు మీ రంగీకరించితిరేని మోక్షమార్గములలో నేది
శ్రేష్ఠమో సులభముగ నిర్ణయింపవచ్చును

| | కర్మము | యోగము | జ్ఞానము | భక్తి |
|---|---|---|---|---|
| I | ౧ | ౧ | ౧ | ౧ |
| II | ౦ | ౦ | ౦ | ౧ |
| III. | ౦ | ౧ | ౦ | ౧ |
| IV. | ౦ | ౦ | ౦ | ౧ |
| V. | ౦ | ౦ | ౦ | ౧ |
| VI. | ౦ | ౦ | ౦ | ౧ |
| VII | ౦ | ౦ | ౦ | ౧ |
| VIII. | ౦ | ౦ | ౦ | ౧ |
| IX. | ౦ | ౦ | ౦ | ౧ |

వివరణము

కర్మయోగము మోక్షఫలము నిచ్చునదియైనను

III. సర్వజన సమాన్యముగాదు సంస్కారములకు
యజ్ఞాదికర్మములకు శూద్రాదుల కధికారము లేదు IV. సర్వజన
సులభముగాదు బాలురకు స్త్రీలకు లభింపదు ధనము, పాండి
త్యము దేహబలములోనైనవి యపేక్షితములు V అనేకవేల
జన్మముల సాధించినఁగాని కర్మయోగమున మోక్షము లభింపదు

VI· అదియును జ్ఞానభక్తుల సాహాయ్యము గలిగిననేకాని స్వతం త్రించికాదు VII యజ్ఞాదికర్మములందు విఘ్నముకలిగినను యథావిధి సలుపకుండినను నపాయముకలదు కర్మమార్గముత్త మమైనదే కానిజ్ఞానభక్తులకు సాధనమగుటచే వానికంటెనుత్తమ మైనదికాదు IX మిగుల శ్రమముతోఁ గూడినదగుటచే సంత తానందము లేదు. X వర్ణాశ్రమకర్మము స్వాభావికముగాదు నడుమవచ్చినది XI. మోక్షకామియైన కర్మయోగికి నైహిక సుఖములేదు ఇఁక దీని కంగమైన

అష్టాంగయోగము జ్ఞానభక్తులకు సహాయపడునేకాని స్వతంత్రించి మోక్షమియ్యఁజాలదు కావుననే దీనికి సేశ్వర సాంఖ్యమనిపేరు III & IV అందఱకు నధికారమున్నను నంద ఱకుఁ బూర్ణముగ సాధ్యముగాదు. కొంతమాత్రమే సాధ్య మైనఁగావచ్చును. V దీర్ఘకాలమునకుఁ గాని ఫలమీయదు

శ్లో॥ ప్రయత్నాద్య తమానస్తు, యోగీసంశుద్ధ కిల్బిషః
అనేకజన్మసంసిద్ధ, స్తతో యాతిపరాంగతిమ్॥ భ గీ

యోగిప్రయత్న పూర్వకముగ సాధనముచేసి పాపముల వలన శుద్ధుఁడై యనేకజన్మములకు సిద్ధుఁడై యావలఁ బరమ గతిని బొందును అని శ్రీకృష్ణభగవానులు చెప్పిరి.

శ్లో॥ మనసో నిగ్రహాయత్త, మభయం సర్వయోగినామ్
దుఃఖక్షయప్రబోధశ్చా, ప్యక్షయాశాంతి రేవచ
ఉత్సేక ఉదధేయద్వ, త్కుశాగ్రేణైక బిందునా
మనసోనిగ్రహాస్తద్వత్, భవేదపరిఖేదతః.

యోగులకు యోగముచే మనోనిగ్రహము దుఃఖక్షయము లోనైనవి కలుగుట సముద్రములోని నీటిని దర్భకొనతో నొక్కొక్క బిందువునేయెత్తి వెలుపలవైచి దానినెండఁబెట్టుట వంటిది

శ్లో॥ అనేక జన్మసాహస్ర, తపోధ్యాన సమాధిభిః
నరాణాంక్షీణ పాపానాం, కృష్ణే భక్తిః ప్రజాయతే॥

అనేకవేల జన్మములు తపస్సు, జ్ఞానము, యోగము వీనిచే పాపముక్షయించిన మనుష్యులకు హరియందు భక్తిజనించును.

VI భక్తిసాహాయ్యము లేకున్న యోగము గారడీ విద్యయై పులుసుకూరయోగ మగును వీధులవెంటఁ గాలకాకు హఠయోగమును నంగడిపెట్టినవారినిఁ జూచుచున్నాము గదా. కొందఱు కామదాసులై భ్రష్టులైన విషయము క్రొత్తగాదు గురుసాన్నిధ్య మత్యంతావశ్యకము

VII. యోగము పాముతోఁజెలిమి యేనుఁగుతో నాటలాడుటవంటిది మిక్కిలి యపాయముతోఁ గూడినది యోగ సాధనమందుఁ జచ్చినవారిని, పిచ్చిపట్టినవారిని నానావిధరోగముల నార్జించినవారిని జూచుచున్నారము కదా

VIII. సాధించుట గంకముతోఁ జేరినది కాని యోగ సిద్ధులు శ్లాఘ్యులే అయినను నీకాలమున నణిమాదులు సాధించినను నవిముక్తికి సాక్షాత్కారణములు గావు ఒకవిధమున శత్రువులే యగును

౧౪. యోగము సాధించుటయందు శ్రమము తోఁచునే కాని యానందము కలుగదు

౪ యోగమునకు భగవంతు వశపఱచుకొను శక్తి లేదు.

చం యమనియ మాదియోగముల నాత్మ నియంత్రి తమయ్యుఁ
గామరోషములఁ బ్రచోదితంబ యగు శాంతివహింపదు
విష్ణుసేవచేఁ గ్రమముగ శాంతిగైకొనినట్లైవడి

అన్నట్టు లీయోగముచేఁ గామక్రోధములు నశింపవు. వృద్ధియైనఁగావచ్చును ప్రాయికముగ నగును అహంకార మమకారములు దొలఁగవు. కేవల యోగి భగవంతునకు దూరస్థుఁడే. యశోదకు - గోపికలకుఁ గౌసల్యకు నదితికి ననేక భక్తులకు భక్తురాండ్రకు వశపడి, పట్టుపడి, కొట్టుపడి, కట్టఁబడి సేవలుచేసినట్లీయోగికి భగవంతుఁడు వశపడెను (దేవాలయ తత్త్వము చూడుఁడు)

అంబరీష దుర్వాసుల తారతమ్యము జగత్ప్రసిద్ధము

కం చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములన్
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ. భాగ.

౧౫ యోగము స్వాభావికముగాదు స్వప్రయత్నసాధ్యము. ఈకారణములచేఁ గేవల యోగము మోక్షము ముక్తిసాధనము కాఁజాలదు.

---

## యోగముద్రలు

శ్లో॥ మహాముద్రా, మహాబంధో, మహావేధశ్చ ఖేచరీ
ఉడ్యానం మూలబంధశ్చ, బంధో జాలంధరాభిధః
కరణీ విపరీతాఖ్యా, వజ్రోలీ శక్తిచాలనమ్
ఇదంహి ముద్రాదశకం, జరామరణనాశనమ్
ఆదినాథోదితం దివ్య మష్టైశ్వర్య ప్రదాయకమ్.

అర్థము మహాముద్ర, మహాబంధము, మహావేధము ఖేచరి, ఉడ్యానము, మూలబంధము, జాలంధరము, విపరీత కరణి, వజ్రోలి, శక్తిచాలనము, అను నివి ౧౦ ముద్రలు, జరా మరణముల నశింపఁజేయును అష్టైశ్వర్యముల నొసఁగును. దీనిని ఆదినాథుఁడను యోగిచెప్పెను ఇవిగాక శాంభవి-ఉన్మని-షణ్ముఖి యనునవియుఁ గలవు. వీనివలనఁ గలుగు ఫలములు- అష్టైశ్వర్యములు ముసలితనము మరణము లేక దీర్ఘకాలము దేహమును ధరించియుండుట ఇంతియేకాని ముక్తిగాదు ఆది నాథుఁడనఁగా నవనాథులలో మొదటివాఁడని యర్థమేకాని శివుఁడుగాఁడు విష్ణువు గాఁడు

యోగ మనాదియైనను నీముద్రలు పూర్వముచెప్పిన ట్లర్వాచీనములు ఈ ముద్రలలక్షణము లిఁక వివరించెద వానిని సాధించుటయం దెంత శ్రమముగలదో చూడుఁడు నా తొంత్ఫలము తుచ్ఛము పతంజలిచెప్పిన సమాధి భగవ ద్ధ్యానముతోఁ గూడినదే మోక్షకారణ మగునుగాని కేవలము

గాదు ఇట్లుండ ముద్రలు మోక్షకారణములని భ్రమించు
వారి నేమనవలయును

ఎడమకాలి మడిమచే మూలాధారము బిగించి, కుడి
కాలుచాఁచి మొదటి రెండుచేతివ్రేళ్లతో కాలి పెద్దవ్రేళ్లను
బట్టిన మహాముద్రయగును మోఁకా లెత్తరాదు ఎడమ
మడిమను యోనియందుఁజేర్చి యెడమతొడమీఁద కుడిపా
దమునుంచి వాయువుపూరించి గడ్డమును ఱొమ్ముపైనిలిపి
యాధారమును బిగించి మనస్సును సుషుమ్నయందుఁ జేర్చిన
మహా బంధమగును

ఏకాగ్రచిత్తముగలవాఁడై పూరకముచేసి జాలంధరబం
ధము ధరించి రెండుచేతులు భూమిమీఁద సమముగా నిలిపి
యెడమమడిమ యోనిస్థానమందుఁ జేర్చి పిఱుఁదులెత్తి నేలపై
మెల్లగఁ గొట్టవలయును ఇది మహా వేధ ఉద్యానబంధము
కడుపులోపలికిఁ దీయుట మూలబంధము=మడిమచేతఁ గ్రింది
రెండురంధ్రముల నడిమిభాగమునొత్తి గుదముబిగించి లోనికి
లాగుట జాలంధరము=గడ్డము ఱొమ్మునకుఁ దగులునట్లు తల
వంచుట.

విపరీతకరణి=తల క్రిందమోపి కాళ్లు పైకెత్తి వ్రేలాడుట
లేక నిలఁబడుట దీనిని వీథిలో బిచ్చగాండ్రు చేయుదురు

వజ్రోలిముద్ర = స్త్రీపురుషులు సంభోగసమయమున
జాఱుచున్న రేతస్సును మరలఁ బైకిలాగుట. ఇది స్త్రీపురుషు
లిరువురు నభ్యసింపవచ్చును. పదునాలు గంగుళముల గొట్ట
ము స్త్రీలు తమ భగములోనికి, పురుషులు తమ శిశ్నము

లోనికిఁ బ్రతిదినము మూత్రకృచ్ఛ్రరోగము వారికివలెఁ దూర్చు చుండవలయును ఇంతచేసినను ఖేచరి ప్రాణజయములేక యిది సిద్ధింపదు దీనివిషయము పూర్ణముగ బహిరంగముగ వ్రాయరాదని వ్రాయలేదు

ఇది నేర్పెదమని మిషచేత దొంగయోగులు వయస్సు విధవలఁ జెఱచుచున్నారు

శక్తిచాలనము= గురుముఖముగా నేర్చుకొనవలయును ఇఁక శాంభవీ-ఖేచరీ-షణ్ముఖీ-ఉన్మనీలక్షణము తెలిపెదను

ఈకాలములో దంభముగా నీవేస్షచెప్పుచుఁ జెడువారే కాని సాధించెడువారు లేరు

## శాంభవి

కనుతెప్పలార్పక, షట్చక్రములలో నేదేని యొక చక్ర మందు నంతఃకరణవృత్తిని ప్రాణవాయువును జలింపకనిలిపిన శాంభవీముద్రయగును దీనియందు మనస్సంతయు హృదయ స్థానమందుండవలయును కన్నులు తెఱచియుండినను బాహ్య వస్తువేదియు గోచరింపరాదు.

## ఖేచరి.

పైప్రకారమేచేయుచు దృష్టిని రెండుకనుబొమల నడుమ నుంచవలయును చలింపనీయరాదు ఇంతియకాక నాలుకనుఁ ద్రిప్పి క్రీనాలుకదాఁకఁ జేసి యచటినుండి కపాలములోనికిఁ బోవురంధ్రమునఁ దూర్పవలయును తననాలుక కొనత్రోఁకగను బొమలనడిమి ప్రదేశముదాఁకఁ గలవాఁడుగాని యీకార్యము

చేయఁజాలఁడు ఇటుచేయలేక నేను ఖేచరి సాధించెదననువాఁడు తెలివిమాలినవాఁడుగనో, మోసగాండ్రు దొంగలుగనో యుం॰ వలయును దీనికిని మనోజయము, ప్రాణజయము, దృష్టిజయ మత్యావశ్యకము కేవల కుంభకము సాధించినవాఁడు గాని దీనిని జేయఁజాలఁడు ఈముద్రయం దుచ్ఛ్వాసనిశ్వాసములు రెండిటినిలిపి కేవలకుంభకమందుండి వాయువును సుషుమ్న యందుఁ బ్రవేశింపఁ జేయవలయును దీనియందు నాలుకచే గాలి పూరింపరాదు

శ్లో॥ భ్రూమధ్య దృష్టిరప్యేషా, ముద్రాభాసతి ఖేచరీ,
కపాలకుహరే జిహ్వా, ప్రవిష్టా విపరీతగా
భ్రువోర్మధ్యగతా దృష్టి,ర్ముద్రా భవతి ఖేచరీ

ఉన్మని

కనురెప్పలు సగము మోడ్చి కనుబొమలుపైకెత్తి చూపును ముక్కుకొనయందుంచి మనస్సుచలింపనీక నిలిపి స్థిరాసనమునఁ గదలకకూర్చుండి ప్రాణవాయువు నిరోధించుట యున్మని యనంబడును ఖేచరిసాధించిన వానికేఁగాని యున్మనిసాధ్యము గాదు దానికిఁజెప్పినలక్షణములు దీనికి గలవు

---

షణ్ముఖీముద్ర-నాదానుసంధానము

శ్లో॥ ముక్తాసనే స్థితోయోగీ, ముద్రాసంధాయ శాంభవీమ్
శ్రుణుయాద్దక్షిణే కర్ణే, నాదమంతస్థ మేకధీః

శ్లో॥ "శ్రవణపుట, నయనయుగళ, ఘ్రాణముఖానామ్ నిరోధ నం। కార్యం, శుద్ధసుషుమ్నా సరణౌస్ఫుటమమలః శ్రూ యతేనాదః॥"

శ్లో॥ అంగుష్ఠా భ్యాముభౌ కర్ణౌ, తర్జనీభ్యాం చ చక్షుషీ
నాసాపుటౌ తథానాభ్యాం, ప్రచ్ఛాద్య కరణానిచ

"ముక్తాసనము (సిద్ధాసనము) నందుండు యోగి శాం భవీ ముద్రనుజేసి యేకాగ్రచిత్తుఁడై కుడిచెవియందు సుషుమ్నా నాడియందుఁ గల నాదమును వినువాఁడగును గాక" రెండు చెవులు, రెండుకన్నులు, రెండునాసికాద్వారములు నోరు అను వీనిని చేతివ్రేళ్లతో నిరోధము చేయవలయును అనఁగా మూసికొనవలయును అప్పుడు ప్రాణాయామముచేత శుద్ధమై యుండు సుషుమ్నా మార్గమునందు అమలమైన (కలంకములేని) నాదము చక్కఁగా వినఁబడుచున్నది.

నిరోధనవిధాన మెట్లనఁగా, పెద్దవ్రేళ్లతో రెండు చెవులను జుట్టన (చూపుడు) వ్రేళ్లతో రెండుకన్నులను, నడిమి వ్రేళ్లతో రెండు నాసికాద్వారములను మూసి చకారమువలన తక్కినవ్రేళ్లతో నోరు మూసికొనవలయును దీనిని షణ్ముఖి ముద్రయనియుఁ జెప్పుదురు" హఠయోగప్రదీపిక.

నేను గ్రామసంచారము చేయునపుడు కొందఱు స్త్రీలు పురుషులు మేము షణ్ముఖిముద్ర సాధించుచున్నామని నాతో దందుఁజెప్పిరి దానియందలి కష్టమెఱుఁగుటచే వీరికె ట్టిది సులభసాధ్యమయ్యెనని యాశ్చర్యపడి యెట్లుచేయుచున్నారో చూపుఁడని కోరితిని ఒక యాఁడుదిగాని యొక మగవాఁడు గాని నోరు మూయలేదు యథాప్రకారము మూరెఁడు బుస కొట్టుచుండిరి నోరు మూయ రేల? యని యడిగితిని మా

గురువులవా రిట్లే చెప్పిరని యంటఱు చెప్పిరి కుంభకము సాధిం
చితిరా యంటిని. లేదనిరి ప్రాణాయామాభ్యాసమైనఁ గలదా
యంటిని లేదనిరి పోనీ ఆహారనియమము గలదాయంటిని
లేదనిరి ఇట్టివారుసుఁడీ నేఁడు ముద్రలుసాధించి మోక్షమును
బొందువారు

నేనాశ్రమమునందుండు నపుడు గోదావరి లంకలోనుండి
యొకఁడువచ్చి నేను లంబికాయోగము సాధించితిననెను.
ఎట్లోచూపుమని యడిగితిని నాలుక క్రీనాలుక యంటించెను
గాని యరనిమిషములోనే యూపిరాడక తికమకలాడెను.
ఇతఁడు ప్రాణాయామమెట్టిదో యెఱుఁగఁడు ఆహారనియతి లేదు.
నాడీశుద్ధికాలేదు తరువాత దానిలోనుండు కష్టము దెలిపి
నీకిది సాధ్యపడదు పొమ్మంటిని

ఇది సాధకుల యందలి లోపముగాదు వారికి నేర్పఁబడి
నది వారు సాధింప యత్నించిరి ఎంతో శ్రద్ధాళువులై బాగు
పడు నాసక్తితోఁ దమ్ముగురువులుగఁ గైకొన్నవారికిఁ దమకుఁ
దెలియనివిషయములు ప్రతిష్ఠకో, ధనాశనో కామదాసులయి
యో నేర్పి నానాబాధల పాలుసేయు దొంగయోగులు నిం
ద్యులు

"ప్రచ్ఛాద్యకరణానిచ" యనువాక్యమున ననుక్తసము
చ్చయమైన చకారమునోటిని దెలుపునని తెలుఁగున నర్థము వ్రా
యఁబడినది ఒకనోటికిమాత్రమే యన్వయించు నెడల "కరణము
లనుగూడ" యను బహువచన ప్రయోగమునకుఁ గారణము

లేదు సంస్కృతము నబహువచనము మూఁడిటికిఁ దక్కవను దెలుపదు. కావునఁ గరణములన్నప్పుడు నోరు మూలాధారము (గుదము) స్వాధిష్ఠానము (మేహనము) ననుమూఁటిని గ్రహింప వలయును నాదానుసంధానమునకు నోరుమాత్రము మూయుట చాలునని యాంధ్ర టీకాకారు లభిప్రాయపడిరేమో

"పరివ్రాడ్యోగయుక్తశ్చ" యన్నట్లు యోగయుక్తుఁడైన సన్న్యాసికి యోగికిఁ బ్రాణవియోగకాలమున నుపయోగ పడునది యీ యాసనమే.

షణ్ముఖియందు రెండుకన్నులు - రెండుచెవులు - రెండు ముక్కులుకలిసి యాఱని కొందఱు తలంతురేమోకాని యదైన నోటితో నేడు కావలసియుండును నోరుమూయని నాదాను సంధానము వ్యర్థము. ఉచ్ఛ్వాస నిశ్వాసములుండవేని వీని ధ్వని వినవచ్చునుగాని యనాహతధ్వని వినరాదు - అది సరి గాదు శ్రోలుత వినవచ్చుధ్వని నాళములందు నెత్తురు వేగ ముగఁ బాఱుటవలనఁ గలుగు ధ్వనియేకాని యితరముకాదు ఏటినీళ్లధ్వనివంటిది - ఇది ముఖ్యముగాదు-అనాహతము ముఖ్య ము మీఁదలక్షణమునఁ జెప్పినట్లు ప్రాణవాయువును సుషుమ్న యందు నిలుపఁదలఁచినవాఁడు క్రింది రెండురంధ్రములను గూడ బిగింపవలయును అట్లుచేయకుండిన వాయువామార్గ ములవెంట వెలుపలఁబోవును. కావున షణ్ముఖియనునపుడు 1. రెండుచెవులు 2 రెండుకనులు 3 రెండుముక్కురములు 4. నోరు 5 ఉపస్థము 6. గుదము ఈవిధముగ నాఱింటిని తొక్కింపవలయును.

సీ. అంఘ్రిమూలమున మూలాధార చక్రంబుఁ
బీడించి ప్రాణంబు బిగియఁ బట్టి
నాభితలముఁ జేర్చి నయముతో మెల్లన
హృత్సరోజముమీఁది కెగయఁ బట్టి
యటమీఁద నురమందు హత్తించి క్రమ్మఱఁ
దాలుమూలమునకుఁ దఱిమి నిలిపి
మతముతో భ్రూయుగ మధ్యంబు సేర్చి దృ
క్కర్ణనా సాస్యమార్గములు మూసి
గీ. యిచ్ఛలేని యోగి యొక్కముహూర్తార్థ
మింద్రియానుషంగ మింత లేక
ప్రాణములను వంచి బ్రహ్మరంధ్రముఁ జించి
బ్రహ్మమందుఁ గలయుఁ బార్థివేంద్ర. భాగ ౨ స్కం.

ఇందు మూలాధారముఁ జెప్పఁబడినదే కాని మేహన
ము చెప్పలేదే యందురేమో అపానవాయుస్థానము గుదమే
కాని మేహనము (లింగము) కాదు (గుదే౽పానః) ప్రారంభ
స్థానమదియే. మేహనమునుండి వాయువు వెలికిఁ బోకుండ బిగిం
పవలయునే కాని దానివలనఁ బీల్పఁబడునది లేదు కావున రెండ
వస్థానము గనాభి చెప్పఁబడినది ఆంధ్రీకరింపఁ బడలేదు గాని
సంస్కృతమున నాఱుస్థానములు చెప్పఁబడినవి

శ్లో॥ స్వపార్ష్ణినా పీడ్య గుదం తతో౽నిలం
స్థానేషు షట్సూన్నమయే జ్జితక్లమః॥ భాగ. ౨. స్కం.

నవరంధ్రములు మూయుటావశ్యకము గనుకనే.



సంఖ్య ౫

మహాయోనిబంధము—షణ్ముఖీముద్ర

శ్లో. సర్వద్వారాణి సంయమ్య, మనోహృది నిరుధ్యచ
మూర్ధ్న్యా ధాయాత్మనః ప్రాణ, మాస్థితో యోగధారణామ్
ఓమిత్యే కాక్షరం బ్రహ్మ, వ్యాహరన్ మా మనుస్మరన్
యఃప్రయాతిత్యజన్ దేహం, సయాతి పరమాం గతిమ్
భగవద్గీతయం దీవిప యమున సర్వరంధ్రములు మూసి యని చెప్పఁ బడెను

గ్రంధ విస్తరభీతి బాధించుచున్నది. సంక్షేపముగఁ జెప్పితిని ఇన్ని ముద్రలయందును మనస్థైర్యము (ధారణ) అత్యంతావశ్యకము ధ్యానము స్థిరపడక ధారణరాదు ప్రత్యాహారము దృఢపడక ధ్యానమునిలువదు ప్రాణజయము వైరాగ్యము చిరతరాభ్యాసములేక ప్రత్యాహారము కుదురదు. ఆసనసిద్ధిలేక ప్రాణజయములేదు ఇన్నియుండినను భక్తియు యమనియమములు లేవేని సర్వము బూడిదెలోఁ జేసినహోమము

ఈకాలపు ముద్రాభ్యాసకులకు సీతారామాంజనేయ సంవాదముగదా ప్రమాణంబు దానియం దేమిచెప్పఁబడెనో వినుఁడు "అష్టాంగంబులు గలిగి యీ యభ్యాసయోగంబు ప్రకాశించునది అపరిపక్వచిత్తులకు యోగం బతి దుర్లభం బిది యమాద్యష్టైశ్వర్యంబుల నొసంగుచు నాత్మజ్ఞానంబు ప్రకటంబుఁజేయు మఱియుఁ బ్రవిమలచిత్తులకు జీవ బ్రహ్మైకజ్ఞానమాత్రంబు నిచ్చు నతి సులభంబైన జ్ఞానయోగంబు రాజయోగం బనంబడు. నీకెంటికి శ్రీరామచరణ కమలభక్తి కార

ణంబు దానికి వైరాగ్యంబు మూలంబు " అని కలదు కేవల మనోవ్యాపారమైన రాజయోగమునకుఁ బ్రాణయామముకూడ నావశ్యకముగాదు ఈ రాజయోగము భక్తులకుఁ దప్పఁ దక్కిన వారికి లభ్యపడదని యీ గ్రంథమే చెప్పుచున్నది

కం ఈరాజ యోగమార్గం
బీరేడు జగంబులందు నెవ్వరెఱుఁగ రా
త్మారామ లసదపాంగా
పారకృపాయుక్తులైన భక్తులుదక్కన్ సీతా ౧౯౦

కేవల భక్తిజ్ఞానంబు లాధారముగాఁగల రాజయోగము నందు తారకసాంఖ్యామనస్కములని మూఁడు భాగములు కల్పించి యందుఁ దారకమం దీముద్రలనుగుఱించి సగమైనఁ జెప్పిచెప్పక విడిచెను ఈతారకముద్రలు హఠయోగాదులఁ జేరినవి. రాజయోగమున కనావశ్యకములు అత్యంతకష్ట సాధ్యములు సాపాయములు యోగులకుఁ బాతంజలి మార్గము శ్రేయస్కరము అది భక్తిజ్ఞానములకు మిక్కిలి తోడు పడును సీతారామాంజనేయ సంవాదము సమగ్రబోధక శాస్త్రముగాదు దానిసంగ్రహము కావున నభ్యాసికిఁ గావల సిన విషయములన్నియు నభ్యాసపద్ధతులను జెప్పక వదలిపెట్టఁ బడెను అది తెలియనివారదియె పర్యాప్తమని నమ్మి చెడు చున్నారు ఇంతకు నీముద్రలఁ దెలుపు

తారకంబు మనశ్శుద్ధి కారకంబనియే చెప్పఁబడెను. కావున ముద్రలు ముద్రలని పలవరించు దంభాచారులు సాధింప శక్తి

యుండిన సక్రమముగ సాధింతురుగాక లేదా మాయావేష ములు చాలించి వెఱ్ఱిమొఱ్ఱులాడక భక్తుల నాక్షేపింపక ముద్ర లకొకనమస్కారముచేసి సుఖపడుదురుగాక

ఇఁక భక్తినిగుఱించియు దాని ముద్రలగుఱించియు విచ రించెద. అష్టాంగయోగమునకుఁ దారక సాంఖ్యామనస్కము లంగములుగాఁ గల రాజయోగమునకు శ్రీరామభక్తి - వైరా గ్యము మూలకారణంబులని కవియె చెప్పెఁగదా. శ్రీసీతా రాములచేత నీ యోగము లుపదేశంబునొందిన ‘‘హనుమంతుఁ డొక్కపరమై కాంతస్థలంబున సుఖాసీనుండై శ్రీరామచరణ భక్తియుక్తుండును, శ్రీరామజపపరాయణుండును శ్రీరామ బ్రహ్మ తత్త్వావలోకన నిరతిశయ నిర్వికల్ప సమాధినిష్ఠుండునై జీవ న్ముక్తి సుఖం బనుభవించుచు నిమ్ముహూర్తంబున నున్నవాఁడు.’’ అనియుఁ జెప్పఁబడెను ఇందుఁ జెప్పఁబడిన సమాధికి భగవద్భ క్తియు, భగవన్నామ జపముచాలును తక్కిన వనావశ్యకములు ప్రహ్లాదుఁడై దేండ్లవాఁ డీముద్రల నభ్యసింప లేదుగదా!

శ్లో॥ పానీయంబులు త్రావుచుం గుడుచుచుం భాషించుచుం హాసలీ। లానిద్రాదులు సేయుచుం దిరుగుచుం లక్షించు చుం సంతత। శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృ తా స్వాదసం। ధానుండై మఱచెం సురారిసుతుఁ డేత ద్విశ్వముం భూవరా॥

ఈదశకేమిపేరో యిది యేముద్రలవలన వచ్చెనో యీ ముద్రాయోగులు చెప్పుదురుగాక ఈమూఁడు యోగము లుప దేశమునొంది సాధించినజీవన్ముక్తుని స్థితికవి యిట్లువర్ణించెను

సీ. ఒకవేళఁ దనయందు సకలప్రపంచంబు
కల్పితంబని యెంచి కాంచి నవ్వు
నొకవేళ సర్వభూతోపాధి తుదియందుఁ
దనుఁజూచి మిగుల సంతసముఁ జెందు
నొకవేళ దేహాదు లొప్పుగా విహరింప
సర్వసాక్షి నటంచు సంభ్రమించు
నొకవేళ నన్వయించుకలే దొకండనే
నని నిర్వికల్ప సమాధి నొందు

గీ నతుల వైరాగ్య బోధోపరతులు గలుగు
నతని మహిమలు గణుతించి యభినుతింప
హరిహర హిరణ్యగర్భులకైనఁ దరమె
యపరిమిత సద్గుణనికాయ యాంజనేయ!

ఇఁకఁ బ్రహ్లాదుని గుఱించి భాగవతంబున

సీ శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైనఁ
జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు
నసురారి తనమ్రోల నాడినయట్లైన
నసుర బాలురతోడ నాడమఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ
బరభాషలకు మాఱు పలుకమఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ
జొక్కి సమస్తంబుఁ జూడమఱచు.

గీ. హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినదైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడునిభంగి.

సీ. వైకుంఠచింతావివర్జిత చేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంతహరి భావనారూఢచిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁడింతియకాని వేఱొండులేఁడని
యొత్తిలినగుచుండు నొక్కచోట
నళినాక్షుఁ డనునిధానముఁ గంటి నేనని
యుబ్బిగంతులువైచు నొక్కచోటఁ

ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్షజనిత బాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
యొక్కచోటనిలిచి యూరకుండు

గాసిపడి నాము గరడీలగు ముద్రాదులు నేర్చిన యోగికిని భక్తుఁడగు బాలునకుఁ గల వాసి బుద్ధిమంతు లెఱుంగుదురుగాక.

ఇంతయుపదేశమునొంది యోగములసాధించి నిర్వికల్ప సమాధినుండు నాంజనేయునెట్టి వానిఁగాఁగ వివర్ణించెనో చూడుఁడు

మ తనరం గాయముచేత రామచరణద్వంద్వైకదాస్యంబు, హెూ
 చ్చినభక్తిం దగువాక్కుచే ననిశముశ్ శ్రీరామనామప్రకీ
 ర్తనముం, జిత్తముచేత రామపరతత్త్వ ధ్యానముం జేయుశ్రీ
 హనుమంతుశ్ సముపాశ్రయింతు మదభీష్టార్థంబు సిద్ధిం
 పఁగన్ ॥

చ అరయఁగ భక్తపాలనములైన భవద్గుణ జాలమాత్మసం
 స్మరణముసేయ వాక్కు నినుసన్నుతిసేయ శరీరమెల్లఁగిం
 కరపరిచృత్తిసేయ మదిఁగాంక్ష యొనర్చెదఁగాని యెల్లనే
 నరిది ధ్రువోన్నతస్థలము నబ్జజపట్టన మింద్రభోగమున్.

 ఇది భక్తియోగికార్యముగా శ్రీభాగవతంబునఁ గలదు.
తారతమ్య మరయుఁడు

సశేషము

---

## —రాధాకృష్ణ సంవాదము—

(గత శేషము ౧౩౫ పుట చూడుము.)

కృ—ఏమంటి వేమంటివే మరల ననుము నన్ను రాధగా
 సృజించి నీవు కృష్ణుఁడుగానయి యుందువా? అయ్యో!
 యంతపుణ్యము నేను జేయనైతిఁ గదా!

రాధ—కృష్ణుఁడుగాఁబుట్టి నీవు చాల శ్రమముపడుచున్నావు
 కాఁబోలు.

కృ—రాధగాఁబుట్టి నీవు చాలఁ గష్టపడుచున్న దానవు
 కాఁబోలు.

రాధ—కానా మఱి నీకు నాకుఁ దారతమ్యము చెప్పెద వినుము నీవు పురుషుఁడవు కాఁబట్టి స్వజాత్యభిమానముచేఁ బ్రాముఖ్యము పురుషులకేయిచ్చి వారి కానిసలుగా మమ్ముఁ జేసితివి ఇరువురను నీవేకదా సృజించితివి ఈ పక్షపాత మేల? స్త్రీలయం దింతకసియేల? ఇరువురను సమముగాఁ జూచుట కిష్టము లేకున్న మమ్ము సృష్టిచేయక యే యుండవలసి యుండె పురుషులను విడిచిన స్త్రీలకు నిహాము లేదాయె పరము లేదాయె అన్నిటికి స్త్రీలు పురుషులపై నాధారపడ వలసి యున్నవారుగదా? నీవు స్వతంత్రుఁడవు నీ వేది యెట్లు చేసినను దప్పుపట్టువారు లేరు కావున నీకు భయము లేదు కనుకనేకదా కొందఱ వృద్ధులుగను, గొందఱఁ గుంటులు గను, గొందఱ రోగులుగను, గొందఱ భోగులుగను, గొందఱ ధనికులుగను, గొందఱ దరిద్రులుగను, జేసితివి. ఇదియేమిన్యాయము ఒకరు నీకేమి యమృతమిడిరి మఱి యొకరేమి విషము పోసిరి అందఱను నీవే సృష్టించితివి నీవే యందఱకుఁ దండ్రివి తండ్రియైనవాఁడు తనబిడ్డలం దఱు నన్ని వేళల నిత్యకల్యాణము పచ్చతోరణముగ నాడు చుఁ బాడుచుఁ గష్టమెఱుఁగక సంతోషముతో నుండఁ జూ చుట బాగా నొకరేడ్చుచు నొకరునవ్వుచు నొకరుముక్కుచు నొకరుమూల్గుచు నుండఁ జూచుట బాగా

నీవు స్వతంత్రుఁడవైకదా యీ నిమిషమున సృష్టించె దవు ఒకనిమిషముంచెదవు. మఱునిమిషమున సర్వము ధ్వం

సముచేసెదవు చెట్టుపెట్టినవారు విషవృక్షమునైన ఖండింపరు గదా ఇదియేమి పిల్లచేష్టలు. పిల్లికిఁ జెల్గాటము ఎలుకకుఁ బ్రాణ సంకటము పిల్లవాండ్రు మట్టిబొమ్మలతో నాడిన ట్లాడెదవేఁ

నేనా పరాధీనను ఏమిచేసిన నీకు నొప్పికలుగునో యని భయపడుచు భయపడుచు నీకు మెప్పుకలుగఁ బ్రవర్తింపవలయును పరాధీనము ప్రాణసంకటము నీతోడి కార్యమా కత్తి మీఁది సాము నీవేమో శాస్త్రాలని చట్టాలని యేర్పఱిచి నావు నీవు స్వతంత్రుఁడవు కాఁబట్టి నీవు చెప్పినదంతయు శాస్త్రమే నిప్పుతో సమిధలఁ దడుపుమని యిట్లవివేకవాక్యములు చెప్పినను నర్థములేని వాక్యములు, పరస్పర విరుద్ధవాక్యములు చెప్పినను దప్పనరాదు అంటినా వచ్చెఁ బ్రాణగండము. ఈ శాస్త్రములెన్ని? అవియెన్నో నీకే తెలియదు అవియేల? మమ్ము బాధింపనే నీకు వానివలన భయములేదు నేనా యీఁడుదానను చదువా రాదు వానిని నేను విననైనఁ గూడదు వింటినా పాపము ఆప్రకారము చేయకుంటినా పాపము తెలిసికొనువిధ మెట్లో? ఎన్నని తెలిసికొందును ఎంతని తెలిసికొందును అన్ని తెలిసికొని తూ చా తప్పక యా ప్రకారము చేయుటకు నాఁడుపిల్లకు నాకు సాధ్యమా? నీ శాస్త్రములోనుండున దేదియైనఁ జేయక విడిచితినా ఇదిగోఁ బాపముచేసితివి పో పదివేలేండ్లు నరకానికి. ఆవలఁ గుక్కగాఁ బుట్టుమందువు తెలిసియో తెలియకయో నీ శాస్త్రమునఁ గూడదని చెప్పినదానిని జేసితినా పో కుంభీపాక నరక

మునకు. ఆవల నక్కగాఁ బుట్టుమనెదవుకాని దయాదాక్షి
ణ్యము చూపెదవా? నేను దొంగతనము చేసితినా చేతులు
తెగఁగొట్టు కొఱ్ఱులతోఁ గాల్పుచునెదవు నీవు దొంగతనము
చేసితివా యది మహా ఘనకార్యము చేసినట్లు నేను జంకు
తనము చేసితినా యూరు నా డేకమగును అందఱు దూషిం
చువారే నీవు జంకుతనముచేసిన నా జంకుటాలిని బవిత్రను
జేయుటకు. నాతోడ జంకాడినవానికి నాకుఁ గాలిన యినుప
బొమ్మల కౌఁగిలంతలు నీతోడ జంకాడినదానికి నాయుజ్య
ముక్తి బ్రహ్మానందానుభవము

నే నాకుగిల్లినను గాయకోసినను హింస నీవు వేల
కొలఁది చంపిన లోకోపకారము నా జిహ్వకు రుచిగాఁ గడు
పారఁ దినిన దోషము నీ కెంత పెట్టినను నేమిపెట్టినను నది
హింసగాదు పరమపవిత్రము పరమపుణ్యము

పరులదుఃఖము నీకు సంతోషము ఎంత దయలేనివాఁ
డవురా కృష్ణా! అటుచూడు మెందఱుగోపికలు నడిరేయి-అడవి
ప్రదేశము - తేలనక - పామనక - గామునక - పురుగనక - పుట్టనక -
యందఱు చిన్నవయస్సువారు కృష్ణా కృష్ణాయని చెట్టుచెట్టు-
గుట్టగుట్ట - పొదరుపొదరు - వెదకివెదకి వేసారి దుఃఖపడుచుండ
గూటమువలె నిండుఁ గూర్చుండి వేడుక చూచుచున్నాఁడవు
గాని పోరాదా మాటలాడరాదా వా రెంత సంతోషింతురు

కృ—రాధా నామీఁద నెన్ని నేరములు మోపితివే నీ యభి
ప్రాయములో నాకంటెఁ బాపాత్ముఁడు లేఁడుగదా?

రాధ—కృష్ణా కృష్ణా యట్టులనకుము కృష్ణుఁడు దేవుఁడు గదా యేల యిట్టి యసంగతకార్యములు చేయుచున్నాఁడని నాకుసందేహము దానివలన నడిగితిని నాసందేహములు తీరునుగాని నేనొక్కటి యడిగెదఁ జెప్పుము నీవు దేవుఁడ వగుదువా కావా?

కృ—అట్లనిన నాకుఁదెలియదు ఎట్టివాఁడు దేవుఁడో వాని లక్షణములుచెప్పిన నేను దేవుఁడనగుదునో కానో యావలఁ జెప్పెదను

రాధ—ఎట్టివాఁడు దేవుఁ డనెదవా? చెప్పెద విను తల్లిదండ్రులు లేనివాఁడు. సర్వము దెలిసినవాఁడు. అన్నికార్యములుచేయు సమర్థుఁడు. ప్రపంచమును సృజించువాఁడు రక్షించువాఁడు శిక్షించువాఁడు తనకంటె గొప్పవాఁడు కాని తనతో సమానుఁడైనవాఁడు కాని లేనివాఁడు. కోరవలసినదేదియు లేనివాఁడు సంకల్పము వ్యర్థముకానివాఁడు నిత్యసంతోషి జరామరణాదులు మొదలైన హేయగుణములు లేనివాఁడు సౌశీల్యము-దయ-వాత్సల్యము-సౌలభ్యము మొదలగు కల్యాణగుణములు గలవాఁడు క్రూరత్వము పక్షపాతము మొదలైనవి లేనివాఁడు సర్వము నియమించువాఁడు సర్వము తనవశమునం దుంచుకొన్నవాఁడు. ఇంతయేల? అన్ని మంచిగుణములు గలవాఁడు. చెడుగుణ మొకటైన నెన్నఁడైన నెందైన లేనివాఁడు దేవుఁడు

కృ—నాయందు లోకములోని దుర్గుణములన్ని యున్నట్టు చెప్పితివి ఇఁక నేను దేవుఁడనని చెప్పిన నమ్ముదువా? చెడుగుణములుకలవాఁడు దేవుఁడుగాఁడని తీర్మానించితివి నేను జెడుగుణములు గలవాఁడనంటివి మరల నన్ను దేవుఁడవాయని యేలయడిగెదవు? సందేహ మేలకలిగెను.

రాధ—నేను జెప్పిన దోషములన్నియు నీయందుఁ గానవచ్చినను మనుష్యులుచేయ సాధ్యపడనికార్యములు చేయుచున్నావు దేవుఁడా యెనా యిటువంటి పాపకార్యములు చేయఁడు. మనుష్యుఁడా యెనా యింత గొప్పకార్యములు చేయలేఁడు కావున నితఁడు దేవుఁడా మనుష్యుఁడా యని సందేహము

కృ—అయ్యో పాపము గొల్లపిల్లలు చీఁకటిలో నన్ను వెదకుచు శ్రమపడుచున్నారు అచ్చటికిఁబోయి వారినూరార్చి వచ్చెదను నీవిందేయుండుము

రాధ—దీనికేకదా నిన్ను దొంగకృష్ణుఁడని నేనుబిలుచుట అడిగినదానికి సమాధానముచెప్పక తప్పించుకొని పోవఁజూచెదవు

కృ—ఒక్కమాట మాటాడివచ్చెదను పోనీయవే

రాధ—నేను బోనీయను నాప్రశ్నములకు సమాధానము చెప్పి యావలఁబో. (అని జడతోఁ జేతులుకట్టి తొడమీఁదఁదొడవేసి యొత్తిపట్టి మెడకౌఁగిలించి కూర్చుండును) ప్రపంచము నేల సృజించితివి సృజించినవాఁడవు

విషమసృష్టియేల చేసితివి? నీయందు నేను జూపిన దోష ములకేమిసమాధానము నేను నిన్ను సృజించితినంటివే యదియెట్లు వీనికి సమాధానములు చెప్పిన విడుతును లేకున్న నిన్ను విడువను

కృ—రాధా! యెంత వగలమారివే. ఇంతలోనే తెలిసెం గదా! నామగతనము - నీయాండుతనము-నాబలము-నీదుర్బ లత్వము - నాస్వాతంత్ర్యము - నీపారతంత్ర్యము - నానిర్దయ త్వము-నీసదయత్వము-నేను బడుసుఖము-నీవు పడుకష్టము- ఇంక మనయిద్దఱ తారతమ్యముగుఱించి నేను వేఱుగ వక్కా ణింపవలయునా?

నేను మగవాండనుగనుకం బ్రాముఖ్యము పురుషులకే యిచ్చితినంటివి స్త్రీపురుషులపేర్లు చెప్పునపుడు ప్రకృష్టమైన పేరు ముందుచెప్పవలయునని వేదాంగమైన వ్యాకరణమందుం జెప్పితినిగానా? కావుననేకదా రాధాకృష్ణులని నీపేరు ముందు చెప్పి యవల నా పేరుచెప్పెదరు ఇట్టులే సీతారాములు, లక్ష్మీ నారాయణులు, గౌరీశంకరులు మొదలైనవి లోకమునం బ్రశస్తి వహించినవి తరువాత దేవత్వమందు ముందు నీయనుగ్రహము సంపాదించిన వారినేకదా పిదప నే ననుగ్రహించుచున్నాను. నీవు నిగ్రహించినవారి నెన్నండైన నెవరినైన నే ననుగ్రహించి తినా? మనుష్యులలోం జూతమా యనిన ముందుగం దల్లినిదే వతవలెం జూడుమని చెప్పితికదా యావలం దండ్రిని దేవతవలెం జూడుమంటిని. తండ్రికంటెం దల్లిగారవంబున నూఱంతలెక్కు

డనినేఁ జెప్పలేదా స్త్రీలుదయావతులు ఓర్పుగలవారు ఎంత కష్టమైన సహింపసమర్థలు అని కదాపురుషుల కసాధ్యమైన ప్రసవభారము స్త్రీలయందుంచితిని స్త్రీలు లేకున్నఁ బ్రజాసృష్టి లేదు పోషణములేదు. ఆకారణముచే నేను లేనివాఁడనే నాకు రూపనామక్రియలు దక్కించువారు స్త్రీలే నాకొక రూపము కావలయుననిన స్త్రీసాహాయ్యమే కావలయును నే నొకకార్యము చేయవలయుననిన స్త్రీసాహాయ్యమే కావలయును. నా శక్తులందఱు స్త్రీలే వారిని గాదని నేనేమి చేయఁ గలను వారి యధికారమునకు నేనుగూడ నొక్కొక్కసారి లోఁబడియుందును స్త్రీలకుఁ బ్రాముఖ్య మీయ లేదంటివే. గృహస్థాశ్రమము తక్కిన యాశ్రమములకంటె నేల శ్రేష్ఠమయ్యెను జెప్పుము భార్యాసాహాయ్యముగలదు గావునఁగదా! సహధర్మచారిణియైన భార్యను బానిసయంటివి ఎంత గయ్యాళి గంగమ్మవే నీవురాధా

(సశేషము)

---

అచ్చుకట్టకముందే పిచ్చుకలరావిడి

(శేషము ౨౫౬ పుట చూడుము)

చి॥ వెంపాటి లింగయ్యను దీ॥ దీ॥

నాయనా! నీవు వ్రాసిన యుత్తరము ననుసరించి నీవు పంపిన సమదర్శినీ పత్రికా ఖండమునఁ గల విషయములలో నామీఁద మోపఁబడిన నేరములకుఁ బ్రత్యుత్తరము పూర్వసం

చికయం దిచ్చితిని ఆంజనేయులుగారు వ్రాసిన మఱికొన్ని విషయములకుఁ బ్రత్యుత్తర మియ్యవలసి యున్నది వారిప్ర శ్నములు వ్రాఁతవైఖరిమాడ నజ్ఞానముపుం భావమొందినట్లు తోఁచుచున్నది ఇంతమాత్రమైనచో దూష్యముగాదు గాని యిది తామసాహంకార పూర్వకమై యుండుటచే సత్య మసత్య ముగను నసత్యము సత్యముగను భావింపఁజేసి శుష్కవాదము నకు దురాక్షేపమునకుఁ గారణమయ్యెను ఇదిశోచనీయము ఆయన దీనిని చదివి చక్కఁబడునో వైతండికుఁడుగ మాఱునో చూడవలయును

"శూద్రుఁడెవఁడు జీవునకు కులములుగలవా" యని వారు ప్రశ్నించిరి "ప్రమాణం వేదాశ్చ, చత్వారో వర్ణాః, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాః" అని ప్రారంభించి యీనలు గురిలో వెనుకటి వెనుకటి వారికంటె ముందు ముందువారు శ్రేష్ఠులని స్మృతి తెలుపుచున్నది నలుఁవురిలో నాలవవాఁడు శూద్రుఁడు ఇది పూర్వజన్మసంస్కారముచే దేహముతోడ వచ్చును. దేహముతోడఁ బోవును. కనుకనే విదుర - ధర్మ వ్యాధ - శబరీత్యాదులు నిజమైన బ్రహ్మజ్ఞాన నిష్ఠులయ్యు మేము శూద్రులమని చెప్పికొనిరి ఆంజనేయులుగా రెఱిఁగి నంత వారెఱుఁగరు కాఁబోలు. జీవునకుఁ గులములుకల వా యను వారిప్రశ్నమునకు సమాధానముచెప్పి యావల నీసందేహము దీర్చెదను. జీవులకుఁ గులములు లేవుగాని సం స్కారములు లేకపోలేదు ఆసంస్కారబలము వలననే జీవులు

సంస్కారానుభవమునకుఁ దగిన నానాజాతుల నానారూపముల జనించుట ఇట్లు పూర్వసంస్కారముకారణమై యనుభవించినఁ గాని నశింపని ప్రారబ్ధరూపమున దేహము దాపరించియుండ దేహముతో మాకుఁ బనిలేదని చిలుకపలుకులు పలుకఁగానే పూర్వ సంస్కారములు ప్రారబ్ధ మెగిరి మాయమై పోవును గాఁబోలు. "దైవాయత్తం కులే జన్మ, మదాయత్తంచపౌరుష" మ్మనికర్ణుఁడు చెప్పినట్లు మనపూర్వజన్మ సంస్కారములనుబట్టి యేకులమందు నేదేశమందు నేకాలమందుఁ బుట్టవలయునో యట్టికుల దేశ కాలములందు దైవము మనల జన్మింపఁజేయును. కులమందుజన్మము మనయత్నముకాదు భూమిమీఁదఁబుట్టిన తరువాత పౌరుషము మనయందున్నది ఇప్పటికొందఱు బ్రాహ్మణులు శూద్రసంస్కారముల నభ్యసింప శూద్రులుబ్రాహ్మణ సంస్కారముల నభ్యసించుచున్నారు మొదటివారు భవిష్య జ్జన్మమందు శూద్రుఁడుగనో వైశ్యుఁడుగనో మఱియేమిగనో పుట్టఁగలఁడు అట్లే శూద్రుఁడు వైశ్య క్షత్రియ బ్రాహ్మణ జాతులలో యోగ్యతకొలఁది పుట్టఁగలఁడు అంతియగాని యీజన్మమందు ప్రారబ్ధ మనుభవింపక తప్పదు 'ప్రారబ్ధం భోగతోనశ్యేత్', 'ప్రారబ్ధం పరిభుజ్య' అనిప్రమాణములు.

ఇప్పుడు నీవు తెలిసికొనవలసిన విషయమొకటి కలదు. ఉపదేశించినది దేహమా? జీవుఁడా? నేనాక్షేపించినది దేహమునా? జీవునినా? ఆత్మలేని దేహ ముపదేశింపఁగలదా యందువేమో? న్యాయ్యమైనప్రశ్నయే భిన్నదశయందు రెండు నేపని

యుఁ జేయఁజాలవు కావున రెండుకలసి యొకకార్యముచేసి నపుడు రెంటిని లెక్కకుఁదీసికొనక ముక్తదశవఱకు ననపాయమై సర్వకర్మసాధకమైన దేహమును దమ్మిడీకైనఁ గొఱగానట్టు మాటలాడ నేల? అట్లు దేహముతోఁబనిలేదేని ఆత్మజ్ఞానైకాకారములు జ్ఞానస్వరూపములు జ్ఞానగుణకములుగదా? ఆంజనేయులవారి యజ్ఞానకులము జ్ఞానకుల మనుభేద మెందుండివచ్చెను? కొన్ని జీవులపైఁ గోపించి యాంజనేయులవా రజ్ఞానకులమున వారి నేల త్రోచిరి వారు వీరికిఁ బెట్టినవిష మేమి? తెలియక యడుగుచున్నాను. ఆంజనేయులవారు క్షమింతురుగాక.

జీవులకు నామములుగలవా? లేవుగదా శూద్రులచే నుపదేశముఁ బొందినవారిని నాంజనేయుల వారివంటి విజ్ఞులు మీగురువెవరని ప్రశ్నించినపుడు నారాయణరెడ్డి యనియో మంగలరంగఁడనియో, కుమ్మరగుడువఁడనియో దూదేకుల హుస్సేననియో తురకమస్తాన్ అనియో చెప్పుచున్నారా? లేక జీవాత్మయని చెప్పుచున్నారా? ఈపేర్లుచెప్పిరేని జీవాత్మవలన నుపదేశము పొందినట్లెట్లగును? కావున నాంజనేయులవారెన్ని విధములరంతులుచేసినను దేహప్రయుక్త దోషముపోదు కపిల గోవుపాలు శ్రేష్ఠములేకదా! వానిని నొక ఘటములోఁ బోసి యిచ్చిన నాంజనేయులవారు త్రాగుదురా? ఏల త్రాగరు? వారు నామీఁది పౌరుషమునకైన దేనినేని త్రాగెదరనుకొమ్ము లోకమునమ్మతించునా? ఏల? ఆధారగతదోషముగలదు. అట్టులే

యాత్మశుద్ధమైనను దేహమునందుండువఱకు దేహగతదోషము పోదు సూర్యకిరణము తెల్లనిదైనను రక్తకాంతిగల యద్ద ములోనుండి వచ్చినపుడు రక్తవర్ణము గుణభేదము కలదగునే కాని తెల్లనిదగునా? కావున నుపాధివలనఁ గలిగినగుణమో దుర్గుణమో యాధేయమునకు నంటునుగాని యంటకపోదు ఆత్మలన్ని పదార్థములందుఁ గలవుగదా? నేపాలముదినిన విరే చనములగుటకు విషము దినినఁ జచ్చుటకు నుమ్మెత్తదినిన పిచ్చి పట్టుటకుఁ గారణ మేమి? ఇవి దేహగుణములా? ఆత్మగుణములా? ఒక్కవిధమైన లేఁబచ్చికను దెచ్చి యావునకు గుఱ్ఱమునకు సమానముగనిడుము ఆవుపేఁడయందుఁగల గుణముగాని వాసన గాని గుఱ్ఱపులద్దెయందుఁగలదేమో చూడుము ఏమీకార ణము? కావున దేహములన్నియుఁ బ్రాకృతములైనను గుణ భేదములుగలవని యెఱుంగుము దేహములోని జీవుఁడే మాకు లెక్కగాని దేహముగాదనిగదా యాంజనేయులవారివాదము ఇది యీవిషయమందుమాత్రమా? నాలుగుతులముల బంగా రును రెండుకడ్డీలుగాఁ గొట్టి వానిని తులమెత్తినుప రేకులలోఁ బొదిగియిచ్చిన లోకులు వాని నేమందురు దేహముమీఁద ధరింతురా? ఏలధరింపరు? మీఁదనుల్లి పొరవలెఁగదా యినుప రేకున్నది. లోపల శుద్ధమైనబంగారమే కదా! నాలుగుతులాల రాగికడ్డీలను తులమెత్తు బంగారురేకుతోఁగప్పిన బంగారుకడి యాలని స్త్రీలు పురుషులు ధరించుటలేదా? కావునఁ గోశ ము త్యాజ్యము గాదు

విభజింపఁదగినవి రెండుకులములె 1 జ్ఞానకులము. 2 అజ్ఞానకులము అని వ్రాసిరి ఇది విశ్వామిత్రసృష్టి ఆంజనేయ కల్పితము ఇది తృణముసేపటుండనీ లోకమున దైవముసృజించి నది రెండుజాతులే స్త్రీలని పురుషులని ఇట్లుండ నత్తయని యమ్మ యని పెండ్లామని భేదములు మనుష్యకల్పితములుగావున వీనిని దొలఁగించి పురుషుఁడు యదేచ్ఛముగ తల్లితోఁగాని తోడుతోఁగాని సంభోగింప వచ్చుననుట యెట్టిదో యాంజనే యులవారి యీవాదమట్టిద అజ్ఞానకులములోఁజేరినవి కేవల ప్రాకృత పదార్థములు జ్ఞానకులములోఁ జేరినవి ప్రకృతివియుక్త శుద్ధాత్మలు అంతియేకాని రెండుకలిసి యుండునప్పుడు ఆంజనే యులవారికులవిభాగము సరిపడదు ఇది యనాలోచితవిభాగము

ఏమికాలమహిమయో కాని పరమహంస జీవన్ముక్త బ్రహ్మజ్ఞానిపదములు మనయంధ్రదేశమునఁ జాకలివానియింటి గాడిదలైనవి ఇట్టివారిపుడు పుట్టకపోయినఁ బూర్వపుఋషులు సత్యవచను లెట్లగుదురు? నాయనా! మఱియొకవిషయమా లోచింపుము మంత్రలక్షణము, జ్ఞానబోధలక్షణము, జీవ న్ముక్తలక్షణము, బ్రహ్మజ్ఞానిలక్షణము, తెలియకపోయినను ఆంజనేయులవారు తాము జ్ఞానకులములోఁ జేరినవారని తలం చుచున్నట్లు వారివ్రాఁతయే తెలుపుచున్నది. అట్టివీరు రేపు న్యాయస్థానమున సాక్ష్యమిచ్చుటకుఁ బోయి రేని నీ కులమేది యని న్యాయాధిపతిగారడిగిన నేమిచెప్పెదరు. జ్ఞానకులమం దురా? అజ్ఞానకులమందురా? లేక తమనైజకులము పేరు చెప్పు

దురా? ఏల? వ్యవహారమునకందురా? జ్ఞానికేమివ్యవహారము? నిజముగా వీరిమతమునఁ గులములు రెండేయయ్యేనేని వీరిజీవన్ముక్తునికంటె మాదిగకొండమ్మ యుత్తమురాలు కావునవీరు 1 మాదిగ కొండమ్మయింటికిఁబోయి. 2 సాష్టాంగప్రణామమాచరించి. 3. పాదతీర్థముతీసికొని. 4 మంత్రోపదేశము నొంది 5 బాగుపడి. 6. కృతజ్ఞులై 7 ప్రతిదినము.

శ్లో మాదిగకొండి సమారంభాం, కమసలాచారి మధ్యమామ్
కమ్మనాయని పర్యంతాం, వందేగురు పరంపరామ్.

అని గురుపరంపర ననుసంధింతురుగాక గురుపరంపర చెప్పని శిష్యుఁడు గురుద్రోహి నాయనా! కమ్మనాయని పర్యంతామ్మని వ్రాయుటచే నీవు కోపింపవలదు నీ వాగురు శిష్య కోటిలోఁ జేరినవాఁడవుకావు. ఆగురు పరంపరలోఁ జేరినవారిని వారిశిష్య ప్రశిష్యులు ధ్యానింతురు గాని తక్కినవారేల ధ్యానింపవలయును? ఆంజనేయులవారు జ్ఞానకులములోఁ జేరినవారైనచోఁ దమసర్వ సమత్వము జ్ఞానమహిమ ప్రకటింపనైన మీఁదఁజెప్పినకార్యము చేయవలయును. లేక యజ్ఞానకులములోఁజేరిరా బాగుపడుటకైనఁ జేయవలయును. కార్యముఫల దాయకముగాని శుష్కవాదముగాదు. కావున నాంజనేయుల వారు కార్యశూరు లగుదురుగాక యని సవినయముగఁ బ్రార్థించుచున్నాను.

ఆంజనేయులవారు తాము లక్షణమెఱుఁగక దురన్వయము చేయకుండుటకును, నీవు జీవన్ముక్తుఁ డెట్టివాఁడో-జ్ఞాని

యెట్టివాఁడో తెలిసికొని క్షుద్ర వేషధారుల మాయలకు వశ
పడక, ముడ్డికి మూఁతికి భేదము తెలియక వ్రాసెడివారి వ్రాఁత
లను నమ్మక, బాగుపడుటకును-జ్ఞానిలక్షణము-జీవన్ముక్త లక్ష
ణము కొంచెముగ వ్రాసెదను

"బ్రహ్మనిష్ఠుండగు నాచార్యునొద్ద, వేదాంతవాక్య తాత్ప
ర్యమును బలుమాఱు శ్రవణముచేసి, శ్రుతార్థమును మనన
నిధ్యాసనములచే మనస్సునందు దృఢపఱుచుకొని, సర్వసంగ
ములు పరిత్యజించి, వైరాగ్యోపశమవృత్తులుగలిగి, జితేంద్రి
యుఁడై నిరహంకారుఁడై సర్వభూతదయాపరుఁడై నిరంతరము
భగవంతునియందు వేదనోపాసనభక్తి శబ్దవాచ్యమగు ధ్రువా
నుస్మృతిగలిగియుండుట జ్ఞానయోగమనఁబడును." సీ రా సం.

ఇట్టిదిగల యోగి జ్ఞాని.

శ్లో. సంజ్ఞాయతే యేన తదస్తదోషం,
శుద్ధం పరం నిర్మల మేకరూపమ్,
సందృశ్యతే వాప్యధిగమ్యతేవా,
తజ్జ్ఞాన మజ్ఞాన మతోన్యదుక్తమ్     వి పు.

శ్లో ప్రత్యస్తమితభేదం య త్సత్తా మాత్రమగోచరమ్।
వచసామాత్మసంవేద్యం, తజ్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్॥

విష్ణుపురాణము.

శ్లో విద్యావినయసంపన్నే, బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ, పండితా స్సమదర్శనః॥     భ గీ.

జ్ఞానీ త్వాత్మైవ మేమతమ్. భ గీ.

శుద్ధము - పరము - నిర్మలము - ఏకరూపము - హేయగుణ రహితమునగు పూర్వోక్త భగవత్స్వరూపమును దేనిచే నెవఁడు (బుద్ధిచేఁ) దెలిసికొనుచున్నాఁడో, (కన్నులచేఁ) జూచుచున్నాఁడో, యెవఁడు పొందుచున్నాఁడో, అట్టిది జ్ఞానము - తక్కిన దజ్ఞానము.

భేదరహితమై సత్తామాత్రమై, వాగగోచరమై, యాత్మప్రకాశకరమైన దేదియో యది బ్రహ్మజ్ఞానము విద్యావినయ వంతుఁడైన బ్రాహ్మణునియందు, గోవునందు, నేనుఁగునందుఁ గుక్కయందు దానిని వండి తిను చండాలునందు సమభావ మెవఁడుంచునో వాఁడు జ్ఞాని.

జ్ఞానియో నాప్రాణ మేయని నాయభిప్రాయము. అని కృష్ణమూర్తిచెప్పెను జ్ఞానసాధనములు —సాధనచతుష్టయ సంపత్తి, వివేకాదిసంపత్తి, మఱియును.

ద్విపద మానహీనత, యదంభత్వ, మహింస
మానితక్షాంతియు, మఱియార్జవంబు
నాచార్య సేవయు, నాత్మనిగ్రహము
శౌచంబు, స్థైర్యంబు, సర్వవిషయము
లందు వైరాగ్య, మహంకృతి లేమి
పొందుగఁ బుట్టుట పొలియుట వ్యాధి
జరయు, దుఃఖము, దోషసంతతి వీని
నరయుచుంట, యసక్తి, యాలును బిడ్డ

ద్విపద. లందు గృహాదుల నా సక్తిలేమి
యొందినచో నిష్టమొండె ననిష్ట
మొండె నెల్లప్పుడు నుల్లంబులోన
నుండుట భేదంబునొందక, మఱియు
నాయందు విజయ! యనన్య యోగమునఁ
బాయని నిశ్చలభక్తిమై నుంట
జనవర్జితంబైన స్థలమునందుంట
జనులకూటముల నాసక్తి లేకుంట
నిరత మధ్యాత్మమై నెగడుజ్ఞానంబుఁ
దిరముగఁ దలఁచుచుఁ దేజరిల్లుటయుఁ
బరఁగఁ దత్త్వజ్ఞానపరమార్థ దృష్టి
నరయ జ్ఞానంబు నా ఖ్యాతంబు లివియు ద్వి భ. గీ

వీని నన్నిటిని సాధించినవాఁడు జ్ఞాని
వ్యవహారదశయందు జ్ఞానివర్తన మెట్లుండునందు వేమో.
హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని బెట్టినహింసలు నీవు చదివి
తివిగదా. అప్పుడు ప్రహ్లాదుఁ డేమిచేసెను

చం పలువురు దానవుల్ పొడువ బాలునిదేహము లేశమా
త్రము। న్నొలియదు లోపలన్ రుధిర ముబ్బదు, కందదు
శల్యసంఘముల్ । నలియదు దృష్టివైభవము నష్టముగాదు
ముఖేందు కాంతియుం। బొలియదు నూతనశ్రమము పుట్టదు
పట్టదు దీనభావమున్

ఉ. తన్నునిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమా
టికో। పన్నగశాయియోదనుజ భంజనయోజగదీశ యో
మహా। పన్నశరణ్య యో నిఖిలపావన యంచు నుతించుఁ
గాని తాఁ। గన్నులనీరు దేఁడు భయకంపసమేతుఁడు
గాఁడు భూవరా

ఉ పాఱఁడు లేచి దిక్కులకు బాహువులొడ్డఁడు బంధురాజి
లోఁ। దూఱఁడు ఘోరకృత్యమని దూఱఁడు తండ్రిని
మిత్రవర్గముఁ। జీరఁడు మాతృసంఘము వసించు సువర్ణ
గృహంబులోనికిఁ। దాఱఁడు కావరే యనఁడు తాపము
నొందఁడు కంటగింపఁగన్.

ప్రహ్లాదుఁడు బాధ తెలిసి సహించుకొనెనా బాధయే
తెలియలేదాయందువేమో. ఆయనకు బాధయే తెలియలేదు
ఏల?

గీ హరిపదాంభోజయుగ చింతనామృతమున
నంతరంగంబు నిండినవాడైన నతఁడు
నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియునుమఱచి
జడతలేకయునుండును జడునిభంగి

శ్లో సత్వాసక్తమతిః కృష్ణే, దశ్యమానో మహోరగైః
న వివేదాత్మనోగాత్రం, తత్స్మృత్యాహ్లాద సంస్థితః వి పు

మనస్సంతయుఁ గృష్ణునియందే యుండుటచేఁ బెను
బాములు గఱచుచున్నను తనదేహము దానెఱుంగఁడు. భగ
వంతునిస్మరించి సంతోషయుక్తుఁడైయుండెను ఇట్టివాఁడు జ్ఞాని

ఒకగురువును మర్కార్గులు కొట్టిరి. ఆయనను శిష్యులు మఠము లోనికిఁ దెచ్చి యుపచరించుచుండ స్మృతి కొంచెము వచ్చిన పిమ్మటఁ బరీక్షకై నేనెవరో మీకుఁ దెలియునా యని పాలు పోయుచున్న శిష్యుఁ డడిగెను నన్నుఁ గొట్టినవాఁడేయని గురువు బదులిడెను ఈయనజ్ఞాని. కాలిపోవుచున్న మిథిలలో నా దేదియుఁ గాలిపోలేదని జనకుఁడుచెప్పెను ఈయన జ్ఞాని

జ్ఞాను లనఁగా నిట్టివారు. జ్ఞానగుణములు కొన్నియైన నుండిన వానిని జ్ఞానియనుట యౌపచారికము - సత్యముగాదు మీఁదఁజెప్పినగుణములు గలజ్ఞాని యేజాతివాఁడైనను జ్ఞాన బోధకుఁగా గ్రహింపవచ్చునుగాని యుత్తమకులుఁడు గాఁడేని మంత్ర దేశికునిగా గ్రహింపరాదు

కొందఱు కబీరుచే కంచర్ల గోపన్న రామమంత్ర ముప దేశము నొందలేదాయని యడిగిరి. వీరు కబీరేకాలమువాఁడ గోపన్న యేకాలమువాఁడు కబీరు పంథాగ్రంథములందు నెందైన గోపన్న తన శిష్యుఁడని కబీరువాక్యము కలదా గోపన్న యెందైనఁదనమంత్రగురువు కబీరనిచెప్పెనా అట్లై నచో ‘‘ఆర్యులకెల్ల మ్రొక్కి వినతాంగుఁడనై రఘునాథభట్ట రాచార్యుల కంజలెత్తి’’ యని గోపన్న యేలచెప్పెను శంకరా చార్యులవారు మాలవానిని గురువనిచెప్పలేదా యని యొక యాక్షేపము? శంకరాచార్యుల • వారితో వాదించిన మాల వాఁడు నేఁడు నాకు లభించెనేని నేనును గురువుగా గ్రహింప సిద్ధపడియున్నాను.

శంకరాచార్యులవారు గంగలో స్నానముచేసి యొక నాఁడు కాశిలోనికిఁబోవుచుండ భార్యాసమేతుఁడైన చండాలుఁ డొకఁడెదురుగావచ్చెను అప్పుడు శంకరాచార్యులు చండాలుఁడా తొలఁగిపొమ్మనెను. అప్పుడు వారికిపరస్పరము సంవాదముజరిగెను ఆవల చండాలుని యోగ్యతయెఱిఁగి శంకరులు ౫ శ్లోకములుచెప్పిరి. వీనికే మనీషాపంచకమనిపేరు వానియందిట్లు వ్రాయఁబడియున్నది బృహత్స్తోత్ర రత్నాకరము చూడుము.

శ్లో॥ సత్యాచార్యస్యగమనే, కదాచిన్ముక్తి దాయకమ్
కాశీక్షేత్రం ప్రతి సహ, గౌర్యా మార్గేతు శంకరమ్
అంత్యవేషధరం దృష్ట్వా, గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్
శంకరః సోపిచండాల, స్తం పునః ప్రాహ శంకరమ్

దీనివలన శంకారాచార్యులవారి కెదురుగవచ్చిన చండాలదంపతులు గౌరీశంకరులని యేర్పడుచున్నది వారమిూఁద వారెవరో తెలిసికొని

శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తిషుస్ఫుటతరా యాసంవి దుజ్జృంభితే
యాబ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం నచదృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపియస్యాస్తిచే
చ్చండాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ

యనిచెప్పిరి అయ్యో యిట్టిచండాలుని గాంచు భాగ్యమైన నాకీజన్మంబునఁ గలదా

శంకరాచార్యులవారు గురువని చెప్పినంతమాత్రముననే మంత్రగురువని భ్రమింపవలదు భాగవతంబున నేకాదశస్కంధంబున నొకయవధూత తనకు నిరువది నలువురు గురువులని చెప్పెను. ఈ ౨౪ గురిలో చెట్లులు గుట్టలు వేశ్యలును గలరు

భారత భాగవతముల దాఁక నేలపోవలె నావిషయమే నేను జెప్పెదను టెంకాయచిప్పశతకమున(అముద్రితభాగమున)

గీ దోనెపూఁడిని నీపూరిలోనఁ గలుగు
కమ్మకొమ్మల గుర్వులుగా గ్రహింపఁ
గంటి నిద్దర, వారు నన్ గాఁగిలించి
మాత బిడ్డల నిమిరెడి మాడ్కిగాఁగఁ
దనువు నిమిరిరి యెంతయో చనువుదోఁప
నెన్నినాళ్లకుఁగంటిరా యన్నయనుచు
నెన్నఁడో యెడఁబాసిన చిన్నికొమరు
మరలఁగాంచిన తల్లుల కరణిఁ గంట
నీరుగార్చుచు, నిశ్చేష్ట నిలువ నేను
లక్ష్మిదేవమ్మయును మహాలక్ష్మియమ్మ
కన్నకూఁతులకంటెను గరముప్రేమ
గల్గువారయ్యె వారు నాకాళ్లు దాఁక
వలవదనుచునుగోపించి పలికినాఁడఁ
బూర్వ; మయ్యదియె నాబుద్ధిపూరిమేయ
మైల వారలు తపసిని మడుఁగు నేను
వారు నన్ దాఁకఁ బోలియుఁ దపంబటంచు

గీ॥ సర్వమును వాసుదేవుఁడన్ జ్ఞానమేది.
కమ్మకొమ్మలవలన భ్రమమ్ము దీఱెఁ,
దలఁచినాఁడ నిటుల్ వారు దాఁకువేళఁ;
దరుణులందఱు తల్లులన్ దలఁపుగలదు
చెడునెకామకుండు తల్లి స్పృశించెనేని

* * * * * *

ఎందు నామది నీరూప మందె యనుచు
నెందు నాతలవ్రాల్తునో యందె నీదు
చరణయుగమని యధ్యవసాయముండెఁ
బరులు నే నను టెల్లను భ్రాంతిగాదె?
నేను ననుఁదాఁక హానియు నివ్వటిలునె?
ఆదినారాయణస్పర్శ హానికరమె?
ఇట్టిభావంబుతోడ నేనెల్లవేళ
శునకచండాల గార్దభసూకరముల
కన్నిటికి మ్రొక్కుచుందు నారాయణాంశ
మనుచు భగవతేనమ యనుచునోరఁ.
బరులు స్పృశియింప నేమిట్టి పడితిచేని
నిన్నియును నపహాస్యమై యెన్నఁబడదె?

* * *

కలికిగుణములతిప్ప టెంకాయచిప్ప.

తెనాలితాలూకాలోఁ గొన్ని గ్రామములు తిరుగునప్పుడు జింకచర్మము కౌపీనముగా ధరించియుంటిని అప్పుడొక గ్రామములో నొక కమ్మగృహస్థునింటికి రామభిక్షకై పోయితిని. ఆ యిల్లాలు నన్నుఁ జూచి దేవుఁడుకప్పినతోలు చాలక మరల మఱియొక తోలుతోఁ గప్పవలయునా యని ప్రశ్నించెను ప్రాణములు నిలువునఁ బోయినట్లయ్యెను "తల్లీ! స్త్రీలకు వెఱచిచుమీ! యంటిని" "ఇంకను నీకీ భ్రాంతిపోలేదా?" యని యామె యనెను. "రామకార్యార్థమే" యని యంటినిగాని నాలో నేనే సగము చచ్చితిని

స్వప్నమున భగవంతుఁడు బోధించియు, నాచార్యుఁడనుజ్ఞ యిచ్చియు నొకవిషయమున నాజంకు నమసిపదిగాదు ఆఱు భిన్నగ్రామంబుల నార్వురు స్త్రీలచేత దైవికముగ నా జంకు వదలెను. నాయనుభవ మందిట్టివి మఱికొన్నిగలవు వీరందఱు నాకు గురువులే గురు వనఁగా నజ్ఞానాంధకారముఁ బోఁగొట్టువాఁడు. వీరందఱట్లు నావిషయమునఁ జేసినవారే. ఒక్కవిషయము దృఢపడ భగవంతుఁ డిందఱచే నిన్నివిధముల బోధపఱిచెను. వీరిమూలమున నజ్ఞానలేశము (ఇంకను బది కాండ్లీనిచినంతయున్నది) సమయుటనిజమే వీరిని గురుభావంబున నేను గౌరవంబున స్మరించుచుంటయు సత్యమే ఐనను వీరి పాదతీర్థము తీసికొంటినా? వీరి చేనుంత్రోపదేశమునొందితినా? "ఏవు నాయనా! పదములలక్షణాన్వయము లెఱిఁగి కార్యములు చేయుము. పండితమ్మన్యుల యీ పాత మధుజల్పి

తముల నమ్మకుము వారేమి చెప్పుచున్నారో వారికే తెలి యదు. దానికై దుఃఖించెడ జ్ఞానికి జీవన్ముక్తునకు విశేష భేదము లేదు జ్ఞాని కానివాఁడు జీవన్ముక్తుఁడు కాఁజాలఁడు

మ మదిరాపానమదాంధుఁ డాత్మపటముఁ మైనుండిననఁ జాతి
నఁ। వదులై వ్రేలినఁ జూడఁడప్పగిది జీవన్ముక్తుఁడు ప్రత్య
మా। ధిదశాప్రాప్తసుఖామృతానుభవ తృప్తిఁ మత్తుఁడై
మేనునె। మ్మదిఁగూర్చుండిన లేచినఁ నడిచినఁ మన్నింపఁడే
నంచుఁ దాఁ॥

మ తరుణీనందన బంధుసాధురిపు మిత్రవ్రాతముల్ తన్నుఁబ।
ల్మలునిందించిన సన్నుతించిన మహామానావమానాదుఁలఁ।
నెఱిఁబొందించిన నిర్వికారుఁ డగుచుఁ నిశ్చేష్టుఁడైయుండు
భా। స్వరతత్త్వాను భవజ్ఞుఁ డెయ్యెడల జీవత్యక్తి దేహ
స్థితిఁ॥

గీ బహుళసంకటములు ప్రాప్తంబు లైనచోఁ
చల్లడింపఁ డాత్మతత్త్వ విదుఁడు
వాయు శీతవహ్ని వర్షాతపమ్ముల
కించుకైన గిరి చలించవట్లు

ఇంకను వలయునేని సీతారామాంజనేయ సంవాదము ౩. ఆ. ౧౭౨ ౧౭౬. ౧౭౭ పద్యములను చూడుము.

జీవన్ముక్తులు జ్ఞానులు నిట్టివారైయుండ జాపిలను ద్రోహు లను వంచకులను దంభాచారులను, గామదాసులను, శిశ్నో

పరపరాయణులను సర్వామేధ్యపదార్థభక్షకులను నదిష్టస్నాత్రు లను నగుపప్రక్షాళకులను జీవన్ముక్తులని జ్ఞానులని యజ్ఞులు వ్రాయసాహసించినపుడు వారిమాట లెంతవఱకుఁ బాటింప వలయునో నీవే యాలోచింపుము

"యేజాతివాఁడైనను, పుట్టువచే శూద్రుఁడనియు, జన్మయె శూద్రత్వముకాక అజ్ఞానసమన్వితమనియు విజ్ఞానోద యముచేఁ గ్రమేపిపైమెట్టుకు రాగలడనియు ప్రామాణ్య గ్రంథములు బోధించుచుండ ........... నాసుదాసు గారు శూద్రునిబోధచే చెడుట యెటులగమనించిరో తోచ లేదు" అని విమర్శనము ప్రత్యుత్తరము.

ఏజాతివాఁడైనను పుట్టుకచే శూద్రుఁడనుట సరిగాదు. వీరిమనసునందు జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజ యనుశ్లోకము స్మరించి యిటువ్రాసిరని యెఱుంగుదు ఈ శ్లోక మేస్మృతిలోనిది? ఏసందర్భమునఁ జెప్పఁబడినది వీరి "ప్రామాణ్యగ్రంథ" మేది? ముందుగం దెలియవలెను. ఇచట ద్విజుఁడనఁగా బ్రాహ్మణుఁడనుటతప్పు. ద్విజశబ్దము బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు మువ్వురకు నన్వయించును ఈ మూఁడు వర్ణములవారు జన్మముచే శూద్రప్రాయులు. అనఁగా నుపన యన సంస్కారము జరగువఱకు వీరు శూద్రులవలె నిలువఁబడి యుచ్చపోయుట, యెంగిలితినుట లోనగుకార్యములు చేసినను బాపములేదు. ఉపనయనముతో రెండవజన్మము వచ్చును.

సశేషము.

# ముముక్షుహితచర్య.

## విషయసూచిక.

శ్రీరామ

# భక్తి సంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి కైంకర్య రూప **మాసపత్రిక.**

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి

విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)

ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట కడప మండలము

**చందాల వివరము.**

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైబడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు

సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు

మూర్ఛావస్థయందున్న భక్తిమూర్తికి [illegible] కొరకు నుపచారము చేయువారివంటి వారు ఉపచారకులు

కుత్తుక [illegible] ప్రత్తితో నీళ్లను [illegible] పోయువారు ధారకులు

స్మృతిగలిగించు ఔషధములిచ్చువారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయము రాకుండ ప్రతికూలములనుండి [illegible] రక్షించువారు రక్షకులు

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థైర్యము నిలుపువారు ప్రతిష్ఠాపకులు

విడిప్రతిక 0—4—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ | అ | పై |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె జక్కగ సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

# ముముక్షుహితచర్య.

---

| | రూ | అ | పై |
|---|---|---|---|
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

Title Page Printed at Read & Co, Printers, Triplicane High Road.




# శ్రీ భక్తి సంజీవని.

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక.
ప్రతి హూణమాసారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు - ప్రకాశకుఁడు వావిలికొలను సుబ్బరావు,
(వాసుదాసుఁడు.) ఒంటిమిట్ట.

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి।
భక్తివశః పురుషః॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతునిబొందించును. ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే. భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨. { ప్రమోదసం॥ ఆశ్వయుజమాసము. అక్టోబరు నెల ౧౯౩౦ సం॥ } సంచిక ౧౦.

శ్రీరామాయనమః.

రామచంద్రమహారాజుకు జేజే
భూమీతనయాపతికిని జేజే
సామజవర సంత్రాతకు జేజే
శ్యామ సుందరమూర్తికి జేజే ॥రామచంద్ర॥

రావణ కంఠవిదారికి జేజే
దావజ్వాలాపాయికి జేజే
గోవర్ధనగిరిధారికి జేజే
దేవకి ముద్దులపట్టికి జేజే ॥రామచంద్ర॥

ఆనత రాక్షసవైరికి జేజే
దానదయాపరమూర్తికి జేజే
మానవతీ భయహారికి జేజే
దీనచయా వనకేళికి జేజే ॥రామచంద్ర॥

ఏకశిలాపురవాసికి జేజే
క్ష్మాకన్యాసంయుతునకు జేజే
లోకపాలనా పరునకు జేజే
శ్రీకర గుణభూషితునకు జేజే ॥రామచంద్ర॥

వాసుదేవ శుభమూర్తికి జేజే
వాసుదాస వరదునకు జేజే
దానజ నావన రతునకు జేజే
వాసరపతికుల మణికిని జేజే. ॥రామచంద్ర॥

## సంజీవనీ దోషములు.

(గతసంచికా శేషము ౪౨౦-వ పుట చూడుఁ.)

శ్రీరాములగుఱించి విశేషించి చెప్పుటకుఁ గారణములు సంజీవని ముందే ప్రకటించియున్నది.

౧. సంజీవని శ్రీకోదండరామ సేవకసమాజ పత్రిక యగుట.

౨. శ్రీకోదండరామసేవక సమాజసభ్యులకు నిష్ట దేవత ముఖ్యముగ శ్రీరాముఁ డగుట.

౩. సర్వ ముముక్షువులకు శ్రీరాముఁ డుపాస్యమూర్తి యగుట.

౪. పణ్డితములవారికి శ్రీరాముఁడు వంద్యుఁడగుట.

౫. సీతారాములు సులభులు – స్మరణమాత్ర సంతుష్టులు నమస్కారమాత్ర ప్రసన్ను లగుట.

౬. శ్రీరాముఁడు భుక్తిముక్తి దాత యగుట.

౭. కరుణాకాకుత్స్థ యని బిరుదు వహించియుండుట.

౮. భక్తి యేకాంతము – అనన్యమునై యుండవలయు నని బోధించుట.

ఇత్యాదులు కారణములు.

అట్టి దేవుఁడు అట్టియుపాయము మఱియొండు లేదా యందురేమో – లేఁడు లేదు అనియే ప్రత్యుత్తరము. ఉన్న దందురా మీ రట్టిమార్గమున నట్టి దేవునిఁ గొలిచి ఫల మను భవింపుఁడు. అశోకవనంబున రాక్షసస్త్రీలు సీతాదేవిని జూచి,

ఓసి సీతా నీమగఁడు మనుష్యుఁడు – రావణుఁడు మనుష్యులఁ దినువాఁడు. నీమగనికి రెండుచేతులు – రావణునకు నిరువదిచేతులు. నీమగనికి నొకతల – రావణునకుఁ బది తలలు. నీమగనికి రెండుకన్నులు – గావణునకు నిరువది

కన్నులు. నీమగఁడు వనవాసి - రావణుఁడు పట్టనవాసి. నీ మగఁడు రాజ్యభ్రష్టుఁడు-రావణుఁడు సింహాసనస్థుఁడు. నీమగ నికి సేవకులు లేరు - రావణునకు లక్షలకొలఁది కలరు. నీ మగఁడు దరిద్రుఁడు - రావణుఁడు మహైశ్వర్యసంపన్నుఁడు అని యీప్రకారము చెప్పిరి. సీత యంగీకరించెనా?

మీరావణుఁడు గొప్పవాఁడైన మీరు సేవింపుఁడు. న న్నేల పీడించెద రనెను. పతివ్రతయగు స్త్రీ నిఱుపేద యైనను దనమగనిని గొప్పగాఁ జూచినట్లు సేవించినట్లు కోటీశ్వరులనైనఁ జూచునా? భక్తుఁ డట్టివాఁడే. కావున మారాముఁడే గొప్పవాఁడు మాభక్తిమార్గమే శ్రేష్ఠమని సంజీవని చెప్పెను-చెప్పుచున్నది - చెప్పఁగలదు. శాస్త్రములు ప్రమాణము. ఫలానుభవము సాక్ష్యము. అట్లు లని సంజీవని యితరదేవతల నిందింపదు. ద్వేషింపదు. గౌరవింపకపోదు.

అయ్యా! నీమతప్రకారమైనను రాముఁడు నారాయణుని యవతారమూర్తియే కదా. నారాయణుఁ గూర్చియే యేల విస్తరించి వ్రాయరాదు. అందు రేని ఇరువురకు భేద మే మేమెఱుఁగము. మబ్బులోని నీరేకదా చెఱువులలో-నదులలోనుండునీరు - మబ్బులోని నీరు త్రాగక నదులలోఁ దటాకములలో నుండునీరు మీ రేల త్రాగెద రనిన మీ రేమి ప్రత్యుత్తర మిచ్చెదరు? చాతకము మబ్బులోనినీరే నేలయంటకముందే త్రాగును. అంతటిశక్తిచాలని యితరజం

తువులు నదీతటాకములలోని నీరే త్రావును. దప్పితీరుట
రెంటను సమానము. ఒకటి దుర్లభము - మఱియొకటి
సులభము. ఒకటి ప్రత్యక్షము. మఱియొకటి పరోక్షము.

మధురయందున్న కృష్ణమూర్తిని దర్శింప గోపికలు
పోయిరి. ఆసమయమునఁ గృష్ణమూర్తి కిరీటము - హారాంగ
దాదిభూషణములు - పట్టువస్త్రములు - శంఖము - చక్రము
ధరించి సింహాసనముపైఁ గూర్చుండియుండెను. కృష్ణదర్శ
నము కావలయునని కోరఁగా ద్వారపాలురా పామర స్త్రీలను
లోపల విడిచిరి. కృష్ణుఁ డేఁడీ యన నీయనయే యని
యచ్చటివారు చూపిరి. ఛీ యీయన మనకృష్ణుఁడు కాఁడే
పోదము రండని వారు తిరిగిపోవుచుండిరి. ఇంతలోఁ గృష్ణుఁడు
నెమలిపించము - వేణువు - వనపుష్పములమాల లోనైన గోప
చిహ్నములు ధరించి మరల వారల రమ్మని చెప్పిపంపెను.
ఆకృష్ణునిఁ జూచి మనకృష్ణుఁడే మనకృష్ణుఁడే యని కృష్ణా
కృష్ణా యని పైపడి కౌఁగిలించిరి.

బద్ధుఁడైన హనుమంతునిఁ జూచి ప్రహస్తుఁడు నీవు
విష్ణువు పంపఁగా వచ్చితివా? ఆయనకు నీకు స్నేహము
కలదా యని యడుగ హనుమంతుఁడు విష్ణు వెవ్వరో నాకుఁ
దెలియదు. ఆయన పంపఁగా నేను రాలేదు. రాముఁడు
పంపఁగా వచ్చితి ననెను. లీలాశుకునకు భగవంతుఁడు శర
చాపములు కిరీటము ధరించి శ్రీరామచంద్రమూర్తివలె గోచ

రింపఁగా వానిని నావలఁబెట్టి వేణువు-నెమలిపింఛెము ధరించి
వచ్చితివేని యీవల నమస్కరించెద ననెను. శ్రీరాముఁ
డెవఁడు శ్రీకృష్ణుఁ డెవఁడు? ఇట్టి నిదర్శనములు పెక్కులు
గలవు. వారి వారి యిష్టదైవములగుఱించి యిట్టి యభిప్రా
యము గలవారై యాయా దేవతాభక్తు లుండవలయు ననియే
సంజీవని మార్గదర్శినియై బోధించుచున్నది. ప్రార్థించుచున్నది.
సంజీవనియందు మతద్వేషము - దేవతాంతర ద్వేషము కల్పిం
చుట క్షుద్రబుద్ధిలక్షణము.

వైష్ణవధర్మశాస్త్రముల ప్రకారము కేవల వైష్ణవత్వ
మునకుఁ బంచసంస్కారదీక్ష యావశ్యకము. అది లేనివారికి
నారాయణాష్టాక్షరి యుపదేశింపరాదు. వీరివృత్తము చాత
కము వంటిదే. అట్టిమార్గమునఁ బోలేనివారికిఁ బోవ నిష్ట
ములేనివారికి రామాష్టాక్షరి, షడక్షరి ప్రశస్తములు. ఉభ
యులకు ఫలము సమానము. ఒకటి యద్వారకము మఱి
యొకటి సద్వారకము. ఒకటి హనుమంతుఁడు లంకలోనికి
నెగిరి దూఁకినట్లు. రెండవది వానరులు రామలక్ష్మణులు
సేతువుమీఁద నడచి లంకకుఁ బోయినట్లు.

ఉపనదులు యమునా సరయువులు గంగలోఁ గలసి
సముద్రము చేరుటవంటిది సద్వారకము. గంగ సరిగాఁ
బోయి స్వతంత్రముగా సముద్రము చేరుటవంటిది యద్వార
కము. వారివారి శక్తి భక్తి కొలఁది వారు వారు వర్తింతురు.

ఉభయాధికారములు తెలిపి సంజీవనీకార్యాలయమువా రుభయులకును జేనైన సాహాయ్యము చేయుచున్నారు.

బ్రాహ్మణులకు క్షత్రియులకు వైశ్యులకు విధ్యుక్తకర్మములు గలవు. అవి చేయకపోయినచో వారు భ్రష్టులు కావున నవి చేయవలసియే యున్నవి. ఆవిషయమున వారిని హెచ్చరించి భ్రష్టులుకాక యుండుఁడీ యని వారికృత్యములు వారికిఁ దెలుపవలసియున్నది. శూద్రులు పుణ్యాత్ములు వారికిఁ గర్మబంధములు లేవు. కావున విశృంఖలముగ వారు భక్తి నాధింపవచ్చును. శూద్రులది నష్టిలేని వ్యాపారము – ద్విజులది నష్టితోఁగూడిన వ్యాపారము – ఒకశూద్రునకు నొక బ్రాహ్మణునకు నొకగంట విరామము దొరకె ననుకొనుఁడు. ఈగంటకాలములో నొకనిమిషమైన వ్యర్థము పోనీక శూద్రుఁడు జపము ధ్యానము లోనైనవి చేయవచ్చును. శూద్రునిదాఁక నేలపోవలె – బ్రాహ్మణ భార్యాభర్తలలో స్త్రీకున్నంత సౌకర్యము – భావస్థితి (యామె భక్తిమార్గమందు వర్తింపఁ దలఁచెనేని) పురుషునకు లేదు. బ్రాహ్మణునకో స్నానము – సంధ్య లోనైనకర్మములు తీర్చికొనిగాని జపించుటకు నధికారము లేదు. వీని కొకయరగంటయైన నధమపక్షమునఁ గాలము పోవును. ఉద్ధరించునవి కర్మములు గావు. అట్లని వానిని మానెనా బ్రాహ్మణుఁడు భ్రష్టుఁ డగును. జాతిచండాలునకంటె నధముఁ డగును. కావునఁ గర్మములు

తీర్చియే భగవత్కార్యము చేయవలసియున్నది. ఇరువురిలో నెవరిపని మేలు? భ్రష్టబ్రాహ్మణుఁడు శూద్రులతోడి సపంక్తి భోజనమునకును నర్హుఁడు కాఁడు. ఘోరపాపములు చేసినఁ దప్ప శూద్రుఁడు పతితుఁడు గాఁడు. కర్మలోపమువలనఁ గలుగు పాతిత్యభయము శూద్రునకు లేదు. ద్విజులకుఁ గలదు. భక్తివిషయ మందఱకు సమానమైనను గర్మవిషయము ద్విజులకుఁ జెప్పవలసివచ్చినది. అదియు దేనివలన? జీవ బ్రహ్మైక్యవేదాంతరహస్య మనెడి పనికిమాలిన పుస్తకము విపరీతకర్మములు బోధించుటవలన. ఆ గ్రంథమును జూచి యోగమునఁ జెడినట్లు కర్మాచారముల నెందఱు చెడుచున్నారో యని యావిషయములు వ్రాయవలసివచ్చెను. ఇంకను గొన్ని వ్రాయవలసియున్నవి. కొందఱది వ్రాయలేదే- ఇది వ్రాయలేదే యనుచున్నారు. ఇంతచిన్న పత్రికలో నన్ని విషయము లేక కాలమున నెట్లు వ్రాయ సాధ్యపడును? యోగము-కర్మము-భక్తి-జ్ఞానము వీనినిగుఱించి క్రమక్రమముగ సంజీవని వివరముగాఁ దెలుపఁగలదు. చందాదారులు లేనిపోని దురూహలపాలుగాక యోర్పు ఓపిక గలవారై క్రొత్తచందాదారులను జేర్చి సంజీవని నుద్ధరింతురుగాక యని ప్రార్థనము. ఇప్పుడున్న చందాదారులు శ్రమించియైన నింక ౬౦౦ మందిని క్రొత్తవారిని జేర్చిరేని యిప్పటిచందా హెచ్చింపకయే ౪౮ పుటల బదులు ౬౪ పుటల గ్రంథము సంజీవని ప్రకటింపఁగలదు.

## పుండ్రము.

(గతసంచికా శేషము ౪౧౩-వ పుట చూడు.)

ఈవిషయమునఁ బద్మపురాణమందలి కొన్నివాక్యము లుదాహరించుచున్నాను.

పద్మపురాణము – ౩౧ అధ్యాయము.

శంకరః.

శ్లో. ఊర్ధ్వపుండ్రస్య మాహాత్మ్యం, వక్ష్యామి శుభదర్శనే
ధారణా దేవ ముచ్యంతే, భవబంధా ద్ద్విజోత్తమాః
ఊర్ధ్వపుండ్రస్య మధ్యేతు, విశాలే సుమనోహరే
లక్ష్మ్యా సార్ధం సమాసీనో, దేవదేవో జనార్దనః
ధారయే దూర్ధ్వపుండ్రం తు, త్రిసంధ్యాసు ద్విజోత్తమః
సర్వపాపవిశుద్ధ్యర్థ మిష్టాపూర్త ఫలాప్తయే
ఊర్ధ్వపుండ్రవిహీనస్తు, సంధ్యాకర్మాదికం చరేత్
తత్సర్వం రాక్షసైర్నీతం, నరకం చాధిగచ్ఛతి
ఊర్ధ్వపుండ్రం తు సర్వేషాం ననిషిద్ధం కథంచన
ధారయేత్ క్షత్రియాద్యోపి, విష్ణుభక్తో భవే ద్యది
హరేః పాదాకృతిం ధార్య మూర్ధ్వపుండ్రం విధానతః
తయా ధృతోర్ధ్వపుండ్రస్తు సర్వయజ్ఞఫలం లభేత్
చందనం చ హారిద్రా చ తథా భస్మాగ్నిహోత్రజమ్
యత్ర దివ్యం హరేః క్షేత్రం, తత్రైవ మృద మాహరేత్
సైవ శ్రేయోర్థిభిర్గ్రాహ్యా, హ్యూర్ధ్వపుండ్రస్య ధారణే

పర్వతాగ్రే నదీతీరే బిల్వమూలే జలాశయే
సింధుతీరే చ వల్మీకే హరిక్షేత్రే విశేషతః
విష్ణోః స్నానోదకం యత్ర, ప్రవాహయతి నిత్యశః
పుండ్రాణాం ధారణార్థాయ గృహ్ణీయాత్తత్ర మృత్తికామ్
శ్రీరంగే వేంకటాద్రౌ చ శ్రీకూర్మే ద్వారకే శుభే
ప్రయోగే నారసింహాద్రౌ వారాహే తులసీవనే
గృహీత్వా మృత్తికాం భక్త్యా విష్ణుపాదజలైస్సహ.

అర్థము.

పార్వతీ! యూర్ధ్వపుండ్రమాహాత్మ్యముఁ జెప్పెద వినుము. దానిని ధరించుటవలన జననమరణబంధములు తొలఁగిపోవును. ఊర్ధ్వపుండ్రము నడుమ లక్ష్మీసమేతుఁడై నారాయణుఁ డుండును. ద్విజులు మూఁడు సంధ్యలయందును నూర్ధ్వపుండ్రము ధరించియే యుండవలయును. దీనివలనఁ బాపములు నశించును. ఇష్టాపూర్తఫలము లభించును. ఊర్ధ్వపుండ్రము లేక చేయు సంధ్య - జపము లోనైన వాని ఫలము రాక్షసులకుఁ బోవును. దానివలన నరకము ప్రాప్తించును. విష్ణుభక్తిగలవారైనచో క్షత్రియులు లోనగువారును నూర్ధ్వపుండ్రము ధరింపవలయును. ఇది యెవ్వరికి నిషిద్ధము గాదు. ఊర్ధ్వపుండ్రము శాస్త్రప్రకారము విష్ణుపాదాకృతిగా ధరింపవలెను. దానివలన సర్వయజ్ఞఫలములు లభించును. చందనము - పసుపు - హోమాగ్నివలనఁ గలిగినభస్మము - విష్ణు

క్షేత్రములందలిమృత్తిక, పర్వతాగ్రములందుఁ బుణ్యానదీ తీరములందు, మారేడుచెట్లమొదళ్లయందుఁ దటాకములందు, సింధుతీరమునందుఁ బుట్టలయందు, విష్ణుస్నానోదకము పాఱు స్థలమునందుండుమృత్తికను, నూర్ధ్వపుండ్రార్థము గ్రహింప వలయును. శ్రీరంగము–వేంకటాద్రి–శ్రీకూర్మము–ద్వారక–ప్రయాగ–నృసింహాద్రి–వరాహక్షేత్రము–తులసీవనము వీని యందుండు మృత్తికను విష్ణుపాదజలముతోఁ జేర్చి ధరింప వలయును. అని శంకరు లుపదేశించిరి.

ఇవన్నియు గ్రాహ్యములైనను, శ్వేతమృత్తికయు హరిద్రాచూర్ణము సంప్రదాయ। సిద్ధమైనవి. హరిద్రాచూర్ణ మనఁగాఁ బసుపుపొడిగాని కుంకుమపువ్వుపొడిగాని శ్రీచూర్ణముగా ధరింప నుపయోగింపవలయును. అంగడినుండి తెచ్చిన దట్టులే యుపయోగింపరాదు. విష్ణుగాత్రపరామృష్టా మ్మని యుండుటచే ముందు భగవంతునకు నర్పించినదియై యుండ వలయును. నేఁడు సమర్పించినది రే పుపయోగింపవచ్చును.

ఈపుండ్రములు పండ్రెండు పదుమూఁడు ధరింపవల యుననియు నవి ముఖము – ఉదరము – ఱొమ్ము – కంఠములో నగు స్థానములందు ధరింపవలయుననియు శాస్త్రములు చెప్పు చున్నవి. ఆస్థానములనే నేను యోగమార్గానుసారముగ మఱి వేఱుపేర్లతోఁ జెప్పెదను. దానినిబట్టి బుద్ధిమంతులు విశేషము గ్రహింపఁగలరు.

ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరింపవలసిన స్థానములు.

౧. ఆజ్ఞాచక్రము - లలాటము.

౨. మణిపూరకచక్రము - నాభికిమీఁద

౩. అనాహతచక్రము - వక్షము

౪. విశుద్ధచక్రము - కంఠము-ఆహారనాళముమీఁద

౫. యకృత్తు - (Liver) రెండవదానికిఁ గుడివైపు.

౬. దక్షిణభుజము

౭. కంఠమునందు పింగళానాడిమీఁద విశుద్ధచక్రమునకుఁ గుడివైపు - ఈనాడియిక్కడ స్పష్టముగఁ దెలిసినట్లు నాసారంధ్రమందుఁగాని శ్వాసకోశమందుఁ బ్రవేశించిన తరువాతఁ గాని తెలియదు.

౮. ప్లీహము (Spleen) ఇది రెండవదానికి నెడమవైపు.

౯. వామభుజము.

౧౦. ఇడానాడిమీఁద విశుద్ధచక్రమునకు నెడమవైపు.

౧౧. కుండలిస్థానము - సుషుమ్నాద్వారమార్గారంభము.

౧౨. త్రికము - మేరుదండమునకుఁ బైభాగము (Medulla oblangata)

౧౩. బ్రహ్మరంధ్రము.

ఈపదుమూఁడు స్థానములకు దేవతలు.

౧ కేశవుఁడు - ౨ నారాయణుఁడు - ౩ మాధవుఁడు - ౪ గోవిందుఁడు - ౫ విష్ణువు - ౬ మధుసూదనుఁడు - త్రివిక్ర

ముఁడు – ౭ వామనుఁడు–౮ శ్రీధరుఁడు ౧౦ హృషీకేశుఁడు–౧౧ పద్మనాభుఁడు – ౧౨ దామోదరుఁడు–౧౩ వాసుదేవుఁడు.

చక్రములలో నాలుగింటిని మాత్రము గ్రహించి మూలాధారమేహనముల వదలనేల యని కొందఱు సందేహింపవచ్చును. నాభికిఁ గ్రిందిప్రదేశ మశుద్ధము. ఆరెండు చక్రముల ధ్యానము ప్రాకృతమే తామసమే కాని సాత్త్వికము గాదు. నాభ్యా ముపరితిష్ఠతి యని ఆత్మవిచారపరులకు నాభి క్రింది ప్రదేశములతోఁ బనిలేదు. సంక్షేపించి చెప్పినను నిప్పటికే గ్రంథవిస్తరమైనది కావున నింకొక విషయము చెప్పి ముగించెదను.

ఊర్ధ్వపుండ్రమునకు నామధారణ మని పామరులు కూడ నందురు. నామముపెట్టుకొంటివా యనునది వాడుక మాట. తిరుమణి (శ్రీమృత్తిక) శ్రీచూర్ణములు పవిత్రములైనవి. భగవత్సంబంధమైనవి. మంత్రపూతమైనవిగా నుండుటే కాక వానిని ధరించునపుడు మీఁదఁజెప్పినట్లు భగవన్నామ ముచ్చరించుచునే యుండవలయును. దీనికే స్వరూపధారణ మనియుఁ బేరుగలదు. జీవునిస్వరూపము స్వభావము దాసత్వము. స్వామిపాదములు శిరసావహించుటయే దాసలక్షణము. వీనిని జూచినను స్మరించినను దనస్వభావ దాసోహం భావము స్మరణమునకు వచ్చును. దానివలన నహంకారము-స్వాతంత్ర్యము – కర్తృత్వాభిమానము లోనైనవి నశించును. మఱియొక విశేషము.

ఊర్ధ్వపుండ్రవిషయమై బృహద్బ్రహ్మసంహితయం దీ శ్లోకములు గానవచ్చెడిని.

శ్లో. ధృత్వాపుండ్రాణి గాత్రేషు, బ్రహ్మత్వం భావయే ద్యది
బ్రహ్మాపరోక్షతా మేతి, మాయాగచ్ఛతి నాశనమ్.

అర్థము.

ఊర్ధ్వపుండ్రములు దేహమున నాయా యవయవము లందు ధరించి యెవఁడు బ్రహ్మత్వమును భావనచేయునో (బ్రహ్మైక్యభావమును) వాఁడు బ్రహ్మసాక్షాత్కారము పొందును. అతనిమాయ (అజ్ఞానము) నశించును.

వైష్ణవత్వమునకు బాహ్యచిహ్నములు మూఁడు. ఊర్ధ్వపుండ్రధారణము – చక్రాంకనము – తులసీమాల – పద్మాక్షమాల (తామరపూసలదండ) ధరించుట. ఈమూఁటి వలన భగవత్సారూప్య జ్ఞానము కలుగును. భగవంతుఁడు ప్రణ వాకారుఁడు–లక్ష్మివిశిష్టుఁడు – శంఖ చక్రధారి – తులసీ మాలికా విభూషితుఁడు – కావునఁ దాను నట్టివేషము ధరించుటచేఁ దాను భగవత్స్వరూపుఁడ ననుజ్ఞానము కలుగును.

గీతగోవిందమందు రాధ కృష్ణునివేషమును పిల్లంగ్రోవి – నెమలిపించెము లోనైనవి ధరించి తనరూప మద్దములోఁ జూచుకొని నేను కృష్ణుఁడను నేను కృష్ణుఁడ నని భావించె నని చెప్పఁబడెను.

ముహు రవలోకిత మండనలీలా
మధురిపు రహ మితి భావనశీలా.

అట్టులే భాగవతమందుఁ బైఁటకొంగు పైకెత్తినంత మాత్రమున నే యొక గోపిక తాను గోవర్ధనధరుఁడ నని తన్న యత్వము చెందెను. కావున విష్ణుభక్తిగలవానికి విష్ణుతన్న యత్వము గాంచుటకు మీఁదఁజెప్పిన యూఁడుచిహ్నాము లత్యావశ్యకములు దానికి విశేషసహాయభూతములు – సదా తత్స్మరణ చిహ్నములు

ఇట్లు పైవేషము వేసి తరువాతి నేమి చేయవలయునని మీఁదఁజెప్పిన బృహద్బ్రహ్మసంహిత చెప్పుచున్నదో చూడుఁడు. ఈబృహద్బ్రహ్మసంహిత యనునది పాంచరాత్రాగమ మందలి యొకభాగము – ఆత్మప్రాప్తి గోరువాఁడు శుద్ధుఁడై యుండవలయును. శుద్ధి రెండువిధములు – ఆత్మశుద్ధి – భూత శుద్ధి. భూతశుద్ధి రెండువిధములు. మీఁదఁజెప్పిన చిహ్నధార ణము, దీని కంగశుద్ధి యని పేరు. రెండవది ప్రాణాయామ పూర్వకముగ పంచోపనిషన్మంత్రములచే దేహశోషణాది కార్యములు చేయుట – ఇట్లు చేసిన పిమ్మట నాత్మశుద్ధికి యత్నింపవలెను. ఇట్లాత్మశుద్ధికి శక్తిచాలనివాఁడు.

శ్లో. అశక్నువఁ భావయితుం వాక్యమేవ సమభ్యసేత్ ॥
బ్రహ్మైవాహం నసంసారీ నిత్యముక్తో నశోకభాక్
అచ్యుతోహ మనంతోహ మవ్యయోస్మి స్వరూపతః ॥

అర్థము.

నేను బ్రహ్మమును – సంసారినిగాను – నిత్యముక్తుఁడను. శోకభాక్కును గాను – స్వరూపముచేత నే నచ్యుతుఁడను. నే ననంతుఁడను నే నవ్యయుఁడను.

30

శ్లో. అహ మాత్మ చ సర్వేషాం సాక్షీ చేతా సనాతనః
బ్రహ్మాస్మీతి నసంసారీ తత్త్వ మస్యాది వాక్యతః ॥

అందఱకు నే నాత్మను - సాక్షిని - చేతనుఁడను - సనాతనుఁడను - సంసారిని గాను - తత్త్వమస్యాదివాక్యములవలన నేను బ్రహ్మము-తత్త్వమసి-అహంబ్రహ్మాస్మి యీవాక్యములు మూఁడుమతములవారికి సమానములే - అయినను భావనయందు భేదముగలదు. ఆత్మావలోకనమన్ని మతములవారికి ముఖ్యమే. ఆవిషయమంతయుఁ గాలాంతరమున సంజీవని ప్రకటింపఁగలదని తోఁచెడిని.

అని యీవాక్యమునైన నభ్యాసము చేయవలయును.
ఇతి వేదోపనిషదా, భావనా హ్యాత్మ శోధినీ,

ఇట్లు వాక్యముచేఁ గాక వేదోపనిషదమైన భావనచే తను ధ్యానముచేయుట ఆత్మశోధన మగును.

కావునఁ దనశ్రేయస్సు గోరు విష్ణుభక్తుఁడు మీఁదఁ జెప్పిన మూఁడువిధముల భగవత్స్వరూపమును బాహ్యమున ధరించి వాక్కుచే మీఁదఁజెప్పిన మంత్రము వల్లించుచు భావమునందు దానియర్థమును ధ్యానింపవలెను. ఇట్లు త్రికరణముల శుద్ధుఁ డగువాఁడు ధన్యుఁడు. మూఁడవది చేతఁగానివాఁడు - మొదటిరెండైనఁ జేయవలయును. రెండవదికూడఁ జేతఁగానివాఁడు మొదటిదైనఁ జేయవలయును.

శ్లో. అజ్ఞానా దథవా జ్ఞానా త్ప్రేరణా ల్లోభతోపివా
సలక్ష్మీకాని నామాని ధృత్వా పాపా త్ప్రముచ్యతే.

అర్థము.

జ్ఞానముకలిగికాని జ్ఞానములేకకాని యితరుల ప్రేరణముచేఁ గాని లోభముచేఁ గాని లక్ష్మి చిహ్నమైన శ్రీచూర్ణముతో తిరుమణి నెవఁడు ధరించునో వాఁడు పాపములనుండి విడువఁబడును. ఇక్కడ నామాని యనఁగా నూర్ధ్వపుండ్రములని యే యర్థము. ఇది ప్రకరణమువలన సిద్ధము. ఊర్ధ్వపుండ్రమునకు నామ మని పే రుండుట యిదివఱకే చెప్పఁబడెను. కావుననే కదా సప్తవిధస్నానములలోఁ బుండ్రధారణము నొక విధమైన స్నానముగా శాస్త్రములు చెప్పుచున్నవి.

అంతశ్శుద్ధి యుండినఁ జాలదా బాహ్యవేష మేల యనరాదు. త్రికరణశుద్ధి శుద్ధి గాని యొకటిమాత్రమే పర్యాప్త మని చెప్పఁబడదు. బాహ్యము ఫలవంతమగునో కాదో లౌకికదృష్టాంతములచేఁ దెలియనగును.

ఇప్పటి రాజభటుల (పోలీసువారి) విషయము చూడుఁడు. యుద్ధభటులవేషము చూడుఁడు. వీరు రాజసేవకులే కదా. వీరు ప్రభువును జూచి యయ్యా! మీయందు మాకంతరంగమున భక్తి కలదు. మీకార్యములు చేయుదుము కాని మీ రిచ్చిన వేషములను మేము ధరింప మనినఁ బ్రభు వేమనును? నేరములు చేసినవారు మనలను జూచి భయపడరు గదా. వాని వేషమును జూచినమాత్రమున నేల భయపడుదురు? వ్యాధి దేహములోపలఁ బుట్టినది గదా. లోపలికి

మాత్ర మౌషధము తీసికొనక పైయుపచారము లేల చేయిం చుకొనెదరు. ఇంట గెలిచి రచ్చ గెలువ వలయును. బాహ్య మును లక్ష్యపెట్టనివాఁడు అంతర్లక్ష్యముగలవాఁ డగునా? కానవచ్చు పదార్థమును గుఱిగొట్టలేనివాఁడు కానరాని పదా ర్థము నెట్లు గొట్టఁగలఁడు? "సంతత శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతా మృతాస్వా"దన తత్పరుఁడైన యోగీశ్వరుఁడు తప్ప మఱియెవఁడైన బాహ్యముతోనాకుఁ బనిలే దనెనేని వాఁడు భ్రష్టుఁడని నమ్మవలయును. కావున బాహ్యము ముఖ్యమైనదే దానిని ద్యజింపరాదు. విష్ణుసారూప్యమును ధరించిన విష్ణుభక్తుని గని యమకింకరులు దూరముగఁ దొలఁగి పోదు రని చెప్పఁబడెను. ఆకారణముచేతనే సర్వదా యూర్ధ్వ పుండ్రమును ధరింపవలెను. అట్లని బుద్ధిమంతుఁడు బాహ్య వేషధారణముతోనే సంతుష్టిపడరాదు. అంతశ్శుద్ధియును వలయును. కావుననే పద్మపురాణమందు,

శ్లో. యే కంఠలగ్న తులసీ నలినాక్ష మాలా
యే బాహుమూల పరిచిహ్నిత శంఖచక్రాః
యేవా లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః
తే వైష్ణవా భువన మాశు పవిత్రయంతి.

ఎవరు కంఠమందుఁ దులసీ పద్మమాలికలు ధరింతురో యెవరు శంఖచక్రచిహ్నములు ధరింతురో యెవరు ముఖము నందు నూర్ధ్వపుండ్రము ధరింతురో యట్టి విష్ణుభక్తులు లోక మును బవిత్రముగఁ జేయుదురు అని చెప్పి,

శ్లో. ద్వివిధం వైష్ణవం ప్రోక్తం, బాహ్యమాభ్యంతరం తథా
శంఖచక్రాది భిర్బాహ్యా, మాంతరం వీతరాగతా
బాహ్యాభ్యంతరసామ్యేయ, త్తద్వైష్ణవ ముదాహృతం
తస్మాచ్చక్రాది చిహ్నాంతు ప్రథమం వైష్ణవం స్మృతమ్
ఆంతరం స్మరరోషాది, వియుక్తం స్యాత్మదర్శనం
సర్వభూతహితం శాంతి రింద్రియార్థే ష్వలోలతా
పుత్రదారా ద్యసంగత్వం యోగాభ్యాస రతి స్తథా
అనన్యభక్తియోగేన పరేశస్య తు సేవనమ్
తస్మాచ్చక్రాదిహేతీనా మంకనం వైష్ణవం స్మృతమ్
చక్రాదిచిహ్నహీనత్వా ద్వైష్ణవత్వం నలభ్యతే.

అర్థము.

వైష్ణవము రెండువిధములు – బాహ్యమని – ఆభ్యంతరమని – శంఖచక్రాది చిహ్నధారణము బాహ్యము. రాగద్వేషాదిదుర్గుణములు లేకయుండుట ఆభ్యంతరము. రెండుసమముగా నుండిననే వైష్ణవత్వము. కావునఁ జక్రాదిచిహ్నధారణము ప్రథమవైష్ణవము–కామక్రోధ లోభాదులు లేకుండుట – ఆత్మదర్శనము – సర్వభూతదయ – శాంతి – ఇంద్రియార్థములందుఁ జపలత్వము, దారపుత్రాదులందు విశేషాభిమానము లేకయుండుట–యోగాభ్యాసము–అనన్యభక్తిచే భగవత్సేవ, ఇవి రెండవ వైష్ణవలక్షణము. కావునఁ జక్రాది చిహ్నధారణము వైష్ణవ మనఁబడును. ఆచిహ్నము లేనివానికి వైష్ణవత్వము లేదు.

కావున నాలుగువర్ణములందును విష్ణుభక్తులగువారికి నూర్ధ్వపుండ్రధారణ మత్యావశ్యకము. రాఁగల సంచిక యందుఁ దిర్యక్పుండ్రమునుగుఱించి వ్రాయఁబడును.

సశేషము.

## శ్రీ రామాష్టాక్షరీ మంత్రార్థము.

(గతసంచికా శేషము ౩౬౪-వ పుట చూడుఁడు.)

కొందఱు చెప్పునట్లు నేను సర్వశక్తుఁడను సర్వస్వతంత్రుఁడను సర్వవ్యాపినైన పక్షమున నన్నుఁ బట్టి కట్ట నెవరికి దేనికి సాధ్యపడును? నే నేల ప్రకృతికి లోఁబడి యది యాడించి నట్లెల్ల నాడుచును? ఎప్పుడు ప్రకృతి నన్ను క్రోఁతి నాడించిన ట్లాడించుచున్నదో యప్పుడే యది నాకంటె బలిష్ఠ మని యంగీకరింపక తప్పదు. ఈబంధము నేనై వేడుకకుఁ దెచ్చుకొన్నఁ దగునేని నేనై ధరించిన వస్త్రమును నాయిచ్ఛకొలఁది తలఁచినప్పుడు పాఱవేయ సాధ్యపడినట్లు బంధములు దొలఁగించుకొనుటకు నాకు సాధ్యపడి యుండవలెను. ఇప్పు డట్లు పాఱవేయుటకు నాకు సాధ్యపడుట లేదు గదా. కావున నీ బంధము నేనై తెచ్చుకొన్నది గాదు. దానిని మించుస్వతంత్రశక్తి నాయందులేదు. అట్లు కాదు. ఇదంతయు మాయ—టక్కు—గారిడి—ఇంద్రజాలము—మలయాళభగవతి—విప్రవినోద విద్య. బంధములేదు—మోక్షములేదు అందువా? అట్లైన నీ మాయను ఇంద్రజాలమును నేను జేయుచున్నానా? అటుగాక

చూచుచున్నానా? ఇంద్రజాలము - మాయ నేను జేసికొను చున్నా ననుటకు నామాయ - నాయింద్రజాలము నన్ను మోస గింపఁగలదా? చూచువారి కది నిక్కముగాఁ గానవచ్చును గాని చేయువారికి నట్లు తోఁచునా? తనవిద్యచేఁ దాను మోసపోవు నైంద్రజాలికుఁడు గలఁడా? అట్లు తోఁపనపుడు మోసపోవనపుడు దానిబాధ నా కెట్లు కలుగును? కావున నీమాయ నేను గాను మాయకుఁ గర్తను నేను గాను. పోని చూచువాఁడ నగుదునా? అట్టైన మాయ - మాయచేయు వాఁడు నాకంటె వేఱై యుండవలయును. ఐంద్రజాలికుఁడు తనవిద్యాశక్తిచే నొక పామునో తేలునో మన కగపడఁ జేయును. దానిని జూచి మనము భయపడుదుము. మనలను భయ పెట్టునది యేది? ఐంద్రజాలికుఁడా? వానిశక్తియైన ఇంద్రజాల విద్యయా? ఐంద్రజాలికుఁడు కాఁడు. వాఁడు విద్యచేయుటకు ముందుగాని వెనుకఁగాని వానిని జూచి మనము భయపడు చున్నామా? లేదు. కావున మనలను భయపెట్టునది వాని విద్యయే. అదియే వానిశక్తి. ఆశక్తికే మాయయని పేరు. కావున ఆశక్తి నాకంటె వేఱే. ఆశక్తిగలవాఁడు నాకంటె భిన్నుఁడే. శక్తి సర్వదా శక్తుని నాశ్రయించియుండునే కాని విడిచియుండదు. మాంత్రికుఁడు మనమీఁదఁ బామును విడిచి నపుడు మనము గుండెలు దడదడకొట్టుకొన - కాలుసేతులు వణఁక - పామా! నామీఁద రాకుమా యని ప్రార్థించిన నది

రాకమానునా? కావున మన మేమి చేయుచున్నారము? అయ్యా! నీపాము నీబుట్టలో వేసికొమ్మని మంత్రగానిని బ్రార్థించుచున్నాము. ఆపాము మంత్రగాని యిచ్ఛకు లోపడి యున్నది. కాని మన యిచ్ఛకు లోపడి యుండ లేదు. మంత్రగాని యిచ్ఛకొలఁది నది యాడుచున్నది. కాని దానికిని స్వాతంత్ర్యము లేదు. ఆపాము మనము చంపిన జచ్చునది కాదు. కావున మనము భయపడి వణఁకుట నిజమే – మంత్రగాని శక్తినిజమే–మంత్రగాఁడు నిజమే–మంత్ర గాని యిచ్ఛకొలఁది వానిశక్తి వర్తించుట నిజమే. ఆమంత్ర గాని ప్రక్కన వాని బంధువు లున్నారుకదా. వా రేల వానిశక్తికి భయపడరు. దోషులదండించు నధికారముగల యధికారికి వాని పెండ్లాము బిడ్డలు భయపడుదురా? ఏల? వారంద ఱాయన కనుకూలురే. ప్రతికూలకార్యము చేయరు. ఆవిద్యారహస్యము తెలిసినవాఁడు మనప్రక్కన నొకఁ డుండిన వాఁడును భయపడఁడు. ఏల భయపడఁడు? మంత్రగాఁడు తనశక్తి నిట్లు కనఁబఱుచుచున్నాఁడు. గాని మనలను బాధింపవలె నని యతనికిఁ గోరిక లేదు. అతని సంకల్పము లేక యాతనిశక్తి మనల నేమియుఁ జేయఁజాలదు. శక్తి యచేతనము. అది మనల నేమి చేయఁగలదు? దాని వలెఁ జేయునంతటిశక్తి మనకు లేకున్నను వాఁడు చేయు నుపాయములు వేయువేషములు మనకుఁ దెలియును. అని

యనుగాక యీమాంత్రికుఁడు మన కాప్తుఁడు. మనక్షేమము గోరువాఁడు. కావున వానిశక్తి మనయం దుపయోగింపఁడు. ఆశక్తికి మనము భయపడవలసినపనిలే దని నిర్భయులమై యుండును. అట్టులే మనలను బంధించు ప్రకృతియు నొక శక్తియే. అది మనకు లోపడి యుండునది కాదు. ఆశక్తి గల వాఁడు భగవంతుఁడు. అది యాయనసంకల్పము ప్రకారము వర్తించును. గాని మనము పొమ్మనిన పోదు. రమ్మనినరాదు. ఆయన సర్వస్వతంత్రుఁడు. మనయధికార మాయనమీఁదఁ జెల్లదు. కావున నాయనకుఁ బరతంత్రులమై యాయన యను గ్రహము వచ్చునట్టు లాయన కనుకూలురమై ప్రవర్తించిన బాగుపడుదుము. మన కేభయము లేదు. కావున మనము భగవంతున కనుకూలురమై ప్రతికూలకార్యము చేయక భర్తను భార్య, తండ్రిని కొడుకు, స్వామిని సేవకుఁడు సేవించు నట్లు సేవించి భారమంతయు నాయనపై వైచి శ్రీరాముఁడైన శ్రీరాముఁడే మనకు రక్షకుఁడని – దిక్కని – భర్తయని – తండ్రియని – స్వామియని వినయవిధేయత్వములతో భక్తి శ్రద్ధలతో సర్వదా ధ్యానము చేయుచుండవలెను.

సశేషము.

శ్రీమదొంటిమిట్ట కోదండరామాలయ వేదపారాయణ
బ్రాహ్మణాశీర్వాద పద్ధతిః.

స్వస్తి మంత్రార్థా స్సత్యా స్సఫలా స్సం త్వితి మహాం తోను గృహ్ణన్తు.

అస్య శ్రీదేవదేవోత్తమస్య, దేవతానార్వభౌమస్య, వందారుమందారస్య, రోమాంచ వందమాన నిజసుందరీ నందన సమేత శతానంద పురందర త్రిపురందర ముఖబృందారక బృంగ కిరీటతటఘటిత ధగద్ధగాయమాన శోభానికాయమాన నానారత్నరింఛోళీ పాళీ పరికల్పిత కాయమాన జగజ్జేగీయమాన దివ్యభవ్యనవ్యదినమణి మణిగణ ద్విగుణారుణిత చరణనఖరస్య, ఖరదూషణ, ఖలదూషణ బుధపోషణ సురతోషణ మణిభూషణ కంధిశోషణ కారణస్య, కారణపురుషస్య, పురుష తరుణీ తిర్యగాది రూపరహితస్య, సుర నర నికర హితస్య, సర్వలోకజననీ జనకరాజ నందినీ సహితస్య, సౌమిత్రి పవనపుత్ర సేవితస్య, శ్రీమదేకశిలానగర వాస్తవ్యస్య, సకలలోక స్తవ్యస్య, శ్రీకోదండరామస్వామినః సాయంప్రాత రభిగమన పూజాఽభిషేక దీపారాధన నైవేద్యాది కర్మణి యత్కించి న్మంత్రలోపే, తంత్రలోపే, క్రియాలోపే, నియమలోపే, ద్రవ్యలోపే, శ్రద్ధాలోపే, సత్యపి సర్వం యథోక్తం యథాశాస్త్ర మనుష్ఠితం భూయా దితిభవంతోను గృహ్ణన్తు,

అస్య శ్రీసీతాకాంతస్య, రూపజిత శతాయుతరతికాంతస్య నిరంతర నిరంతరాయ సేవాహేవాకాతిశయస్య సర్వేషాం లోకానాం భూయా దితి భవం తోనుగృహ్ణన్తు.

అస్య కాశ్యపగోత్రోద్భవస్య పునర్వసూనక్షత్రే కర్కటరాశౌ జాతస్య, సీతా లక్ష్మణ హనుమ త్సమేతస్య, తిప్ప

రాజ, పోతరాజ, రామభద్ర వాసుదాస ముఖకవీంద్ర వాక్య మోదితస్య, కరుణావరుణాలయస్య, దుష్టశిక్షణ శిష్టరక్షణ సువిచక్షణ దక్షకటాక్ష వీక్షా సభాజన భాజన మేత త్సభా జనతా భవత్వితి భవం తోనుగృహ్ణన్తు.

అస్య శ్రీకోదండరామస్య సేవావిముఖాః పరిచరణ కరణక్రియాంతరాయకర్తారః కైంకర్యోపేక్షకాః తద్ద్రివ్యాప హారకాః సాధున్యాంతాః పాదాక్రాంతాః పరాజితాః భగ్నా వయాః భక్తమంతః రక్తమంతః యథాయదం భూయాదితి భవం తోనుగృహ్ణన్తు.

అస్య శ్రీకోదండరామస్య దేవాలయే త్రిసంధ్యం సేవాకాలే సముద్ఘుష్యమాణ కోణాహత ఢక్కా భేరీ పటహ డమరు మడ్డు వీణా వేణు శంఖ డిండిమ ఝర్ఝర ఝల్లరీ పణవ గోముఖ హుడుక్కా తాల మృదంగ సంజనిత ఝళంఝళ, ధణంధణ రమంరమ ఢమంఢమ ధింధింధిం భంభంభం రం రంరం ధంధంధ మిత్యాది నిషాదర్షభ గాంధార షడ్జ మధ్యమ దైవత పంచ మేతిస్వరసప్తకేన శ్రవ ణానందో భూయా దితి మహాం తోనుగృహ్ణన్తు.

అస్య శ్రీకోదండరామస్య సమాజసభ్యాః సేవకాః దాసాః కింకరాః భృత్యాః పరిచారకాః పరిచారికాః భక్తాః సేవానుకూలాః అమలిన్ముచాః సతతం సంపుష్టాః సంతుష్టాః శ్రీజుష్టాః బహుశిష్టాః బహుమిత్రాః సచ్చరిత్రాః సుపా

త్రాః సారోగ్యగాత్రాః సత్పవిత్రాః సపుత్రాః సకలత్రాః, వదాన్యాః మాన్యాః మూర్ధన్యాః సామాన్యాః అసామాన్యాః శక్తియుతాః మతియుతాః భక్తియుతాః రక్తియుతాః ధనయుతాః ధాన్యయుతాః శ్రీయుతాః గోధనయుతాః భూయాసు రితి భవంతో మహాంతోనుగృహ్ణన్తు.

అస్మిన్నేకశిలానగరే సర్వేజనాః విదుషః నీరోగాః నిరుపద్రవాః సదాచారసంపన్నాః దైవభక్తిసంపన్నాః సర్వైశ్వర్యసంపన్నాః పుత్రపౌత్రప్రపౌత్రాదివృద్ధిమంతః ధీమంతః శ్రీమంతః నిర్మత్సరాః నైకాగారికాః అవిపన్నాః ప్రపన్నాః త్రికాలవిహిత నిజకర్మ నిరతాః సువ్రతాః దయాళవశ్చ భూయాసు రితి మహాంతోనుగృహ్ణన్తు.

అస్మిన్‌రాష్ట్రే కాలేకాలే సువృష్ట్యా సర్వే వాపీ కూపతటాకాః సర్వా నద్యః సంపూర్ణాభూయా దితి భవంతో మహాంతోనుగృహ్ణన్తు.

సర్వేజనా స్సుఖినో భవన్తు.
సమస్త స్సంగలాని భవన్తు.
స్వ స్త్యస్తు.
శ్రీ రామార్పణ మస్తు.

---

దీనియందలి గ్రామనామమును, వలయుచోటుల దేవతానామమును మార్చి వారువారు వారివారి దేవాలయములందో భజన మందిరములందో యుత్సవాదులందును, భజనాంతమందును బఠింపవచ్చును.

## శ్రీరామమత ధర్మములు.

### లక్ష్మణకైంకర్యము.

(గతసంచికా శేషము ౩౫౩-వ పుట చూడుము)

లక్ష్మణు నరణ్యమునకు రమ్మనిన వారులేరు. పొమ్మనిన వారు లేరు. స్వయముగనే ప్రయాణ మయ్యెను. తనరాక నంగీకరింపు మని వదినెను ప్రార్థించెను. ఆమె మనస్సు మెత్తనిది. కావునఁ బ్రార్థన మియ్యకొనెను. రాముని మనస్సు కరినము. సులభముగఁ గరఁగునది కాదు. పరీక్షించి కాని యంగీకరించునది కాదు. నిజమైన యార్తి భక్తియున్నచోఁ త్యజించునది కాదు. కావున నార్తుఁడై కూడవచ్చెద నని లక్ష్మణుఁడేడ్చెను. అప్పటికి రాముని మనస్సు కరఁగలేదు. పాదములమీఁదఁ బడెను. విడిపించుకొని పోవునేమో యని గట్టిగఁ బట్టుకొనెను. అంగీకరించువఱకు విడిచినవాఁడు కాఁడు. రాముఁడు మంచిమాటలతో రావల దని చెప్పెను. విన్నవాఁడు కాఁడు. ఆజ్ఞ విధించెను. లోపడినవాఁడు కాఁడు. నేను బోవునది చుట్టాలయిండ్లకుఁ గాదు. విందులకుఁ గాదు. పెండ్లిండ్లకుఁ గాదు. నీవు నాతోడ వచ్చి యేమి చేసెదవు? నీవు చిన్నవాఁడవు. నీసుఖము క్షేమము నేను విచారింపవలసి యుండును. దానివలన నాకెక్కువకష్టము గదా. నాకుఁ గష్టము గలిగించుట నీకు న్యాయ్యమా యని రాముఁ డనెను. నేను సుఖము లాభము గోరి మీవెంట రాఁదలఁపలేదు.

ఉ. అన్నపదంబులం బడి మహామతి గట్టిగఁ బట్టుకొంచు నా
యన్నులమిన్న సీతఁగని యామెను బ్రార్థన చేసి మున్నుగా
నన్నకు నామహావ్రతున కార్తి నసుర్ వనసీమ కేగదే
ని న్నినుఁ గొల్చి వత్తుఁ గరుణింపుము నాపయి దీనవత్సలా.

ఆ. వె. గంప గడ్డపాఱ గైకొని యొక కేల
విల్లు బాణములును వెలయ నొకట
సీకు ముందు పోయి నెఱిఁగాఁగ మార్గంబు
జూపువాఁడ శ్రమము బాపువాఁడ.

ఉ. పండులు గడ్డలుఁ వననివాసులు గ్రాసముగాఁగ మెక్కు
వే।ఱొండు నెడైనఁ దెచ్చెదను నుర్విజ నీవును గూడి యాడు
చోఁ। గొండలపేటుల న్నిదుర గూరియు యున్నను మేలు
కొన్నఁ గో। దండధరుండనై మెలపు దాలిచి సర్వము
నేన తీర్చెదర్॥

రెండుచేతులు మోయుపని చెప్పెనేకాని వదినెగారి పలువదిరెండు చీరలమోపు తలపైఁ బెట్టుకొని తెచ్చెద నని లక్ష్మణుఁడు చెప్పినవాఁడు కాఁడు. దశరథుఁడు సీతాదేవికి ౧౪ సంవత్సరములకుఁ గావలసినన్ని చీర లిచ్చెఁగదా. అవి లక్ష్మణుఁడుగాక మ ఱెవ్వరు మోచిరి,

లక్ష్మణా! నానిమిత్తమై నీవింత శ్రమించిన నీకు లాభ మేమి? ఏల వ్యర్థముగఁ గష్టము తెచ్చిపెట్టుకొనెదవు. కావున నింటనుండి సుఖింపుమని రామచంద్రుఁ డనెను.

అది విని లక్ష్మణుఁడు:—

కం. అనుచరునిఁగాన నన్నే
లోకనుమీ వైధర్మ్య మింపుఁ గొఱలదు నేనున్
మనఁగలుగుఁ గృతార్థుఁడనై
విను నీకుఁ బ్రయోజనంబు వెలసెడి దీనన్.

అన్నా! నీవు నన్నుఁ గింకరుగా గ్రహించుకొనుము. ఇది ధర్మవిరుద్ధకార్యము గాదు. ఏలన? నివు జ్యేష్ఠుఁడవు. నేను గనిష్ఠుఁడను. కావున నీవు తండ్రివి. నేను బుత్త్రుఁడను. కావున నీవు భరింపవలసినవాఁడవు. నేను భరింపఁబడవలసిన వాఁడను. కావున నీవు స్వామివి (సొత్తుగలవాఁడవు) నేను స్వమ్ము (సొత్తును). కావున స్వామియగువాఁడు తనసొమ్మును దనయొద్దనుంచుకొని పాలించుట ధర్మవిరుద్ధము గాదు. నా వెంటవచ్చి యడవులయందు శ్రమించిన నీకేమిలాభ మంటివి? నేను నీసేవచేఁ గృతార్థుఁడ నగుదును. అదెట్లందువా నా స్వధర్మమును నేను నిర్వహించిన వాఁడనగుదును. నీవు స్వధర్మ స్థాపనమునకుఁగదా కంకణము గట్టి దీక్ష వహించితివి? నీ స్వధర్మము నీకెట్టులో నాస్వధర్మము నా కట్టులుగదా. తండ్రిని ధర్మమునుండి చెడకుండఁ గాపాడఁ బూనినవాఁడవు నా స్వధర్మమునుండి నన్నేల భ్రష్టునిఁ జేయఁజూచెదవు? నాధర్మ మేలకాపాడవు? నేను నీసేవ చేయ నని తిరస్కరించితినేని నన్ను దండించియైన నాధర్మమందు నన్ను నిలిపి పెద్దవారికిఁ

బిన్నవారు సేవచేయవలయునను ధర్మము నాచేఁ జేయింపవల సినది నీకు విధియై యుండఁగా ధర్మహానిఁ గలిగింపఁ జూచె దవు. ఇంట గెలువలేనివాఁడు రచ్చ నేమి గెలుచును? ఇంట నుండు నన్నే నాధర్మమందు నన్ను నిలుపనోల్లవేని రాష్ట్రజను లందేమి నిలుపఁగలవు? అట్లైనచో ధర్మరక్షాదీక్ష యేమై పోయి నట్లు? నన్ను వెంట రానిచ్చిన లాభపడువాఁడను నేను మాత్రమే కాదు. నీకుఁ గావలసిన జలములు - ఫలములు - సమిధలు - దర్భలు నేను దెచ్చి యిచ్చెదను. నేను దెచ్చకోఁ జాలనా యందువా? వీనికై పోవునపుడు సీత నడవిలో నొంటిగా నెందుంచి పోయెదవు? నాతోడఁ బిలుచుకొని పోయెద నందువా? రాత్రులందు నిరువురు నిద్రించితి రేని వనమృగాదులవలన బాధలేకుండ నెవరు కాచియుందురు? పదునెనిమిదియేఁడుల బాలిక యామె నిద్ర యాఁపఁగలదా? నీ వెన్ని నాళ్లని నిద్రలేక యామెను గాచి యుండెదవు? ఈపనులన్నియు నేను జేయుచుండిన మీరు సుఖముగాఁ గ్రీడింపవచ్చునుగదా. అదియునుగాక నేను నీయాశ్రితుఁ డను. నన్ను రక్షించుటచే నాశ్రితరక్షణమువలనఁ గలుగు ఫలము నీకును లభించును. వలదని వారించితివా యాశ్రి తత్యాగదోషము నీకుఁ బ్రాప్తించును. ఆదోషము రాకుండఁ జేసికొనుటకైన నాసేవ నంగీకరింపుము.

నన్నేలు మని చెప్పుటకు మాఱుగ నన్నేలుకొనుమా యని యాత్మనేపదము ప్రయోగించుటచే సేవాఫల మనుభ వించువాఁడవు నీవే యని స్ఫురించును.

లక్ష్మణా! పెద్దవాఁడ నగుటచే నాసేవవలన నీవు కృతార్థుఁడ నయ్యెద నంటివి – సంతోషమే. కాని నాకంటెఁ బెద్దవారు తల్లిదండ్రు లిందేకదా యున్నారు. వారిసేవ చేసినఁ గృతకృత్యుఁడవు కావా? అది ధర్మము కాదా? అట్టి ధర్మమువలన నీకు స్వర్గఫలము కలుగునే? అనిన లక్ష్మణుఁడు,

గీ. దేవలోకాక్రమణమైన, దేవ యల్ల
నిర్జరత్వంబమైనను, నిఖిల లోక
ములయు నైశ్వర్యమైనను వలచువాఁడఁ
గాను నీలేనిచోట మహానుభావ.

అయ్యా! నీ వెటులేని పోయితివేని కొంతకాలము దేవలోకమందుండు సుఖము నాకు వలదు. నేనే దేవతనై కలకాలము స్వర్గమునందుండుటయు నాకు వలదు. ఒక్క స్వర్గలోకమే కాదు ౧౪ లోకముల ప్రభుత్వమైనను నాకు వలదు. నీ సేవవలనఁ గలుగుఫలము వీనివలెఁ గొంతకాల మునకు నశించునదికాదు. స్థిరఫలమును వదలి యస్థిరము నెవఁడు కోరును?

లక్ష్మణా! నేను నీకుఁ దండ్రి నంటివి–జ్యేష్ఠుఁడ నంటివి–భర్త నంటివి – స్వామి నంటివి – ఇట్టి చిన్నవాఁడవు కింకరుఁడ వగు నీవు నామాట జవదాఁట వచ్చునా? నిమీఁద నాకు భక్తియే కాని నీయాజ్ఞప్రకారము నేను నడచుకొన ననిన నేమి యర్థము? ఆజ్ఞాద్రోహివి కావా? నాతండ్రి యాజ్ఞ శిర

సావహించి నేను నడచుటకుఁ బూనలేదా? నే నుల్లంఘించి తినా? అట్టులే నీవేల నామాటకు లోఁపడవు? ఇది ధర్మవిరుద్ధము కాదా?

అన్నా! రామచంద్రా! నీపితృవాక్యపరిపాలనమువలన స్వధర్మహాని లేదు – స్వరూపహాని లేదు. అటుచేయకుండిన నీ వధర్మవర్తనుఁడవగుదువు. కావునఁ జేయఁ బూనితివి? నీ మాటచొప్పున నేను వర్తించిన నాకు స్వధర్మహాని స్వరూపహాని కలుగును. నన్ను రక్షించునది నాకు స్వరూపమైన నాస్వధర్మమే. నాస్వధర్మమందు నే నుండనేని నీవు నన్ను రక్షింపఁగలవా? లేవు కదా? కావున నేను.

లక్ష్మణా! యిప్పుడు నావెంట నేను రానీయనేని నీవేమి చేసెదవు?

అన్నా! నే నేమి చేయఁగలను? ఇచ్చట నీకు సేవ చేయువారు పెక్కురు గలరు. కావున నాకుఁ బూర్ణముగ సేవించు పుణ్యములేదు. అడవులందు వీ రెవ్వ రుండరు. అప్పుడు పూర్ణముగ సర్వసేవలు నే నొకఁడనే చేయ నభిలషించితిని. అట్టిది నాకు ప్రాప్తపడదయ్యేనేని నాజీవితమే వ్యర్థము.

మత్త. నిన్నుఁ బాసి ధరాతనూజయు నేను నొక్క ముహూర్త
మే। నిన్నిలం గలవారమే తమ నీటిఁ బాసిన చేఁపల
ట్లన్నా! ॥

నిన్నుఁ బాసి నేనుగాని సీతాదేవిగాని యల్పకాలమైన నీటిని బాసిన చేఁపలవలె జీవింపలేము. చేఁపలకు నీళ్లెట్లు జీవనమో నీవు మాకట్లు, నీళ్లను విడిచిన చేఁపల ప్రాణములు తమంతటఁ దామే లేచి పోవును. దానికి చేఁపలు ప్రయత్నింపవలసిన పనిలేదు. అట్టులే నీవు మమ్ము విడిచితివా మాప్రయత్నము లేకయే తమంతటఁ దామే ప్రాణములు దేహమును విడిచి లేచిపోవును. నేను జేయునది యేమున్నది.

ఈసంభాషణమువలన లక్ష్మణుఁ డేల రాముని వెంట నరణ్యమునకుఁ బోయెనో స్పష్టపడియెను.

స్వధర్మమగు కైంకర్యమం దిట్టిపట్టుదల కలవాఁడు కనుకనే రాముఁడు నిన్ను యువరాజును చేసెద నన్నప్పుడు కైంకర్యహాని యగునని లక్ష్మణుఁ డంగీకరించినవాఁడు కాఁడు. పెద్దవాఁడు భరతుఁ డున్నకారణముచే లక్ష్మణుఁ డంగీకరింపలేదని కొందఱు చెప్పుదురుగాని యది వాస్తవము గాదు. లక్ష్మణుఁడు యౌవరాజ్య మంగీకరించియుండిన శ్రీరాముఁడు భరతునకు శత్రుఘ్నునకు మధురాపురమువలె వేఱొకరాజ్యమిచ్చియుండును. పరతంత్రుఁడైన భరతుఁ డంగీకరించియే యుండును.

కైంకర్యహాని లక్ష్మణుపాలిటికిఁ బ్రాణహానియే కావుననే రాముఁడు యమున కిచ్చినమాటప్రకారము లక్ష్మణునితో,

కం. చెడకుండ ధర్మవిధి నిను
విడిచితి సౌమిత్రి నాదుప్రియసోదరుఁడా
పుడమిని సాధుల కిష్టుల
విడుచుట చంపుటయు నొక్కవిధమై యునికిన్.

శ్రీరాముఁడు లక్ష్మణునితో రావణుఁడు విభీషణునకుఁ జెప్పినట్లు ఛీ నీవు పొమ్మని చెప్పలేదు. నేను నిన్ను విడిచితి నని చెప్పెను. ఆశ్రితత్యాగదోషము నాదేకాని యేదోషము నీయందు లేదని భావము.

అన్ననోరనుండి నేను విడిచితి నని చెప్పఁగానే లక్ష్మణుఁ డేమి చేసెను.

సీ. రామునివాక్యముల్ సౌమిత్రి యాలించి
కన్నుల నీళ్లులు కార్చి యపుడ
తనగృహంబునకైనఁ జనక చక్కఁగఁ బోయె
సత్వరుండగుచును సరయుకడకు
నంబువుల్ వార్చి కృతాంజలి యగుచును
నఖిలేంద్రియంబుల నాఁకగొనుచు
నూరుపు బిగియించి యుండ సహస్రాక్ష
రోగణంబులు సురపూగములును
బుష్పవృష్టి గురియఁ బురుహూతుఁ డెవరికిఁ
గానరాక వచ్చి కడు బలాఢ్యుఁ
డనువుతో సుమిత్ర తనయుని గ్రహియించి
త్రిదివమునకుఁ జనియె దివ్య లలర.

లక్ష్మణుఁడు త్రిదివమునకుఁ బోయె ననుటచే భగవత్కైంకర్యప్రాప్తికి ఫలము స్వర్గమాత్రమా యని పాఠకులు జుగుప్స పడ నక్కఱలేదు.

పునస్సంయోగములేని వియోగము కింకరున కెట్లు సహింపరానిదో యట్టివాని వియోగము భగవంతునకు నట్టిది. కావుననే రాముఁడు లక్ష్మణుని విడిచినతోడనే తాను మహాప్రస్థాన మేఁగ నిశ్చయించుకొని "లక్ష్మణుఁ డేగుగతికి నే నేగువాఁడ" లక్ష్మణుఁ డేస్థానమునకుఁ బోయెనో యాస్థానమునకు నేను బోయెద ననెను.

రాముఁడు పోయినస్థలము తెలిసిన లక్ష్మణుఁడు పోయినస్థలము తెలియును గదా.

కం. తా నిశ్చయించి మనమున
సానుజుఁడై యపుడు చొచ్చె సశరీరుండై
మానితవైష్ణవతేజము.　　ఉత్తర. ౧౬౫౬.

అనియుండుటచే లక్ష్మణుఁడుకూడ వైష్ణవతేజములోఁ జొచ్చె నని యేర్పడుచున్నది. లక్ష్మణుఁడు వైష్ణవతేజములోఁ జొచ్చుట యనఁగా దీప మెండలోనికిఁ బోయినట్లని యెంచవలయును.

కావునఁ గైంకర్యఫలము ముక్తియేకాని తుచ్ఛస్వర్గము కాదు. కాని యట్టిఫలమును గోరువాఁడు లక్ష్మణువలె.

1. సర్వకాల సర్వావస్థల భగవత్సేవ నేమఱరాదు.

2. చేతులతోఁ బ్రత్యక్షముగఁ గైంకర్యము చేయసాధ్యముగాని యప్పుడు మనస్సుతోనో వాక్కుతోనో చేయుచుండవలెను.

3. సాధ్యమైనంతమట్టునకు భగవద్దివ్యదేశమే తనకు వాసస్థానము చేసికొనవలయును.

4. తనలాభము సుఖము సంతోషము కొంచెమైనఁ గోరరాదు. స్వామి సుఖ లాభ సంతోషములే తనసుఖలాభసంతోషము లని యెంచి యుండవలెను. తన సుఖమే కాదు తనవారిసుఖముకూడఁ బరిత్యజించి యైన కైంకర్యము చేయవలెను. ఇట్లనుటచే వయస్సుభార్యలను, దన రక్షణముపై నాధారపడియుండు తల్లిదండ్రులను వదలి దేశాంతరము వనములకుఁ బోరాదు. తనకార్యమునకు వారు ప్రతికూలురు కారేని వారిని వదలరాదు. భార్య పుత్రవతియై, పుత్రులు రక్షింపశక్తిగలవారైరేని వారి కామెను నామె సమ్మతిపై నప్పగించి తాను బోవచ్చును. అనుకూలవతియై శీలవతియైనభార్య దానును వచ్చెద ననెనేని దానిని విడిచిపోరాదు. అట్లైనచో లక్ష్మణుఁ డేల యూర్మిళను విడిచిపోయెను. ఆమె యనుకూలవతిగాదా-శీలవతిగాదా? యందురేమో. శీలమందు-నానుకూల్యమందు నూర్మిళ సీతకుఁ దక్కువదికాదు.

కాని వయస్సునఁజిన్నది. సీతయంతటి స్థైర్యధైర్య ములు కలదిగాదు. ఈ జంజాటముండెనేని లక్ష్మణు నకుఁ గైంకర్యమందు లోపము గలుగక తప్పదు. అన్నయువదినెయు రాత్రులందుఁగూడనిదురింప లక్ష్మ ణుఁడు ధనుర్ధరుఁడై వారిని గావలికాచి తిరుగుచుం డెను. అప్పుడూర్మిల నెందుఁ బండఁబెట్టను? ఆమెను గాచువారెవ్వరు? వదినె చీరలు – అన్న యాయుధ ములు – గంప గడ్డపాఱలే యాయన మోచినంత యుండెను. ఇఁకఁ బెండ్లము చీరలెట్లుమోయును? సీతావియోగానంతరము రామునివిడిచి ఫలాదులకై లక్ష్మణుఁడు పోవుచుండెను. అప్పుడూర్మిల నెచ్చట విడిచిపోవును. రావణుఁడు నూర్మిలనుగూడ హరించి యుండిన లంకలో సీతపడినబాధ లోనైనవి సామాన్య స్త్రీయగు నూర్మిల సహించియుండఁగలదా?

5. కైంకర్యము విధ్యుక్తము – స్వధర్మము–కావునఁ జేయ వలయు నని చేయవలయునే కాని ఫలము కోరి కాదు.

6. కైంకర్యహానికరమగు కార్య మెవరు చెప్పినను జేయ రాదు.

7. భగవత్కార్యమునకైనచో వియోగము సహ్యమే. కావుననే కదా లక్ష్మణుఁడు రాముని విడిచి కిష్కిం ధకుఁ బోయి కొన్నిదినము లుండుట.

8. కింకరోమి కింకరోమి స్వామికిఁ బ్రీతికరమైన కార్య మేమి చేయుదునా యేమి చేయుదునా యని కుతూహలము కలవాఁడై సర్వదా యుండవలయును.

9. మనసేవకు వీఁడు యోగ్యుఁడు. వీనిచేత మన మీ కైంకర్యము చేయించుకొనవలయు నని సంకల్పము భగవంతునకుఁ గలుగునట్లు వర్తింపవలయును. భగవత్సేవ మనము చేయవలయునను మనసంకల్పమునకుఁ దోడు భగవత్సంకల్ప మనుకూలమై వచ్చిన నే సంపూర్ణఫలము గలుగును.

10. కైంకర్యము చేయువాఁడు నేను నాది యనుకొనుచుండిన సర్వము చేతనములను నచేతనములను తన్నుఁ దన దేహమునుగూడ స్వరూపముగఁ ద్యజింపవలెను. అది సాధ్యము కానప్పుడు వానియందలి యభిమానమునైనఁ ద్యజింపవలెను. వానితోడి జంజాటముచేఁగాని వానియందలి యభిమానముచేఁగాని కైంకర్య హాని కలిగించుకొనరాదు.

11. నమస్కరించుట కింకరుని ప్రధమలక్షణము. అది వినయమును దెలుపును. రామునకే కాదు సీతాదేవికిఁ గూడఁ బ్రాతస్సాయంకాలములయందు నమస్కరింపవలయును.

రావణుఁడు త న్నెత్తుకొనిపోవు సమయంబున ఋశ్య మూకముపైనున్న వానరులఁ జూచి తన యాభరణములందుఁ గొన్ని యుత్తరీయమున మూటగట్టి వారిముంగల పాఱవైచెను. వానిని సుగ్రీవుఁడు దాఁచియుంచి శ్రీరామునకుఁ జూపెను. వానిని గుర్తించియు శ్రీరాముఁడు లక్ష్మణునిఁ జూచి లక్ష్మణా యివి సీత వవునా చూడు మని చూపెను.

చం. అనవుఁడు లక్ష్మణుండును నిజాగ్రజుతోడుత నిట్లు పల్కు
నో ! యనఘ! యెఱుంగఁజాల వనితాంగదముల్, గుఱు
తింపలేన యా ! గొనబగు కుండలంబులను, గోమలి నేను
దినంబు పాదవందన మొనరించుచుం గనుట నాతివ
యందియ లే నెఱుంగుదుర్ ॥

అన్నా! భుజములందుఁ బెట్టుకొను నంగదముల నేను గుర్తింపలేను. చెవుల కమ్మలు నేను గుర్తింపలేను. ప్రతి దినము నేను నమస్కారము చేయువాఁడనగుటచేఁ గాలి యందెలు మాత్రము సీతాదేవివే యని చెప్పఁగల ననెను.

అయ్యలారా! కంటిరా పదుమూఁడు సంవత్సరములు కూడనుండియును లక్ష్మణుఁడు సీతాదేవిపాదములనుతప్ప, నామె నోఁకాటికి పైభాగమును జూచినవాఁడు కాఁడు. దీనివలననే లక్ష్మణుని మహత్త్వము - నూహోత్త్వము జితేం ద్రియత్వము వినయవిధేయతలు తెలియనగు. దాసుల మనువా రిట్టిజితేంద్రియులై యుండవలయును.

లక్ష్మణుఁడు సీతాదేవిని కన్నెత్తి చూడకయుండినది వనవాసకాలమందు మాత్రమే కాదు. అయోధ్యయందున్నప్పుడును.

శ్రీరాముఁడు రాజ్య మేలుచున్న కాలమందు జనాపవాదమునకు భయపడి సీతను వాల్మీకియాశ్రమమునొద్ద గంగాతీరమున విడిచి రమ్మని లక్ష్మణున కాజ్ఞాపించెను. లక్ష్మణుఁ డట్లులే యామెను విడిచి యామెయనుజ్ఞ తీసికొని వచ్చునపుడు సీతాదేవి లక్ష్మణునితో,

కం. కనుమా నను గర్భముచి
హ్నము దాల్చినదాన నెట్టి యలజడి గలిగెఁ.

లక్ష్మణా నేను నిండుచూలాలిని – చూడుము. నాకెట్టికష్టము కలిగెనో యని చెప్పెను. ఊరు విడిచి పోవునపుడు గర్భిణికాదు. ఆవల గర్భము తెచ్చుకొన్న దని రెండవ నింద యొకటి వచ్చునను తలంపుతో సాక్షిగానుండ నిమ్మని యిట్లు చెప్పెను. దానికి లక్ష్మణుని ప్రత్యుత్తరము వినుఁడు.

చం. అనవుడు దీనచిత్తుఁ డబలాంఘ్రుల మ్రోల ధరిత్రి సోఁకఁ
గాఁ। దనదు శిరంబు వ్రాల్చి వసుధాతనయామణితోడ
నొక్కవ। ల్కను వచియింపలేక వలకొంచు మహారవ
మార నేడ్చుచుఁ। దనమది నొక్కమారుతము ధ్యాన
మొనర్చుచుఁ–బల్కె సీతతోఁ॥

చం. అనఘచరిత్ర, యేమనుచు నాడితి వేను భవత్స్వభావ
మర్మ। గనినది లేద యింతదనుకన్ భవదంఘ్రి యుగంబు దక్కఁగా। జనములు లేని యీయడవి సాధ్వి రొ
రాముఁడు లేనిఁ వేళ నేఁ। గనుటయుఁ గల్గునే?

యని చెప్పెను.

ఇట్టి కత్తిమీఁదిసాము లక్ష్మణునకుఁ జెల్లనే కాని యిత
రులకు సాధ్యముగాదు. కావునఁ దక్కినవారు

కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావము చేసి మరలువాఁడు.

అను ప్రహ్లాదునివలె నాచరింపవలయును. నడచు
నపుడు తలయెత్తక నేలఁజూచుచు నడవవలెను చూడవలసి
వచ్చినపుడు పరస్త్రీని తల్లి యనుభావముతోఁ జూడవలెను.

సశేషము.

## ప్రార్థనాపత్రము - సాక్షులు.

శ్రీకోదండరామ సేవకసమాజమునఁ జేరఁ గోరు
వారు సమర్పించు ప్రార్థనాపత్రములందు సాక్షుల మని
చేవ్రాలు చేయువా రట్లుచేయుటకు సమాజమునఁ జేరఁ
గోరువారు నియమములఁ జక్కఁగాఁ బాటింతు రనుట తమకు
నమ్మకమనియు వారు దుష్ప్రవర్తనము కలవారై సమాజమున
కపకీర్తి తెచ్చు కార్యములు చేయుదు రేని యావిషయము
వెంటనే వాసుదాసునకుఁ దెలుపుదుమనియు నర్థమే కాని

చేవ్రా లాపత్రము సమర్పించువాని దని దృఢపఱుచుటకు మాత్రము కాదని తెలియవలెను. ఇది యింతకుఁ బూర్వము సాక్షిచేవ్రాలుచేసిన వారికిని నన్వయించును.

నియమప్రకారము చేయవలసిన జప–ధ్యాన భజనాదులు చక్కఁగాఁ జేయని దురదృష్టులు భగవదనుగ్రహమునకుఁ బాత్రులుకాక పోవుదురు. నియమాతిక్రమణము గావించి మాంసభక్షణము – జారత్వము – చోరత్వము – జనవంచనము లోనగు దుష్కార్యములు చేయువారు ప్రమాణమునకు విరోధముగ వర్తించిన పాపముగూడఁ బొందుదురు. వీరివలన సమాజమునకు నపకీర్తియు వచ్చును. ఇట్టివారు సమాజము నందుండఁ దగరు.

ఈవిషయమై యొకటి యాలోచింపవలసియున్నది. ఇట్లు దుష్కార్యములను జేయువారిని సమాజచిహ్నములైన పతకముల మరలఁ దీసికొని సమాజమునుండి తొలఁగించుట శ్రేయస్కరమా? పతకముల మరల గ్రహింపక వారి పేరు తొలఁగింపక సమాజబాహ్యులుగా నుంచి వారు ప్రమాణము నుల్లంఘించుటచేఁ గలుగు పాపముల ననుభవించు నట్లు చేయుట సమాజమునకు శ్రేయస్కరమా? సమాజ భ్రష్టులు కొందఱేర్పడుటవలన నిఁకమీఁద సమాజమునఁ జేర్చుకొనుటయందును రహస్యవిషయములు చెప్పుటయం దును మిక్కిలి హెచ్చరిక వహింపవలసివచ్చెను. మొగ

మోటమునకుఁ బోయిన ముండగర్భిణి లైయినట్టు లయ్యో పాపము బాగుపడ నిమ్మని యట్టివారికి నేర్పిన విషయములు బూదిలోఁ జేసిన హోమమగుటయే కాక యుపదేశించిన వారికిని గీడు కలిగించును. అయ్యో పాప మనిన నాఱు నెలల దోషముకూడ వచ్చె నను సామెత నిజమగును. ఇట్టి కారణములచేత కాఁబోలు పెద్దలు శిష్యు నొక సంవత్సరము పరీక్షించిగాని దగ్గఱఁ జేర్పరాదని శాసించిరి. జిహ్వాచాపలము చేతను గామగృహాకండూతిచేతను నెవరి కేవేళ కేమి దుర్బుద్ధి పుట్టునో-కావున నిట్టివారు తెలియరాఁగానే యట్టివారిని దొలఁగింపఁ జేయుభారము సమాజయశము సామాజిక శ్రేయస్సు గోరువారిదై యున్నది.

| నిత్యభోగమునకు, | వాగ్దానము. | చెల్లించినది. |
|---|---|---|
| ౭౯. శ్రీనివాసులజానకమ్మగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౫౧. గుండాల సుందరమ్మగారు | ౫౦-౦-౦ | ౩౦-౦-౦ |
| | లోగడ | ౨౦-౦-౦ |
| ౮౫. దేచిరాజు రామారావుగారు | ౫౦-౦-౦ | ౫౦-౦-౦ |
| ౮౨. మతుకుమల్లి హనుమాయమ్మగారు | ౫౪-౦-౦ | ౨౦-౦-౦ |
| ౧౮౦. గణవరపు రంగారావుగారు సంవత్సరమునకు. | ౬-౦-౦ | ౩-౦-౦ |
| ౧౮౧. అక్కిరాజు బొజ్జమ్మగారు | ౫౦-౦-౦ | ౧౫-౦-౦ |

| | | |
|---|---|---|
| ౧౮౨. దూబగుంటసుబ్రహ్మణ్యముగారు | ౩-౦-౦ | ౩-౦-౦ |
| ౧౮౩. గిద్దలూరు కృష్ణయ్యగారు | ౩-౦-౦ | ౩-౦-౦ |
| ౧౮౪. చింతలపూఁడి లక్ష్మణరావుగారు | ౩-౦-౦ | ౩-౦-౦ |
| ౧౮౫. పాటూరు కృష్ణయ్యగారు | ౩-౦-౦ | ౩-౦-౦ |
| ౧౮౬. పాటూరు కామమ్మగారు | ౫౦-౦-౦ | ౧౦-౦-౦ |
| ౧౮౭. కరి సూర్యనారాయణగారు | ౩-౦-౦ | ౩-౦-౦ |

సశేషము.

మందరము వ్రాయుకాలములో శ్రీస్వామి నైవేద్యమునకు నెలకు రూపాయవంతున మూఁడుసంవత్సరములవఱ కిచ్చు టంగీకరించిన భక్తుల వివరము.

| | వాగ్దానము. | చెల్లించినది. |
|---|---|---|
| ౩. అల్లూరు అప్పలనరసింహ రాజుగారు Alias అప్పల రాజుగారు రేలంగి. | ౩౬-౦-౦ | ౧౦-౦-౦ |
| ౫. మధిర రంగదాసుగారు చాగంటివారిపాలెము. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౧౦. కనుపర్తి హనుమాయమ్మగారు కొండాసత్యవతమ్మగారు - దేచవరం. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౧౨. చిల్లర మరాళమ్మగారు వెల్లలూరు. | ౩౬-౦-౦ | ౨౨-౦-౦ |
| ౨౦. రాజా వెంకటస్వామిసెట్టి గారు ధర్మవరము. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |

| | | |
|---|---|---|
| ౨౧. అక్కరాజు వేంకటసుబ్రహ్మణ్యముగారు మహిమలూరు. | ౩౬-౦-౦ | ౨౮-౦-౦ |
| ౨౪. పామిడి సుబ్బన్నగారు తాడిపత్రి. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౨౫. పెనుమత్స సుభద్రయ్యమ్మగారు రేలంగి. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౨౬. పెనుమత్స బంగారయ్యమ్మగారు రేలంగి. | ౩౬-౦-౦ | ౨౪-౦-౦ |
| ౨౭. అల్లూరు వేంకటరమణయ్యమ్మగారు రేలంగి. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |
| ౨౮. తిరుమలరాజు సీతయ్యమ్మగారు రేలంగి. | ౩౬-౦-౦ | ౧౭-౦-౦ |
| ౩౦. సత్రము నారాయణరావుగారు శిరస్తాదారు, డిస్ట్రిక్టుకోర్టు, కడప. | ౩౬-౦-౦ | ౨-౦-౦ |
| ౩౧. నిష్టలవేదగిరి అయ్యగారు కడప. | ౩౬-౦-౦ | ౯-౦-౦ |
| ౩౩. పెండ్యాల రామసుబ్బయ్యగారు గుంటూరు. | ౩౬-౦-౦ | ౧౭-౦-౦ |
| ౩౫. దేచిరాజు సాంబశివ వరప్రసాదరావుగారు ప్రాతగుంటూరు. | ౩౬-౦-౦ | ౧౨-౦-౦ |

౩౬. దేచిరాజు రామారావుగారు ప్రాతగుంటూరు. ౩౬-౦-౦ ౨౫-౦-౦

౩౭. గుండవరపు వేంకట సుబ్బారావుగారు గుండవరము. ౩౬-౦-౦ ౨౪-౦-౦

౩౮. రావినూతుల నాగభూషణముగారు అంగలకుదురు. ౩౬-౦-౦ ౩౬-౦-౦

౩౯. కోటంరాజు సూర్యనారాయణగారు రేపల్లె. ౩౬-౦-౦ ౧-౦-౦

౪౦. వేల్పూరు సూర్యనారాయణగారు వేల్పూరు. ౩౬-౦-౦ ౧౮-౦-౦

౪౧. కొలిచిన కామశాస్త్రిగారు బి. ఎ. సత్తెనపల్లె. ౩౬-౦-౦ ౧౨-౦-౦

౪౭. పిళ్లారిసెట్టి వేంకటాచలపతి రావుగారు గురుజాల. ౩౬-౦-౦ ౧-౦-౦

౪౯. జంపాల గోపాలరావు చౌదరిగారు తహసీల్దారు, ఒంగోలు. ౩౬-౦-౦ ౧౨-౦-౦

౫౦. గుండవరపు సూర్యనారాయణగారు కరణము, క్రొత్తపల్లి. ౩౬-౦-౦ ౧౦-౦-౦

౫౧. చిల్లర హనుమంతరావుగారు వెల్లలూరు. ౩౬-౦-౦ ౧-౦-౦

౫౨. రావిపాటి వీరయ్యకుమారుఁడు వెంకయ్యగారు వేఁటపాలెము. ౩౬-౦-౦ ౧౨-౦-౦

సశేషము.

| | | |
|---|---|---|
| ౫౭. ఎల్లాప్రెగడ అనంత పద్మనాభయ్యగారు కరణము సిరిపురం. | ౩౬–౦–౦ | ౩౬–౦–౦ |
| ౬౨. డి. సంజీవరావుగారు రెవిన్యూ ఇన్‌స్పెక్టరు, ఎల్లలూరు. | ౩౬–౦–౦ | ౧౨–౦–౦ |
| ౬౩. కోగంటి వేంకటసుబ్బయ్యగారి భార్య అచ్చమ్మగారు కూచపూడి. | ౩౬–౧–౦ | ౧౨–౦–౦ |
| ౬౭. పున్నమరాజు పెదవేంకటరావుగారు, Alias వేంకటదాసుడుగారు. | ౩౬–౦–౦ | ౫–౦–౦ |
| ౬౮. నగరూరు సుందరమ్మగాగు బళ్లారి | ౩౬–౦–౦ | ౧౨–౦–౦ |
| ౭౦. బోయనపల్లి వెంకటనరసింహారావుగారు రంగూన్. | ౩౬–౦–౦ | ౩౬–౦–౦ |

సశేషము.

భక్తిసంజీవని చందాదారులు.

| | |
|---|---|
| ౯౦౧. ఎం. వాసుదేవశాస్త్రిగారు, నెల్లూరు. <br> ౨౫౦. వి. వేంకట రంగయ్యగారు, నర్సారావుపేట. | వీరి పూర్తి విలాసము తెలిసినవారు మాకు వ్రాయ ప్రార్థితులు. |

ఆత్మ తెలియని యోగికద్వైతములు మెండు.

జూలైనెల సంజీవనియందు జీవ బ్రహ్మైక్య వేదాంత రహస్యమందలి కొన్ని సందేహములను దీర్చువారెవ్వరా యని యాలోచింప ననంతపురమండలమున ధర్మవరముసమీపమునసుండు చిగిచెర్లయను గ్రామమునఁ బ్రకృతము విచ్చేసి

యుండు శ్రీకృష్ణపరమహంసలవారు తాము శ్రీకృష్ణుని యవతారమనియు వీరి యుపదేశవాక్కులు విన ఋషీశ్వరులు కాచిపడియున్నారనియు వీరి శాగ్రంథమందు విశేష పరిచితి స్వీయాభిమానము గలదనియు విని నాసందేహములు తీఱుకాలము నేఁటికి లభించెఁగదా యని యుప్పొంగి వారు ప్రత్యుత్తరములీయఁ బ్రార్థింపఁబడిరి. ఆ సంజీవనియందుఁ బ్రకటించినప్రకారము వారు ప్రసాదించిన ప్రత్యుత్తరమిందుఁ బొందుపఱుపఁబడెను. పాఠకులు ప్రాణాయామాసన విషయప్రశ్నములేమి? పృష్ఠతాడనం దంత భగ్నమన్నట్టు ప్రత్యుత్తరమేమి? యని కినియకుందురుగాక. అంతియగాక యక్షరజ్ఞానములేక - శబ్దజ్ఞానములేక - యర్థజ్ఞానములేక - యన్వయజ్ఞానములేక - విషయజ్ఞానములేక వ్రాయఁబడిన వెఱ్ఱివ్రాఁతల నెట్లు సంజీవని ప్రకటించెననియుఁ గోపింపకుందురు గాక. అది వ్రాసినవారు పరమహంసలు - అతీతులు - సంతతాగ్నిహోత్రులు - కృష్ణమూర్తులు - కావున వారియందు దోషమెంచరాదు. వారిమాటలు మనుష్యులకేకాదు - దేవతలకుఁగూడ నర్థముకాదు. హంసలభాషలు మనుష్యుల కర్థముకాఁగలదా. హంసయాన సరస్వతికిని దెలియదు. పరమహంసపైనెక్కు పరమసరస్వతికిఁ దెలియవలె - దమయంతికిఁ దెలియవలె. తెలిసికొనలేనిదోషము మనదేకాని వారిది గాదు. హంసయనఁగా Goose, duck, flamingo అని Apte ఆప్త నిఘంటువునందు బాతు అని వ్రాయఁబడియున్నది.

హంసయే గూస్‌గామారైనదని శాబ్దికులు చెప్పుచున్నారు. ఆ పక్షులమాటలు మనుష్యుల కర్థముకాఁగలదా. కావున వారి ననరాదు.

వారు వ్రాసినయుత్తరమేకాక కొన్ని సందేహములను వ్రాయవలసివచ్చెను. పాఠకులు సంజీవనిని ఆవిషయము లను ప్రశ్నింతురేమో యను భీతిచే వారే సెలవిచ్చిన సంజీ వనీభారము తప్పునని వానిని వ్రాయవలసివచ్చెను. క్షమింతురుగాక వారువ్రాసిన యుత్తరమిది.

## "ఆత్మవిచారణ."

1. రెండువిద్యలను దెలిసికొనఁదగినది. అనఁగా శబ్ద బ్రంహ్మమును పరబ్రహ్మమును చక్కఁగా తెలిసికొనినవాఁడు వకరిని తప్పుపట్టఁడు తనతప్పును దానుచూచుకొనును. సదరు విడిచినవానికి గోచరము అని ధర్మవాచ. శాంతిః.

2. బుద్ధిశాలియైనవాఁడు వేదశాస్త్రములను అభ్యసించి జ్ఞాన విజ్ఞానము జ్ఞానము దెలివి. విజ్ఞానము తెలిసికొనినప్రకారముగా అనుభవముపొంది విడువని ప్రయత్నము కలవాఁడైయుండును. ధ్యానమును గోరువాఁడు వేదశాస్త్రములను విడువవలయును అని బుధులవాచ. దీనిభావము ఆత్మవిచారణపరులకు తెలియును. గాన సాధనపరులకు తెలిసినదిగాదు. ఆసనములుగావు, ముద్రలుగావు, యోగములుగావు, మనస్సుగాదు. గాన యీఆత్మను మీరు ప్రశ్న అడి

గితిరి. మనస్సుకు మనస్సే సాక్షిగాయున్నది. తమయొక్క ఆశీర్వచనమునకు ఎదురుచూచువాడను. తత్వవేత్తలగువారు అన్నిటిని దైవస్వరూపముగా చూచువారు యీ అర్చిరాది మార్గమును యేసాధనలేక కనదగును. ఆత్మసాక్షిని గనవల యును. అని యీ కేవలాత్మమనవి శిరస్సానమస్కారములు.

3. భక్తవర్యులగువారికి సదరు శిష్యులకు ఆశీర్వాద ములు ఇచ్చినపిదప వారలుచేయు దుష్కార్యములు సత్కా ర్యములు గురువులకు చెందునని పెద్దలు విన్నపము. గాన పెద్దలును తిరస్కరించడముతో మనస్సు సాక్షులగుచున్నారు. దీని అంతరార్థములో ఆలోచించవలెను మానవులయొక్క నడతలు త్రిగుణరహితులగువారికి తెలియును. తాము నిర్మల చిత్తులై యీ మహా వాక్యార్థమును గమనించి భగవద్గీతలో 14 అధ్యాయమును చూడవలయును. అని యీ ఆత్మయొక్క మనవి తాము కోరినప్రశ్న అందులోనేయున్నది. అహింసా పరమోధర్మమును అనగా ఎట్టిది అని చూడగా ఒకరిని వాదిం చడము, అలక్ష్యముచేయడము, దూషించడము మనస్సు నొ ప్పించడము, నేను ఎక్కువ నీవు తక్కువ యని తిరస్కరించ డము. ఇవి హింసయని ఆత్మను దర్శించిన జీవన్ముక్తులకు ఎరుక. ఇది అతీతము అని పెద్దలగు వారుపలుకుదురు. శాస్త్రమువదలి మనస్సు సాక్షినిగని జన్మసాఫల్యము చేసుకొనవలయునని దైవ వాచ. తెలిసినవారు దీనులకు దీనులైయుందురని భక్తశిఖా

మణుల విన్నపము ఇది తమలో తాము దీర్ఘాలోచనచేసి ఆశీర్వచనము దయచేయవలయును. వస్తువును చూచి వస్తునైయుండువారెవ్వరో భగవంతుని ఎరుక. ఆదినుంచి ఇదివరకు మోక్షమును ఎవ్వరు పొందియుండలేదు. మోక్షమునుకొరకై పెద్దలు కాచియున్నారట. శాంతిః శాంతిః శాంతిః.

తా. ''భూలోక భువర్లోకమునందు మించువాడ అనిభావము ఫాలనేత్రమును ధరించినవాడ - ఆధారమైనవాడ - బ్రహ్మనిష్ఠాగరిష్ఠుల అంతరంగమునందు ఆనందించు వాడ - ఆనందింపచేయువాడ - కామము విరాగము చేసినవాడ కడగంటిచూపుచే గనవాడ - నిను గనుటకు ఆత్మసాక్షిగాను గనుగొంటి తండ్రీ ఇతరమార్గములచే గనదగదు. ఏసాధనలేక గనదగును. శాంతిః శాంతిః శాంతిః.

శ్రీ కృష్ణపరమహంస
23—8—1930.                    అవధూత ఆశ్రమము''

ఈ ముక్తాయింపువాక్యముతో పరమహంసగారిలేఖ ముగిసినది. దీనిపై సంజీవనికిఁ గల సందేహములు.

౧. పరమహంసగారూ! శబ్దబ్రహ్మము - పరబ్రహ్మము రెండు విద్యలని యంటిరే. అదైన వేద్యమేది?

౨. శ్రీశంకరరామానుజ మధ్వాచార్యులు దక్కిన సర్వ మతాచార్యులును వక్రమార్గములఁ బోవువారినే కాక

భిన్నాభిప్రాయములఁ గలవారినిగూడ నాక్షేపించి సవరించిన వారేకదా. వారు తెలిపినవారు కారా?

౩. మీరు కలికృష్ణులుగదా. తాము ద్వాపరకృష్ణులుగా నున్నప్పుడు అర్జునునకు జ్ఞానోపదేశము చేయునపుడు అసురులనేల దూషించితిరి. అప్పటివిషయ మిప్పుడు జ్ఞప్తి యందు లేదేని భగవద్గీత చూడుఁడు. కొందఱను నరాధములని మూఢులని అట్టివారిని శీఘ్రమున నరకమునఁ ద్రోయుదునని యిట్టి కఠోరవాక్యములు సెలవిచ్చితిరే. అప్పుడు తమ కీ జ్ఞానము లేదాయెనా? ఉన్న తెలివి పోయెనా?

౪. తప్పులుపట్టుట యనఁగా లేనిదోషములఁ జెప్పరాదని మీ యభిప్రాయమా? లేక శిశ్నోదరపరాయణులై మేము యోగీశ్వరులము మేము పరమహంసల మని దేశము మీఁద బయలుదేఱి చేయరానిపనులు చేయుచుఁ జెప్పరానివి చెప్పుచు వంచకులై కామినీ కాంచనాసక్తులై మూఢులగు లోకులఁ జెఱుచుచు లోకద్రోహులైనవారి మాటలను టక్కులను అసత్యములను దొంగచేష్టలను లోకమునకుఁ దెలిపి మోసపోకుఁడీ యని హెచ్చరించుట దోషమని మీ యభిప్రాయమా? సంజీవని మొదటికార్యము చేసినదా రెండవ కార్యము చేసినదా. సకారణముగ శ్రీముఖ మనుగ్రహింపుఁడు.

మదనపల్లితాలూకా గోళ్లపల్లె గ్రామములోని శూద్రుఁ డొకఁడు పోలీసుపనిలోనుండి బర్తరపుకాఁబడి పెండ్లా

మును దొంగలకుఁదోలి బిడ్డల విడనాడి వేషము వేసికొని తిరుగుచు నచ్చటచ్చట నర్ధచంద్రప్రయోగములు పాదరక్షా బహూకరణములు నందుచుఁ గానని దూరదేశమునకు వచ్చి జనులను మోసగించుచున్నాఁడని వింటిని. వీని వృత్తాంతమంతయుఁ దెలుపుట గుణమా దోషమా? తమ సమ్మతిఁదీసికొని తమరెట్లుచెప్పిన నట్లు చేయువాఁడను. కొంద అద్వైతులు తత్త్వమసి యనుచున్నారు కాని ద్వైతులు వాఁడు వీఁడగునా కాఁడనుచున్నారు. మనస్సునకు మనస్సే సాక్షి – ఆత్మను దర్శించిన మీబోటి జీవన్ముక్తుల కిది యెఱుకగాని ఋజువర్తనులగు సాధకులకుఁ దెలియునది కాదు. కావునఁ దత్త్వము తమరే తెలుపవలయునని మనవి. శాంతిః శాంతిః శాంతిః.

౫. సదరు విడిచినవానికి గోచరమంటిరి. పూర్వవాక్యమున సదరు దేనితో నన్వయము – గోచరమేది? భ్రాంతిః భ్రాంతిః భ్రాంతిః.

౬. ''బుద్ధిశాలియైనవాఁడు వేద మభ్యసించి'' యని వ్రాసి వెంటనే ''ధ్యానము గోరువాఁడు వేదశాస్త్రముల విడువవలయు'' నంటిరి. ధ్యానము గోరువాఁడు బుద్ధిశాలి గాఁడనియేకదా మీ యభిప్రాయము?

హంసల యవ్యక్తధ్వనులు హంసలకును – వాని యుపదేశముకై కాచియుండు ఋషిపుంగవులకుఁ దెలియవలయును

గాని మనుష్యులకుఁ దెలియునవి కావు. కావున సందేహములు కలిగెను.

౭. ధ్యానముగోరువాఁడు వేదశాస్త్రముల నెప్పుడు వదలవలయును? ఆదియందా? మధ్యమందా? అంతమందా?

౮. విచారణశబ్దమున కర్థమేమి? వేదశాస్త్రములను వదలిన యాత్మవిచారణపరులు ఏ ప్రమాణములఁగొని విచారణ చేసెదరో తెలిపెదరా? విచారణావిచారములకు భేదము తెలియదు కాఁబోలు.

౯. సాధనపరు లనఁగా నెవ్వరు? దానికర్థము – అన్వయము తెలియునా? ఆత్మవిచారణాపరులకు సాధనములు లేవా? అమానిత్వాదు లేమిటి? సాధన చతుష్టయము లేమిటివి? పరమహంసలకు బీడీలు సాధనములుగాని యివి కావు కాఁబోలు. అటులైనఁగదా సంతతాగ్ని ముఖులగుదురు? అగ్నిముఖా వై దేవా యని ప్రమాణము కలదు కదా? బ్రాహ్మణోస్య ముఖమాసీత్తని యుండుటచేత నేకదా మీతోడ భుజించు బ్రాహ్మణుల ముఖములకు నది ధూపమాఘ్రాపయామి యని సమర్పణ చేయుచున్నారు.

తాము ద్వాపరకృష్ణుఁడుగా నున్నప్పుడు ఆత్మ సాధనమునకు ఆసనము యోగము కావలయునని యర్జునున కుపదేశించితిరే. (భగీ – ౬ – ౮) సర్వేంద్రియాణి సంయమ్య అను శ్లోకమునందు ఖేచరీముద్ర బోధించితిరే. ఇప్పుడు వలదను

చున్నారే. చేతఁగాకయేకదా? ద్వాపరకృష్ణునిమాట నిజమా కలికృష్ణునిమాట నిజమా చెప్పెదరా? **శాంతిః శాంతిః శాంతిః.**

౧౦. ఆత్మవిచారమునకు ధ్యానమునకు నిశ్చంచలమైన మనస్సు కావలయునా యక్కఱలేదా? కావలసియుండిన యోగ మక్కఱలేదా? ఆసన మక్కఱలేదా? యోగమనఁగా నేమో శబ్దార్థమైనఁ దెలియునా?

పరమహంసల కీ యాసనములు పనికిరావు. కులటాసనములు కావలయును గాఁబోలు. సంయోగమేకాని యితర యోగము పనికిరాదు. వీరికీ సాధనములు పనికిరావు గాని హారతి యెత్తెడివారివలన 1—0—0 పాదపూజకు 10—0—0 స్త్రీలు పురుషులు తొడలుపిసుకుటయు నివి ముఖ్యసాధనములు గదా?

ఈ దాసునిపైఁ గోపింపక తెలిపెదరుగాక. ప్రశాంతిః ప్రశాంతిః ప్రశాంతిః.

౧౧. మఱియొకమనవి తెలియక యడుగుచున్నాను. పరమహంసలకు నాదవానిమాలది గుర్వీగానుండవచ్చును గదా? వారతీతులు. ఎట్లున్నను దోషముకాదు కదా?

౧౨. మీవిషయమున నొక కర్ణకఠోరవార్త వింటిని. కొందఱు బ్రాహ్మణ పుణ్యజనులు తమతో సపంక్తిభోజనము చేయుచుఁ దమ పాదతీర్థామృతమును గ్రోలుచు ధన్యులగు

చుండఁ గొందఱు బ్రాహ్మణులట్లుచేసియు మరలఁ బ్రాయశ్చిత్తములు పెట్టుకొనుచున్నారని వింటెని? ఇది నిజమా ఇట్టివారును గలరా. ఏమి కలికాలమహిమ, వారికి ఏమి ప్రాయశ్చిత్తము. అగ్నిసంస్కారమా? శాంతంపాపమ్. శాంతిః ప్రశాంతిః ప్రశాంతి.

౧౩. ఈదాసుని యాశీర్వచనము గోరితిరి. ఏమని నేటి శ్రీకృష్ణ దీవింపవచ్చును? అయినను పరమహంసలు మీమాట దాఁటరాదు కావున సహస్ర ప్రతీపదర్శినీ సంయోగసిద్ధిరస్తు. అని దీవించెదను.

౧౪. అర్చిరాదిమార్గ మేసాధనలేక కనఁదగునని వ్రాసితిరి. అర్చిరాది మార్గమేదో యదియేమిటో సాధించినవా రెట్టివారో. ఆత్రోవ నెవ్వరెవ్వరు పోదురో తెలియునా? మాటమాత్రమే తెలియునా? దాని విధానము పూర్ణముగఁ దెలిసియున్నవారు వెఱ్ఱివ్రాఁతల వ్రాయరు - ఇట్టివి శిష్యులకు బోధముచేయువారి కేమిగతి - వారిచ్చు డబ్బేగతి ఆవల నరక మేగతి.

౧౫. అయ్యో మఱియొక పెద్దసందేహము. కేవలాత్మ మనవి శిరస్నానమస్కారములని సెలవిచ్చితిరి. మనవి చేయుటకు కేవలాత్మకు నోరున్నదా? నమస్కరించుటకు శిరస్సున్నదా? దేహాత్మాభిమానముగల మాదృశులకుఁ గేవలాత్మ నమస్కరింపవలసినంత దుర్దశ దానికేమి వచ్చెను. కేవ

లాత్మకుఁ గాళ్లు సేతులు లేవు కాఁబోలు - ఉండిన తన పాదరక్షలను శిష్యులచే మోయించునా? నేను గురువును వీరు శిష్యులునను దురభిమానము దురహంకారముచే నందురా? పరాశీర్వచనముగోరుట నమస్కరించుట వీనిచేతనే మీరు తెల్లహంసలో నల్లహంసలో యని సందేహము కలుగుచున్నది. ప్రశాంతిః ప్రవాంతిః ప్రభ్రాంతిః.

౧౯. శిష్యులపాపములు గురువులకు వచ్చినట్లు లోకద్రోహులై శిశ్నోదరపరాయణులై దాంభికులై తిరుగు బకవ్రతుల బిడాలకుల పాప మెవరికిఁబోవును? వీరి యుపదేశము విని చెడినవారి పాప మెవరికిఁబోవును?

౧౭. మనస్సాక్షిత్వము కష్టసాధ్యమని తలఁచియుంటిని. పెద్దలను దిరస్కరించుటచే మనస్సాక్షులగుచున్నారని సెలవిచ్చితిరి. కావునఁ దమ శిష్యులలో మనస్సాక్షిత్వము గోరువారు తమకంటెఁ బెద్దలు వారికి లభింపరుగావున తమకనుకూలురై పాడైపోవక మిమ్ముఁ దిరస్కరించి మనస్సాక్షులై బాగుపడుదురు గాక యని దైవమును బ్రార్థించుచున్నాను.

౧౮. తాము గోరిన ప్రశ్న అందులోనే యున్నదంటిరి. నేను గోరినది ప్రశ్నగాదు ప్రత్యుత్తరము. పరమహంసల కారెంటికి భేదము తెలియదు కాఁబోలు. ఎంతైనను వారు సర్వసములు - భేదబుద్ధిరహితులు గదా. పరమహంస

లకుఁ దల్లికి భార్యకు భేదము తెలియదఁట. ఇఁక నీ యల్ప భేదములా వారికిఁదెలియును.

౧౯. జీవన్ముక్తుఁడైన జనకుఁడు శత్రువుల వధించెను - దుష్టుల దండించెను. కావున దుష్టులను లోకద్రోహులను దూషించుట హింసగాదు గాని తమవంటి పరమహంసలకు జీవన్ముక్తులకుఁ గేవలాత్మలకు యోగీశ్వరులకు నిది దూషణ మని యిది భూషణమని యెట్లు స్ఫురించెనో.

౨౦. జీవన్ముక్తులమని పరమహంసలమని యోగీశ్వరు లమని కేవలాత్మలమని పలుకుచుఁ గొంచెమైనను శాస్త్రజ్ఞాన ముగాని వివేకముగాని యంతఃకరణశుద్ధిగాని లేక తాము చెప్పునది తమకే తెలియక నోరికివచ్చినది వదరుచు దుర్బోధములుచేయు నీచులగు లోకవంచకులకంటె జీవముక్తులు శ్రేష్ఠములని నాయభిప్రాయము. ఇది సత్యమని తమ రేకీ భవించెదరని నమ్మెదను.

౨౧. 'శాస్త్రమువదలి' ఇది భ్రష్టులు తప్పించుకొని తిరుగుటకు సులభోపాయము. ఏమయా నీ వీ యకార్యము చేసెదవనిన మేము శాస్త్రాతీతులము శాస్త్రములు మమ్ము బాధింపవు. అని భ్రష్టులు చెప్పుచుందురు. వీరికి మాంసము కోడిగ్రుడ్లు - బీడీలు - సిగారెట్లు - లంజలు సేవకులు సేవకురాండ్రు డబ్బు పిండివంటలు అన్ని కావలసినవే - శాస్త్రము మాత్రమే వలదు. ఎవఁడు శాస్త్రముతోనాకుఁ బనిలేదని

వదరుచుఁ గొంచెమైనను నైహిక కార్యములం దాసక్తుఁడ గునో వాఁడు వంచకుఁడు లోకద్రోహి భ్రష్టుఁడు పతితుఁడు నగుటయందు సందేహము లేదు. నగారామీఁద దెబ్బవేసి చెప్పవచ్చును.

౨౨. తెలిసినవారలు దాసులకు దాసులైయుందురని భక్తులు చెప్పుదురుగాని దీనులకు దీనులైయుందురని చెప్పరు. భక్తియన నెంతమాత్రము తెలియునో మాటలకర్థ మంత మాత్రమే తమకు తెలియును.

౨౩. పరమహంసలు కలికాలకృష్ణులు మరల నా యాశీర్వచనముఁ గోరితిరి. తమకోరిక నెఱవేర్పక యుండఁ జాలను. పరశ్నత పుత్రావాప్తిరస్తని దీవించెదను.

౨౪. వస్తువునుజూచి వస్తువైయుండువా రెవ్వరో భగవంతుని కెఱుకయంటిరి. మొదటివస్తు వేది? రెండవవస్తు వేది. మూఁడవ భగవంతుఁ డెవఁడు? ఇటువంటి యున్మత్త ప్రలాపములు శిష్యులయెదుట వాగిన బలే బలే మాగురు వెంత తత్త్వవేత్తయని వారు చంకలు గొట్టుకొందురు గాని నలువురికిఁ దెలియునట్లు వ్రాసిన లోకము నవ్వునని నైన మీకుఁ దోఁపలేదా? అట్లు తోఁచుటకుఁ గొంత తెలివి కావలెను. అదేదీ? భగవంతుఁ డెవ్వఁడో వ్యుత్పత్త్యర్థమును బట్టి తెలిపి యావలఁ దక్కినవి వ్రాయఁగోరెదను. వస్తువు మీరు మీవలె వస్తువైయుండువారు మీశిష్యులు—వీరిగతి భగవంతునికే యెఱుక.

౨౨. ఆదినుండి యింతవఱకు మోక్షము నెవ్వరు పొందియుండలేదు. మోక్షమునకై పెద్దలు కాచియున్నారట యను యమూల్య వాక్యరత్నములు వేదశాస్త్రములు విడిచి యనాఘ్రాత పురాణేతిహాసాదులైన తమవంటి కేవలాత్మలు జీవన్ముక్తులు పరమహంసలు నగు నపూర్వజ్ఞానులు చెప్ప సాహసింతురు గాని కొంచెమైన యథార్థజ్ఞానము గ్రంథవాసన గలవారు చెప్పరు. మీరు వ్రాసిన వాక్యమును ఆదినుంచి యింతవఱకు మీవంటి గురువులు వారి శిష్యులు మోక్షము నెవ్వరు పొందియుండలేదు అని వ్రాసిన యథార్థముగ నుండును. మీరు వ్రాసినదే సత్యమగునేని మోక్షోపాయములు తెలుపు నుపనిషత్తులు - మోక్షమును బొందిన వారు గలరని చెప్పు పురాణేతిహాసాదులు తమ బీడీలకై యుపయోగింపఁదగినవే కదా?

శుకుఁడేలోకమున నున్నాఁడు? బ్రహ్మలోకమునుండి యూర్ధ్వలోక మేగినవారందఱెందున్నారు. బ్రహ్మలందఱెందున్నారు. శ్రీరాముని వెంటఁ బోయినవారందఱెందున్నారు. గజేంద్రునిగతి యేది? శిశుపాలుఁ డేమైనాఁడు. ద్వాపరమందుఁ దామే కొందఱకు గోపికాదులకు ముక్తినిచ్చితిరే. మఱచితిరా?

౨౩. మోక్షముకొఱకై పెద్దలు కాచియున్నారట ఎవరిని? నాలుకలమీఁద తొలసాకుతో శ్రీయని వ్రాయించుకొనినవారు మీకై కాచియున్నారా?

౨౪. పాఠకమహాశయులారా! ఈ కడపటి ముక్తా యింపు వాక్యమును బరిశీలింపుఁడు. వీరు భూలోక భువర్లోక ములను మించువారఁట. భూలోకమున మించువారు మనుష్యులు. భువర్లోకమున మించువారు భూతప్రేత పిశాచాదులు వీరీ రెండు లోకములందు మించిరే కాని స్వర్గముఖదర్శనమైన వీరికిఁ బ్రాప్తిలేదు. అని వారే చెప్పుకొనుచున్నారు. తక్కిన లోకముల మాటయేల?

వీరు ఫాలనేత్రులైనచో పాదనేత్రులుండుట వీరెఱుఁగరు కాఁబోలు. గ్రంథము పెరిఁగినది కావునఁ దక్కినవిషయములు సంక్షేపించెదను.

అయ్యా మీరు పరమహంస యని చేవ్రాలు చేసితిరి గదా. పరమహంస యెట్టివాఁడు దాని కథకారి యెవ్వఁడు ప్రమాణమేది? తొలి మూఁడుదాఁటి పరమహంసయైతిరా? ఎత్తుకోఁగానే యైతిరా? హంసశబ్దోత్పత్తియేమి? హకారస్థానమేది? సకారస్థానమేది? హంసశ్వాసముగాఁ జెప్పఁగారణమేమి? దానికి సన్న్యాసిత్వమునకు నేమిసంబంధము. సన్న్యాసుల కాపేరువచ్చుట కేమికారణము? పరమహంసలక్షణములేవి మీ యందుండుగుణములు పరమహంసగుణములా? పరమహంస యెప్పుడైతిరి. ఉద్యోగ మూడినయనంతరమా? హంసనుసోహమని యేల తలక్రిందుగాఁ జదువవలె? సోహం అనుటకు మాఱుసాహమ్మనరాదా – దోషమా – ఏల? లేదేని రెంటికి సామరస్యమెట్లు దీనిని విశదీకరించి మీ పరమహంస

త్త్వము స్థాపించుకొనుఁడు. హంసశబ్దప్రచారఫలమునకు వ్యాకరణ, యోగ, తత్త్వశారీర ప్రకృతిదర్శనముల ప్రకారము స్వానుభవముచే సమన్వయించి మీరు చెప్పఁగలిగిన నిజముగఁ బరమహంసలనియే సంజీవని కొనియాడును. చెప్పకపోయిన పరమ్ X అహంస వాయిస మనియే తలఁచును.

పరమహంసగారూ! తాము కృష్ణమూర్తులుగదా. తమరు నీళ్లు పడునని చెప్పినచోట బండలుగుండ్లు ఏలపడెను. తమదృష్టికి నీళ్లు - లోకులదృష్టికి రాలయ్యెనా. అయ్యో వా రెంతపాపులో పూర్వము ధృతరాష్ట్రునకిచ్చిన మీదృష్టి వీరి కియ్యలేకపోయితిరా? లేక మిమ్ము నమ్మినవారికి గతి రాలుగుండ్లని తెలుప నూరకుంటిరా? శాంతిః పరమ శాంతిః. అయ్యా హంసగారు తమ వ్రేలియుంగర మెక్కడిది? మీ సొగసులకుఁ గాను వైశ్యునికి వానిభార్యకుఁ గలహము పెట్టుట న్యాయ్యమా? ఇది కృష్ణహంసలకు (నల్లకాకులకు) తగును గాని పరమహంసలకుఁ దగునా? ఇప్పుడైన వారి కుటుంబకలహము మాన్పెదరా? తమరు పోలీసులో నుంటిరిగదా. మీచర్యలే సెక్షను క్రింద వచ్చునో చెప్పెదరా? ఎవరైన దావాచేసిన మెడగొలుసు కాలిగొలుసగునేమో? దయయుంచి యింకనైన గ్రామజనుల బాగుపడనిండని ప్రార్థించుచున్నాను. పరమహంసలగు తమ కేవలాత్మత్వము ఆత్మవిచారణ యిటువంటిదా?

ఇట్లు, దాసోహం,

వాసుదాసుఁడు.

## భక్తిపాఠశాల – ఒంటిమిట్ట.

ఈ యాశ్వయుజ విజయదశమినుండి శ్రీవాసుదాసస్వామివారు భక్తినిగుఱించి పాఠము చెప్పుదురు. ప్రారబ్ధ మడ్డుపడనివారువచ్చి వి: వచ్చును. వెనుక చింతించుట వెఱ్ఱితనము.

ఇట్లు విన్నవించు, దాసోహమ్,

సుబ్బదాసుఁడు.

శ్రీరామ

# భ క్తి స ం జీ వ ని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వానుదాసుఁడు)
ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము.

## చ ం దా ల వి వ ర ము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు.

నుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు.

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

ఒడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. అ. పై. |
|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె చక్కగ సవరింపఁబడినది | 8 0 0 |
| మూఁడు సంపుటములు | 10 0 0 |
| ఏడు సంపుటములు | 13 0 0 |

## వాసుదాస ప్రణీతము.

| | |
|---|---|
| శ్రీ [illegible] | 0 4 0 |
| శ్రీ [illegible] | 0 4 0 |
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 14 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 14 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 2 0 |

## భక్తి సంజీవని ౧౯-౨౯.

| | |
|---|---|
| ౧-౨ సంచికలు | 3 0 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 5 0 |

కొలఁది ప్రతులే యున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co., Printers Triplicane High Road

| సంపుటము ౨ | ౧౯౩౦ సంవత్సరము నవంబరు నెల<br>ప్రమోద సం॥ కార్తిక మాసము. | సంచిక ౧౧. |
|---|---|---|

శ్రీ రామాయనమః

## శ్రీవృత్తము.

సీ-తా-దే-వీ.

### —దాంపత్యము.—

మహాభారతమున శకుంతలావాక్యములు.

క. సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయు నైనవనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతిదు
ర్మతి కిహాముం బరము గలదె యెదిఁ బరికింపన్.

సీ. ధర్మార్థకామసాధన ముపకరణంబు గృహానీతివిద్యకు గృహ
ము, విమల | చారిత్రశిక్ష కాచార్యకం బన్వయస్థితికి మూ
లంబు సద్గతికి నూఁత | గౌరవంబున కేక కారణం బున్నత
స్థిరగుణామణుల కాకరము హృదయ | సంతోషమునకు
సంజనకంబు భార్యయ చూవె భర్తకు నొండ్లు గావు
ప్రియము

గీ. లెట్టిఘట్టములను నెట్టియాపదలను
నెట్టితీఱములను ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనుల కెందు.

వ. మఱియు భార్య పురుషునం దర్ధం బగుటం జేసి పురుషునకు మున్న పరేతయైన పతివ్రత పరలోకంబునం దనపురుషుం గూడం దదాగమనంబు ప్రతీక్షించుచుండుం; బురుషుండు మున్న పరేతుండైనం బదంపడి తానును బరేతయై తనపురుషుం గూడ నరుగు, నట్టిభార్య నవమానించుట యధర్మంబు మఱియునుం బురుషుండు భార్యయందుం బ్రవేశించి గర్భంబునం బుత్రుండై తాన యుద్భవించుం గావున నంగాదంగా త్సంభవసి యను నిదియాదిగాంగల వేదవచనంబుల యందు జనకుండును బుత్రుండును ననుభేదంబు లేదు.

క. విను గార్హపత్యమను న
యానలము విహరింపఁబడును నాహవనీయం
బన నెలుఁగు, నట్ల వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్రుఁడై నిజద్యుతితోడన్. ఆదిపర్వము.

అర్థము.

పతివ్రతయును, సద్గుణములుగలదియు, బిడ్డలఁ గలదియు, భర్తయనుష్ఠించువ్రతమును దాను నాచరించునదియు నగుభార్యను నవమానదృష్టిఁ జూచు ధనుతికి నెంత యాలోచించినను నిహము పరము రెండును లేవు.

ధర్మము- అర్థము- కామము సాధించుటకు భార్యయే సాధనము- భార్య గృహస్థధర్మమునకు నిలువనటివి – ఇల్లులేని

వాఁడు పరులపంచలయందో యారజయిళ్లయందో యెట్లు పడి
యుండవలయునో భార్యలేనివాఁ డట్లు గృహస్థధర్మమునకు
బాహ్యుఁ డగును. చక్కనినడవడిని నేర్పుటయందు నుపాధ్యా
యురాలు- (భార్యలమూలమున నియమము లనుష్ఠించి బాగు
పడుచుండువారు సమాజమందే కలరుగదా) వంశము నిలుచు
టకు వేరు. మంచిగతులు కలుగుటకు నూఁతగోల- ఆధారము.
గౌరవంబునకు ముఖ్యకారణము గొప్పవై స్థిరములైన గుణర
త్నములకు గని మనస్సునకు సంతోషము కలిగించునది భా
ర్యయే. భర్తకు భార్యవలెఁ బ్రియమైన పదార్థము వేఱొండు
లేదు. ఎట్టి కఠినసందర్భములందును నెట్టియాపదలందును ఎట్టి
త్రోయరానికార్యములందును గలిగినదుఃఖము లెల్ల భార్యలను
బిడ్డలను జూచువారికిఁ దొలఁగిపోవును.

భర్తయందు సగము భార్య గావున ముందు పతివ్రత
యగు భార్య మరణించెనా భర్త వచ్చువఱకుస్వర్గంబునఁగాచి
యుండును. ముందు భర్త మరణించెనా యట్టిభార్య వచ్చు
వఱ కతఁడు స్వర్గమందుఁ గాచియుండును. కాఁబట్టి యట్టిభా
ర్యను నవమానించుట ధర్మమునకు విరుద్ధకార్యము. మఱియు
ను బురుషుఁడు తానే తనభార్యగర్భమందుఁ బ్రవేశించిపుత్రుఁ
డై పుట్టును. అంగమంగమువలన నీవు కలిగితి వనునర్థముగల
వేదవాక్యములవలనఁ దండ్రికిఁ బుత్రునకు భేదము లేదు. య

జ్ఞానములందు గార్హపత్యాగ్నినుండి యాహవనీయాగ్నివలె జనకుఁడే పుత్రుఁ డగును అని శకుంతల దుష్యంతునకు బోధించెను.

కావుననే జ్యేష్ఠపుత్రుఁడే పుత్రుఁడనియుఁ బుత్రుఁడు కలిగినపిమ్మట భార్య భర్తను గలియరాదనికూడ గ్రంథములు చెప్పుచున్నవి-"జ్యేష్ఠే నైవ చ కర్తవ్యం మాసికం చ మహాలయ" మ్మని పెద్దకొడుకే తండ్రికి మాసికములు మహాలయములు పెట్టవలయు నని శాస్త్రము చెప్పుచున్నది- అయినను నొకకొడుకున్నయెడల వానియాయువు నమ్మరాదు. తనకు వెనుక నీళ్లు విడుచువాఁడు లేకుండునేమో యని"ఏకాభార్యా త్రయః పుత్ర" యని భార్యయొక్కతె పుత్రులు మువ్వురని కొందఱు ఋషులు శాసించిరి- భార్యయందుఁ బుత్రులు కలుగుటకు ముందే యామె మరణించెనేని పుత్రులు లేరను నెపమున పురుషుఁడు మరల వివాహము చేసికొనుట ప్రశస్తము గాదు కామార్తులు చేసికొందురు. "పుత్రార్థం నోద్వహే దన్యాం కర్మ పుత్రాహి యోగినః" పుత్రులనిమిత్తమై వేఱొకస్త్రీని వివాహమాడరాదనియు సద్గతుల నిమిత్తమై యోగ మభ్యసింపవలయుననియు ఋషులు చెప్పిరి- ఇట్లుండ జారుఁడై కులసతుల విడనాడి పరస్త్రీలయందు రేతస్స్ఖలనము చేయువాఁ డేలోకమునకుఁ బోవును? పరులక్షేత్రములయందుఁ బీజములు చల్లినచో నాపైరు తనపై రగునా? తనయాఁకలి కడ్డ

ము వచ్చునా? జారుఁడైనపతి తనభార్యకు అంకాడుట కనుజ్ఞ
యిచ్చినవాఁడే యగును. అట్టిభార్యను ఆపతి యాక్షేపింప
రాదు. సహించి శాంతుఁడై "ఆత్మవత్సర్వభూతాని" నావలె
నే యందఱు నని మానియై యుండవలయును. అట్టి వాఁడవురు
చచ్చి యెఱ్ఱగా కాలిన యినుపమగబొమ్మను భార్యయు నట్టి
దయగు నాఁడుబొమ్మను బురుషుఁడు కౌఁగిలింపవలయును.
పురుషుఁడు దుర్నీతిపరుఁడైనను భార్య శీలవతియై యుండెనేని
యుభయలోకముల భర్తతో సుఖించును

ఈకాలమున దీర్ఘబ్రహాచర్యము వానప్రస్థము సన్న్యాసము నిషిద్ధములు- స్ఖలనములేకుండ వానిని నిర్వహించుట యసాధ్యము కావుననే యన్నియుగములందును గృహస్థాశ్రమమే శ్రేష్ఠ మని కొనియాడఁబడినది. గృహస్థుఁడు కామక్రోధములచేఁ బొరపాటునఁ బాపముచేసినఁ బ్రాయశ్చిత్తము కలదు. తక్కినవారి కది లేదు ఉండినవో కడుకఠినములు- కావున గృహస్థుఁడే శ్రేష్ఠుఁడు- నైష్ఠికబ్రహ్మచర్యము చేతను సన్న్యాసముచేతను సాధించుగతులను గృహస్థుఁడును సాధింపవచ్చును. అట్టిగృహస్థధర్మమునకు నిలువనీడ గృహిణి. అట్టిగృహిణిని జారత్వ చోరత్వ ప్రతికూలభాషిణీత్వాది గుణములు లేనిదానిని నిరాదరించువాఁడు తననోటఁ దానే మన్ను వేసికొనువాఁడై యుభయభ్రష్టుఁ డగును. ఇట్లనుటచే జారత్వము

చోరత్వము ప్రతికూలభాషిణీత్వము గలయిల్లాలిని వదలి సు ఖింపరాదనియు తెలియనితనముచేతనో ప్రమాదముననో తప్పు చేసినఁ గోపింపరాదనియు భార్యాదాసుఁడై యుండవలెననియు నర్థము కాదు. ఒకయాత్మయే రెండురూపములుగా నగుట స్మ రించి యొకదేహమున కుడిభాగ మెడమభాగమును నొప్పిం చుట బాగో- యెడమభాగము కుడిభాగమును బాధించుట బాగో యాలోచించి వర్తింపవలయును. ఏభాగమునకు బాధయై నను దేహమున కంతయు బాధయే ముఖ్యముగ సమాజసభ్యు లు పతకములు హృదయమందు ధరించుట యలంకారార్థము గాదు. అందుండువారు సీతారామలక్ష్మణులు హనుమంతుఁడు. వీరు కోదండరామసేవక సమాజసభ్యుల కాదర్శకులు. మార్గ ము చూపించువారు. వారు చూపించిన మార్గమున నడచి వారివలె మనము కావలయును. మోక్షము గోరువారు బ్ర హ్మైవభవతి బ్రహ్మమే యగును. బ్రహ్మమువలె నగును. అని వేదము చెప్పుచున్నదిగదా- బ్రహ్మమువలె నగుటకు నట్టిగుణ ములుం రూపము కావలయునుగదా? సమానరూపము- సమా నగుణములేక యొకదానిలో నొకటి కలియునా? నీళ్లు నూనె కలియునా? బియ్యము నువ్వులు కలయునా? అట్టులే విరుద్ధవ స్తువులు కలియవు- కావున మన మేదేవతను గొలిచెదమో యాదేవతయందుండు గుణములను మనము సంపాదించినచో వారియందుఁ గలియుదుము. కాని విరుద్ధగుణము లుండినఁగలి

యుండుమా? సాత్త్వికప్రభువు తామసుండగు సేవకు నాదరించు
నా? పతివ్రతయగుస్త్రీ అంకుటాలి నాదరించునా? కావున మన
మెవరి నాదర్శముగాఁ గొందుమో వారికి సమ్మతమై వారు
సంతోషించుకార్యములే చేయవలయును. శ్రీరాముఁ డేకపత్నీ
వ్రతుఁడు ధర్మాత్ముఁడు- సత్యసంధుఁడు ఆయన భార్యయొ
ద్దలేనికాలములోఁ బరస్త్రీసాంగత్యము చేసెనా? రెండవపెండ్లి
యైనఁ జేసికొనెనా? అట్టిప్రభువు నెదుట మనము భార్యల
ననాదరించి యేమని నిలువఁగలము? ఆయన మనల నాదరిం
చు టటుండనీ మనముఖమైనఁ జూచునా? అట్లులే భర్తలకుఁ
బ్రతికూలమైన స్త్రీలు సీతాదేవి యెదుటి కేమని పోదురు?
మనము చేయు దుశ్చేష్టలకు సాక్షులుగా నుండుమనియా వా
రిని మనహృదయమందు ధరించుట- కాదు. వారిని జూచిన
ప్పుడంతయు వారిశీలము సత్యసంధిత్వము ఏకపత్నీవ్రతత్వము
ధర్మచర్య స్మరించి యట్లు ప్రవర్తింపవలెననియే కాని వారియె
దుటనే దుష్కార్యములు చేయుటకుఁ గాదు. బాహ్యముగా
వీరిని ధ్యానించి ధ్యానించి యావల హృదయమందు వారిని
జూడవలయును. అట్లులే లక్ష్మణునిజూచినపుడు ఆయనచేసిన
కైంకర్యమును హనుమంతుని జూచినపుడు దాస్యమును స్మ
రించి వారివలె నడువ మనము దృఢముగ సంకల్పించి ప్రవర్తిం
పవలయును. శ్రేయస్కాముల కిది యనివార్యము- సమాజ

మునఁ జేరినమాత్రమున- నేదియో నాలుగక్షరములు వదరి నంతమాత్రమున నడవడి సరిగా లేదేని ప్రయోజనము లేదు. సమాజమున జేరుటకు ముం దెట్టివారైనను భయము లేదు. సమాజములోఁ జేరినతరువాత దుష్టాహారము దుష్టాచారము దుష్టవిహారము సంపూర్ణముగ మానవలయును. నెయ్యి మంచిపదార్థము. జ్వరరోగి వేసికొనిన విషమించి చచ్చును. రోగము నివర్తింపఁ జేసికొని యావలఁ దినిన బుద్ధిబలము దేహబలము కలుగును. కావున సమాజసభ్యులు ప్రమాణముచేసిన చొప్పున దృఢవ్రతులై భగవద్భక్తిరతులై తమశ్రేయస్సునందు సమాజకీర్తియందు నిరతులై యుండవలయును. దీనివలన నిప్పు డిట్లులేరని యర్థముకాదు వారిమనస్సులు దృఢపడుచుటకై ప్రమాదమురాకుండుటకై యప్పుడప్పుడు హెచ్చరించుచుండుట వారిశ్రేయస్సు కోరినసంజీవనికిఁ గర్తవ్యవిధి.

మీఁదననువదించిన భారతవాక్యమునందు శుష్కవేదాంతులకుఁ గర్ణరసాయనమైన వాక్యము గలదు. "జనకుండు పుత్రుండు ననుభేదము లేదు." ఇది వారికిఁ బ్రమాణ మగును. దీని కర్థమో-తన భర్తకుఁ దనపుత్రునకు భేదము లేదు. మగఁడే కొడుకుగాఁ బుట్టెను. గావున మగనితో సంభోగించినట్లు కొడుకుతో నేల రమింపరాదని వారివాదము. ఇట్టిదియు నుండునా? సంజీవని యింతటిపరుషవాక్యములు వ్రాయవచ్చునా? యని

కొందఱు ముఖము చిట్లింతురు గాక. ఎవరికి నొప్పులు దెప్పు లు మెప్పులు తోఁచినను సంజీవనికి నిజము చెప్పకతప్పదు. వా సుదాసుఁడు గుంటూరిమండలమున సంచరించునపుడు గుం టూరికి ౬ మైళ్లదూరమున నుండు తక్కెళ్లపాడు గ్రామమం దుఁ గరణముగారి వాకిట సాయంకాలమందుఁ గొందఱు పెద్ద మనుష్యులతో మాట్లాడుచుండఁగా నొకఁడు వేదాంతి కాషా య వస్త్రధారి-మతాధిపతియఁట- శిష్యులశిష్యు రాండ్రఁగల వాఁడఁట-వచ్చి స్వామీ యీపద్యమున కర్థము చెప్పుఁ డని వాసుదాసుని కోరి దీనిని జదివెను.

“అండాండమునున్న - పిండాండమునున్న - బ్రహ్మాండ మునున్న-బ్రహ్మసున్న- విష్ణువు సున్న-రుద్రుఁడు సున్న-సూ ర్యుఁడు సున్న చంద్రుఁడు సున్న నక్షత్రములు సున్న భూమి సున్న-అన్నిసున్న సున్న సున్నాంలో కలిసెను” అని చదివి యర్థము చెప్పఁగోరెను-ఇటువంటి పద్యరత్నమునకు నీవంటివే దాంతిరత్నముగాక మఱియెవఁ డర్థము చెప్పఁగలఁడు. నీవే చెప్పుమని యాయన యనెను. ఏమున్నదండీ ఏమి లేదు, అం తయు సున్నయే. ఇప్పుఁ డున్నసూర్యుఁడు ఇంక కాసేపటికి లేఁడు పోయినవాఁడే కదా యనెను. అట్లైన రేపటియుదయ మునఁ దూర్పునఁగనఁబడునే సున్నయైన నెట్లు కనఁబడునయ్యా యని వాసుదాసుఁ డనెను. దానికేమి లే పోయినవారందఱు

వచ్చినారా యనెను వానిమాటలఁ బట్టివాఁడచలమతస్థుఁ
డైన శూన్యవాది యని గ్రహించి వానినోరనే జగత్కారణ
మొకటి యున్నదనిపింపవలెనని వాసుదాసుఁడు నీకుఁ దండ్రి
యున్నాఁడా యనెను. నాతండ్రి యెవఁడో నాకుఁ దెలియదు.
అని యతఁడనెను. నీతండ్రి యెవఁడైనది నీ కెట్లు తెలియఁగ
లదు కాని నీకుఁ దల్లియైనఁ గలదని తెలియునా? యని వాసు
దాసుఁడనెను నాతల్లిని నాకుఁ దెలిసిననేమి నాతల్లికి నేనే
మగఁడను అని వాఁడనెను. అదెట్లని వాసుదాసుఁడనెను—
నేను తల్లికడుపులోనుండి బయటవచ్చిన తరువాతనా శిశ్నము
ను దెచ్చి కలిపించుకొంటినా? పుట్టినపుడు శిశ్నమునకుఁ దగిలిన
దేహముగాదా యిప్పుడు మాత్రమేమి యనెను. వాసుదా
సుఁడు నివ్వెరపడి యాలోచించుచుండఁ బ్రక్కనున్నవారుస్వా
మీ! వీఁడు కోడిగ్రుడ్లు కోళ్లు మాంసము తిని సారాయి త్రా
గుచున్నాఁడనిరి. అదేమయ్యా! యని వాసుదాసుఁడనెను.
వాఁడు నాది రామానుజమత మనెను. వాసుదాసుఁడు నిరు
త్తరుఁడై యూరకుండెను. ఇట్టివేదాంతులు, ఇట్టిపరమహంసలు
ఇట్టియోగీశ్వరులు ఇట్టిసన్న్యాసులు చూడీ స్త్రీలనర్ధరాత్రమం
దు నొక్కొక్కరినే గదిలోనికి రమ్మని "మాతృయోనిం పరి
త్యజ్య విహరేత్సర్వయోనిషు" మాతృయోనిని విడిచి తక్కిన
యన్ని యోనులయందు విహరింపవచ్చునుఅని యుపదేశముచే
యువారు ఈవాక్యము శాస్త్రగ్రంథములందలిది మాతృయోని

యనిన వీరు చెప్పునది సరియైన యర్థముగాదు. యోని యనఁ
గా వ్రేలిగణుపునకు పేరు. శాక్తేయులు చూపుడువ్రేలి మొద
టిపై రెండు గణుపులు మాత్రయోనియందురు. పురుషదేవతల
జపించువారు నడిమివ్రేలి క్రిందిగణుపులు రెండు మాత్ర యోని
యందురు. మాత్రయోని యెట్లు దాఁటరాదో జపమం దీరెండు
గణుపుల నట్లు దాఁటరాదని భావము సమాజసభ్యులిది యె
ఱిఁగిన విషయమే. రహస్యవిషయములు రహస్యభాషలోఁ జె
ప్పుట పూర్వుల సాంప్రదాయము గంగా యమునయోర్మధ్యే
బాలరండా తు జాయతే'' గంగా యమునలనడుమ బాలరండ
గలదని దానితో సంయోగము శ్రేయస్కర మని యోగశా
స్త్రములు చెప్పుచున్నవి. దీని కర్థము బాలవిధవలతో సంభో
గింపుమని దొంగయోగులు చెప్పుదురు. గంగాయమునలు

ఇడాపింగళానాడులు నడిమి బాలరండ సుషుమ్న

అట్టశూలాజనపదాః శివశూలాః చతుష్పధాః
యువత్యాః కేశశూలిన్యః భవిష్యంతి కలౌయుగే.

ఇది భారతమందలి వ్యాసఘట్టములలో నొకటి. ఇం
దుఁ గేశశూలిన్యయనఁగా వెంట్రుకలనమ్మువారని యొకరు
వ్రాసిరి. దీనికిసరియైన యర్థ మాంధ్రభాగవతమున నిట్లు వ్రా
యఁబడినది.

గీ. " అన్నవిక్రయు లయ్యెద రఖిలజనులు
వేదవిక్రయు లగుదురు విప్రవరులు

షణ్ణ్యాయోనులు నగుదురు పద్మముఖులు
కష్టతరమైన యాకలికాలమునను-ఆరణ్యపర్వము.

శబ్దార్థజ్ఞానము సంప్రదాయజ్ఞానము లేక భ్రష్టులు విప
రీతార్థములు చెప్పుచుఁ దెలియనివారిని భ్రష్టులఁ జేయుచు
న్నారు ఇట్టులే పీత్వా పీత్వా పునః పీత్వా యను దానికి సా
రాయము పూర్తిగఁ ద్రాగు మని యర్థము కాదు మీఁద
మీఁద ప్రాణాయామము చేయు మని యర్థము

—పుండ్రము—

(గత సంచికా శేషము చూడు పుట ౪౫౭)

ఇఁకఁ దిర్యక్పుండ్రవిధానము చెప్పవలసియున్నది. తిర్య
క్పుండ్రమనఁగా నడ్డముగాఁ బెట్టు పుండ్రము. రేఖలు మూఁ
డగుటయందు నుభయవిధపుండ్రధారులు సమానులే. మూఁటి
నిగుఱించి ముందు చెప్పఁబడినదే యిప్పుడు నన్వయించును.
ఊర్ధ్వపుండ్రధారులకు శ్వేతిమృత్తిక - గోపీచందనము సంప్ర
దాయసిద్ధమైనట్లు తిర్యక్పుండ్రధారులకు భస్మము సంప్రదా
యసిద్ధమైనది తిర్యక్పుండ్రవిషయమున వాసుదాసుఁ డనభి
జ్ఞుఁ డగుటచే నట్లుపెట్టుటయందుఁ దాత్పర్య మేమి యని య
ద్వైతులను కొందఱఁ బ్రశ్నించెను గాని యెవరు తగిన సమా
ధానము చెప్పఁజాలరైరి. ఎవరైన నడ్డముగ ఋజువుగా సమ
రేఖలుగ విబూది పెట్టఁ గారణము వ్రాసిపంపి రేని సంజీవని
ప్రకటించును.

ఒకరిద్దరు మాత్రము ఋజువుగాఁ బెట్టరాదనియు చంద్రరేఖవలెఁ గొన లెత్తుకొని యూర్ధ్వముఖముగ నుండఁబెట్టవలయుననియుఁ జెప్పిరి.

ఇది సమంజసముగ నున్నది. భస్మధారులు శైవులు- శివుఁడు చంద్రశేఖరుఁడు - చంద్రుఁడు భస్మము ధవళములు. కావున చంద్రరేఖవలె భస్మము ధరించుటచే నూర్ధ్వపుండ్ర విషయమునఁ జెప్పినట్లు సారూప్యస్మరణమునకు సహాయపడుచున్నది. నొసటకుంకుమ మాజ్ఞాచక్రమందలి యగ్నిని సూచించుచున్నది ఖేచరీముద్రాసాధకులకు నిది సహాయపడఁగలదు. ఆస్థానమట్టిదనిసూచించి స్మరింపఁజేయుటకే స్త్రీలు ఎఱ్ఱకుంకుమము పురుషులు నెఱ్ఱని పచ్చని చూర్ణములు నొసట (రంగు బొట్లుగావు)ధరించుట వాడుక. ఉద్దేశ్యము పోయినది ఆచారముమాత్రము నిలిచినది.

విష్ణుభక్తులకు నూర్ధ్వపుండ్రధారణ మెట్లువిధియో శైవులకు భస్మధారణము విధి విష్ణుభక్తులు భస్మధారులగుటగాని శివభక్తు లూర్ధ్వపుండ్రధారులగుటగాని ప్రశస్తముగాదు. ఏదేవతా భక్తుఁ డాదేవతానురూపములైన చిహ్నములు ధరించుట శ్రేయస్కరముగాని రాజులలోఁ గొలువు నవాబులలో నొళువన్నట్లు లోపల నొకవిధము వెలుపల మఱియొకవిధ ముండరాదు

"అంతశ్శైవం బహిశ్శాక్తం సభామధ్యేతు వైష్ణవ" మన్నట్టు మనోవాక్కాయకర్మములు మూఁడు మూఁడుత్రోవల నుండుట సరిగాదు. ఏదో యొకటి రాచుకొనుద మనువారికి నేవైన నొకటియు. ఏదిలేకున్న నొకటియు. కాని దానివలన బాగుపడఁ గోరిక కలవారికిఁ త్రికరణశుద్ధి ముఖ్యము. భస్మధారులందు విష్ణుభక్తులు లేరా యందురేమో- లేరని యుండఁగూడ దని నేను జెప్పరాలేదు. భస్మధారియైన విష్ణుభక్తుని కంటె భస్మధారియైన శివభక్తుఁడే శ్రేష్ఠుఁడు. పాశ్చాత్యస్త్రీలు కొందఱు హిందూమత మంగీకరించి వారివేషములు వదలి మనవారివలెఁ జీరలు కట్టుచున్నారు. ఏల? మునుపటివేషములే యుంచుకొని మనస్సులందు హైందవమతావలంబులుగ నుండరాదా? వాసుదాసుఁడు గుంటూరుమండలమున సంచరించునపు డొకబ్రాహ్మణుఁడు ముఖమున విబూదిబూసి దానిపై నూర్ధ్వపుండ్రమును ధరించివచ్చి దర్శన మిచ్చెను. ఇది యేమి వేష మని వాసుదాసుఁ డడిగెను. నాకు శివకేశవు లిరువురు సమానులు. నా కిరువురయందు సమానభక్తియే యని యాయన చెప్పెను. నీమనస్సును నీవు పరిశోధించి చూచితివేని నీ కిరువురయందును భక్తిలేదని వాసుదాసుఁ డనెను. సమానముగ భాగించి తక్కెడలందుంచి తూఁచుటకు భక్తి వంకాయకాదు. ఊర్ధ్వపుండ్రము పెట్టుని యోగియింటికి నతిథియై పోయి విస్తరిముందు కూర్చుండి భోజనమున

కాపోశనమిచ్చు సమయమందు నీవూర్ధ్వపుండ్రము దీసి భస్మము ధరించినఁ గాని నేను భుజింపను. లేచి పోయెదనని బెదరించు భస్మధారి యొకఁడు గలఁడని వింటిని - అట్టి నీచపు టతిథిని లేచిపొమ్మని గృహస్థు చెప్పుట దోషము కాదు. అన్ని విషయములందును త్రికరణశుద్ధి యనివార్యమని సంజీవని యభిప్రాయమైనను నీవటుపెట్టుకో నీ విటుపెట్టుకొమ్మని కాని నీ వాదేవుని గొలువుము నీవీదేవుని గొలువుమని కాని యెవరికిని జెప్పదు. ఒకదేవతయందో గురువునందో భక్తి గలవారు వారి కనురూపమైన రూపము ధరించుట శ్రేయస్కరమని మాత్రము చెప్పును. అది యుత్తమపక్షము బోధించునే కాని గౌణపక్షవాదుల నాక్షేపింపదు. బృహజ్జాబాల్యుపనిషత్తునందు భస్మమునుగుఱించి యీవాక్యములు కానవచ్చుచున్నవి.

విభూతి ర్భసితం భస్మం క్షారం రక్షేతి భస్మనో భవంతి పంచనామాని పంచభి ర్నామభి ర్భృశ మైశ్వర్యకారణా ద్భూతిః భస్మ సర్వాఘభక్షణాత్ భాసనా ద్భసితం క్షారణా దాపదాం క్షారం భూతప్రేతపిశాచ బ్రహ్మరాక్షసాపస్మార భవభీతిభ్యోభిరక్షణా ద్రక్షేతి ప్రథమబ్రాహ్మణమ్. విభూతి-భసితము భస్మము- క్షారము- రక్ష-అనివిబూది కైదుపేర్లు గలవు-ఐశ్వర్యము గలిగించును గావున విభూతి- సర్వపాపములను భక్షించును గావున భస్మము- ప్రకాశించునది కావున భసితము ఆ

పదలఁ దొలఁగించును గావున క్షారము- భూతప్రేత పిశాచా దులవలని భయమునుండి రక్షించునది కావున రక్షయని పేర్లు.

వీని యుత్పత్తులు— కపిలగోమయము వలన నైనది- విభూతి. కృష్ణగోమయము (నల్లయావుల పేఁడ) వలన-భసితము. రక్తగోమయము (ఎఱ్ఱయావుల పేఁడ)- భస్మము. శ్వేతగోమ యమువలన క్షారము. చిత్రవర్ణ గోమయమువలన రక్ష. అగ్నే ర్వీర్య మిదం ప్రాహు స్తద్వీర్యం భస్మయ త్తతః అని యుండు టచే నగ్నియందు గోమయమును అగ్నిరిత్యాది మంత్రములచే దగ్ధము చేయవలయును.

వర్జింపఁదగిన గోమయము.

వికటాంగము- ఉన్మత్తము- మహోఖలము, మలినము- శివాది చిహ్నన్వితముకానిది, లింగాకారముగా వాఁతలు వేయని ది-కృశించినది- దూడలేనిది-శాంతిలేనిది (పొడుచునది తన్ను నది) పాలీయనిది- ఇంద్రియములు లేనిది (కన్ను కాలు చెవి తోఁక మొదలైనవి లేనిది) తృణము భక్షించునది (గడ్డిగాక చీఁపురుకట్టలు మొదలైనవి తినునది వెంద్రుకలు, గుడ్డలు, ఎముకలు పుల్లాకులు) తినునది ఋతుసమయమున నాఁబో తుచే వెంటాడఁబడిన యావు- క్రొత్తగా నీనినది - రోగముక లది. ఇట్టి యావుల పేఁడ పనికిరాదు- నేలఁబడిన తరువాత గ్ర

హించిన పేఁడయుఁ బనికిరాదు- భూమిమీఁదఁ బడకముందే పట్టుకొనవలయును - శుద్ధమైన స్థలమందుఁబడిన దానినైన గ్రహింపవచ్చును- తెల్లయావు- కపిల వీని గోమయము శ్రేష్ఠము-ఇవి దొరకనియెడల నేయావుదైన సరియె- దోషవర్జితమై యుండవలయును.

## భస్మముచేయువిధము.

శాస్త్రప్రకారము సంస్కారముసేయని భస్మము ధరింపరాదు. ఈవిషయము ముందు వ్రాయఁబడును- "ఆగావ. ఇతి" మంత్రముచే ముందు గోవును నభిమంత్రింపవలెను. "గావో భగో గావ" యనుమంత్రముచేదానికి నీళ్లు పెట్టవలయును. ఏపక్షమందైనను వ్రతపరుఁడై చతుర్దశినాఁ డుపవాస ముండవలయును. మఱుసటినాఁ డుదయమున లేచి స్నానముచేసి శుచియై సమాహితుఁడై ఉదికి యార వేసిన తెల్లని మడివస్త్రమును గట్టుకొని యావును బలవంతముగా లేపి గాయత్రీమంత్రముచే మూత్రమును సంగ్రహింపవలెను- దీనికి బంగారు- వెండి- రాగి- మంటిపాత్రము లుపయోగింపవలెను- తక్కినవి పనికిరావు- తామరాకు, మోదుగాకు, గోశృంగము పనికివచ్చును. ఇట్లు గోమూత్రమును గ్రహించి "గంధద్వారేతి" మంత్రముచే గోమయమును గృహస్థుఁడు ముందుచెప్పిన ట్లది నేలపైఁ బడకముందే మీఁదఁజెప్పినపాత్రములందు గ్రహింపవలెను. గృహీగృహీ

యని యుపనిషత్తు చెప్పుటచే గృహస్థుఁడు కానివాఁడు(భార్య లేనివాఁడు) ఆపనిచేయరాదని తోఁచెడిని. తరువాత "శ్రీర్మే భజతు" మంత్రముచే గోమయమును శోధింపవలెను. అలక్ష్మీర్మే" మంత్రముచే దానియందు ధాన్యము లేకుండఁ జేయవలయును. ఆవల "సంత్వాసించామి" మంత్రముచే గోమూత్రమును గోమయమందుఁబోసి "పంచానా" మ్మను మంత్రముచే దానిని ౧౮ ముద్దలుగ సూర్యకిరణములందు శోధించి చేసి ముందుచెప్పిన పాత్రములందు వానినుంచవలయును. తరువాత వారివారి గృహ్యసూక్తముల విధులచొప్పున నగ్నిని ప్రతిష్ఠించి యాద్యంతములఁ బ్రణవోచ్చారణముచేయుచు దానియం దుంచవలయును. షడక్షరసూక్తులచే స్వాహాంతముగా నాయాదేవతలకై యాపిండములు హోమము చేయవలెను.

ఈప్రకారమింకను ననేక మంత్రములచేఁ గొన్నికర్మములు జరిపి మూఁడుదినము లగ్ను లందుంచి బ్రాహ్మణులకు భోజనము పెట్టి తరువాత వ్యాహృతులచేఁ గొంతకర్మము గావించి యగ్నినుండి తీసి యందు కుంకుమపువ్వు లోనగు వాసనపదార్థములఁ బ్రణవమంత్రములతోఁ గలిపి మఱి కొంతకర్మ కాండము జరిపిన తరువాత దానిని ఈశాననామమున శిరస్సునందు, తత్పురుషనామమున ముఖమందు, అఘోరనామమునఁ దొడలయందు, వామదేవనామమున గుహ్యమందు,సద్యో

జాతనామమున పాదములందు, ప్రణవముచే సర్వాంగమందు ధ రింపవలయును. తరువాత సర్వాంగ ముద్ధూళనముచేయవలెను. ఉద్ధూళనమనఁగా దేహమున కంతయుఁ బూసికొనుట. దీనిని ఉద్ధూననమని మహిమ్న స్తోత్రమందు వ్రాయఁబడియున్నది.

భస్మకల్పము నాలుగువిధములు.

౧. అగ్నిహోత్రమున విరజానలమునఁ బుట్టినది అను కల్పము.

౨. అడవియందలి యెండినపేఁడ తెచ్చి వారివారి గృహ్యసూత్రముల ప్రకారము శాస్త్రము విధించిన చొప్పున కల్పించునది యుపకల్పము.

3. అడవియందలి యెండిన గోమయము తెచ్చి పొడి గొట్టి గోమూత్రముచే ముద్దలుచేసి కల్పప్రకారము సంస్కరిం చినది యుపకల్పము

౪. శివాలయస్థము శతకల్పము అకల్పము, ఈనాలుగి టిలో నేదైన ధరింపవచ్చును. భస్మము 3౨ స్థానములందు ధ రించుట మొదటిపక్షము.

శిరస్సు, నొసలు, చెవులు, కన్నులు, ముక్కరములు, నోరు, కంఠము, రెండు మూఁపురములు, మోఁచేతులు, మణి కట్లు, హృదయము, రెండుప్రక్కలు, నాభి, రెండు గుహ్యప్ర దేశములు, తొడలు, పిఱుదులు, మోఁకాళ్లు, పిక్కలు, పా దములు.

ఇవి ౩౨ స్థానములు, ఈస్థానములందలి దేవతలస్మరిం చుచు ధరింపవలయును.

షోడశస్థానముల ధరించుట రెండవపక్షము. శిరస్సు, లలాటము, చెవులు, ముక్కులు, రెండుబాహువులు, హృదయము, నాభి, తొడలు, మోఁకాళ్లు, పాదములు, ఈ ౧౬ స్థానములందైనను ధరింపవలయును.

అష్టస్థానములందు ధరించుట మూఁడవపక్షము గుహ్యస్థానము, నొసలు, చెవులు, రెండుమూఁపులు, హృదయము, నాభి.

దేశకాల విరోధమువలన పైఁజెప్పినట్లు ధరింపలేనివారు, శిరస్సు, బాహువులు, హృదయము, నాభి యీయైదుస్థలములందైనను భస్మము ధరింపవలయును

ఈ యైదువిధముల నుద్ధూళనము చేయశక్తిలేనివారు లలాట, హృదయ, నాభి, కంఠ, మణిబంధ, బాహుమూల, పృష్ఠములందు శీర్షమందు లలాటే బ్రహ్మణేనమః యని యాయాస్థానములం దాయాదేవతల నమస్కరించుచు త్రిపుండ్రము ధరింపవలయును. ఓపిక శ్రద్ధ కొలఁది స్థానములందు ధరింపవచ్చును గాని భస్మము సంస్కరింపఁ బడియుండవలయును. ఆయాదేవతల నమస్కరించుచు ధరింపవలయును.

ఇవి యనివార్యములు.

శ్లో॥ త్రైవర్ణికానాం సర్వేషా, మగ్నిహోత్రసముద్భవం
ఇదం ముఖ్యం గృహస్థానాం విరజానలజంభవేత్
విరజానలజం చైవ ధార్యం ప్రోక్తం మహర్షిభిః॥

అనియుండుటచే బ్రహ్మక్షత్రియ వైశ్యులు విరజానల భవమైన భస్మమునే ధరింపవలయును అందు విశేషించి గృహస్థులు ఔపాసనాగ్నివలనఁ గలిగినదే ధరింపవలయును బ్రహ్మచారులు సమిధలవలన వగ్నివలనఁ గలిగినది ధరింపవలయును శూద్రులు శ్రోత్రియుల (యజ్ఞముచేసిన నిత్యాగ్నిహోత్రుల) యింటనుండి తెచ్చుకొని ధరింపవలయును

అతివర్ణాశ్రములు స్మశానాగ్నివలనఁ గలిగినదానిని ధరింపవలయును శివాలయమందలి భస్మమునందఱు ధరింపవచ్చును. శివాలయమందలి దనఁగా మంత్రసంస్కారములచే దగ్ధముచేసి లింగమునకుఁ బూసినదని యర్థము. మంత్రసంస్కారముగాని దెవ్వరు ధరింపరాదు. భస్మధారణము సేయక కర్మముచేసిన వ్యర్థమగును.

ఈభస్మధారణవిధి శివపరత్వ మంగీకరించి శివుఁడే మోక్షదాత యని శివుఁడే పరతత్త్వ మను కేవల వీరశైవులకేయని సూతసంహితవలనను, మహాజాబాల్యుపనిషత్తు వలనను దెలియవచ్చుచున్నదిః అద్వైతముగాని ద్వైతముగాని విశిష్టాద్వైతముగాని శివపరత్వ మంగీకరింపదు. వీరశైవులకు నారాధ్యులు

లింగాయతులు శాక్తేయులుతప్పఁ దక్కినవారు శివనిర్మాల్యా ముగ్రహింపరు శివప్రసాదము భుజింపరు. ఇది శైవశాస్త్రసమ్మతమే. శివాలయమందలి పూలువాడుకొనరు. శివాలయము స్మశానమేకదా. కాశికి మహాశ్మశానమని నామాంతరము శాక్తేయులు నిశ్చేష్టుఁడుగాన శివుని శవముగానే చెప్పుదురు అంతియకాదు సూతసంహితయందు

శ్లో॥ పాంచరాత్రేచ కాపాలే తథా కాలాముఖేపి చ
శాక్తేన దీక్షితా యూయం భవత బ్రాహ్మణాధమాః
అని గౌతముఁడు బ్రాహ్మణుల శపించిన ట్లున్నది. ఇందుఁ బాంచరాత్రము కేవలవైష్ణవాగమము. ఇది శ్రీవిష్ణుభక్తినే ప్రతిపాదించును శాక్తనిగమము శివశక్తినే ప్రతిపాదించును.వీనికిచేరిన యిరువురు పైశ్లోకమందు బ్రాహ్మణాధములని దూషింపఁబడుటచే వీరికి విభూతిధారణము నిషిద్ధమని యేర్పడుచున్నది.

హారీతః

శ్లో॥ త్రిపుండ్రం బ్రాహ్మణో విద్వాన్ లీలయాపి నధారయేత్
త్రిపుండ్రం ధారణా ద్విప్రః పత త్యేవ నసంశయః
త్రిపుండ్రము (తిర్యక్పుండ్రము) వినోదమునకైనను బ్రాహ్మణుఁడు ధరింపరాదు. త్రిపుండ్రధారణముచే బ్రాహ్మణుఁడుపతితుఁ డగును. అనియు.

పరాశరధర్మశాస్త్రము, ఉత్తరఖండము ౧౮ అధ్యాయమందు.

శ్లో॥ కపాల కేశ భ స్మాస్థి, శుక్తి పాషాణ ధారిణమ్
త్రిపుండ్ర ధారిణం విప్రం, చండాల మివ సంత్యజేత్ ॥

పుఱ్ఱెలు, వెండ్రుకలు, విబూది, యెముకలు, ముత్తెపు చిప్పలు, రాలు, ధరించువానిని త్రిపుండ్రముధరించిన బ్రాహ్మణునిని చండాలునివలె వదలవలెను. అనియు వాక్యములు గలవు.

శ్లో॥ అభ్యంగే చోదధిస్నానే, వివాహే పుత్రజన్మని
మాతాపిత్రో ర్మృతాశౌచే నకుర్యా ద్భస్మధారణమ్॥

తలంటుకొనిననాఁడు, సముద్రస్నానమునందు, పెండ్లి నాఁడు, కొడుకుపుట్టిననాఁడు, తల్లిదండ్రుల మృతాశౌచము నందు భస్మముధరింపరాదు. పాడుమొగముతో నేకర్మముచేయరాదు. కావున నూర్ధ్వపుండ్రమునే ధరింపవలెను.

శ్రీభాగవతమందును బద్మపురాణమందును విభూతిధారణమును నిషేధించువాక్యములు కానవచ్చుచున్నవి. వానినను వదించుటనావశ్యకము. అయినను మన మాలోచింపవలసిన విషయములు రెండు. విభూతి నిషిద్ధమా? తిర్యక్పుండ్రము నిషిద్ధమా? శైవులకు మంత్రపూతమైన విభూతి నిషిద్ధముగాదు. ఊర్ధ్వపుండ్రధారణమందు యోగ్యపదార్థములలో నట్టి విబూ

దియుఁ జేరియున్నది. అదియునుగాక యాపాసనాదులందుఁ గడపట రక్షామంత్రము చెప్పి యంద ఆయగ్నివలనఁ గలిగిన విబూదిని నొసటఁ బెట్టుకొనుచున్నారు నిషేధవాక్యములం దిట్టి భస్మము నిషిద్ధ మని చెప్పలేదు. కావున విబూదిని తిర్య క్పుండ్రముగా ధరించుట నిషిద్ధ మని యేర్పడుచున్నది. కొన్ని వాక్యము లది గ్రాహ్య మని చెప్పుచున్నవి. విధినిషేధవాక్య ములు రెండును తత్తత్ప్రమాణగ్రంథములందే యున్నవి. కా వున నిట్టి సందిగ్ధసందర్భములందుఁ బూర్వులు చూపినమార్గ మునఁ బోవుటయే శ్రేయస్కరము. జీవహింసావిషయమందు అహింసాపరమో ధర్మ యను వేదములందే యజ్ఞాదులందుఁ బితృకార్యములందు జంతుహింస కర్తవ్యముగాఁ జెప్పఁబడినది. శాస్త్ర మాధారముగ దేవతాప్రీతికై మంత్రవంతముగఁ జేయు హింసహింస గాదనియు జిహ్వాచాపలముచే నాత్మార్థమై య మంత్రకముగఁ జేయుహింస హింసయనియుఁ బెద్దలు నిర్ణయిం చిరి. దేవతలపేరు పెట్టిచేసినను శాస్త్ర మాధారముగానిది మంత్రవంతముగానిది నిషిద్ధమే. అట్టులే తప్తచక్రాంకనమందు విధినిషేధవాక్యములు గలవు ఆవిషయమునఁ బ్రశ్నలువచ్చి యున్నవి.

నారదః,

శ్లో॥ హుతాగ్నితప్త చక్రాద్యై, రాయుధైః పంచభిర్హరేః
ప్రతప్త బాహుమూలం యే, ప్రాప్నుయుస్తే పరంపదమ్

లౌకికాగ్ని సంతప్తై శ్చక్రాద్యై ర్యది లాంఛితాః
ద్విజాదయో మహారాజ ప్రాప్నుయు ర్నరకం ధ్రువమ్॥

హోమముచేయఁబడిన యగ్నియందుఁ దప్తమైన చక్రాదుల చేఁదప్తములైన బాహువులు గలవారు వైకుంఠమునకుఁ బోదురు. లౌకికాగ్నియందు సంతప్తములైన చక్రాదులచేఁ జిహ్నితములైన యన్నివర్ణములవారు నరకమునకుఁ బోదురు. సత్యము. పద్మపురాణము, ఉత్తరఖండము 30 అధ్యాయము.

శ్లో॥ హుతాగ్నినైవ సంతప్య సర్వపాపనుత్తయే
చక్రంవా శంఖచక్రేవా తథాపంచాయుధానివా
ధారయత్త్వైవ విధివద్బ్రహ్మకర్మసమాచరేత్,
హుతాగ్నితప్తచక్రేణ శరీరంయస్యచిహ్నితం
తేన తీర్థానియజ్ఞాశ్చసంప్రాప్తానాత్రసంశయః
అధృత్వావిధినాచక్రం బ్రాహ్మణోజ్ఞానదుర్లభః
గర్హితస్సర్వలోకేషు బ్రాహ్మణ్యాత్ప్రచ్యుతోభవేత్,
అధృత్వావిధినాచక్రం బ్రాహ్మణఃప్రాకృతోభవేత్
నతస్యకించిదస్తీ యాదపిక్రతు సహస్రిణః"

అర్థము.

సర్వపాపములు నశించుకొఱకు హుతాగ్నిచే సంతప్తమైన శంఖచక్రాదులనే శాస్త్రప్రకారము ధరించి కర్మములను జేయువలయును. హుతాగ్నివలన సంతప్తమైన చక్రాదులచేఁ

జిహ్నితమైనదేహముగలవారికిఁ దీర్థములు యజ్ఞములు సం
ప్రాప్తమయినట్లే. ఇందుసందేహము లేదు.

శాస్త్రమునఁజెప్పిన చొప్పునచేయక జ్ఞానహీనుఁడై బ్రా
హ్మణుఁడెవఁడు చక్రమును ధరించునో వాఁడు సర్వలోకగర్హి
తుఁడు. భ్రష్టుఁడు. శాస్త్రముదప్పించి చక్రము ధరించువాఁడు
ప్రాకృతుఁడు వాఁడు నూఱుయజ్ఞములుచేసినవాఁడైనను వాని
చేతిదేదియుఁ గొంచెమైనఁ దినరాదు. వాతరోగనివారణమున
కై మనుష్యులకు పశువులకు నమంత్రకముగా వాతలు వేయు
దురు. భవరోగనివారణార్థముసమంత్రకముగా సారూప్య స్మర
ణమునకై భగవదాయుధధారణము.

ఇట్లు హుతాగ్నితప్తములు గ్రాహ్యములని లౌకికాగ్ని
తప్తములు నిషిద్ధములని శాస్త్రములు నిర్ణయించినవి. కావున
శైవులైనవారు ముందు చెప్పినవిధముగ యథా శాస్త్రముగ
మంత్రవంతమైన విబూదిని ధరింపవచ్చును. ధరింపవలయును.
శైవులు కానివారు సమంత్రకమైనను తిర్యక్పుండ్రముధరింపరా
దు. అమంత్రకమైన భస్మధారణము శైవులకైనను నిషిద్ధమే.
బూడిదను దిర్యక్పుండ్రముగా ధరించువారు తిర్యక్కులేయను
పరిహాసవచనము మంత్రముచేఁ బూతముకాని బూదిని నాస
మయమునకు నేకుంపటిలోనిదో ప్రొయ్యిలోనిదో తెచ్చి దేహ
మునకు రాచుకొనువారివిషయమందే సార్థకమైయన్వయించు

ను. కీర్తిశేషులైన మహామహోపాధ్యాయ వేదము వేంకట రాయశాస్త్రులవారు "బూడిదెలో బొర్లేది గాడిదేకదా" యనిచెప్పినట్లువానికి వారికి నేమిభేదము."బూడిద పూసికొనుటచేతనే మోక్షమువచ్చునేని వీధికుక్కల కదిలభించినదే" యని కులార్ణవతంత్రమందుఁగలదు.

గీ. ఆవగింజంత బూదిమైనలఁదికొనిన
వెలఁది ! గుమ్మడికాయంత నెట్టిపుట్టు, కాశీఖండము

అమంత్రకమైన బూడిదయందు భస్మ, భసిత, రక్షాది శబ్దములు సార్థకములగునా ? ఎన్నఁటికిని గావు. తమ్ము ధరించినవారిని పవిత్రులఁ జేయునది తెల్లసుద్దగాదు. పొయ్యిలోని బూడిదగాదు. మంత్రపూతములైన పదార్థములు కావున నమంత్రకములైన వానిని ధరించుట వ్యర్థములు. అందు నిట్టి భస్మధారులు పాషండులగుదురు భస్మమునకు భృగుశాపములును గలవు. కావున విష్ణుభక్తి గలవారు సమంత్రకముగ విష్ణునామోచ్చారణ పూర్వకముగ సంప్రదాయానుసారముగ నూర్ధ్వపుండ్రమును శంఖచక్రములను ధరింపవలయును. శివభక్తిగలవారు శివనామోచ్చారణ పూర్వకముగధరింపవలయును. కేశవనారాయణయని వైష్ణవులాచమింతురు ఆపేర్లుచెప్పక శైవులు మహేశ్వరాది నామముల నాచమింతురు. అట్టులే చేయవలయును. మఱియొకవిధముగఁజే

యుటపరిగాదు. భక్తి యేకముఖముగనుండవలయును. అందు ద్వైవిధ్యము పనికిరాదు. నీవీదేవతను గొలువుము. నీవీ దేవతను గొలువవలదని సంజీవనిచెప్పదు. ఏదేవతను సేవించినను నిండుభక్తితో శ్రద్ధచే నైకతానముగఁ గొలువుమనును. నీ వీ పుండ్రము పెట్టుకో నీవీ పుండ్రమును ధరింపవలదని సంజీవని శాసింపదు. నీవేదేవతనుగొలిచెదవో దానికనురూపముగ శాస్త్ర ప్రకారము త్రికరణశుద్ధిగాఁ బ్రవర్తింపుమనును చక్రాంకనము విషయమై ప్రశ్నించినవారికిని దే ప్రత్యుత్తరము. ఏకో దేవః కేశవోవా శివోవా యన్నట్లు దేవుఁడొకఁడే ఆయనను కేశవుఁడని కొలిచెదరా ఆసంప్రదాయప్రకారమే వర్తింపుఁడు. శివుఁడనికొలిచెదరా ఆసంప్రదాయప్రకారము వర్తింపుఁడు. అది గొఅలువలదు త్రికరణశుద్ధి ముఖ్యము ఒకమార్గమందుండువారు రెండవమార్గమం దుండువారిని ద్వేషింపవలదు. వారు వారుచేసిన కర్మములఫలమువారువారనుభవింతురు. వారిప్రశంస తక్కినవారి కేల? వక్రమార్గమందుఁ బోవువారిని సవరించుట దుష్టముగాదు. ఏదియోయొక సత్సంప్రదాయము ననుసరించువారిని నభిప్రాయభేదముచే నాక్షేపింపరాదు. దుష్టసంప్రదాయములు గ్రాహ్యములుగావు. అజ్ఞానముచేతను నుపేక్షచేతను సదాచారములు ఖిలములై దురాచారములుగ నగుటచే వానివాని తాత్పర్యము కారణము తెలిసినమాత్రము చెప్పవల

యుననియు చేతనైన సాహాయ్యము కార్యములందుఁ జేయ వలయుననియు సంజీవనియాశయముగాని యితరముగాదు.

భస్మధారణము విషయమైన యీ శ్లోకములు వాని అర్థము నిత్యకర్మాష్టకమునుండి గ్రహింపఁబడినవి ఇవి మొదటి కూర్పునందుఁగలవుగాని తరువాతి కూర్పులందుఁ గానరావు. ఇవి గ్రంధమందు లోపించినను అనుష్ఠానమందు లోపింపరాదు.

శ్లో॥ సర్వభస్మాగ్నిహోత్రాంతే, ధార్యమేవాగ్నిహోత్రిభిః
అనాహితాగ్నేర్బ్రాహ్మ్యఖ్య, మౌపాసన సముద్భవమ్

ఆహితాగ్నులైనవారు అగ్నిహోత్రములైన తరు వాత సర్వమను నాభస్మమును ధరింపవలయును. అనాహితా గ్నులగువారు (అగ్నిహోత్రములులేనివారు) నిత్యౌపాసనా నంతరమున బ్రాహ్మమను పేరుగల ఆభస్మమును ధరింపవ లయును.

శ్లో॥ ఔపాసనాగ్నిజంబ్రాహ్మం, సర్వభస్మంతు వైష్ణవం
సర్వభస్మపరంబ్రహ్మ ద్వయంసంసారతారకమ్
తయోరన్యతరత్సేవ్యం సంసారభయభీరుణా.

ఔపాసనాగ్నివలనఁ గలిగినభస్మము బ్రాహ్మము సర్వ భస్మము వైష్ణవము. సర్వభస్మపరబ్రహ్మ (వైష్ణవ)ము. ఈ రెం డును సంసారతారకములు గనుక సంసారభయభీరువగు నతఁడు ఈ రెంటిలో నేదేని ధరింపవలయును.

దీనివలన నగ్నిహోత్రము ఔపాసనము ముగియువ
అకు భస్మముధరింపరాదు. సంసారములోఁబడియుండఁ గోరు
వారు ఔపాసనాగ్నివలనఁగలిగిన భస్మమును ధరింపవలయును.
సంసారబాధ తప్పించుకొనఁగోరువారు సర్వభస్మము (వైష్ణవ
ము పరబ్రహ్మము) ధరింపవలయును. దీనివలనఁ బాడుముఖ
ముతో దేవపితృకార్యములు చేయరాదు గావున నూర్ధ్వపుం
డ్రముధరించియే అగ్నిహోత్రము ఔపాసనము చేయవల
యునని యేర్పడుచున్నది. ఈరెండులేని భస్మధారులగతి యే
మో చెప్పఁబడలేదు

శ్లో॥ ధార్యంభస్మంత్రిసంధ్యంతు గృహిణాజలసంయుతమ్
పర్వకాలే భవేత్త్రీణాం, యతీనాంజలవర్జితమ్.

గృహస్థుమూఁడు సంధ్యలయందును జలయుతముగ భ
స్మముధరింపవలయును. యతులును స్త్రీలును పర్వకాలమున
జలవర్జితముగ ధరింపవలయును.

కొందఱు మేము ధరించునది కుంపటిలోనిదిగాదు ప్రొ
య్యిలోనిదిగాదు విబూదిపండని యందురుకాఁబోలు. సంతో
షమే. ఇది పండగుట యెంత యథార్థమోదాని పవిత్రత్వమంత
యథార్థమే. విభూతి పిండము విబూదిపండయ్యెను.

ఈపండెవ్వరుసిద్ధముచేసిరి ? ఏవిధిననుసరించి సిద్ధముచే
సిరి? మంత్రము తంత్రము నటుండనిచ్చి యిది భస్మము ఆవు

పేఁడదే బట్టిదిగాదని యైన ధైర్యముగాఁ జెప్పఁగలరా? దానిన మ్మి జీవించువారేకసుమాలముతో దాని సిద్ధముచేయుచున్నా రో యెఱుఁగుదురా? తెలియనప్పుడది పవిత్రమని యెట్లుచెప్పఁ గలరు ?

ఊర్ధ్వపుండ్రము ధరించినవారు భగవన్నామములు చ్చరించుచు ధరించినఁ జాలునంటిరే అట్టులే భస్మధారులేల చేయరాదందురేమో సుద్దకుఁగాని చందనమునకుఁగాని తొల సిమ్మృత్తికకుఁగాని గోపిచందనమునకుఁగాని యూర్ధ్వపుండ్రము గాధరించునే పదార్థమునకు శాపమువలనఁగలిగిన యాశౌచ ములేదుకావునఁ బదార్థమును శుద్ధిచేయుకార్యములేదు. భస్మ మునకో శాపప్రేయుక్తదోషముగలదు కావుననే దానికి శాస్త్ర ము విశేషసంస్కారములు విధించుచున్నది కావునఁ దొలుతఁ బదార్థమును సంస్కరించి యావల శివనామములతో నూర్ధ్వ పుండ్రము ధరించువారివలె శైవులును జేయవచ్చునని సంజీవని విన్నపము. ఆవల వారివారి యిష్టము శ్రద్ధాభక్తి విధ్యుక్తధ ర్మము కొలఁది ఫలము.

—శ్రీరామమత ధర్మములు—

లక్ష్మణ కైంకర్యము.

(గతసంచికా శేషము చూడు ౪౭౯ పుట)

11. సీతారామలక్ష్మణులు గంగ దాఁటుసమయంబున సు మంత్రుఁడు మాతల్లిదండ్రుల కేమిచెప్పెదవనిన లక్ష్మ ణుఁడు.

కం. రాముఁడె భ్రాతయు, భర్తయు,
రాముఁడె ప్రియబంధు వరుఁడు రాముఁడె సుమిత్రా
రాముఁడె నాజనకుండును
భూమిపు నెడ లేదు జనక బుద్ధి సుమంత్రా.

అయోధ్య ౧౫౧౩.

అనిచెప్పెను. కైంకర్యపరుని దృఢవిశ్వాసమిట్టిదై యుండవలయును. ధారణపోషణములకు యోగక్షేమముల కన్నిటికి భగవంతుని మీఁదనే యాధారపడి నిర్భయుఁడై నిర్భరుఁడై యుండవలెనుగాని సోపాధికబంధులైన తల్లిదండ్రులు నన్నదమ్ములు చుట్టాలుతక్క అవసరముల నాదుకొందురని నమ్మరాదు. ఎంతవఱకు మనవలన వారికిలాభము సౌఖ్యముగలదో యెంతవఱకు మనము వారి కనుకూలురమై వారి చిత్తవృత్తి ననుసరించి యుందుమో యంతవఱకు వారు మనల ననుసరించి యుందురు. వారి సుఖలాభములకు భంగముకలిగెనా వారు మనలను విడుచుటేకాదు దూషించుటేకాదు ప్రత్యక్ష శత్రువులగుదురు. ఇదిలోకానుభవసిద్ధము. మనకనుకూలురుగ నుండు సమయమునందైనను మనయందెంత ప్రీతిగలవారైనను విపత్తులందు మనకు సహాయపడఁజాలరు. రాముని చరిత్రమే దృష్టాంతము. ఆయనయందేమి దోషము గలదని యాయనను దల్లిదండులు వనములపాలుచేసిరి. తమనిమిత్తమైకదా? పాముచుట్టు

కొనిన కృష్ణుని తల్లిదండ్రులు ప్రాణప్రియులైన గోపికాగోపకజనంబు లేమాత్రము రక్షించిరి. ద్రౌపదికి మానభంగసమయంబుననే భర్తలు, ఏమామలు, ఏతాతలు, ఏపెద్దమనుష్యు లెవరడ్డమువచ్చిరి?

తనకుఁ గష్టమని దమయంతిని నొంటిగ నడవులలో మృగములపాలుచేసిపోయినవాఁడెవఁడు? కట్టుకొన్న మగఁడు కాఁడా?

తన యప్పునకై చంద్రమతి నమ్మినవాఁడెవఁడు? భర్త గాఁడా?

ఇట్టివానికిఁ బౌరాణిక నిదర్శనము లక్కఱలేదు. అనుభవమేచాలును. తమలంజలకూడిగములుచేయుమని తమధర్మపత్నులను బీడించు చండాలురెవరు? కట్టుకొన్నభర్తలుగారా? కనుక నన్నదమ్ములను దల్లిదండ్రులను చుట్టములను వదలియైన భగవత్సేవచేయవలయును వారిసేవకై భగవత్సేవ వదలరాదు. స్త్రీలు తక్కినయందఱ విడిచినను బతితుఁడుగాఁడేని భర్తను మాత్రము విడువరాదు. పతులులేనివారు శాస్త్రార్థమెఱిఁగిన నెవరినో యాశ్రయించి నిందలకుఁ బాలుపడనిరీతి వర్తింపవలయును. స్వైరవృత్తితగదు.

శ్లో॥ పితరంమాతరందారాన్ పుత్రాన్‌బంధూన్‌సఖీన్‌గురూన్
రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్
లోకవిక్రాంతచరణౌ శరణం తే వ్రజం విభో॥

అర్థము.

తండ్రిని దల్లిని, భార్యలను, కొడుకులను, చుట్టములను స్నేహితులను, గురువులను, రత్నములను, ధనధాన్యములను, భూములను, ఇండ్లను సర్వపుణ్యకార్యములను గోరికలతో స్వర్గాదిఫలములతోడ వదలి ప్రభూ! లోకముల నాక్రమించిన నీచరణములను శరణుపొందుచున్నాను. ఇది కింకర కర్తవ్య కార్యము

12 సీతారామలక్ష్మణులు పంచవటిని జేరిరి. అప్పుడు శ్రీ రాముఁడు లక్ష్మణునితో

శా. అన్నా! పంచవటీ ప్రతీతి గలరమ్యంబైనదేశం బిదే
కన్నారం గనవే సుపుష్పితలతాక్ష్మాజాతజాతంబులో
విన్నాణింపరికించి చెప్పు మిఁకఁ బృథ్వీకన్యకున్ నీకు నా
కున్నిండారముదంబునాశ్రమమెటం గూర్పంగనౌలక్ష్మణా.
ఉ. నీటికిదవ్వుకాక రమణీయవనీహృదయంగమస్థలీ
వాటులు గల్గి మిట్టలును బల్లములేకసమప్రదేశమై

గాటముగాఁగఁబూవులునుఁగట్టియలుఁగుశలుఁసమీపమై
నేటగుసైకతంబయిననిర్మలదేశముఁ జూడుమీ యనఁ
అన్నా! లక్ష్మణా మనకు ముప్పూరకువసియింపఁదగినస్థలమే
దో చూచిచెప్పుమనిన లక్ష్మణుఁడు.

ఉ. అంజలిచేసి జానకి సమక్షమునం దిటువిన్నవించె భూ
రంజనశీల యిద్యోఁడఁదిరంబుగమీరుశతాబ్దముల్ ముదా
త్మ్యం జరియింప మీకుఁబరతంత్రుఁడనే, నటుగానమీరెనా
కుం జనవారనాజ్ఞ యిడఁగోరెదమీకురుచించుస్థానముఁ॥
అని ప్రత్యుత్తరమిచ్చెను.

మాభార్యాభర్తలకు నీకు నెక్కడనుండిన సుఖమనితోఁ
చునో యచ్చటఁబర్ణశాల నిర్ణయింపుమని రాముఁడు చెప్పెను.
ఆప్రకారము లక్ష్మణుఁడు చేసియుండిన నాయనయందు రెండు
దోషము లేర్పడును.

! తనసుఖముచూచుకొనుట !! స్వాతంత్ర్యము ఈ రెం
డును దాసలక్షణములుగావు. దాస్యవిరోధులు. కావునఁ దన్నుఁ
బరీక్షించుటకై రాముఁడిట్లు చెప్పుచున్నాఁడని తెలిసికొని నేను
బరతంత్రుఁడను. మీసౌఖ్యమే నా సౌఖ్యము. కావున మీకె
క్కడ సుఖమో మీరేచూచి చెప్పుఁడని కోరెను. దాసుని
యందుఁ బ్రమాదబుద్ధి పతనకారణమగును. కావున స్వతంత్ర

భావ మేకాలమందును సమీపమునకు రానీయరాదు. తనసుఖము భోగము నాలోచింపనేరాదు కొందఱు భోజనపదార్థములు సిద్ధముచేయుటయందుఁ దమరుచి తమకోరిక చూచుకొని సిద్ధముచేసి నివేదింతురు. ఇది సరిగాదు. ఇది భగవంతుఁడారగించు పదార్థము. ఇది యిట్లుచేసిననాయనకుఁ బ్రీతికరమని యిదిమన మశ్రద్ధతోఁజేసిన దేవుఁడెట్లారగింపఁగలఁడని సిద్ధముచేయవలెను. ఒక ప్రభువు మనయింటికివచ్చెనేని మనమే పదార్థమెట్లుచేసిన నాయన ప్రీతుఁడగునోయని యాలోచింతుమేకాని మనయింపే యాయనకింపని మన యిష్టమువచ్చినట్లు చేయముకదా. రాజోపచార మెట్టిదో దేవోపచారమట్టిదే.

సశేషము.

నిత్యభోగమునకు, చెల్లించినది ౨౦-౦-౦ వాగ్దానము

౨౨ ఎల్లాప్రెగడ అనంతపద్మనాభయ్యగారు ౨౦-౦-౦.

పూడివాడ సశేషము

మందరము వ్రాయుకాలములో నెలకు ఒక రూపాయవంతున ౩ సంవత్సరములవఱకు శ్రీస్వామి నైవేద్యమునకు నీయనంగీకరించినవారి వివరము.

౨౩. తడవర్తి బాపయ్యశ్రేష్ఠిగారు. వాగ్దానము చెల్లించినది.

ధూళిపూఁడి. ౩౬-౦-౦ ౧౭-౦-౦.

౨౪, సందెపూఁడి పరబ్రహ్మయ్యగారు వంగిపురము. ౩౬-౦-౦ ౧౫-౦-౦

౭౫. జంధ్యావేంకటప్పయ్యగారు, గురిజాల ౩౬-౦-౦ ౨-౦-౦
౭౬. గోపరాజు చిన పుల్లయ్యగారు చిఱుమామిళ్ల ౩౬-౦-౦ ౧౦-౦-౦
(సశేషము)

## మందరనివేదనోత్సవము.

ఇది యీ సంవత్సరము అక్టోబరు ౫-వ తేదికి సరియయిన యాశ్వయుజ శుద్ధ ౧౩ యందొంటిమిట్ట శ్రీకోదండ రామాలయంబున జరగెను. మందరమనునది యాంధ్రవాల్మీకి రామాయణ వ్యాఖ్యానమని లోకులెఱుంగుదురు. తననూతన గ్రంథములు లోకమున వ్యాపింపకముందే యాయాగ్రంథములను భగవంతున కర్పించుట వాసుదాసుమతము కావున నది వఱకుస్వహస్తలిఖితమైయుండిన దీనిని శ్రీకోదండరాములకర్పించెను. దీనినే యిప్పుడు సర్వము తిప్పివ్రాయుచున్నారు. ఇట్లుఁ జేయుటవలన నొక్కొకభాగమో కాండమో ముద్రితము కాఁగానే లోకమునఁ బ్రచురింపసాధ్యమగును. అటుకానియెడల గ్రంథము సమగ్రముగ ముద్రితమగువఱకు వెలిపుచ్చ సాధ్యపడదు. అటుచేయుట యెన్నిసంవత్సరములకార్యమో. ఉద్దిష్ట దినమున నుదయమున శ్రీకోదండ రామస్వాములవారికి సహస్రనామార్చనాదులు జరగెను. ఆవల గ్రంథమును శ్రీసీతారామలక్ష్మణులముందుంచి స్వాములవారి కనకమయ పాదుకలంతోడ మేళతాలములతోడను భజనములతోడను గ్రామమందూరేగింపఁబడెను. అమృతలూరు అంగలకుదురు మొదలగు గ్రామ

ములనుండి వచ్చిన కోదండరామసేవక సమాజసభ్యులే నిర్వాహకులైరి.

గ్రామ ప్రదక్షిణానంతరము దేవాలయమందు సభకూడెను. పెక్కురుస్త్రీలు పురుషులు నాలుగువర్ణములవారు దాని నలంకరించిరి. దాని కగ్రాసనాధిపత్యమును కడపమండల కరగ్రాహకులు (జిల్లాకలెక్టరు) మహారాజశ్రీ శి కే. మానవేదనరాజా బి. ఏ గారు వహించిరి. సబ్ కలెక్టరు బ్రహ్మశ్రీ రాజశ్రీ సుందరయ్యరుగారును తహశీల్దారు బ్ర॥ శ్రీ॥ బదరీనారాయణరావుగారును వారికి సహాయులై యుండిరి.

అప్పుడు బ్రహ్మశ్రీ యామర్తి సుబ్బదాసుఁడు గారు మందరమందలి పీఠికాపద్యములు చదివి యావల మొదటిరెండుపద్యముల వ్యాఖ్యానము చదివిరి. అప్పటికే చాలఁబ్రొద్దెక్కియుండుటచే నప్పటికి గ్రంధము స్వామికి సమర్పించి సభ చాలింపఁబడెను.

మధ్యాహ్నముమీఁద 3 గంటలకు మరల సభగూడెను. ఆంధ్రవాల్మీకి రామాయణమునకు నాంధ్రవ్యాఖ్యాన మావశ్యకమాయను విషయము చర్చించుచు సంస్కృత రామాయణమందలి కొన్ని నూతనవిషయములగుఱించి వాసుదాసుఁడు పన్యసించుచు

శా. శ్రీరామాయణ మంత్రశాస్త్రమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణ ధర్మశాస్త్రమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణగృహ్యసూత్రమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణముక్తి శాస్త్రమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్

శా. శ్రీరామాయణకావ్యరత్నమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణ సత్పురాణమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణయోగశాస్త్రమునకున్
శ్రేష్ఠంబు లేదేదియున్
శ్రీరామాయణమే నిధానము సుండీ
శ్రేయోర్థులౌవారికిన్.

గీ. రాముచరితంబు లక్ష్యంబు రామునను జా
గీతలక్షణ సూత్రంబు ధాత్రి నాచ
రణమురూపునఁ జూపించె రాముఁ డెద్ది
యదియెబోధించెఁ గృష్ణుఁడై యర్జునునకు.

గీ. చెప్పె నేధర్మచరితఁ బ్రా చేతసుండు
సంగ్రహమ్ముగఁ గావ్యలక్షణము చెడక
దానినే వివరించె వ్యాఖ్యానముగను
భారతామ్నాయమునయందు వ్యాసమౌని.

అను మందరపద్యములు చదివి వీనియర్థమువిశదీకరించెను.

ఆవలఁగార్యక్రమ పత్రమునందు సూచించినప్రకారము దేవాలయోద్ధర్కాముగుఱించి మ-రా-శ్రీ బ్రహ్మశ్రీ శి వెం శోబరావుగారును (తాడిపర్తి) మ-రా-శ్రీ కొండూరు వేంకట శివరాజుగారును నుపన్యసించుచు గుంటూరు మండలమువారు వాసుదాసునిఁ దమమండలమునకుఁ దోడుకొనిపోవ యత్నిం చుచున్నారనియుఁ గడప, అనంతపురము, చిత్తూరు మొదలగు మండలములవారు వారిని నొంటిమిట్టయందేనిలుప బ్రయత్నిం పవలయుననియు వారి ప్రతిబింబమును దేవాలయమున స్థాపిం పవలయుననియు నుపన్యసించిరి. మహారాజశ్రీ చమర్తి చిన్న సామి రాజుగారును వారి యభిప్రాయమునే బలపఱిచిరి.

గుంటూరుమండల కోదండరామసేవక సమాజసభ్యుల పక్షమున నంగలకుదురుకరణము బ్రహ్మశ్రీ రాజశ్రీ రావినూ తుల నాగభూషణ శర్మగారు వారికిఁ బ్రత్యుత్తరమిచ్చుచు

గుంటూరు మండలమున నేడువందలకు మించికోదండరామసే
వక సమాజసభ్యులు సభ్యురాండ్రున్నారనియు, ఇంకను జేరుట
కుఁ గొందఱు సిద్ధపడి వీరి రాకకై యెదురుచూచుచున్నారని
యు వారికందఱకు నెడపాదడపావీరుదర్శనమిచ్చి చెప్పవలసిన
విషయములు చెప్పి యాచారమునేర్పి చక్కదిద్దవలసిన భార
ము వాసుదాసునందుఁగలదనియు మామండలము వారిచ్చటికి
రావలయుననిన ధనాభావము శక్త్యభావముచే సాధ్యముకాదని
యు వారందఱిచ్చటికివచ్చుటకై వెచ్చముచేయవలసినధనము
వాసుదాసుగారికిచ్చిన నేదైన ధర్మకార్యమునకు దేవతాకా
ర్యమునకు నుపయోగింపఁబడుననియు భక్తితోడ రమ్మనిపిలు
చువారిని విడిచి భక్తిహీనులైన యీజనుల నడుమవారుండు
ట సరిగాదనియు ఇచ్చటివారువారివలన బాగుపడు మార్గము
తెలియక తెలిసికొనఁజాలు తెలివితేటలు లేకయున్నారనియు
ఇచ్చటివారు మావిషయమున గడ్డివామిమీఁది కుక్కవలె
వర్తించుట సరిగాదనియు వారుబాగుపడక మమ్ము బాగుపడ
నీయక పోవుట వీరికి ధర్మముగాదనియు పోయినసారి తామి
చ్చటికివచ్చియుండినపుడు ఈయూరిజనులు స్వామికి నైవేద్య
మునకై తామిచ్చిన ప్రసాదమును దామువినక పరులకుఁబెట్టక
ముణుగఁబెట్టి యావలఁ బాఱపోయుట కన్నులారఁ గంటిమని

యు నిదియే వీరిదైవభక్తిని వేయినోళ్లఁ జాటుచున్నదనియు నీగ్రామజనులు కాటులాడుచు వాసుదాసు మనస్సునకు వ్యాకులత గలిగించి మందరలేఖన కార్యము సాగనీయకున్నారని యు ఇహమునకుఁగాని పరమునకుఁగాని తనకుఁగాని యితరుల కుఁగాని లాభకరముగాని యీచింతగలిగించి యేయితర చింత లేని వీరిని వ్యాకులపఱుప సరిగాదనియు నీకారణముచే నైనవీరీ గ్రామము విడుచుట బాగనియు నుపన్యసించిరి.

ఆవల వాసుదాసుఁ డిట్లుపన్యసించెను. నా శ్రేయస్సు కోరిన యధికారులు పెద్దమనుష్యులు నీవీకుగ్రామమందు నింత కార్యము చేయుచున్నావే నీకు వెనుక దీనినెల్లఁ గాపాడువారె వ్వరని పలువురు ప్రశ్నించుచున్నారు నాకౌరసులు లేరు. ఉత్త రాధికారులుగలరుగాని వారు వ్యర్థులు కావునఁ బ్రతిసంవత్సర ము మరణశాసనము వ్రాసి తగిన యేర్పాటు చేయుచున్నాను. ఈమరణశాసనములందుఁ దొలుతొల్త నాసర్వస్వము హిందూ మతాదాయశాసనాధికారులకువశపఱునట్లు వ్రాసితినిగానివిజ్ఞులు వారికధికార మీయవలదనియు దేవాలయ స్వగ్రహణమందు వారికుండుశ్రద్ధదేవాలయాభివృద్ధియందు లేదనియుఁజెప్పిరి. వీరు చెప్పినదినత్యమని యిప్పటి నాయనుభవముచేఁ దెలిసికొంటిని. కావుననాకుఁగల సర్వస్వము కోదండరామ సేవకసమాజసభ్యు లపేర(౨౧-౧౮౬౨) సంఘశాసనము ప్రకారమువ్రాసియిచ్చి

వేయ యోజించి దానినిజట్టప్రకారమువ్రాయుటకు మ-రా-శ్రీ కే. గుండూరావుగారినిగోరితిని పక్షవాదులు దరిద్రపక్ష్యునియం దుపేక్ష వహింతురుగాని శీఘ్రకార్యకారులగుదురా? ఆకారణ ముచేనది యింకనుగార్యరూపమువహింపకున్నది. శీఘ్రకాలము నందే యది క్రియగఁ బరిణమింపఁగలదు. భవిష్యత్కాలము నాఁటిమాట యట్లుండ నిప్పుడీగ్రామమున దేవకార్యముచేయు టకు సాధ్యపడకున్నది. గ్రామమునందుఁ గలహాము మెండైనది. ఈగ్రామమందు బ్రాహ్మణులు, వైశ్యులు, రెడ్లు, బలిజలు నున్నారు. బ్రాహ్మణు లల్పసంఖ్యులు. బీదవారు వారేకార్య ముచేయను విచారింపను శక్తిగలవారుగారు బలిజలు పెక్కు రున్నారుగాని వారును బీదలు వివేకముగలవారు కారు. అందుఁ బెక్కురు దేవాలయమం దెవరైన నేదైన మఱ తురా? యని వచ్చువారేకాని శ్రద్ధాభక్తులెట్టివో వారె ఱుఁగరు. వారికి రెడ్లకుఁ బ్రబల విరోధము ఇంతవఱకు సూరా రెడ్డిగారు నాపక్షమున దేవాలయకార్యము చేయుచుండుటచే తను ఆయన సేవాకుటీరసమీపమందే వసించుటచేతను ఆయన పక్షముననేనుండి తమ కేదో కీడుచేయుచున్నానని బలిజలకు నాపైఁ గోపముకావుననే కొలఁది దినములక్రింద వీరిలోనొకఁ డువచ్చి మీరు సూరారెడ్డికి సాహాయ్యము చేసినయెడల మీ కును గీడుగలుగునని బుద్ధిచెప్పిపోయెను. ఇఁక సూరారెడ్డిగారో

మంచి యాలోచనపరుఁడు. వ్యవహారపిదుఁడు. సాహసికార్య కరణసమర్థుఁడు. గంభీరుఁడు. కావున హృదయము పట్టియియ్యఁడు. ఆయనకు నాయందు విశ్వాసమేకలదో యవిశ్వాసమో కలదో నేటిసభయందుఁ దెలియఁగలదు. సూరారెడ్డిగారి విషయమునఁగాని బలిజలవిషయమునఁగాని నేనేమైనఁ జెప్పితినో లేదో యధికారులయిన మీకే తెలియును.

సూరారెడ్డిగారికి బలిజలకేగాక సూరారెడ్డిగారికి వైశ్యులకును మనఃస్పర్థగలదు దేవాలయమందు రెండుమూఁడుకుటుంబముల రెడ్లు తాముముందు మర్యాదలు గ్రహించి యావల వైశ్యులకిచ్చెద మనుచున్నారు వైశ్యులు దీనినిసహింపఁజాలకున్నారు. కొందఱు దీనిని సంఘవిరోధమని సమాధానపఱుపఁజూచెదరుగాని సాంఘిక విరోధమైనచో సర్వత్రయుండవలెను ఇది పొడుగుచేతులవాని పణ్యారము కావునఁ గొన్నిస్థలములందే కానవచ్చుచున్నదికాని యెల్లచోటులలేదు. ఇది మన్త్రిప్రభువుల ప్రతినిధు లగుటచే నిట్లు జరగుచున్నదిగాని వారు పోయినను ఇదిమాత్రమునిలిచినది. ఈ కారణముచే వైశ్యులెవ్వరు నీదేవాలయ మాదరించుటలేదు ఈ రెడ్లు ప్రముఖులు దేవాలయమునకుఁ దామొక కాసిచ్చుటయు లేదు. ఇచ్చెడివారిని ఇయ్యనిచ్చుటయు లేదు. ఇవన్నియు దీర్ఘక్రో

ధములు వీరికందఱకుఁ గలహకారణము. రణభూమి దేవాల
యము. వీరిలో దేవాలయమందు భక్త్యభిమానములు గల
వారులేరు ఈదినము నుదయమున దేవునివాహనమును మో
యువారులేక చూడవచ్చిన భక్తులచే మోయింపవలసివచ్చెను.
శుక్రవారోత్సవమునకు నిట్లే మనుష్యులు కూలి యిచ్చినను
లభించుట దుర్లభము. ఈ మేషయుద్ధమందు నాస్తికజంబుకము
వంటివాఁడై యున్నది. వారి తెరువునఁబోక దూరమందున్నను నిరు
వురు పోడువవచ్చుచున్నారు. కొలఁది దినములక్రింద కుటీరమం
దుఁ బనిఁజేయుదానినిఁగొట్టి యిచ్చుటనుండకుండఁ జేసిరి. అట్లే
నా సేవకునిఁగొట్టిరి మరలఁగొట్టనున్నారని వాఁడప్పుడప్పుడు
చెప్పుచున్నాఁడు. కొందఱు పందిటిసామాను దొంగిలింపఁగా
నీయిరువురువచ్చి మాతో దానినిజెప్పుటయే యీ ప్రహరణము
లకుఁ గారణము సమాచారము మాకుఁ దెలియరానీకుండుట
కై వారిని వెడలఁగొట్టు నుద్దేశముతో నీపని జేయుచున్నారు.
ప్రకృతమా ప్రత్యక్షతటస్థము. భవిష్యత్తునందా యాదరణశూ
న్యము ఇట్టిచోట నీదేవాలయమునకు నేమిచేసి యేమిప్ర
యోజనమని నాయభిప్రాయము దేవాలయ కార్యముచేయవ
లనుపడదేని నేనీ గ్రామమందుండవలసిన పనియేలేదు. పిదికెడి
యావును విడిచి తన్నెడి బఱ్ఱెను గట్టుకొని నేనేల యేడ్చుచుం
డవలయును. ఈరెడ్లు మంచిమనస్సుగలవారైరేని యీకలహ

ములన్నియు నేఁటితో మానును. దీనికుభయవాదులంగీకరించిరి కావున దేవాలయము గ్రామము చక్కఁబడును. అట్టిభావము వారికి లేదేని నేను బుద్ధిమంతుఁడనైనచో నీగ్రామమును విడిచి యెందైనఁజని సుఖింతును ఈగందరగోళములోఁబడి స్తిమితమైనమనస్సులేక నేను వ్రాఁతపని యెట్లుజేయఁగలను? ఈ దేవాలయకార్యము ధనసాధ్యము. దాని నే ధనికుఁడైనఁజేయఁగలఁడు. నామందరభారము నెవ్వఁడు మోయఁగలఁడు. కావునఁ బెద్దమనస్సుచేసి తమకు శాశ్వతకీర్తికరమైనకార్యముచేయ రెడ్లను బ్రార్థించెదను వెలుగుచేనుమేసినఁ గాచువారెవ్వరని సామెతగలదు. గ్రామమందు నయముతోనో భయముతోనో శాంతినెలకొలుపవలసిన యధికారులే కలహకంటకవృక్షమును నీరుపోసి పెంచి పెద్దచేయుచున్నారు ఈతాలూకా కధికారిగా నుండిన యొక మహానుభావుఁడే దేవకార్యవిరోధియగుటయేకాక పక్షపాతియై కలహములుపెంచి రెడ్లను ధ్వంసముజేయఁ గంకణము కట్టుకొనెను గాని మగనితోడ మంగళసూత్రముపోయినట్టు లధికారముతోఁ గంకణము జారిపోయెను ధర్మకర్తల నేర్పాటుచేయునధికారి తొలుత నొకని నూతన ధర్మకర్తగా నేర్పఱచెనుగాని యావిషయము ప్రాఁతధర్మకర్తకుఁ దెలిపినవాఁడుకాఁడు. ఇతఁడా ప్రాఁతధర్మకర్తకాదేశముగవచ్చినవాఁడో సహాయుఁడో చెప్పినవాఁడుకాఁడు. ఈ

కారణముచేఁ బ్రాఁతధర్మకర్త పక్షమువారికిఁ గ్రొత్తధర్మకర్త పక్షమువారికి దేవోత్సవవిషయమై గొప్పకలహము జరుగ సిద్ధమైయుండెను. అది జరగియుండిన హత్యలు జరగియుండును. ఈగండము డివిజనల్ మేజస్ట్రీటువారి యుత్తరవువలన నణఁగెను. ఈవార్తవిని నూతన ధర్మకర్తను నేర్పాటుజేసిన యధికారి యతనినేర్పాటు జేయుటకుఁ దనకధికారము లేదనియు నతఁడు ధర్మకర్తగాఁడనియు వ్రాసి ప్రాఁతధర్మకర్తకుఁ దెలిపెను. ఈయధికారి తన యధికారమెంతయో యదికూడఁదెలియక, తానీ కార్యముచేసిన ఫలమెట్లుండునోయని యూహించుశక్తియు లేక వ్యవహరించెను ఇంతతోఁబోయినమేలే మరల నాయధికారియే యాసందర్భములందే యామనుష్యునే ధర్మకర్తగా నేర్పాటుచేసెను ప్రాఁతధర్మకర్త కీవిషయము దెలుపక యర్చకునిపేర నీవీ నూతన ధర్మకర్తకు లోపడి పనులు చేయవలసినది ఆయనకు నీ వవిధేయుఁడవై వర్తించితివేని యతఁడు తెచ్చుదావాకు నేనుత్తరవాదినిగానని నెంబరులేని తాకీదునొకదానిని బంపెను. అదియాపక్షమువారు కల్పించిన సంకల్పించిన వానికిఁగాక నిజమైన యర్చకునకుఁ జేరెను. ఆయన దానిపై నన్నేర్పాటుచేసిన ధర్మకర్త యొకఁడున్నాఁడు. ఇప్పుడుమీరా యనను దొలఁగించి యీయనను నేర్పాటుచేసితిరా? లేకసహాయుఁడుగానా ఏదియుమీరు వ్రాసిన వారుకారు.

(సశేషము)

శ్రీరామ

# భక్తిసంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి

కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి

విలేఖకుఁడు —ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)

ప్రకటనస్థలము —వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము.

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు

సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు.

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె చక్కగ సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

## వాసుదాస ప్రణీతము.

| | | | |
|---|---|---|---|
| శ్రీవాసుదాసు [illegible] | 0 | 4 | 0 |
| శ్రీ భక్తకల్పద్రుమశతకము | 0 | 4 | 0 |
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

## భక్తి సంజీవని ౧౯—౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧—౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.

Title Page Printed at Read & Co., Printers Triplicane High Road




# శ్రీ భక్తి సంజీవని

ఇది భక్తి జ్ఞాన కర్మ యోగములఁ దెలుపు మాసపత్రిక

ప్రతి పూర్ణిమా ప్రారంభంబున వెలువడుచుండును.

విలేఖకుఁడు-ప్రకాశకుఁడు: చావలికొలను సుబ్బారావు,
(వాసుదాసుఁడు) ఒంటిమిట్ట.

"భక్తిరేవైనం గమయతి, భక్తిరేవైనం దర్శయతి
భక్తివశః పురుషః ॥" మా. శ్రుతి.

భక్తియే భగవంతుని బొందించునది. ఆయనను దర్శింపఁ జేయునది భక్తియే. భగవంతుఁడు భక్తివశుఁడు.

సంపుటము ౨ { ౧౯౩౦ సంవత్సరము డిశంబరు నెల / ప్రమోద సం॥ మార్గశిరము. } సంచిక ౧౨.

శ్రీ రామాయనమః

స్త్రీవృత్తము. సీతక్-మాతక్-బూతక్-ఖ్యాతక్
నారీవృత్తము. మెలఁతక్-దలఁతుక్-గొలుతుక్-వలతుక్.

ప్రార్థనము.

౧౯౩౧-వ సంవత్సరమునకు భక్తిసంజీవనికిఁ జందాదారులుగా నుండఁగోరువారు వారివారి చందాలను ఈ నెల 30 తేదిలోపల మాకుఁజేర మనిఆర్డరుగాఁ సొమ్ముబంపఁ బ్రార్థితులు.

— ప్రశ్నోత్తరములు —

ప్రశ్నలు. 1. ఋతుకాలము మీఱిన తరువాత స్వభార్యతో భోగించుట దుష్కామ మగునా?

2. ఋతుకాలము మీఱిన తరువాతఁ బురుషుఁడు బ్రహ్మచర్య మవలంబింపవలె నని యుండెనేని భార్య కామాతురయై పిలిచిన నామె కామము వ్యర్థము చేయవచ్చునా?

3. ఋతుకాలము మీఱిన తరువాత భార్య బ్రహ్మచర్యవ్రత మవలంబింపవలయు నని యుండినను భర్త బాధించెనేని భార్య యేమిచేయవలయును?

ఉత్తరము. ఇట్టి వింత ప్రశ్నములు వచ్చుచున్నవి ఈ విషయముల సంజీవని యనుభవశాలిని గాదు. అనుభవజ్ఞులు వ్రాసి పంపుదురుగాక.

ఈ సందర్భమున నొకటిమాత్రము సంజీవని తెలుపఁ గలదు. స్త్రీలు కామినులు వారికి ఋతుకాలంబులఁ గామ మెక్కువ. అట్టి స్త్రీలకు ఋతుకాలానంతరము కామము గలు

గదు. అట్టికోరిక యుండెనేని యది కండూతియే. అట్టిసమ
యంబులఁ గలయుట కండూతి నివారణార్థకామసంతర్పణమే
కాని రతిగాదు. రతి వేఱు. కండూతి వేఱు అట్టిదినములందు
సంభోగించుటవలనఁ బురుషునకు రేతస్సు వ్యర్థ మగుచున్నది.
రేతస్సే తేజస్సు. రేతస్సే ఓజస్సు రేతస్సే ఆరోగ్యము అదియే
మనోబలము. అదియే బుద్ధిబలము. అదియే దేహబలము. ధన
దరిద్రునకన్న వీర్యదరిద్రుఁడు నిర్భాగ్యుఁడు ఋతుకాలంవినా దేవి
రమణం పరివర్జయేత్తనుట (ఋతుకాలమందుఁదప్పఁ బతితోఁ
గలియరాదనుట) మఱచియో యెఱుఁగకయో యుపేక్షించి
యో దానియందు విశ్వాసబుద్ధి లేకయో యుల్లంఘించి యీ
కాలమున విధినిషేధములు లేక ఋతుకాలానంతరమందు
వీర్యము వ్యర్థము చేయుటచేతనే యీనాఁల గర్భము నిలుచున
ప్పటికి వీర్యదారిద్ర్యమో దుర్బలవీర్యమో కలుగుటచే జీవచ్ఛ
వములవంటి బిడ్డలు దేశమున వెల్లివిరియుచున్నారు ఋతుకా
లానంతరము గర్భకోశము ముకుళితమై యుండుటచే రేతోగ్ర
హణశక్తముగాదు కావున వీర్యము వ్యర్థము చేయరాదు. పతివ్ర
తలైనస్త్రీలు సహధర్మచారిణులుకావున భర్తలు బ్రహ్మచర్యము
వలంబించెదమనిన వారును నట్టులేచేయుదురు భర్తలు బ్రహ్మ
చర్యవ్రతము నవలంబించెదమనిన వారిని భ్రష్టులఁజేయ భార్య
లు యత్నించెదరేని తమనెత్తిపైఁ దామె మన్ను వేసికొనినవా

రగుదురు. కామములేని స్త్రీతోఁ గలియుటచే పురుషుని దేహ
ము చెడును. కావున నట్టి సమయములందు భర్తయు జితేంద్రి
యుఁడై యుండవలయును గాని నీవు రాకున్న నేను మఱియొక
దాని యొద్దకుఁబోయెద నని బెదరింపరాదు. ఇట్లు బెదరించు
వాఁడు భార్యపిలిచినపుడు తాను బోకుండిన నామె యట్లు బెద
రించినఁ దనగతి యేమో యాలోచింపవలయును. అర్థకామము
లను బ్రధానముగ నెంచక భార్యాభర్తలు ధర్మము ప్రధాన
ముగ నెంచి సీతవలె స్త్రీలు, రామునివలెఁ బురుషులు, వ్యవహ
రించుట క్షేమకరము (పతిహితచర్య సతీహిత చర్య చూడుఁడు).
ఉత్తమదాంపత్య మెట్టిదనిన,

సీ. అన్ని యవస్థల ననుగుణ మగుచును
సుఖదుఃఖముల నొక్కచొప్పు గలిగి
ముదిమియందేనియు వదలక హృదయ వి
శ్రామంబుఁ గలిగించు ప్రేమ కలిగి
పరిణయ మాదిగా భర్తదేహము వీడు
నందాఁకఁ బరిణయమైన నాఁటి
స్నేహంబుఁ బోలినస్నేహసారంబునఁ
గలఁగని స్థిరమైన కలిమి గలిగి

తే. పరఁగుచుండెడి మేలిదాంపత్యమనను
గలుగు నైక్యంబు ముఖ్యమై వెలయుచున్న
క్షేమ మెయ్యెదో దానిచేఁ జెలఁగుచుండఁ

గోరువాఁడను సర్వప్రకారములను. ఉ. రా.

ఇట్టి దాంపత్యసౌఖ్యముగలవారికి స్వర్గమేల? కాల్వనా?

భార్యాభర్తృసంభోగము పోతు పెంటి కలియుట వలెఁ గామసంతర్పణకార్యమని యెంచువారు పశువులని నిత్య తంత్రమునఁ గలదు బృహదారణ్యకోపనిషత్తునందు స్త్రీపురుషసంయోగము పవిత్రమైన హోమముగాఁ జెప్పఁబడినది. అష్టమాధ్యాయము ద్వితీయబ్రాహ్మణము.

దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుత్యై రేతస్సంభవతి॥౧౨॥ యోషావా అగ్ని ర్గౌతమ! తస్యా ఉపస్థ ఏవసమిల్లోమాని ధూమో, యోని రర్చి, ర్యదంతః కరోతి తేంగారా అభినందా విస్ఫులింగా స్తస్మిన్నే తస్మి న్నగ్నౌ దేవా రేతో జుహ్వతితస్యా ఆహుత్యై పురుష స్సంభవతి సజీవతి యావజ్జీవత్యథా మ్రియతే॥౧౩॥ అథైన మగ్నయే హరంతి తస్యాగ్ని రేవాగ్నిర్భవతి సమి త్సమిద్ధూమో ధూమోర్చి రంగారా అంగారా విస్ఫులింగా విస్ఫులింగా స్తస్మి న్నేతస్మిన్నగ్నౌ దేవాః పురుషం జుహ్వతి తస్యా ఆహుత్యై పురుషో భాస్వరవర్ణ స్సంభవతి॥౧౪॥ తే య ఏవ మేతద్విదుః యేచామీ అరణ్యే శ్రద్ధాం తస్య ముపాసతే తేర్చిరభిసంభవంతి అర్చిషో హరహ్న ఆపూర్యమాణ పక్ష మాపూర్యమాణ పక్షాద్యా౯ షణ్మాసానుదంఙాదిత్య ఏతి మాసేభ్యో దేవలోకం దేవలోకా దాదిత్య మాది

త్వా వైద్యుతం తాన్వైద్యుతా త్పురుషోఽమానస ఏత్య బ్ర
హ్మలోకా న్గమయతి తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో
వసంతి తేషాం నపునరావృత్తిః॥౧౫॥

అర్థము.

మనుష్యుఁడే అగ్ని. ఈయగ్ని యందు దేవతలు అన్న
మును హోమము చేయుదురు.దానివలన రేతస్సుకలుగును.
౧౭॥స్త్రీయే యగ్ని గౌతమా! ఆమెయుపస్థమే(పిఱుఁదులు)
సమిధలు. వెంట్రుకలే పొగ. యోనియే జ్వాల.సంభోగమే మి
ణుఁగురులు. దీనియందు రేతస్సును హోమము చేయుచు
న్నారు. దీనినుండి మనుష్యుఁడు పుట్టుచున్నాఁడు. వాఁడు జీవిం
చునంతకాలము జీవించును. వాఁడు మరణించినపుడు అగ్ని
హోత్రమునకై కొనిపోఁబడును. అప్పుడు వానిలోని అగ్ని
యగ్నియగును. సమిధలు సమిధ లగును. ధూమము ధూమ
మగును. జ్వాల జ్వాల యగును. అంగారము లంగారము లగు
ను. మిణుఁగురులు మిణుఁగురులగును. ఈయగ్నియందు దేవ
తలు పురుషుని హోమము చేయుదురు. ఆయాహుతిచేతఁ
బురుషుఁడు తేజము గలవాఁడై జనించును (వాఁడగును.)

ఈ జ్ఞానముగలవారును ఏకాంతప్రదేశమున శ్రద్ధతో
సత్యమును (బ్రహ్మమును) నుపాసించువారును అర్చినిగుఱించి
పోదురు. అర్చినుండి దినము దినమునుండి శుక్లపక్షము శుక్ల

పక్షమునుండి యుత్తరాయణము అందుండి దేవలోకము దేవలోకమునుండి యాదిత్యుని ఆదిత్యునుండి విద్యుత్తును (మెఱుపు)పొందును. అందుండి మహాపురుషుఁ డొకఁడు బ్రహ్మలోకమునకుఁ గొనిపోవును. ఆబ్రహ్మలోకమునందు శాశ్వతముగ నుందురు. మరల వారికి జన్మము లేదు.

దీనికే యర్చిరాదిమార్గమని పేరు మరల జన్మములకు రానివా రీమార్గమునఁ బోదురు. మీఁదఁజెప్పినదానికిఁ బంచాగ్నివిద్య యని పేరు. దేనిని దెలిసికొనుటచే జన్మరాహిత్య మగునో దానికి విద్యయని పేరు ఇట్టివి ముఖ్యముగ ౩౨ గలవు. అందిది యొకటి.అయిదగ్నులలోఁ గడపటిదైదవయగ్ని భార్య. అట్టి యగ్నియందు "మైథునం ప్రచరే ద్ధర్మాత్ దేవతాభావచేష్టిత"మ్మని యుండుటచే నిదియజ్ఞమువంటి పవిత్రమైన దేవతాకార్యమని యెవఁడు రేతస్సనెడి యాహుతిని భార్యయందు హోమముచేయునో వానికిఁ బునర్జన్మములేదని యుపనిషత్తు చెప్పుచున్నది. పునర్జన్మమునుగోరి యంతరాళమున నల్లాడు జీవునకుఁ గరణకళేబరమను తరణసాధనము నిచ్చుట దేవతాకార్యము గాదా. పూర్వకాలమున మరణించి దీర్ఘకాలము స్వర్గసుఖము లనుభవించి యందుండి పంపఁబడిన పుణ్యాత్ములు కొందఱు మరలఁ దాము భూమిపై జన్మింపఁ దమకుఁ దల్లిదండ్రులుగా నుండఁదగిన పవిత్రదంపతులు త్తమజాతులందు మన

దేశమున లేకుండుటచే యిష్టములేకయు వేఱుగతిలేక యన్య దేశములందు జనించుచున్నారు నరకమునుండి విడుదలకాఁబడిన వారీ దేశమున నుత్తమజాతులందుఁ బుట్టుచున్నారు. ఇట్టివారి కిఁ దల్లిదండ్రులుగా నుండఁదగినవారు మనదేశమున వేలకొలఁ దులున్నారు ఉత్తమఫలము రతి దేవతాకార్య మనుభావము తోఁ జేయువారికిఁ గలదు కాని కామదాసులై చేయువారికిఁ గాదు. పశుధర్మమని చేయువారికిఁ బశుత్వమే ప్రాప్త మగును. బ్రహ్మక్షత్రియవైశ్యులకు భార్యతోడనగ్ని వచ్చును. ఆమెతోడ నగ్ని పోవును. కావున భార్యయే యగ్ని. ఎవఁడు పవిత్రవంత మైన తనరేతస్సును దనవివాహితపత్నియందుఁ దప్ప నితరస్త్రీ లయందు విడుచునో లేక వ్యర్థముచేయునోవాఁడు కపిలగోవు నేతిని సంపాదించియు పవిత్రమైన తనయగ్నియందు హోమ ముచేయక దినదినము కుక్కలకుఁ బెట్టువానికంటెను వీధిలోఁ బాఱఁబోయువానికంటెను నికృష్టుఁడగును. అట్టి పవిత్రమైన యాజ్యమును బాఱఁబోయువానికిఁ బాపములేదుగాని రేతస్సు వ్యర్థముచేయు వీనికి ఘోరపాపము గలదు. మీఁద వివరించిన విషయమే బృహదారణ్యకమున నష్టమాధ్యాయమందు నాల్గ వ బ్రాహ్మణమందును గలదు, "తస్యా వేది రుపస్థో లోమాని బర్హిశ్చర్మాధిషవణో సమిద్ధో" దీనియందు స్త్రీలమర్మాంగము యజ్ఞవేదిగాఁ జెప్పఁబడినది కుక్కకూర్చుండిన యజ్ఞవేది యె

ట్టిదో అంకుటాంధ్ర మర్మాంగములట్టివ. ఈమీఁద వ్రాసినదెల్ల గృహస్థుల కేయని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసియున్నారు. దుష్ట వేశ్యలయంగములు నడిపీఁక బొల్లు, రచ్చతిన్నెలు, వారిబొమ్మలు సంతసౌరకాయలు. కావున వారికిది యన్వయింపదు. బ్రహ్మచారులకు సన్న్యాసులకు నన్వయింపదు. అరణ్యమందే కాంతముగనుండిపరబ్రహ్మోపాసనము చేయువారి కేఫలమో మీఁదఁజెప్పినట్లు వర్తించుభార్యాభర్తలకు నాఫలమే చెప్పఁబడినది దీనియర్థ మేమో బుద్ధిగలవారు గ్రహింపఁగలరు.

అర్చిరాదిమార్గమునుగుఱించి వివరముగా వేఱొకపత్రికయందుఁ బ్రకటింపఁబడును. మీఁదఁ జెప్పినట్లు నడచుకొను గృహస్థులకు గృహిణులకు జన్మరాహిత్యముచెప్పి యాయుపనిషత్తే అథ యజ్ఞేనదానేన తపనా లోకాంజయంతి తే ధూమమభిసంభవంతియని యజ్ఞము దానము తపస్సు వీనిచే నూర్ధ్వలోకములకుఁ బోవువారికి మరల జన్మముఁ గలిగించు ధూమాదిమార్గము చెప్పఁబడినది. దాంపత్యశ్రేష్ఠత్వము గుఱించి యింతకంటె సంజీవని యేమిచెప్పఁగలదు. ఈ ప్రకారమువర్తించి బాగుపడుఁడని చెప్పఁగలదు. స్వైరవిహారులై చెడిపోకుఁడని చెప్పఁగలదు ఆవల వారివారి ప్రారబ్ధ మెట్లీడ్చిన నట్లు వారువారు పోఁగలరు. దానిఫల మనుభవింపఁ గలరు. నవ్వుచుఁజేసి నవా రేడ్చుచు ననుభవింతురు.

ప్రశ్నము. సమాశ్రయణ మననేమి? అది యెట్టివారి కావశ్యకము? సమాశ్రయణమునకుఁ దప్తచక్రాంకనముముఖ్యమా? అదిలేక సమాశ్రయణము కారాదా?

ప్రత్యుత్తరము. సమాశ్రయణ మనఁగా సమ్యక్ + ఆశ్రయణము పూర్ణముగ యథావిధి సాంగముగ భగవంతు నాశ్రయించుట. పూర్ణముగ ననఁగా మనస్సునం దఱగొఱలు లేక నిండుమనస్సుతో నీవే తప్ప నితఃపరం బెఱుఁగనని యన్యదేవతలను, నన్యోపాయములను అన్యప్రయోజనమును విడిచి భర్తను పతివ్రతయగు భార్య యాశ్రయించినట్లు చాతకము మేఘమును నాశ్రయించినట్లు లాశ్రయించుట పూర్ణముగ నాశ్రయించు టగును. యథావిధిగ ననుటచే నిట్టియాశ్రయణ మెట్లుచేసినఁ బూర్ణమగునని శాస్త్రములు చెప్పుచున్నవో యాశాస్త్రపద్ధతిప్రకారము చేయుట. సాంగముగన నఁగా ఈకార్యము చేయుటయందు దీని కంగములుగ నేయే కార్యములు చెప్పఁబడినవో యవి యెల్లఁ జేయుట. ఇది చాతకన్యాయనిష్ఠులై దాసోహమ్మను భావముగల విష్ణుభక్తులకం దఱ కవశ్యకము. అహంబ్రహ్మాస్మి నేనే బ్రహ్మమని నోటిమాటలుమాత్రము చెప్పుటగాక తర్కించుటగాక సర్వదా యట్టిభావమందు నిష్ఠుఁడై యుండువానికి నది యనావశ్యకము. నేనే బ్రహ్మమైనప్పుడు నేను మఱియెవరి నాశ్రయింపవలె.

పరులరక్షణముపై నాధారపడియుండువాఁడు దన్నురక్షింప సమ
ర్థుఁడగువాని నితరుని నాశ్రయింపవలెఁగాని స్వతంత్ర శక్తిగల
వానికిఁ బరాశ్రయణమేల? ఇట్టి స్వతంత్రశక్తి వచ్చినపిమ్మటఁ
బరాశ్రయణమనావశ్యకమేకాని నాకు స్వతంత్రశక్తి యెన్నఁడో
రాఁబోవును అని యిప్పుడే నిరాశ్రయుఁడై యుండుట నేను గో
న్నాళ్లమీఁద నిట్టనిలిచి పరువెత్తగలను. నాకితరులతో నితర
సాధనములతో నేమి పనియని దోఁగాడు పసిబిడ్డ చెప్పినట్టేయ
గును. సమాశ్రయణము పాణిగ్రహణము వంటిది. ఒకపురుషు
నకు భార్యకాఁబోవు కన్య నాదేహమునందుఁ గొంత నేను న్స్వా
ధీనమందుంచుకొనెదను. భర్తవశముచేయను అనిన నావివా
హము పూర్ణమా? నీవు నామగఁడవు నేనునీకు భార్య నయ్యె
దననిన చెప్పి యట్లుండిన నది విటీవిటుల సంభాషణమే కాని
వివాహమగునా? హోమము దానము సప్తపది మంగళసూ
త్రము పాణిగ్రహణ మనఁబడునుగాని పాణిగ్రహణ మనఁగాఁ
జేతిని బట్టుకొనుటయేకదా. చేతిని బట్టుకొనినఁజాలును. మెడ
లో మంగళసూత్ర మేల యనిన నేమి చెప్పవలయును? కావున
నేకార్యమందును త్రికరణశుద్ధి శాస్త్రవిధానము సాంగకర్మాచ
రణమత్యంతావశ్యకములు అనివార్యములు ఈపాణిగ్రహణవి
ధానము వేశ్యలకనావశ్యకము ఏల? వారుస్వైరిణులు. గృ
హిణులు కారు. సామాన్యలుగావున వారికి సర్వపురుషులయం
దు సమానదృష్టి. వారు లోకదాసికలే కాని యొకనికి దాసికలు

గారు. సమాశ్రయణమయి నియమమునకు విరుద్ధముగఁ జరించువారు అంకుటాంద్రవంటివారు. పతిని మాత్ర మనుసరించుట వ్రతముగాఁ గలవారు పతివ్రతలు. కావున నీమూఁడుమార్గములలో వారు వారు వారి వారి యిష్టము వచ్చినట్లు వర్తింపవచ్చును. పతివ్రతలు భక్తులు సమానులని సంజీవని పలుమాఱు వచించియే యున్నది కావున స్త్రీలకుఁ బాణిగ్రహణమువలె విష్ణుభక్తుల కందఱకు సమాశ్రయణ మావశ్యకమై యున్నది కావున నేదాసోహంభావముగల విశిష్టాద్వైతులు ద్వైతులు దీనినను ష్ఠించుచున్నారు. పెక్కురు అహంబ్రహ్మాస్మి యనువా రట్టిదశకు రాకున్నను వచ్చుటకైన యత్నింపకున్నను యత్నించిననునది సాధ్యముగాకున్నను అట్లగు విధానముగాని యామాట కర్థముగాని తా మేమతమువారమని యందురో యామాటకర్థముగాని యనేకులకు తెలియకున్నను పేరునందు నభిమానము మాత్రము వహించి సోహంతలేక దాసోహంతరాక ఉభయభ్రష్టులు తత్తో భ్రష్టు లగుచున్నారు ఇందుఁ గొందఱు పరుల వెక్కిరింపఁ బోయి వెల్లకిలఁ బడుచున్నారు. ఈసమాశ్రయణమునకే పంచ సంస్కారవిధి యనియుఁ బేరు. ఇట్టి పంచ సంస్కార విధిని బొందినవారే ప్రపన్నులు.

శ్లో॥ సంస్కృతాః పంచసంస్కారైః, స్తాపాద్యైర్వైమలైశ్శుభైః
నారాయణం ప్రపద్యేరన్, నరావై మోక్షకాంక్షిణః॥

మోక్షకాంక్షగలనరులు శుభకరమై పాపములను హరించునదియై తాపాదులచేఁ గూడినదగు పంచసంస్కారవిధిచే సంస్కరింపఁబడినవారు నారాయణునిఁ గూర్చి ప్రపత్తిచేయుదురు అని ప్రశ్నసంహితయందుఁ గలదు

శ్లో॥ అచక్రధారిణాం మంత్ర, మధ్యాపయతి దేశికః
శిష్యేణ నరకంయాతి, కల్పకోటిశతం ద్విజః
తస్మాత్తాపాదిసంస్కారం, కృత్వామంత్రమనుత్తమం
అధ్యాపయేద్గురుస్సమ్య, గన్యథా నరకం వ్రజేత్ ॥

చక్రధారణములేని శిష్యునిచే నేబ్రాహ్మణుఁడు నారాయణాష్టాక్షరీమంత్రము నధ్యయనము చేయించునో వాఁడు దీర్ఘకాలము నరకము పాలగును. కావునఁ దాపాది సంస్కారములయినవానికే యనుత్తమనారాయణ మంత్రము నుపదేశింపవలయును. అని పరాశరధర్మశాస్త్రము చెప్పుచున్నది.

శ్లో॥ ముముక్షు శ్చక్రచిహ్నాది, రహితో యది మాధవమ్
ప్రపద్యేత నరో మోహా, త్స చండాలో భవేద్ధ్రువమ్॥

మోక్షమునందాసక్తిగలవాఁడయ్యు చక్రాదిచిహ్నములులేక యెవఁడు మోహముచేఁ బ్రపత్తిచేయునోవాఁడు చండాలుఁడగును. అని నారదసంహిత

శ్లో॥ విప్రాద్యాస్తేచ శూద్రాశ్చ, యదైవకృతలక్షణాః
తదా తు యోగ్యావిజ్ఞేయా, హరిసంశ్రయణాదిషు॥

విప్రులు మొదలయినవారును శూద్రులును ఎప్పుడు చి
హ్నములధరించుచున్నారో యప్పుడు విష్ణు సంశ్రయణమునకు
యోగ్యులగుచున్నారు. అని విష్ణుమందిరమందుఁగలదు.

శ్లో॥ తస్మాత్త్వమసి రాజర్షే, విష్ణుసాయుజ్య మిచ్ఛసి
దీక్షామార్గవిధానేన, ధారయిత్వా సుదర్శనమ్॥
నారాయణపదద్వంద్వం, తదేకం శరణంవ్రజ

నీవు విష్ణుసాయుజ్యము కోరుచున్నావు కావున నోయి
రాజర్షి దీక్షామార్గము ననుసరించి చక్రము ధరించి నారాయ
ణచరణారవిందములను మాత్రమే శరణుచొరుము అని పద్మపు
రాణము ఉత్తరఖండమునఁగలదు. ఇట్టి ప్రమాణము లింకను
గలవు. దీనివలన నారాయణప్రపత్తి చేయువారికిఁ బంచసం
స్కారదీక్ష యత్యావశ్యకమని యేర్పడుచున్నది. తాపనము,
పుండ్రధారణము, దాస్యనామకరణము, మంత్రోపదేశము, భగ
వదారాధనము అనునవి పంచసంస్కారములనఁబడును. దీనికే
పరమసంస్కారమనియుఁ బేరుగలదు. ఈపరమసంస్కారము
నకు నాలుగువర్ణములవారు యోగ్యులే ఇందుఁ దప్తచక్రధా
రణము ద్విజులకు నందుఁ బురుషులకు ననివార్యము

శ్లో॥ ద్విజాతీనామిదంప్రోక్తం, తప్తచక్రస్యధారణమ్
అతప్తంవాపిశూద్రాణాం, భవేయుర్వైష్ణవా యది॥

ఈతప్తచక్రధారణము ద్విజులకుఁ జెప్పఁబడినది. విష్ణుభక్తిగలవారైరేని శూద్రులుఁ దప్తము కాకపోయినను ధరింపవచ్చును.

శ్లో॥ స్త్రీణామనుపనీతానాం, శూద్రాణాం చ విశేషతః
లాంఛనం శంఖచక్రాభ్యాం, తత్రహోమం నకారయేత్ ॥

స్త్రీలు ఉపనయనము కానివారు శూద్రులు వీరు శంఖచక్రములధరింపవలయునుగాని సుదర్శనహోమము చేయవలసిన పనిలేదు.

ఈవాక్యములవలన బ్రహ్మక్షత్రియ వైశ్యులందుఁ బురుషులు తప్తచక్రాంకనమునే ధరింపవలయును. స్త్రీలును ఉపనయనముకానివారును శూద్రులును వారివారి రుచిప్రకారము తప్తమైనను నతప్తమైనను ధరింపవచ్చును అయినను ఇప్పుడందఱు తప్తమునుధరించుటే సంప్రదాయమైనది. ఏకకాలమునఁ దప్తచక్రాంకనము గోరువారందఱు శూద్రులైరేని ముందొక ద్విజుఁడుధరింపఁజేసి యావలఁ దక్కినవారికిఁజేయుట యాచారమైనది. ఇట్లుండ,

శ్లో॥ తప్తముద్రాంకితందృష్ట్వా, శివలింగధరం తథా
ఆదిత్యమండలంవీక్ష్య, నత్వా స్తుత్వా విశుద్ధ్యతి॥

తప్తముద్రాంకితుని జూచినను శివలింగమును ధరించినవానిఁజూచినను సూర్యమండలమును జూచి నమస్కరించి స్తు

తించి పరిశుద్ధుఁడగును. అను నిట్టి యాక్షేపము లశాస్త్రీయకృతముల కన్వయించును ఇందుఁ జెప్పఁబడిన రెండును దుష్టములుగావు. శైవదీక్ష కింగమగు లింగధారణము సర్వదా శివస్మరణమున కనుకూలమగుచున్నది. లింగధారులు ప్రతిదినము పూఁటపూఁటకు ముందాలింగమును జేతిలోనుంచుకొనియైనఁ బూజించి యాతీర్థము తీసికొనియే భుజింతురు. ఇట్టివారి నాక్షేపించుట పాప మార్జించుట కనియే సంజీవని యభిప్రాయము. నీచపు లోహములచేఁ జేయఁబడి యిహమునకుఁ బరమునకు నెక్కని లాకెట్టులను పనికిమాలిన బిళ్లలను ధరించుట పుణ్యమును శివలింగమును భక్తితోధరించి దానిఁ బూజించుట పాపమా? దైవమును స్మరింపఁజేయునది యేదియైనను దోషము కాదు. శాస్త్రవిశ్వాసములేని సర్వభ్రష్టులకు నేదియు ననావశ్యకమేకాని దైవభక్తి శాస్త్రవిశ్వాసముగలవారికిఁ బుండ్రమెట్లనివార్యమో యట్లు విష్ణుభక్తిగలవారికిఁ జక్రాంకనము శివభక్తిగలవారికి లింగధారణ మత్యంతావశ్యకములు వానివలనవచ్చునష్టి యేదియులేదు. కాని వివేకముగలవానికి లాభమెంతో గలదు. పరమతద్వేషదూషితచిత్తుల యున్మత్తప్రలాపముల విని యాయాసంప్రదాయజ్ఞులు తమ సదాచారములు మానకయుండురుగాకయని సంజీవని ప్రార్థించుచున్నది.

శ్లో॥ బ్రాహ్మణస్యతనుర్జ్ఞేయా, సర్వవేదమయీ యతః
తస్మాన్న తాపయేద్విద్వాన్, చక్రలింగాది హేతిభిః॥

అంకనం శంఖచక్రాద్యైః, ద్విజో దేహే నధారయేత్
ఏక జాతే రయంధర్మో, నద్విజానాం కదాచన॥

బ్రాహ్మణుని దేహము సర్వవేదమయము కావున దానిని చక్రలింగాదులచే దహింపఁజేయరాదు. బ్రాహ్మణుఁడు దేహమునందు శంఖచక్రాదులచిహ్నములను ధరింపరాదు. ఇది శూద్రులకు ధర్మమే కాని ద్విజులకుఁగాదు.

ఇత్యాదివాక్యములు విధి ననుసరించి హోమాగ్ని యందుఁ దప్తముకాని చక్రాంకనములవిషయమే కాని విధిరూపమున శాస్త్రప్రకారము తప్తముచేసినవాని విషయముగాదు.

శ్లో॥ హుతాగ్నితప్తచక్రాద్యై, రాయుధైః పంచభిర్ద్విజాః
ప్రతప్తబాహుమూలా యే ప్రాప్నుయుస్తే పరంపదమ్
లౌకికాగ్నిషు సంతప్తై శ్చక్రాద్యైర్యదిలాంఛితాః
ద్విజాదయోమహారాజప్రాప్నుయుర్నరకంధ్రువమ్॥ నారదః
పద్మపురాణము, ఉత్తరఖండము త్రింశాధ్యాయము.

శ్లో॥ హుతాగ్నినైవ సంతప్య సర్వపాపానుత్తయే
చక్రంవా శంఖచక్రేవా, తథా పంచాయుధానివా
ధారయిత్వైవ విధివద్బ్రహ్మ కర్మసమాచరేత్
హుతాగ్నితప్తచక్రేణ, శరీరంయస్య చిహ్నితమ్
తేన తీర్థాని యజ్ఞాశ్చ, సంప్రాప్తా నాత్ర సంశయః

అధృత్వా విధినాచక్రం, బ్రాహ్మణోజ్ఞానదుర్లభః
గర్హితస్సర్వలోకేషు, బ్రాహ్మణ్యా త్ప్రచ్యుతోభవేత్
అధృత్వా విధినాచక్రం, బ్రాహ్మణః ప్రాకృతోభవేత్
నతస్య కించిదశ్నీయా,దపిక్రతుసహస్రిణః
బ్రాహ్మణ్యమంత్రసిద్ధ్యైచ జ్ఞానసిద్ధ్యైవిముక్తయే
సర్వాశ్రమేషు వసతాం బ్రాహ్మణానాం విశేషతః
విధినా వైష్ణవం చక్రం ధార్యం హి శ్రుతిచోదితమ్॥

ఇట్టిప్రమాణవాక్యములనేకములు గలవు.

వీనికర్థము.

హోమాగ్నియందుఁ దాపముచేయఁబడిన చక్రాదులతో నైదింటితో నెవఁడు భుజములను దప్తము చేయించుకొనునో వాఁడు పరమపదమును బొందును. లౌకికాగ్నియందుఁ దప్తమైనవానిచే ధరించు ద్విజాదులు నరకము పాలగుదురు. పాపములన్నియు నశించుకొఱకు శంఖచక్రములుగాని పంచాయుధములుగాని హోమాగ్నియందుఁ దప్తమైనవానినే ధరింపవలయును. శాస్త్రప్రకారముధరించియే బ్రహ్మకర్మము నాచరింపవలెను. హోమాగ్నిచేఁ దప్తమైన చక్రమును ధరించువాఁడు తీర్థములందు స్నానము చేసినఫలము యజ్ఞములు చేసిన ఫలము నొందును.

శాస్త్రప్రకారము చక్రమును ధరింపని విప్రుఁడు జ్ఞాన దుర్లభుఁడై లోకగర్హితుఁడై బ్రాహ్మణ్యమునుండి పతితుఁడగును. వాఁడు నూఱుయజ్ఞములుచేసినవాఁడైనను వానిపదార్థము దినరాదు. బ్రాహ్మణత్వము నిమిత్తము మంత్రసిద్ధినిమిత్తము జ్ఞానసిద్ధినిమిత్తము ముక్తిలభించునిమిత్తము నన్నియాశ్రమములవారు అందు ముఖ్యముగ బ్రాహ్మణులు వేదము శాసించుటచే శాస్త్రప్రకారము విష్ణుచక్ర చిహ్నమును ధరింపవలయును.

బ్రాహ్మణుని దేహము వేదమయముకావునఁ దప్తము చేయరాదనికదా యాక్షేపము? బ్రాహ్మణుని బ్రాహ్మణ్యము జన్మార్జితమా?కర్మార్జితమా?ఒకబ్రాహ్మణునకు వేదసంపన్నునకు సజాతి బ్రాహ్మణపత్నియందుఁ బుట్టినవాఁ డొక్కఁడుపనయన సంస్కారము మానెనేని వానిదేహము వేదమయమా? ఉపనయనసంస్కార మయినది. సంధ్యవార్చుటలేదు. వాఁడు బ్రాహ్మణుఁ డగునా? వానిదేహము వేదమయమగునా? ఒకబ్రాహ్మణుఁడు ప్రతిదినము సంధ్యవార్చుచునే యున్నాఁడు నిషిద్ధాహారము దినుచున్నాఁడు. నిషిద్ధసాంగత్య మనఁగా శూద్రస్త్రీతో సంభోగించుచున్నాఁడు. వీఁడు బ్రాహ్మణుఁడా? వీనిదేహము వేదమయమా? ఉప్పులో నూరిన మామిడికాయవలె నే బ్రాహ్మణుని దేహము సంతతవేదాధ్యయనమున నూరి నరము

లు వేదస్వరమునకుఁ బ్రతిభాషించునో యట్టి బ్రాహ్మణుని దేహ
ము వేదమయము గాని తక్కినవారి దేహము లమేధ్య మయ
ములే. కావున బ్రాహ్మణ దేహము వేదమయ మనుట యమే
ధ్యమయ దేహముల కన్వయింపదు ఈ వేదమయ దేహునకే వాత
రోగమువచ్చి కీళ్లుపట్టుకొనిపోయిన దనుకొనుఁడు వైద్యుఁడు
వచ్చికీలెఱిఁగి వాఁతపెట్టుమన్న రీతిసూదితోనో దబ్బనముతోనో
పశువులకు వాఁతలు వేసినట్లు కాల్చె ననుకొనుఁడు. ఆ వేదమయ
దేహ బ్రాహ్మణునిగతి యేమి? వానిని జూచినవారందఱు ప్రా
యశ్చిత్తము పెట్టుకోవలయునుగదా? శిశువులకు కింకవాయుప్పు
వు వచ్చినపుడు సూదులతో బొడ్డుమీఁదనో నొసటనో వాఁత
లువేయుదురే ఆశిశువుల గతియేమి? అగ్నిహోత్రముచేఁ
గాల్చిననే కాల్పుగాని కాస్టిక్కుచే (క్షారము) చేఁ గాల్చినఁ
గాల్పు కాదా? భుజములందు భగవచ్చిహ్నములు ధరించిననే
కాల్పగునుగాని వంటచేయునపుడో ప్రొయ్యిలో కట్టె లెగసన
దోసినపుడో వేఁడినీళ్లలోఁ జేయి పెట్టినపుడో వేఁడియన్నము
తినునపుడో గంధకాది ద్రావకములు తాఁకినపుడో దీపావళి
పండుగనందు బాణములుకాల్చునపుడో చేతులుకాళ్లు కాల్చు
కొన్న నది కాల్పుకాదా? అట్టివారిగతి యేమి? చికిత్సలయం
దు దోషములేదందురేని దేహవ్యాధి కదిచికిత్సయైనచో భవ
రోగవ్యాధికి భగవచ్చక్రాంకనము చికిత్సయే. అది కాదని

యెవరనఁగలరు? వాతరోగమునకు వాఁతలు వైద్యశాస్త్రసమ్మ
తమేని చక్రాంకనము శ్రుతిస్మృతిశతప్రసిద్ధము.

ఇప్పుడు సదాచారనిష్ఠుఁడైన యొకసన్న్యాసి నేను ఎను
బదినాలుగుచెప్పన్నములు వేదము చదివినాను నాతో సంభో
గించినస్త్రీలు దివ్యత్వము నొందుదురని కొందఱస్త్రీలఁ జెఱచి
యొక తెకు దివ్యత్వమునకు సాక్షిగా సంతాన సౌఖ్యము గలి
గించెను. వీని దేహము వేదమయమూ

మహోపనిషత్తునందు బ్రహ్మసూక్తి.

శ్లో॥ దక్షిణేతు భుజే విప్రో, బిభృయా ద్వై సుదర్శనమ్
సవ్యేతు శంఖం బిభృయా, దితి బ్రహ్మవిదో విదుః

బ్రాహ్మణుఁడు కుడిభుజమందుఁ జక్రమును ఎడమభుజమం
దు శంఖమును ధరింపవలయు నని బ్రహ్మవేత్త లెఱుం
గుదురు.

కాణ్వవేదమందు.

దేవాసోయేన విధృతేన బాహునా సుదర్శనేన ప్రా
చాం స్వర్గమాయాంతి నామనవో లోకవిస్పృష్టాతన్వంతి బ్రా
(బ్ర)హ్మణ స్తద్వయంతి సర్వావై దేవతానాం సర్వావై విప్రా
ణాం సర్వావై క్షత్రియాణాం సర్వావై వైశ్యానాం సర్వావై
శూద్రాణా మిత్యగ్నినా వైహోత్రా తప్తచక్రం ద్విభుజే,

ధార్యం అధోర్ధ్వపుండ్ర మాలిఖేత్ తస్మాద్విరేఖం భవతి పునరాగమనంన, బ్రహ్మణస్సాయుజ్యం సలోకతా మాప్నోతి.

అథర్వణసుదర్శనోపనిషత్తునందు,

శ్లో॥ యజ్ఞోపవీతీ ధృతచక్రధారీ యోబ్రహ్మవిద్బ్రహ్మవిదో మనీషా హిరణ్యా మాదాయ సుదర్శనం కృత్వా॥

పవిత్రమి త్యగ్నిః అగ్నిర్వైసహస్రారః సహస్రారో నేమిః నేమినా తప్తతనుః బ్రహ్మణః సాయుజ్యం సలోక మాప్నోతి॥

ఇట్టి ప్రమాణవాక్యములు ఋగ్వేదమందును యజుర్వేదమందును సామమందును గలవు. గ్రంథ విస్తరభీతినవి యన్నియు నుదాహరింపఁబడవయ్యెను. దీనివలన నాలుగు వర్ణముల వారును హోమాగ్నితప్తమైన చక్రాంకనము ధరింపవలయుననియు దానివలన పరబ్రహ్మసాయుజ్యము సాలోక్యముప్రాప్తించుననియుఁ దెలియనయ్యెడిని. ఈవిషయ మింకను దెలియఁగోరువారు వృద్ధమను వాసిష్ఠ విహగేంద్ర శాండిల్య పరాశర విష్ణుతత్త్వ వామనాదిలైంగ గార్గేయ స్కాంద బ్రహ్మాండ బ్రహ్మకైవర్త పాద్మ వారాహగారుడ శేషధర్మ పాంచరాత్రాగమములందును జూడవచ్చును

అమంత్రక భస్మధారణము నిషిద్ధమైనట్టు లమంత్రకచక్రాంకనము నిషిద్ధము. ఈసంప్రదాయ మితరమతములవారి విరోధనిరోధములచేఁ బడుపాటగుచుండుట లేదుగాని దీని నుద్ధ

రింపవలసినభార మెవరియందున్నదో వారిధనాశవలననే పక్షు పాటగుచున్నది.

ఈసంప్రదాయమందు భక్తిశ్రద్ధలుగలవారుగూడ నాచార్యునిభార్యకు రు౫౦-౦-౦ లచీర ఆచార్యునకు రు ౨౫-౦-౦ దోవతులు తదుపరి నాచార్య ప్రాచార్యేత్యాది సంభావన లీయలేక వీనికి భయపడి దీనిని మానుకొనుచున్నారు.

సశేషము.

ప్రశ్నము. ఇప్పుడు కొందఱు స్వాములమని పరమహంసలమని వచ్చి యుపదేశములు చేయుచున్నారు. మీజాతియేది యనినఁ జెప్పరు. జాతితో నేమిపని? ఏజాతియైన నేమి యనుచున్నారు ఇట్టివారిని గురువులుగా స్వీకరింప వచ్చునా ?

ఉత్తరము. ఇఁక ముందుపోవును గాని యింతవఱకుఁ బ్రతిమనుష్యునకు మనదేశమున జాత్యభిమానము గలదు. ఉండవలయును. వాసుదాసునొద్ద దూదేకులజాతికిఁ జేరిన యొకఁడు సేవకుడుగా నుండెను. వాఁడు చూచుటకు శూద్రుఁడుగా నుండును. పేరు హిందువులపేరు. ఎల్లప్ప. వీని నొకరు నీవెల్లప్పయని పేరుపెట్టుకొంటివే యేజాతి శూద్రుఁడవని యొకపల్లెలో నడిగిరి వానికిఁ జిఱ్ఱునఁ గోపమువచ్చి కులము దాఁచిపెట్టుమని యెదవా? మేము దూదేకులవార మనెను.

ఒకజాతియందుఁబుట్టి మఱియొక జాతిపేరు చెప్పువాఁడు తనతల్లి లంజెయని తాను అన్యబీజమునకుఁ బుట్టినవాఁడని చెప్పుకొన్నట్టే. అందుసందేహములేదు. జాతిపేరు చెప్పనివాఁడు నాలుగువర్ణములలోఁ జేరినవాఁడు కాఁడని ధైర్యముగఁ జెప్పవచ్చును. ఎఱుకలు ఏనాదులు తుదకుఁ బంచములుకూడ తమ జాతిపేరు దాఁపరు. పలుజాతులకుఁ బుట్టినవాఁడు తానెవ్వరి రేతస్సునకుఁ బుట్టినది తెలియదు కావునఁ జెప్పుకోలేక పోవచ్చును. లేక హీనజాతుఁడై యుత్తమ జాతులను మోసము చేయుటకై జాతిదాఁచినను దాఁచియుండవచ్చును.

శ్లో॥ యస్య నజ్ఞాయతే శీలం, కులం తస్య చ సంశ్రయమ్
నతస్య సంగతిం కుర్యా,ది త్యువాచ బృహస్పతిః

ఎవనినడవడి తెలియదో యెవనికులము తెలియదో యెవఁడు పుట్టినది పెరిఁగినది యుండునది మొదలయిన యాశ్రయము తెలియదో యట్టివాని సాంగత్యమేచేయరాదనియుండ నీకుఁ గులము తెలియనివానిని గురువుగా గ్రహింపవచ్చునా యనిననేమి చెప్పవలయును? అట్టివానిని గురువుగాఁగొని గురుపరంపర యేమని చెప్పుదురు? పాలో యమ్మ పాలోయని వీధిలోనమ్మువారిని నేపాలమ్మా ఆవుపాలా బఱ్ఱెపాలాయని యడిగిన దోషమా? అమ్మెడివా రేపాలైన నీ కేమి యనవచ్చు

నా? అట్లు చెప్పకుండుట మోసబుద్ధిచేతనే కదా. ప్రాకృతపదార్థ ములందే యిట్టిజ్ఞాన మావశ్యకమై యుండ నధ్యాత్మ విషయ మిందిట్టి విచారమత్యం తావశ్యకమని వేఱుగఁజెప్పవలయునా? అందు మోసగాండ్రు వెల్లివిరిసియుండు నీకాలమున లోకులు హెచ్చరికగలిగియుండుట మిక్కిలి యావశ్యకము. నీచజాతివా రిని గురువులుగా గ్రహించి నీచజన్మములకుఁ బోవుటకంటె నజ్ఞులై యున్నస్థితియందుండుట క్షేమకరము. దోషము తెలివి మాలిన యాశిష్యులదేకాని యామోసగురువులదికాదు. పురు గులుపోయి మంటలోఁబడిన దోషమెవరిది? మీరు వచ్చినా లోఁబడి చావుఁడని మంట ప్రార్థించెనా? కెంపనుకొని నిప్పును దాఁకినఁ గాల్పక మానునా?

—భక్తిసంజీవనీ పాఠశాల—

ఒంమిట్ట.

ప్రధానోపన్యాసకుఁడు వాసుదాసుఁడు

సహాయోపన్యాసకుఁడు—యామర్తి వేంకటసుబ్బదాసుఁడు.

బోధవిషయము.

భక్తి—జ్ఞాన—కర్మయోగాదులగుఱించి యుపన్యాసరూప ముగనేదైన భక్తిగ్రంథము నాధారముగఁజేసికొని చెప్పఁబడును.

కాలము.

అమావాస్య, పూర్ణిమలు, పాడ్యములు, ఉత్సవదిన ములు సంచారముచేయుదినములు తప్పఁ దక్కినదినములందు పగలు ౨ మొదలు 3 గంటలవఱకు

ఉపాధ్యాయవేతనము. ఆయన చెప్పినదివిని ఆప్ర
కారము నడచుటయే

వినువారు.జీతమియ్యవలసినది లేదుగాని వారివారి భోజ
నవసతులు వారువారేర్పాటు చేసికొనవలయును. విజయదశ
మినుండి యీపాఠశాల ప్రారంభము.

ముముక్షుహితచర్య చదివి విషయములు బోధింపఁబడి
నవి భగవద్గీత ప్రారంభింపఁబడినది.

కోదండరామసేవక సమాజసభ్యులు తమకు వాసుదా
సుఁ డేమియుఁ జెప్పలేదని యనవలసిన పనిలేదు. భక్తిశ్రద్ధలు
గలవారు వచ్చి వినవచ్చును. ప్రారబ్ధ మడ్డపడినవారు మానవ
చ్చును. చెప్పవలసినవిషయము లన్నియుఁ బూర్ణముగ నిందు
బోధింపఁబడును. సందేహములుగలవా రడుగవచ్చును.

గ్రామసంచారసమయమున నిది సాధ్యపడదు. అన్య
గ్రామములందుఁ బెక్కునాళ్లుండుటకు సాధ్యపడదు.కావున నిది
యొంటిమిట్టయందున్నప్పుడు జరుగవలసియున్నది.

— శివకేశవతారతమ్యము. —

"ఏకోదేవః కేశవోవా శివోవా"

అను నీభర్తృహరివాక్యమును బంగారక్షరములతో
వ్రాసి యుంచుకొనఁదగినది. కేశవుఁడో శివుఁడో దేవుఁ డొ
క్కఁడేయని దీని యర్థము. దీనివివరణము నాయనయే

శ్లో॥ మహేశ్వరేవా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదంత రాత్మని
న వస్తుభేద ప్రతిపత్తి రస్తు మే
తథాపి భక్తి స్తరుణేందుశేఖరే॥

ప్రపంచమునకు నధిపతియగు మహేశ్వరునందుఁగాని జగదంతరాత్మయగు నారాయణునందుఁగాని యీయన యొక వస్తువు. ఆయనమఱియొకవస్తువు అనుభేదబుద్ధి నాకు లేదు. అట్లులున్ననునాకు భక్తి శివునందే యని యీశ్లోకమునకర్థము. భక్తి స్వభావసిద్ధమైనది. జన్మముచేఁ గర్మముచే వచ్చునది కాదు. పూర్వజన్మవాసనాబలమున సంస్కారవశమునవచ్చును వర్ణమునుబట్టి భక్తిరాదు. వంశమునుబట్టి భక్తిరాదు. పూర్వజన్మమున నేది యభ్యసించెనో యదియే యీజన్మమున వచ్చును. భక్తి యాత్మవిషయము. ఒకవంశమందు జన్మించుట ఋణానుబంధవిషయము. ఋణముకొలఁది శైవుఁడైన తండ్రికి శైవవంశమునఁ బుట్టినంతమాత్రమునఁ దాను శైవుఁడుగా నుండవలయునను నిర్బంధములేదు. ప్రహ్లాద విభీషణాదులే దీనికిఁ బౌరాణికసాక్షులు. సంస్కారముకొలఁది మనస్సు పోవును. స్వభావము దురతిక్రమము. సంస్కారమొకప్రక్కకీడ్చుచుండఁ దా నొకప్రక్క కీడ్చెనేని యుభయభ్రష్టుఁ డగును.

శ్లో॥ శైవావయం నఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీ జపపరా నితరాం తథాపి

చేతో మదీయ మతసీకుసు మావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్॥

కృష్ణకర్ణామృతమ్.

అర్థము.

మేము శైవులము. అది విచారింపవలసిన విషయము గాదు. విశేషముగ శివపంచాక్షరి జపము చేయువారము. అయినను నామనస్సు అవిసెపూవువన్నెచేఁ బ్రకాశించుచుఁ జిఱునవ్వుగల మోమున విలసిల్లు గొల్లదానిపిల్లవానినే స్మరించుచున్నది.

ఇట్లు చేయుటచే లీలాశుకుఁడు ముక్తుఁ డయ్యెనుగాని భ్రష్టుఁడు గాలేదు.

ఇఁక బమ్మెరపోతన తలిదండ్రులగుఱించి యాయనయే యిట్లు చెప్పెను. ఈయనతండ్రి కేసన (కేశవన్న) తల్లి లక్కమాంబ (లక్ష్మమ్మ)

తనకు లక్కమాంబ ధర్మగేహినిగాఁగ మనియె శైవశాస్త్రమతముఁ గనియె. అని తండ్రిగుఱించి చెప్పెను

ఉ. సదాశివ పాదయుగార్చ నానుకం

పా నయవాగ్భవానికిని బమ్మెర కేసన లక్కసానికిన్ అని తల్లినిగుఱించి చెప్పెను.

కం. ఆమానినికిం బుట్టితి

మే మిరువుర మగ్రజాతుఁ డీశ్వర సేవాకాముఁడు తిప్పన అని తనయన్నను గుఱించి చెప్పెను.

ఇట్లు తన తల్లిదండ్రి యన్న శైవులై యుండ బమ్మెరపో తన వైష్ణవుఁడయ్యెను

గతజన్మఋణానుబంధముకొలఁది దాపరించువారుతల్లి దండ్రులు సోదరులు. ఆత్మసంస్కారవశమున లభించునది భక్తి పోయినజన్మమున నేదేవతయందు భక్తినభ్యసించి యుండునో యాదేవతయందే యీజన్మమున నప్రయత్నముగ భక్తి లభించును. ఇట్టి భక్తులలో శైవులు వైష్ణవులు శాక్తేయులు విశేషించియున్నారు.

కేవల శివునకే పరత్వముఁ జెప్పుచు శివుఁడే పరతత్త్వ మని మోక్షదాతయని, విష్ణ్వాదు లతనికంటెఁ దక్కువవారై యాయనయాజ్ఞకు లోపడి కార్యములు చేయువారని శైవులు చెప్పుదురు వీరు విష్ణు నధమునిఁగాఁ జూతురు ఆయనను గొం దఱు ద్వేషించుటయుఁ గలదు. వీరే యారాధ్యులు. లింగా యతులులోనగు వీరశైవులు.

వీరు శైవవిశిష్టాద్వైతులు. వైష్ణవ విశిష్టాద్వైతు లుత్తముఁ డని విష్ణువును జెప్పెడుచోటులనెల్ల వీరు శివునిఁ జెప్పె దరు. మతమునందు భేదములేదు. వీరు పరదైవ మొక్కఁడే యాయనపేరు శివుఁ డందురు. సంధ్యవార్చునపుడు వైష్ణవులు

కేశవాది నామములు చెప్పిన వీరు శివాదినామములు చెప్ప దరు. వీరు రుద్రాక్షలు భస్మమునుధరింతురు. లింగాయతులు లింగమును ధరింతురు. వీరిది యేకభక్తి. అది శివునియందే యుంతురు. వీరు తిర్యక్పుండ్రధారులు. దేవతార్చనకు మారేడు పత్రి వీరికి శ్రేష్ఠము.

వైష్ణవులో విష్ణువే పరతత్త్వమని చెప్పుచు నాయనకే పరత్వముఁజెప్పుదురు. మోక్షదానాధికారి యాయనయే కాని శివుఁడుకాని మఱియెవ్వరుకాని కాఁడందురు. శివాదులు విష్ణ్వంశజులనియు నాయన యాజ్ఞ శిరసావహించి కార్యములు చేయుచుందురనియుఁ జెప్పుదురు. వీరు శివుని హీనదృష్టిఁ జూతురు. కొందఱు ద్వేషించుటయుఁ గలదు. వీరూర్ధ్వ పుండ్రమును ధరింతురు. తులసిమాలలు తామరపూసలసర ములు ధరింతురు. దేవతార్చనకుఁ దులసి వీరికి శ్రేష్ఠము. వీరు సర్వకార్యములు విష్ణునామముతోనే తీర్తురు. వీరిది యేకభక్తి. దేవుఁ డొకఁడే యాయన పేరు నారాయణుఁడని విష్ణువని వా సుదేవుఁడని యందురు.

శక్తిని బూజించువారు శాక్తేయులు వీరు శివశక్తు లొక్కటేయని వాదించినను శక్తికే ప్రాధాన్యమిత్తురు. ఈ క్రిందివాక్యములు వీరిమతతత్త్వమును దెలుపఁగలవు.

శ్లో॥ శివః శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి

అతస్త్వా మారాధ్యాం హరిహర విరించ్యాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కధ మకృతపుణ్యః ప్రభవతి.

అర్థము.

శక్తితోఁగూడినపుడే శివుఁడు సృష్టింప సామర్థ్యముగలవాఁడు. ఆమె లేదాయెనా శివుఁడు కదలుటకును శక్తుఁడు గాఁడు. ఇట్లుండఁ బుణ్యముసేయని నేను హరిహర బ్రహ్మాదులచే నారాధింపఁబడు నిన్ను నమస్కరించుటకు స్తుతించుటకు నెట్లుశక్తుఁడఁ గాఁగలను.

శ్లో॥ తనీయాంశం పాంసుం తవచరణపంకేరుహాభవం
విరించిః సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్
వహ త్యేనం శౌరిః కధమపి సహస్రేణ శిరసాం
హరః సంక్షు భ్యైనం భజతి భసి తోద్ధూళన విధిమ్॥

అర్థము

నీపాదరేణువులోని యొక్క యల్పభాగము గ్రహించి బ్రహ్మదేవుఁడు సృష్టిచేయ శక్తుఁడయ్యెను శౌరి తనసహస్రఫణములచే నెట్లెట్లో భూమిని భరింప శక్తుఁ డయ్యెను. హరుఁడు వారు సృష్టించిన రక్షించిన ప్రపంచమునంతయు భస్మముచేసి యాబూది దేహమునఁ బూసికొనును. వీరు శక్తిశక్తుల కభేదము చెప్పినను దృష్టిపధమిట్లున్నది ఈశ్లోకము లానందలహరిలోనివి. వీరి శివశక్తికి వైష్ణవుల లక్ష్మికి గుణములందు

విశేష భేదములేదు గాని వీరు మగనిచే భార్యకు మోక్షమిత్తురు. వా రట్లుచేయరు. వీరిమతమునకు విశిష్టాద్వైతమునకుఁ గడపటఁ గొంచెముభేదముతప్పఁ దక్కినదానియందు భేదము లేదు. వీరిలో మాంసభక్షకులు మదిరాపాయులుగలరు. వీరిప్రశంస యక్కఱలేదు.

జగత్సృష్టిస్థితి సంహారములకు ముక్తినొసఁగుటకు శక్తిమంతుఁ డెవ్వఁడో వాఁడు దేవుఁడు. ఈకార్యములు చేయఁగలవాఁడు విష్ణు వొక్కఁడేయని వైష్ణవులనుచున్నారు. శివుఁడని శైవు లనుచున్నారు. ఇందు యథార్థ మేది?

విష్ణువున కేయధికారములు నేగుణములు గలవని వైష్ణవులు చెప్పెదరో శివునకు శైవులాగుణములే యాయధికారములే చెప్పెదురు. అట్టి యధికారములు గుణములు కలవాఁడొక్కఁడే కాని యిరువురు లేరని శాస్త్రములు చెప్పినపుడు ఆరెండు పేర్లొక్కనికే యున్నవనుటయే న్యాయ్యము. సత్యము. కావుననే శివపర్యాయనామములన్నియు విష్ణువునం దన్వయించుచున్నవని వైష్ణవులందురు. అప్పయ్యదీక్షితులవారు నారాయణశబ్దము దప్పఁ దక్కినవన్నియు శివపర్యాయముగ' సాధించిరి. అంతశ్రమ మిప్పుడు పడవలసిన పనిలేదుగాని మచ్చునకై కొన్నినామము లుదాహరించుచున్నాను.

| నామము. | అర్థము. |
|---|---|
| శంభువు | సుఖము కలిగించువాఁడు. |
| ఈశుఁడు- | ఐశ్వర్యము గలవాఁడు. |
| పశుపతి- | జీవకోటిని బాలించువాఁడు, |
| శివుఁడు- | ఆనందస్వరూపుఁడు. |
| ... | శుభముతోఁ గూడినవాఁడు. |
| ... | సాధువుల మనస్సుల యందు |
| ... | శయనించి యుండువాఁడు. |
| మహేశ్వరుఁడు- | శ్రేష్ఠుఁడైన యీశ్వరుఁడు. |
| ఈశుఁడు- | ప్రభుత్వము గలవాఁడు |
| శంకరుఁడు- | సుఖము కలిగించు వాఁడు. |
| హరుఁడు- | పాపముల హరించువాఁడు. |
| మృడుఁడు- | భక్తులకు సుఖమిచ్చువాఁడు. |

ఈ ప్రకారము గుణవాచకములన్నియు విష్ణువునందు నన్వయించును. నేనుజెప్పునది శైవులెవ్వనికిఁ బరత్వము చెప్పె దరో యాపరమశివునిగుఱించియే కాని దేవతలలో దిక్పాలుఁ డుగ నుండు శివునిగుఱించికాదు. మహావిష్ణువన్నప్పుడు వసువు లలో నొకఁడైన విష్ణువుగుఱించి యెట్లుకాదో యట్లేశివుఁడన్న ప్పుడుపరమశివునిగుఱించి కాదని తెలియవలయును. శ్వేతా శ్వతరోపనిషత్తునందు విష్ణుశబ్దమే లేదు అన్నియు శివనామ

ములే. అయినను వైష్ణవులు వానినన్నిటిని విష్ణుపర్యాయములు గనర్థము చెప్పుచున్నారు. దీనివలన నొకనికే రెండు నామధేయములని గ్రహింపవలయునుగదా.

పరతత్త్వము వేఱు. విభూతులు వేఱు. పరతత్త్వమంశి. విభూతు లంశములు. రెండును పరతత్త్వము లని గ్రహించితిమేని వస్తుభేదములేమిచే భేదము రాదు. వచ్చుటకు వలనుపడదు. ఒకచోటఁబరతత్త్వమును గ్రహించి రెండవచోట విభూతిని గ్రహించిన హెచ్చుతగ్గులు కానవచ్చును. భేదప్రతిపత్తి కిది కారణము మూర్తి యొకఁడే యైనప్పుడు రూపమొకటిగా నుండక రెండువిధములుగా నుండనేల యను ప్రశ్నము వచ్చును. కార్యభేదమువలన రూపభేదము.

సృష్టిస్థితిసంహారములు చేయువాఁడును ముక్తి నిచ్చువాఁడొక్కఁడేయని మీఁదఁ జెప్పఁబడెను కావున నొకరూపముతో నొక కార్యము మఱియొకరూపముతో మఱియొక కార్యము చేయుచున్నవాఁడు. కార్యమునకుఁ దగినవేషము వేషమునకుఁ దగినభాష లోకవిరుద్ధము కాదు గదా? ఒకఁడు బిడ్డలను బుట్టించుటకై భార్యప్రక్కలోఁబండుకొన్నప్పుడుండు వేషము పుట్టిన బిడ్డలకుఁ బాలునీళ్లు పోయునపుడు ధరించునా? బిడ్డలను దండించునపుడు ధరించునా? దండించునపుడు ముఖము మటమటలాడుచుండును. కన్నుల నిప్పులు గ్రక్కుచుండును. మాట భైరవ

ముగా నుండును. చేత దండాయుధ ముండును. మీఁద గుడ్డ యుండిన నుండును. లేకుండిన లేకుండును. ఈ వేషము బిడ్డలఁ బుట్టించునపుడు పిల్లవాండ్ర రక్షించునపుడు పనికివచ్చునా?

బిడ్డలపుట్టించువాఁడు రజోగుణయుక్తుఁడై యుండవలయును. రజము లేకున్న బిడ్డలు పుట్టరు. రక్షించువాఁడు సాత్త్వికుఁడై యుండవలయును. కోపము తోఁగూడిన మనస్సుగలదై తల్లిబిడ్డకుఁ బాలిచ్చెనేని యాబిడ్డకుఁ దప్పక రోగమువచ్చును. మటమట మాఁడు మొగముతో నాకులో యన్నము భార్య పెట్టినను దిన బుద్ధిపుట్టునా? మనస్స్వాస్థ్యములేక తినినను మేలుగలదా? కావున సత్త్వగుణము కలవారే పోషింప యోగ్యులు

దండించునపుడు కోపియైయుండవలె. క్రీడించువాఁడు నవ్వుచునే గొంతులు గోయును గాని మేలుగోరినవాఁడు కోపముతోనే చెప్పును. కావున బ్రహ్మయందు రజోగుణము విష్ణువునందు సత్త్వగుణము శివునందుఁ దమోగుణము సర్వగ్రంథములు చెప్పుచున్నవి

పరికరసామ్య మిదివఱకే సంజీవని ప్రకటించియున్నది. కావున మరలఁ జర్వితచర్వణమేల?

స్మశానవాసము, భస్మధారణము, కపాలమాల, సర్పభూషణము, చర్మధారణము, దిగంబరత్వము, భూతప్రేతపిశా

చనహావాసము ఇవన్నియు నసహ్యాములు గావా యందురు. సంహారకార్యము చేయువాఁడు స్మశానమందుండక పురిమేడ యందుండునా? అట్టివానికి స్మశానవాసులు భూతములు పరిచరులుగాక మఱి యెవ్వరగుదురు? అతఁడు భస్మమునుగాక ధరించుటకు శ్రీచందన మెందుండి వచ్చును? అట్టివానికిఁ గపాలములుతప్ప మంచిముత్తెము లెట్లు వచ్చును. స్మశానమందుండి సంహారకార్యములు చేయవలసివచ్చినపు డాప్రదేశమునకుఁ గార్యమునకుఁ దగినవేషము వేయవలయును గాని చలువదోవతులు గట్టుకొని పూలుపెట్టుకొని గంధముపూసికొని ముత్యాలపేరులు మెడలో వ్రేలఁ దాంబూలము నమలుచు సుందరులతో నవ్వుచుఁ బ్రేలుచుస్మశానమునకుఁ బోయి పీనుఁగులకగు కార్యము చేయవలయునా? అది యసంభావితము గాదా? ఇంటనున్నప్పు డీవేషము స్మశానమందున్నప్పు డావేషము. ఇక్కడి కిది యుచితము. అక్కడి కది యుచితము.

తనస్మశానవాసమునకుఁ గారణము శివుఁడు పార్వతి కిట్లుచెప్పి, నట్టు భారతంబున నానుశాసనికపర్వంబునఁ గలదు.

(సశేషము.)

**గుంటూరు మాండలికసభా తృతీయవార్షికోత్సవము**

**జమ్ములపాలెము.**

శ్రీకోదండరామసేవక సమాజమువారిని జమ్ములపాలె మువంగలి భ కసమాజమువా రాహ్వానించి యుండుట సమా

డిశంబరు నెల. గుంటూరుమాండలికసభా తృతీయ వార్షికోత్సవము ౫౮౫

జనభ్యుల కందఱకుఁ దెలిసినవిషమే ఉపసమాజములవారు సభానాయకు నెన్నుకొనవలసియున్నది దానికి యోగ్యులగు వారిపేర్లు పోయిన సంవత్సరమునసే సంజీవని తెలిపియున్నది. నూతనముగ జేరినవారిలో మహారాజశ్రీ జంపాల గోపాలరావు చౌదరీ ఎం. ఏ గారు ప్రముఖులు. వీరు నిజమైన భక్తులు. కార్యనిర్వహణ సమర్థులు. వీరిప్పుడు ఒంగోలు తహశీలుదారుగా నున్నారు. ఈసారి వీరి నెన్నుకొనుట సమాజమునకు శ్రేయస్కరమని సంజీవని యభిప్రాయము సమాజమువారుకోరిరేని తామాకార్యము నిర్వహించెదమని వారంగీకారము సూచించియున్నారు. అయినను బలువురు పలువురి నెన్నక యందఱు నాలోచించుకొని యోగ్యుఁడైన యొకని నెన్నుకొనుట శుభప్రదము. ఉపసమాజములవారి యభిప్రాయము ఈ నెల 10 తేదిలోపల సంజీవనికిఁ దెలియవచ్చినచో నది ప్రకటింప సాధ్యపడును

జమ్ములపాళెము భక్తసమాజమువారును నాహ్వానసంఘము నేర్పఱిచికొని వారిపేర్లును సంఘాధ్యక్షునిపేరును సభయే తేదులందు జరుపనిశ్చయించినదియుఁ దెలుపఁ బ్రార్థితులు.

ఫిబ్రవరి 21-22-23 తేదులందుఁగాని ఫిబ్రవరి 28 మార్చి 1-2 తేదులందుఁగాని జరపుట వారి కనుకూలముగనుండిన బాగు ఫిబ్రవరి 21-22 తేదులు సెలవుదినములు. కావున నవి శాఁదలఁచిన యుద్యోగస్థుల కనుకూలదినములు.

## ఉపసమాజములు.

సమాజశ్రాద్ధమునుగుఱించియు సామాజకుల నడవడి గుఱించియు సంజీవని వ్రాసినవిషయమును గొందఱు సమాజ సభ్యులు చదువనే లేదో చదివినను వారిమనస్సులు తత్పూర్వమే దురభిమానపూరితమై యుండుటచే నదిమనస్సున కెక్కనేలేదో యెక్కినను బ్రారబ్ధమడ్డపడినదో తెలియదు. కోదండరామసేవక సమాజమందుఁ జేరినవారు రెండుసంవత్సరములవఱకుఁ బరస్పర సంబంధములేక యెవరికి వారు వారి వారి శ్రద్ధాభక్తులకొలఁది ప్రార్థనా పత్రమందు బ్రమాణము చేసినట్లు చేయుచుండిరి. ఇప్పుడును గొన్ని గ్రామములం దట్లే యున్నారు. ఆవల సమాజములోఁ జేరినవారొక్కొక్కగ్రామములో నుండువా రందఱుగలసి యొక్కటిగఁ బని చేసిన భాగనియుఁ బరస్పర బోధములచేతను నైకమత్యము చేతను లాభముకలుగునని కోరుటచేతఁ గొన్నిస్థలములం దుప సమాజము లేర్పఱుపవలసివచ్చెను. కొన్ని యుపసమాజము లందలివా రాపద్ధతిప్రకారమే యన్యోన్యమైత్రితోఁ గలిసి భజన లుచేయుచు సంజీవనులను జదివి వినిపించుచుఁ దమకుఁ దెలియనివి పరుల నడిగి తెలిసికొనుచు శ్లాఘింపఁదగిన నడవడిగలవారై యున్నారు. కొందఱో యదియేదో గొప్పపదవి తమకు లభించిన ట్లెంచి మైత్రి తుంగలలోఁ ద్రొక్కి సోదరభావము చూరులలోఁ జెక్కి యాత్మోన్నత్యమును దలపై నెక్కించు

కొని సమాజసభ్యులనే యవమానదృష్టిఁ జూచుచున్నారు. ఇది కేవల శోచనీయము. భజనాదులకో పఠనాదులకో నియమితకాలముగలదేని యప్పు డొకరినొకరు పిలువవలసిన పని లేదు. వారియంతట వారు సకాలమునకు రావలసినదే విధి. పిలిచెడి పనిపెట్టుకొనిరా యందఱను బిలువవసినదే విధి. తక్కినయందఱను బిలిచి యొక్కరినిమాత్రము పిలువకుండుట వచ్చినవారిలో నందఱ నాదరించి యొక్కనిమాత్ర మాదరింపకుండుట యసభ్యుల లక్షణముగాని సాధుల వర్తనము గాదు. ఇది నిష్కారణ మనస్తాపమునకుఁ గారణము. హింస యిదిగాకున్న నిఁక నేది? అయోగ్యతచే సభకు రాఁగూడని వాఁ డుండినయెడల నీయం దీ దుర్గుణము గలదు. కావున నీవు సభకు యోగ్యుఁడవుకావని వానికిఁ జెప్పి వానిని సమాజమునుండి తొలఁగించు ప్రయత్నము చేయవలయును. ఆశౌచాది కారణములచే నలువురిలోవచ్చి కూర్చుండుటకు ననందర్భములుగలవారి కుచితస్థలములఁ జూపవలయును. లేదా సభలు, భజనములు, పఠనములు చాలించుకొని యెవరంతటవారుండవలయును. కొన్నిగ్రామములందు భజనవిషయమైప్రమాణముచేయించుట భజనచేయు విషయమునకే యన్వయించును గాని యెప్పుడు లేరనుకారణముతోనో యావలఁ జేరినారను కారణముతోనోయితరులఁ బరిభవించుటకుఁగాదు. కొందఱు సమాజసభ్యులు జాతిద్వేషములను మతద్వేషములనుపరస్పరవ్య

_క్తి ద్వేషములను అసూయామాత్సర్యములనుదురహంకారదుర భిమానములను నిప్పటికినిమానకుండుటచూచితక్కినవారుమిగు లశోకించి యత్యంతసుందరమైనదేహమం దెచ్చటనోయొకకుష్ఠ పుమచ్చపుట్టి దేహమునకంతయు నింద కలిగించునటు లీయల్ప సంఖ్యాకులచే సమాజమునకంతయు నపకీర్తివచ్చునని భయప డుచున్నారు గుణగౌరవము గౌరవముగాని సంఖ్యాగౌరవము గౌరవముకాదు ఒకపొలమునందు వెయ్యి కంపచెట్లుండుటక న్నఁ బదిఫలవృక్షము లుండుట మేలు. కావున నితరవిషయము లవా రెంతగొప్పవారైనను దుర్గుణములు గలవారు సభయుం దుండ యోగ్యులుగారని సమాజసభ్యులందఱు స్పష్టముగఁ దెలిసికోవలయును ఈసమాజమువారు ౯ మండలములం దు న్నారు. అయినను అదృష్టవశమున నీసమాజకేదారమందు నే వో ౫-౬ మాత్రమే కంపచెట్లున్నవి. తక్కినవన్నియు ఫలవృ క్షములే. ఈకంపచెట్లను బీఁకి పాఱవైచిన సర్వమనవద్యముగ నుండును. లేదా కంపచెట్లే ఫలవృక్షములుగ మాఱవలయును. ముండ్లుకొట్టివేసి ముండ్లచెట్లను పండ్లచెట్టులఁ జేయవలయునని యే సంజీవని శ్రమించుచున్నది. బలవంతులు బలహీనులఁ జేరఁ దీసి రక్షింపవలయును. బుద్ధిమంతు లజ్ఞానులకు బోధము చేయ వలయును. కులీనుఁడ ననుకొనువాఁడు కులహీనుని సాదరదృష్టిఁ జూడవలయును. కన్నులుగలవాఁడు కన్నులులేనివానికి మార్గ

దర్శియై సహాయపడవలయును. ఇది గొప్పవారి వర్తనము. విరుద్ధవర్తనము నీచలక్షణము. నీచులు సభ్యులుగానేరరు. సమాజసభ్యుల చెడునడతలగుఱించి యెప్పుడప్పుడు వ్రాయవలసి వచ్చుట సమాజమునకుఁ గీర్తికరముకాదు. వీనిని జదివినవారీ సమాజమువారి బ్రదుకీమాత్రమా యని తలంతురని సంజీవని యెఱుఁగును. అయినను కోదండరామసేవక సమాజము మేడిపండుగా నుండఁగూడదు. మిరపగింజవలె నుండవలయును. సంజీవని మసిపూసి మారేడు నేరేడును జేయనొల్లదు ఉన్నది దాఁపదు. లేనిదారోపింపదు. ఈసమాజము దుష్టుల సహింపదని లోకమునకు సమాజసభ్యులకుఁ దెలియవలయును. తొమ్మిది మండలములపైకి పైనడవడిగలవారొకయుపసమాజమువారైనను నిదిసహ్యముగాదని యందఱను హెచ్చరించుటకై యిందు వ్రాయవలసి వచ్చెను.

— శ్రీరామాష్టాక్షరీమంత్రార్థము —

జీవస్వరూపలక్షణము.

పూర్వజన్మమందు నీయభ్యాసము విశేషించి చేసినవారి కీజన్మంబున శీఘ్రకాలమందే యాత్మసాక్షాత్కరించును. ఈయనుభవము పలువురకుఁ బలువిధముల నుండును. కావున నిది యిట్టులే యగునని చెప్పసాధ్యపడదు. ఈయాత్మ సాక్షా

త్కారము స్వపాండిత్యమువలన స్వయంకృషివలన పెద్దలసేవ
వలన నిత్యాదికారణములచే సాధ్యమగునది కాదు. కేవలదై
వానుగ్రహములేక రాదు. భక్తిలేక దైవానుగ్రహము రాదు.
అటని కృషిచేయక యుండరాదు. ప్రతిదిన ముదయకాల
ములందు నర్ధరాత్రమున దిగంబరులై ధ్యానింప వలయును.
ఇట్లైన నుపాధిరాహిత్యము శీఘ్రముగస్ఫురించును. తొలుతఁ
దన ప్రతిస్వరూపము గానవచ్చును. అట్లు కానిపించెనేని
యింకను సోపాధిక ధ్యానమందే యున్నానని దానిని దొలఁ
గించుకొను నుపాయము చేయవలయును. ఇట్లు చేయఁగాఁ
జేయఁగా మఱికొన్ని యనుభవములు గలిగినమీఁద నాత్మ
సాక్షాత్కార మగును. ఇవన్నియు వ్రాయరాదు. మోస
గాండ్రు తెలిసికొని మా కట్లయినది మా కిట్లయిన దని తెలి
యని వారిని మోసపుచ్చుదురు ఇంత కృషిచేసియు సాక్షా
త్కారమైనపుడు కొందఱు భయపడుదురు. కొంద ఱది యే
మియైనది తెలియక మిణకరింతురు. ఈసాక్షాత్కారము భక్తి
కిఁ బ్రారంభదశ. ఇది యెండను జూచినట్లులే కాని సూర్యుని
జూచినట్లు కాదు. కొంద ఱీయింతతోనే సంతోషింతురు. అది
సరిగాదు. ఇట్టి తేజస్సుగలవాఁ డెవఁడని యావస్తువును జూడఁ
గృషిచేయవలయును. తస్యాః శిఖాయాం మధ్యే పరమాత్మా
వ్యవస్థిత యని యాశిఖామధ్యమందుండు పరమాత్మస్వరూప
మును జూడఁ గృషిచేయవలయును జీవాత్మధ్యానము శ్రేయ

స్కరముకాదు సంకోచవికాసములుగల ప్రత్యగాత్మ భావనము శ్రేయస్కరముగాదు. అట్టిస్వభావజన్య దోషములేని పరమాత్మను ధ్యానింపవలెను. నే ననువస్తు వీప్రత్యగాత్మ. దీనికిఁ బరమాత్మకుఁగల సంబంధము ధ్యానింపవలెను. ఇట్టి సంబంధము సూర్యునకు నెండకుఁ గలసంబంధమువంటిదని తెలియవలెను. ఈసంబంధము పలువిధములుగఁ జెప్పఁబడును.

శ్లో॥ పితాచ రక్షక శ్శేషీ, భర్తా జ్ఞేయో రమాపతిః
　　స్స్వా మ్యాధారో మమాత్మాచభోక్తా చాద్యమనూదితః

కం. రాముఁడె భ్రాతయు భర్తయు
　　రాముఁడె ప్రియబంధువరుఁడు రాముఁడె చుమ్మీ
　　రాముఁడె నాజనకుండును
　　భూమిపునెడ లేదు జనకబుద్ధి సుమంత్రా.

ఇట్టిసంబంధము కల్పించుకొనవలయును. దీనికర్థ మేమన.

(సశేషము)

## — లక్ష్మణకైంకర్యము —

ఇంకొకవిషయముఁ జెప్పి యీవ్యాసమును ముగించెదను. త న్నరణ్యమునకుఁ బిలుచుకొని పొమ్మని శ్రీరామునిఁ లక్ష్మణుఁడు ప్రార్థించినపుడు అహం సర్వం కరిష్యామి సర్వకైంకర్యములు నేనే చేసెదనని చెప్పెను. ఈవాక్యానుసారముగనే పట్టాభిషేకసమయమందు లక్ష్మణుఁడు "రామశీర్షంబుపై

వ్యజనంబువీచుచు నన్యహస్తంబున వెలిచామరముఁ బూని నిలిచియుండె” యుద్ధ ౭౯౮౮ ప. ను. ఎడమచేత స్వామిసేవ చేయవచ్చునా యను కొందఱ సందేహము నిది మాన్పుచున్నది. దేవపూజచేయు సమయమందు నెడమచేత గంట వాయింపరాదని కొందఱయభిప్రాయము. కారణ మేమన నెడమ చేయి యపవిత్రముగనుక నని చెప్పుదురు. లక్ష్మణుచర్యయది పొరబా టభిప్రాయమని తెలుపుచున్నది. కుడిచేతితో సేవని చేయుక యూరకున్నప్పు డెడమచేయి పనికిరాదుగాని కుడిచేతితో దేవపూజచేయు సమయంబున నెడమచేయి పనికిరాదనుట సరిగాదు. ముకుంద మాలయందు,

శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరమ్ పాణిద్వంద్వ సమర్చ యాచ్యుతకథా శ్రోత్రద్వయత్వం శృణు కృష్ణం లోకయలోచనద్వయహరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం జిఘ్రి ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్.

అర్థము.

జిహ్వా! కేశవుని కీర్తింపుము. మనస్సా శ్రీధరుని భజింపుము. రెండుపాణులారా! యచ్యుతునిఁ బూజింపుఁడు రెండుచెవులారా! అచ్యుతకథల వినుఁడు. రెండుకన్నులారా! కృష్ణుని జూడుఁడు. రెండుపాదములారా! దేవాలయమునకుఁ

బొందు. నాసికమా! భగవంతునిపాదతులసిని వాసనచూడుము. శిరమా! అధోక్షజు నమస్కరింపుము. అని యిట్లు సర్వాంగములతో భగవంతుని సేవించుట శాస్త్రవిరుద్ధముగాదు. ఇట్లుండ నొకచేతం బూజించునపుడు మఱియొకచేత గంటవాయించుట సరిగాదనుట సరిగాదు. భుజగశయనుఁడు విష్ణువని భుజగభూషణుఁడు శివుఁడని నాగప్రతిష్ఠచేసి పూజించి వరములం బొందుచు నాగమయ్యప్రత్యక్షమైన రాలతోఁ గట్టెలతోఁ గొట్టి చంపుటకంటె వేదాంతదేశికులు ఘంటావతారమని లోకములోని గంటలను దాఁకుట యధర్మమా.

శ్లో॥ ఆదౌజగదాధార శేషః, తదనుసుమిత్రా నందన వేషః
తదుపరిధృతహాలముసలవిశేషః, తదనంతరమభవద్గురు రేషః॥

ఈయన రామానుజాచార్యులు తొలుత జగదాధారుఁడైన శేషుఁడు. ఆవల లక్ష్మణుఁడు. ఆవల బలరాముఁడు. ఆవలనీగురువుగానయ్యెనని చెప్పుచు నాగుఁబామునుజంపుట దోషముగాదుగాని దేశికులు ఘంటావతారము గావున నేగంటనైన నెవడమచేతితోఁబూజవేళ దాఁకుట దోషమఁట.

శాస్త్రనిషేధముకానిదానిని భావవికారముచే మనము నిషేధించెదమేని యెడమచేతితో నీళ్లు ద్రాగరాదని స్పష్టముగా శాస్త్రము నిషేధించుచున్నదిక దా. భోజనసమయమున దప్పియగునేని యేమిచేయవలయును?

శంఖః॥ పీతావశేషితం పీత్వా,పానీయం బ్రాహ్మణఃక్వచిత్
త్రిరాత్రం తు వ్రతం కుర్యా ద్వామహ స్తేన వా పునః
అత్రిః॥ ఆస్యేనన పిబే త్తోయం తిష్ఠ న్నాంజలినా పిబేత్
వామహ స్తేన శయ్యాయాం తథైవాన్యకరేణ వా॥

త్రాగఁగా మిగిలిన నీళ్లు బ్రాహ్మణుఁడు త్రాగనేని, యెడమచేత నీళ్ళు త్రావెనేని, మూఁడురాత్రులు వ్రత మాచరింపవలెను. నోటితో (పశువులవలె) నీళ్లు త్రాగరాదు. నిలఁబడికాని దోసిటితోఁగాని యెడమచేతఁగాని పడకమీఁదఁ గూర్చుండికాని యితరుని చేతితోఁగాని త్రాగరాదు

శ్లో॥ వామహ స్తేన యోభుం క్తే, యోపః పిబతి వా ద్విజః
సురాపానేన తత్తుల్యం మనుం స్వాయంభువోబ్రవీత్ ॥

ద్విజుఁడు యెడమచేతితో భుజించినను నెడమచేత నీళ్లు ద్రావినను నది కల్లుత్రాగుటవంటి దగును అని స్వాయంభువ మనువు చెప్పెను.

ఇట్టు లెడమచేత నీళ్లు ద్రావవలదని శాస్త్రము నిషేధించుట భోజనకాలమందు గొం తడుచుకొని లోకులు చావవలయునని కాదు. ఏలన

శ్లో॥ భుంజానోదక్షిణం బాహుం, నసంయుంజ్యా త్కదాచన
ఉద్ధృత్య వామహ స్తేన తృషా ర్తస్సలిలం పిబేత్ ॥రత్నాకరము.

దీనివలన భోజనకాలమందు దాహమగునేని యెడమచేతితోఁ బాత్రమెత్తుకొని నీళ్లు ద్రాగవలయునే కాని యెంగిలిచేతితోఁ బాత్రముఁ దాఁకరాదు. అని చెప్పుచున్నది. అన్నము నోటిలోఁ బెట్టుకొనుట నీళ్లుద్రాగుట యేక కాలమున జరగు కార్యములు కావు. అట్లుండ వామహస్తము జలమునకుఁ బనికిరాఁగా కుడిచేయి పూజసేయు సమయంబున నెడమచేయి సోమరిగా నుండవలయు ననుట సరిగాఁ దోఁపదు.

| | నిత్యభోగమునకు | వాగ్దానము. | చెల్లించిన |
|---|---|---|---|
| ౧౧౪. | బెల్లంకొండ వెంకటస్వామి సెట్టిగారు | 3-0-0 | 3-0-0 |
| ౧౭౯. | ఆకునూరి లక్ష్మీనారాయణరావు నాయఁడుగారు ... ... | ౫0-0-0 | ౫0-00 |
| | మందరమునకు- | | |
| ౨౪. | రాజా వేంకటస్వామిసెట్టిగారు | 3౬-0-0 | 3౬-0-0 |
| 3౨. | కస్తూరి సుబ్బారావుగారు | 3౬-0-0 | ౧౨-0-0 |
| ,, | లింగం వేంకటసూర్య నారాయణరావుగారు విజయనగరము ... | 3౬-0-0 | ౨-0-0 |

మందరనివేదనోత్సవము గతసంచికాశేషము పుట ౫3౭ చూడు

ఏదియుమీరు వ్రాసినవారుగారు. వారిద్దఱు విరోధులు గావున పరస్పరవిరుద్ధములైన యుత్తరువులు వారిచ్చునెడలనే నెవరియాజ్ఞకులోఁపడి వర్తింపవలయును. నూతనధర్మకర్తకు నే నవిధేయుఁడనై వర్తించిన నతఁడు తెచ్చుదావాకు నేనుత్తరవాది

గానంటిరి. ప్రాంతధర్మకర్తకవిధేయుఁడనై నేనువర్తించిన నా
యన తెచ్చుదావాకు మీరుత్తరవాదులుగ నుండెదరా తెలు
పుఁడని ప్రత్యుత్తరము వ్రాసిపంపెనుగాని దానినాయధికారి గై
కొనక త్రిప్పివేసెను. ఇటీవల నీయుత్తర్వు కాగిదములు మిథ్యా
స్పష్టపత్రములని వింటిని.

సామ్రాజ్యపట్టాభిషేకమహోత్సవకాలమున స్వామికి
నలంకరించినవి భక్తులు సమర్పించిన యాభరణములను నెట్లో
యెవరిమూలముననో సంగ్రహించి వాసుదాసుని న్యాయస్థా
నమందు నాట్యమాడింపవలయునని కొందఱుచేసిన ప్రయత్న
ముగుఱంచి యుత్సవకాలమందే సభలో నాయన తెలిపియే
యున్నాఁడు.

ఇత్యాదికారణములవలన

శ్లో॥ గంధాఢ్యాసౌ భువనవిదితా కేతకీ స్వర్ణవర్ణా
పద్మభ్రాంత్యా చపలమధుపః పుష్పమధ్యే పపాత
అంధీభూతః కుసుమరజసా కంటకైర్లూనపక్షః
స్థాతుం గంతుంద్వయమపిసఖే నైవశక్తోద్విరేఫః॥

అనుసూక్తికిఁ బాత్రుఁడనై యున్నాఁడను. ఆకేపాటి
సూరారెడ్డిగారు రామకార్యధురంధరులేమైరా నాకిందుండుట
యే కలుగును. కామకార్యధురంధరులైరా నేనుబుద్ధిగలవాఁ
డనైతినేని నాస్వస్థానము చేరికొందును. అదియో యిదియో
యిప్పుడు వారుచేయఁబోవు నుపన్యాసము పరిష్కరించును

ఆనిమిత్తముగానే యీసభ యేర్పాటుచేసితిని. అదివినినాకు శ్రే యస్కరమార్గమును. బెద్దలుపదేశింతురుగాక అని విరమించెను

ఆవల మ-రా-శ్రీ ఆకేపాటి సూరారెడ్డిగారులేచి వాసు దాసునకుఁ దానుజేసిన వాగ్దానమును మఱచి యేవియోకొన్ని ముసలమ్మ ముచ్చటలు ముచ్చటించి యప్రస్తుత ప్రశంసలుచేసి స్వాసన మలంకరించిరి.

అవునని నిశ్చయించుకొనిన దొకటి యైనది మఱియొ కటి యగుటచే నగ్రాసనాధిపతిగారు వాసుదాసుని ముఖముఁ జూచిరిగాని యాయన లజ్జచేఁ దలవంచుకొనెను.

ఆవల నగ్రాసనాధిపతిగారు సుబ్బరావుగారిని వ్యాఖ్యా నరచనకుఁ బ్రేరించినవాఁడు శ్రీరామచంద్రమూర్తియే యనియు దనగ్రంథము సమగ్రముగ నెఱవేర్చుకొన్న శ్రీరాముఁడే యీ యనచేఁ బలికించుచున్నాఁడనియు నిది సాంతముచేయ భగవం తుఁడాయనకు నాయురారోగ్యము లనుగ్రహింప వలయునని యుఁ దమగ్రంథములకుఁ దామే వ్యాఖ్యానమువ్రాసిన గ్రంథ కర్తలు ఫెక్కురులేరనియు గ్రంథకర్తయొక్కఁడు వ్యాఖ్యాత మఱియొకఁడు నైనపుడు వ్యాఖ్యాత యెంత పండితుఁడైనను గొన్నిచోటులఁగవి హృదయము కనుఁగొనుట కష్టమైయుం డుననియు నిరువురు నొకరేయైనచో నట్టి లోపముండదనియు, భారతరచనానంతరము వ్యాసులహృదయమునందువలె సుబ్బ

రావుగారి హృదయమునందును దానింతవఱకుఁ జేసిన సేవతో భగవంతుఁడింకను సంతసింపలేదనితోఁచుటచేఁ దానీకృతికిఁ బ్రారంభించెననియు నిట్టివానికి మనోవ్యాకులత్వముగలిగించుట సరిగాదనియు నాయనకట్టి సంకటముగలిగించి యూరు వెడలిపోవ నీగ్రామజనులు వర్తించిరేని నష్టపడువారు గ్రామజనులేగాని వారుగారనియు దామీమండలమునకువచ్చి రమారమి 3 సంవత్సరములైనవనియు నీకాలములో దేవాలయకార్య మెంతో జరగి యభివృద్ధికివచ్చినదనియు నాయన యూరువిడిచెనేని దేవాలయము మరల యధాస్థితికివచ్చి పశుపాలైపోవుననియు నీమాటలు నేనగ్రాసనాధిపతిగాఁ జెప్పుచున్నానుగాని జిల్లాకలెక్టరుగాఁగాదనియు నా విధముగావర్తింపవలసివచ్చినపు డేమి చేయవలయునో యది తెలిసినవిషయమేయనియుఁగావున గ్రామములోఁగలహములులేక వర్తింపుఁడనియు బోధించిరి

అంతతో సభముగిసెను.

వాసుదాసు నుపన్యాసమందలి కొన్నివాక్యములు లోగుట్టు తెలియనివారికర్థముగాక పోవచ్చును. కావున నావిషయము స్పష్టీకరింపఁబడుచున్నది.

వైశ్యసముదాయమునకు మ-రా-శ్రీ. సూరారెడ్డిగారికిదీర్ఘకాలముగ దేవదానవమైత్రిగలదు అదిగాక యిప్పుడు గ్రామమం

దు సూరారెడ్డిగారికిని బలిజప్రముఖులకుఁ బ్రత్యక్షవిరోధము ప్రబలమైయున్నది. కావున వైశ్యులు బలిజవారు నేకమైరి. అందుబలిజముఖ్యులు తమయధికారము సాగనేని వర్ణాశ్రమధర్మప్రకారము మీకు మర్యాదలు జరపెదమని వైశ్యులకు వాగ్దానము చేసిరనియు నాకారణముగ వారిరువురు నేకమైరనియు వాసుదాసుఁడువిని యిట్లైన గ్రామములోఁ గలహములు పెరిఁగిపోవునేమో తనకు స్వామికార్యములందు సహాయుఁడుగా నుండిన శ్రీ. రెడ్డిగారికిఁగీడుకలుగునేమోయని యాలోచించి సూరారెడ్డిగారితో నీవుబుద్ధిపూర్వకముగా వైశ్యులకు మర్యాదలంగీకరించితివేని నీకు శాశ్వతకీర్తి కలుగును. స్వామికార్యములు చక్కఁగాజరగును. గ్రామము శాంతిపడును. వైశ్యులు నీకువశపడిన బలిజవారును నీమార్గముననే వత్తురు. శ్రీరామునికార్యములు చక్కఁగాజరపి విభీషణుఁడవయ్యెదో యటుగాక రావణుఁడవయ్యెదవో అది నీచేతిలోనికార్యము. వేనవేలు ధనము శ్రీనాథునకిచ్చి అనవేమారెడ్డి కీర్తిసంపాదించెను నీయొద్దనొకకాసైనఁ దీసికొనక యంత కెక్కువకీర్తి శాశ్వతముగ నీకుసంపాదించియిచ్చెదను. ఇట్టికీర్తియెందఱకు లభ్యమగునదికాదు ప్రీతిపూర్వకముగనేను జెప్పుచున్నాను ఇప్పుడుచెప్పుటయేకాదు. నీకిదివఱకుఁ బలుమాఱు వ్రాసియున్నాను. చెప్పియున్నాను. ఇప్పుడు నీవు గౌరవమని తలంచునది నీకపకీర్తికి బహుజనవిరోధమునకుఁ

గారణమగుచున్నదిగాని నీకు లాభమేమియులేదు. మీరొకటి రెండిండ్ల రెడ్లొకజాతి నంతయు నవమాన పఱచుట తగదు. మ-రా-శ్రీ ఎం. నాగిరెడ్డిగారు ధర్మకర్తగా నున్నప్పుడు వర్ణాశ్రమధర్మప్రకారము జరుపలేదా అప్పుడు నీకువచ్చిన యపకీర్తి యేమి? ఇప్పుడునీకువచ్చిన కీర్తియేమి? మీరెడ్డే యనేకులు మీనడవడి సరిగాదనినాతో జెప్పియున్నారు. కావున గ్రామము దేవాలయము నీవు బాగుపఱు నాలోచనచేసి కీర్తిపరుఁడవుకమ్మని హితముపదేశించెను. సూరారెడ్డిగారును దానికియ్యకొని వారికి నేను లోపడినట్లుగాక యీకార్యము నిర్వహింపుమని వాసుదాసునిఁ గోరెను. ఇట్టిసభ యేర్పాటుచేసిన ముఖ్యయోజన. ఇటుచేసిన మందరకార్యము ముఖ్యముగను దక్కినదిగౌణముగను గనఁబడును. ఉభయకార్యములు చక్కఁబడును. నివేదనకార్యమునకై గ్రంథముసమాప్తియగువఱకుఁ గాచుకొనిన నేకాలమెట్లుండునో యెవరికెఱుక అంతవఱకు నర్పింపకయుండుటెట్లు? కావున నయినంతవఱకుఁ గ్రొత్తదితక్కినది యిదివఱకు వ్రాసియుంచినది సమర్పించు నెపమున నీకార్యము సమకూర్చెదనని తనయభిప్రాయము సూరారెడ్డిగారికిఁ దెలిపెను. వారు ఆయాలోచన బాగున్నదని యంగీకరించిరి.

నీవొకఁడ వంగీకరించినఁజాలునా? నీవారందఱు నంగీకరింపవలదాయని వాసుఁదాసుఁడడిగెను. నేనంగీకరించిన న్నునఁ

గాదని పోవువారెవ్వరు అందఱు ననుకూలులై వచ్చెదరని రెడ్డి
గారు చెప్పి యేమి వ్రాసియియ్యవలయునో మీరే వ్రాసి యిండని
వాసుదాసునడిగెను. ఆయనయు సమాధానపత్రము వ్రాసియి
చ్చెను. దానిని సవరింపవలసినచోటుల సవరించి మీయుపన్యా
సముకాఁగానే నేను మావారిచే వ్రాలుచేయించిన యీకాగిద
మును మీయొద్దసభలోనిచ్చెదను. అని రెడ్డిగారు చెప్పిరి అట్టు
లేకానిమ్మని వాసుదాసుఁడనెను రేపుసభయునఁగా నీనాఁటిసా
యంకాల మాశ్రమమునకు వచ్చి నేను వ్రాసియిచ్చినన్యు వైశ్యు
లు విరోధముమానక నాకు కీడుచేయఁదలఁతురేని నే నుభయ
భ్రష్టుఁడనగుదు నేయని చెప్పెను. అట్లెప్పటికిఁగాదు. సభలో
స్వామియెదుట మ-రా-శ్రీ నాగిరెడ్డిగారికి నీకు సమాధానము
కుదిర్చినట్లు నీచేతి తాంబూలములు వారికిప్పించి వారిచేతి
తాంబూలములు నీకిప్పించి యిఁకమనలోమనకు ద్వేషము
వలదు మానుకొందమని ప్రముఖులచేతఁ జెప్పించెదనని వా
సుదాసుఁడు చెప్పెతిని అట్లైన సరియని రెడ్డిగా రంగీక
రించిపోయిరి. ఇట్లిట్లు జరుగవలసియుండును మీరందఱు స్వా
మిసన్నిధానమునకుఁరండని వైశ్యప్రముఖులకు వాసుదాసుఁడు
జెప్పెను ఇంతచేసి తుదకు నేను మ-రా-శ్రీ సూరారెడ్డిగారికిఁ
జేసిన హితోపదేశము కృష్ణవిభీషణులు దుర్యోధన రావణుల
కుఁ జేసినట్టిదయ్యెను. అయిననొక భేదము వారొకటిచెప్పి మఱి

యొకటి చేయలేదు. వారెంతటిదుష్టులయ్యు మొదటినుండియు నొకమాట మీద నేనిలిచిరి.

వాసుదాసుఁడు సామదానభేదరూపమునఁ జేసిన సమాధానప్రయత్నము విఫలమగుటకుఁ గారణభూతులు శ్రీసీతారామచంద్రులే కాని మఱియెవ్వరుగారు ఏదియోశుభోదర్కమున కుఁగాకున్న శ్రీరాముఁడిట్లు వాసుదాసుని మోసగింపఁ దలఁపఁడు తలఁచెనుబో దానివలన వాసుదాసునకుఁ రాఁగల నష్టియులేదు మ-రా-శ్రీ కోటిరెడ్డిగారు బి ఏ బిఎల్ కడప వాసుదాసునకుఁ జేసిన భవిష్యద్విషయమైన యుపదేశము వ్యాకులుఁడైన వాసుదాసునకు సాక్షాచ్ఛ్రీరామవాక్యామృతమువలె మనశ్శాంతికలిగించెను అంతవఱ కాయుపాయము వాసుదాసునకుఁ దోఁచినదికాదు. వారిట్లుచెప్పిరి ఆయ్యా నీవేల విచారపడియెదవు? నీవు స్వామికిఁ గానీయఁబోవునది వర్ణాశ్రమధర్మప్రకారముజరుగు నిబంధనముపై నిమ్ము. ఆవల దేవాలయము నధికారులు రాఁబట్టుకొననీ పోఁగొట్టుకొననీ. నీభారము తొలఁగునని యుపదేశించిరి. ఈవిషయమున వారే నాకుగురువులని భగవతేనమయని నమస్కరించి యాప్రకారము చేయుటకై నిశ్చయించితిని వాసుదాసుఁడు వంచింపఁబడిన సభ ఫలమన్యమండలము వారెఱుఁగరు. అన్యమండలములందు సమాజమునందే ముఖ్యముగ వైశ్యులయందును కమ్మవారిలో

ను నెంతెంతో గొప్పవారు హేమాహేమీలు ఘటాఘటీ
లుగలరు. వాసుదాసునిమిత్తమై వీరందఱు నొంటిమిట్టకువచ్చు
వారే ఇట్టి పురుషసింహులగువారు స్వామిదర్శనార్థమై కోవె
లకుఁబోయినపుడు కడపదాఁటినఁ గాసుచేయని నిరక్షరకుక్షు
లు నిర్భాగ్య దామోదరులునగు నిరుపసర్గసంగ్రామ సింహము
లు వారిని జులకనాడినచో నాయవమానము వాసుదాసునిదై
వాసుదాసుఁడుచేయించినవాఁడో చేసినవాఁడో యగును ఇది
వాసుదాసునిభయము వర్ణాశ్రమధర్మప్రకారము నడవుఁడని
సామాజకులకు బోధించుచు "చాతుర్వర్ణ్యస్యరక్షితా" యని నా
లుగువర్ణములధర్మములు పరిపాలించిన రామునియెదుటనే దా
నికి విరుద్ధముగజరగుట వాసుదాసుఁడు సహించుటకంటెసర్వ
సంగ పరిత్యాగముచేసి దేహమో దేశమో దేవలమో వదలు
ట యతనికి యశస్కరము శ్రేయస్కరము

మనవి.

చెఱువు జమ్ములపాలెమునందు జరుగఁబోవు శ్రీకోదండ
రామసేవకసమాజముయొక్క తృతీయగుంటూరు మాండలికస
భకాహ్వాన సంఘాధ్యక్షునిగ మ-రా-శ్రీ ఊట్ల పెదవీరయ్య
గారి నేర్పాటుచేసికొనినట్టులు సభావిషయమున సంజీవని ప్రక
టించినవిమ్మట నాగ్రామభజనసంఘమువారు వ్రాసియున్నారు.

సభాధ్యక్షుని నెన్నుకొనుటనుగుఱించి సంజీవని యిదివ
ఱలో సూచించినదానిని గమనించి యుపసమాజములవారు

తమయభిప్రాయమును డిశంబరు నెల ౧౫-వ తేదిలోపునఁదెలుపఁ బ్రార్థితులు సభ యేయే తేదిలను జరుగునది సంజీవని తరువాత విన్నవించుకొనఁగలను.

ఇట్లు విన్నవించు
దాసోహమ్
సుబ్బదాసుఁడు

1929 సంవత్సరము భక్తిసంజీవని యేప్రిలుసంచిక పునర్ముద్రణమయి సిద్ధముగానున్నది. వలయువారు అయిదణాల చీట్లు పంపినయెడల సంచిక పంపఁబడును

భక్తిసంజీవని
కార్యాలయము
ఒంటిమిట్ట.

సుబ్బదాసుఁడు,
కార్యనిర్వాహకుఁడు.

విన్నపము.

శ్రీకోదండరామసేవక సమాజమున డైరక్టరులుగానుండ నంగీకరించినవారందఱు 1930 సం॥ డిశంబరు 30-వ తేది నాఁటికి నొంటిమిట్టకు దయచేయఁ బ్రార్థితులు. సమాజమును రిజస్టరుచేయు సందర్భమున డైరక్టరులందఱు ముఖ్యముగా నుండవలయునుగనుక విన్నవించుకొనినాఁడను.

ఇట్లు విన్నవించు
శ్రీవాసుదాసస్వామివారి
అంతేవాసి
సుబ్బదాసుఁడు.

శ్రీరామ

# భక్తి సంజీవని.

---

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి
విలేఖకుఁడు — ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)
ప్రకటనస్థలము — వాల్మీకాశ్రమము ఒంటిమిట్ట కడప మండలము.

## చందాల వివరము.

| | | |
|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨—౦—౦ |
| ధారకులు | ,, | ౫—౦—౦ |
| జీవాతువులు | ,, | ౧౦—౦—౦ |
| పోషకులు | ,, | ౨౫—౦—౦ |
| రక్షకులు | ,, | ౫౦—౦—౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦—౦—౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు
సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.

మూర్ఛావస్థయందున్న భక్తిమాతకు విసనకఱ్ఱలవీచుట లోనగు నుపచారము చేయువారివంటి వా రుపచారకులు

కుత్తుక యెండకుండ ప్రత్తితో పాలను తడిపి ధారధారగా పోయువారు ధారకులు

స్మృతిగలిగించు నౌషధములవంటివారు జీవాతువులు.

దేహమునకు కొంచెము బలముగలుగునట్లు చేయువారు పోషకులు.

మరల నపాయమురాకుండ ప్రతికూలములనడచి యనుకూలముల రక్షించువారు రక్షకులు.

ఉజ్జీవింపఁ జేయువారు ఉజ్జీవకులు

స్థిరముగ నిలుపువారు ప్రతిష్ఠాపకులు.

విడిపత్రిక 0—5—0

వావిలికొలను సుబ్బరాయకృతము.

# ఆంధ్ర వాల్మీకి రామాయణము.

---

| | రూ. | అ | పై |
|---|---|---|---|
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, 4-వ కూర్పు. విశేషలఘుటీకతోడ రెండు సంపుటములు మును పటికంటె జక్కగ సవరింపఁబడినది | 8 | 0 | 0 |
| మూఁడు సంపుటములు | 10 | 0 | 0 |
| ఏడు సంపుటములు | 13 | 0 | 0 |

వాసుదాస ప్రణీతము.

| | | | |
|---|---|---|---|
| శ్రీవాసుదాసు కీర్తనలు | 0 | 4 | 0 |
| శ్రీ భక్తకల్ప ద్రుమశతకము | 0 | 4 | 0 |
| ముముక్షుహితచర్య—ప్రథమభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| ,, ద్వితీయభాగము (పేపర్ కవర్) | 0 | 14 | 0 |
| రెండు భాగములు కలిపి కాలికో బైండు | 2 | 2 | 0 |

భక్తి సంజీవని ౧౯-౨౯.

| | | | |
|---|---|---|---|
| ౧-౨ సంచికలు | 3 | 0 | 0 |
| విడి సంచిక ఒకటొకటి | 0 | 5 | 0 |

కొలఁది ప్రతులేయున్నవి, త్వరపడుఁడు.